సకుటుంబ ఆహ్లాద వీచిక

# చినుకు

మాసపత్రిక

ఏప్రిల్-మే

₹-75/-





తొలి సంచిక
ఏప్రిల్ 2005లో వెలువడి
దశ వర్షాలు పూర్తి చేసుకుని
11వ సంవత్సరంలోకి అడుగు పెడుతోంది.

'చినుకు'తో నడుస్తున్న ముప్పయి సంవత్సరాల స్నేహం
ఎన్ని ఇబ్బందులెదురైనా వదలని బంధం
'చినుకు' ప్రారంభానికి
భుజం తట్టి బయలు దేరిన
తొలి సైన్యం శ్రీ జనార్ధన్

సంపాదక వర్గంలో లేకపోయినా
తన శ్రమని ఊతం చేసి
తన అనుభవాన్ని పెట్టుబడిని చేసి
ప్రతి సంచికకు ఉత్సాహాన్ని పోగేసి
ఎన్నో అద్భుతాలు చేయగలమన్న
శక్తిని ఇంజెక్ట్ చేస్తున్న
పెద్దలు శ్రీ లింగప్రసాద్‌గారు

కృతజ్ఞతలు చెప్పడం సరిపోదు
ధన్యవాదాలు చెప్పి పరాయివారిని చేయలేను
వీళ్ళు లేకపోతే 'చినుకు' లేదని మాత్రం చెప్పగలను.

నండూరి రాజగోపాల్

'చినుకు' పదవ వార్షికోత్సవ
జన్మదిన ప్రత్యేక సంచికగా వెలువడిన
ఏప్రిల్ - మే 2015 సంచిక
ఇప్పుడు మీ చేతుల్లో ఉంది.
ఇన్నాళ్ళు...ఇన్నేళ్ళూ ఆదరించి,
అభిమానించిన పాఠకులకు,
రచయితలకు, రచయిత్రులకు,
చందాదారులకు, ఏజెంటు మిత్రులకు,
ప్రకటన కర్తలకు,
సాహితీ మిత్రులకు
కృతజ్ఞతా పూర్వక ధన్యవాదములు

ఎడిటర్



సకుటుంబ ఆహ్లాద వీచిక, సమాచార దీపిక

# చినుకు
మాసపత్రిక

సంపుటి : 11 సంచిక : 1

121-122

సంపాదకులు
నండూరి రాజగోపాల్
సెల్ : 98481 32208

ఏప్రిల్ – మే 2015

పేజీలు : 292 + 4

అసోసియేట్ ఎడిటర్
జనార్ధన్ లంకె
సెల్ : 98485 36113

ఫీచర్స్ ఎడిటర్
సింగంపల్లి అశోక్ కుమార్
సెల్ : 98485 04649

పబ్లికేషన్ కన్సల్టెంట్
కె. రఘురామరాజు, హైదరాబాద్
సెల్ : 98493 50555

అలంకరణ
యల్.జె

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | : ₹. | 200/- |
| 3 సంవత్సరాలకు | : ₹. | 500/- |
| 5 సంవత్సరాలకు | : ₹. | 800/- |
| జీవిత చందా | : ₹. | 5000/- |

U.S.A.- 30 $

చందాలు ఎం.ఓ / డి.డి లేదా చెక్కులను చినుకు పబ్లికేషన్స్, విజయవాడ పేర ఈ క్రింది చిరునామాకు పంపవలెను.

చినుకు పబ్లికేషన్స్
26-7-11, గరికపాటివారి వీధి,
గాంధీనగర్, విజయవాడ – 3.
E-mail :editor.chinuku@gmail.com




## కథలు

## సమీక్షలు



## కవితలు



## విశ్లేషణలు



### చిన్న కథ



### "నాటకం క్రింద నుంచి రావాలి"





| కథలకు బొమ్మలు | ముఖచిత్రం |
|---|---|
| వెంకట్, బాపట్ల | పాణి, విజయవాడ |

# BEST WISHES TO CHINUKU

## ON THE OCCASION OF COMPLETION OF 10 YEARS




# BOMMIDALA

## INTERNATIONAL (P) LTD.,

(EXPORT HOUSE RECOGNISED BY GOVT.OF INDIA)

LEADING SUPPLIERS OF INDIAN TOBACCOS:

FLUE - CURED VIRGINIA
BURLEY (LIGHT SOILS)
AIR - CURED
SUN - CURED COUNTRY (NATU)

OFFERED IN :

MACHINE STRIPS, HAND STRIPS & LEAF FORMS

CONTACT US NOW

MR.B.S. KRISHNA MURTHY
BOMMIDALA INTERNATIONAL (P) LTD.,
CHANDRAMOULI NAGAR
GUNTUR - 522 007 INDIA

TEL : 91-863-2357615/2357616
FAX : 91-863-2351343

E MAIL : murtybsk@bommidalainternational.com
WWW.bommidalainternational.com

సంపాదకీయం

# అక్షరాలు సేకరిస్తూ...అక్షరాలు చల్లుకుంటూ...

పది సంవత్సరాలు గడిచిపోయాయి. మొదటి సంచిక నుండి ఇప్పటిదాకా మేలిమి సాహిత్యాన్ని అందించడానికి ప్రయత్నిస్తూనే ఉన్నాం. కొత్త గొంతుకలను వెతుక్కుంటూ...కొత్త అభిప్రాయాలను పోగేసు కుంటూ...విమర్శలను స్వీకరిస్తూ...సరిచేసుకుంటూ నడుస్తూనే ఉన్నాం. నెల గడిచిన కొద్దీ 'చినుకు'ను ఒక ప్రతిభావంతమైన అక్షర కుటీరంలా మార్చుకుంటూ...ప్రశంసలు అందుకుంటూ...ప్రోత్సాహాలకు ధన్యవాదాలర్పిస్తూ...ప్రతి ఒక్క అక్షర శిల్పి చేతిలో 'చినుకు' కొలువు తీరేలా కృషి చేస్తూనే ఉన్నాం. వీలైనప్పుడల్లా కొత్త పాఠకులను వెదుక్కుంటూ 'చినుకు' నలువైపులా కురిసేలా ప్రణాళికలను సరిచేసు కుంటూనే ఉన్నాం. ఫేస్‌బుక్‌లు, వాట్సాప్‌లు, గూగుల్ ప్లస్‌లు వచ్చి నవతరాన్ని ఆకర్షిస్తున్న కాలంలో, 'చినుకు' ప్రతి సంవత్సరం కొంతమంది యువతరాన్ని మంచి సారస్వతం వైపు నడిచేలా ప్రయత్నం చేస్తోందన్న సత్యం చెప్పటానికి ఈ దశాబ్ది సంచిక వేదికయ్యింది.

మార్గం ఎప్పుడూ ఉంటుంది. దానికి ఇరుపక్కలా అనేక అడ్డదారులు ఎదురవుతూనే ఉంటాయి. వాటిని తప్పుకుంటూ రహదారిలో వెళ్ళడానికి మంచి పత్రికలు శతాబ్దాలుగా ప్రయత్నిస్తూనే ఉన్నాయి. ఆ ప్రయత్నమే లేకపోతే...పబ్‌లు, కాసనోవాలు, సోషల్ మీడియా నెట్‌వర్క్‌లు, సినిమాలు, షికార్లు, అనేక ప్రలోభాలు ఈ సమాజాన్ని వెంటిలేటర్‌పై ఉంచేవి. కానీ ఇప్పుడూ స్నేహాలూ ఉన్నాయి, కబుర్లు ఉన్నాయి, పంచుకోవడానికి పుస్తకాలు ఉన్నాయి, ఆదుకోవడానికి అక్షరాలు ఉన్నాయి, పలకరించడానికి మాటలు ఉన్నాయి, అవసరానికి అక్కరకొచ్చే అధ్యయనాలున్నాయి. వీటన్నింటినీ ఎప్పటికప్పుడు మెరుగు పరుస్తూ...కాలంతో పోటీగా నిలిపే పత్రికలున్నాయి. ఇవాల్టికి దాదాపు ప్రతి ఇంటి వీధి వాకిలిలోకి పొద్దునే ఏదో ఒక పత్రిక కొలువు తీరుతూనే ఉంది. ఇప్పటికీ భానుడి వెలుగురేఖకన్నా ముందే అక్షరం తెలుగు నేలను మేల్కొలుపుతూనే ఉంది.

ఇది నిజానికి 'చినుకు' పదేళ్ళ సందర్భం కన్నా ఎక్కువ ఆనందాన్నిస్తోంది. ఈ పదేళ్ళలోనూ 'చినుకు' కు డబ్బులు కట్టి చందాదారులుగా చేరిన సభ్యుల సంఖ్య ఆశించినంతగా పెరగక పోవచ్చు. 'చినుకు' అందరినీ ఇంకా పలకరించలేక పోవచ్చు. కానీ, కొత్త 'చినుకు' సంచిక వచ్చిన ప్రతిసారీ ఓ ఆనందం. అందరూ చదవాల్సిన అక్షర సమూహాన్ని అందరికీ పంచడానికి సిద్ధం చేశామన్న ఆనందం. తెలుగు నేలపై కొత్త విలువలు, వెలుగులు మొలకెత్తడానికి విత్తనాలు పాతామన్న ఆనందం. ఆ నెలంతా పుష్పించిన 'చినుకు' స్పర్శతో నేలంతా తడవుతోందన్న ఆనందం. తడిసిన నేలలో కొత్త చదువరులు పుట్టుకొస్తారన్న ఆశతో కూడిన ఆనందం.

ఇన్ని ఆనందాల మధ్య...'చినుకు' మూడువేల ఆరువందల యాభైఆరు రోజులు మీతోనే ఉంటూ వస్తోంది. రేపు కూడా ఇది కొనసాగుతుంది. మిమ్మల్ని చేరుకుంటూ, మీలో ఒకరిగా ఉంటూ, మీ సంభాషణలలో పాలు పంచుకుంటూ, మీ సమస్యలకు పరిష్కారమవుతూ, మీ ఆనందాలకు వేదికవుతూ మీలో భాగమైన 'చినుకు' పదేళ్ళ పండగ సందర్భంగా మీకు వినమ్రంగా ధన్యవాదాలర్పిస్తున్నాం. ఈ ఆనందాన్ని మనందరం అనుభవిద్దాం. ఎప్పటిలానే 'చినుకు'ను ఎప్పుడూ అందుకుంటూ, అందిస్తూ ఉండండి.

నండూరి రాజగోపాల్






మాలచ్మి గుమ్మంలో కూచుని వుంటుంది. ఆమె చేతిలో మువ్వల వెండి పట్టీలూ, చిన్న చిన్న బంగారు లోలాకులూ వుంటాయి. కళ్ళనిండా నీళ్ళూ వుంటాయి. అట్లా ఆమె అక్కడ కూచోబట్టి ఆరు నెలలు అయిపోయింది. ఒకప్పుడు ఆమె పనిచేసిన ఇంటి మేడమ్ కారులో అటుగా వస్తూ అక్కడ ఆగి "దా మాలచ్మీ మా ఇంటికి పోదాం" అంటుంది.

"నేనింక పని చెయ్యలేనమ్మా, ఎవర్నన్నా చూసుకోమన్నా గందా? వినవేంటి?" అని కసురు కుంది మాలచ్మి.

"పనికోసం కాదు ఊరికేనే...కాసేపు మాట్లాడుకుందాం రా"

"ఏం మాట్లాడతావ్? నీకు వంద పన్లు, కొవ్వొత్తులు పట్టుకు తిరగడాలూ అవీ ఇవీ. నా పిల్ల సంగతి నీకేం పట్టింది. నేను మీ ఇంటికి రాను" అని మొహం మరో వైపు తిప్పుకుంటుంది మాలచ్మి. ఆవిడ ఒక నిట్టూర్పు విడిచి వెళ్ళిపోతుంది. ఈ మధ్య ఎవరు కదిలించినా ఇట్లాగే చిరాకు పడుతుందట మాలచ్మి. ఆమెను మళ్ళీ పూర్వపు మాలచ్మిని చెయ్యాలనే ఎవరి ప్రయత్నమూ ఫలించలేదు.




# పేరులేని పిల్లల్లో ఒక పిల్ల

పి.సత్యవతి



98481 42742

మాలచ్మి పోలీస్ స్టేషన్ వరండాలో ఒక స్థంభానికి ఆనుకుని తల చేతిలో పట్టుకుని కూచుంది. వాళ్ళాయనా, కొడుకూ లోపల ఎస్సైగారితో మాట్లాడుతున్నారు. ఆమె కళ్ళు తుడుచుకుంటూ లోపలికి చూస్తోంది అప్పుడప్పుడూ.

కాసేపటికి వాళ్ళు బయటికొచ్చారు. వాళ్ళతోపాటు ఆమె కొడుకు తోలే కారు ఓనరు రవీంద్రబాబుగారు కూడా వచ్చారు. ఆయన మాలచ్మి కేసి చూస్తూ "కంప్లేంటు రాసుకున్నార్లేమ్మా! ఇంక ఇంటికి పోండి. ఎతుక్కొస్తార్లే...నే కనుక్కుంటూ వుంటాగా" అన్నాడు.

"పోదాం దా! ఈడ కూకుని చేసేదేం లేదు" అని కసురుకున్నాడు మాలచ్మి వాళ్ళాయన. కొడుకు యజమానిని కారెక్కించుకుని వెళ్ళిపోయాడు.

"పాపం ఈళ్ళని కాస్త ఇంటికాడ దిగబెట్టూ" అంటాడేమో ఆయన అనుకుంది మాలచ్మి. ఆయనకేమన్నా పిచ్చా ఏంది అనుకుని కాళ్ళీడ్చుకుంటూ వాళ్ళాయన వెనకే బయలుదేరింది.

అతను వేగంగా నడుస్తున్నాడు. ఆమె అనుసరిస్తున్నది. కాళ్ళు లాగుతున్నాయి. రెండు రోజులుగా తిండిలేదు. రిక్షా ఎక్కి పోదామంటాడేమోనని చూసింది. అతనిపాటికి అతను గబగబా నడుచుకు పోతున్నాడు. అతనికి కోపం వస్తే అంతే...అట్లా గబగబా నడుస్తాడు వెనకచూపు లేకుండా. మాలచ్మి రొండిన పది రూపాయలున్నాయి. ఈ మద్దెన సైకిల్ రిక్షాలే కనబడ్డంలేదు. అంతలో ఓ షేర్ ఆటో అటుగా వస్తే ఆపి ఎక్కింది. ఆయన్ని కూడా ఎక్కమందామా అంటే చాలా ముందున్నాడు. ఎవరి కర్మ

ఆళ్ళది అనుకుంటూ కూచుంది.

ఇంటికి రాగానే నలుగురూ ఎగబడ్డారు, పోలీసులు ఏమన్నారేమిటీ అంటా.

పోలీసులేమంటారో వాళ్ళకి తెలీనిదా?

"సరే కానియ్! టీ పెట్టుకు తాగు. అన్నం ఉడకెయ్! అంతా బగమంతుడి దయ! ఎంతకని ఏడుస్తావ్?" అని తలకి కట్టుకున్న తువాలు విదిలించి భుజానేసుకుని ఎక్కడికో పోయాడు వాళ్ళాయన. బంగారమంటి పిల్ల! ఏ బ్రహ్మరాక్షసుడెత్తుకు పోయాడో! ఇంగ్లీషులో మార్కులు తగ్గినయ్యని ఒకాయన కాడ ప్రయివేటు చెప్పించుకుంటోంది. అట్టా ప్రయివేటుకని వెళ్ళిన పిల్ల ఇంతవరకూ అయిపులేదు. ఉధృతంగా దుఃఖం వచ్చింది మాలచ్మికి. శోకాలు పెట్టి ఏడ్చుకుంటూ గుమ్మంలోనే కూర్చుండిపోయింది.

నిన్న పొద్దున రవీంద్రబాబుగారు లేకుండ అచ్చంగా తనూ కొడుకూ పోయి కంప్లేంటిస్తే ఆ పోలీసు నాకొడుకు ఏమన్నాడు? "ఎవడితోనో లెగిసిపోయి వుంటదిలే! నాలుగు రోజులు షికారు చేసి అదే వస్తది. ఈ లోగా మా ప్రాణాలు తియ్యకండి" అన్నాడేగాని కంప్లేంట్ రాసుకున్నాడా? తెల్లని ఇస్త్రీ బట్టలూ, నాలుగు వేళ్ళకీ నాలుగు ఉంగరాలూ, ఒక కారూ వుంటేగానీ రాసుకోడు గామాల!

"ఇంకా గుమ్మంకాడనే కూకుండావా? లెగిసి పొయ్ ఎలిగించు పో! ఎవడు చేసిన కర్మ ఆడు అనుబగించాల్సిందే! చేతులారా సేసుకున్నావ్! ఇప్పుడేడిస్తే ఏం లాబం? పో పో! ఎల్లి కూడొండు. తినకపోతే కళ్ళు తిరిగి సస్తావ్" అన్నాడు మాలచ్మి వాళ్ళాయన.

మాలచ్మి మాట్లాడలేదు. అక్కడ్నించీ లేవనూ లేదు. అతనే పోయి పొయ్యి వెలిగించి టీ కాసుకొచ్చి ఇచ్చాడు. తాగనని మొండికేస్తే తిట్టి తాగించాడు.

"సేసిందంతా సేసి ఇప్పుడు ఈ ఏడుపేందే!" అని అరిచాడు. ఆ తరువాత "పాపం నువు మాత్తరం ఏం సేస్తావులే. అంతా బాగుంటుందనుకున్నావు. ఏడుస్తూ కూకుంటే మనకి బతిమాలి తిండెవరూ పెట్టరు. పద పద" అని ఓదార్చాడు.

"ఎతుక్కొస్తార్లే అమ్మా! ఏడవమాక. మా సార్ కూడా కనుక్కుంటూ వుంటానన్నారుగా! నువ్వు పని చేసే మేడమ్‌కి కూడా చెప్పు. ఆవిడకేదో సంఘం వుందిగా" అన్నాడు అప్పుడే వచ్చిన కొడుకు.

**"అవునూ! అది ఎవరితోనూ వెళ్ళిపోక, కాలవలో పడి చచ్చిపోక, ఇంటికి రాక ఏమైనట్టూ? ఇట్లా మాయమై పోతున్న పిల్లల గురించీ ఒక నలుగురు ఆడవాళ్ళో నలుగురు మొగవాళ్ళో కూచుని టీవీలో మాట్లాడుకోరేం? పట్నం పిల్లలు పోతేనే హడావుడా? నా పిల్లకోసం నేనే కొవ్వొత్తులు వెలిగిస్తా" అని ఒక రోజు గుమ్మం ముందు పదిహేడు కొవ్వొత్తులు పెట్టింది మాలచ్మి.**



చాలాసేపటికి మాలచ్మి లేచింది. అయినా ఆమె కళ్ళల్లో నీళ్ళూరుతూనే వున్నాయి.

మాలచ్మి పనిచేసే మేడమ్ వచ్చింది, మూడు రోజులుగా ఆమె పని ఎందుకు ఎగ్గొట్టిందో తెలుసుకోవాలని. మాలచ్మి ఆమె చెయ్యి పట్టుకుని మళ్ళీ కంటికి కడివెడుగా ఏడ్చింది. "మీ సంఘం వాళ్ళతో చెప్పి నా బిడ్డ సంగతి చూడు తల్లీ" అని వేడుకుంది. ఆవిడ చూస్తాననే అంది కానీ "అయితే

నువ్విప్పట్లో పనికి రావా ఏంటి?" అని కూడా అంది.

"నా వల్ల కాదు తల్లీ" అని కూతురి కబురు చెబుతూ కుళ్ళి కుళ్ళి ఏడ్చింది మాలచ్చి.

'దిగులు పడమాకు. నీ కూతురికేం కాదులే వచ్చేస్తుంది" అని ఓదార్చి వెళ్ళిపోయింది మేడమ్.

వారం రోజులాయె! పదిరోజులాయె.

ఒక రోజు పోలీస్ స్టేషన్నుంచీ కబురొస్తే దేముడు పటానికి దండం పెట్టుకుని లెంపలేసుకుని పరిగెత్తినట్లే పోయింది.

"ఐందరు లాకుల కాడ కొట్టుకొచ్చింది ఒక శవం! లంగా ఓణీ, చెవులకి బుట్టలు ఒకేళ మీ అమ్మాయేమో చూడు!"

"అమ్మో నా తల్లో! నువ్వు కావద్దు నువ్వు కావద్దు" అంటూ పోతే నిజంగానే మాలచ్చి కూతురుగాదు. గుండె అవిసిపోయింది తల్లా! ఎవరిబిడ్డో ఏమో! అయ్యో నా తల్లీ!

రైలు పట్టాల మీద పిల్ల! తలకి తల! మొండానికి మొండేం! లంగా ఓణి బుట్టలు. అమ్మయ్య...మా అమ్మాయికాదు స్వామీ.

బొంబాయిలో దొరికిన తెలుగు పిల్లల్ని పట్టుకొచ్చాం. ఒక పిల్లది ఈ వూరేనంది. చూడు...

మా అమ్మాయి కాదు నాయనా! చస్తున్నాం పోలీసు స్టేషన్కీ, కాలవ ఒడ్డుకీ, రైలు పట్టాల కాడికీ తిరగలేక...రెండు మూడు రోజులకి శవాలు! ఇంతమంది ఎందుకు చస్తున్నారు దేవుడా! ఏమైంది వీళ్ళకి. తిని తిరగలేక తీపరమొచ్చిందా?

"శవాలు వస్తూనే వున్నై. మీ అమ్మాయి కనిపించక చాన్నాళ్ళయింది కదా? ఇవ్వన్నీ కొత్త శవాలు. ఎవరితోనో దొబ్బేసుంటది. నోరు మూసుకుని వూరుకోండి" అంటున్నారు బంధువులు, ఇరుగు పొరుగులు.

రవీంద్రబాబుగారికి మాత్తరం పనుల్లేవా? ఎన్నిసార్లని పోలీసులని కనుక్కుంటారు? మేడమ్కి మీటింగ్లు, ధర్నాలు, కొవ్వొత్తుల ప్రదర్శనలు. ఆవిడకి మాత్రం మన సంగతొక్కటేనా? దేవుడి మీద భారం వేసి మన పనులు మనం చేసుకోవాలి అంటున్నాడు మాలచ్మి కొడుకు.

దానికి చదువొద్దే అని నెత్తీ నోరు కొట్టుకుంటే వినిందా? పద్దెనిమిదేళ్ళు రావాలని తల్లీ కూతుళ్ళిద్దరూ ఒకేమైన కాకిగోల. సదూకుంటా నాన్నా సదువుకుంటా నాన్నా! ఇప్పుడేమైంది. సదువూ పోయింది పిల్లా పోయింది. తల బాదుకుంటాడు మాలచ్మి వాళ్ళాయన. ఆవేశంలో పెళ్ళాం మీద గంతులేస్తాడు. ఆవిడ కుళ్ళికుళ్ళి ఏడుస్తుంది. మళ్ళీ ఓదారుస్తాడు. తిండి తినిపిస్తాడు. కొడుకు నిద్రలేస్తూనే కారెక్కుతాడు. రాత్రి పదింటికే మళ్ళీ ఇంటికి. వరసకి మేనత్త కొడుకయే వీరభద్రానికి చేద్దామే అని పదో క్లాసు పాసైన రోజే అన్నాడు మాలచ్మి మొగుడు. "ఆడ్ని నేను సస్తే సేసుకోను నాన్నా! నేనా పల్లెటూళ్ళో వుండలేను. నేను సదువుకుంటాను. నాకింకా పదహారే. పదహారేళ్ళకి పెళ్ళిచేస్తే నిన్ను జైల్లో పెడతారు" అంది కూతురు. పోట్లాట! పోట్లాట. ఒకటే పోట్లాట. వీరభద్రం మంచోడు. వాడి తల్లీ మంచిదే. ఆడికో ఇల్లుంది. ఎవరిదో పొలం కౌలికి చేస్తాడు. పెళ్ళాం దానికి వంత పాడింది, తన కూతురేదో పెద్ద చదువు చదివి కలక్టర్ అయి పోతుందన్నట్లు.

కాలేజీ చదువు కదాని, ఉన్నంతలో కాస్త మంచి బట్టలు, చెప్పులు! దేనికి లోటు చేశామనీ? అదైనా మంచి పిల్లేనే. ఒక్క మగ స్నేహితుడూ లేడు. దాని పుస్తకాలు బట్టలూ అన్నీ తెగ వెతికారు పోలీసులు కూడా. ఎక్కడా ఒక్క పొరపాటు లేదు. పాఠాలు నోట్సులు తప్ప లవ్ లెటర్స్ లేవు. అందరికీ సెల్ ఫోన్లున్నా దానికి లేదు. ఒకటి రెండుసార్లు అడిగిందే కాని తను కొనివ్వలేదు. కొనిస్తే ఏదైనా ప్రమాదంలో చిక్కుకుంటే అన్నకైనా ఫోన్ చేసి వుండేదేమో! అనుకున్నప్పుడు నాన్న గజగజలాడి పోయాడు. "అమ్మాయికి ఫోన్ కొనిస్తే బావుండేదేమోనే లచ్మీ" అని పక్కన కూచుని తుండుగుడ్డతో కళ్ళు తుడుచుకున్నాడు.

"ఎట్టాగైనా ఒప్పించి పెళ్ళి చేసేస్తే బాగుండేదేమోనయ్యా" అంటుంది మాలచ్మీ.

"ఈ ఎదవ ఇంటర్ చదువు చదివి ఏం సెయ్యాలని కాలచ్చేపానికి కాకపోతే! నేను ఇంటర్ చదివి ఏం ఎలగబెడుతున్నాను? ఈ సదువులు దండగ" అంటాడు కొడుకు. పిల్ల కనపడక పోయిన మూడో నెలలో కామేసు, దాని స్నేహితురాలు నాగమణిని కాలేజీ మాన్పించి పెళ్ళి చేసేశారు. ఇప్పుడు తొందరగా పెళ్ళి సెయ్యడమే రైటు.

పది చేతులతో పని చేసే మాలచ్మి పది చేతులూ చచ్చుబడి పోయాయి. వొళ్ళిరుచుకుని పనిచేసి మొగుడికి తెలీకుండా కూతురికోసం కొన్న వెండి పట్టాలూ, మూడు గ్రాముల లోలక్కులూ రోజు కొకసారి చూసుకుంటూ వుంటుంది. వాకిట్లో కూచుని కూతురికోసం ఎదురు చూస్తూ వుంటుంది...మాలచ్మి పని చెయ్యకపోవడం ఆ ఇంటి ఆదాయానికి లోటే. మొగుడు కొడుకూ తెచ్చేది వాళ్ళ ఖర్చులు పోను బొటాబొటీ.

శవాల గుర్తింపులు ఇంకా సాగుతూనే వున్నాయి. "ఇంక మేము రాలేము స్వామీ, మమ్మల్ని వదిలి పెట్టండి, ఆరు నెలలైపోయింది" అని ఒక నమస్కారం పెట్టేశాడు మాలచ్మి మొగుడు.

"అదేంటయ్యా! ప్రేమించుకుని వెళ్ళిపోడానికి ఒక నెల! కాపురం మూడు నెలలు! కడుపు ఒక మూడు నెలలు! అప్పుడు పిల్లని వదిలెయ్యడం ఒక వారం! చావడానికి రెండు రోజులు..." అని నవ్వాడు అనుభవజ్ఞుడైన ఒక పోలీసాయన. మాలచ్మి ఎదుట ఆ మాటంటే ఎవరన్నదీ చూడకుండా అతన్ని కొట్టి ఆనక జైలుకెళ్ళేది. మాలచ్మి మొగుడు తమాయించుకుని అతనికొక నమస్కారం పెట్టి వచ్చేసాడు, "పిల్ల కావాలి, శవం వద్దు మాకు. మమ్మల్నిక పిలవకండి" అని చెప్పి.

"అవునూ! అది ఎవరితోనూ వెళ్ళిపోక, కాలవలో పడి చచ్చిపోక, ఇంటికి రాక ఏమైనట్టూ? ఇట్లా మాయమైపోతున్న పిల్లల గురించీ ఒక నలుగురు ఆడవాళ్ళో నలుగురు మొగవాళ్ళో కూచుని టీవీలో మాట్లాడుకోరేం? పట్నం పిల్లలు పోతేనే హడావుడా? నా పిల్లకోసం నేనే కొవ్వొత్తులు వెలిగిస్తా" అని ఒక రోజు గుమ్మం ముందు పదిహేడు కొవ్వొత్తులు పెట్టింది మాలచ్మి.



> నిన్న పొద్దున రవీంద్రబాబుగారు లేకుండ అచ్చంగా తనూ కొడుకూ పోయి కంప్లేంటిస్తే ఆ పోలీసు నాకొడుకు ఏమన్నాడు? "ఎవడితోనో లెగిసిపోయి వుంటదిలే! నాలుగు రోజులు షికారు చేసి అదే వస్తది. ఈ లోగా మా ప్రాణాలు తియ్యకండి" అన్నాడేగాని కంప్లేంట్ వ్రాసుకున్నాడా? తెల్లని ఇస్త్రీ బట్టలూ, నాలుగు వేళ్ళకీ నాలుగు ఉంగరాలూ, ఒక కారూ వుంటేగానీ రాసుకోడు గామాల!

# పథసూచికలు

వెలుగులూ చీకట్లు కలిసి
దాగుడుమూతలాడుకుంటూ వుంటే
మధ్యలో టపాటపా మోగే
టపాసులలొల్లి ఎందుకన్నట్టు?

భిన్న ప్రవృత్తుల వాళ్ళు
వరసలు కలుపుకుని ఉరకలేస్తూ వుంటే
వాళ్లను చూసి
కన్నుగుట్టే వాళ్ళెందరో!

గదులు
తమ రొమ్ముల మీద చేతులు వేసుకుని
గురక పెడుతుంటే
వీధుల రొదలు
ఆ గదుల చెవుల్లో చొరబడి
గడబిడ చేస్తుంటా యెందుకో?

కొమ్మ మీద కూచుని
ముద్దు ముద్దుగా ముచ్చట్లాడుకుంటూ వుంటే
ఆ పక్కనే వున్న కాకి మూకలు
కావుకావుమని అరిచి
ఆ జంట ఏకాంతాన్ని భంగపరచడం
కసి పెరిగిన అసూయ వల్లనే కదా

సౌమనస్యాలున్నప్పుడు వైరుధ్యాలూ
తప్పవేమో?
ప్రవృత్తుల వైవిధ్యాలను
సహన దృష్టితో సమీక్షించగలిగే
వ్యక్తిత్వాలే
సముదాత్త జీవన గమనానికి
నిరవధిక పథసూచికలుగా
నిలిచిపోతాయి.

డా॥సి. నారాయణరెడ్డి
040-24753724




# తృష్ణ

దేహాన్ని ఉప్పెనలా
కుదిపేసే తృష్ణ,
ప్రవహింపచేసే రేతస్సులో
భగ్గునమండే తృష్ణ,

అనాదిగా ఆత్మరోదనగా
ఆనంద విహ్వలత్వంలో
ఎవరికివారు - తమను తాము
అన్వేషించే ప్రగాఢ తృష్ణ,
హేతువుకు అతీతంగా
అతి బలీయంగా
మనిషిని లొంగదీసి
ప్రతిసృష్టి కోసం
ప్రకృతి ఆడుకునే తృష్ణ,

రగిలే కోరికలో
ఎవరికోసం ఎవరనే
ప్రశ్నను లెక్కచేయని
మనిషి మనుగడలో
కరిగిపోయే తృష్ణ,

ఆదిమ సంస్కృతి లోంచి
అత్యాధునిక జీవన శైలిలో
అంతర్గతంగా దాగిన తృష్ణ,
వావివరుసల
విచక్షణాజ్ఞానాన్ని
విస్మరించే పశుకామం తృష్ణ,

కాటిదాకా ఉప్పొంగే
ఉద్రేక కడలి
చితిమంటల్లో ఆవిరై
బూడిదగా మారే తృష్ణ!!

నిఖిలేశ్వర్
9177881201






2

***వో చికెన్ ఫ్రాంకీని, వొక గ్లాసు నిండా బటర్‌స్కాచ్ మిల్క్ షేక్‌ని పేరు తెలియని ఆమె కోసం వుంచి, ఆ రోజు వచ్చిన క్యాష్‌ని లెక్కపెడుతోంది కమిలిని. షాప్‌ని క్లీన్ చేసే అతను మాత్రమే వున్నాడు. మిగిలిన స్టాఫ్ వెళ్ళిపోయారు. సరిగ్గా యిలాంటి సమయంలోనే ఒంటరిగా వచ్చిన ఆమె తింటానికి యేముంటే అది పెట్టమని అడిగింది వారం రోజుల క్రితం కమిలినిని. అప్పుడు సాలిడ్ ఫుడ్ యేం లేక బటర్‌స్కాచ్ మిల్క్‌షేక్ స్వయంగా యిచ్చింది. ఆ రోజు షాప్‌లో మరెవ్వరూ లేకపోవటంతో. యీ వారం రోజులుగా ఆమె దాదాపు యిదే సమయానికి కాస్త అటుయిటుగా వస్తూనే వుంది. ఆమె రెండు రోజులు వరుసగా రావటంతో మూడోరోజు నుంచి ఆమెకోసం వొక ఫ్రాంకీ కూడా వుంచుతోంది కమిలిని. ఆమె ఈ రోజింకా రాలేదు. షాప్ మూసేసే సమయం అయింది.***

# మౌన...

## కుప్పిలి పద్మ




"అసలు ఆమె గురించి యింతగా నేనెందుకు ఆలోచిస్తున్నాను" అనుకుంది కమిలిని.

సిటి మధ్యలో వున్న ఆ మాల్లో ఒక ఫ్లోర్ మొత్తం ఫుడ్ కోర్టు వున్నాయి. రోజు చాల మంది వస్తుంటారు. రెగ్యులర్ కస్టమర్స్ ఆ చిన్ని ఫ్రాంకీ జాయింట్‌కి రావటం తక్కువే. ఫ్లోటింగ్ పాపులేషన్ యెక్కువ. ఫ్రాంకీస్, డోనట్స్, కేరమిల్ కస్టర్డ్, రకరకాలైన మిల్క్‌షేక్స్ మాత్రమే సర్వ్ చేస్తారు.

కాస్త అలా రెగ్యులర్‌గా వచ్చే వాళ్ళలో ఆ ఇద్దరమ్మాయిలు కలిసి వచ్చేవారు. నాలానే వాళ్ళకి ముప్పై ఐదు లోపలే వుండొచ్చు వయస్సు. యెప్పుడూ వాళ్ళ చుట్టూ మరో లోకమే లేనట్టు, వున్నంత సేపు కబుర్లు నవ్వులతో ఫ్యూజన్ మ్యూజిక్ చిమ్మించేవారు, యీ అవుట్‌లెట్ అంతా. యీ మధ్య ఒక్క అమ్మాయే వస్తుంది. డిస్టర్బ్‌డ్‌గా కనిపిస్తుంది. యేమైవుంటుంది. ఆ రెండో అమ్మాయి యేమయిందో? యీ అమ్మాయి యీ రోజింకా యెందుకు రాలేదో? అని కమిలిని అనుకొంటుండగా ఆమె వచ్చింది.

లోపలికి వెళ్ళి ఆమెకోసం వుంచిన ఫ్రాంకీ, మిల్క్‌షేక్ తెచ్చి యిచ్చింది. ఆమె హేండ్‌బ్యాగ్ లోంచి డబ్బులు తీసి ఇచ్చింది. ఆమెకి మిగిలిన డబ్బులు, బిల్ కాపీ యిచ్చింది కమిలిని. ఆమె యెప్పటిలానే కూర్చుని తింటూ, మెల్లగా మిల్క్‌షేక్ తాగుతోంది.

క్లోజ్ చేసే టైమ్ కాబట్టి ఆమె త్వరగా బయలుదేరితే బాగుండునని ఆమె వైపు కమిలిని చూస్తే ఆమె యెటో శూన్యంలోకి చూస్తోంది.

"యెక్స్‌క్యూజ్‌మీ" కమిలిని అంది.

ఆమె తలెత్తి చూసింది.

"సారీ. క్లోజింగ్ టైమ్"

"నేనిక్కడ ఉండొచ్చా" అని అడిగింది చప్పున.

"యిక్కడా" అయోమయంగా అడిగింది కమిలిని.

"సారి" అని ఆమె లేచి మెల్లగా నడుస్తూ వెళ్ళిపోయింది.

పార్కింగ్‌లోంచి కారు తీసుకుని సిటి సెంట్రల్ దగ్గరున్న సిగ్నల్ పడితే ఆగింది కమిలిని. గ్రీన్ లైట్ వెలిగింది. రైట్‌కి తిరగబోతుంటే ఆమె నిదానంగా నడుస్తూ వెళుతూ కనిపించింది.

ఆమె తనని "ఇక్కడ ఉండొచ్చా"ని ఎందుకు అడిగింది యిందాక. ఆమె యెక్కడికి వెళ్ళుతుందో కనుక్కుని దారిలోనైతే లిఫ్ట్ యివ్వొచ్చు. కానీ ఆమె తన కారు యెక్కుతుందా? తను పూర్తిగా స్ట్రేంజర్ కాదుగాని, రాత్రి పదకొండున్నరకి తనతో వచ్చేంత కానీ, తను లిఫ్ట్ యిస్తానని అడిగేంతగా కూడా వొకరికొకరం తెలియం కదా. అనుమానం, అభద్రతా టెంటికిల్స్‌లా వ్యాపించేస్తున్నాయి జీవితాల్లో. ఆలోచిస్తూనే డ్రైవ్‌చేస్తున్నా, లోపలెక్కడో గిల్టీగా కూడా అనిపించింది కమిలినికి.

ఆ అమ్మాయి మానసికంగా వుత్సాహంగా లేదని తెలుస్తూనే వుంది. నాలోంచి కూడా యెదుటి వారిని పట్టించుకోనే మనసు వెళ్ళిపోతుందా. యెదుటివారిని పట్టించుకోనితనం అంటువ్యాధిలా నాకు సోకిందా? అనుకొంటుండగా దిగులేసింది కమిలినికి. అప్రయత్నంగా వెనక్కు వెళ్ళింది.

ఆ అమ్మాయి అప్పటికే క్వారీ దాటి వెళ్ళుతూ కనిపించింది. రైట్ యూ టర్న్ తీసుకొని ఆమెకి కాస్త దూరంలో ఆపి, కారు దిగి "యెక్కడైనా

డ్రాప్ చేయనా, నేనిటే వెళ్తున్నాను" అని అడిగింది.

ఆమె కాస్త అయోమయంగా చూస్తూ "నో థాంక్స్" అంటూ ఆగి, నా వైపు తటపటాయింపుగా చూస్తూ "మీకు అభ్యంతరం లేకపోతే కెబియార్ పార్క్ దగ్గర వరకూ లిఫ్ట్ యివ్వగలరా" అని అడిగింది.

కారెక్కాం. మా మధ్య మాటలేం లేవ్. పార్క్ దగ్గరకి వచ్చాకా అడిగాను "ఎక్కడ ఆపను" అని. ఆమె చుట్టూ చూస్తూ "ఇక్కడ పుట్‌పాత్ మీద చాలామంది పడుకొని వుంటారుగా రకరకాల హస్పటల్స్ పని మీద వచ్చినవాళ్ళు, కాస్త అక్కడ ఆపుతారా" అంది.

"యెందుకక్కడా" అడిగాను ఆసక్తిగా.

"అక్కడైతే సేఫ్" అంది.

"సేఫ్ అంటే? వోకె. ఐ యామ్ కమిలిని. మీ పేరేమిటి?"

"విమల"

"మీరు యేదో విషయంలో డిస్ట్రబ్‌గా వున్నారని తెలుస్తోంది. మీకీ రాత్రికి వుండటానికి ప్లేస్ కావాలంటే వాతో రండి, మిగిలిన విషయాలు పొద్దున్నే చూసుకుందాం. నాకు నిద్దరొస్తుంది" అంది కమిలిని

ఆమె కళ్ళల్లోంచి టపటపా కళ్ళనీళ్ళు వడగళ్ళలా.

కమిలిని నిద్ర తేలిపోయింది.

"సారీ..." అంటూండగానే ఆమె కళ్ళు నుంచి ధారాపాతంగా కన్నీరు.

యీ కొద్దిపాటి పరిచితురాలి బాధేంటో యెలా వోదార్చాలో తెలీయక అయోమయంగా కమిలిని ఆమె చేతిని చేతుల్లోకి తీసుకోబోతుంటే విమల తన చేతిని చప్పున వెనక్కి తీసుకుంది. యెక్కువ చొరవ చూపించానాని సిగ్గుగా అనిపించింది కమిలినికి

"సారీ...నమ్మ మీతో రమ్మన్నారు. మనం వొకరికొకరు యేమంత తెలుసని. చాలా వికలంగా ఉన్నాను. మీ యింటికి రమ్మని పిలిచారు. మీకు నా గురించి తెలీదు. రేపు నేను యెవరినో తెలిసాకా మీరు ఫీల్ కాకూడదు. నేనెవరో తెలిసాక మీకు వోకే అంటే వస్తాను" అంది.

"యేదో వొక రాత్రి కొన్ని గంటలు మా ఇంట్లో వున్నంత మాత్రాన మీ ప్రైవసీలోకి నేను యెలా యెందుకు చొరబడతానండి. ఇది క్రైమ్‌కి సంబంధించిన విషయం మాత్రం కానంతవరకు నాకు వోకె. మీరే ఆలోచించుకోండి" అన్నాను.



"నాక్కూడా అర్థం కావటంలేదండి నే చేసిన నేరమేంటో. కానీ నన్ను అందరూ నేరస్తురాలిగానే చూస్తున్నారు" అని ఆగి "మంచినీళ్ళు ఉన్నాయా?" అని అడిగింది.

పక్కన వున్న నీళ్ళ బాటిల్ అందించింది కమిలిని.

విమల నీళ్ళు తాగి కమిలిని పర్మిషన్ కూడా అడక్కుండానే వొక ట్రాన్స్‌లో వున్నట్టు చెప్పడం మొదలుపెట్టింది...

అవి నేను యూనివర్సిటిలో జాయిన్ అయిన రోజులు. వేసవి వెళ్ళిపోయింది. వానలింకా మొదలు కాలేదు. రోజు వార్తల్లో వానలు రాక పోవడం మీద కథనాలు వస్తున్నాయి. ఆ మధ్యాహ్నం క్లాస్ అయిపోయింది. నన్ను యింట్రావర్ట్ అనేవారు డిగ్రీలో ఉండగా లెక్చరర్స్. దానికి తోడు అంతా కొత్తగా వుందిక్కడ. యింకా యెవరితో స్నేహం కాలేదు. క్యాంపస్‌లోని హాస్టల్ రూమ్‌కి వొంటరిగా బయలుదేరాను.

చెట్ల మధ్య నుంచి నడుస్తున్నాను నాలో నేనే ఆలోచించుకుంటూ, మాటాడుకుంటూ. "సైకిల్

కొనుక్కోవాలి యీ శనివారం వెళ్ళి. ఆ రోజు యెవరినైనా తోడు రమ్మనాలి...

అప్పుడు వినిపించింది హఠాత్తుగా మేఘ ఘర్జన వర్షాగమనపు సంకేతంలా. చల్లదనం పాకుతోంది వొళ్ళంతా. అప్పటివరకు యెండ కాసిన వైనమే లేకుండా టపటపా జల్లు. అంతవరకు యెండ కాసిన ఆనవాలుగా భూ సుగంధం వెచ్చగా తాకుతోంది వుచ్ఛ్వాస నిశ్వాసాలని.

అప్పుడు వినిపించింది బ్యూటిఫుల్ అని.

తల తిప్పి చూసాను.

జీన్స్ మీద షార్ట్ షర్ట్, బాయ్‌ఁ కట్‌తో నవ్వుతూ చూస్తోన్న ఆమె చూపులు వానకి తడిసి శరీరానికి అతుక్కుపోయిన నా చున్నీపైపే వున్నాయి.

సైకిల్‌కి స్టాండ్ వేస్తూ "యీ సీజన్‌కి మొదటి వాన కదా" అంది ఇంగ్లీషులో.

తిరిగి ఆమె కురుస్తున్న వాన వైపు చూస్తు "మొదటిసారి కురిసే వానలో తడుస్తుంటే వుండే మజానే వేరు" అంది.

తిరిగి ఆకాశం వురిమింది. భయంతో అర్జునా ఫాల్గుణా అంటూ లోలోపల పఠిస్తోంది నా మనసు.

"యేమయింది...అలా బిగుసుకు పోతున్నావ్? వానంటే యిష్టంలేదా" అడిగింది.

"యిష్టమే"

"మరి"

"వురుములంటే భయం" చెప్పాను

ఆమె నవ్వి "సో నీ కోసం వురుముల్లేని వానల్ని యివ్వమని మేఘాలకి చెపుతాలే" అని యింకా నవ్వుతూనే "భయపడటం వలన అవి ఆగిపోవు కానీ చాలా కాలానికి వచ్చిన వానని యెంజాయ్‌ఁ చై" అంది.

ఆమె యీ యూనివర్సిటి స్టూడెంట్ అని తెలుస్తునే వుంది. ఆమె మాటల్లోనే కాదు ప్రతి కదలికలోనూ కనిపిస్తున్న వాగువేగాన్నిచూస్తూ "యెంత కలివిడిగా మాటాడుతుందో. తను యెప్పటికైనా యిందులో సగమైనా మాటాడగలనా" ఆలోచిస్తున్నాను.

యెంత హడావిడా ప్రేమలా వచ్చిందో అంతే హడావిడిగా వెళ్ళిపోయింది వాన.

ఆమె వెళ్ళబోతు "నా పేరు మౌన. చూసారా జీవితంలో యెంత కాంట్రాస్ట్ వుంటుందో...నా పేరుకి నా లొడలొడకి యేమైనా సంబంధం ఉందా" అని ఆగి "మీ పేరు" అనినవ్వుతూ "నది అయితే కాదుగా. మరి నిశ్శబ్దంగా వున్నారు. నిజానికి మీకు నా పేరు కరెక్టుగా సూట్ అవుతుంది. మీ నిశ్శబ్దం చాలా అందంగా వుంది నదీతీరంలా" అంది.

ఆమె మాటల్లోనే కాంప్లిమెంట్‌ని యెంత బాగా చెప్పేస్తుందో యెఫర్ట్‌లెస్‌గా. మౌనా నాకు నచ్చింది. కానీ తనతో వొక్క మాటా మాటాడలేక పోతున్నాను. యిదే యీ మాటాడలేనితనాన్ని వదిలించుకోవాలి. యెలా...

"హలో, పేరు చెప్పటానికి అంతలా ఆలోచించకండి. మనం మౌనంగానే మాట్లాడుకొందాం. యిక్కడ పిహెచ్‌డీ చేస్తున్నాను. యింగ్లీష్ లిటరేచర్ స్టూడెంట్‌ని. మీరు" నవ్వుతూ అడిగింది.

"విమల.యంయస్సీలో చేరాను" అన్నాను.

"హాస్టల్లోనేగా వుండేది. యిప్పుడు టీ తాగితే భలే వుంటుంది. చింత చెట్టుకింద వున్న క్యాంటీన్‌కి యెప్పుడైనా వెళ్ళారా" అడిగింది.

"అన్నం ఆకలేస్తుంటే యిప్పుడీ టీ యేంటో" అనుకుంటూ ఆ క్యాంటీన్ తెలీదన్నట్లు తలూపాను. సైకిల్ యెక్కుతూ "దా" అంది.

వెనక కూర్చున్నాను.

విచిత్రమైన పరిమళం తడిసిన చెట్ల ఆకుల్లోంచి అప్పుడప్పుడూ గాలికి చిన్నగా తగులుతున్న ఆమె షర్ట్ చివరల్లు కొద్దిగా గిలిగింతలు కలిగిస్తున్నాయి.

* * *

అలా మొదలయ్యింది మా స్నేహం.

సైకిల్ కొనుక్కోవాలని చెబితే మౌన తీసుకు వెళ్లింది.

తరచు కలుస్తుండేది. యెప్పుడు కలిసినా యూనివర్సిటీలోని కొత్తకొత్తవి లోలోపలి ప్రదేశాలు చూపించేది.

"నీకు బాయ్‌ఫ్రెండ్స్ వున్నారా" అడిగిందో రోజు.

"లేరు"

"యిక్కడ కాదు. యిప్పటి వరకు.

"లేరు"

"యేం"

"యేం అంటే"

"స్ట్రేంజ్, యు ఆర్ వెరి గుడ్ లుకింగ్, చాలామంది ప్రపోజ్ చేస్తుంటారుగా. యిట్స్ నేచురల్" అంది.

"నీకు" అడిగాను.

"వుండేది ఒక అమ్మాయి. కొద్దికాలమే. యంయే అవ్వబోతున్న టైమ్‌లో పరిచయం. తరువాత యంఫిల్ చేస్తున్నప్పుడు కూడా కొంత కాలం ఫ్రెండ్స్‌మి. తరువాత తనకి మరో ఫ్రెండ్‌షిప్ వచ్చింది. అప్పట్నుంచి మరెవ్వరూ లేరు" అని చెప్పింది.

మౌన యిలా అవలీలగా విషయాలు మాటాడే ప్రతిసారి యెప్పటిలానే ఆమె నాకు ఆశ్చర్యంగా తోస్తుంది. అందరూ చాల దాచి దాచి మాట్లాడే స్నేహాలని "నాకు బాయ్‌ఫ్రెండ్స్ లేరు" అని నేను చెప్పినంత మామూలుగా చెప్పిందామె.

చాలామంది ప్రపోజ్ చెయ్యటం నిజమే కానీ, నాకెందుకో వాళ్ళు మాటాడినంత సేపు బానే వుంటుంది. వాళ్ళ చెయ్యి మామూలుగా తగిలినా కూడా యేంటోలా వుంటుంది. వొక ప్రత్యేకమైన కాంక్షతోనో, మోహంతోనో, ఆసక్తితో తాకితే మరింత చికాకుగా అనిపిస్తుంది. అది వాళ్ళపట్ల వున్న వ్యతిరేకతం కాదు. అదేంటో మెల్లమెల్లగా అర్థమవ్వసాగింది. ముఖ్యంగా మౌన పరిచయంతో రోజురోజుకీ పెరుగుతున్న ఆ స్నేహంలో ఆ విషయం మరింత తేటగా తెలుస్తుంది. కానీ సహజంగానే యెవ్వరితో త్వరగా మాటాడలేనితనం వో వైపు. మరో వైపు విషయం మనసుకి సంబంధించింది. సున్నితమైనది.

* * *

ఆ రోజు మెయిల్ చూస్తుంటే మౌన పంపిన పోయిమ్ కనిపించింది.

వాన కురిసిన ఆ మధ్యాహ్నం
యెదురైన మరో వాన
దప్పికకొన్న మరో హృదయభూమిపై
వాన కురినప్పుడల్లా మనసు సుగంధం
మరల మరల యెగసి చిమ్ముతుంటుంది
పుస్తకంలోని నెమలి యీక
అనుకోకుండా కనిపించినట్టు
మర్చిపోయిన యిష్టమైన పాటొకటి
హఠాత్తుగా యఫ్‌ఎమ్‌లో వినిపించినట్టు
యెదురైన వాన
తెరవని గది తలుపులలోంచో
తెరిచీ తెరవని కిటికీ రెక్కల నుంచో
జీవన కాంతిని చిలకరిస్తుందేమోననే
యెదురు చూపు...

యెంత బాగుందో...మౌనాకి జవాబు

రాసాను

* * *

ఆ రోజు పుదయమే నా రూమ్‌కి వచ్చిందామె. చేతిలో వొక చిన్న మట్టి కుండీలో మనీ ప్లాంట్. ఆ కుండీ కింద పెట్టడానికి ఆరెంజ్ కలర్ ట్రే. అలానే కిటికి వూసకి వొక చిన్ని బెల్ కట్టింది. గాలికి ఆ చిన్నిగంట మెత్తగా మోగుతోంది.

కాసేపు ఆవీయివీ మాటాడాకా "సాయంత్రం లామకాన్‌లో నాటకం వుంది వెళదామా" అని అడిగింది. యిద్దరం ప్లే చూసి అక్కడకి దగ్గరలోనే వున్న మాల్లోని ఫ్రాంకీ అవుట్ లెట్‌కి వచ్చాం. రెండు చికెన్ ఫ్రాంకీస్, రెండు డోనెట్స్, వొక బటర్ స్కాచ్ మిల్క్‌షేక్ ఆడర్ చేసింది. అవి తినేసాక మిల్క్‌షేక్ వచ్చింది.

వొన్‌బైటూ అనుకొని యెక్స్‌ట్రాగా గ్లాస్ తీసుకు రమ్మన్నాను

గ్లాస్ వచ్చింది. ఆ గ్లాస్‌లోకి వొంపటానికి ఆ మిల్క్‌షేక్ గ్లాస్ అందుకోబోతుంటే "వన్ సెకండ్" అంది. 'మనిద్దరం పార్టనర్స్‌గా వుండటం నీకు ఇష్టమేనా" అడిగింది మౌన.

ఆమె వైపు చూపు చూసాను. కళ్ళల్లో యేం చెపుతానన్న క్యూరియాసిటీ, చిన్న ఆదుర్దా. యేం చెయ్యాలో తెలీక నవ్వాను.

"ఆ నవ్వు నాకేం కన్వే చెయ్యలేదు విమలా...నాకు నా పార్ట్‌నర్‌తో సెటిల్ అవ్వాలని ఉంది. వో క్యూట్ యిల్లు కావాలనిపిస్తుంది. యీ హాస్టల్ జీవితం యిక చాలనిపిస్తుంది. మరీ యెక్కువ ఆలస్యం చెయ్యకుండా నిన్ను అడగటమే మంచిదనిపించిది. నువ్వంటే యిష్టమని యిప్పుడు ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. మనిద్దరం పార్టనర్స్‌గా హ్యాపీగా వుండగలమనే అనిపిస్తుంది. నీకు అలానే అనిపిస్తే, నీకు యిష్టమైతే మిల్క్‌షేక్‌ని ఆ రెండో గ్లాస్‌లో పొయ్యకుండా రెండు స్ట్రాలు యిందులోనే వేయి" అంది మౌన.

అప్పటికే యీ విషయంలో కాస్త ఆలోచించుకొనివున్నానేమో యెక్కువ తటపటాయింపు లేకుండానే మిల్క్‌షేక్‌లో రెండు స్ట్రాలు వేసాను.

"థాంక్‌యూ" అంటూ హగ్ చేసుకొంది.

* * *

ఆ తరువాత మేం ఇద్దరం హాస్టల్‌లో వొకే రూమ్‌లో వున్నాం కొంత కాలం. తరువాత వో యిండిపెండెంట్ యింట్లో వో పోర్షన్ అద్దెకు తీసుకొన్నాం. ఆ యింటికి కావల్సినవి వొకొక్కటిగా యెంచుకొని కొనుక్కునే వాళ్లం. మా వంట గదిని, లివింగ్‌రూమ్‌ని, బెడ్‌రూమ్‌ని మాకు నచ్చినట్టు కలర్‌ఫుల్‌గా అలంకరించుకొన్నాం. మా యింటికి వున్న వరండాలో వొక వూయల కట్టాం. పుదయం ఆ వూయల బల్లపై నేను కూర్చుంటే మౌన యెదురుగా వో వెదురు మోడాపై కూర్చునేది. యిద్దరం కబుర్లు చెప్పుకొంటూ వేడివేడి ఫిల్టర్ కాఫీ తాగుతూ ఆ అరోమాని ఆస్వాదిస్తూ కబుర్లు చెప్పుకొనేవాళ్ళం. మౌన తను రాసిన కొత్త కవితనో, నచ్చిన మరొకరి కవితనో, కథనో చదివేది. పాటలని వినటం యిద్దరికి చాల యిష్టం. వంట యెవరికి వీలైతే వాళ్ళం చేసేవాళ్ళం. మా మా వుద్యోగాలకి వెళ్ళేవాళ్ళం. వీకెండ్స్‌లో సినిమాలకి వెళ్ళేవాళ్ళం. షాపింగ్ చేసేవాళ్ళం. గిటార్ యిష్టమని నేర్చుకోడానికి జాయిన్ అవ్వాలను కొన్నప్పుడు గిటార్ నాకు చెప్పకుండా మౌన కొని కొచ్చి చాలా ఆశ్చర్యపర్చింది నన్ను. అలా మా యిద్దరం సంతోషంగా వుండేవాళ్ళం.

మా ఇంట్లో యీ విషయం చెప్పలేదు. మౌన తనింట్లో చెప్పింది.

వాళ్ళింట్లో వాళ్ళు "యింతకు ముందు అమ్మాయి నిన్ను తన అవసరానికి వాడుకొని వదిలేసింది. యిప్పుడు సంపాదిస్తున్నావ్ కూడా. మోసపోతావ్. యీ స్నేహాన్ని యిలానే పెట్టుకుని పెళ్ళిచేసుకో" అన్నారంది.

అప్పుడు వాళ్ళిద్దరి విషయం వివరంగా మాట్లాడింది మౌన.

"నన్ను తనేం తన అవసరాలకి వాడుకొని వదిలైలేదు. మా యిద్దరి జీవితానికి సంబంధించిన చుట్టూ వున్న సమస్యలు తనకి, నాకు కూడా ప్రాక్టికల్‌గా అర్థమవ్వసాగాయి. తను తన ఫ్యామిలీని, యీ సొసైటీని యెదుర్కోలేనంది, అంతే. యింట్లో వాళ్ళు చేసే పెళ్ళిచేసుకొని కూడా వేరేగా మరో అమ్మాయితో వుండొచ్చన్నది ఆమె ఆలోచన, అభిప్రాయం. దానికి నేను వొప్పుకొంటే మనిద్దరమే అప్పుడప్పుడు కలవచ్చుంది. వుండొచ్చుంది.

కానీ నాకే అలాంటి లైఫ్ యిష్టం లేదు. అదేం జీవితం. మనశ్శరీరాలు యేకమవ్వాలి. మాదైన వొక యిల్లుండాలి. మా పిల్లల్ని మేం పెంచుకోవాలి. దత్తతా, సరోగసీయా అవన్నీ తరువాత. నాకు కంప్లీట్ యిల్లు కావాలి. అసలే మా జీవితాలు నేచర్‌కి వ్యతిరేకం అంటున్నారు. మాకేమో యిలా తప్ప మరోలా వుండలేమనిపిస్తోంది. అసలే రహస్యం. మళ్ళీ అందులో సబ్ రహస్యం. అంత కాంప్లికేషన్ అవసరమా? అనిపించింది. అయినా సహజమో అసహజమో నాకు అలానే జీవించటం వచ్చు. నాకు నాదైన ఫ్యామిలి కావాలి. మా యింట్లో వాళ్లకి యివి అర్థం కావ్. అఫ్‌కోర్స్ యెవరికీ కావనుకొంటాను. కానీ వాళ్ళకి నేను తిరగబడతానని కాస్త భయం వుందనుకుంటాను. వూరిలో అందరికి తెలిసిపోతుందనే పరువు భయమూ వుంది. అదీకాక నేను యింట్లోవాళ్ళు అడిగిన డబ్బు సహాయం కూడా చేస్తున్నాను కదా. నిజానికి వాళ్ళకి అక్కర్లేదు. కానీ డబ్బుకి నో అనేది వుండదు కదా. యీ ఫ్యామిలి పాలిటిక్స్ అర్థమవుతాయి. కానీ కొన్నింటిని సీరియస్‌గా తీసుకోకూడదు. నా యీ జీవిత విధానాన్ని పూర్తిగా వాళ్ళు వొప్పుకోలేరు. అంత మాత్రాన నేను వాళ్ళని పూర్తిగా వదులుకోలేను. ఐ లవ్ దెమ్. మీ యింట్లో వాళ్ళకి చెప్పకపోతే నీ మీద పెళ్ళి చేసుకోమని వొత్తిడి పెరుగుతుంది కదా" అంది మౌన

"మా యింట్లోనా? అమ్మో నావల్ల కాదు".

"మరి నువ్వు యెలా డీల్ చేస్తావ్".

"యేమో... యిప్పుడు చెప్పను" అన్నాను

* * *

ఆ తరువాత కొంతకాలానికి మా ఇంట్లో వాళ్ళకి యీ విషయం చెప్పలేదు కానీ, పెళ్ళి చేసుకోలేనని చెప్పాను. కానీ వాళ్ళకి మెల్లగా విషయం అర్థమవ్వసాగింది. మెల్లగా నాకు వాళ్ళకీ మధ్య మాటలు బాగా తగ్గాయి. తన జాతకంలోనే పెళ్ళి అనేది లేదని, యిలా వాళ్ళ కష్టాలు వాళ్ళు పడ్డారు, యింటా బయటా నాకు యెందుకు పెళ్ళికాలేదో చెప్పుకోలేక.

మౌనాకి మొక్కలని పెంచడం అంటే యిష్టం...ఆ యింటిగల వాళ్ళు మనుష్యులకే నీళ్ళు సరిపోవటం లేదు, మోటర్ వేస్తుంటే కరెంటు బిల్లు యెక్కువ అవుతోందని గొడవ చేస్తుంటే మేం ఆ బిల్లుని షేర్ చేస్తాం అని చెప్పింది. డబ్బులు తీసుకొని కూడా నస పెడుతుంటే భలే విసుక్కునేది. యీ చికాకంతా పడలేం కానీ మనమే వొక యిల్లు కట్టుకుందామని వూరికి దూరంగా వొక చిన్ని స్థలం కొనుక్కున్నాం. అప్పటి వరకు దాచుకున్న డబ్బులు, మరి కొంత లోన్ తీసుకొన్నాం. చిన్న యిల్లు కట్టుకొన్నాం. ఆ అప్పులు కలిసే తీర్చాం. మేం దాదాపు పదిహేనేళ్ళుగా వుంటున్నాం.

పోయిన నెల ఇద్దరం హాలీడేకి వెళ్ళాం.

అక్కడ సడన్‌గా వచ్చిన వరదలో చాలామంది కొట్టుకు పోయారు. చెల్లాచెదురయ్యారు. చెల్లాచెదురైన వాళ్ళలో మౌన కూడా ఉంది. గాలింపు చర్యలు చేస్తుంటే అక్కడే వున్నాను. మౌన కోసం రోజు అక్కడ యేర్పాటు చేసిన క్యాంప్, ఆఫీసుల చుట్టూ తిరుగుతోంటుంటే "మీకేమవుతుంది" అనే ప్రశ్న యెదురయ్యేది. యెలా చెప్పాలి పార్ట్‌నర్స్ అని. ఫ్రెండ్స్ అని చెప్పేదాన్ని. ఫ్యామిలి మెంబర్స్ యెవ్వరూ యిక్కడికి రాలేదా అని అడిగేవారు. ఫ్యామిలి మెంబర్స్ అని అడిగిన ప్రతిసారి నేను తను యెవ్వరం? అప్పటికీ మౌన యింట్లోవాళ్ళకి వెంటనే యిన్‌ఫామ్ చేసాను. కానీ వాళ్ళు రావ డానికి అక్కడ దారులన్నీ కొట్టుకు పోయి వున్నాయి, విషయాలు చెపుతుండమన్నారు. అక్కడ అథారిటీస్ యేమైనా తెలిస్తే చెపుతాం అని నన్ను వెళ్ళిపొమ్మ న్నారు. వచ్చేసాను దుఃఖంతో.

నేను ఇక్కడికి వచ్చేసరికి మౌన యింట్లో వాళ్ళు వూరి నుంచి వచ్చి మా యింట్లో వున్నారు. మా బెడ్‌రూంలోని బీరువా తాళాలను తీయిం చారు. వొక్కమాటలో చెప్పాలంటే వాళ్ళు యింటిని ఆక్యుపై చేసుకొన్నారు. యిక్కడ విషయాలు, మౌన విషయం చూసుకొంటాం అని నన్ను యింట్లోంచి వెళ్ళిపొమ్మన్నారు. నిర్ఘాంతపోయాను.

"యిది నా యిల్లు" అన్నాను.

"యిది మౌన యిల్లు. అందులో నిన్ను వుండనిచ్చింది. అంతే. వెళ్ళిపో" అన్నారు.

యేం చెయ్యాలి నేను ?

సమాజం వొప్పుకోదు. మాకంటూ చట్టాలు లేవు. కానీ మేం నిజం. మా జీవితాలు నిజం. మా అనుబంధాలు నిజం. కుటుంబం, సమాజం, స్నేహితులు, చట్టం అండగా వున్న వాళ్ళ జీవితాల్లోనే బోలెడంత హింస వుంది. అన్యాయం వుంది. భద్రత లేదు. ఆ సంబంధాల్లోనే అలా వుంటే యే వొక్క దన్నూ లేని, ఆధారం లేని మాపై జరిగే అన్యాయం ని యేం యెక్కడ యెలా అడుగుతాం. యిప్పుడు మా విషయమే తీసుకోండి. ఆ యిల్లు మౌన పేరుమీద వుంది కానీ అది మా యిద్దరం కలిసి నిర్మించుకొన్నాం. యిద్దరం కలిసి కూర్చుని కాఫీ తాగే వూయల బల్ల, కవిత్వం చదువుకొన్న అనేక స్థలాలు, పెంచుకొన్న మొక్కలు యిలా జ్ఞాప కాలున్నాయి. యిల్లంటే నాలుగు గోడలు వో కప్పు మాత్రమే కాదు కదా. అనుబంధాల గొడుగు కదా.

మౌన వాళ్ళ యింట్లో వాళ్లు కట్టుబట్టలతో నన్ను బయటకు పంపించారు. మౌన కానుకగా యిచ్చిన నాకెంతో అపురూపమైన గిటార్‌ని యిమ్మ న్నాను. యివ్వలేదు. నా కళ్ళముందే వాళ్ళ అమ్మ గారు దాన్ని విరిచేస్తు "నా కూతురి జీవితాన్ని నాశనం చేసినదానివి. నువ్వే తనని పట్టుకొని వుండి వుండకపోతే తను అందరిలా నిక్షేపంగా పెళ్ళి చేసుకొని వుండేది. చివరికి నా కూతురే తప్పిపోయింది. నువ్వెంత డబ్బుకి మరిగినదానివో నేను కనిపెట్టలేనా? మౌన మనసు కష్టపెట్టలేక మేం వచ్చేవాళ్ళం కానీ యిదంతా నచ్చి కాదు?. అంటూ ఆమె కడుపు తరుక్కు పోయినట్టుగా పెద్దగా యేడ్చింది. నా మనసంతా వికలం అయి పోయింది, ఆమె వేదన చూసి.

మమ్మల్ని అందరికి భిన్నంగా తయ్యారు చేసింది యెవరు? యెందుకు యింత మందికి వ్యతిరేకంగా మా మానసిక శారీరక స్థితి వుంది. యిలా మమ్మల్ని సృష్టించినప్పుడు మమ్మల్ని మామూలుగానే చూసేట్టు మొత్తం సమాజం యెందుకు లేదు? అన్నీ ప్రశ్నలే. మ్యారేజ్ చేసుకొన్న వాళ్ళు యిలాంటి పరిస్థితుల్లో బయటకి గెంటి వేయబడితే ఆ అమ్మాయిలు తమ హక్కుల కోసం, న్యాయం కోసం కోర్టులకి వెళతారు. టీవీల్లో, పేపర్ల లో మాట్లాడతారు. మేం అవి యేం చెయ్యలేం. మా ప్రేమ నిషిద్ధం. మా అనుబంధం నిషిద్ధం. చివరికి మా ప్రాణాలనే నిషేధించేస్తారేమో అన్నంత భయంతో బతుకుతుంటాం. అసలు మాకు చట్టం లో మాకో చోటుంటే కదా యిది మా హక్కు అని అడగ్గలం. మేం మాలాంటి వాళ్ళు అడుగుతోన్న చట్టబద్ధత వస్తుందో రాదో. అప్పటి వరకూ మా జీవితాలకు స్వేచ్ఛ లేదు. యేంటో చట్టబద్ధత లేదని యిలా బతకాలని వున్న వాళ్ళు యిలా వుండటం మానేస్తారా? చట్టబద్ధత వుందని యిలాంటి వాటి మీద ఆసక్తి లేనివాళ్ళు వస్తారా? మౌన కోసం దుఃఖించే వీలుకూడా లేదు. యేడవటానికి చోటు లేదు. యిదేం ప్రపంచం. యెవరినైనా గట్టిగా హత్తు కొని యేడవాలనుంది.

నిజమే, టెక్నికల్‌గా ఆ యిల్లు మౌన పేరుమీదే వుంది. మా బంధానికి అనుబంధానికి యెటువంటి చట్టబద్ధత లేదు. సొసైటీ ఆమోదం లేదు. యెవ్వరు మావైపు మాటాడతారు. మౌనా మిస్సింగ్ వొక వైపు నా మనసుని అతలాకుతలం చేస్తుంటే నిలబడే చోటు కోసం నేనెలా వెతుక్కొ గలను. వొంటరిగా నిలబడ్డాను. మీకో విషయం చెప్పనా... మా యిద్దరికి వున్న స్నేహితులు పలకరి స్తున్నారు. కానీ వాళ్ళ యింట్లో కనీసం వొక్కరోజు కూడా వుండమని అడగలేదు. యీ విషయాల్లో కల్పించుకోవటం వాళ్ళకీ యిబ్బందే కదా. కారు కూడా తీసేసుకొన్నారు. అదున్నా అందులో వుండేదాన్నేమో. ఆఫీస్ అయ్యాక మీ దగ్గరకి రావటం యెందుకంటే అక్కడ మా యిద్దరకి సంబంధించిన జ్ఞాపకాలున్నాయి" అంది విమల.

ఆశ్చర్యంతో వింటున్న కమిలిని కాసేపు నిశ్శబ్దంగా వుండిపోయింది. ఆమె మనసంతా వొకలాంటి నిస్తేజం ఆవహించింది. తనకి యిలాం టివి అసహజం అనే అభిప్రాయం వుంది. సీరియస్ గా ఆలోచించాల్సిన అవసరం కూడా యెప్పుడూ కనిపించలేదు. ఆమె చెప్పేవరకు అసలు వాళ్ళిద్దరూ అలాంటి వాళ్ళు అని తనకి అనిపించలేదు.

"మీకు ఆలశ్యం అవుతుంది. నేనిక్కడే యెక్కడో వుంటాను" అంది విమల.

"మా యింటికి వెళదాం" అంటూ కమిలిని కారు స్టార్ట్ చేసింది.

"మీ ఇంట్లో ఇంకెవరుండరా" అడిగింది విమల

"మా హజ్‌బెండ్ నేను ఉంటాం. పిల్లలు హాస్టల్లో వుంటారు. మా యిన్‌లాస్ వచ్చి వెళు తుంటారు. యెవరికి డిస్ట్రబెన్స్ లేకుండా బయట నుంచి లాక్ చేస్తాను".

యింట్లోకి వెళ్ళాకా విమల పడుకోవడానికి రూమ్ చూపించి "నైట్ డ్రెస్ కావాలా" అని అడి గింది కమిలిని.

"నో థాంక్స్" అని "రియల్లీ థాంక్స్. సారి ఫర్ ది ట్రబుల్" అంది విమల

'గుడ్‌నైట్" అంది కమిలిని.

తన గదిలోకి వెళ్ళింది కమిలిని. నిద్రపో తున్న తన భర్త పక్కన చప్పుడు కాకుండా పడుకొని అతను కప్పుకొన్న బ్లాంకెట్‌లోకి మెల్లగా దూరుతూ అతని మీద చెయ్యి వేసింది నిదానంగా. అలా వేసి పడుకొంటే యెంతో సెక్యూర్డ్‌గా ఆత్మీ యంగా అనిపిస్తుంది. అతను ఆ నిద్రలోనే ఆమె చేతిని తన చేతుల్లోకి యిముద్చుకొన్నాడు. వొక కంఫర్ట్.

యిదే, యిలాంటి వొక కంఫర్ట్ మౌన, విమల కోరుకొంది...పొందింది.

* * *

"కంఫర్ట్‌గా వుండగలిగేదాన్నా ఆ ఫుట్‌పాత్ మీద. కొత్త యిల్లు తీసుకోవాలంటే అద్దె అడ్వాన్స్‌కి డబ్బులు లేవు. అయినా వొంటరి ఆడపిల్లకి యిళ్ళె వరిస్తారు. సాఫ్ట్‌వేర్ ఉద్యోగాలైతే కాస్త యిచ్చే ఛాన్స్

వుంది. హాస్టల్లో రూం తీసుకోవాలి. ఆఫీసు వాళ్ళు అడ్వాన్స్ రేపైనా యిస్తారా? అసలు యిదంతా యేంటో? యీ రోజుకి యిలా గడిచింది" ఆలోచనలు యెక్కువసేపు వెంబడించక ముందే నిద్రొచ్చేసింది విమలకి.

* * *

మళ్ళీ మెలకువ వచ్చేసరికి గదిలోని కిటికీల నుంచి అతి పల్చని వెలుగు లోపలకి లీలగా దోబూచులాడుతోంది.

కొన్ని క్షణాల తర్వాత ఆమెకి తను యీ కొత్త గదిలో యెందుకు వుందో గుర్తొచ్చింది. గదిలోకి వచ్చిన కమిలిని గుడ్‌మార్నింగ్ చెప్పి, కాఫీయా, ఛాయ్‌యా అని అడిగింది.

కాఫీ అని చెబుతుండగానే, తను మౌన కాఫీతో పరిమళింప చేసిన అనేక సమయాల పరిమళం మనసుని చుట్టుకోగానే విమల కళ్ళ నిండుగా కన్నీరు. యెంతలో జీవితం వుప్పగా మారిపోయిందో...

ఆఫీస్‌కి బయలుదేరుతూ "థాంక్ యూ. మౌన మిస్సింగ్ తరువాత కాసేపైనా కంఫర్టబుల్‌గా నిద్రపోయాను. వర్కింగ్ వుమెన్స్ హాస్టల్లో యివాళో రేపో చేరిపోతాను. తరువాత మెల్లగా ఆలోచించుకొంటాను యీ జీవితాన్ని తిరిగి యెలా చక్కదిద్దుకోవాలో... ఆ భగవంతుని దయవల్ల యే అడవిలోనో చిక్కుకున్న మౌన తిరిగి వచ్చేయ్‌వచ్చు యెప్పటికైనా" అని ఆగి "నాకీ కష్టం వచ్చాకా మొదటిసారి వొక వ్యక్తి దగ్గర నాలోని మొత్తాన్ని చెప్పుకొన్నాను. మౌన స్నేహంలో నేను నా యింట్రావర్ట్ స్టేటస్ నుంచి యేమంత పెద్దగా మారలేదు. బట్ యీ దుఃఖం మీ దగ్గర మాటలుగా బరస్ట్ అయినట్టుంది. అందికే మిమ్మల్ని కలిపాడా భగవంతుడు. థ్యాంక్యూ" అంది విమల.

"మా అవుట్‌లెట్‌కి వస్తుండండి. మీ యిద్దరి ప్లేస్ అలానే వుంటుంది. మౌన తిరిగి సాధ్యమైనంత త్వరగా రావాలని దేవుణ్ణి ప్రార్థిస్తాను. ఇది నా మొబైల్ నెంబర్" అంది కమిలిని.

* * *

విమల ఆ యింట్లోంచి బయటకు వచ్చి లిఫ్ట్ వైపు వెళుతుంటే ఆమె ఫోన్ రింగయ్యింది. ఆ నెంబర్ చూసి యెవరా అనుకొంటూ "హలో" అంది.

"యెక్కడున్నావ్...నేను నిన్ను కలవడానికి వచ్చాను."

"అమ్మా" ఆశ్చర్యపోతూ అంది విమల.

"అవును. నేను అన్నయ్య వచ్చాం. హోటల్లో వున్నాం" అంది అమ్మ

"యిన్నాళ్ళలో ఒక్కసారి కూడా రాని తన తల్లి, అన్న యీ రోజు యీ విషయం తెలిసాకా వచ్చారు. అప్పుడప్పుడూ తమని చూడడానికి వచ్చే మౌన యింట్లో వాళ్ళు యిప్పుడింత బిట్టర్‌గా తన పట్ల ప్రవర్తిస్తున్నారు. యేంటో యిదంతా" అనుకొని వాళ్ళు యెక్కడున్నారో కనుక్కుని అక్కడికి వెళ్లింది విమల.

పలకరించుకున్నాక "యిన్నాళ్ళు రాని నువ్వు యిప్పుడెలా వచ్చావ్" కుతూహలంగా అడిగింది విమల తల్లిని.

"నీ గురించి మేం యింట్లో అప్పట్లో చాలానే మాటాడుకొన్నాం. మా అందరికి పెద్ద షాక్ నీ ప్రవర్తన. మాకు చాలా బాధని, ఆందోళనని కలిగించింది. నీకు దూరంగా వుంటే నువ్వు మారతావ్ అనుకున్నాం. కానీ నువ్వు మారలేదు. యిప్పుడు నీ యీ కష్టంలో వొకసారి కలుద్దామనిపించి వచ్చాం. యింటికి వెళదామా" అంది అమ్మ.

వాళ్లకి యిక్కడ విషయాలన్నీ చెప్పాలనిపించక "మౌనా వాళ్ళ పేరెంట్స్, వాళ్ళ అక్క అన్నా కూడా వున్నారు. యిప్పుడు అక్కడికి వెళ్ళడం అవ్వదు. నేను ఆఫీసుకి వెళ్ళాలి. మీరు రెస్టు తీసుకొండి" అంది విమల.

యీ రోజు అప్లై చేసిన అడ్వాన్స్ సేంక్షన్ కావచ్చు. ముందు వుండటానికి వొక చోటు వెతుక్కొవాలి అనుకుంటూ ఆఫీసుకి బయలుదేరుతుంటే "వాళ్ళు నిన్ను బయటకు గెంటేసారా" నిదానంగా అడిగారు విమల వాళ్ళ అమ్మగారు.

నిశ్శబ్దంగా వున్న కూతురు వైపు చూస్తూ "యిలాంటిది యేదో జరుగుతుందనే అనుకున్నాం. నా మనసులోకి వచ్చింది నిజమే అవుతుంది. నిన్ను అమాయకురాలిని చేసి వాళ్ళు ఆడుకొంటున్నారు. అన్ని లక్షలూ దానికే పోసావ్...అసలు" తల్లి మాటలని మధ్యలోనే కట్‌చేస్తూ "అమ్మా యిన్నాళ్ళూ నా విషయాలు యెలా పట్టించుకోలేదో యిప్పుడూ అలానే వుండండి. చూడ్డానికి వచ్చావు. థాంక్ యు. మౌన గురించి వ్యతిరేకంగా మాటాడొద్దు. తను నా మనిషి. తన కోసం నేను వెతుకుతునే వుంటాను" అంది విమల

"నువ్వెప్పటికీ మాకు సంతోషాన్ని ఇవ్వలేవ్. యెప్పుడూ తలనొప్పే నీతో. నీ మాట యీసారి మేం వినం. ఆ ఇంట్లో నీ కష్టార్జితం వుంది" అంటూ ఆమె కన్నీళ్ళు పెట్టుకుంది.

"ఆ ఆస్తిలో నీకు వాటా వుంది. యెలా వదులుకొంటాం. యిప్పుడు ఆ యేరియాలో ల్యాండ్ ధర చాలా పెరిగిందటగా. కనుక్కున్నాను. మన యింట్లోనూ పిల్లలున్నారు. ప్రతి పైసా ముఖ్యమే. నువ్వు మాటాడకు. వాళ్ళని యెలా ఆడిస్తానో చూడు" అన్నాడు విమల అన్నయ్య.

నిస్సహాయంగా వాళ్ళని చూస్తూ విమల ఆఫీసుకు బయలుదేరుతూ "అమ్మని, అన్నయ్యని బతిమాలైనా సరే యింటికి పంపించెయ్యాలి సాయంత్రమో రేపో. వాళ్ళకి కావాల్సింది ఆ యిల్లే ...ఛ...యేమి మానవ సంబంధాలు..." అని అనుకుంటుండగా ఆమెకి కమిలిని గుర్తు వచ్చింది.

"ఆమెకి తనేం అవుతుంది. సింపుల్ కస్టమర్...కానీ ఆమె తనతో ఎంతో వ్రాత్‌గా వుందో... మానవ సంబంధాలపై ఆశని కలిగించేట్టుగా... మౌనా...దారి వెతుక్కుని రా మౌనా...అలాకాదు నేనే వెళతాను. వెతుకుతాను. నీ కోసం యీ రోజే తిరిగి అక్కడకి బయలుదేరుతాను"

విమల నడక వేగవంతమైంది.

* * *

తనకి అసలు యిలాంటి విషయాలపై అవగాహన లేదు. ఆ మౌన, విమల చూడటానికి నాలానే వున్నారుగా...అలాంటి వాళ్ళ జీవిత విధానం అసహజం అనుకోవటానికి తనెవరు... అనుకుంటుండగా యేదో చూచాయిగా గుర్తొచ్చి తన చేతిలోని ఫోన్‌లో మెసెంజర్ వోపెన్ చేసింది కమిలిని. రకరకాల విషయాలపై సంతకాల కోసం ఆన్‌లైన్‌లో వచ్చే వాటిని వెతకటం మొదలు పెట్టింది కమిలిని.

తనకి చాలా రోజుల క్రితం మౌనా, విమల లాంటి జీవన విధానంలో వున్న వాళ్ళు తమ హక్కుల కోసం సంతకాల సేకరణ చేస్తున్న వో ఆర్గనైజేషన్ మెసెంజర్‌లో పంపిన డాక్యుమెంట్‌ని వెతికి తీసింది కమిలిని. సంతకం పెట్టింది. ఆ డాక్యుమెంట్‌ని తన టైమ్ లైన్ మీదకు షేర్ చేసింది.

విమల తను మౌనాని వెతకటానికి బయలు దేరుతున్నానని యస్‌యంయస్ పంపించింది కమిలినికి.

రిప్లయి ఇచ్చింది కమిలిని "ఆల్ ద బెస్ట్".




# పుస్తక సమీక్ష




**వ్యక్తుల పేరు వేరు, తీరు వేరుగా ఉంటుంటుంది తరచుగా. ఈ గ్రంథ రచయిత ఆ లక్షణానికొక సుందర అపవాదం! ఆయన పేరే తన వ్యక్తిత్వానికి సరైన నిర్వచనం. దక్షిణామూర్తి అంటే దయాస్వరూపం. హృదయంలో దయ ఉండాలి. అసలు దయచేత ఆపృష్టమై (ఆవరించబడి) ఉంటుంది కనుకనే దానిని హృ'దయ'ము అన్నారు. ఈ మహోన్నత మానవీయ గుణాన్నే ఉపనిషత్తులు 'దయ' అని ప్రతిపాదిస్తే, దానినే 'కరుణ'గా ప్రసారించాడు బుద్ధ భగవానుడు. కాని ఆ రెండిటి మధ్య ఒక మౌలిక పార్థక్యం లేకపోలేదు. దయకంటే కరుణ గరీయసి. 'కరుణ లేని నరుడు గడ్డిబొమ్మ' అంటాడు కరుణశ్రీ. 'ఏవాని యెడద కరుణకు / నావాసం బతనియంద హరి వసియించున్' అన్నాడు తుమ్మల.**

## దక్షిణామూర్తి సాహిత్య సౌహిత్యాలు

ప్రస్తుత రచయిత తెనాలిలో అవిరళ సేవ లందించే హృదయ వైద్య నిపుణులే కాక యాదృచ్ఛికంగా హృదయవాది కూడ. రోగి 'పర్స్' చూసి కాక 'పల్స్' చూసి చికిత్స అందిస్తారు. వైద్యసేవ, సాంస్కృతిక వరివస్య ఆయనకు నేత్ర ద్వయం. ఆయన సాహిత్య సౌహిత్యాలు బహుశ్రుతాలు.

గత ఏభై సంవత్సరాలుగా ఆయన వివిధ పత్రికలలో ప్రకటిస్తూ వచ్చిన అరవై తొమ్మిది లఘు వ్యాసాల సంగ్రథనమే ఈ బృహత్సంపుటి. వాటిని వైద్య విజ్ఞానం, సాహిత్యం, పుస్తక సమీక్ష, చలన చిత్ర విశ్లేషణ, మహనీయుల జీవన చిత్రణ, పర్యటన రంగం అనే ఉప శీర్షికల క్రింద వింగడించి ముద్రించారు. కొన్ని వ్యాసాలు భౌతిక ప్రయోజనం అందిస్తే, మరికొన్ని కలిగిస్తాయి రసానందం. మనిషికి రెండూ సమానంగా అవశ్యకాలే, ఎందుకంటే అతనికి శరీరంతోబాటు మనస్సు కూడా ఉంటుంది కనుక.

వైద్య సంబంధిత వ్యాసాలు అసాంకేతిక భాషలో, అసందిగ్ధ వివరణతో రచించబడినాయి, 'గుండెపోటు లక్షణాలు- జాగ్రత్తలు', 'అలజడి రేపే అంజైనా వ్యాధి' అనే వ్యాసాలు పత్రికల్లో వెలువడినప్పుడు అవి చదివిన వందల కొలది పాఠకులు తమ గుండెనొప్పి, అంజైనా లక్షణాలను గుర్తించి కార్డియాలజిస్ట్‌లను సంప్రదించి చికిత్స పొందేరట. సదవగాహన అనేది సమాచరణగా ప్రతిక్రమిస్తే అంతకంటే వాంఛనీయమైంది ఇంకా వేరే ఏముంటుంది కనుక!

శ్రీశ్రీ మొదలు కొసరాజు వరకు జీవన చిత్రణలు, తాము సకుటుంబంగా దర్శించిన లండన్ నగరం, హిమాలయాల్లోని కులూ మనాలీ, కేదారనాథ్, బదరీనాథ్, ఇంకా దక్షిణ భారత పుణ్యక్షేత్ర విశేషాలు రచయిత నిశిత పరిశీలనకూ, ప్రకృతి ప్రణయానికీ, నిత్యాధ్యయన శీలానికీ, కథన పాటవానికీ నిలువుటద్దాలు. ప్రముఖుల లేఖలు, ఛాయా చిత్రాలు, సన్నివేశ చిత్రాలు, ముఖపత్రంపై రచయిత రూపరేఖాచిత్రం, విముఖపత్రంపై తెలుగుతల్లి నిలువెత్తు వర్ణచిత్రం గ్రంథానికి అందమైన, హృదయ స్పందమైన అమరికలు.

గ్రంథంలో జోడించిన ఒకే ఒక ఉగాది స్వీయ కవిత డాక్టర్‌గారి భావుకతకు, అభ్యుదయాకాంక్షకు, సమసమాజ దర్శన లాలసకు ప్రతీకగా నిలుస్తుంది.

ముహుర్ముహుర్పఠనీయమైన ఈ గ్రంథం ప్రతి నాగరికునికీ ఒక హస్తభూషణం! రచనా శైలి లాగే ధర కూడా 'సరస'మే సుమా! రచయిత కృషికీ, ప్రకాశకుల దోహదానికీ త్రయీప్రశంసలు! అలమతివిస్తరేణ.

**దక్షిణామూర్తి వ్యాసాలు**
**డాక్టర్ పాటిబండ్ల దక్షిణామూర్తి**
**పుటలు : 248**
**మూల్యం : రూ.150/-**
**ప్రతులకు :**
**తెనాలి ప్రచురణలు**
**22 - 6 - 78 లక్ష్మీ సదన్,**
**కొత్తపేట, తెనాలి - 522 221**

**ఎన్.ఆర్.తపస్వి**

# అష్ట విధ నాయికలు

ఆమె సమయస్ఫూర్తికి చక్కని ప్రతీక
శ్రీవారి జ్ఞాపకాలను దాచుకునే నెమలీక
ఎంత రాత్రైనా కానీ ఇంటికి రావలసిందే
మాటలా! మజాకా! ఆమె **స్వాధీన పతిక**

ఇంటి శుభ్రతకు తాను శుభసూచిక
కంటికింపైన మరుని పాచిక
కొంపచేరిన పతికి సొంపుల కెంపు
వారెవ్వా! ఆమే కదా **వాసిక సజ్జిక**

అలప్యాన్ని ఆవలింతలతో గణించే నెలత
ప్రియుడి కోసం తలుపు దగ్గరే తపించే ముదిత
ఓహ్! ఏమి ఆమె ఎదురు చూపులు
ఆమే సుమా మన **విరహోత్కంఠిత**

ఆత్మీయుడి కోసం అల్లాడే ముగ్ధ
అణువణువున ప్రణయ రసప్లావిత దగ్ధ
పరిసరాలంతటా పరచుకొన్న విరహమే
పరికించి చూస్తే ఆ పడతి **విప్రలబ్ధ**

మగడు కనపడకపోతే కోపాలన మండిత
పరకాంత వాసన పసికట్టడంలో పండిత
జాగు జరిగిందా బాగుండదు వ్యవహారం
ఖచ్చితంగా చెప్పాలంటే ఆమే **ఖండిత**

మొగుడి ముఖం చూడగానే దూషించే జ్వలిత
వాడు ఇల్లు విడవగానే గొల్లుమనే వనిత
అంత:పురంలో వున్నా పూరి గుడిసెలో ఉన్నా
గుర్తించి చూడండి ఆమే **కలహాంతరిత**

దేశాంతర మెళ్ళిన మొగుడి కలల జ్ఞాపిక
కళ్ళనిండ కాంతులతో కరుగుతున్న దీపిక
చిక్కి శల్యమయ్యింది పెనిమిటిపై ప్రేమతో
భూషితురాలు కాదు ఆమె **ప్రోషిత భర్తృక**

ప్రియణ్ణి కలవాలనే బలమైన కోరిక
దొరికిందంటే చాలు ఒక్కక్షణం తీరిక
వాలిపోతుంది వాడి ఎదమీద వేడిగా
అడగకుండా వచ్చిందా ఆమే మరి **అభిసారిక**



**లఘు టిప్పణి**

**అలంకార శాస్త్రాలలో, ప్రబంధాలలో ప్రస్తావించిన అష్టవిధ శృంగార నాయికలు,**
**అనాదేకాదు, ఈనాటికీ మన సమాజంలో సామాన్య గృహాల్లో కనిపిస్తారు.**
**కాకపోతే మనం గుర్తించం.**
**ఈ తరం కుర్రపాఠకుల కోసం సరదాపడి రాసింది**

ఎండ్లూరి సుధాకర్
**92466 50771**

# వలస




**మలయాళ మూలం**
**జెక్కరియా**

**తెలుగు సేత**
**ఎల్.ఆర్.స్వామి**

**"డాక్టర్ పి.ఎం. మాథ్యూ, వెల్లూర్,**
**మనస్తత్వ విశ్లేషకుడు**
**తిరువనంతపురం.**

**గౌరవనీయులైన డాక్టర్ గారూ,**

ముందుగా నన్ను పరిచయం చేసుకో నివ్వండి. నా పేరు ఆశా మాథ్యూ...వయసు 26... ఇంటి పేరు కరిపురత్...నాన్న పేరు జోసెఫ్ మాథ్యూ...చిరునామా...కత్తిరంప్ పోస్ట్, కుట్టియాడి.

ఆంగ్ల సాహిత్యంలో బిరుదానంతర బిరుదమూ, బి.ఎడ్. బిరుదమూ పొందిన యువతిని నేను. నాకు తల్లిదండ్రులతో పాటు ఒక అన్నయ్య, ఇద్దరు చెల్లెళ్ళు కూడా వున్నారు. అన్నయ్య పెళ్ళి చేసుకున్నాడు. మానంతవాడి అనే ఊరులో జాగా కొనుక్కొని ఇల్లు కట్టుకొని అక్కడే వున్నాడు. వదిన అక్కడే స్కూల్ టీచర్‌గా పని చేస్తోంది. ఒక చెల్లి ఎం.బి.బి.ఎస్. మొదటి సంవత్సరం చదువుతోంది. రెండో చెల్లి ప్రీ డిగ్రీ మొదటి సంవత్సరం...

రెండో ప్రపంచ యుద్ధ కాలంలో ఆకలితో అలమటించి మారాంగాటుపల్లె అనే ఊరునుంచి కుట్టియాడికి వలసవచ్చిన రైతుల్లో ఒకడు మా తాత. అడవి నరికి సేద్యం చేయటం మొదలు పెట్టాడు. అడవి నరికి సేద్యం చేయకుండా వుండ వలసిందని ఎన్నో సార్లు తాతతో వాదించి వున్నాను నేను. కాని తాత ఇలా చెబుతాడు..."ఆశా, నీకు ఆకలి బాధ యేమిటో తెలియదు. కొన్ని రోజులు పెళ్ళాం పిల్లలుతో పస్తువుంటే అప్పుడు అడవి ఏమిటీ, ప్రపంచం మొత్తాన్ని నరికేసి సేద్యం చేయాలని అనిపిస్తుంది".

ఎనభై తొమ్మిదేళ్ళ తాత హేతువాది. డాక్టర్ ఏ.టి. కోవూర్‌తో (ప్రసిద్ధ హేతువాది) ఉత్తర ప్రత్యుత్తరాలు ఉండేవి తాతకి. ప్రతి సాయంత్రం మేం ప్రార్థన చేసే సమయంలో గదిలో కూర్చుని పుస్తకం చదువుతాడు తాత. ఇప్పుడు ఎనభై రెండు సంవత్సరాల వయసు గల నానమ్మే మమ్మల్ని దేవుని బాటకు తిప్పింది. ప్రతి రోజు నాలుగు కిలో మీటర్లు నడిచి చర్చికి వెడుతుంది నానమ్మ. నాన్న కారు కొన్నాక కారులో తీసుకొని వెళ్తానని చెప్పినప్పుడు నానమ్మ అంది..."నడవగలిగినంత కాలం నా రెండు కాళ్ళతో నడిచి దేవుడి వద్దకి వెళ్తాను"...

ఆ మాట వినగానే నాకు రాజ్‌కపూర్ సినిమాలోని పాట గుర్తుకొచ్చింది. "సజ్జన్‌రే జూట్ మత్ బోలో (సజ్జనులారా అబద్ధమాడకండి) దేవుని దగ్గరకి వెళ్ళవలసింది ఏనుగు మీద కాదు, గుర్రం మీద కాదు, కాలి నడకతోనే వెళ్ళాలి అక్కడకి"

అది గుర్తొచ్చిన నేను నవ్వాను. నానమ్మకి కోపం వచ్చింది. "నువ్వెందుకు నవ్వుతావే ఆశా?" అని అడిగింది కూడా. మా నాన్న కాంగ్రెసు - చర్చ్ నియమాలకి అనుగుణంగానే బ్రతుకు తున్నవాడు...సమాజంలోని అన్ని కట్టుబాటులకూ కట్టుబడి వుంటాడు...చాలా చిన్నప్పుడు మాత్రమే పస్తు పడుకున్నాడట. నాన్నకి రాయినైనా జీర్ణించుకోగల వయసు వచ్చేలోగా వరి, పెండలం వగైరాలు పండించటం మొదలు పెట్టేసాడట తాత. ఆదర్శ రైతు అవార్డు ఎన్నోసార్లు అందుకున్నాడు నాన్న. మేం అంటే నాన్నకి చాలా చాలా ఇష్టం. మా అమ్మను బంగారంలా చూసుకుంటాడు నాన్న. మా అన్నయ్య పుట్టినప్పుడు ఆసుపత్రి కాని, డాక్టర్లు కాని లేనందువల్లనూ, నాన్నమ్మ చర్చికి వెళ్లినందు వల్లనూ మంత్రసాని పని చేసింది తనేనని ఇప్పటికీ చెబుతాడు నాన్న. హాస్టల్‌లో వున్న చెల్లెళ్ళకి వారాని కొక్కసారి ఫోను చేస్తాడు. నెలకొక్కసారి చేతులు నిండా సామానులుతో వెళ్ళి చూసి వస్తాడు. నేను హాస్టల్‌లో వున్నప్పుడు కూడా అంతే - చదవాలని నాకు అనిపించిన పుస్తకాలు కేరళలో దొరకకపోతే ఢిల్లీనుంచి తెప్పించి ఇచ్చేవాడు.

అలాంటివన్నీ చదివినా నేను ఒక మామూలు యువతిని మాత్రమే డాక్టర్‌గారు. నేను ఒక మేధావి కాని విప్లవ భావాలు గల యువతిని కాని కాదు. చూడచక్కని ఒక మంచి పిల్ల అనేదే నా గురించి మా ఇంటివాళ్ళు, ఊరువాళ్ళు, గురువుల, మిత్రుల అభిప్రాయం. ఇప్పటివరకు ఎవరికీ నా గురించిన ఫిర్యాదులూ లేవు అని కచ్చితంగా చెప్పగలను. క్రమశిక్షణతో, తల్లిదండ్రుల మాట విని, గురువులకు నమస్కరించి, ఇంటివాళ్ళనూ మిత్రులనూ ప్రేమిస్తూ చర్చ్ నియమాలకు అనుగుణంగా బ్రతికాను ఇప్పటివరకు. నాకు ఎంతో ఇష్టమైన మోహన్‌లాల్ (సినిమా నటుడు) ను కూడా ఇంత వరకు ప్రేమించలేదు నేను. మా అమ్మలా ఒక ఆదర్శ భార్యగా, మా నాన్నలాంటి ఒక మంచి భర్తతో ప్రశాంతంగా బ్రతకాలనేది నా కోరిక. నేను ఇంత చదువుకున్నది కూడా ఉద్యోగం చేయాలని కాదు. పెళ్ళి అయినంతవరకు విషయాలు తెలుసుకోవటం కోసమే చదివాను. నేను ఈ మాట చెప్పకపోయినా నాన్నకి ఈ విషయం తెలుసని అనుకుంటున్నాను. డాక్టర్ గారూ...నిష్కల్మష హృదయం గల దయాశీలి, స్నేహశీలి మా అమ్మ. మా అమ్మ పెళ్ళినాటికే డబ్బున్న కుటుంబం మాది. చాలా కష్టాల్లో ఈదే ఒక కుటుంబం నుంచి వచ్చింది అమ్మ. ముగ్గురు మగ పిల్లలకూ వరకట్నం పుచ్చుకోలేదు తాత. సేవాదళ్ పని మీద తిరుగుతున్నప్పుడు అమ్మని చూసాడు నాన్న. ఆమె సౌందర్యానికి దాసోహమైపోయాడు. తరువాత పెళ్ళి మాటల కోసం అమ్మ ఇంటికి వెళ్ళాడు. ఆ సంబంధాన్ని తను వ్యతిరేకించానని నానమ్మ చెబుతోంది. ఒక సారి నాన్నమ్మ నాతో అంది..."ఆడవాళ్ళు ఎక్కువ అందంగా వుండటం కూడా మంచిది కాదే ఆశా. కాని మీ అమ్మ సంగతి వేరు, అందంగా వున్నా, మీ అమ్మ మంచిదే"

మా అమ్మ చాలా మంచిదే... అమాయకురాలు... స్నేహశీలి.




వివాహానంతరం అమ్మని హేతువాదిగా మార్చడానికి ఎంతో ప్రయత్నించాడు తాత... అతడు చెప్పినదంతా విని అమ్మ అడిగిందట "దేవుడు లేడని నేను నమ్మకపోతే మీకు నా మీద కోపం వస్తుందా?" అని.

రాదని చెప్పాడట తాత.

''అయితే నేను దేవుడున్నాడనే నమ్ముతాను" అని చెప్పి అమ్మ అక్కడ నుంచి లేచి వెళ్ళిపోయిందట. అప్పుడు నానమ్మ చెప్పిందట..."ఈ ఇంట్లో ఆడవాళ్ళు వున్నంత కాలం దేవుడికి ఏ లోటూ వుండదు" అని. నాకు ఇదంతా చెప్పినది మా అమ్మే. అమ్మలాగే బ్రతికి చావాలనే కోరికే నాకూ వుంది. అంతకు మించిన ఆశలు లేవు నాకు.

డాక్టర్ గారూ...ఇలాంటి ఒక స్నేహపూరిత వాతావరణంలో ప్రశాంతంగా గడిపిన నేను ఈ రోజు చాలా ఇరకాటంలో పడిపోయాను.

రెండునెలల క్రితం ఒకసారి అమ్మ నన్ను అడిగింది..."ఆశా, నువ్వు ఇంకా ఏదైనా చదవాలని అనుకుంటున్నావా?"

"లేదు"

అప్పుడు అమ్మ నా భుజం మీద చేయి వేసి నన్ను అక్కున చేర్చుకొని అడిగింది..."అయితే పెళ్ళిసంబంధాలు చూడమంటావా?"

అమ్మ గుండెల మీద ముఖం దాచి నిలబడ్డాను. సిగ్గుతోనైనా ఒప్పుకున్నాను. ఆ రోజు రాత్రి చాలా సేపు నిద్ర పట్టలేదు నాకు. మిరియాల తీగల మీద మెరిసే మిణుగురు పురుగులను కిటికీ లోనుంచి చూస్తూ పడుకున్నాను. కాసేపు పోయాక వెన్నెల విరిసింది. వెన్నెల నా పరువు మీద పడినప్పుడు నాకు చలి అనిపించింది. ఆ తరువాత ఎప్పుడో నిద్ర పోయాను నేను.

నన్ను చూడడానికి వచ్చిన మొదటి పెళ్ళి కొడుకు ఒక కాలేజీ లెక్చరర్. అతడే స్వయంగా టాటా సుమో డ్రైవ్ చేసుకొని వచ్చాడు. అతనితో పాటు అతని తల్లిదండ్రులూ, అక్కా బావా కూడా వచ్చారు. అందరికీ ఫలహారాలు అందించాను నేను. అప్పుడు ఒక సిగరెట్ వెలిగించి నన్ను అడిగాడతడు... "బి.ఎడ్.పూర్తి చేసాక ఉద్యోగానికి వెళ్లలేదా?"

"లేదు" అని నేనన్నాను.

"దానికి ఉద్యోగం చేయాలని లేదట" నాన్న అన్నాడు. అతడు సిగరెట్ వెలిగించటం



తెలియకుండానే వేసిన ఒక క్రూర జోక్ అని తోచింది నాకు. పొగ పీలుస్తూ కూర్చునే అతనికి మంచి, మగతనమూ, అందమూ వున్నాయి. వాళ్ళు వెళ్ళగానే నేను ఫాన్ వేగం పెంచాను.

"చల్లగా వుంది... ఫాన్ వేగం తగ్గించు" తాత అన్నాడు.

"పొగ వాసన పోవాలి తాతా" నేనన్నాను.

"మగాళ్ళు పొగ పీలుస్తారు" నాన్న అన్నాడు.

"అది కాదు నాన్నా..." నేనన్నాను, "సిగరెటు వెలిగిస్తూ నన్ను అడగటం నాకు నచ్చలేదు".

ఆ తరువాత ఎవ్వరూ దాని గురించి మాట్లాడలేదు. తాత అందరికీ అన్నట్లు ఇలా చెప్పారు...

"ఇంకా వుంటారుగా పెళ్ళి కొడుకులు...ఫర్వా లేదు"

ఆ రాత్రి ఆలోచించాను నేను. అతని గురించి నాకు తెలిసిన విషయాలు రెండే - ఆ సిగరెట్టు - ఆ టాటా సుమో - అంతకిమించి అంతా నాకు తెలియనివే - సిగరెట్టు వెలిగించటం నాకు ఇష్టమైవుంటే మాత్రం - తెలుసుకోవలసిన విషయాలు నేనెలా తెలుసుకునేదాన్ని?

నా మీద దుప్పటి కప్పి నుదుటి మీద శిలువ గీసి "ప్రభువా" అని చెప్పి వెళ్ళిపోయింది అమ్మ.

ఆ తరువాత చూపులకు వచ్చినవాడు నాకు నచ్చాడు. అతని ముఖం మీద గరుకుదనం కనబడలేదసలు. బ్యాంక్ ఆఫీసరట అతడు. కాఫీ తీసుకున్నాక చిరునవ్వుతో నాతో అన్నాడు అతడు..."నేను కూడా ఆంగ్ల సాహిత్యమే చదివాను. ఆ తరువాత దారి మారిపోయింది అంతే..."

వాళ్ళు వెళ్ళగానే అందరి చూపులూ నా ముఖం మీదనే. చిరునవ్వుతో తల దించుకొని నుంచున్నాను. ఆ రాత్రి నేనాలోచించాను. ఆంగ్ల సాహిత్యానికి సంబంధించినంతవరకు అతను నాకు తెలుసు. ముఖం మీద గరుకుదనం లేదని తెలుసు - అంతే - ఆపైన...అతని ఇంట్లో పుస్తకాలుంటాయా? పాత ఆంగ్ల పాఠ్యపుస్తకాలు మాత్రమే వుంటాయా? అక్కడ కిటికీ తెరిచి పడుకోవడం కుదురుతుందా? దోసకి పచ్చడి చేసినప్పుడు వాళ్ళు ఆవాల పోపు వేస్తారా, వేయరా? పోపు వేస్తే నాకిష్టం. చాలా సేపు అటూ ఇటూ దొర్లిన తరువాతనే నిద్ర పట్టింది. మరునాడు మధ్యవర్తి వచ్చి చెప్పాడు నేను వాళ్ళకి నచ్చానని. కాని పెళ్ళికొడుకు హేతువాది కాదు, పిల్ల తాత హేతువాది కావటం వల్ల వాళ్ళు కొంత వెనకడుగు వేస్తున్నారట.

"పోనీ" నా వైపు చూస్తూ అన్నాడు నాన్న "మనకి వద్దు".

ఏదో నేరస్తుడిలా నన్ను చూసారు తాత.

"ఫర్వాలేదు తాతా బాధపడకు" నేను తాత చెవిలో అన్నాను..."పెళ్ళికొడుకులు ఇంకా వస్తారు"

మూడోవాడుగా వచ్చినవాడితో నా పెళ్ళి ఖాయమైంది. పెళ్ళికొడుకు ఇల్లు కొజికోడ్ అనే ఊరులో వుంది. మా అమ్మ పుట్టింటికి దగ్గరగా భూమి కొని సేద్యం చేస్తున్నారు అతని తల్లిదండ్రులు. పెళ్ళికొడుకు ఆర్కిటెక్ట్. పట్నంలో ఇల్లు కట్టుకొని వుంటున్నాడు.

"ఉద్యోగం చేయాలని అనుకుంటున్నావా?" అతడు నన్ను అడిగాడు.

"లేదు" నేనన్నాను.

"నాకూ అదే ఇష్టం" అతడు అన్నాడు. "నేను బిజినెస్, సేద్యం - రెండూ చూసుకుంటాను. కాని సేద్యం అంటేనే నాకు ఎక్కువ ఇష్టం"

డాక్టర్‌గారూ...ఇక్కడ మొదలవుతోంది నా ఇరకాటం. పెళ్ళి నిశ్చయమైంది. ఆ రోజు రాత్రి, నా జీవితం ఒక కొత్త మలుపు వద్ద వుందనే అవగాహనతో కిటికీ నుంచి బయటికి చూస్తూ పడుకొని వున్నాను. బయట చిమ్మ చీకటి. కిటికీ లోనుంచి చల్లటి గాలి వీచినప్పుడు నేను ముసుగు తన్ని పడుకున్నాను. ఆ తరువాత నేను కళ్ళు తెరిచినప్పుడు అర్ధరాత్రి దాకా చదివే తాత గదిలో కూడా వెలుగు కనబడలేదు. ఇల్లు నిద్ర పోతోంది. బయట చుక్కల వెలుగుంది. హఠాత్తుగా నాకు ఆ ఆలోచన వచ్చింది. నేను నా ఇల్లు విడిచి వెళ్ళిపోతున్నాను. తల్లిదండ్రులనూ, తోబుట్టువులనూ, తాతనీ, నానమ్మనీ, ఈ కిటికీనీ, ఈ పరుపునీ, ఈ నూతినీ, ఈ వంటగదినీ, పనివాళ్ళనీ విడిచి మరో ఇంటికి వెళ్ళాలి. ఆ తరువాత చచ్చేంత వరకు అక్కడే వుండాలి. అక్కడవున్న వాళ్ళతో కలసి మెలసి బ్రతకాలి. ఆర్కిటెక్ట్ జోయి నాతో బ్రతకడానికి రావటం లేదు. నేనే శాశ్వతంగా అతని ఇంటికి వెళ్తున్నాను. జోయి మంచివాడే. జోయి గురించి నాకేం తెలుసు? జోయి అయితే కనీసం నా ఇల్లు చూసాడు. మా ఇంటికి వచ్చే దారి చూసాడు. ఈ కొండలూ భూమీ చూసాడు. తాతనీ, తాత పుస్తకాలనీ చూసాడు. మా కుక్క టాటువుని కూడా చూసాడు. మా ఇంటి గోడమీదవుండే కుటుంబ చిత్రాలు చూసాడు. కొట్టంలోని ఆవులనూ, వాకిటిలో ఎండే మిరియాలనీ చూసాడు. జోయి కూర్చున్న సోఫా మీద కూర్చున్నప్పుడే నేను పెద్ద పిల్లనైనాననేది అతనికి తెలియదు. కాని నేను, మా తాత మారంగాటుపల్లెనుంచి శాశ్వతంగా వలస వచ్చినట్లు జోయి ఇంటికి వలస పోవాలి. ఆ ఊరు గురించి, అక్కడ వాళ్ళ గురించి, నాకేం తెలుసు? అక్కడ ఏం ఏం వున్నాయో! వాళ్ళకి మొక్కలన్నా ఆవులన్నా ఇష్టమేనా? ఆడవాళ్ళను స్నేహపూర్వంగా చూసుకుంటారా? స్నేహపూర్వంగా ప్రవర్తిస్తారా? పనివాళ్లను గౌరవంగా చూసుకుంటారా? పిల్లలను కొట్టి ఏడిపిస్తారా? కుక్కను తరిమేస్తారా? ముష్టి వాళ్ళను ఎగతాళి చేస్తారా? లోపల శుభ్రమైన బట్టలు వేసుకుంటారా? అబద్ధమాడుతారా? ఇతరుల సొమ్ము ఆశిస్తారా? పుస్తకాలను గౌరవిస్తారా? ప్రార్థన చేసేటప్పుడు కూడా మనసులో కుళ్ళూ కల్మషాలు నింపుకుంటారా? కిటికీలు తలుపులు తెరిచి వుంచుతారా? వాళ్ళు ఏం ఏం వండిస్తారు? రాత్రి ఎన్ని గంటలకి నిద్ర పోతారు? ఎప్పుడు లేస్తారు? టాయిలెట్ శుభ్రంగా వుంటుందా? కాచి చల్లార్చిన నీళ్ళు తాగుతారా? అన్నం మేకులా వండుతారా లేక ముద్దగానా...

డాక్టర్ గారూ... చీకటిలోనుంచి ఒక అగాధ గర్తంలోకి పడుతున్నట్లు తోచింది నాకు. మౌనంగా ఏడుస్తూ మంచం మీద లేచి కూర్చున్నాను. జీవితంలో మొదటిసారిగా నేను ఒంటరిదాన్నని అనిపించింది. చలికి వణుకుతూ నా జుట్టు, నా స్తనాలు, పొత్తి కడుపు అంతా ముట్టుకొని చూసాను. ఆశా మాథ్యూ అనే యువతి... 26 సంవత్సరాలు... ఎం.ఏ., బి.ఎడ్... కరిపురత్ జోసెఫ్ మాథ్యూ కూతురు - కన్య- ఎలియట్‌నీ హెమ్మింగ్వేనీ చదివిన అమ్మాయి...నా కళ్ళూ పెదవులూ తడుముకున్నాను. కాళ్ళ మీదగా చేతులు పోనిచ్చాను. మళ్ళీ చేయి జారి, చీకటిలో నుంచి జారుతున్నట్లు అనిపించింది.

"ఆశా మాథ్యూ...నువ్వు ఏడవకూడదు" నేననుకున్నాను. వణుకుతూ ముసుగు తన్ని పడుకున్నాను.

పొద్దున ఆలస్యంగా లేచాను.

"నీ ముఖం ఏమిటే, ఇలా వుంది?" అమ్మ అడిగింది... "పెళ్ళి అంటే భయం వేసిందా?"

నేను మాట్లాడలేదు. ఒక చిరునవ్వు నవ్వాను. కాఫీ తాగిన తరువాత తాత గదిలోకి వెళ్ళాను నేను.

"తాతా... నీతో ఒక రహస్యం చెప్పాలి".

కళ్ళద్దాలు తీసి చదివే పుస్తకం మడిచాడు తాత. దగ్గర కూర్చోమని సైగ చేసాడు.

"తాతా..." నేనడిగాను..."మీరు మారంగాటుపల్లెనుంచి మూట ముళ్ళూ సర్దుకొని ఇక్కడకి వచ్చే ముందు చీకటిలో నుంచి ఏదో గర్తంలోకి జారుతున్నట్లు అనిపించిందా?"

తాత నన్ను పరిశీలనగా చూసాడు. ఆ తరువాత అన్నాడు "నీకు నిద్ర పట్టలేదని అనుకుంటున్నాను"

"అవును, నిజమే! నాకు చీకటిలోనుంచి జారుతున్నట్లు అనిపించింది. వలస పక్షులందరికీ ఇలాగే అనిపిస్తుందా?"

"నాకు అర్థం కాలేదు"

"తాతా... నేనొక వలస పక్షి కదా? మారంగాటుపల్లెనుంచి మీరు శాశ్వతంగా వలస వచ్చినట్లు నేను ఆర్కిటెక్ట్ జోయి ఇంటికి వలస వెళ్ళబోతున్నాను కదా. మరణం వరకు నేను వుండవలసిన ఇల్లు కూడా నేను చూడలేదు. ఆ ఇల్లు

కొండ మీద వుందా... చిత్తడి నేల మీదవుందా... అని కూడా నాకు తెలియదు. ఆ ఇంట్లో దయ్యాలు న్నాయా లేవా అని కూడా తెలియదు. అతని పూర్వీకులు ఇతరుల సొమ్ము కాజేస్తారా అనేదీ తెలియదు... అలా చేసివుంటే ఆ పాపం మా పిల్లలు అనుభవించాలి కదా"

నా అనుమానాల చిట్టా మొత్తం విప్పాను నేను... "తాతా... ఒక నెలైనా నేను అతని ఇంట్లో వుండాలి. అలా వుంటేనే అక్కడకి వలస వెళ్ళే ధైర్యం కూడబెట్టుకోగలను. మీరు చేసినట్లు, కళ్ళు మూసుకొని చీకటిలోకి ప్రయాణం చేయలేను నేను"

బాధగా నన్ను చూస్తూ చాలా సేపు కూర్చు న్నాడు తాత. ఆ తరువాత కౌగలించుకొని నుదుటి మీద నస్యం కంపుతో కూడిన ఒక ముద్దు పెట్టా డు..."తల్లీ, నేను నీ వైపే..." తాత అన్నాడు... "కాని నీ కాలం వేరు. నా కాలం వేరు. నేను ముసలివాణ్ని. హేతువాదిని కూడా... ఈ విష యంలో నీకు మార్గనిర్దేశం చేసే శక్తి నాకు వుండి వుంటే ఎంత బాగుండేది! ఆ ప్రభువు నిన్ను అనుగ్ర హించనీ...ఆ చివరి గడ్డిపోచైనా నా చేతిలో వుండనీ"

డాక్టర్ గారూ... పెళ్ళికి ముందు నెల రోజులు ఆర్కిటెక్ట్ జోయి ఇంట్లో వుండాలనే నా ప్రతిపాదన తల్లిదండ్రుల ముందు వుంచాను. ఈ పెళ్ళి సంబంధానికే కాదు, ఆ తరువాత ఏదైనా పెళ్ళి ఆలోచనలు వచ్చినా సరే, ఇదే వర్తిస్తుందని చెప్పాను.

డాక్టర్ గారూ...ఇప్పుడు మా ఇంట్లో ప్రశాం తత, స్నేహం, ఐకమత్యం మొదలైనవి లేకుండా పోయాయి. నా చెల్లెళ్ళు నా మీద నేరం మోపు తున్నారు. మా అన్నయ్య ఫోను చేసి నన్ను మానసిక చికిత్సకి పంపాలని చెబుతున్నాడు. మా అమ్మ కన్నీరు ఆగటం లేదు. నాన్న ఎప్పుడూ బాధతోనే కనబడుతున్నాడు. తాత పుస్తకం చూస్తూ కూర్చుంటున్నాడు తప్ప పేజీలు తిప్పటం లేదు. రెండుసార్లు వలస వచ్చిన నానమ్మ మాత్రం ఒక యంత్రంలా ఇంటిపనులు చేస్తూ చర్చికి వెళ్తూ నన్ను ఓదారుస్తూ కదులుతోంది.

డాక్టర్ గారూ...నాకు సహాయం చేయండి. నేనేం చేయాలి? నేను బయటపడే దారివుందా? నేనడిగింది తప్పా? నేను ఒక మానసిక రోగినా? దయచేసి నాకు సలహా ఇవ్వండి డాక్టర్...

ధన్యవాదాలతో, ఆశా మాథ్యూ...!




# దైనందినం

పక్కింటికీ మాకూ మధ్య
చిరునవ్వే ఒక ప్రసారం
తలుపులు రెప్పల్లా
మూసుకుంటూ తెరుచుకుంటాయి.

అందరిండ్లలో
ప్రవహించేది అదే విద్యుత్తు
వెలుగు చీకట్లలో
ఎవరి జీవితం వారిది.

ప్రతి ఇంటిలో
ఎన్నెన్నో తలపోతలు
కలవరాలు
ఆనంద సందోహాలు
నాలుగు గోడల పొట్లంలో
నలుగుతున్న పరిమళాలు!

ప్రతి నల్లాల్లోంచి
దూకే నీళ్ళొకటే
కన్నీళ్ళే వేరు వేరు.

బాల్కనీలో నిలబడితే
వీధి ఓ దీర్ఘకవితలా
సాగుతుంటుంది
ఒక్కొక్క మనిషి
ఒక్కొక్క పుస్తకం
ముఖచిత్రాలు చూసి
మోసపోరాదు.

అందరూ మా ఇంటివైపు
చూస్తూ పోతుంటారు
ఎవరి కన్నుల్లో
ఏం ప్రతిఫలిస్తుందో
తెలియదు.

చౌరస్తా దాకా నడిస్తే శివాజీ విగ్రహం
పలుకరిస్తుంది గాని
ఆ కత్తి ఝళిపించేది
ఎవరిమీదో అడగాలి.

రోడ్లకు కార్లు
పూసల దండల్లా వేలాడుతుంటాయి
నగరం ఇరుకై
నడక మళ్ళీ ఇంటికే దారితీస్తుంది.

చీకట్లో ఇల్లు
మాదేనా అన్నట్టుంటుంది
ఇన్నాళ్ళు మాలోని ఇల్లును
చూసుకుంటున్నాం గాని
బయటి నుంచి చూడటం
ఇదే మొదటిసారి

తెల్లారితే సూర్యుడు
మా కోసమే ఎదురుచూస్తుంటాడు
నిన్నటి సూర్యుడేనా ఇతడు!?

అయినా
సూర్యుడికీ మాకూ మధ్య
ప్రకాశమే ఒక ప్రసారం.

డా॥ ఎన్. గోపి
93910 28496

# తెలంగాణా ఆర్త స్వరం



కె.ఎన్.మల్లీశ్వరి

కూతురికి కొనిచ్చిన గొంగి బర్రె అక్కడ నుంచి తప్పించుకు వచ్చి అర్ధరాత్రి పదును మీదున్న అనుపచేలో పడితే 'మాయి ముంత' కథలో సాయమ్మ ఏం చేసింది! ఆ పంట మీదే బతికే పేద సాయమ్మ! ఒక కట్టె తీసుకుని దానిని తరిమి కొడు తుందనుకున్న సాయమ్మ ఏమంటోందంటే... దాని రొండ్ల మీద చేతులేసి తట్టి, "రేపో మాపో అన్నట్టు తల్లడిత్తన్నవు. గిప్పుడు దొంగ తిండి గావలెనా పొద్దులు నిండినయి. సక్కగా ఇంటికిపో" దానిని పునుకుతూ చెపుతుంది మనిషితో మాట్లాడుతున్నట్టు. బహుశా ఈ ఆర్ద్రతే పెద్దింటి అశోక్ కుమార్ జీవన సాహిత్య తాత్వికతలని లోకానికి పట్టిస్తుంది. తన చుట్టూ ఉన్న సమస్త జీవ ప్రపంచంతో ఎక్కడ ప్రేమలో పడాలో, ఎక్కడ పేచీ పడాలో తెలిసిన అశోక్ కుమార్ తన సాహిత్యమంతటిలో ఈ స్పష్టతని నిలుపుకుంటూనే ఉన్నారు. ఇంత కాలం అస్తిత్వవాదాలు చాలా ప్రశ్నలని సమాజానికి పరిచయం చేసాయి... నిలదీశాయి... ఒప్పించాయి. అయితే ఆ దశ నుంచి ముందుకు వెళ్లి ప్రశ్నలని మాత్రమే కాక సమాధానాలని అన్వేషించే ప్రయత్నం అశోక్ కుమార్ రచనలు చేసాయి. ఈ పరిణామం అస్తిత్వ సాహిత్యానికి ఒక చేర్పు.



పెద్దింటి అశోక్ కుమార్

## ప్రత్యేక వ్యాసం

**కరీంనగర్** జిల్లా మారుమూల ఊరు మల్లారెడ్డి పేటలో అతి మామూలు జనులు మాట్లాడే భాష ఈ రోజు వర్తమాన తెలంగాణా కథా సాహిత్యానికి, మొత్తంగా తెలుగు సాహిత్యానికి ప్రీతిపాత్రం అయింది. విత్తనం శాఖోపశాఖల వృక్షంగా ఎదిగినట్లు నిలబడిన చోటు నుంచి మిగతా లోకంలోకి విస్తరించిన ఈ సాహిత్యకారుడు తన అచ్చపు తెలంగాణా మాండలికంతో యాసతో 'మంద తావున గొప్ప నాగరికత వర్ధిల్లుందని' రుజువు చేయగలడు. క్లౌడ్ సీడింగ్‌కీ మానేరు డామ్‌కీ మధ్య సంబంధాన్ని విశ్లేషించగలడు. ఏ ప్రాంతపు వారికైనా అతని మాండలికం చదవడం ఏ మాత్రం అడ్డంకి కాదు. ఎందుకంటే "నాలికె మీదికెల్లి గాదు నాబి దగ్గరకెల్లి పెకిలేటి తెలంగాణ భాష" **(డా॥ నలిమెలి భాస్కర్ - మా ఊరి బాగోతం - నయనం ప్రచురణలు - 2005)** అశోక్ కుమార్ సొంతం కనుక.

వలస కథలను ఒక సీరీస్‌గా రాయడం ద్వారా తన వస్తు ప్రాధాన్యాలను ప్రకటించాడు ఈ రచయిత. పల్లెల నుంచి పట్నాలకి వలస వెళ్ళే వారి జీవితాల్లోని అనేక కోణాలను గత పాతికేళ్ళుగా తెలుగు సాహిత్యం వెలికి తీస్తూనే ఉంది. వలసలలో ఉండే అమానవీయతను పట్టించుకున్నంతగా దాని అనివార్యతను, మొబిలిటీ వల్ల ఏర్పడే పరిణామాలను పట్టించుకోలేదు. అందుకే విషాదాన్ని వ్యక్తీకరించడం నుంచి కార్యాచరణకి ప్రయాణించడంలో

సుదీర్ఘ సమయం అవసరమవుతోంది. ఆశోక్ కుమార్ కూడా వలస జీవితాల దుర్భర స్థితిగతుల్నే ఎక్కువ కథల్లో చెప్పారు. అయితే అతని కాన్వాస్ వేరు. పల్లెల నుంచి ఏకాఎకి అరబ్బు దేశాలకు వలస పోతున్న వారి గురించి రాసారు. మస్కట్, దుబాయ్ లాంటి దేశాలకు వెళ్తున్న వారి జీవితాలను ప్రతిబింబించే సాహిత్యం అతి తక్కువ. కనుక ముందుగా కొత్తని ప్రజెంట్ చేయడంలో భాగంగా వచ్చిన సాహిత్యంగా గుర్తిస్తూనే మిగతా విశ్లేషణలన్నీ అదనపు బలంగా పరిగణించాలి. అపుడే ఆశోక్ కుమార్ కథాసాహిత్యం ప్రయాణించిన దూరం గురించిన అవగాహన ఏర్పడుతుంది.

వలసలకి ప్రధాన కారణమైన ఆర్థిక అంశాలతో పాటు కొన్ని రాజకీయ కారణాలను కూడా కథల్లో అక్కడక్కడా ప్రస్తావించారు. మెరుగైన ఉద్యోగావకాశాల కోసం కొద్ది పొలాన్నీ, బంగారాన్నీ తాకట్టు పెట్టి, అప్పులు చేసీ, ఏజంట్లని నమ్మి, మోసపోయీ అక్కడ ఉండలేకా, స్వదేశం రాలేకా ఏళ్ల తరబడి హింసకి గురవడాన్ని తన సహజ ఆర్తస్వరంతో చిత్రించారు పెద్దింటి ఆశోక్ కుమార్. అయితే నక్సలైట్లతో సంబంధాలున్నాయన్న కారణంగా పోలీసులు వేధిస్తుంటే వాటి నుంచి తప్పించుకోవడానికి వేరు మార్గం లేక కూడా అరబ్ దేశాలకి వలస పోవడాన్ని 'వలస బతుకులు' కథలో చూస్తాము. కథలో ఎత్తుగడే విషాదాలాపనతో మొదలవుతుంది. "బిడ్డా... ముత్తెమూ...నా ముత్తెమసొంటి కొడుకు నువ్వు...ఎందింటున్నవో యాడవం టున్నవో ఏడేండ్ల పొద్దాయే నువ్వు కండ్లవడక...ముత్తెమూ...ఏదో కలిగిన కాడికి కాలు జాపి పండుకోనీయకుండా పోలీసోల్లు ఎంటపడిరి...మనకు వాళ్ళెరుక లేదు వీళ్ళెరుక లేదుగనీ అత్తన్నరు పోతన్నరని బట్టగాల్సి మీదేసి కావలి గాసిరి. ఇగవాళ్ళతోని వషపడదనిగాదు బిడ్డా గంత దూరం పోయింది" **(పెద్దింటి ఆశోక్ కుమార్ - వలస బతుకులు - విశాల సాహిత్య అకాడెమి ప్రచురణ - 2004 - 26)** అంటూ కొడుకు గురించి తల్లి ఆవేదన పడుతుంది.

వలస పోవడం వల్ల ఆస్తులు సంపాదించుకున్న వాళ్ళ గురించి కూడా ఆశోక్ కుమార్ మాట్లాడారు. వారి పట్ల వ్యతిరేకత గానీ, ఆకస్మాత్తుగా వచ్చిన ఆర్థిక ఎదుగుదల వల్ల మానవ సంబంధాలను సరిగా నిర్వహించుకోలేక పోవడం, ధనం రాకడను నిభాయించుకోలేక పోవడం, దాంతో యథాతథ స్థితికి లేదా అంతకన్నా దిగువ స్థితికి జారిపోవడం ఎట్లా జరుగుతాయో చెప్పడం ఒక హెచ్చరిక. అంతేకాకుండా దుబాయ్, మస్కట్ లాంటి దేశాలకి వెళ్లి కాస్త డబ్బు సంపాదించుకున్న వారు మిగతా వారి అసూయలకి గురవడం అనేది వ్యక్తుల్లో ఉండే తామస గుణాలకి ప్రతీకగా కాక సమస్థాయిలో జీవించే గుంపుకి భిన్న వర్గంగా మారడం పట్ల ఉండే కోపంగా చూసారు ఆశోక్ కుమార్. తన ఊరి జనమేకాక తన తండ్రి కూడా ఇట్లా వలస వెళ్ళడం వలన చాలా దగ్గర నుంచి ఈ అంశాన్ని పరిశీలించగలిగారు. అనుభవంలోంచి వలస బతుకులని చిత్రించడం వల్ల వాటి మంచీ చెడు రెండూ చెప్పడం అతనికి సాధ్యపడింది.




ఆశోక్ కుమార్ కథల్లో అభివృద్ధి - కులవృత్తులకి సంబంధించిన అనేక అంశాలు చర్చించదగినవి. తన కాలపు మిగతా సాహిత్యానికి భిన్నంగా కుల వృత్తులను విడిచి పెట్టడం అనేది స్వచ్ఛందంగా ఉండడాన్ని కొన్ని కథల్లో ప్రస్తావించారు. కుల వృత్తులు నిర్బంధం అయిన చోట్ల దానిని ఎదిరించడం కోసం చేసే పోరాటాలను 'వెలి' వంటి కథలు వెలికి తీసాయి. రజక వృత్తిని వదిలి ఆరెంపీ మారాలనుకున్న చిన్న కొడుకుని ఊరంతా వెలి వేస్తుంటే రామవ్వ "వాడు ఉతుకడట. వాని బుద్ధున్న పని వాడు చేసుకుంటడు. తాతలు తండ్రుల నాటి నుంచి తరతరాలు బట్టలుతికే బతుకుతమని కాయితం రాసిచ్చినమా ఏంది?" **(పెద్దింటి ఆశోక్ కుమార్ - ఊటబాయి - నయనం ప్రచురణలు - 2002, పుట - 29)** అని ప్రశ్నిస్తుంది.



'వలసపక్షి' కథ మొత్తం ట్రాక్టర్లు రావడం వల్ల గాడిదలపై వడ్ల మూటలు మోసేవారి జీవిక ఎలా దెబ్బతిందో చెప్పినపుడు ఒక రొటీన్ కథలా కనిపించినా ముగింపులో వాస్తవిక చిత్రణ చేసారు. కాలం మారింది మనమూ మారాలనీ, ఆరు నెలల్లోనే ట్రాక్టర్ నడపడం నేర్చుకుని ఉపాధి పొందుతాననీ ప్రధాన పాత్ర అనడం పాజిటివ్ ముగింపుగా కాక అనివార్యమైన ముగింపుగా చూడవలసి ఉంది. అయితే ఇక్కడ యంత్రానికి యజమాని ఎవరు? జీతగాడు ఎవరు? అన్నది మౌలికమైన ప్రశ్న. ప్రత్యామ్నాయాన్ని ఎంపిక చేసుకోవడంలో అవకాశాలు తక్కువ కనుక దిగువ తరగతుల వారు మళ్ళీ వివక్షకే గురవుతారు. ఇదే అంశాన్ని వేరే నేపథ్యంలో 'కొత్త జీతగాడు' కథ చెపుతుంది. మూడు తరాలు గడిచాక దళితుల అభివృద్ధిని మదింపు చేస్తే ప్రతి తరంలోనూ దళితుల కన్నా ముందే అభివృద్ధిని సాధించి మళ్ళీ ఆధిపత్య స్థానాలను అందిపుచ్చుకున్న వారిగా ప్రాబల్య కులాలవారు కనిపిస్తారు.

గ్రామాల్లోకి పెట్టుబడి ప్రవేశించాక కొత్తగా వచ్చిన చిన్న చిన్న వ్యాపారాలూ, వాటి స్వభావాలను స్వయంగా అనుభవించినంత సహజంగా చాలా కథల్లో రాసారు ఆశోక్ కుమార్. రొట్టెల అమ్మకం, జీపు నడపడం, మొసాంబీల అమ్మకం, మినరల్ వాటర్ ప్లాంట్లు, పూలు కూరగాయ తోటల సాగు, జెనెరిక్ మందుల అమ్మకం, అరబ్బు దేశాలకు పంపే ఏజంట్లు... ఇట్లా తెలంగాణా గ్రామీణ ఆర్థికానికి ఉండే పలు ముఖాలను 'ఊటబాయి' సంకలనంలో పరిచయం చేసారు.

దళిత, ముస్లిం అస్తిత్వాలతో పాటు తెలంగాణా అస్తిత్వం కోసం ప్రత్యేక సంకల్పంతో సాహిత్యం ద్వారా పోరు సాగించారు ఆశోక్ కుమార్. 'వర్గ మూలాలు', 'కొత్త జీతగాడు' కథలు అస్తిత్వ చైతన్యపు లాజిక్‌తో నడుస్తాయి. ఎన్ని తరాలు గడిచినా సమాజాభి వృద్ధిలో ప్రాబల్య కులాల వారే మెరుగైన స్థానాల్లో ఉండడాన్ని 'కొత్త జీతగాడు' కథ చెపితే, ఆర్థిక సమానత్వం సాధించినంత మాత్రాన సామాజిక సమానత్వం రాదనీ, దాని కోసం చేసే పోరాటం అంతులేని మానసిక సంఘర్షణతో కూడుకుని ఉంటుందని 'వర్గమూలాలు' కథ చెపుతుంది.

గ్రామాల్లో ఉండే ఒకటి రెండు ముస్లిం కుటుంబాలకీ గ్రామ రైతులకీ మధ్య ఉండే సంబంధంలో ముస్లింలు ఎట్లా దోపిడీకి గురవుతున్నారో 'జిద్దు' కథలో చూస్తాము. హలాల్ చేయించడం అనేది తెలంగాణా గ్రామాల్లో కొన్ని కుటుంబాలకి ఒక ఆధారంగా ఉన్నది. ముస్లింలు హలాల్ చేసే వృత్తిలో ఉన్నారు. పౌరోహిత్యం మాదిరిగా ఇది కూడా ఒక ధార్మిక వృత్తి. అయితే మెజార్టీ మతానికి చెందిన ధార్మిక అంశాలకి లోక సహజంగా దొరికే గౌరవం ముస్లింల ధార్మిక నిర్వహణకి వచ్చేసరికి దొరకదు. ఎందుకంటే వారు సామాజికంగా, ఆర్థికంగా, మతపరంగా వెనుకబడిన వారు కావడం ప్రధాన కారణం... ఈ సూక్ష్మ పరిశీలనాశక్తి వల్లనే జీవితపు అనంత వైవిధ్యాన్ని ఆవిష్కరిస్తూనే వైవిధ్యంలోని ఐక్యత, ఘర్షణలను మెరుగ్గా పట్టుకోగలిగారు.

కడుపులో కత్తులు పెట్టుకుని కలిసి ఉండడం కన్నా విడిపోవడం మేలన్న ఆశోక్ కుమార్ 2010లో మూడు కథలు ఏడు వ్యాసాలతో 'పోరుగడ్డ' పుస్తకం తెచ్చారు. తెలంగాణా రాజకీయోద్యమంతో సమాంతరంగా సాగిన సాంస్కృతిక ఉద్యమంలో పదిహేనేళ్ళుగా ఆశోక్ కుమార్ చాలా చురుకుగా కృషి చేస్తున్నారు. అయితే 2009 తరువాతి పరిణామాలు చాలా మందికి లాగానే అతన్నీ కలవర పరిచాయి. ఆ మానసిక సంచలనాలూ ఉద్వేగాలను తక్షణం వ్యక్తీకరించడానికి ఆకస్మాత్తుగా వ్యాస ప్రక్రియను ఆశ్రయించారు. ఆ ఏడాది కాలంలో వ్యాసం అతన్ని సేదతీర్చి ఉంటుంది. అట్లాగే తన పాత కథన ధోరణులను పక్కన బెట్టి రాజకీయ కథలు రాయడానికి తనకి అనువుగా ఉండే ఆధునిక కథన పద్ధతుల్ని ఆశ్రయించి, 'రేపు మాపు' అను విడాకుల కథ, 'రణనినాదం' అను 7 ఎపిసోడ్ల కథ, 'యుద్ధనాదం' అను కథల్ని బాధ్యతగా రాసారు.

ఆశోక్ కుమార్ సాహిత్యంలో ప్రత్యేకంగా పరిశీలించాల్సిన అంశం రూప నిర్మాణంలో కొట్టొచ్చినట్లు కనిపించే జానపద సాహిత్య విలువల్ని. 'మా ఊరి బాగోతం' కథల సంపుటి పఠనానుభవం గొప్పది. దృశ్య కావ్యం చూసినప్పటి అనుభవం అది. పాఠకులని కూడా జానపదుల్ని చేసి బాగోతాలు, నాటకాలు ఆడే గడీల ముందు కూర్చోబెడుతుంది. మొత్తంగా అశోక్ సాహిత్యంలో జానపద తత్వమే ఎక్కువ. జానపద సాహిత్యానికి అజ్ఞాత కర్తృత్వం, అలిఖితమై ఉండడం ముఖ్య లక్షణాలు. ఇక్కడ కర్త తెలిసుండడం, లిఖిత రూపంలో ఉండడం లాంటివి రెండింటికీ మధ్య ఉన్న భేదాలు.

ఆశోక్ కుమార్ సాహిత్యంలోని సామెతల్ని ఒక ప్రత్యేక విభాగంగా అధ్యయనం చేయాల్సి ఉంది. ఎందుకంటే ఏ ప్రాంతపు సామెత అయినా ఆ ప్రాంతపు సాంప్రదాయక అభివ్యక్తులుగా ఉంటాయి. 'నెమలికండ్ల నీరు వేటగానికేం ముద్దు?', 'తవ్వెడు వడ్లకు తంగేళ్ళు పీకవోతే బుట్టెడొడ్లు దుడ్డె బుక్కిపోయినట్టయింది' లాంటి అనేక సామెతలలో నుంచి ఒక ప్రాంతపు అనేక వర్గాల జీవితం ప్రతిఫలిస్తుంది. లార్డ్ జాన్ రస్సెల్ చెప్పినట్లు పలువురి జ్ఞానం ఒక్కని వివేకంగా సామెత పుడుతుంది కనుక ఒక చిన్న సామెత ఇచ్చే జ్ఞానం అనంతమైనది. వైద్య, న్యాయ, నీతి, వ్యవసాయ, స్త్రీల, వృత్తుల, ఆచార సంబంధమైన వాటితో సహా సామెతల్లో చాలా విభాగాలు ఉన్నాయి. 'రోణిలో మక్కలేత్తే రోకలి బండలోలె కంకులేత్తయి' అనడంలో తెలంగాణా రైతు వ్యావసాయిక అనుభవం అవగాహనలోకి వస్తుంది. చారిత్రిక భౌగోళిక సిద్ధాంతం (ఫిన్నిష్ థియరీ) ద్వారా పరిశోధిస్తే ఆశోక్ కుమార్ సామెతల పుట్టుకకు సంబంధించిన కాలం, కులం, ప్రాంతం, వర్గం వాటికి సంబంధించిన అనేక విషయాలు వెలుగులోకి వస్తాయి.

'తెగారం' కథలో పూనకంలో ఊగిపోతున్న శివసత్తి తీసిన రాగాల్లో ఎన్నో చారిత్రిక సాంస్కృతిక విశేషాలున్నాయి. "ఆరాలు దప్పితే గోరాలు నాయి... గోరాలు దప్పితే ఆరాలునాయి. లందల బుట్టి బొందల పెరిగిందాన్ని కార్తీకరాజుల రక్తం దాగిందాన్నీ...కోటొక్క పూజలా కొలువున్న దాన్ని... ఎముడాల రాజన్నా పదివెయిల శరణే...కొలుచుకున్నోళ్లకు కొంగు బంగారాన్ని" అంటుంది శివసత్తి ఎల్లవ్వ. ఇందులో రాజుల ప్రస్తావన ఒక చారిత్రిక విశేషమైతే, రాజుల్ని కూడా ఎదిరించగలిగే అతి మామూలు స్త్రీ సాహసం మరొక సాంస్కృతిక విశేషం.

మనుషులు మామూలుగా బతకడం కాదు... ఆత్మగౌరవంతో బతకడమే కాదు... కళాత్మకంగా జీవించాలన్నది ఆశోక్ కుమార్ కోరిక కాబట్టే "బతుకు ఊటబాయి కదా ఎపుడూ నీళ్ళు తోడుతూనే ఉండాలి. పూటిక తీస్తూనే ఉండాలి. లేకుంటే ఊటలు మరలిపోతాయి. బాయి ఎందుకు పోతుంది" **(పెద్దింటి ఆశోక్ కుమార్ - జూకంటి జగన్నాథంతో సంభాషణ - ఊటబాయి - నయనం ప్రచురణలు - 2002)** అని సున్నితంగా హెచ్చరించాడు. ఆత్మ గౌరవం, కళాత్మకతల నిండుజలతో తొణికిసలాడుతున్న 'ఊట బాయి' లాంటి సాహిత్యాన్ని ఆశోక్ కుమార్ నిరంతరాయంగా అందిస్తూ ఉండాలని నా ఆకాంక్ష.

# కవిత్వమే కవిత్వం

## డా॥ ద్వా.నా.శాస్త్రి


98492 93376

"కొందరు కవిత్వం రాయాలి" అనుకొని రాస్తారు. ఇంకొందరు "కవిత్వం వస్తే రాయాలి" అనుకొని రాస్తారు. రమణ వెలమకన్ని ఈ రెండో కోవలోకి చెందుతారు. 2012లో నానీల సంపుటి ప్రచురించారు. ఇన్నేళ్ళకి ప్రకృష్టమైన వచన కవితా సంపుటి 'నా చిరునామా' వెలువ రించారు. బ్యాంక్ అధికారిగా పదవీ విరమణ చేసి గాఢమైన కవిత్వం రాయటం విశేషం. మరొక వ్యాపకం పెట్టుకోకుండా సాహిత్య వ్యాపకం అలవరచుకోవటం మరో విశేషం. ఒక పక్క సమీక్షలు రాస్తూ మరోపక్క కవితలు రాసే రమణ వెలమకన్ని తనను తాను పుటం పెట్టుకోగలరు. ఒక మంచి లక్షణం ఏమిటంటే తన కవితల్ని ఇతరులకి వినిపించి (వారిలో నేనూ ఉన్నాను) సూచనలు అడిగే నిజాయితీతనం ఈయనలో గమనిస్తాం.

'నా చిరువామా' అంటే చిక్కడపల్లి, హైద రాబాద్ కాదు. కవి చిరునామా...! అదెక్కడ దొరు కుతుంది...?

కవిత్వంలోనే దొరుకుతుంది. కవిని కలుసు కోవడమంటే అతని కవిత్వాన్ని చదవడమే అన్న కె.శివారెడ్డి మాటలు రమణకు అన్వయిస్తాయి. 60 కవితలున్న ఈ సంపుటిలో కవిత్వం కానిది వెతకటం వృథా ప్రయాస. కాకపోతే ఉత్తమోత్తమ కవిత, ఉత్తమ కవిత, మంచి కవిత అనే తరతమ భేదాలుండవచ్చు. అది పాఠకుడ్ని బట్టి, విమర్శకుడ్ని బట్టి ఉంటుంది.

"అక్షరాలను చిదిమాను
లావాలా వాక్యాలై ఎగిశాయి
గాయమైనవి కొన్ని
గేయాల్లా జారినవి మరికొన్ని..." అంటూ

ఈ కవితా సంపుటి మొదల వుతుంది. ఈ కవికి ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలపై అవగా హన లేదని నాకు తెలుసు. కానీ ఆ అవగాహన, అధ్యయనం లేకుండానే లోలోపల ఏదో ఉందని పై పంక్తులు చెప్తాయి. ఇందులో భావ చిత్రాలు న్నాయి. కవిత్వ నిర్వచనం వుంది. 'ఉపమ' వుంది. అక్షరాలను చిదమటం అంటే సానబెట్టడం, మథిం చడం, చెక్కడం...ఏదైనా కావచ్చు, అక్షరాలు వాక్యాలకి మూలమైనట్టు కవితాశక్తికీ అక్షరాలే మూలం, అక్షరార్చన కవిత్వానికి మూల మనీ తెలుసుకొంటాం.

మనసు అస్థిరమైనపుడు, మనసు గాయపడి నప్పుడే మంచి కవిత్వం వస్తుందని దేవులపల్లి, జాషువా, సుద్దాల హనుమంతు వంటివారు నిరూ పించారు. అందుకే 'బాధ కవిత్వానికి పర్యాయ పదం' అన్నారు. అప్పుడు 'గేయాల్లా జారినవి' – జారటం అంటే అప్రయత్నంగా వెలువడటం... దానంతట అదే రావాలి.

పాతదైనా, కొత్తదైనా, ఉత్తమమైనదైనా, నీచమైనదైనా, గొప్పదైనా, సామాన్యమైనదైనా కవి కవితా శిల్పంగా మలచగలడని ప్రాచీన ఆలంకారి కులు ఎప్పుడో చెప్పారు. ఈ శిల్పం రమణలో వుందనడానికి...

**"మీ అమ్మ ఎవరంటే**
**చెత్త కుండీని చూస్తాడు**
**నాన్నని గుర్తు చేస్తే**
**చేత్తో సంచీని తడుముతాడు**
**నిజానికి ఆ యిద్దరూ వాడికి తెలీదు..."**

అనే "సమాజప్పొర" కవిత నిదర్శనం. వ్యాకరణం ప్రకారం సమాజపు పొర అనాలి – వాడుకలో అలా అనం గదా...కవితను ప్రారంభించడం కూడా ఒక శిల్పం. పాఠకుడ్ని చివరిదాకా చదివింప జేసే 'టెక్నిక్' రమణకి ఉందని చాలా కవితలు వెల్లడి స్తాయి. తెలంగాణ తెలుగులో 'ఆగమైతున్నరు' కవిత కూడా రాయగల కవి రమణ! చీపురుపై ఎప్పుడో భగ్వాన్ అనుకుంటా – మంచి కవిత రాశారు. ఇప్పుడు మళ్ళీ అదే వస్తువుతో విలక్ష ణంగా రాసి ప్రశంస పొందారు. 'యూజ్ మి ప్లీజ్' వంటి ప్రత్యేక కవితలు చాలా ఉన్నాయి. విభిన్న అంశాలు హృదయాన్ని అస్థిరం చేస్తే జీవుని వేదన తో రాసిన కవితలివి. ఏ ఒక్క భావజాలానికో ఇరుక్కోకుండా మానవీయ కోణమే ప్రాతిపదికగా రాశాడు. మంచికవిత్వం చదవాలనుకొనేవారు చదవాల్సిన కవితా సంపుటి ఇది.




**నా చిరునామా**
**రమణ వెలమకన్ని**
**కవితా సంపుటి**
**మూల్యం : రూ.125/-**
**ప్రతులకు :**
**అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు**
**98660 15040**





“అమ్మా నాన్న ఒకసారి నిన్ను కలుస్తానంటున్నాడు. ఇంటికి రమ్మని చెప్పేదా?” అరుణిమకి ఏమీ సమాధానం చెప్పకుండా, భావరహితంగా ఆమె కేసి చూసింది సావిత్రి.

“చెప్పమ్మా”

“ ఇది నీ ఇల్లు, నీ ఇష్టం”

“ అట్లా అంటావేంటి. ఆయనేం ఇక్కడ ఉండబోవటం లేదు. నీకిష్టం లేదంటే చెప్పు. ఆ సంగతే నాన్నకి చెబుతాను ” అంది అరుణిమ కొంచం నిష్టూరంగా.




4

# సావిత్రి

విమల




**అరుణిమకి,** కొడుకు క్రాంతికీ వాళ్ళ నాన్నని ఇంటికి తీసుకువచ్చి తమతో పాటు వుంచుకోవాలన్న కోరిక ఉన్న విషయం సావిత్రికి అర్థం కాకపోలేదు. ఆ మనిషి మొఖాన్ని రోజూ చూస్తూ తానుండ గలదా? తను గట్టిగా వద్దంటే వాళ్ళేమీ బలవంతం చేయరని తెలుసామెకి. తను కాదు, అతను కలవవాలని కోరుకుంటున్నాడు. మన సంతా మహా శూన్యంగా అనిపించింది. అయినా, “ఒక్కసారి కలిసేందుకైతే రమ్మను” నెమ్మదిగా అని మెల్లిగా లేచి తన గదిలోకి వెళ్ళింది సావిత్రి.

ఈ సంభాషణ జరిగిన వారం రోజుల తరువాత ఒక రోజు సాయంత్రం సావిత్రి భర్త ప్రకాశ రావుని వెంటబెట్టుకుని ఇద్దరు వ్యక్తులు అరుణిమ ఇంటికొచ్చి అతడ్ని దింపి వెళ్ళారు.

ఎన్నో ఏళ్ళు ఎదురుచూసి, ఇక చూడకూడదని, అతను తన జీవితంలో లేడని నిర్ణయించుకున్నాక, అతను ఇప్పుడొచ్చి తన ముందు కూర్చున్నాడు. ముసలితనం కమ్ముకున్న మొఖంతో, మూడొంతులు నెరిసిపోయి, పల్చబడ్డ తల వెంట్రుకలతో, కొంచం వంగిన నడుముతో, వణుకుతున్న చేతులతో, తెరల తెరల దగ్గులతో, ముక్కు మీదకి జారిన కళ్ళద్దాలతో అతనొచ్చాడు. అతను తల వంచుకు కూర్చున్నాడు. భయమో, సిగ్గో, అవమానమో, మొహమాటమో తెలియదు కానీ, అతను అట్లానే చాలా సేపు కూర్చుండి పోయాడు. ముప్పయి ఏళ్ళ క్రితం, వారం రోజుల్లో తిరిగి వస్తానని చెప్పెళ్ళిన వాడు, ఇప్పుడిట్లా ముసలి రూపేసుకుని వచ్చి ఆమె ముందు కూర్చున్నాడు. కాస్సేపటికి తలెత్తి సావిత్రి కేసి చూసి చిన్నగా నవ్వాడు. సావిత్రికి నవ్వు రాలేదు. ఎట్లా వచ్చుద్ది. అతను నవ్వినప్పుడు పళ్ళు తెల్లగా తళుక్కున మెరిసాయి. ‘కట్టుడు పళ్లను కుంటాను’ అనుకుంది సావిత్రి.

“అరుణి కాస్సేపయ్యాక వస్తానంది” అన్నాడతను సంభాషణ ప్రారంభించేవాడిలా.

ఆమేమీ బదులివ్వలేదు.



9885201686

సావిత్రి కేసి చూస్తూ "నువ్వు బాగా లావయ్యావు" అవి అని మళ్ళీ నవ్వాడు. ఈ సారి కూడా సావిత్రికి నవ్వు రాలేదు. ఆ తరువాత, ఎలా వున్నావని అతడు ఆమెని కానీ, ఆమె అతడిని కానీ అడగలేదు.

సోఫా పక్కన టీపాయ్ పైనున్న న్యూస్ పేపర్ తీసి ముక్కు మీదకు జారిన కళ్ళద్దాల్లోంచి చూస్తూ చదువుతున్నాడతను. ఈ అలవాటు మాత్రం పోయినట్లు లేదు. చదువుకునేందుకు ఏదన్నా దొరికితే, పక్కన మనుష్యులున్నా అతనికి పట్టేది కాదు. తనపాటికి తాను చదువుకుంటూ వుండేవాడు. అతనికి తెలియని విషయాలంటూ వున్నాయా అనిపించేది సావిత్రికా రోజుల్లో. అట్లా ఎవరి గురించైనా అనుకోవడం కన్నా భ్రమ మరొక టుండదని తరువాత మెల్లిగా అర్థమైందామెకి.

ఈ మనిషిని ప్రేమించి, ఇతని కోసమేనా తను ఇంట్లోంచి పారిపోయి వచ్చింది? తన తల్లి దండ్రులతో, తోబుట్టువులతో తెగదెంపులు చేసు కుంది? ఇతని కోసమేనా చంటిపిల్లల్ని చంకనేసు కుని అజ్ఞాతంగా జీవించింది. ఎప్పుడు ఏం జరుగుతుందోనని నిత్య భయంతో బతికింది. రాత్రి తన పక్కన పడుకుని నిద్రపోయే అతడ్ని ఎవరైనా ఎత్తుకుపోతారేమో, ఏమైనా కీడు తలపెడతారే మోనని పీడ కలలు కని, ఉలిక్కిపడి మేల్కొని, అతన్ని మళ్ళీ మళ్ళీ చూసుకొని, నిశ్చింతగా, తల నిమిరి, నుదుటిపై ముద్దు పెట్టుకుని, అతనిపై చేయివేసుకుని, ఆదమరిచి నిద్రించింది. ఇతడి నేనా, సరిగ్గా తిన్నావా లేవా అని పొట్ట నిమిరి, కొప్పు డి మరీ తినిపించింది? ఇతడ్ని తలచుకునేనా ఏళ్ళ తరబడి తను పెగులు కళ్ళ దు:ఖంతో, ఒంటరి తనంతో కుమిలి పోయింది?

ఆ గదిలో సోఫాలు, కాఫీ టేబుల్, పుస్తకాల అలమారా, గోడలకు వేలాడే చిత్రపటాలు, గాలికి ఎగురుతున్న కర్టెన్‌లు, సీలింగ్ నుండి వేలాడుతూ రివ్వున తిరుగుతున్న ఫ్యాను... తను రోజూ చూస్తుండే అలవాటైన ఆ వస్తువుల మధ్య, అసం దర్భంగా కొత్తగా వచ్చి చేరిన వస్తువులా కనబడ్డా డతను సావిత్రి కళ్ళకి.

అప్పటికి అనేక మార్లు చదివేసిన, కుట్లూడి, పుటలు చినిగి పోయిన పుస్తకం లాంటి జ్ఞాపకాలు. గుర్తుంచుకో దగ్గ అందమైన పంక్తులు కూడా మసి బారిపోయి, అక్షరాలన్నీ చెదిరిపోయి...గాలికి రెప రెపలాడే పుటల్లాంటి ఆలోచనలన్నీ అతని పిలుపుతో ఎగిరిపోయాయి."సావిత్రీ" అంటూ ప్రకాశరావు గొంతు సవరించుకుని ఏదో చెప్పబోయేంతలో దగ్గు ముంచుకొచ్చి, ఖనేళ్, ఖనేళ్ మని దగ్గుతూ వుంటే, సావిత్రి లోనికెళ్ళి మంచినీళ్ళ గ్లాసు పట్టుకొచ్చి అతని చేతి కందించింది. తాగి "థ్యాంక్స్" అన్నాడు. జీరబోయిన అతని గొంతు వికారంగా ధ్వనించింది.

మెడలో పూలదండలతో గోడకి వేలాడు తున్న క్రాంతి పెళ్ళి ఫోటోను చూసి "వాడినీ, వాడి భార్యని కలిసానీ మధ్యే" అన్నాడు ప్రకాశరావు. ఆ సంగతి అరుణిమ అంటే తెలిసింది. కొడుకు ఆమెతో అంతగా మాట్లాడడు. వాళ్ళ నాన్నని పిల్లలిద్దరూ మధ్య, మధ్య రహస్యంగా చాలా ఏళ్ళుగా కలుస్తున్నారని సావిత్రికి తెలుసు. అతనికి ఆరోగ్యం బాగా లేక, ఆసుపత్రికి వచ్చిన ప్పుడు పోలీసులకి పట్టుబడ్డాడు. అతను పనిచే స్తున్న పార్టీలో ఏవో అంతర్గత విభేదాలు, చీలికలు వచ్చాయనీ, అతను పార్టీ నుండి బయటకు రావా లని అనుకున్నాడని కూడా చాలా సార్లు గతంలో వార్తలు వచ్చాయి. ఏడాది తరువాత బెయిలు పైన అతను బయటకు వచ్చాడు. వెళ్ళి కలవచ్చు కదా అని తెలిసినవాళ్ళు ఒకరిద్దరన్నా, ఆ సమయం లోనూ సావిత్రి అతడ్ని కలిసేందుక వెళ్ళ లేదు. తెగి, ఎగిరిపోయిన గాలిపటపు దారం పట్టుకునేం దుకు ఇప్పుడు పరుగెత్తడం ఎందుకనుకుందామె.

ప్రకాశరావు సన్నటి, తెల్లటి విక్స్‌వేపరబ్ గొట్టం తీసి, ముక్కు దగ్గర పెట్టుకొని గాఢంగా గాలి పీల్చాడు. ఆ తెల్లటి గొట్టం చచ్చిపోయిన వాడి ముక్కు రంధ్రాలను మూసి వుంచే తెల్లటి దూది వుండల్లా కనపడ్డాయి సావిత్రికి. ఇతడు చనిపోతే దేవుడ్ని నమ్మే ఇతడి కొడుకు శ్రాద్ధ కర్మలు చేస్తాడా! తలవెనుక దీపం పెడతాడా? లేక మొఖం పైన ఎర్రజెండా కప్పుతారా? లేక రెండూ చేస్తారా?

సావిత్రికి ఎందుకో వెలపరంగా అనిపించింది. అతడ్ని చూస్తే మరణానికి సన్నద్ధమవుతున్న వృద్ధు డిలా వున్నాడు. వంటింటిలో కెళ్ళి ఓ ప్లేట్‌లో స్వీటు, కారప్పూస పట్టు కొచ్చి అతని ముందు పెట్టింది. దాని కేసి చూసి, "నాకు షుగరు" అన్నాడు. అతను పాలు లేని కాఫీ తాగుతాడని గుర్తుంది సావిత్రికి. చెక్కరే యని బ్లాక్ కాఫీ ఇస్తే, ఆ వేడి కాఫీ జుర్రున తాగాడు. ఈ అలవాటూ మారలేదనుకుందామె.

కొందరి మధ్య సంభాషణలు మంచుగడ్డలా గడ్డకట్టి పోతాయి.

"నువ్వేం మాట్లాడటం లేదు" అన్నాడతను.

"ఏం వుంటుంది? నీతో మాట్లాడేందుకు నాకు?" ఇదీ ఇన్నేళ్ళ తరువాత సావిత్రి అతనితో మాట్లాడిన మొదటి మాట.

అలాగే కాస్సేపు మౌనంగా కూర్చుని, కొంచెం కష్టంగా లేచినిలబడి, దీర్ఘంగా నిట్టూర్చి, "చనిపోయేలోగా నిన్నొకసారి చూసి, ఒక మాట చెప్పాలనిపించింది" అని వణుకుతున్న రెండు చేతుల్నీ జోడించి "సావిత్రీ నన్ను క్షమించు" అన్నాడు ప్రకాశరావు. ఈ మాట అంటున్నప్పుడు అతని కాంతి లేని కళ్ళలో పల్చటి కన్నీటి పొర...బుగ్గలపై జారిన వెచ్చటి కన్నీళ్ళు...

ఇప్పుడు సావిత్రికి నవ్వొచ్చింది. కానీ నవ్వ లేదు. ఎంత అర్థంలేనిదీ మాట ఇప్పుడు. అతను లేకుండానే గడిచిన ఇన్నాళ్ళ ప్రయాణాన్ని, కలత లనీ, గాయాలని, అపనిందల్నీ, నిస్సహాయతల్నీ, లొంగుబాట్లనీ, అవమానాల్నీ ఎన్నెన్నిటిని తాను తవ్వుకోవాలి? ఎందుకిదంతా?

తను అతడ్ని క్షమించటమేమిటి? అతడే కాదు, తనూ నిజమని నమ్మిన సత్యాల కోసం దారి వెతుక్కుంటూ జీవితమంతా కొట్లాడిన వాడ తను. పోనీ అతనేమన్నా సుఖపడ్డాడా అంటే అదీ లేదే. ఇప్పుడిట్లా అనారోగ్యంతో, అలసటతో, ఒంటరిగా తనముందు నిలబడి తన క్షమని అడుగు తున్నాడు. అన్నేళ్ళ క్రితం తాను అతడ్ని అడిగిన ప్రశ్నలకి జవాబులు అతనికి దొరికాయో లేవో తెలీదు నాకు అనుకుందామె, అతని కేసి నిర్వి కారంగా చూస్తూ.

అతను గడప దాటబోయి తూలి పడబోతే గభాలున అతని భుజం పట్టుకుని గడపదాటిం చింది సావిత్రి. తడబడే అడుగులతో వెళ్ళిపోతున్న అతడ్ని చూస్తే జాలి లాంటి భావన ఏదో కలిగిం దామెకి. నిస్సహాయుడైన సాటి మనిషి పట్ల మరో మనిషికి కలిగే భావన లాంటి భావన. ఇంకా నెర

వేరని జీవితేచ్ఛని, వదలని కలల్నీ మోసుకుంటూ, తలవంచుకు తడబడుతూ వెళ్ళిపోయిన ఆ మనిషి తాలూకు వాసన ఆ గదిలో ఇంకా అట్లానే వుంది.

* * *

"శ్రీకాకుళంలోన చిందింది రక్తమ్ము
కాల్వలై కలిసింది కొండవాగులలోన
బండలెరుపెక్కి నాయా.
పోరాడ కొండలై కదిలినాయా..."

దేశమంతా నక్సల్‌బరీ వసంతకాలం గర్జిస్తుంటే ఇట్లాంటి పాటలంటే ఎవరికిష్ట ముండదు? ప్రకాశరావు విశాఖలో చదువుకుంటున్న కాలం. ఎలాంటి కాలం అది ? శ్రీకాకుళంలో సాగుతున్న సాయుధ పోరాట వార్తలు, ఆ ఉద్యమంపై అమల వుతున్న తీవ్ర హింసాకాండ లతో సమాజం అతలా కుతలం అవుతున్న కాలం అది. కాలేజీ కుర్రాళ్లని ఈ ఉద్యమాలు ఉత్తేజపరిచాయి. ఆ ఉద్యమాలతో సంబంధాలున్న విద్యార్థుల్లో కొందరు ప్రకాశరావుకి స్నేహితులయ్యారు. వాళ్ళిచ్చే విప్లవ సాహిత్యాన్ని చాలా ఆసక్తిగా చదివేవాడతను. మొదటినించీ పుస్తకాలు తెగ చదివే అలవాటున్న ప్రకాశరావుకి ఆ సాహిత్యం మరో ప్రపంచానికి దారులు తెరిచినట్లని పించేది. అతనికి తెలిసిన కొంత మంది మిత్రులు చదువుల్ని అర్థాంతరంగా ఆపేసి, పోరాటంలోకి వెళ్ళిపోయారు.

విజయనగరానికి దగ్గరగనే వున్నా, ఆ ఊరు ఇంకా అప్పటికి పల్లెటూరే. ఆ ఊరికి దగ్గర్లో వున్న ఒక జీడిపిక్కల కంపెనీలో పనిచేసేందుకు తల్లితో పాటు టిఫిన్ డబ్బా పట్టుకు వెళ్ళేది సావిత్రి. రెండెకరాల పొలం వున్నప్పటికీ, ఆరేడుగురు కుటుంబ సభ్యులున్న వాళ్ళకి ఆ ఆదాయం ఏ మాత్రం సరిపోయేది కాదు. పదోతరగతికే చదువు మానేసినా, రోజూ కంపెనీలో మాడిన జీడిపిక్కల వాసనతో మునిగి తేలుతున్నా, మల్లెపూవులా యవ్వనం కమ్ముకున్న సావిత్రికి అందమైన కలలుండేవి. వంటి నిండా మెరుపులుండేవి. ఏదో తెలియని ఆనందపు కిలకిల నవ్వులుండేవి. అట్లాంటి పదిహేడేళ్ళ సావిత్రికి, ప్రకాశరావు పరి చయమయ్యాడు. సావిత్రికి వరుసకి బాబాయయ్యే పుల్లయ్య ఇంటికి సమావేశం పెట్టుకునేందుకు వచ్చారు అతనూ, అతని మిత్రులు. వంటలో కాస్త సాయం చేసేందుకు రమ్మంటే వాళ్ళింటికి వెళ్ళింది. ఎవరికి ఎవరిపట్ల ఎందుకు ఆకర్షణ కలుగుతుందో చెప్పలేనట్లే, సావిత్రికీ, ప్రకాశరావుకీ ఒకరి పట్ల ఒకరికి ఇష్టం కలిగింది. జీవితంలో ఎప్పటికీ పెళ్ళి చేసుకోకూడదనీ, ఉద్యమంలోకి వెళ్ళిపోవాలని అనుకున్న ప్రకాశరావు ఎంఏ చదువు మధ్య లోనే ఆపేసి, కుటుంబ అవసరాల కోసం టెలిఫోన్ శాఖలో ఉద్యోగంలో చేరాడు. ఏడాదికి పైగా సావిత్రితో సాగుతున్న అతని పరిచయం ప్రేమగా రూపాంతరం చెందింది.

"నన్ను పెళ్ళి చేసుకోవడం నీకిష్టమేనా"

సిగ్గుతో తలవంచుకుని చీరకొంగు ముడివేసి, విప్పుతూ చిరునవ్వు నవ్వుతూ నిలబడ్డ సావిత్రి నోటి నుంచి "ఇష్టమే" అన్న మాట రావడానికి పది హేను నిముషాల సమయం పట్టింది. ప్రకాశరావు ఆ మాట కోసం ఓపిగ్గా ఎదురుచూసాడు.

సావిత్రి ఇంట్లో వాళ్ళకి ఈ పెళ్ళి ఎంత మాత్రం ఇష్టం లేదు. కుర్రవాడు చదువుకున్న వాడే అయినా, బతుకుతాడో, చస్తాడో తెలియని రాజకీయాల్లో వున్నవాడు. వాళ్ళు సావిత్రిని కట్టడి చేసారు.

ఓ చీకటి రాత్రి...

"ఊరవతల ఎదురుచూడు. మోటర్ సైకిల్‌పై వచ్చి తీసుకెడతాను" అని ప్రకాశరావు అన్న మాట నమ్మి ఆమె కట్టుబట్టలతో ఇంట్లోంచి వచ్చేసింది. అతను రాలేదు. అతని స్నేహితుడు రషీద్ వచ్చాడు. అతనితో కలిసి వెళ్ళేందుకు చాలా భయపడింది సావిత్రి. ప్రకాశరావు రానందుకు ఏడ్చేసింది. ఇక వెనక్కి వెళ్ళ లేదు. తెగించి అతనితో పాటు వెళ్ళింది. సీతమ్మధార దగ్గర ఓ డాబా ఇంట్లో ప్రకాశరావు కలిసాడు. వాళ్ళిద్దరూ స్నేహితుల సమక్షంలో పూలదండలు మార్చుకొని పెళ్ళి చేసుకున్నారు. వాళ్ళ సంసారం మొదలైన నాలుగు నెలలకి ప్రకాశరావుని అనుమానం మీద అరెస్టు చేసారు. అతను ఉద్యోగం నుండి సస్పెండ్ అయ్యాడు.

తనకు తెలిసిన దానికన్నా అతను మరింత ప్రమాదకరమైన పనుల్లో వున్నాడని సావిత్రికి మెల్లిగా అర్థం కాసాగింది. అతని పార్టీ, అతని పనులు, ఇంటికి వచ్చి పోయేవాళ్ళు, వాళ్ళ మాటలు, ఈ కొత్త వాతావరణం, అక్కడి స్వేచ్ఛా సావిత్రికి ఎంతో ఆనందాన్నీ, ధైర్యాన్నీ, నిశ్చింతనీ ఇచ్చేవి. మరీ ముఖ్యంగా ప్రకాశరావు తనతో వుండే పద్ధతి అప్పటి వరకూ తాను చూసిన అనేక కుటుంబాలలోని పద్ధతి కన్నా చాలా భిన్నంగా వుండటం ఆమెకి మరింత సంతోషాన్నిచ్చింది. తిట్లు, అవమానాలు, కొట్టడాలు, ఇంట్లోంచి వెళ్లగొడతానని బెదిరించటాలు, చేతికి నయాపైసా ఇవ్వకుండా లొంగదీయటాలూ లేని భర్త తనకు దొరకటం తన అదృష్టం అనుకునేది సావిత్రి.

ఎప్పుడో మానేసిన చదువు మళ్ళీ చదవమని అతడు వత్తిడి చేయటం మాత్రం ఆమెకి అసలు నచ్చేది కాదు. ప్రకాశరావు ఉద్యోగం వదిలేసాడు. అమలాపురంలో వాళ్ళమ్మా, తమ్ముడూ ఉండేవాళ్ళు. అతనికి తండ్రి లేడు. పెళ్ళయిన కొత్తలో ఓసారి ప్రకాశరావుతో పాటూ ఆ ఊరెళ్ళిన సావిత్రిని అతని తల్లి సాద రంగా ఆహ్వానించింది. ఐదారు గేదల్ని, చిన్న కిరాణా దుకాణాన్నీ పెట్టుకొని గుట్టుగా సంసారాన్ని లాక్కొస్తుందావిడ. ఆమె దగ్గర ఆరునెలల పాటు సావిత్రిని పెట్టి వెళ్ళిపోయాడు ప్రకాశం. మధ్యలో అతను కబురుచేస్తే కలిసేందుకు రెండు సార్లు వెళ్ళి వచ్చింది సావిత్రి. చివరికి ప్రకాశరావు సావి త్రిని తీసుకొని హైదరాబాద్ వచ్చాడు. చిక్కడపల్లి దగ్గర రెండుగదుల ఇల్లు అద్దెకు తీసుకున్నారు వాళ్ళు. ఆ దగ్గరలోనే వున్న ప్రింటింగ్ ప్రెస్‌లో ప్రకాశరావు ఉద్యోగంలో చేరాడు. రషీదు కూడా అక్కడే పనిలో చేరాక సావిత్రికి అర్థమైంది, అక్కడ పార్టీకి అవసరమైన సాహిత్యం ప్రింట్ అవుతుందనీ, వాళ్ళిద్దరూ ఆ పనిలోనే ఉన్నారనీ.

"నువ్వు కూడా ఏదైనా పని నేర్చుకో సావిత్రి. ఆర్థికంగా ఎవరిపైనా ఆధారపడకుండా బతకటం ఆడవాళ్ళకి చాలా అవసరం" అన్నాడు ప్రకాశరావు. అప్పటికి ఏడోనెల గర్భవతి సావిత్రి. అప్పుడే అత్యవసర పరిస్థితి ప్రక టించారు. వాతావరణం ఏమీ బాగుండ లేదు. అరెస్టులు, పోలీసులు పట్టుకు పోయి కాల్చి చంప డాలు జరుగుతున్నాయి.

"నాకు భయంగా వుంది. ఎప్పుడేమవుతుందో" అందో రోజు సావిత్రి.

"ఏమవుతుంది? నన్ను పట్టుకుంటే కాల్చి చంపుతారు" అన్నాడతను చిరునవ్వు నవ్వుతూ.

"మరి నేనేం కావాలి? నా కడుపులో వున్న మన బిడ్డేం కావాలి?"

"అలా అడిగితే నేనేం చెప్పగలను? అందరిలానే మనమూ" అన్నాడతను.

ఆ సమాధానం అంత తృప్తిగా అనిపించకపోయినా సావిత్రి మరేమనలేదు.

ప్రింటింగ్ ప్రెస్ దగ్గర మళ్ళీ పోలీసులు తిరుగుతున్న విషయం తెలిసిన వెంటనే, రెండు జతల బట్టలు, అత్యవసర వస్తువుల్నీ పట్టుకుని, ప్రకాశరావు, సావిత్రి పాతబస్తీలోని ఒక షల్టర్‌కి వెళ్ళారు. అక్కడకి ఆమెని తీసుకొచ్చిన ఓ గంటకి "ఇక్కడే ఓ రెండు రోజులు వుండు. డెలివరీ అయ్యే వరకూ నిన్ను వుంచేందుకు వేరేచోట ఏర్పా ట్లు జరుగుతున్నాయి" అన్నాడు ప్రకాశరావు.

"మరి నువ్వో?"

"నేను వెళ్ళిపోవాలి. పరిస్థితులేం బాలేవు" సావిత్రికీ తెలుసా సంగతి.

ఆ రాత్రి అతని పక్కన పడుకున్నప్పుడు ఏం అనాలో, ఏంచేయాలో అర్థంకాని నిస్సహాయతతో, దిగులుతో ఆమె ఏడ్చింది.

ఆమెని పొదివి పట్టుకుని "ఏడవకు, నేను తప్పకుండా వస్తాను కదా!" అన్నాడు ప్రకాశరావు. అతని గొంతులో ధ్వనించిన అపనమ్మకం ఆమెని తాకింది. చీర కొంగుతో కళ్ళు తుడుచుకుని అతని కేసి దీర్ఘంగా చూసింది సావిత్రి. ఆ రాత్రి ఆమె నిద్రపోలేదు.

ప్రకాశరావు వెళ్ళిపోయాడు. సావిత్రిని నల్గొండలోని మిరియాలగుడాలో, ఒకరి ఇంట్లో వుంచారు. అక్కడే సావిత్రికి అరుణిమ పుట్టింది. ఆ ఇంటివాళ్ళ ప్రేమ చూసి, తన కన్నవారు కూడా అంత బాగా చూసుకునే వారు కాదేమో అనుకునేదామె. ఎమర్జెన్సీ ఎత్తేసి, జనతా ప్రభుత్వం అధికారంలోకి వచ్చేదాకా అక్కడే వుంది సావిత్రి. అప్పుడప్పుడు కలిసేందుకు వచ్చే వాడు ప్రకాశరావు. ఆ నిర్బంధ కాలం అంతా అతను బయటి రాష్ట్రాల్లో కాలం గడిపాడు. ఇక తామిద్దరం కలిసే వుంటామనుకుంది సావిత్రి. ఈ సారి వాళ్ళ మకాం హైదరాబాదు నగరం నుండి మారింది. నడివయసు దాటిన ఇద్దరు భార్యాభర్తలు, ఓ పద్దెనిమిదేళ్ళ కుర్రవాడు రవి వాళ్ళతో పాటూ వుండేవాళ్ళు. పెద్ద వాళ్ళిద్దరూ సావిత్రి తల్లిదండ్రులుగా, ఆ కుర్రవాడు ఆమెకి తమ్ముడుగా, వ్యవహరించే వాళ్ళు. ప్రకాశరావు వ్యాపారస్తుడనీ, పనిమీద ఎక్కువగా ఊర్లు తిరుగుతుంటాడనీ చెప్పుకునేవాళ్ళు వాళ్ళంతా. అక్కడున్నప్పుడే సావిత్రికి క్రాంతి పుట్టాడు.

గతం నుండీ సాగుతున్న వరంగల్, గోదావరీలోయ పోరాటాలే కాదు, కొత్తగా ఉత్తర తెలంగాణాలో, రాజుకున్న పోరాటాలు రాష్ట్రం అంతటా దావానంలా వ్యాపించాయి. ప్రకాశరావుతో సహా ఎవరికీ క్షణం తీరిక లేదు. అందరి మనసుల్లోనూ కొత్త ఆశలు చిగురించాయి. ఇలాంటి పరిస్థితుల్లోనే వారం రోజుల్లో మళ్ళీ వచ్చి కలుస్తానన్న ప్రకాశరావు కనపడకుండానే వెళ్ళిపోయాడు. ఇద్దరు పిల్లల్ని చేతబట్టుకుని, సావిత్రి హైదరాబాదు చేరుకుంది. మరి కొంత కాలానికి, రహస్య జీవితంలో తమతో పాటూ వున్న రవి మణుగూరు అడవుల దగ్గర జరిగిన ఎదురు కాల్పుల్లో చనిపోయాడన్న వార్త విని సావిత్రి చాలా బాధపడింది.

తను ఉద్యమం నిర్మించేందుకు అడవిలోకి వెళ్ళిపోయానని, ధైర్యంగా జీవించేందుకు ప్రయత్నించమనీ, ఆరు నెలల తరువాత చిన్న చిట్టీ పంపాడు ప్రకాశరావు. అతనికేం అవుతుందన్న దిగులుకన్నా, ఈ ఇద్దరు పిల్లల్ని ఎలా పెంచాలి? ఇంతటి భారాన్ని తాను ఒక్కతే మోయటం ఎలా అన్న భయం ఆమెని వణికించింది.

పార్టీవాళ్ళు ఆర్థికంగా కొంత సహాయ పడినా, తన జీవికను తాను వెతుక్కోవల్సిన పరిస్థితి సావిత్రిది. ఇలాంటి స్థితి లోనే రషీద్ సావిత్రి జీవితంలోకి వచ్చాడు. ఎమర్జెన్సీ కాలంలో అరెస్టయి, చిత్రహింసల పాలై మూడేళ్ళ పాటు జైల్లో వున్నాడు. ఆరోగ్యం బాగా దెబ్బతిని, పూర్తి కాలం ఉద్యమంలో పనిచేయలేననుకుని, చిన్న ప్రింటింగ్ ప్రెస్ పెట్టుకుని బతుకుతున్నాడు. అతనే ఆమెకి సనత్ నగర్ దగ్గరి ఓ ఫ్యాక్టరీలో చిన్న ఉద్యోగం ఇప్పించాడు. కూతుర్ని, కొడుకునూ బడిలో వేసింది. రమ్మని పిలవగానే ఊరి నుంచి ప్రకాశరావు తల్లి వచ్చింది. సావిత్రికి కొంచెం నిశ్చింత దొరికింది. ప్రకాశరావు నుండి అడపా దడపా ఉత్తరాలు వచ్చేవి. కానీ అతను ఆమెని కలవలేదు. కష్టం సుఖం చెప్పుకునేందుకు, ఏదైనా సహాయం కావల్సి వచ్చినప్పుడు ఆమె రషీద్‌నే అడిగేది. ప్రకాశరావు తల్లి చనిపోయాక సావిత్రి ఇంటికి రషీద్ రాకపోకలు ఎక్కువయ్యాయి. పిల్లలిద్దరికీ రషీద్ దగ్గర చనువెక్కువ. వాళ్ళతన్ని చిన్నాన్న అని పిలిచేవారు.

"రషీద్...ఎవరైనా మంచి పిల్లని చూసుకొని నువ్వు పెళ్ళిచేసుకో" అంది సావిత్రి

"నాకెక్కడ దొరుకుతుంది పిల్ల" అని నవ్వాడు రషీద్.

"నేను చూసేదా"

"నువ్వు చూసే పిల్ల నీలాగెట్లా వుంటుంది"

"అంటే"

"ఏం లేదు. ఎందుకులే!"

అతని మాటలు కొంచం అర్థమై, అర్థం కానట్లనిపించి అతని కేసి నిదానించి చూసింది. ఉన్న వయసుకన్నా చిన్నగా కనిపించే బక్కపలచని, కలలుకనే కళ్ళున్నవాడు రషీద్. కవిత్వం రాసేవాడు. బొమ్మలు గీసేవాడు. ఎన్నో ఏళ్ళుగా తనకు తెలిసిన రషీద్ ఆ వేళ కొత్తగా కనిపించాడు సావిత్రి కళ్ళకి. పరిచయమైన మొదటి రోజుల్లోనే అతను తాను రాసిన కవిత్వం సావిత్రికి వినిపించేవాడు. సావిత్రి పట్ల కన్సర్న్‌గా వుండేవాడు. అతను చొరవగా వుండడనీ, ఊగిసలాడతాడనీ "మీ కవులు, కళాకారులంత మానసిక దుర్బలురు మరొకరుండరు రషీద్" అంటూ ప్రకాశ రావు అతన్ని విసుక్కునే వాడు. అట్లాంటి రషీద్ సావిత్రికి అండగా నిలబడ్డాడిప్పుడు.

నాలుగేళ్ళ తరువాత, ప్రకాశరావు పిలుపు మేరకి పిల్లల్ని తీసుకుని అతను రమ్మన్న చోటుకు వెళ్ళింది సావిత్రి. తండ్రి పిలవగానే అరుణిమ దగ్గరి కెళ్ళింది గానీ, క్రాంతి వెళ్ళలేదు. అందరూ భోజనాలు చేసాక, అతను సావిత్రితో విడిగా కాస్సేపు మాట్లాడాడు.

"నీ బాధ్యత గానీ, పిల్లల బాధ్యతగానీ తీసుకోలేక పోయినందుకు నీకు నామీద చాలా కోపంగా వుండవచ్చు. కానీ తప్పదు సావిత్రీ. ఇట్లా తప్పదు" అన్నాడు ప్రకాశరావు.

"నువ్వు చేసే త్యాగాల్లో, నేనూ, నీ పిల్లలూ ఓ భాగం కాబోలు" అంది సావిత్రి కొంచం నిష్టూరంగా.

"నేను అలసిపోయాను. ఇట్లా నిత్యం ఏదో ఒక భయంతో బతకటం నా వల్ల కావటంలేదు" అంది ఆమే మళ్ళీ.

"నేనిప్పుడున్నాను. రేపు చనిపోవచ్చు. అప్పుడేమిటీ" అన్నాడు ప్రకాశరావు, ఆమె మాటలకి అదే సమాధానమన్నట్లు.

"నువ్వు ఉండటానికీ, చనిపోవడానికీ మధ్య తేడా కనపడ్డం లేదయ్యా నాకు" అంది సావిత్రి కోపంగా.

"అయితే లేననే అనుకో" అంటూ నవ్వాడు ప్రకాశరావు.

కాస్సేపటి మౌనం తరువాత "అయినా రషీద్ నీకు సాయపడుతున్నాడు కదా" అన్నాడు ప్రకాశరావు.

అతని గొంతులో కొంచెం వ్యంగ్యం ధ్వనించి సావిత్రికి మరింత కోపం వచ్చింది.

"అవును, ఐతే?" అతనామెకిప్పుడు పూర్తిగా పరాయివాడుగా అగపడ్డాడు.

"నిన్నూ, నీ పోరాటాల్నీ తప్పని నేనన్నా. విప్లవం ఎట్లా తేవాలో మీకు వ్యూహాలు, ఎత్తుగడలూ అంటూ ఏవో వుంటాయి కదా! అందులో నాలాంటి వాళ్ళూ, మన పిల్లల్లాంటి వాళ్ళూ భాగం కాదా? అనుకొనో, అనుకోకుండానో నీలాంటి వాళ్ళ చుట్టూ అల్లుకున్న మా జీవితాలు ఏం కావాలి? ఏం ఆలోచిస్తున్నారు మీరు? నీలాగా అన్నీ తెంచేసుకుని వెళ్ళ లేకే, మనమిద్దరం కలిసి కన్న పిల్లల కోసం నేనిట్లా ఆగిపోయాను కదా? బతికేందుకు తన్నుకలాడతా వున్నా కాదా? మరి నన్నెవరి సాయం తీసుకోమంటావో చెప్పిపో" అంది సావిత్రి దు:ఖం

తో పూడుకు పోయిన గొంతుతో.

"మన ప్రశ్నలన్నిటికీ జవాబులు రెడీగా వుండవు సావిత్రీ. నీకు ఏం జవాబివ్వాలో నాక్కూడా తెలీదు. నేనెవరిని నీలా అడగను చెప్పు? మన జవాబుల వెతుకులాటే కదా ఈ పోరాటం. ఏమో! ఇవ్వాళ్ళ కాకపోయినా, రేపటికి దారేదైనా దొరక చ్చేమో? మరి" అంటూ అతనేదో అన్నాడు. అతడే మన్నాడో సావిత్రికి అర్థం కాలేదు.

చీకటి త్వరగా కమ్ముకున్న ఆ అమావాస్య రాత్రి తెరచిన వాకిలి దాటి అట్లా చీకటిలోకి వెలుతురు వెతుక్కుంటూ వెళ్ళిపోతున్న అతని కేసి ఆమె చూస్తూ నిలబడిపోయింది. ఆమెని చుట్టుకున్న పిల్లలిద్దరి తలలపైనా ఆమె చేతులు నెమ్మదిగా వాలాయి. అదే ఆఖరి సారి ఆమె ప్రకాశరావును చూడటం.

★ ★ ★

ఇది జరిగిన మరి కొన్నాళ్ళకి ప్రకాశరావు దగ్గరి నుండి ఒక ఉత్తరం వచ్చింది సావిత్రికి. తను ఉద్యమం నుండి బయటకు రాలేనని, నీ జీవితంపైనా, నీ స్వేచ్ఛ పైనా నాతో వున్న సంబంధం సంకెలవలే వేలాడటం సరైంది కాదనీ, మనం స్వచ్ఛందంగా విడిపోయి, ఎవరి జీవితాలు వారు జీవిద్దామనీ రాసాడతను. రషీద్‌కా ఉత్తరం చూపించింది సావిత్రి. అతను పార్టీ వాళ్ళతో మాట్లాడదాం అన్నాడు. సావిత్రి అవసరం లేదని సమాధానమిచ్చింది. ఆమె అతనికి జవాబేమీ రాయలేదు. కానీ అతనితో తన బంధం ఇక ముగిసినట్లే అని ఆమెకి అర్థమైంది.

రషీద్‌ని తమతో పాటు వచ్చి వుండమని సావిత్రి అడిగితే అతను సంకోచించాడు. సావిత్రి వత్తిడి చేయలేదు. ఎప్పుడన్నా ఉండాలనుకుంటే ఒకటి రెండు రోజులు వుండి పోయేవాడు. అరుణిమ తండ్రి రాజకీయాల పట్ల ఆసక్తి చూప టమే కాదు, విద్యార్థి సంఘాల్లో చురుగ్గా పాల్గొనేది. తల్లి పట్ల, రషీద్ పట్లా ప్రేమగా వుండేది. క్రాంతి కూడా అక్కతో పాటూ మీటింగులకి వెడుతుండే వాడు. పిల్లలని వద్దని ఆమె ఎన్నడూ అనేది కాదు. ఎదుగుతున్న క్రాంతి లో మార్పు నెమ్మదిగా వచ్చింది. వాడి డస్క్‌లో దేవుళ్ళ బొమ్మలు చూసి సావిత్రి ఆశ్చర్యపోయింది. దేవుడికి దండం పెట్టుకోవడం, గుళ్ళకెళ్ళటం, పండ గలు చేయటం ఏనాడో మానేసింది సావిత్రి. పిల్లలకీ అదే అలవాటు. అట్లాంటిది వాడి దగ్గర దేవుడి బొమ్మ. వాడు ఎవరితోనూ కలవకుండా ఒంటరిగా వుండేందుకు ఇష్టపడటం మెదలెట్టాడు. వాడి లోలోపల ఏం జరుగుతుందో సావిత్రికి అంతు పట్ట లేదు. వాడిలో పెరుగుతున్న అశాంతి, కోపం దాచుకోడం చాతకాని తనంతో, అక్కతో, అమ్మతో అప్పుడప్పుడూ తగాదా పడేవాడు. చివరికి రషీద్ పైకి వాడి కోపం మళ్ళింది. ఈ పరిణామాల పట్ల సావిత్రికి చాలా ఆందోళనగా వుండేది.

"వాడు ఎదుగుతున్నాడు. ఈ వయసులో పిల్లల్లో ఇలాంటి తిరుగుబాటే వుంటుంది. అదే సర్దుకుంటుంది. నువ్వేం కంగారు పడకు" అన్నాడు రషీద్.

ఒకసారి సావిత్రితో వాదిస్తూ "నీ గురించి బయట అందరూ ఏమనుకుంటున్నారో తెలుసా నీకు" అంటూ క్రాంతి ఒక మాటన్నాడు. వాడలాంటి మాట ఎలాంటి సంకోచం లేకుండా అన గలిగినందుకు సావిత్రి మనసుకి చాలా కష్టమని పించింది.

"నువ్వు కదా రషీద్, అవ్వాళ నాకు అండగా నిలబడింది. నీ కంటూ ఒక స్వంత జీవితం లేకుండా, నాకోసం, నా పిల్లలకోసం ఇట్లా మిగిలి పోయింది" అంటూ రషీద్ దగ్గర చెప్పుకుని బాధపడింది.

క్రాంతి ఇప్పుడు తన గదిలో దేవుడి బొమ్మలు పెట్టుకుని బాహాటంగానే పూజ చేయడం మొదలెట్టాడు. ఖరగ్‌పూర్ ఐఐటీలో సీటు వచ్చి వెళ్ళి పోయేప్పుడు హెచ్చరికలాగే వాడు రషీద్ ముందే "అతను కావాలో, నేను కావాలో తేల్చుకో అమ్మా... అతనొస్తే నేనీ ఇంటికి మళ్ళీరాను" అన్నాడు.

"అమ్మ జీవితం మీద నీ పెత్తనం ఏమిటిరా? అసలు నువ్వెడివి ఇలా మాట్లాడటానికి? నీకు సంబంధంలేని విషయాల్లో తలదూర్చకు" అంటూ అరుణిమ అంతెత్తున క్రాంతి మీద ఎగిరిపడింది.

వాడి మాటలకి సావిత్రి నిర్ఘాంతపడి, ఏం అనాలో తోచక అలా నిలబడి పోయింది. క్రాంతి వెళ్ళిపోయిన చాలా సేపటి వరకూ రషీద్ కూర్చున్న చోటి నుండి లేవలేదు. తప్పి పోయిన లేగదూడ కోసం బెదురు కళ్ళతో వెతుక్కుంటున్న గంగిగోవులా అతని చూపులు తారట్లాడాయి. అతని చేతుల మీద పెరిగిన పిల్లవాడు క్రాంతి.

కోడి పిల్లలని పట్టుకునేందుకు వంగి చేతులు చాచి పరుగెడుతున్న వాడి బొమ్మ రషీద్ గీసాడు. గోడకు వేలాడుతున్న ఆ చిత్రం కేసి చూసింది సావిత్రి. తన పాలు తాగిన పిల్లవాడు. తను జోల పాడితే నిద్దరోయిన వాడు. చంకనెక్కి దిగనని మారాం చేసిన వాడు. తను కథలు చెప్పి గోరు ముద్దలు తినిపించిన వాడు. రాత్రుళ్ళు ఒంటరిగా వొంటేలు పోసుకునేందుకు భయపడిన వాడు. మూతి మీద మీసాలు మొలవటం మెదలయ్యాక అమ్మపైన తన పెత్తనాన్ని స్థిర పరిచిన వాడు. వాడు తన కొడుకేనా? వాడి తండ్రి కూడా అనేందుకు సిద్ధపడని మాటల్ని జంకూ గొంకూ లేకుండా అనగలుతున్న వాడు...

రషీద్ ఎప్పుడెళ్ళి పోయాడో కూడా సావిత్రికి తెలీలేదు. అతను నెలరోజుల పాటు సావిత్రి ఇంటికి రాలేదు. ఎలాంటి కబురూ లేదు. చివరికి సావిత్రే అతని దగ్గరికి వెళ్ళింది. అతను తన సామాన్లు సర్దుకుంటున్నాడు.

" నువ్వు కూడా నాకు చెప్పకుండానే వెళ్ళి పోదామనుకున్నావా రషీద్" అంది సావిత్రి చెంపల మీద కారుతున్న కన్నీళ్ళని తుడుచుకుంటూ. అతడామెని గుండెలకు హత్తుకుని తడి కళ్ళపై ముద్దు పెట్టుకున్నాడు.

"మన జీవితం మన చేతుల్లోనే వుందనుకుంటాం కానీ, చాలా సార్లు అట్లా వుండదు. చాలా మంది వ్యక్తులు, పరిస్థితులు మనల్ని ప్రభావితం చేస్తాయి. ఎదిరించగలిగిన సంసిద్ధత మనకే వుండదు చాలాసార్లు" అన్నాడు రషీద్.

"నువ్వు నా దగ్గరుంటే నాకు చాలా నిశ్చింతగా, శాంతంగా వుంటుంది రషీద్." అంది సావిత్రి

అతనామె తల నిమిరాడు.

"నేను కొంత కాలం ఎటైనా వెడతాను సావిత్రి. నువ్వు నాతో రాగలవా?"

అతని కేసి తలెత్తి తల అడ్డంగా ఊపి ఆమె నవ్వింది. అతనూ నవ్వి "నాకు తెలుసు" అన్నాడు ఆమె నుదిటి మీద ముద్దు పెట్టుకుని. అదే వాళ్ళిద్దరి ఆఖరి కలయిక.

వంటరితనపు కరకు దారుల్లో జీవితం నడిచి, నడచి కడకు పిల్లలిద్దరూ వాళ్ళ బతుకు వాళ్ళు బతకగలిగిన ప్రయోజకులయ్యాక కూడా అరవయి మూడేళ్ళ సావిత్రి ఇంకా ఒంటరిదే.

"అమ్మా చీకట్లో కూర్చున్నావేంటి?" అంటూ అరుణిమ వచ్చి లైటేసే వరకూ అలానే కూర్చుంది సావిత్రి.

అరుణిమని చూడగానే సావిత్రి వేసిన మెదటి ప్రశ్న... "అరుణీ, రషీద్ ఎక్కడున్నాడో తెలుసా? నాకోసారి చూడాలని వుంది" అని.



తురగా ఫౌండేషన్

చినుకు మాసపత్రిక

# శ్రీమతి తురగా జానకీరాణి మేలిమి కథల పోటీ - 2015

ఆరు దశాబ్దాల పాటు పత్రికలు, రేడియో, సమాజ సేవ ముప్పేటలుగా అల్లుకున్న కార్యరంగంలో తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన కథానికలు, రూపకాలు, నవలలతో, 'రేడియో అక్కయ్య' గా జనజీవన హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయిన శ్రీమతి తురగా జానకీరాణి స్మృత్యర్థం తురగా ఫౌండేషన్, 'చినుకు' మాసపత్రిక నిర్వహణలో కథల పోటీని నిర్వహిస్తోంది. కలం పట్టిన రచనాయోధులందర్నీ ఈ పోటీలో పాల్గొనవలసిందిగా ఆహ్వానిస్తున్నాము.

ఆగస్టు 31, 2015 న, శ్రీమతి తురగా జానకీరాణి 80వ జన్మదినోత్సవ సందర్భంగా బహుమతులు ప్రకటించబడతాయి. బహుమతులు గెలుచుకున్న రచయితలందరూ స్వయంగా హాజరై నగదు బహుమతులను, జ్ఞాపికను, సత్కారాన్ని అందుకోవలసి ఉంటుంది.

## బహుమతుల వివరాలు

**1. ఉత్తమ కథ - రూ. 7,500/- 2. ద్వితీయ ఉత్తమ కథ - రూ. 5,000/-**

**3. తృతీయ ఉత్తమ కథ - రూ. 3,000/**

**మూడు ప్రోత్సాహక బహుమతులు - ఒక్కొక్క కథకు రూ. 1500/- చొప్పున మూడు కథలకు రూ.4,500/**

**మొత్తం బహుమతుల విలువ - రూ. 20,000/-**

## నిబంధనలు

1. కథ ఇతివృత్తం సమకాలీనమై ఉండాలి
2. ప్రతి కథ డిటిపిలోనే విధిగా పంపవలసి ఉంది. ఇలా పంపిన ప్రతి కథ 5 పేజీలకు మించి నిడివి ఉండకూడదు.
3. కథతోపాటు ఆ కథ తమ సొంతమని, అనువాదము, అనుసరణ కాదని, ఇంతకుముందు ఎక్కడా ప్రచురింపబడలేదని, ప్రసారం చేయబడలేదని విడిగా హామీ పత్రాన్ని జత చేయాలి. కథ ప్రతి మీద రచయితల పేరు, చిరునామాలు రాయకూడదు. విడిగా రాసి జత చేయాలి.
4. రచనలు ఎట్టి పరిస్థితులలోనూ జూలై 25 లోగా 'చినుకు' పబ్లికేషన్స్, గరికపాటివారి వీధి, గాంధీనగర్, విజయవాడ - 520 003 చిరునామాకు పంపవలసి వుంది. ఆ తరువాత వచ్చిన కథలు ఈ పోటీకి పరిశీలించబడవు.
5. కథల ఎన్నిక, బహుమతుల విషయాలలో న్యాయ నిర్ణేతలదే తుది నిర్ణయంగా భావించాలి. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.
6. రచయితలు డిటిపి చేసిన తమ కథలను పేజ్ మేకర్ 7. లో ఓపెన్ ఫైల్ మరియు పిడియఫ్‌లో editor.chinuku@gmail.com.కు మెయిల్ చేయవచ్చు. ఈ విషయం రాతపూర్వకంగా 'చినుకు' కార్యాలయానికి తెలియజేయగలరు.

# నిరలంకృతం




5

**"ఉండవే, అట్లా తల కదిలిస్తుంటే అలం కరించేది ఎట్లా" అన్నది తల్లి మురిపెంగా.**

**"ఎంతసేపేమిటి మరీనూ" అని గోము లొలికింది సుగాత్రి. చెలికత్తె కిసుక్కున నవ్విం ది, చేత్తో కడుతున్న సన్నజాజిపూల మాల ను మూరతో కొలిచి చూస్తూ.**

సుగాత్రి ఎర్రటి అధరాలమీద కూడా ఒక సన్న నవ్వు తళుక్కుమని మెరిసింది. ఆమె కళ్ళు పరవశంతో సోలిపోతున్నాయి. ఏ మధుర భావాలు హృదయంలోంచి పొంగుకొచ్చాయోగాని, మళ్ళీ తల కొంచెం కదిలింది. "అబ్బబ్బ...కదలకుండా ఉండమంటే ఉండవుకదా...చూడు ఈ చామంతి బిళ్ళ వెంట్రుకల్లో ఎలా చెక్కుకు పోయిందో..." అంది, తల్లి చిక్కుకుపోయిన వజ్రాలు పొదిగిన బంగారు చేమంతి బిళ్ల, అరచేతి వెడల్పున్నదాన్ని మళ్ళీ అమరుస్తూ.




"ఒసేయ్ వాసంతికా...ఎంతసేపు ఆ పూల బుట్ట ముందేసుకుని మాల కడుతున్నట్టు నటిస్తావు. ఇట్టావచ్చి ఈ దుద్దులు పెట్టు సుగాత్రికి" అన్నది తల్లి. వాసంతిక లేచి రాబోతుండగా, "నాకా దుద్దు లొద్దు. మామిడిపిందెల బుట్టలోలకులు పెట్టు కుంటా" అన్నది సుగాత్రి.

"సరే, నీ ఇష్టప్రకారమే పెట్టుకో. చెవుల కిందనుంచి ఆ బావిలీలు పెట్టుకోవడం మాత్రం మరచిపోకు" అంది తల్లి.

"నేనున్నాను గదమ్మా, ఇంక నాకు వదిలె య్యండి. బావిలీలూ, బాజుబందులు అమర్చి, మూడు పేటల ముత్యాల గొలుసూ, తామర మొగ్గల రెండు వరసల సరమూ, చంద్రవంకల హారము, దాంతోపాటు నవరత్నాల మురువుదండ - చివర్న కలవ పూవంత రత్న వైఢూర్యాల ఫల కంతో వేలాడేది - అన్నిట్నీ అలంకరించనూ..." అంది వాసంతిక.

"అవునేవ్...రత్న వైఢూర్యాల ఫలకం మధ్యలో - నేరేడుపండు పరిమాణంలో మరకతం పచ్చగా ఎన్ని కాంతులు విరజిమ్ముతున్నదో! ఆ ఫలకం ఎదుర్రొమ్ముమీద వేలాడుతుంటే - మా తల్లి ఎంత సొగసుగా వుంటుందో" అంటూ సు గాత్రి బుగ్గలు పుణికి, అర చేతులను కణతల కానించుకుని - మెటికలు విరిచి, "నా దిష్టే తగు

('కళాపూర్ణోదయం' కావ్యంలోని ఒక చిన్న ఘటనకు కథారూపం)


సిహెచ్.వి.బృందావన రావు


ల్తుందేమోనమ్మా పిల్లకు" అని మనసులో అనుకొని "పొద్దువాటారుతున్నది. ఇప్పటినించీ మొదలు పెడితే గాని తెమలదు పని. ఊరికే ముచ్చట్లతో మునిగిపోకుండా తొందరగా అలంకరణ పూర్తి చేసుకోండి" అని అవతలికి కదిలింది సుగాత్రి తల్లి. పోతూ పోతూ "ఆ కంచుకం మరీ అంత బిగుతుగా బిగించకేవ్"



99633 99189

అని హెచ్చరిక జారీ చేసింది.

అప్పటిదాకా ఆపుకొని, ఆమె కనుమరుగు కాగానే ఫక్కున నవ్వింది వాసంతిక.

"ఏందే అంత నవ్వొచ్చే సంగతి" అడిగింది సుగాత్రి.

"కంచుకం బిగుతు లేకుండా తొడగమం టేనూ..." అని దీర్ఘం తీసి, మళ్ళీనవ్వి - సుగాత్రి వక్షంవైపు చూస్తూ - "వాటి ప్రతాపానికి కంచు కాలన్నీ పటపటా చినిగిపోతుంటే - బిగుతు లేకుండా కట్టమంటుంది మీ అమ్మ. అది సాధ్య మయ్యే పనేనా..." అంది వాసంతిక నాలికను బుగ్గలోకి జొనిపి నవ్వుతూ. "నువ్వూ..." అంటూ కొట్టబోయినట్లు నటించి - "కొంటెమాటలు మానవు" - అంది సుగాత్రి.

"కదలకమ్మా తల్లీ ఈ కెంపురాతి ముక్కు పుడక పెట్టనీ" అంది వాసంతిక. తరుణారుణ రాగరంజితాలయిన సుగాత్రి లేత పెదవుల రంగుల్లో - బేసరి కెంపు రంగు సమన్వయం పొందుతుం డగా - ఆకుపచ్చ కలిసిన లేతపసుపు రంగు పసి తమలపాకులాంటి సుగాత్రి కుడి ముక్కుపుటానికి ముక్కు పుడక పెట్టింది వాసంతిక.

"ఇంత అలంకారం అవసరం అటనే...!" అంది సుగాత్రి.

"అది నేనేం చెప్పగలనమ్మా, ఆ సమయంలో నీకే తెలుస్తుంది. ఈ మగవాళ్ళున్నారు చూశావూ, వాళ్ళు నవ ప్రియులు. ప్రతి దాన్లోనూ కొత్తదనం కావాలి వాండ్లకు. అసలు బంగారంలాంటి నీ శరీరం మీది బంగారు వస్తువులను మీ వారు గుర్తిస్తారో లేదో ! నీ ఆభరణాల్లో పొదిగిన రత్న



# సూర్యుడి కళ్ళు

**వెలుతురు** నేత్రాలవాడు
వెతుకుతున్నాడు
చీకటి జాడలకోసం...
అన్ని లోకాలూ వెతుకుతున్నాడు
దేహ మోహ స్నేహ ఊహాలోకాలు
సుఖ దుఃఖ భయ అభయ
స్వేద అశ్రు చైతన్య విశ్రాంతిలోకాలు కూడా
విప్పారిన కాంతికళ్ళతో...
చిక్కవుగా సూర్యుడికి
చీకటి, ఆలోచనల చిరునామాల ఛాయలు
సూర్యుడు కళ్ళు తెరిచీ తెరవగానే
పిట్టలు రెక్కలు దులుపుతాయి
కాంతి సునామీలో
కొట్టుకు పోతుంది చీకటి
నదీ ప్రవాహాల ఉపరితలాలు మెరుస్తాయి
చీకటి ఉన్నదున్నట్టుగా మాయమవుతుంది
ఆలమందలానందంతో మోరలు పైకెత్తి
గంగడోలు ఊగేలా అరుస్తాయి

గిట్టల కింద నలిగి నలిగి చీకటి
ఏమైపోతుందో,
ఎక్కడికి కూరుకుపోతుందో
కొండ శిఖరాలూ కోవెల గోపురాలూ
ఎత్తులు పెంచుకుంటాయి
ఉలిక్కిపడే అవకాశం కూడా లేకుండా
ఉనికి కోల్పోతుంది చీకటి
వెలుతురు చూపుల వాడి వేట
సాగుతూనే ఉంటుంది నిరంతరాయంగా...
వక్ర రేఖలు కాని అతని
అనంత గోళాకార దీర్ఘ కాంతి కిరణ
దృష్టి రేఖల శరాల సమూహాలలో
సూర్యుడి చూపు ఆనినంత మేరా
మోగదు, చీకటి ప్రతాపాల నగారా
వెలుతురు నయనాల వాడికి
వెలుతురే కనిపిస్తుంది సదా సర్వదా
అతడి కళ్ళ ఊసులు సైతం
చీకటిని చూడవు కదా...




భగ్వాన్

మాణిక్యాల కాంతులకు ఆయన కళ్ళు జిగేల్మనవూ...నల్లటి మేఘాల్లాంటి నీ కురుల్లో ఇరుక్కుపోయిన చంద్రబింబంలాంటి చేమంతి బిళ్ళనించీ, కొండల మధ్యలోంచి దిగిపోయ్యే - అస్తమాన సూర్యబింబంలాంటి హార పతకంలోని గోమేధికాన్నించీ - చూపులు తిప్పుకుంటాడూ..." అంటూ చెప్పుకు పోతున్నది వాసంతిక. ఆమె పలుకుల్లోని రెండో ఉపమానానికి ముసిముసిగా నవ్వు కుంటూ "ఇంక చాల్లేవే, ఇంకా ఎన్ని తగిలిస్తావు గంగిరెద్దుకులాగా" అంది సుగాత్రి.

"అదేం కుదరదమ్మోయ్, ఈ ఆభరణాలన్నీ సజావుగా నీకు అలంకరించకపోతే మీ అమ్మ నా ప్రాణం తీసెయ్యరూ. ఇదుగో ఈ ముత్యాల మురువుల కాంచీదామాన్ని నీ నడుముకు అలంకరించనీ...ఓసి నీ ఇల్లు బంగారంగానూ...మరీ ఇన్ని చుట్లు తిరిగొచ్చిందేమమ్మా ఈ కాంచీదామమూ... అసల్నీకు నడుమనేది ఉన్నట్లా లేనట్లా...ఉండు, ఈ బంగారమ్ములికితో కుట్టివేస్తాను. ఆఁఇక ఈ ముత్యాన్ని బొడ్డుకు తగిలించనీ. ఆఁ శభాష్. నాభ్యగ్రే నవమౌక్తికం! బావుంది. ఇక అయిపోవచ్చింది. ఏవీ ఈ బంగారు పట్టీలు కాళ్ళకు తగిలించనీ" అంది వాసంతిక.

"పట్టీలెందుకే! నడుస్తుంటే ఘల్లుఘల్లంటూ అదో గోల" అంది సుగాత్రి.

"అది గోలటమ్మా నీకు...పట్టీల చివర వరసగ్గా వేసిన చిరుఘంటల్లోని చిన్ని చిన్ని ముత్యాలు - కాళ్ళు కదిలినప్పుడల్లా సంగీతానుసారం లయానుగుణంగా మ్రోగుతుంటే - దాన్ని గోలంటావూ...నడిచేటప్పుడు నీకలా అనిపిస్తుందేమో గాని - మీవారితో నీవు శయ్యాసుఖం అనుభవించేటప్పుడు లయబద్ధంగా మ్రోగే ఆ గంటల సంగీతం ఎలా ఉంటుందో రేప్పొద్దున్న నాకు చెపుదుగానిలే" అంది వాసంతిక.

"ఛీ పోవే, మరీ బరి తెగించావు నువ్వు" అని పక్కనే ఉన్న తామర పువ్వుతో అదిలించబోయింది సుగాత్రి.

ఇంతలో సుగాత్రి ఇతర చెలికత్తెలు గూడా వచ్చారు. "ఇప్పుడట్నే వచ్చేది మంజరీ...?" అంది వాసంతిక.

"ఏదీ ఈ రదనిక తెమిల్తేనా..." అంది మంజరి. అందరూ కలిసి సుగాత్రి అలంకరణను సరిజూడ్డంలో మునిగిపొయ్యారు.

కాశ్మీర రాజ్యంలోని శారదా పీఠం. అది సాక్షాత్తూ శారదా మందిరమే. నాలుగు వేదాల ఘోష అహరహమూ ముఖరితమౌతూ వుంటుంది అక్కడ. మహా పండితులూ, మీమాంసకులు, జ్యోతిష్కులూ, తార్కికులూ, యోగజ్ఞులూ, వైయాకరణులు నిత్యము తమతమ విద్యలను పునశ్చరణ చేసుకుంటూ, అధ్యయన అధ్యాపనాది కర్మలను నిర్వర్తించుకుంటూ - తమ పాండిత్యాన్ని సార్థక పరుచుకుంటారు. ఆ పీఠ ఆవరణ లోనే సరస్వతీ దేవి మందిరం నిత్యపూజలతో కళకళలాడుతూ ఉంటుంది...ఆ దేవాలయ పూజారి పరమ భక్తుడు. మహా పండితుడు. నిష్ఠాగరిష్ఠుడు. కేవలం విద్యాసంపన్నుడే కాదు, రాజులు మెచ్చి ఇచ్చిన మహాసంపదలతో తులతూగే గృహస్తు. అతని ఏకైక పుత్రికే సుగాత్రి. ఆమెకు శాలీనుడనే వరునితో వివాహం జరిపి, ఇల్లరికపుటల్లునిగా అతన్ని తమ ఇంటనే ఉంచుకున్నారు పూజారి దంపతులు. సుగాత్రి శారదాదేవికి పరమభక్తురాలు. ఆమె దయతో సర్వ విద్యలనూ కరబదరి గావించుకున్న విదుషి. రూపంలో అప్సరసలను ధిక్కరించే సౌందర్య పరమసీమ. ప్రాయం వచ్చి వసంత కాలపు పూదోటలా మెరిసిపోతూ భర్తృసంగమానికి తహతహ లాడుతున్న తరుణి.

వైశాఖమాసం. పగళ్ళు పొడుగ్గా ఉండి విసుగు పుట్టిస్తున్నాయి. సాయంకాలం దాటి కనుచీకట్లు పరుచుకుంటూన్న వేళ. మంచు కొండల మీది నుంచి వచ్చే చల్లగాలులముందు గ్రీష్మపు ప్రతాపమంతగా సాగటంలేదు. ఆ రాత్రి సుగాత్రికి భర్తతో ప్రధమ సంధాన ముహూర్తం. అందు కోసమే ఆమెకు ఆ అలంకరణలన్నీను.

చెలికత్తెలు సుగాత్రిని సింగారించడం పూర్తయింది. ఒక్కసారి సర్వభూషణాలంకృత ఐన సుగాత్రిని తనివితీరా చూశారు సావాసగత్తెలు. మన్మధుని వింటివంటి తీర్చిన కనుబొమలు - వాటి క్రింద చేరలకు అందని విశాల నేత్రాలు - అనంత లోకాల వసంతాలను దాచుకున్న కనుపాపలు - సంపంగి పువ్వులాంటి నాసిక - ప్రవాళాల కాంతిని ధిక్కరించే లేత అధరాలూ - తలనిండా పూదండతో - దేహకాంతితో పోటీ పడుతున్న బంగారు ఆభరణాలు - శరీరపు అంగాంగాలకు ప్రత్యేకించబడిన వైవిధ్య భూషణాలంకరణలూ - పరిపూర్ణ యవ్వనంతో పిక్కటిల్లిపోతున్న వక్షస్సూ - చెలికత్తెలకే ఆ అందం సమ్మోహనకరంగా వున్నది.

"ఈ నగలన్నీ భారంగా ఉన్నాయ్" అంది సుగాత్రి.

"అట్లా అనగూడదు తల్లీ, భర్త సౌభాగ్యం కోసం - ఆయన ఆయురారోగ్య సౌఖ్యం కోసం - ఎల్లప్పుడూ స్త్రీ సర్వాభరణాలూ ధరించి వుండాలి. ఎట్టి పరిస్థితుల్లోనూ వాటిని తీయగూ డదు. అది భర్తకు అరిష్టం" అన్నది తల్లి. సుగాత్రి మరేమీ మాట్లాడలేదు.

"ముహూర్తం సమీపిస్తున్నది" అని బయట్నించీ మౌనంగా భార్యకు సూచించి బయటికి వెళ్ళిపోయాడు సుగాత్రి తండ్రి. తల్లీ, చెలికత్తెలూ సుగాత్రి చేతికి పాల చషకం అందించి తలుపు తెరిచి శాలీనుడున్న గదిలోనికి పంపించి - తలుపు దగ్గరగా లాగి - పరస్పరం ముసిముసి నవ్వులతో చూసుకుంటూ వెళ్ళిపోయారు.

సుగాత్రికి బిడియంగా ఉంది. భయంగా ఉంది. వాలిన కనురెప్పలు మెల్లగా ఎత్తి ఒకసారి గదిలోకి చూచింది సుగాత్రి. గదిలో విశాలమైన పర్యంకంమీద తన భర్త ఐన శాలీయుడు పవళించి ఉన్నాడు. వెలుగు ప్రసరించడానికి వీలుగా వ్రేలాడగట్టిన గోళాల రంధ్రాల్లోంచి వెలిగే దీపాల కాంతులు చిరు వెలుగులను చిమ్ముతున్నాయి. పర్యంకపు పందిరిమీది నుంచి కిరణ భేద్యమైన ఆవరణాంశుకం వ్రేలాడుతున్నది. బయటికి తెరవబడిన వాతాయనాల్లోంచి చల్లని సమీర కెరటాలు మలయ పర్వతాలమీదినుంచి చందన సుగంధాన్ని మెల్లగా మోసుకొస్తున్నాయి. తలగడ మీద కుడిచేతినుంచి - దానిపై తల ఆనించి పైకి మడిచిన ఎడమ మోకాలు మీద కుడికాలును విలాసంగా ఉంచి పడుకొని ఉన్నాడు శాలీనుడు. సుగాత్రి తన చేతిలోని పాలచషకాన్ని పక్కనే ఉన్న దేవదారు కలపతో చేయబడిన వలయాకారపు బల్లపై ఉంచి చప్పుడు కానీకుండా తలుపుకు గడియపెట్టి - అక్కడే నిలబడి ఉంది. గడప దగ్గర నులుచున్న సుగాత్రిని - జిగేలనే బంగారు నగల తొడుగుల మధ్య కనిపించీ కనిపించకుండా ఉన్న సుగాత్రిని ఒకసారి అలా చూచి - కనులు మరలించుకున్నాడు శాలీనుడు.

సుగాత్రి శరీరం పారవశ్యంలో తేలిపోతున్నది. ఆమె మనసునిండా మధురోహాలు ఊసులాడుతున్నాయి. ఎంతకాలానికి తన అందానికీ, ప్రాయానికీ సార్థక్యం లభించబోతున్నది. ఎంత

సొగసుగాడు తన భర్త. మూర్తీభవించిన పుంస్త్వం తో, ఆజానులంబాలైన దీర్ఘ బాహువులతో, సమ విభక్తలైన సర్వాంగాలతో బలంగా దృఢంగా కనిపించే శరీరభాగాలతో నిత్యము పెదాలపై తుల కించే చిరునవ్వు కోరమీసంతో వొరుసుకుని మబ్బుల మధ్యలోంచి వచ్చే చంద్రకిరణాల వెలుగు లాగ తొంగిచూస్తుండగా - ఆయన్ను చూసి మైమ రచి పోయేది. వేద వేదాంగాలను ఆచమించిన మహాపండితుడు తన భర్త. సోయగంలో నలకూబ రుని తలదన్నే రూపసి. అతని బలిష్ఠమైన చేతుల పంజరంలో రామచిలుకనై - అతని ఊపిరి తన సర్వాంగాలకూ వీవన వీస్తుండగా - ఈ రాత్రిని ఏమి - ఈ బ్రతుకంతా అతని పాదాలకడ నైవే ద్యంగా సమర్పించి స్వర్గ సౌఖ్యాలను అనుభవిస్తూ జీవితాన్ని సార్థక పరచుకోవాలి. అదుగో... ఇక అతను వస్తాడు. తనను కౌగిట్లో అదుము కుంటాడు. తన పెదాలపై అతని అధరాలను ముద్రి స్తాడు. తనను సుతారంగా ఒక పూదీవను ఎత్తుకు న్నట్లు తన రెండు చేతులతోనూ అలవోకగా ఎత్తు కుని ఎదకు హత్తుకుని - పర్యంకానికి చేర్చి నా స్త్రీత్వానికి సార్థకత కల్పిస్తాడు. అదుగో ఇక వస్తా డు...అనుకుంటూ - తీపి తలపులతో తేలిపోతూ ఒకసారి కనులెత్తి - ద్వారం దగ్గరినుంచీ పర్యంకం వైపు చూచింది సుగాత్రి. శాలీనుడు అటువైపు తిరిగి పండుకొని - నిద్రాదేవి పరిష్వంగంలో మునిగిపోయి ఉన్నాడు. ఒక్కసారిగా వాస్తవ లోకం లోనికి వచ్చింది సుగాత్రి. ఆశ్చర్యపడింది. ఆశా భంగం చెందింది. అలానే ఆ ద్వారం దగ్గర నిల్చు న్నది చాలాసేపు. తర్వాత అక్కడే కూలబ డింది. ఏ భావమూలేని మనస్సుతో- ఏ స్పందననూ రానివ్వని హృదయంతో- రాత్రంతా అక్కడే కూర్చుని గడిపింది. వారిరువురి మధ్యా ఆ నిశీధి ఒక నిశ్శబ్ద తిమిరాన్ని యవనికలా పరిచింది.

తెల్లవారింది. గదినుంచి బయటకు వచ్చిన సుగాత్రిని చెలికత్తెలూ, తల్లీ చూశారు. సుగాత్రి పెదవులమీద చిరునగవు మెరుస్తూనే ఉంది. కన్నుల్లో తెచ్చిపెట్టుకున్న ఆనందం వెలిగిపోతూనే ఉంది. కానీ నలగని ఆమె శరీరమూ, చెదరని ఆమె కురులూ, తొలగని ఆభరణాలూ - ఇవేవీ ఆమె చిరునవ్వు వెనకాల దాచాలనుకున్నా వాస్త వాలను దాచలేకపోయినాయి. నిశ్శబ్దంగా ఆ పగలు గడిచిపోయింది.

రెండవనాటి రాత్రి కూడా అదే కథ. మూడో రాత్రీ, ఆ తర్వాత మరికొన్నిరాత్రులు కూడా మొదటి రాత్రి చరిత్రనే పునరావృతం చేశాయి. శాలీనునిలో చలనం లేదు. అతడు సుగాత్రిని గమ నించిన సూచనలే లేవు. ఆమె తన శయన మంది రంలోకి రాదగిన తన జీవన సహచరి అనీ, తమ కాపురపు సార్థక్యానికి సన్నద్ధపరచబడిన సందర్భం అది అనే గుర్తింపే అతనిలో లేదు. సుగాత్రి నిర్వేద పడింది. అంతేగాని అధైర్య పడలేదు. తొందర పడలేదు. అన్నిటికీ ఆ శారదా మాతయే వుంది అనుకుంది. రాత్రులన్నీ అలాగే - శయ్యాగతుడై శాలీనుడూ, ద్వారం దగ్గర నిలువు కొలువు చేస్తూ సుగాత్రి - గడిచి పోతున్నాయి

సుగాత్రి ఎంత దాచిపెట్టాలని చూచినా తల్లి మనసు గుర్తించలేక పోతుందా...!చెలికత్తెలు ఆ మాత్రం గ్రహించలేరూ...తల్లికి మనసు కరిగి పోయింది. కొడుకుల్లేని తమకు కూతురి కడుపున ఒక నలుసు పుడితే తమ అనంత సంపదలకే కాక తాతగారి వైభోగానికీ, వైదుష్యానికి వారసు డౌతాడని ఆశించింది. తన కూతురు శారదామాత కృపను పొందిన యువతి. ఆమెకు గొప్ప భవిష్య త్తుందనీ, ఆమె కాపురం నవనీత భాండంలాగా పొంగారుతుందనీ జ్యోతిషులు చెప్పారు. కానీ ఇలా అయిందేమిటి? ఆమెకు అల్లుని మీద - అత్తకు రావల్సినంత కోపమూ వచ్చింది. నిలదీసి నిందిం చబోయింది.

"అమ్మా...వారినేమైనా అంటే నా మీద ఆన. నా ఖర్మకు మీరేమి చేస్తారు.? నా భాగ్యమిం తేనని అనుభవిస్తాను" అని తల్లిని వారించింది సుగాత్రి. "మీరైనా చెప్పండే" అని చెలికత్తెలకు చెప్పి వెళ్ళిపోయింది సుగాత్రి తల్లి.

"మొగవారికి వారి కారణాలేమో వారికుం టాయి. బెట్టు చేస్తూనే ఉంటారు. నువ్వూ అలాగే - నీ ప్రయత్నమేదీ చేయకుండా ఊరకుండిపోతే ఎలా? ఆకు మడుపులందివ్వు. కాళ్ళుపట్టు. వీవనతో విసురు. చెమటను నీ పైటకొంగుతో తుడువు. అలా నిరంతరమూ భర్త సాన్నిధ్యంలో ఉండి సపర్యలు చేస్తూ ఉంటే ఒకసారి కాకపోతే ఒకసారైనా కన్నెత్తి కనికరించక పోతాడా, పన్నెత్తి పలకరించకపోతాడా, పరువంలో ఉన్న స్త్రీ పక్కనే ఉండి పరిచర్యలు చేస్తుంటే ఏ స్పందనా లేకుండా ఉండడానికి మీ ఆయన శుక మహర్షా ఏం?" అంటూ హితబోధలు చేశారు ఇష్టసఖులు. వారు చెప్పిన అన్ని ఉపాయాలనూ ఆచరించి చూసింది సుగాత్రి. ఏమీ ప్రయోజనం కనిపించలేదు. శాలీనుడిలో చలనం లేదు. సుగాత్రి ఉనికినే అతడు గుర్తించడం లేదు.

రోజులు గడిచిపోతున్నాయి. తన కూతురి కాపురం తలచుకొని నిర్వేదం చెందుతున్నది తల్లి. పరిపూర్ణ యౌవన, మీదు మిక్కిలి విదుషీమణి. లోక వృత్తం బాగా ఎరిగిన ఔచిత్యమతి. శారదాదేవి కృపావరం ఫలితంగా ప్రభవించిన కారణ జన్మి. అప్సరసలను తలదన్నే సౌందర్యంతో వెలిగిపోయే సుగాత్రి ప్రాయము ఇలా అనుభవానికందని అరణ్యచంద్రిక కావలసిందేనా! శాలీనుడి మీద బాగా కోపంవచ్చింది ఆమెకు. ఒక రోజు కూతురు కానని సమయంలో "ఇలా ఏ పనీ చేయకుండా దండగ్గా కూచుంటే ఎవరిని సంతోషపెట్టటానికి నాయనా! అలా వెళ్ళి మనతోట పనైనా చెయ్యొ చ్చుగా" అని ఎత్తి పొడిచింది అల్లుడిని.

ఆ మాటల్లోని నిష్ఠూరం శాలీనుడి మదికెక్క లేదు. అతనికీ ఊరికే తిని కూర్చోవడం- ఏ పనీ లేకపోవడం - విసుగ్గానే ఉంది. అత్తగారు సూచిం చిన తోట పని మంచి వ్యాసంగంగానే అనిపిం చింది. మామగారి పొలం పక్కనే ఉన్న తోట దగ్గ రికి పోయి పరికించి చూశాడు.

ఎవరూ శ్రద్ధ తీసుకుని ఆ వనాన్ని సంబాళి స్తున్నట్లు లేదు. కంచెలు పోయి వున్నాయి. పిచ్చి లతలు పెరిగే మొక్కలకు అడ్డం పడుతున్నాయి. సకాలంలో మొక్కలకు నీరందడంలేదు. వెంటనే ఆ తోటను సక్రమంగా చేసేందుకు నడుంబిగిం చాడు. మొక్కల పాదులు సరిజేసాడు. బావి దగ్గ ర్నించి బోదకాలువలు త్రవ్వాడు. పిచ్చిమొక్కలు లాగేశాడు. వాడిపోయిన పూదీవెలకు ఆలంబనలు ఏర్పాటు చేశాడు. పందిర్లు బిగించాడు. ఏతం ఎక్కి బావినీరుతోడి బోదకాలువల ద్వారా తోట లోని చెట్లన్నిటికీ పారించాడు. అంట్లు కట్టాల్సిన చోట కట్టాడు. ఈ పనిలో మునిగి పోయి అఖండ మైన ఆనందాన్ని పొందుతూ రోజూ ఆ తోట - దాని సంరక్షణా ఏక ధ్యేయాలుగా చూసుకొని ఒక మనోహర నందనాన్ని సృష్టించాడు శాలీనుడు.

సుగాత్రికి తన భర్త చేస్తున్న శ్రమ అర్థమౌ తున్నది. ప్రతిరోజూ అతను తోటనుంచి ఇంటికి వస్తుంటే ఎదురేగి చెమట నిండిన శరీరాన్ని చీర చెంగుతో తుడవాలనుకుంటుంది. అతని పాదా లను సంవాహనం చెయ్యాలనుకుంటుంది. అతను చేసే కాయకష్టం తలచుకొని ఎంతో సహను

భూతితో దగ్గరకు చేరి సేదతీర్చాలనుకుంటుంది. కానీ శాలీనుడి నుండి ఒక్కచూపు...ఒక్క పలక రింపు...ఏమీ ఉండదు. నిరాశతో నిట్టూరు స్తుంది సుగాత్రి.

వైశాఖం వెళ్లిపోయింది. జ్యేష్ఠం గతించింది. ఆషాఢం సగపడా గడిచింది. చిటిపోటి చినుకులు ప్రారంభమైనాయి. కొండ కొమ్ముల్ని దాచుకునే గున్న ఏనుగుల్లాగా కడుపునిండా నీళ్లను దాచు కున్నట్లగపడే మబ్బులు ఉరమడమేగాని వర్షిం చడం తక్కువగా ఉంది. శ్రావణం కూడా ప్రవేశిం చింది.

ఆ రోజు మధ్యాహ్నం రెండో జాము గడిచి పోయింది. తూర్పునించి మెల్లగా – గర్భభారంతో నడిచే నెలలు నిండిన తరుణుల్లాగా మబ్బులొక దానివెంటొకటి కదుల్తున్నాయి. అడపా దడప ఒకటి అరా మెరుపులూ – సన్నధ్వనితో మొదలై రవం పెంచుకునే ఉరుములు ఉన్నట్టుండి సన్న గాలి పెరతరమగా – ఒక్కటిగా కలిసిపోయి – ఆకాశా న్నంతా ఆక్రమించి – ఊరికి ఉత్తరం వైపుకు వొంగి వర్షించడం మొదలు పెట్టాయి మేఘాలు. క్రమంగా దిక్కుల్ని ప్రతిధ్వనింపజేస్తూ ఉరుములు జోరైనాయి. మింటిని చీలుస్తున్నట్లు – శంపాలతలు నల్లటి మబ్బులు సృష్టించిన చీకట్లను పరపరా కోస్తున్నాయి. భూనభోం తరా ళాలు ఏకమైనట్లుగా– ఏనుగు తొండాలంత ధారల్తో – కుంభద్రోణంగా – ఘణంఘణ ఘోషణ భీషణ ంగా వర్షం నిలబడి కురిసింది. ప్రళయం వచ్చిందా అన్నట్లు మ్రోగు తున్న ఉరుములుముకూ అర్జునః ఫల్గుణః పార్థః కిరీటీః శ్వేతవాహనా అంటూ ఇంద్ర కుమారుడైన అర్జునుని పదిపేర్లు స్మరిస్తూ జనం బెంబేలెత్తి పోయారు. పొద్దు వాటారడానికి ఇంకా రెండు గడియల సమయముందనగా – వర్షం తన ప్రభా వాన్ని ఆపింది. మబ్బులు తమ జీవనాన్ని పూర్తిగా వొంపేసుకుని అస్తిత్వ విహీనాలై అభావమై పోయాయి. ఆకాశం మళ్లీ నిర్మలంగా తయారయి – లోకం తెరపిన పడింది.

ఈ భయంకర వర్షంలో తన భర్త తోటలో ఎట్లున్నాడో అని భయం కలిగింది సుగాత్రికి. ఎక్కడైనా తల దాచుకున్నాడో లేదో! బాగా తడిసి పోయాడో – ఏ చెట్టయినా విరిగిపడి ఇబ్బంది కలి గించలేదుకదా!అని వణికిపోయింది. పోయి చూసి వద్దామని బయలుదేరింది. భర్త సౌభాగ్యం కొరకు తన శరీరంనిండా ధరించిన స్వర్ణాభర ణాలన్నీ జాగ్రత్తగా అలాగే ఉంచుకొని భర్తకోసం ఆయనున్న ఉద్యానవనానికి వెళ్ళింది సుగాత్రి.

తోటంతా బురద. అప్పుడే కురిసి వెలిసిన వానకు నీళ్ళు అడ్డదిడ్డంగా పారుతున్నాయి. తీగలు చెదరి పోయాయి. తన భర్త ఎంతో ఏకాగ్రతతో నీటిని కాలవలకు మళ్ళిస్తూ, చెదరిన తీగలు సరి చేస్తూ, పొదలు సరిచూస్తూ శ్రమపడుతున్నాడు. ఆయనొక్కడే పడుతున్న శ్రమను చూడలేక పోయిం ది సుగాత్రి. తనూ తోటపనిలో పాలు పంచుకో వాలనుకున్నది. వెంటనే తన శరీరంమీద ఉండే అన్ని ఆభరణాలను తీసివేసి–తన చేతిగుడ్డలో మూటకట్టి – గుర్తుగా ఒక చెట్టుక్రింద పెట్టింది. చీరకొంగును నడుముచుట్టూ బిగించింది. పాదా ల్దాకా జీరాడే చీరను పిక్కలపైకి బిగిసేటట్లుగా కాసెలాగా బిగించి వెనక్కు దోపుకున్నది. శ్రామిక యువతిలాగా తయారయి – భర్త పక్కనే తనూ కూర్చుని మట్టిని తొలగిస్తూ తీవలని సరిచేస్తూ, కాలవలను మళ్లిస్తూ, పిచ్చిమొక్కలను లాగేస్తూ – పనిలోని ఆనందాన్ని ఏకాగ్ర వ్యగ్రంగా అనుభవిస్తూ భర్త ఉనికిని గూడా మరచిపోయి వన సంరక్షణ గావిస్తున్నది. తను చేస్తున్న పనిలోంచి తలెత్తి పక్క కు చూసిన శాలీనుడికి – తోటపనిచేస్తూ – పొదల మధ్య పూల రాశిలాగా కూచున్న సుమగాత్రి – సుగాత్రి కనిపించింది. ఆశ్చర్యం కలిగింది అతనికి. తన భార్య ఎప్పుడొచ్చింది ఇక్కడికి– వంగి కలుపు మొక్కల్ని తొలగిస్తూ – చేతికందిన బురద ముఖా నికి అంటకుండా మోచేతితో ముంగురులను సరి జేసు కుంటూ ఉన్న సుగాత్రిని అలాగే చూస్తూండి పోయాడు.

కంటి రెప్ప మీద – చెట్టు ఆకుమీది నుంచి జారిపడ్డ – నేటిచుక్క – కాటుకతో కలిసి– నల్లగా చెంపమీదికి జారుతూ బంగారురంగులో మెరిసిపోయే నాసాపుటందాకా వచ్చి ఆగిపోయింది. నుదుట పుట్టిన చెమట చుక్క సిందూరంతో కలిసి కనుబొ మల మధ్యగా జారి ముక్కుకొసకు వచ్చి – నాసాగ్రే నవమౌక్తికమై నిలబడింది. బిగించి కట్టిన కంచు కమ్మీద తిరుగుబాటు ప్రకటిస్తూ – బయటికి దూకేందుకు విశ్వప్రయత్నం చేస్తున్న వక్షోజాలు మనోహరంగా కన్పిస్తున్నాయి. కంచుకానికీ చీరకూ మధ్య మెరిసిపోతున్న జఘనభాగపు ముడతలు – అపూర్వశోభతో స్త్రీత్వానికి పరాకాష్ఠలుగా కన్పిస్తు న్నాయి. కాసె బిగించి కట్టడంలో అనాఛ్ఛాదితంగా వున్న పిక్కలు వింతకాంతితో వెలిగిపోతున్నాయి.

ఆ అందాల పరసీమను – ఆ సమయంలో – ఆ సమ్మోహన రూపంలో అనుకోకుండా చూసిన శాలీనుడు ఆశ్చర్యపోతూ లేచి నిలబడి – దగ్గరికి పోయి "నువ్వెప్పుడొచ్చావు సుగాత్రి ?" అన్నాడు. ఉలిక్కిపడిలేచి – ఎదురుగా అబ్బురపు చూపులను చూస్తున్న భర్తను చూసి సిగ్గుపడి – తలవంచు కున్నది సుగాత్రి.

"ఈ శ్రమ నీకెందుకు సుగాత్రీ...చూడు ఎలా చెమట పోసిందో...బుగ్గదగ్గర బురదంటింది. ఉండు తుడుస్తాను" అంటూ తన చేతితో ఆ బుర దను తొలిగించాడు. ఆమె నుదుటిమీది చెమట చుక్కలను ఉత్తరీయంతో తుడిచాడు. "అలవాటు లేని పనితో ఎంత అలసి పోయావో చూడు. పెదా లెల్లా వణుకుతున్నాయో" – అంటూ అధరాలను సుతారంగా నిమిరాడు. అతి సామీప్యంతో– పరు వంలోని అందాల సుందరి నిరాభరణ నిసర్గ సౌం దర్యం శాలీనుణ్ణి ఉత్తేజితుడిని చేసింది. మనసులోని సుగాత్రి మీది అఖండ ప్రేమ ఒక్కసారిగా పొం గింది. ఆమెను ప్రణయంతో తమకంతో కౌగిలిం చుకుని తన వక్షానికి అదుముకున్నాడు. అంత దాకా భర్త నిరాదరణతో వేగిపోతున్న సుగాత్రి ఈ అనూహిత, అయాచిత అవకాశానికి పొంగిపోతూ భర్తను పెనవేసుకున్నది. చక్కని ఏకాంతమూ, చల్లని సాయంత్రమూ, ఎలప్రాయమూ, ఎదురుచూపూ, అవకాశమూ – శాలీనుడు ఒక పూదీగను ఎత్తుకు న్నట్లు సుగాత్రిని రెండుచేతులతో పైకెత్తుకుని – పొగడ చెట్టుకింద పోగైఉన్న పండుటాకుల – తడి సెజ్జమీదకి చేర్చాడు. అధరాధరాల మృదుల లాలనతో – అంగాంగాల మధుర లాలనతో మన్మథ మహాసంగ్రామం మొదలైంది. అంతకు ముందే కురిసి వెలిసిన అద్భుతమైన ఉధృత వర్షం లాగా – ఆ దంపతుల ప్రథమ సంగమంలో శృంగార వర్షం కొండల మీంచి దూకే ఝరీపాత వేగంతో మరోసారి కురిసింది. అక్కడ కొంతసేపు కాలం అలా నిలబడిపోయింది.

ఆ మునిమాపు తనకు తెరిచిన నందన ద్వారంలోంచి మరునాటి రాత్రి – తమ శయ్యా గృహం ప్రవేశించింది సర్వా భరణ భూషితురాలై సుగాత్రి. శాలీనుడు ఒకసారి తలెత్తి ఆ బంగారు ప్రోవు వంక చూసి తల తిప్పుకున్నాడు. మామూలు ధోరణి మళ్లీ మొదలు...మనసు చివుక్కుమన్నది సుగాత్రికి. తన సిగ్గును పక్కన బెట్టి – మెల్లగా భర్త శయనించివున్న పర్యంకం వద్దకు చేరింది. కొద్ది

సేపు భర్తకు పాదాలొత్తింది. వీవనతో విసిరింది. భర్త నుంచి ప్రతిక్రియ లేదు. ఆయన తన ఉనికినే గుర్తించలేదు. పంతం వచ్చింది సుగాత్రికి. పక్కకు తిరిగి పండుకొని ఉన్న శాలీనుని ముఖం వద్దకు తన ముఖం చేర్చి, భుజంమీద చెయ్యి వేసింది. శాలీనుడు అసహనంగా ఆ చేతిని తొల గించి "ఇప్పుడేం పనిమీద వచ్చావ్?" అని అడి గాడు. సుగాత్రి నిర్ఘాంతపోయింది. రోషంతో "ఈ సమయంలో ఏ భార్యఐనా భర్త దగ్గరకు ఎందు కొస్తుంది?" అని అడిగింది సిగ్గును అవలకు నెట్టి. శాలీనుడు ఆ మాటలేవీ పట్టించుకోకుండా ఆమె నుండి దూరంగా జరిగి అవతలి వైపుకు తిరిగి పండుకొని కండ్లు మూసుకున్నాడు.

సుగాత్రికి అర్థమైంది, భర్తకు తన మీద ఎటువంటి భావమూ లేదని. బహుశా అతను వేరే యువతి ఎవరి మీదైనా మనసు పడ్డారేమో నని అనుమానపడింది. సుగాత్రి ఉత్తమ పరంపరా సంజాత. శారదాదేవి వరాన జన్మించిన స్త్రీ. సంస్కా రవతి. భర్త తనకు విముఖుడైనా తాను ఆయనకు విముఖురాలు కాలేదు. ఆయన్ను ద్వేషించలేదు. నిరసించలేదు.

"పోనీ మీ మనసులో వేరెవరైనా ఉన్నారా చెప్పండి...మీమధ్య నుంచి నేను ఆనందంగా తప్పు కుంటాను" అని పలికింది. శాలీనుడు అది విన్నాడో లేదో తెలియదు. కనులు మూసుకుని అటు తిరిగి పడుకున్న భర్తను చూసి నిట్టూర్చింది సుగాత్రి.

మరునాడు మళ్లీ సర్వాభరణాలూ ధరించి భర్త ఉన్న తోట దగ్గరికి పోయింది సుగాత్రి. తోట నూ, నవనవోన్మేషాలైన మొక్కలను, రూపు దిద్దు కుంటున్న కోరకాలనూ, వికసిస్తున్న పూలనూ, పూల చుట్టూ రొద చేసుకుంటూ తిరిగే షట్ప దాలనూ చూస్తూ మైమరచి పోయింది. అసంక ల్పితంగా తన సర్వాభరణాలనూ మళ్లీ తీసి - మూటకట్టి గుర్తుగాదాచి కొంగు బిగించి శ్రామిక కన్యలా మారి ఎంతో ఇష్టంగా తోటపనిలో మునిగి పోయింది. ఆమెను చూసి ఆమె నిరలంకృత, నిసర్గ, రమణీయమైన సోయగాన్ని చూసి మురిసిపోతూ శాలీనుడు ఆమెను కౌగిట్లోకి తీసుకోవడమూ, ఇద్దరూ మరలా ఆ వనమధ్యంలోని కుంజాల మాటున మదన కదనంలో మైమరచి పోవడమూ, క్రితం సాయంకాలపు చరిత్ర పునరావృతం కావ డమూ జరిగి పోయింది.

ఆ వనమధ్యంలో పొగడ పూలచెట్టుకు ఆనుకుని మోకాళ్లను ముందుకు మడుచుకుని కూచుని వుంది సుగాత్రి. ఆమె వొడిలో తొడలమీద తన తలనుంచి కనులు మూసుకుని దీర్ఘమైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో - తాను కొల్లగొన్న మన్మథ మహా సుఖాన్ని పునశ్చరణ చేసుకుంటున్నాడు శాలీ నుడు. సుగాత్రి తన పైటకొంగుతో అతని నొసటినీ, ముఖాన్ని తుడిచి కొనవేళ్ళతో అతని అధరాన్ని నిమిరి, అతని కోరమీసాన్ని సవరిస్తున్నది. నెమ్మ దిగా కనులు తెరచిన శాలీనుడు తన కనుల కెదురుగా తనవైపే చూస్తున్న రాకా చంద్రబింబం లాంటి సుగాత్రి ముఖాన్ని చూచి, సన్నగా నవ్వి ఆ ముఖాన్ని తన ముఖందగ్గరకు లాక్కుని ప్రాణా లు జివ్వుమనేట్లు గాఢంగా చుంబించాడు. పరవ శించిన సుగాత్రి "ఇంత ప్రేమ ఉన్నవారు అన్ని రాత్రిళ్లు నన్ను అంత బాధ పెట్టారెందుకో...దగ్గరికి చేరినా నావైపు కూడా చూడకుండా ఉపేక్ష చేశారెం దుకో..." అంది. "నేనా! నిన్ను ఉపేక్ష చేశానా? నువ్వు నా దగ్గరికి వచ్చావా?" అన్నాడు శాలీ నుడు. "మగవారు, ఎంతకైనా తగుదురు. మరీ అంత ఆశ్చర్యం నటించకండి. ఎన్ని రాత్రులు నేను మన శయ్యామందిరపు తలుపు దగ్గర దారువునై నిలువు జీతపు కొలువు చేశాను! మీరు కడగంటి చూపైనా నా మీద ప్రసరింప జేయలేదు కదా"- అంది సుగాత్రి.

"అదేంటి సుగాత్రీ అలా అంటావు! తలుపు దగ్గర రక్తమాంసాలున్న ఏ స్త్రీ నాకు కన్పించలేదు. బంగారు ఆభూషణాల ప్రోవు ఒకటి నిలబెట్టబడి వున్నట్లగుపించేది. అది నా భ్రమేమో అనుకునే వాడిని" అన్నాడు శాలీనుడు.

గుండె ఝల్లుమంది సుగాత్రికి. అయితే తనకూ తన మనోహరునికీ మధ్య ఇంత కాలమూ అడ్డం నిల్చున్నవి తన స్వర్ణాభరణాలా...వంశాను గతంగా వస్తున్నాయనీ, అవి భర్త శ్రేయస్సుకోసం ధరించాల్సినవనీ తల్లి బలవంతంమీద అలంకరిం చుకుందేగాని అవే తన ప్రణయ జీవితానికి అభ్యంతరాలౌతాయని అనుకోలేదు. తనకు మాత్రం ఆ హేమ ఆభూషణాల మీద వ్యామోహ మేమీ లేదు. కేవలం తల్లి ప్రోద్బలమే. పోనీ ఇంత కాలానికైనా తనకూ తన ప్రాణేశ్వరునకు మధ్య అఖాతాన్ని సృష్టించినవేవో తెలిసాయి. ఐనా అత్త మామలు ఇచ్చే రత్న రాసుల మీద, భార్య తీసుకు వచ్చే పసిడి కాసులమీద, అసలు సంపదలమీదనే వ్యామోహంలేని నిజమైన మగసిరిగల పురుషుడు తన భర్త. తన వొంటిమీదున్న నగల వలన కాక తనను తనునుగా ప్రేమించే స్వచ్ఛ మనస్వి తన మనోహరుడు. సుగాత్రి మనస్సెంతో ప్రఫుల్ల మయింది. ఆనాటినుంచి ఏ ఆడంబరాలూ లేని నిసర్గ ప్రణయోద్యానంలో ఆ వనంలోనే ప్రతిరోజూ వారి ఎలప్రాయాలు పుష్ప భ్రమరాయ మాణాలై నాయి.

కూతురు ముఖంలో తాండవిస్తున్న ఆనం దం సుగాత్రి తల్లికి క్రొత్తగా కనిపించింది. కూతురూ అల్లుడూ అన్యోన్యానురాగంతో తమ బ్రతుకులను పండించుకోవడం ఆమెకు అమితానందం కలిగిం చినా - ఏదో కొంచెం కొరవ ఆమె మనస్సులో...!

ఒక రోజు కూతురితో యథాలాపంగా అన్నది తల్లి..."సుగాత్రీ! నువ్వు సంతోషంగా ఉండటం నాకూ సంతోషం కలిగించే ముచ్చటే! కానీ మనం అనాదినుంచీ కొన్ని పద్ధతులకూ కట్టు బాట్లకూ నిబద్ధులమైన వాళ్లం. శాస్త్రాలేమి శాసిస్తు న్నాయో ఆ ఆదేశాలను తుచ తప్పకుండా ఆచరించే వాళ్లం. ఏది, ఎప్పుడు, ఎక్కడ, ఎలా, ఎందుకు చేయాలో ప్రతీదానికీ మనకు శాస్త్ర నిర్దేశమే శిరో ధార్యం. సమయాసమయాలు లేకుండా ఎక్కడంటే అక్కడ శృంగార క్రీడలు సలుపరాదమ్మా. ఈ విశృం ఖలత వల్ల దుర్గుణ పూరితులైన సంతానం జన్మి స్తారు. శారదామాత ఈ బరితెగింపును అంగీకరిం చదు" అని కూతురికి బోధించింది.

"లేదమ్మా, ఇప్పుడు నాకు ఏ సందేహమూ లేదు. నా పతికి ఏది ఇంపవుతుందో అదే నాకు అవశ్య శిరోధార్యం. అతనికి నచ్చనిది నాకు వద్దే వద్దు. ఈ సూత్రమొక్కటే ఇక నాకు మార్గ దర్శకం. భగవంతుడూ, వేదమూ, గురువూ, శాస్త్రమూ అన్నీ ఇంక నా భర్తే! ఆయన అభీష్టాలను నిర్వర్తిం చుకోవడంలో నేను ఏ శాస్త్రాన్ని, ఏ నిషేధాన్ని లెక్క చేయను. నాభర్తకు ఏది నిషిద్ధమో దానిని నేనొల్లను. ఆయనకేది విహితమో దానిని నేను మానను. నిజానికి శారదామాత నా ఈ అభిప్రా యాన్ని ఆశీర్వదిస్తుందే కాని నిరసించదు" అంటూ పూజా మందిరంలోని భారతీసతి సన్నిధికి పోయి సమస్కరించింది సుగాత్రి.

స్వచ్ఛ శరజ్యోత్స్నల్లాంటి నవ్వులను వెలా రిస్తూ - సుగాత్రిని ఆశీర్వదిస్తున్న చూపులను వాణి వెలయిస్తున్నట్లు తోచింది ఇద్దరికీను. తృప్తిగా తలవంచి చేతులు జోడించారు ఇరువురు.

# మాయమై పోతున్నవమ్మా!

ఎనభయ్యవ దశకం పూర్వార్థంలో స్నేహితుడొకడిచ్చాడని చెప్పి మా పిల్లలు ఓ తెలుగు సినిమా క్యాసెట్ ఇంటికి పట్టు కొచ్చారు. కాసెట్ అయితే వుంది కానీ, దాన్ని టీవీ (నలుపు తెలుపు) తెరపై చూడడానికి వీడియో కాసెట్ ప్లేయర్ (వీసీపీ) లేదు. నాదా దొరికిందని ఘోడా కోసం వెదికినట్టు చిక్కడపల్లిలో ఓ షాపునుంచి దాన్ని గంటకు ఇంత అని రెంటుకు తీసుకొచ్చి, ఇంట్లో ఆ సినిమా చూసాం. ఆ తరువాత అందరి ఇళ్లలో వీసీపీలు, వీసీఆర్‌లు గృహప్రవేశం చేశాయనుకోండి. అది వేరే కథ.

మళ్ళీ చాలా ఏళ్ళ తరువాత - మా బావగారు, బెజవాడలో సీనియర్ న్యాయవాది తుర్లపాటి హనుమంతరావు పంతులు గారి డెబ్బయ్యేడవ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకుని *1995*లో తీసిన వీడియో క్యాసెట్ చూడాలనిపిస్తే, వీసీఆర్ అనే పరికరం ఇళ్లల్లోనే కాదు, షాపుల్లో కూడా మాయమైపోయింది. ఒకప్పుడు వీసీఆర్ ఇంట్లో ఉంటే ఘనంగా చెప్పుకునే వాళ్ళు. ఇప్పుడా మాట చెబితే నమ్మేవాళ్ళు వుండరేమో!. ఎందుకంటే ఈ నాటి పిల్లలకు ఆ నాటి వీడియో క్యాసెట్లు, వీడియో ప్లేయర్లు చూసి వుండే అవకాశం లేదు కాబట్టి.

## భండారు శ్రీనివాసరావు

ఆ మధ్య పేపర్లో ఓ వార్త చదివాను.

అందుబాటులోకి వచ్చిన టెక్నాలజీ పుణ్యమా అని, ఉత్తరాలు చదవడం దగ్గరనుంచి, టెలిఫోన్ డైరెక్టరీ చూడడంవరకు అనేక పనుల అవసరం ఇప్పుడు జనాలకు లేకుండా పోయిందని ఓ సర్వే తేల్చిందట. ఇలాంటివి దాదాపు యాభయ్ దాకా వున్నాయని కూడా ఆ సర్వే సారాంశం.

నెట్ ప్రపంచం ఆవిష్కృతమైన దగ్గరనుంచి లోగడ ప్రజలు అలవాటు పడిన అనేక పనుల అవసరం నేటి ప్రపంచంలో లేకుండా పోయింది. వెనుక ఏదయినా ఫోను నెంబరు కావాల్సివస్తే డైరెక్టరీతో పనిపడేది. ఇప్పుడు వాటిని చూసేవారే లేరు. ఇంటర్ నెట్ వినియోగం ఇంకా పూర్తిగా వ్యాపించని కొన్ని దేశాల మాటేమోగాని ఇప్పుడు అనేకానేక దేశాల్లో రైల్వే బుకింగ్ కౌంటర్లకు వెళ్లి ప్రయాణాల టిక్కెట్లు కొనుక్కునే వారి సంఖ్య నామమాత్రంగా మారుతోంది. పోస్ట్ కార్డులు, పబ్లిక్ టెలిఫోన్ బాక్సులు, ఫోటో ప్రింటింగ్, టెలిఫోన్ నెంబర్లను గుర్తుగా రాసుకునే చిన్నిచిన్ని పుస్తకాలు వేగంగా కనుమరుగైపోతున్నాయి.

మాయమై పోతున్న అంశాలు మననం చేసుకుంటున్నప్పుడు ఆత్మీయులు, తెలంగాణా ప్రభుత్వ సాంస్కృతిక సలహాదారుడు కె.వి. రమణాచారి గారి జన్మదినం సందర్భంగా హైదరాబాదు రవీంద్రభారతి ప్రాంగణంలో ఈ మధ్య జరిగిన హరికథా ఉత్సవాలు, ఒకనాడు తెలుగునాట వూరూరా ప్రాచుర్యం పొందిన హరికథను గుర్తుచేసాయి. హరికథల కథాకమామిషు తెలిసిన మిత్రులు ఆర్వీవీ కృష్ణారావు గారు చెప్పిన అనేకానేక అంశాలతో కూడిన హరికథా గానం ఇది... చదవండి.




"మనకు ఇష్టంలేని కబుర్లు ఎవరయినా చెపుతుంటే ఈ హరికథలు చాల్లేవోయి అంటూ ఉంటాము. కానీ హరికథలంటే బోరుకొట్టే కథలు మాత్రం కాదు. హరికథలు ఒకానొక కాలంలో జనాలను కట్టిపడేసిన భక్తిరస ధునులు. పండిత పామరులను సమ్మోహితులను చేసిన శ్రవణానందకర ధ్వనులు.

"చాన్నాళ్ళుగా ఈ ఛానళ్ళ ప్రోగ్రాములు చూసి చూసి విసుగెత్తి పోయినప్పుడు శ్రీ వెంకటేశ్వర భక్తి ఛానల్ కాని, భక్తి ఛానల్ కాని చూడడం ఈ మధ్య తెలియకుండానే ఒక అలవాటుగా మారిపోయింది. నిజంగా పెద్ద రిలీఫ్. ఆ మధ్య ఎస్.వి.బి.సి. ఛానల్‌లో ఉమామహేశ్వరి గారి హరికథ చూపించారు. ఎంతో బాగా చెప్పారు. మరపున పడుతున్న మధుర జ్ఞాపకాలను తమ హరికథాగానంతో తట్టిలేపారు.

"ఈనాటి పిల్లలకు కానీ, ఇంకా చాలామంది పెద్దవాళ్ళకు కాని హరికథ అనే ప్రసిద్ధ కళారూపం వొకటి వుందని కూడా తెలియదేమో అనిపించే రోజుల్లో జీవిస్తున్నాము. హరికథ ఎంత గొప్పదో ఆ కథ విన్నవారికి తెలుస్తుంది. ఎనభయ్యో దశకంలో కూడా హరికథ ప్రభావము ఎంతో కొంత వుండేది.

"యాభయ్, అరవై దశకాల్లో అయితే హరికథ ఒక వెలుగు వెలిగింది.




హరికథా పితామహులు ఆదిభట్ల నారాయణదాసు భాగవతార్

దేవాలయాల ఉత్సవాలలో, వినాయక చవితి, దేవి నవరాత్రుళ్ళు, శ్రీ రామ నవమి పందిళ్ళల్లో, పెద్ద స్థితిమంతుల ఇళ్ళల్లో జరిగే శుభకార్యాలలో హరికథా కాలక్షేపాలు ఉండేవి. మధ్య మధ్యలో వేసవికాలంలో కూడా గ్రామస్తులు అంతా కలసి రామాయణమో, మహా భారతమో సీరియల్‌గా చెప్పించుకొనే వారు. సాంస్కృతిక కార్యక్రమాలను నెలనెలా నిర్వహించే గాన సభల్లో ఏడాదికి వోసారి అయినా హరికథ పెట్టించేవారు.

"హరికథ అనేది సర్వ కళల సమాహారం. హరికథ చెప్పే దాసు గారికి సాహిత్యం క్షుణ్ణంగా వచ్చి తీరాలి. రామాయణ, భారత, భాగవతాదులు కరతలామలకంగా వుండాలి. కొద్దో గొప్పో నాట్యం తెలిసి వుండాలి. వీటన్నిటితో సమయస్ఫూర్తి, చతురత, రక్తి కట్టించే సామర్థ్యం అవసరం. అభినయ కళ తెలిసి వుండడం కూడా ముఖ్యం. ఇన్ని వుంటేనే దాసుగారికి బంతిపూల దండలు దండిగా పడేవి. హరికథలు చెప్పే దాసుగారిని భాగవతార్ అని పిల్చేవారు. అమ్ముల విశ్వనాథ భాగవతార్...అలా అన్నమాట. హరికథకి వయోలిన్, మృదంగం పక్క వాయిద్యాలు. దాసుగారు కుడిచేతిలో చిడతలు పట్టుకొని కీర్తనలు పాడేటప్పుడు తాళం వేస్తూ వుండే వారు. కాళ్ళకు గజ్జెలు. దాసుగారి ఆహార్యం పట్టు పంచె, పట్టు ఉత్తరీయం, నుదుట సింధూరం. అన్నట్టు దాసుగారు తనతో ఎప్పుడూ తీసుకు వెళ్ళేది శ్రుతి బాక్సు.

"కథ ప్రారంభంలో దాసుగారు పక్క వాయిద్యాల సమేతంగా వేదిక మీద కూర్చునే గణపతి ప్రార్థనతో మొదలు పెట్టి తాను ఏ కథ చెప్పదలచుకొన్నారన్నది సూచన ప్రాయంగా తెలియచేస్తూ రెండు మూడు కీర్తనలు పాడేవారు. తర్వాత లేచి నిలబడి, గజ్జెలు కళ్ళకు అద్దుకొని, వాటిని కాళ్ళకు కట్టుకొని, "శ్రీమద్రమారమణ గోవిందా" అని తానంటూ, సభికులందరిచేతా గట్టిగా అనిపిస్తూ కథలోకి ఉపక్రమించే వారు. కీర్తనలు ఆలపించేటప్పుడు పక్క వాయిద్యాల సహకారం తీసుకునే వారు. సందర్భోచితంగా నాట్యం చేస్తూ కథను రక్తి కట్టించే వారు. నిద్రలో జోగే శ్రోతలను జాగ్రదావస్థలోకి తెచ్చేందుకు మధ్యమధ్యలో గోవిందలు కొట్టించేవారు. సినిమాలో కూడా హరికథలు పెట్టేవారు. పది పదిహేను నిమిషాలు వుండేవి. విజయా వారి 'షావుకారు' సినిమా హరికథతోనే ప్రారంభం అవుతుంది. నాగేశ్వరరావు, కృష్ణకుమారి నటించిన కవితా వారి 'వాగ్దానం' సినిమాలో రేలంగి హరిదాసుగా, ఘంటసాల పాడిన 'సీతాకళ్యాణం' చాలామంది ఇష్టపడే మరపురాని హరికథ.

"హరికథ అంటే ఆదిభట్ల నారాయణదాసుగారి పేరే అందరికీ గుర్తుకు వస్తుంది. విజయనగరం సంస్థానం ఆస్థాన విద్వాంసులు ఆయన. ఫిడేలు విద్వాన్ ద్వారం వెంకటస్వామి నాయుడు గారికి ముందు విజయనగరం సంగీత కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసారు కూడా. హరికథ చెప్పే ప్రతీవారు తాము నారాయణదాసుగారి శిష్యులమనో లేదా ఆయన కథలు చెపుతు న్నామనో చెప్పుకునేవారు. ఇప్పటికీ కూడా ఉత్తర కోస్తా జిల్లాల్లో నారాయణ దాసు గారి ఉత్సవాలు చేస్తూ వుంటారు.

"తోట్లవల్లూరులో వేణుగోపాలస్వామి దేవాలయంలో, వైశాఖ పౌర్ణమి కల్యాణాలలోను, శివాలయంలో శివరాత్రి, దసరా నవరాత్రులలోను ఎంతో మంది పేరున్న వారు వచ్చి హరికథలు చెప్పేవారు. కూచిభొట్ల కోటేశ్వరరావు అనే ఆయన బక్క పలచగా పొడుగ్గా వుండేవారు. భక్త పోతన హరికథ ఎంతో గొప్పగా చెప్పేవారు. "లలిత సరస గాన కళానిధే..." అంటూ ప్రార్థన చేసేవారు. లేచి నిల్చున్న వెంటనే "వాసుదేవ ..."అని కళ్యాణిరాగంలో త్యాగరాజ కీర్తన ఎంతో శ్రావ్యంగా పాడేవారు. సందర్భానికి తగ్గట్టుగా పిట్ట కథలు చెప్పేవారు. పోతన భాగవతాన్ని అమ్ముకోలేక, జీవనం గడపలేక ఎంత బాధ పడ్డాడో అందరికీ తెలిసిందే. పోతనగారిలాగే కూచిభొట్ల వారు కూడా తమకున్న అద్భుతమయిన హరికథా విద్యను అమ్ముకోలేదు. ఏమిస్తే అది పుచ్చుకొనే వారు. పేదవారయినా పెద్ద మనసు వున్నవారు. బెజవాడలో త్యాగరాజ సంగీత కళా సమితి అనే సంస్థను ప్రారంభించినప్పుడు తన ఇంట్లో వున్న వెండి త్యాగరాజు ఫొటో పట్టుకొచ్చి 'ఇదే మీ లోగో' అన్న గొప్ప హృదయం వున్నమనిషి ఆయన. ప్రాతః స్మరణీయులు,

"సొమ్ములు వాగ్దేవికి / సరసమ్ములు సంగీత సహజ సౌందర్య / విలాసమ్ములు, మధుర మ్ములు, మా / అమ్ముల తమ్ముల మనోహరాపముల్" అని అభివర్ణించారు కరుణశ్రీ.

"అమ్ముల విశ్వనాథంగారు మరో గొప్ప హరికథా విద్వాంసులు. చల్లపల్లి, అవనిగడ్డ ప్రాంతం వారు. స్ఫురద్రూపి. పారుపల్లి రామకృష్ణయ్య పంతులుగారి శిష్యులు. మండలి బుద్ధప్రసాద్ గారు ప్రచురించిన 'దివిసీమ రత్నాలు'లో అమ్ముల విశ్వనాథంగారి గురించి చాలా వివరంగా వుంది. నారాయణదాసుగారి తర్వాత బహుశః శిలా విగ్రహం వేయించుకోగలిగిన గౌరవం పొందింది అమ్ములవారే. శివ ధనుర్భంగం కథ చాలా గొప్పగా చెప్పేవారు. అమ్ముల విశ్వనాథంగారి అమ్మాయి, దుర్గాభవాని ప్రస్తుతం విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో వయోలిన్ ఆర్టిస్టుగా పనిచేస్తోంది.

"సీరియల్ హరికథల గురించి కొంత చెప్పాలి. పొలం పనులు అయిపోయి అందరు తీరిగ్గా వున్నప్పుడు సీరియల్ హరికథలు పెట్టించు కునేవారు. గుళ్ళో కళ్యాణ మండపం స్టేజిగా రామాయణమో, భారతమో పూర్తిగా చెప్పించే వారు. రాత్రి ఏడు ఎనిమిది మధ్య ప్రారంభమయిన కథ పన్నెండు గంటల దాకా సాగేది. మధ్యలో హారతి పళ్ళెం పట్టేవారు. హరికథ వినడానికి వచ్చిన వారు హారతి పళ్ళెంలో తమకు తోచిన విధంగా అణా, అర్ధణా, బేడా, పావలా కాసులు వేసేవాళ్ళు. పళ్ళెం మధ్యలో చిన్న కుందిపెట్టి వొత్తి వెలిగించి దీపం పెట్టేవాళ్ళు. చీకట్లో కొంతమంది అణా వేసి పావలా కొట్టేసేవారని జోకులు కూడా ఉండేవి. చిల్లర లేకపోతే హారతి పళ్ళెం పట్టేవాడిని అడిగి తీసుకునే వెసులుబాటు వుండేది. "నాదగ్గర పావలా వుంది. నేను అణా వెయ్యాలి. మిగతాది ఇచ్చెయ్యి" అని అడిగి తీసుకునే వారు.

"వీరగంధం వెంకట సుబ్బారావు, రాజశేఖరుని లక్ష్మీపతిరావు, ర్యాలి రామచంద్ర రావు, కంచిభొట్ల వీరరాఘవయ్య, నౌడూరి విశ్వనాధశాస్త్రి, కదలి వీరదాసు, ముదపాక మల్లేశ్వరరావు, ప్రగడ వీరభద్రరావు, ముదునూరు శంకర్ రావు, ఎల్లమందరావు, చోరగుడి పాండురంగారావు గార్లు హరికథలు చెప్పడంలో దిట్టలుగా పేరుతెచ్చుకున్నారు. ములుకోట్ల సదాశివ శాస్త్రి గారు అని తెనాలి అనుకొంటా...హైస్కూల్‌లో తెలుగు మాష్టారుగా వుండేవారు. త్యాగరాజు చరిత్రను రామభక్తి అంతా రంగరించి కథ చెప్పేవారు, సంస్కృతం రాని వాళ్ళకు కూడా అర్థం అయ్యేలా. ఇలా రాసుకొంటూ పోతే చాలా వున్నాయి. రేడియోలో ప్రయాగ నరసింహ శాస్త్రి గారు...ఏ కథ అయినా సరే ఆయనకు కొట్టిన పిండి, అలవోకగా చెప్పేవారు. షెడ్యూల్ చేసిన ప్రోగ్రాం లేకపోతే ప్రయాగ వారి హరికథ వుండేది. గాంధీ, నెహ్రూ, బోస్‌ల చరిత్రలు కూడా ఆయన హరికథలుగా చెప్పేవారు.

"తర్వాత తరంలో మనకందరికీ తెలుసున్న వ్యక్తి కోట సచ్చిదానంద శాస్త్రి గారు. చాలా రమణీయంగా హాస్యోక్తులతో ఎన్ని గంటలు విన్నా ఇంకా ఇంకా వినాలనిపించేలా చెప్పేవారు.

"నరసాపురం దీక్షిత్ దాసుగారు, బుర్రా శివరామకృష్ణ శాస్త్రిగారు కూడా మంచి కథకులు. ఆడవారిలో సైతం మంచి విద్వాంసులు వున్నారు.



'వాగ్దానం' చిత్రంలో
హరికథ చెబుతున్న రేలంగి

తెనాలి ఉమా చౌదరి భాగవతారిణి కొన్నేళ్ళపాటు ఆంధ్రదేశంతోపాటు ఇతర రాష్ట్రాలలోని తెలుగు వారికి సయితం అభిమాన పాత్రులయ్యారు. నగరాజ కుమారి, వజ్రాల విజయశ్రీ, మంత్రిప్రగడ లలిత కుమారిల హరికథలు అంటే జనం చెవికోసుకొనేవారు.

"రాజమండ్రి దగ్గర కపిలేశ్వరపురం జమీందార్ సత్యన్నారాయణ రావుగారు సర్వారాయ హరికథ గురుకులం ప్రారంభించి హరికథల పట్ల ఆసక్తి వున్నవారికి అక్కడే వసతి కల్పించి రెండుమూడు సంవత్సరాలు శిక్షణ ఇచ్చే ఏర్పాటు చేసారు. ఇప్పుడు హరికథ చెబుతున్నవారిలో చాలామంది కపిలేశ్వరపురం గురుకులం విద్యార్థులే - మొదట్లో ప్రస్తావించిన ఉమామహే శ్వరితో సహా. ఉమామహేశ్వరి చాలా చిన్నతనంలోనే సంస్కృతంలో హరి కథచెప్పి అందరినీ మెప్పించారు. మంచి పేరు ప్రఖ్యాతులు గడించారు. నటరాజ రామకృష్ణగారి ప్రియ శిష్యులు కళాకృష్ణగారిని వివాహం చేసుకు న్నారు. ఆ దంపతులిద్దరూ ఒకరు పేరిణి నాట్యంద్వారా, మరొకరు హరికథ ద్వారా కళాసేవ చేస్తున్నారు.

"ఆచార్య తూమాటి దోణప్పగారు 'హరికథా సర్వస్వం' అనే గ్రంథం రాశారు. తెలుగు యూనివర్సిటీవారు నిరుడు తమ రజతోత్సవాలు సంద ర్భంగా తక్కువ ధరకు అమ్మిన పుస్తకాల్లో ఇది కూడా ఉంది. ఇంకా అవి ఉన్నాయో లేదో కూడా తెలియదు. హరికథను అభిమానించేవారంతా కొని

## స్వగతం

డెబ్బయ్ ఏళ్ళు రేపో మాపో మీద పడబోతున్న వయస్సులో 'చినుకు' పత్రిక ప్రత్యేక సంచికకు ఏదైనా ప్రత్యేకంగా రాయండి అని పంపిన యస్‌యమ్‌యస్ ఎంతో సంతోషాన్ని కలిగించింది. మరెన్నో స్మృతులను తట్టి లేపింది. "రాయి, ఏదన్నా రాయి, భయపడకుండా, భయంలేకుండా రాయి" అని మొదటి పాఠం చెప్పారు నాకు జర్నలిజంలో ఓనమాలు దిద్దించిన నార్ల వెంకటేశ్వరరావుగారు.

"రాయండి, రాస్తూ పొండి, పేరుకోసం రాయకండి. మీ రాతల్లో సత్తావుంటే పేరు అదే వస్తుంది. రాయమని అడిగేవారూ వస్తారు. అయితే ఒక విషయం గుర్తు పెట్టుకోండి. రాయమని అడగకుండా ఏ పత్రికీ రాయకండి. రచయితలకు ఆత్మాభిమానంకూడా ఉండాలి" అని చెప్పేవారు జర్నలిజంలో నాచేత తొలి అడుగులు వేయించిన నండూరి రామ్మోహనరావు గారు

ఇక నేను పనిచేసిన 'ఆంధ్రజ్యోతి'లో నా సీనియర్ సహచరులు పురాణంగారు, తుర్లపాటిగారు సరేసరి. ఈనాడు నాలుగు ముక్కలు రాయగలుగుతున్నానంటే అంతటి ఉద్దండుల పుణ్యమే, సాహచర్యమే. జ్యోతిలో పనిచేసిన ఐదేళ్లలో వాళ్ళు నాచేత రాయించని విషయం లేదు, చేయించని ప్రయోగం లేదు. తెలుగు పత్రికల్లో తొలిసారిగా కార్టూన్ మాదిరిగా అనుదినం నాచేత 'వాక్టూన్లు' రాయించారు.

రేడియో, దూరదర్శన్‌లలో మూడు దశాబ్దాలు పైచిలుకు పనిచేసి 2005లో రిటైరైన తరువాత రమ్మన్న టీవీ చర్చలకే వెడుతూ, రాయమన్న పత్రికలకే రాస్తూ, ఇలా కాలక్షేపం చేస్తున్నాను. ఏదో వాణిజ్య ప్రకటనలలో చెప్పినట్టు "నేను ఓ మోపెడ్ కొనుక్కున్నాను" అన్నట్లుగా నాకు ఓ బ్లాగు ఉంది. ప్రతిరోజూ ఒక అంశంమీద పోస్టు పెడుతూనే ఉన్నాను. నాలుగైదు లక్షల హిట్లూ వస్తున్నాయి. ఈ వయసులో ఇంతకన్నా ఏం కావాలి... అందుకే రాయడం ఒక వ్యసనం అయిపోయింది.

**- భండారు శ్రీనివాసరావు.**



ఉమా మహేశ్వరి భాగవతారిణి

దాచుకోవాల్సిన పుస్తకం. యూనివర్సిటి పీఆర్వో చెన్నయ్యగారికి ఏవన్నా దీని గురించి తెలుసేమో అడగాలి.

"రేడియోలో ప్రతీ మంగళవారం రాత్రి తొమ్మిదిన్నరకు గంటసేపు హరికథ వచ్చేది. రేడియో సంగీత సమ్మేళనం, నాటక సప్తాహం లాగా హరి కథా సప్తాహంకూడా నిర్వహించేవాళ్ళు. హరిదాసులందరూ వారి లెటర్ హెడ్స్‌పైన, కరపత్రాలపైనా, 'రేడియో ఆర్టిస్టు' అని వేసుకునేవారు. ఇప్పుడు కూడా హరికథలు ప్రసారం చేస్తున్నారో లేదో తెలియదు. వస్తుంటే చాలా సంతోషం. మానేస్తే అంతకంటే అన్యాయం మరోటి ఉండదు. తోలుబొమ్మ లాటలు పోయాయి పౌరాణిక నాటకాలు మరచిపోతున్నారు. హరికథని అలా కానివ్వకూడదు. తమిళనాడులో ఇంకా హరికథ ఆదరణకు నోచుకుంటూనే వుందన్న సంగతి మరచి పోకూడదు.

"గతంలో మన రాష్ట్ర ప్రభుత్వంకూడా ఆంధ్రప్రదేశ్ కథాగాన కళా పరిషత్ ఏర్పాటు చేసింది. సంగీత సాహిత్య నాటక అకాడమీల్లాగానే అది కూడా కాలగర్భంలో కలిసిపోయింది. అలాగే బుర్రకథలు. ఎన్నికలప్పుడే ప్రచారాలకోసం గుర్తుకొచ్చేవిధంగా అవీ క్రమంగా మారిపోతున్నాయి.

తెలుగువారి ఈ సాంస్కృతిక సంపదలను పరిరక్షించడానికి సాంస్కృతిక ప్రియుడైన రమణాచారిగారు ఏవన్నా చేయగలుగుతారేమో చూడాలి. ఎందు కంటే ఇటువంటి విషయాల్లో వారికి అపరితమైన ఆసక్తి ఉంది. చేయగల చేవా ఉంది. జన్మదినాన్ని హరికథలతో నిర్వహించి వాటిపట్లతన మక్కువను ప్రదర్శించిన ఆయనే ఏవన్నా చేయాలి."

# అద్దం పగిలింది




కొండ అద్దంలో కూర్చొని
కుడి ఎడమలు మార్చుకుంది
గోరంత దీపం
కొండంత వెలుగు పరిచి
వీక్షకులకు కనువిందు చేస్తూంది
అంతవరకు సాగిన అఖండ చిత్రాన్ని
ఒకానొక విధ్వంసక శక్తి
ముక్కలుగా చీల్చి
హద్దులు నాటింది !
రహదారికి అంకితమైన నడకలు
చిరుదారులు వెతికాయి
చిరుదారులు లఘుదారులుగా చీలాయి
ఒక్క తాటిపై నడిచిన మాటలు
తడబడ్డాయి
ఏ ఇద్దరిదీ ఒక బాట కాదు
ఏ ఇద్దరిదీ ఒక మాట కాదు
మాటలు కోటలు దాటి
వీధుల్లో తలపడ్డాయి
పదిలంగా దాగిన మాటలు
పలచనై తేలిపోయాయి
ముఖాలు ముసుగులు కప్పుకున్నాయి!
నడక సులభమే జటిల మౌతున్నది
మాట మధురమే పాషాణ మౌతున్నది
చూపు శాంతమే భాస్వర మౌతున్నది!
మానవ సంబంధం
రక్త సంబంధం
రూపం మారి
నమ్మకం వమ్ము చేశాయి
ఆశించిన సుఖం
ఆర్జించిన ధనం
నరక కూపానికి
అధఃపాతాళానికి
దారి తీశాయి
ముక్కలుగా చీలిన కొండ
నిజరూపం మాసింది
ఉనికి కోల్పోయింది
నాటి ప్రాభవం నెమరేస్తుంది!


**అడిగోపుల వెంకటరత్నమ్**
**98482 52946**








6

# వెంటాడేవాడు

మధురాంతకం నరేంద్ర

"బండి సవుండుగూడా యినబల్లేదు కుమార్సా! యీ పొద్దు నువ్వు బిన్నాగానే వస్తావని తెల్సులే నాకు" అని పలకరించిందామె.

మోటర్‌బైకు స్టాండు వేస్తున్న కుమార్ వులిక్కిపడి, ఫాం హౌసులోంచే బయటికొస్తున్న వ్యక్తిని చూసి "నువ్వా బాలమ్మా? నీ గొంతలా వుందేమిటి?" అన్నాడు కంగారుగా.

"నా గొంతా? మారిపొయ్యిందా? లేదు లేదు" అంటూ బాలమ్మ తడబడిపోయింది.

**అతను** కళ్ళార్పకుండా చూస్తూ "నీ గొంతు గాదది. కానీ యెక్కడో విన్న గొంతే!" అని బెంబేలు పడ్డాడు. ఆవిడ వెనక తనను భయపెడుతున్న ముఖమేదో వచ్చి నిల్చున్నట్టుగా అనిపించగానే వణుకుతూ వెనక్కో అడుగేశాడు.

దూరపు కొండలనుంచీ తార్రోడ్డు వరకూ ముళ్ళ పొదలతో, పిచ్చి మొక్కలతో నిండిన బీడు సహజంగానే కనబడుతోంది. రోడ్డు పక్కన పొందిగ్గా పెరిగిన మామిడితోట అసహజంగానూ, తోటలోకి తీసుకొచ్చి పెట్టినట్టున్న రంగురంగుల ఫాం హౌసు కృత్రిమంగానూ కనిపిస్తున్నాయి. తోట చుట్టూ సిమెంటు కూసాలకు చుట్టిన యినప కమ్ముల కంచె ప్రాణమున్న దానిలా గాలికి కదులుతోంది. కంచె లోపల తోటకు అంచులా వరసగా పెరుగుతున్న టేకు చెట్లు ప్రాణంలేని బొమ్మల్లా ఆకల్లార్చకుండా నిలబడి వున్నాయి.

ఫాం హౌసు లోపలికెళ్ళి, రెండు మూడు మాటలేవో మాట్లాడి, తన గొంతు మారిపోలేదన్న నమ్మకం కలిగాక బయటికొచ్చింది బాలమ్మ. "సమత్సరంగా మేడంకు నీ పెండ్లి గురించే మనేద పట్టుకునింది సా... మువ్వు అమేరికానించీ రాంగానే పెండ్లి జేసెయ్యాలని తీర్మానం జేసుండాది. ఆ పొద్దు యిక్కడ పార్టీ అందుకే యేర్పాటు జేసుండాది. ఆ సంగతి దెల్సునా నీకు?" అంటూ మామూలుగా మాట్లాడటానికి ప్రయత్నించింది. "దనరాజు సారూ, ఆయిన భార్య, వాళ్ళ కూతురు కీర్తీ వస్తారని మేడం జెప్పింది. ఆ బిడ్డిప్పుడు బలే నాణ్యంగా యెదిగుండాది. వస్తాది గదా, చూద్దువుగానీ వుండు. యీ పాటికి వాళ్ళు గూడా యింటికాన్నుంచీ యెలబారే వుంటారు... అమేరికాకు పోయినాంక నీకు కొంచెం వొళ్ళొచ్చుండాది సా... యింగా నీకు యీ స్కూటరుపైన యమ పోలేదా? మేడం వాళ్ళు కార్లో వస్తాండారా? యీతూరి నువ్వు రెండు నెలలయినా వుంటావనింది మేడం. పెండ్లవతానే యిమానమెక్కేస్తావా? నీకక్కడ జీతమంతా అట్టట్నే మిగిలి పోతాదంటగదాని! యీ పొద్దు పెద్దసారు నిజంగానే వస్తాడా సా..." కుమార్ చివాలున వెనుదిరిగి "యెందుకు రాడు?" అని కసరగానే బాలమ్మ తాను తప్పు మాట్లాడినట్టుగా గుక్కిళ్ళు మింగసాగింది.

"తప్పకుండా వస్తాడు. ఆ మనిషిని అంత కాలం టాలరేట్ చేసిందే డాడీ తప్పు. అదే నేనైతేనా..." అంటూ కుమార్ హుంకరించాడు.

కోపంతో అతని ముఖం జేవురించుకు పోతోంది. తన కళ్ళముందే పెరిగిన కుర్రాడూ, అమెరికాకు వెళ్ళొచ్చిన కుర్రాడూ వొక్కరు గాదనిపించడంతో బాలమ్మ అయోమయ పడిపోయింది.

"డాడీ యెంత కమిటెడ్‌గా పని చేస్తారో తెలుసుగదా? యెఫీషియెంట్‌గా పనిచేసేవాళ్ళను పిలిచి పెద్ద పోస్టులిస్తారు. జెలసీతో ఆయన్ను డిస్టర్బ్ చేస్తారా? సస్పెండు చేసి, కోర్టుకులాగి, పేపర్లలో రాసి, యింత వేదిస్తారా? చేసిన మేలు మరిచి పోయి, ఆ మనిషి, అంత యిన్‌గ్రాటిట్యూట్‌గా, అంత దుర్మార్గంగా..." కుమార్ గొంతు గద్గదికమై పోసాగింది. తానేదో తప్పుచేసినట్టుగా కుమార్ తనను వురిమి చూడడంతో బాలమ్మ భయపడి పోయింది. సైకిల్ గంట వినబడగానే తిరిగి చూసి "గులామన్న వస్తాండాడు సా..." అని అక్కడి నుంచీ పారిపోయి వచ్చేసింది.

"యీ పొద్దిక్కడ యింత పెద్ద పార్టీ బెట్టుకొని అరుట్లు గొడతావుందా సా బాలమ్మా? ఆ కుర్చీలు దీసి బయటపెట్టు...మేడం వచ్చిందంటే లేటు జేసి నావని నా పైన యెగిరితింది..." అంటూ వస్తూనే పనిలోకి దిగేశాడు గులామాలీ.

ప్లాస్టిక్ కుర్చీల దొంతరను తీసుకొచ్చి ఫాం హౌసు బయట నిలబెడుతూ "యీ పొద్దు పెద్ద సారొస్తాడా గులామన్నా?" అని అడిగింది బాలమ్మ కంపిస్తున్న గొంతుతో.

జంబు తీగకు గుచ్చిన చేపల్లా వరసగా నిగుడుకున్న ప్లాస్టిక్ కుర్చీలను విడదీస్తూ "కొడుకు అమెరికా నుంచి వచ్చినాడు. యీ పొద్దిక్కడ పెండ్లి చూపులు. కుదిరితే రేపో మొర్నాడో నిశ్చితార్థం. ఆ పైన పెండ్లే! జెనం మాత్రం యే గోరాన్నయినా యెన్నాండ్లని గెవనం బెట్టుకుంటారు? మెల్లింగా అన్నీ పరిసిపోతాయి" అన్నాడు గులాం. తర్వాత "యింక చూస్కో బాలమ్మా! నీకు వొద్దంటే పని" అని జోడించాడు.

"పనికి నేనెప్పుడు పాలుమారినాను గులామన్నా!" అంది బాలమ్మ.

తనను తాను వోదార్చుకుంటున్నట్టుగా "ముప్పయ్యేండ్లుగా మేడం వాళ్ళ యింట్లో పనిచేసుకుంటా పడుండాను. యాడ్నో గాలికి తిరగలారతా వుంటే మేడం పిలిచి పనిలో బెట్టుకునింది. కూడుకూ గుడ్డకూ యెతుక్కోకుండా జరిగి పోతా వుండాది. నమ్మిందానికి నేనేమీ చెడిపోలేదు".

"అంతేలే బాలమ్మా! యెప్పుడో నే నుద్యోగంలోకి జేరిన కొత్తల్లో సారు నాకు యెగ్రస్టా యింక్రిమెంటిచ్చినాడు. అప్పటి నించీ ఆయిన కాలితో జెప్పిన పని చేతల్తో జేస్తా వుండాను. నేనడిగినప్పుడల్లా సారు అయిదూ పదీ యిస్తానే వుండాడు. నాకంతే జాలు!" అన్నాడు గులాం.


98662 43659

బాలమ్మ తల వూపుతూ "గెస్టులెందరొస్తారన్నా యీ పొద్దు?" అని అడిగింది.

"పిలిస్తే వూరంతా రారా? పిలిచుండేది మూడు కుటుంబాల్నే! పదిమంది దాకా వస్తారు. యేర్పాట్లు మాత్రం మేడం లెవల్లో జరగతా వుండాయి. తాజ్ వోటల్నించీ బిర్యానీలూ, యెన్నీలూ వస్తాండాయి. చూసినోళ్ళు కుళ్ళుకుంటారని మినకరిస్తా వుండాదిగానీ, మేడంకు దుడ్డంటే మంచి నీళ్ళకిందే జమగదా!" మాట్లాడుతూనే తోటనంతా కలయజూసి "మొత్తం పద్నాలుగెకరాలు. అప్పుడు లక్షల్లో జరిగింది బేరం. యిప్పుడు దొంగ చేతికిచ్చినా కోట్లొస్తాయి. చేతిలో గీత బాగుంటే అన్నీ యీ మాదిరే వచ్చి చేరిపోతాయి. రూలూ గీలూ అని మాట్లాడితే యేమొస్తాది? అప్పుడా వడ్డారం మనిషికి బట్టిన గతే పడతాది" అన్నాడు.

గులాం యెద్దేవా చేసినట్టుగా అనిపించగానే బాలమ్మ కంగారు పడింది. అతడి ముఖంలోంచీ మరేదో చూడగూడని ముఖం తొంగి చూసినట్టుగా తోచగానే ఆమె కెవ్వున అరవబోయి, అంతలో తమాయించుకుని ఫాం హౌసులోకి పారిపోయింది.

తోటకు వుత్తరపు చివర్లో కుమార్ పచార్లు చేస్తున్నాడు. కొండల నుంచీ వీస్తున్న వేడిగాలి తోట దగ్గరికి రాగానే ఆగిపోయి, యెందుకో వెనక్కి పరిగెడుతోంది. కాలాన్ని ఆగనివ్వనన్నట్టుగా గవర్నెంటు కారొకటి హారను మోగించుకుంటూ వచ్చి తోటలోకి తిరిగింది.

గులాం గబగబా ముందుకొచ్చి, కారు తలు

ఫాం హౌసు ముందు ఆగిన కారును చూస్తూ "నువ్విక్కపైన యిండియాలోనే వుండిపోతానన్నావుట!" అన్నాడు సత్యం. "నీ తెలివి తేటలు యింకో దేశానికి వుపయోగపడడం నీ కిష్టం లేదన్నావట! అదీ పాట్రియాటిజమంటే! అయినా ఆ దేశంలో యేముంది? నౌకర్లూ చాకర్లూ వుండరు. యెవరి పనులు వాళ్ళే చేసుకోవాలి. చెత్తలు చిమ్మడం, యెంగిలి గిన్నెలు కడగడం - యివా నువ్వు చెయ్యాల్సిన పనులు? యిక్కడింత అస్తుంది. బిజినెస్‌లో దిగు. దానికంటే పాలిటిక్స్ మేలు!" కుమార్ తన మాటలు వినిపించుకోకుండా వెళ్ళిపోవడం చూశాక సత్యం మౌనంగా వుండిపోయాడు.

పు తెరిచి "వెల్‌కం సుచరితా మేడం! మీరే ఫస్టు... దనరాజుసారూ, కీర్తి రాలేదా?" అని ఆహ్వానించాడు.

మేడం సుచరిత కారు దిగుతూనే "ఫాం హౌసంటే యేవిటో అనుకున్నా...యింత పెద్ద యెస్టేటనుకోలే..." అంటూ ఆశ్చర్యపడిపోయింది.

"యిదేముండాది మేడం! బెంగుళూరులో కొన్న ఫ్లాటు జూస్తే నోరు దెరిచేస్తారు! సారోళ్ళ వూర్లో కెనాల్ పక్కన కొనుండేది యాభై యెకరాలని అంటారు. యింక అక్కడా యిక్కడా కొన్న యిండ్ల ప్లాట్లెన్నో సారుకే లెక్క దెలవదు" గులాం గొంతులో కోపం ధ్వనించగానే సుచరిత ముఖం చిట్లించింది. గులాం తన తప్పును గుర్తించిన వాడిలా "సారూ మేడమూ యిద్దరూ సంపాయిస్తా వుండారు. కొడుకుది అమెరికాలో ఉద్యోగం. ముగ్గురి సంపాదన. ఆదాయమేగానీ ఖర్చు లేదు" అని ప్లేటు ఫిరాయించాడు.

సుచరిత నడుముపైన చేయి పెట్టుకుని "మేమూ యిద్దరూ జాబ్ చేస్తున్నాం. ప్రాపర్టీ జీతాలతో రాదు...యీ మాదిరిగా వచ్చి కలుస్తాయంతే!" అని నిట్టూర్చింది. తరువాత డ్రైవరుతో "సారు ఆఫీసులో...బేబీ యింట్లో...పికప్ చేసుకురా పో" అని హుంకరించింది.

రోడ్డుపైకెళ్తున్న గవర్మెంటు కారునే చూస్తూ "పేరుకు పార్టీ అని పేరేగానీ జరగతా వుండేది పెండ్లిచూపులేనంట గదా మేడం! కుమార్ సార్ వచ్చేసినారు...మీ డాటరును మీరే తొడుక్కొనొచ్చుంటే బాగుణ్ణు" అన్నాడు గులాం.

దూరంగా నిల్చున్న కుమార్‌కేసి ప్రసన్నంగా చూస్తూ "మీ సారు యివ్వాళ యిక్కడికొస్తాడా గులాం?" అని అడిగింది సుచరిత.

ఆవిడకోసం కుర్చీని చెట్టు నీడలోకి లాగుతూ "పార్టీలియ్యలేదనే కోపంతో ఆ పేపరోళ్ళు మా సారుపైన వుండేవీ లేనివి రాసి అగుడు జేసేసినారు మేడం! దాంతో మా సారు ముగమెత్తుకోలేక యిల్లొదిలి పెట్టి బయటికే రావటం లేదు...అయినా జనాలదేముండాది మేడం? కొత్త వార్తలు దొరగ్గానే పాతవి మర్చిపోతారు. సారీ పొద్దు వస్తారనే చెప్పింది మా మేడం!" అన్నాడు గులాం.

రోడ్డుపైన ఆటోలోంచి దిగుతున్న వ్యక్తిని జూసి "మీ సారు క్లోజ్ ఫ్రెండు సుగుణ శేఖర్... కారును ఇంట్లో పెట్టుకోని పూజ్జేస్తాడు. రోజూ ఆటోవాళ్ళతో బాడిగరేటు కుదరక జగడమాడతాడు" అని యెగతాళిగా నవ్వేసింది సుచరిత.

"అందరికీ కార్లలో తిరిగే హెూదా వస్తిందా మేడం? యిప్పుడు పెట్రోలు రేటు బంగారం మాదిరిగా మండతా వుండాది" మేడం వురిమి చూశాకగానీ గులాంకు తాను మాట జారినట్టు స్ఫురించలేదు. వెంటనే "బాలమ్మా! ఆ మినరల్ వాటర్‌కేన్ బయట పెట్టు" అంటూ అక్కడి నుంచీ జారుకున్నాడు.

బట్టలకంటుకున్న దుమ్మును దులుపుకుంటూ వచ్చిన సుగుణ శేఖర్ "నమస్తే మేడం! వొక్కరే ఉన్నారు" అని పలకరించాడు.

"పార్టీ అన్నారని ఆదరాబాదరా వస్తే యిక్కడికింకా యెవరూ రాలేదు...మీరు అటే వెళ్ళి మీ ఫ్రెండుతోబాటూ వస్తారని అనుకున్నా" అందామె తాపీగా.

సుగుణ శేఖర్ పెద్దగా మూల్గి "యిప్పుడాయన స్టేజీ వేరే మేడం! నేనేమో యెక్కడేసిన గొంగళి అక్కడగా పడున్నాను" అన్నాడు.

"మీ ఫ్రెండు పైకెళ్ళాక యెక్కువ అసైన్‌మెంట్లు యిచ్చింది మీకేగా?" అని రెట్టించిందామె.

"అదే మేడం నేనూ అంటోంది. ఆయన బాసూ, నేను సబార్డినేటూ...అది మరిచిపోతే యెదురు దెబ్బలు తగలతాయి" అన్నాడతను అదో రకం నవ్వు నవ్వుతూ.

"మీ ఫ్రెండు డిప్రెషన్లో వున్నప్పుడు కంపెనీ యివ్వాల్సింది మీరేగా!" సుచరిత మందలిస్తున్నట్టుగా అంది. "వాళ్ళ అంకుల్ పవర్లోకొస్తే అది ఆయన తప్పా? యింకెవర్నీ నమ్మలేకేగా ఆయన మీ ఫ్రెండుకు ఆ పోస్టింగిచ్చింది! రూల్సు ఫాలో గాలేదని గొడవ చేశారప్పుడు...అయినా ఆ రూల్సు రాసిందెవరు? ముందున్న వాళ్ళు వాళ్ళకు సూటయ్యేలా రూల్సు రాసుకు న్నారు...మీ ఫ్రెండొకరేనా సంపాయించింది? మిగిలిన వాళ్ళంతా చేస్తే రైటూ, యీయన చేస్తే మాత్రం తప్పునా? అంతా జెలసీ! అంతే!"

యెదురుగాలికి తలవంచుతున్నట్టుగా ముందుకొచ్చి "నేనన్నదీ అదే మేడం...మా ఫ్రెండు ఆ పెడసరం మనిషికి గూడా వొక దోవ చూపిస్తాననే అన్నాడు. కానీ వాడే నీతులూ ధర్మాలూ అని సుమతి శతకం చదివాడు. దాంతో మా ఫ్రెండు వాడ్ని..." అని, అంతలో టక్కున నోరు మూసుకున్నాడు. సుచరిత తనవెనకెవరినో చూస్తూ నివ్వెర పోవడం గమనించి వెనుదిరిగి చూశాడు. అక్కడెవరూ లేకపోవడంతో కంగారుపడ్డాడు. రోడ్డుపైన స్కూటరొకటి ఆగుతూనే ప్రాణం లేచి వచ్చినట్టుగా "సత్యంగారూ! సార్సార్! యిక్కడే... యిటువేపు..." అని పిలుస్తూ పక్కకు కదిలాడు.

బాలమ్మ ఫాం హౌసు లోపలికీ బయటకీ చెడ తిరుగుతోంది. గులాం ప్లాస్టిక్ టేబుళ్ళను చెట్ల నీడ లోకి చేరేస్తున్నాడు. కుమార్ తోటకంచె దగ్గరే నిలబడి సెల్‌ఫోనుతో మంతనాలు చేస్తున్నాడు.

"తపోవనమిట్ట అంటే ఆ యేసుపాదానికి తెలియనే లేదు. నేనే దోవ జూపించాల్సి వచ్చింది" అంటూ తనను వాహనంపైన తీసుకొచ్చిన వ్యక్తిని విసుక్కున్నాక "నువ్వు గూడా పార్టీకి ఫామిలీ తీసుకురాలేదా? వాళ్ళు పార్టీ అంటే ధూం ధాం గదా! మిసెస్ ధనరాజ్ మాత్రం వచ్చినట్టుంది" అన్నాడు సత్యం.

"వాళ్ళ కీర్తిని కుమార్ కియ్యాలని ఆవిడ తాపత్రయం. అందుకే వాళ్ళ ఫామిలీ అంతా వస్తోంది. గవర్మెంటు కారెళ్ళింది వాళ్ళను తీసుకు

రావడానికి" అని, కాస్సేపాగి "పార్టీ అనేది యెక్స్ట్రా జ్ అనుకుంటా... యిలాగైనా జనంలోకి పడాలని. మీ ఫ్రెండు... అసలు యీ రోజు ఇక్కడికి వస్తాడం టారా?" అని ప్రశ్నించాడు సుగుణ శేఖర్.

"మీరేగదా క్లోజ్...మీరే చెప్పాలి" అన్నాడు సత్యం. తరువాత సుగుణ శేఖర్ కేసి చనువుగా చూస్తూ కన్నుగీటి "యేమో! మనకు రాక తప్పు తుందా? యెంత పెద్ద యెస్టేటో చూడు... ఆ పోస్టు కొట్టేయడం దగ్గర్నుంచీ అన్నీ అవుటాఫ్ ది వే నే! మూడంటే మూడే సంవత్సరాలు... బండ్లు వోడలై పోయినాయి. కోట్లు కోట్లు...పై నుండే వాడు మనవాడే అయినా యెంతకని అడ్డం పడతాడు! వూస్టింగే జరగాల్సింది. సస్పెన్షన్‌తో తప్పోయింది. జైలుకు వెళ్ళొస్తే నష్టమేం జరిగింది? పేరు పేపర్లలో నాని పాపులర్ అయింది. వాని డ్యూటీ వాడు చేశాడని, పాపం, ఆ పూర్ ఫెలోను...నిట్ట నిలువునా... తలుచుకుంటేనే గుండెలవిసి పోతున్నాయి..." మాట్లాడుతూనే సత్యం తోటలో నడవ సాగాడు. తన వెంటే వస్తున్న గుణశేఖర్‌తో "ధనరాజ్ గూడా నాకు జూనియరే! శ్రీనగర్ కాలనీలో రెండిండ్లు గట్టి రెంటకిచ్చినాడు. యిక మీ ఫ్రెండు సంగతి చెప్పాల్సిన పనిలేదు" అని వాపోయాడు.

"నీతీ న్యాయం ధర్మం అన్నీ వొట్టి మాటలు సార్! అసలు దేవుడనే వాడున్నాడా అని డౌటు... కోర్టుల్లో కేసులు లాగిస్తారు. జైళ్ళు చేతులెత్తేస్తాయి. పేపర్లు ఫోకస్ మార్చేస్తాయి. జనం మరిచి పోతారు. పనిష్మెంట్లు గూడా వుండవు..." సుగుణ శేఖర్ విలవిలలాడి పోసాగారు.

తోటలోకి చిన్న వానొకటి వచ్చింది. యూనిఫారాలు తొడుక్కున్న బట్లర్లు వానులోంచీ హాట్ బాక్సులు దించుతున్నారు.

సుగుణ శేఖర్ నడవడం ఆపేసి "సార్సార్! అతనిటే వస్తున్నాడు" అని కీచుగొంతుకతో గీపెట్టాడు. రుమాలుతో ముఖానికి పట్టిన చెమటను తుడుచుకున్నాక "గాడ్! ఆ మనిషి గాదు సార్. ఆ వస్తున్నది కుమార్. గబుక్కున అటు తిరిగానా? నాకు అతనే వస్తున్నట్టు అనిపించింది. అయ్యో! నిలువెత్తు మనిషి...ఆ ఘోరం యింకా నా కళ్ళ ముందు మెదులుతూవే వుంది...యిక్కడికొచ్చాక మళ్ళీ మళ్ళీ అతనే జ్ఞాపకం వస్తున్నాడు..." అంటూ బాధగా మూలిగాడు. తరువాత "సుచరిత మేడం పిలుస్తోంది సార్!" అని చెబుతూ పారి పోయాడు.

# బాల్యం




చీకటి తెరలు విచ్చుకోకముందే నిద్రలేచి,
ఉత్సాహంగా వురకలేస్తూ
తాటి తోపుల్లో వెతికి వెతికి
రాలిపడ్డ తాటికాయల్ని ఏరుకొచ్చి
మొండి కత్తితో కోసి
అందులోని లేత ముంజల్ని జుర్రుకు తిన్న విజయోత్సాహం...
ముంజల్ని తిన్నాక, కోసిన ఆ తాటికాయలకు
కర్రను - తాటాకును కట్టి తాడుతో
బండిలా నడిపించిన సాంకేతిక నైపుణ్యం..
రెడ్డిగారి చింతతోపుల్లో రాళ్ళేసి కొట్టి రాల్చిన
చింతకాయల్ని తీసుకొచ్చి, పచ్చడి చేయమని
అమ్మ చుట్టూ ప్రదక్షిణలు చేసిన మొండితనం...
ఇంటిముందు పిట్టగోడెక్కి చౌదరిగారి మామిడిచెట్టు కొమ్మకు
వేలాడుతూ ఊరిస్తున్న పచ్చి మామిడికాయల్ని తెంపుకొచ్చి,
నేస్తాలతో కలిసి ఉప్పు కారం అద్దుకు తిన్న నాయకత్వం...
ఇంటెనక ఈశ్వరమ్మగారి దొడ్లో ఎంతో ఎత్తుకెదిగిన సీమ తుమ్మ చెట్టుకు
దోరగా పండిన సీమ తుమ్మకాయ దుబ్బల్ని
పొడవాటి గడకర్రతో రాల్చి
చొక్కా - నిక్కరు జేబుల్ని నింపుకున్న ఆటకాయితనం...
పారేసిన అగ్గిపెట్టెల్ని, సిగరెట్ పెట్టెల్ని చించి
వాటితో 'ఓకు'లాటాడిన వైనం...
నోటు పుస్తకాలు చించి స్నేహితులతో కలిసి
కాగితం విమానాలు ఎగరేసిన పోటీ తత్వం...
గోలీలు, బిళ్ళంగోడు ఆటలాడిన క్రీడా ఉత్తేజం...
ఇనుపరజను, తాటిరజను, బొగ్గుపొడి, గంధకం వంటి
వివిధ పదార్థాల మిశ్రమాన్ని తాటిమట్టకు కట్టి,
తాడుతో సాయంత్రపు చీకటిలో గుండ్రంగా తిప్పుతుంటే
అవి రవ్వల కాంతి వలయాలుగా రంగులీనుతుంటే
మదిలో ఓ ఉపగ్రహాన్ని ప్రయోగించిన ఆనందం...
అవును..!
బాల్యం...అమూల్యం...అంతులేని ఆనందం..
మరచిపోలేని మధురామృతం...అందమైన జ్ఞాపకం...
అందుకే
కాలచక్రాన్ని వేడుకుంటున్నా...
ఒకవేళ వుంటే
మంత్రదండానికి మొరపెట్టుకుంటున్నా...
మొన్న జారి పడిపోయిన బాల్యపు బంతిని
మళ్ళీ నా వైపు విసిరేయమని.

**కలిమిశ్రీ**

92464 15150

"హలో కుమార్! హౌ ఆర్యూ?" అని నవ్వుతూ పలకరించడానికి ప్రయత్నించాడు సత్యం.

"బాగానే వున్నాన్లెండంకుల్! కానీ మీరంతా వుండేనా మా డాడీకింత ప్రాబ్లం వచ్చింది?" అంటూ కుమార్ వెంటనే నిలదీశాడు.

సత్యం తెల్ల ముఖం పెట్టగానే "ప్రతి స్టుపిడూ డాడీని క్రాస్ యెగ్జామిన్ చేయడమేనా? పేపర్లలో యేం రాసినా పట్టించుకోరా? వాడు...ఆ స్కవుండ్రల్...పొద్దస్తమానమూ చుట్టూ తిరుగుతూ, చెవుల్లో గీపెడుతూంటే యెలా వూరుకుంటారు? అందుకే డాడీ వాడ్ని..." అన్నాడు కుమార్ యేడుపు గొంతుతో. తరువాత పెద్దగా బుస కొడుతూ... "డాడీపైన క్రిమినల్ కేసు గూడా పెడతారా? దేనికీ పనికిరాని వొక చెత్త మనిషి కోసం..." అని దబాయించాడు.

"యిప్పుడు పవరు వాళ్ళదై పోయింది కుమార్! అన్నీ అన్యాయంగా తిరగ తోడుతున్నారు. యెలక్షన్లలో యెప్పుడూ గెలిచేది యాంటీ యెస్టాబ్లిష్మెంటే...మనమింకో మూడేళ్ళు వెయిట్ చెయ్యాలంతే!" అన్నాడు సత్యం దీనంగా.

కుమార్ కోపంతో పిడికిలి బిగించి "యిక్కడంతా రాటనైపోయిందంకుల్! మమ్మీడాడీలను గూడా అమెరికాకు తీసుకెళ్ళిపోతాను" అన్నాడు ఆవేశంగా.

ఫాం హౌసు ముందు ఆగిన కారును చూస్తూ "నువ్విక్కపైన యిండియాలోనే వుండి పోతానన్నావుట!" అన్నాడు సత్యం. "నీ తెలివి తేటలు యింకో దేశానికి వుపయోగపడడం నీ కిష్టం లేదన్నావట! అదీ పాట్రియాటిజమంటే! అయినా ఆ దేశంలో యేముంది? నౌకర్లూ చాకర్లూ వుండరు. యెవరి పనులు వాళ్ళే చేసుకోవాలి. చెత్తలు చిమ్మడం, యెంగిలి గిన్నెలు కడగడం - యివా నువ్వు చెయ్యాల్సిన పనులు? యిక్కడింత ఆస్తుంది. బిజినెస్లో దిగు. దానికంటే పాలిటిక్స్ మేలు!" కుమార్ తన మాటలు వినిపించుకోకుండా వెళ్ళిపోవడం చూశాక సత్యం మౌనంగా వుండి పోయాడు.

ముళ్ల చెట్లూ, పిచ్చి మొక్కలూ, మామిడి చెట్లూ అన్నీ మంద్రంగా వూగుతున్నాయి. తోట లోపలికి మరో కారేదో వచ్చింది. ఫాం హౌసు ముందు హడావుడి మొదలయింది.

అన్యమనస్కంగా టేకు చెట్ల పక్కన నడుస్తున్న సత్యం కంచెలోంచీ యెవరో దూరి రావడం కనబడగానే ఆగిపోయాడు.

"దండాలు సామీ! నేను కొండయ్య...యీ తోటకు నేనే కాపలా వుండేది! బాలమ్మ నా కూతురే!" అన్నాడతను.

"కాపలా మనిషే ఫెన్సింగ్లోంచీ దూరితే యింక తోటను కాపాడినట్టే! యిదేనా కాపలాగాసే పద్ధతి?" అని కోప్పడ్డాడు సత్యం.

"ఆ పక్క గెలిదాంకా పొయొచ్చినాన్లే సామీ! యిప్పుడవితే తలా వొక దోవై పోయినారుగానీ, వొగప్పుడిదంతా మా గుంపు తిరిగారిన తావే! ఆ పక్క నుండే పల్లె కొంపలో మా యిండ్లూ వాకిండ్ల ఆనవాళ్ళు యింగా మిగిలే వుండాయి. యీ తోపు యిప్పుడింత కుదిమట్టంగా గనబడతావుండాదిగానీ, మా సారు బేరం జెయ్యక ముందు చూసుండాల దీన్ని...అంతా కంపా కట్టే...గుంతా మిట్టా...నేను జెప్పినాంకే మా సారు దీన్ని బేరం జేసినారు" అంతా తన ప్రతాపమే అయినట్టుగా కొండయ్య పరవశంగా చెప్పుకు పోసాగాడు.

విసుగును దిగమింగుకుంటూ "గాలికి తిరిగే కులంలో బుట్టినా తోటను బాగనే డెవలప్ జేసినావు..." అన్నాడు సత్యం వెక్కసంగా...

"నాదేముండాదిలే సామీ! అంతా యీ నేల రాశి. తపానమిట్టంటే గవర్మెంటు ముండ్ల చెట్లు పెరిగే బీడనే అనుకుంటారిప్పుడు...యీ నేలలో పుట్టి పెరిగినోడ్ని...నేలసారం మా కులపోల్లకు తెలిసినట్టుగా యింగెవురికీ తెలవదు. ముందెప్పుడో వొబికాలంలో యిదే తావులో వొగ మునీస్పరు దున్నారంట!" కొండయ్య భక్తితో చేతులు జోడించుకుని చెప్పసాగాడు. "ఆయనిచ్చిన మంత్రాల మామిడి పండును తిన్నాంకే ఆ రాజు పెండ్లానికి సంతు గలిగిందంట! అప్పుడా రాజు యీ తావునంతా ఆ మునీస్పరుడికే రాసిచ్చి, యీడున్న రైతుల్నంతా ఆ మునీస్పరుడికే కప్పం గట్టమన్నారంట! అవుతే ఆ మునీస్పరుడు యింగొకరి రెక్కల కష్టం నాకొద్దే వొద్దని కరాకండిగా జెప్పేసినారంట! రాజయితే రైతులు కట్టాల్సిందే అని మొండి గుచ్చు నేసినాడంట! అప్పుడా రైతులు కప్పమంతా తెచ్చి యీ తావులో కుప్పబోసి పోయినారంట! ఆ మునీస్పరుడు దాంట్లోంచీ గడ్డి పరకైనా తాక్కుండా, ఆ పక్కన కొండల్లో వుండే గెలి లోవలకి యెలబారిపోయినాడంట...రాజుకు బయిపడిన రైతులు యీ కయ్యాకాలవల్ని పరిగెలదోలేసి పరాయి రాజ్జానికి వలసబొయినారంట...యిప్పుడు గూడా ఆ కొండ గెలిలో ఆ మునీస్పరుడు తపస్సు చేసుకుంటా వుండాడని మా పెద్దోళ్ళు చెప్పేటోళ్ళు... ఆయినొచ్చి కప్పం దీసుకునేదాంకా మడకలు గట్టకుండా రైతులు దూరంనించీ యెగజూస్తానే వుండారంట యిప్పటికీ..."

"ఆ మునీశ్వరుడి సంగతి నా కెందుకుగానీ, మీ అయ్యగారు యీ పొద్దిక్కడికి వస్తాడా, రాడా, ఆ సంగతి చెప్పు..." అని కసిరాడు సత్యం.

"యేమో! పనోడ్ని. నాకెట్ల దెలిస్తింది సా? నా కవుతే పొద్దన్నించీ, యెవురు తోపులోకొచ్చినా, మా సారే వస్తా వుండేటట్టు గనబడతా వుండాది" అంటూ కొండయ్య అయోమయంగా తల గోక్కున్నాడు.

"బాగుందిలే! తోట యజమానికీ, బయటోళ్ళకూ తేడా గనబడదా నీకు? భలే వాచ్మేన్ దొరికినావు!" సత్యం చీకాకు పడ్డాడు.

"అయ్యా! అయ్యా!" అని బాలమ్మ బిగ్గరగా పిలిచింది.

వెనుదిరిగి "యేమమ్మీ! యెందుకట్ల కొంపలు మునిగి పోయినట్టుగా పడతా లేస్తా వస్తా వుండావు?" అని కోప్పడ్డాడు కొండయ్య

బాలమ్మ నిర్ఘాంతపడిపోయి, కొండయ్య వెనక్కు చేయి చాపి చూపిస్తూ "వచ్చేసినాడు... వచ్చేసినాడు" అని గొల్లుమంది.

"యెవురు? యెవురొచ్చేసినారు?" అంటూ వెనుదిరిగి చూసి, యెవరూ కనబడకపోవడంతో, కళ్ళపైన నీడ పడేలా అరిచేతిని నుదుటి కానించుకుని కొండ గుహల దాకా చూపుల్ని సారించాడు కొండయ్య.

సత్యం పక్కకు అడుగేయగానే "యీ సారా?" అని మరో అడుగు వెనక్కు గెంతింది బాలమ్మ. "పొద్దన్నించీ నాకెవుర్ని చూసినా ఆ మనిషే వచ్చినట్టుగా అగుపడతా వుండాది" అని యేడవబోయింది. ఆ తరువాత "పోదాం రా నాయినా! సారొస్తాడేమో..." అంది.

ఆమెను పట్టించుకోకుండా కొండయ్యకేసి విసుగ్గా చూస్తూ "అట్లెందుకు జూస్తావు? కొంపదీసి ఆ మునీశ్వరుడేమైనా వస్తాడనా?" అన్నాడు సత్యం వ్యంగ్యంగా.

కొండయ్య తలగోక్కుంటూ వెనక్కు తిరిగి "యింగేమొస్తారు?" అనేశాడు.



# రూపాయి కలం

**అతని**
మరణ సమయాన్ని నాలోకి అనువదించుకుంటున్నాను
చీకటి లోయలాంటి ఊరిలో
మిలమిల మెరిసే సెలయేరు...
నలభై ఏళ్ళు పైబడిన అనేక మజిలీల మధ్య
లేత చేతులు తాకిన అతని పాదాలను జ్ఞాపకం చేసుకుంటాను...
రిక్షాలో ఓ మూల వొదిగి కూర్చున్న నాకు
పాఠశాలను, వంతెనను, రహదారిని,
గలగలపారే ఏటిని,
రిక్షా కార్మికుని చెమటను చూపించి,
మనిషి బొమ్మకాదు,
నడుస్తున్న మంచు తెర అనే మాటను
జ్ఞాపకం చేసుకుంటాను.

**1.**

**మూడవ** తరగతి తెలుగు వాచకాన్ని
అట్టవేసుకొని సంచిలో భద్రంగా దాయి
నా దగ్గర ఆ ఆ ల నుండి క గుణింతం నుండి ప్రారంభం కా
అన్న మృదువైన నీటి తెరను జ్ఞాపకం చేసుకుంటాను
పిడికెడు బియ్యం, రెండణాల కోసం
అక్షరాల్ని పావురాళ్ళుగా ఎగరేసిన
ఆకలి సమయాల్ని జ్ఞాపకం చేసుకుంటాను.
క్షయతో ఊయలలూగిన ఊపిరితిత్తులు
ఆగని తడి దగ్గు, ఆయాసంతో ఊగే శరీరం
కుదురుగా ఉండనివ్వని శరీరాకృతి
పేడతో అలికిన అరుగుపై కూర్చొని
పిల్లల హృదయంలోకి నీటిధారలా ప్రవేశించాడు.
పురాణ జానపద కథల సారాంశాన్ని
పసి మనసులలో విత్తనంలా నాటాడు.
ఎగరాల్సినంతగా ఎగిరారు.
పసి కనులలో ఈర్ష్యను తొలగించి
వెన్నెల స్నేహాల్ని పదిలం చేశాడు.

**2.**

**ఇంటి** ఆవరణ నుండి
ప్రపంచాన్ని వొడిసి పట్టుకొని
పిల్లలను పునాదిరాళ్ళను చేశాడు.
అతని చివరి రోజులు
ఆస్పత్రికి – ఇంటికి కుదించుకు పోయినప్పుడు
ఓ సాయంకాలం,
తగరపువలస, పఠాభి దుఖాణంలో
నాకొక కలం కొనిచ్చాడు
బాల్య అల్లరిలో కలం ముక్కలయింది.

**3.**

**మనుషులు** ముక్కలు కావొచ్చు
వస్తువులు విరిగిపోవచ్చు
మనిషి ఆకృతి సజీవం
ఊరిలో అతనెవరికి జ్ఞాపకమున్నాడో తెలియదు
అతన్ని జ్ఞాపకం చేసుకోవడం ఊరికి అవసరం లేకపోవొచ్చు
అప్పారావు అనే వికలాంగ ఉపాధ్యాయుడు
గానుగాడే తెలికల కులస్తుడు
జ్ఞాపకం చేసుకోవడం సందర్భం కాకపోవొచ్చు
వస్తువులు వలలో మనుషులు అంతరించవచ్చు
ఆనాటి మిత్రుల్ని కదిపితే
ఎంతో కొంత మేర జ్ఞాపకం చేసుకోవొచ్చు
ఎంతకీ గుర్తుకు రాకపోవొచ్చు
ఊరి మొదట్లో ఎన్టీఆర్ విగ్రహానికి బదులు
అతని స్మారక స్థూపాన్ని నిర్మించాలని నేనంటే
నన్ను కత్తులతో పొడవనూ వచ్చు
అతను ఊరి మనిషి
మామూలు మనిషి.
తెలిసిన అక్షరాలను నేర్పి
పోలియో బారిన పడి, క్షయవ్యాధితో మరణించినవాడు
అతని మరణం దగ్గర నేనున్నప్పుడు
నా హృదయ శరీరాల ప్రాయం తొమ్మిదేళ్ళు.

**4.**

**నా ప్రయాణమంతా** అతన్ని మోసుకు తిరుగుతున్నాను
అర్ధణా కోసం ఎదురు చూచే అతను
రూపాయి కలం కొనిచ్చాడు.
సిరా ఇంకి పోవొచ్చు
నా లోపలి జ్వలనం ఆర్పడం ఎవ్వరి తరం కాదు
ఆ జ్వలనాన్ని వెలిగించిందతను

**5.**

**ఊరు**
ఆ ఊరు మనుషులు అతన్ని మరిచిపోవొచ్చు
గురిచూచి పాటపాడే అతన్ని
మీకు పరిచయం చేస్తున్నాను

**అరసవిల్లి కృష్ణ**
92472 53884

తోవకు అటూ ఇటూ రెండు దీపాలు వెలుగుతున్నాయి. ఆ బాటను రెండు దీపాలూ కాంతివంతం చేస్తున్నాయి. కానీ, వాటిలో ఏ దీపం వెలుగు ఎంత వరకూ ప్రసరిస్తున్నదో, ఎక్కడకు పరిమితమవుతున్నదో చెప్పడం సాధ్యం కాదు. మానవాళి ప్రస్థానం మీద చరిత్ర, సాహిత్యం అనే రెండు దీపాల వెలుగూ అలాంటిదే. ఈ రెండు దీపాల కాంతిధారల మధ్య విభజన రేఖను గీయడం సాధ్యం కాదు. చరిత్రకీ, సాహిత్యానికీ ఉన్న బంధాన్ని కొన్ని వందల సంవత్సరాల క్రితమే ప్రపంచం గుర్తించింది. ఆధునిక చరిత్ర తత్వవేత్తలు కూడా సాహిత్యమంటే చరిత్రకు ఛాయేనంటారు. గొప్ప సాహిత్యం దేనికైనా చరిత్రే ముడిసరుకు అయి ఉంటుంది. చరిత్ర పరిశోధన పట్టించుకోని, పరిశోధకుల మేధకు అందని సున్నిత కోణాన్ని సృజనాత్మక సాహిత్యం ఆవిష్కరిస్తుంది. మానవాళికి తగిలిన గాయం పూర్వాపరాలను తర్కిస్తుంది చరిత్ర. కానీ సృజనాత్మక సాహిత్యం అదే గాయానికి గొంతుకగా మారుతుంది. గాయం గాథనీ, బాధనీ వినిపిస్తుంది. పరిశోధన సూత్రాల పరిష్వంగం నుంచి విడవడి ఆ కాలపు ఆత్మనూ, దాని ఘోషనూ, వైయక్తికమైన అనుభవాలనూ సృజనాత్మక సాహిత్యం అన్వేషిస్తుంది. చరిత్ర ఆధారంగా నిర్మించే సాహిత్యం ఒక ముఖ్య స్రవంతిగా చాలా భాషలలో సాగడం అందుకే. ఇటీవల కాలంలో ఆ స్రవంతి ఇంకా బలీయమవుతోంది. వేగవంతమవుతోంది. ఇది సాహిత్య ప్రపంచం గమనించవలసిన ముఖ్యాంశం. మరీ ముఖ్యంగా తెలుగు సాహిత్యలోకం గుర్తించాలి.

# గతంతో సంభాషిస్తూనే ఉందాం!

డా॥ గోపరాజు నారాయణరావు

**ఇప్పుడు** మొదటి ప్రపంచ యుద్ధం (1914 -1918) నూరేళ్ల సందర్భం. దీనిని భారత్ సహా ప్రపంచంలో ఎన్నో దేశాలు ప్రత్యేకంగా గుర్తిస్తున్నాయి. ఈ మహా సమరంలో ఒక్కొక్క ఘట్టం ఒక్కొక్క మహా నవల. ఒక్కొక్క సైనికుడి అనుభవం ఒక గొప్ప రచన. 1915లో లూసిటేనియా ఉదంతం జరిగింది. లూసిటేనియా బ్రిటిష్ నౌక. ప్రపంచంలోనే అతి పెద్దది. 1,265 మందితో ప్రయాణిస్తుండగా మే 7, 1915న జర్మనీ ప్రయోగించిన యూబోట్ (జలాంతర్గామి)తో అది మునిగిపోయింది. అంతకు మూడేళ్ల క్రితం మునిగిన టైటానిక్ నౌక వంటిదే లూసిటేనియా కూడా. పాశ్చాత్య దేశాలకు చెందిన కోటీశ్వరులు, రాజకీయవేత్తలు, కళాకారులు, కవులు, సినీ రంగ ప్రముఖులు ఈ నౌకలో ఉన్నారు. ఇంతకీ జర్మనీ ప్రయోగించిన యూబోట్, లూసిటేనియాకు తగిలేటట్టు వ్యూహం రచించినవాడు ఒక బ్రిటిష్ ప్రముఖుడేనని ఇప్పటికీ అనుమానం. అతడు మరెవరో కాదు, విన్‌స్టన్ చర్చిల్. ఇది మొదటి యుద్ధానికి దూరంగా ఉన్న అమెరికాను దించడానికి వేసిన దుష్ట పన్నాగమని ఒక వాదన ఉంది. ఈ అంశాలను తీసుకుని గ్రెగ్ కింగ్, పెన్నీ విల్సన్ అదే పేరుతో నవల రాశారు. అది ఇటీవలి కాలంలోనే పాఠకులకు చేరింది. ఇంతకు ముందు ఈ అంశం మీద కొన్ని రచనలు వచ్చాయి. తాజాగా ఈ నవల కూడా వెలువడింది. రచయిత ప్రతిభకు పరీక్ష పెట్టేవీ, పాఠకుల అభిరుచిని పెంచేవీ ఇలాంటి రచనలే.




ప్రత్యేకంగా సందర్భమేదీ లేకపోయినా మిషెల్లె మోరాన్ ఇటీవలే రాసిన ఒక నవల భారతీయుల దృష్టిని ఆకర్షించేదే! ఆ నవల పేరు 'రెబెల్ క్వీన్'. ఝాన్సీరాణి లక్ష్మీబాయి జీవితం ఆధారంగా మోరాన్ ఈ నవల రాశారు (కొన్ని దశాబ్దాల క్రితం మహాశ్వేతాదేవి కూడా లక్ష్మీబాయి జీవితం ఆధారంగా అద్భుతమైన నవల రాశారు. తెలుగు అనువాదం కూడా ఉంది). 368 పేజీల మోరాన్ నవలను చూసి, ఇన్ని పేజీలు 'ఎవరు చదువుతార'ని నిర్ధారించుకుని మనవారు దిగుమతి చేసుకోలేదేమోనని అనిపిస్తుంది. ఈ నవల మీద వచ్చిన సమీక్షలు చూస్తే, ప్రతి చిన్న అంశాన్ని రచయిత్రి ఎంత కూలంకషంగా అధ్యయనం చేశారో అర్థమవుతుంది. అంటే అదంతా రచయిత్రి కల్పన కాదు, అదొక ఉబుసుపోక రచన కాదు. మన గతం. మన ప్రథమ పోరాట చరిత్రలో ఒక కోణం. దాని గురించి వచ్చిన విస్తృత అక్షరచిత్రం.

చరిత్రను పునర్ లిఖించుకోవడం, పునర్ మూల్యాంకన చేసుకోవడం ప్రతితరం మీద ఉన్న బాధ్యత. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకుని పరిశీలిస్తే









మ్యాన్ బుకర్ పురస్కారాలు అందుకున్న రచయితలూ, రచయిత్రులూ ఎంతో అభినందనీయులు. చరిత్రను ఆధారం చేసుకునే సాగినా, సృజనాత్మక రచనలేవీ పరిశోధకులు, చరిత్రకారుల ప్రమాణాలకు సంపూర్ణంగా ఒదిగి ఉండవు. కానీ కొత్త పరిశోధనల ఆధారంగా వెలుగు చూపిన విషయాలు విస్తృత ప్రచారం పొందడానికి ఈ సృజనాత్మక రచనలే ఉపకరిస్తాయి. ఈ అంశాలను రుజువు చేస్తూ ఇటీవల వచ్చిన కొన్ని చారిత్రక నవలలు చూద్దాం. ఇవి వాటి స్థూల పరిచయాలు మాత్రమే. అయినా యాభయ్ ఏళ్ల క్రితమో, ఆఖరికి పాతిక సంవత్సరాల క్రితమో జరిగిపోయిన కొన్ని ఘటనల మీద ప్రజలకు ఉన్న దృష్టి ఒక కొత్త వాస్తవంతో, సరికొత్త కోణంతో ఎలాంటి మార్పు తెచ్చుకుంటుందో ఇవి నిరూపిస్తాయి. చరిత్ర అధ్యయనంలో, పరిశోధనలో ఎన్నో మార్పులు వచ్చాయి. దృక్కోణాలు మారాయి. రాజవంశాల చరిత్రలూ, చక్రవర్తుల చరిత్రలూ వెనుకపడినాయి. సాంస్కృతిక కోణంతో పాటు, కింది వర్గాల ఉనికికి ప్రాధాన్యం ఇస్తూ సబాల్టర్న్ అధ్యయనాలు వచ్చాయి. దానిని బట్టే సాహిత్యం కూడా కొత్త పుంతలు తొక్కింది.

1989లో బుకర్ పురస్కారం పొందిన నవల 'ది రిమెయిన్స్ ఆఫ్ ది డే'. రచయిత కజువొ ఇషిగురో. ఇతడు జపాన్‌లోని నాగసాకిలో పుట్టి, ఇంగ్లండ్‌లో స్థిరపడిన రచయిత. బ్రిటిష్ పార్లమెంట్ చేసిన 1911 నాటి చట్టం, మొదటి ప్రపంచ యుద్ధం (1914) తరువాత పెరిగిన పన్నులు ఆ దేశ కులీన వర్గాన్ని ఎలా పతనం చేశాయో ఇషిగురో తన నవలలో చిత్రించాడు. ఈ నవలా ప్రక్రియలోనూ అక్కడి రచయితలు కొత్త కొత్త పుంతలను కూడా తొక్కారు. హిస్టరియోగ్రాఫిక్ మోటాఫిక్షన్ అలాంటిదే. సృజనాత్మక దృష్టితో చరిత్రను పునర్మూల్యాంకన చేయడమే ఈ శైలి ఉద్దేశం. ఎ.ఎస్. బెయట్ రాసిన 'పొసెషన్: ఏ రొమాన్స్' నవల అలాంటిదే. నిజానికి సాల్మన్ రష్దీ 'మిడ్‌నైట్ చిల్డ్రన్' ఈ విభాగంలోకి వస్తుందంటారు. ఇంకా 'ఇంగ్లిష్ పేషెంట్' అనే విఖ్యాత నవల కూడా అలాంటిదే. హిస్టరియోగ్రాఫిక్ మోటాఫిక్షన్ అనేది పోస్ట్ మోడరన్ కళాప్రక్రియ. విక్టోరియా యుగం, వర్తమానకాలాల మధ్య భేదాన్ని రెండు కల్పిత కవులు పాత్రలతో బెయట్ తన నవలలో చర్చించారు. దీనికే 1990లో బుకర్ బహుమానం వచ్చింది. 1992లో అదే పురస్కారం అందుకున్న 'ది ఇంగ్లిష్ పేషెంట్' నవల కూడా ఆ కోవలోనిదే. మైఖేల్ ఒండాజె ఈ నవల రాశాడు. రెండవ ప్రపంచ యుద్ధం నేపథ్యంలో నలుగురు క్షతగాత్రుల అనుభవాలను రచయిత ఇందులో వర్ణించారు. హిరోషిమా మీద అణుబాంబు దాడిలో ఈ నవల ముగుస్తుంది. కృపాల్‌సింగ్ అనే భారత సిపాయి పాత్ర కూడా ఇందులో ఉంది. 1992 పురస్కారాన్ని ఒండాజెతో కలసి తీసుకున్న రచయిత బ్యారీ అన్స్‌వర్త్. ఆయన నవల 'సేక్రెడ్ హంగర్'. 18వ శతాబ్దం నాటి బానిస వ్యవస్థ, దాని రూపురేఖలు ఇందులో ఇతివృత్తం. 1995లో బుకర్ పురస్కారం అందుకున్న నవల 'ది ఘోస్ట్ రోడ్' మొదటి ప్రపంచయుద్ధంలో షెల్ షాక్‌నకు గురైన ఒక సైనికుడి అనుభవం. పాట్ బార్కర్ రాసిన నవల ఇది. షెల్ షాక్ ఆధునిక యుద్ధ చరిత్రలో ఘోరాలను మించిన ఘోరం. నిజానికి ఆ షాక్ అనుభవాన్ని మూడు నవలలుగా రచయిత ఆయన విస్తరించారు. అందులో మూడో భాగమే ఈ నవల. మొదటి ప్రపంచయుద్ధంలో పెద్ద విషాదమని చెప్పదగిన కవి సైనికుడు సీగ్‌ఫ్రెడ్ ససూన్‌ను రచయిత ఇందులో ఒక పాత్రగా ప్రవేశపెట్టారు. ససూన్ ఇంగ్లిష్ సైన్యంలో పనిచేశాడు. కానీ రూపురేఖలు జర్మన్లకు దగ్గరగా ఉంటాయి. కారణం ఇతని తాతలలో ఎవరో జర్మన్ సంతతి వారు. అతడి కళ్లూ, ఒంటి రంగు చూసి ఇంగ్లిష్ సైనికులే కాల్చారు. ఎట్టకేలకు బతికినా, కొద్దికాలం మతి చలించింది. ఇతడు మొదటి ప్రపంచ యుద్ధం విషాదం మీద అనేక కవితలు రాశాడు. బార్కర్ ఇలాంటి ఒక చారిత్రిక విషాదాన్ని తన నవలలో పాత్రగా మలిచాడన్నమాట.



2014 సాహిత్య నోబెల్ పురస్కార విజేత పాట్రిక్ మోడియానో



సుప్రసిద్ధ భారతీయ ఆంగ్ల రచయిత అమితావ్ ఘోష్

నెడ్ కెల్లీ అనే వెలికి గురైన తెగకు చెందిన దొంగ కథతో 18వ శతాబ్దం ఐర్లాండ్ సామాజిక దృశ్యాన్ని పీటర్ కెరె తన నవల 'ట్రూ హిస్టరి ఆఫ్ ది కెల్లి గ్యాంగ్'లో చిత్రించారు. దీనికే 2001లో బుకర్ బహుమతి లభించింది.

2009, 2012 సంవత్సరాలలో బుకర్ బహుమానాలు గెలుచుకున్న రచయిత్రి హిలారీ మేంటెల్. అందులో 'ఉల్ఫ్ హాల్' నవల ఇతివృత్తం 1500–1535 మధ్య ఇంగ్లండ్ ఎనిమిదో హెన్రీ హయాంలో చోటు చేసుకున్న సంఘటనల సమాహారం. ఇందులో థామస్ క్రామ్వెల్ కీలకమైనవాడు. ఒక సాధారణ కుటుంబం నుంచి బ్రిటిష్ ప్రధానిగా క్రామ్వెల్ ప్రయాణమే ఈ నవల ఇతివృత్తం. దీనికి కొనసాగింపుగా రాసిన మరో నవల 'బ్రింగప్ ది బాడీస్'కు 2013లో అదే పురస్కారం లభించింది. 2014లో బుకర్ పురస్కారానికి ఎంపికైన 'ది నేరో రోడ్ టు ది డీప్ నార్త్' కూడా రెండో ప్రపంచ యుద్ధం నేపథ్యంలో రాసిన నవలే. జపాన్ యుద్ధఖైదీలతో చరిత్రలో బర్మా – థాయ్ మృత్యు రైల్వే మార్గంగా పేరు పొందిన మార్గాన్ని ఎంత నిర్దయగా నిర్మింప చేశారో ఈ నవలలో రచయిత రిచర్డ్ ఫ్లానన్ చిత్రించారు. డోరిగో ఇవాన్స్ అనే ఆస్ట్రేలియా డాక్టర్ అనుభవంగా దీనిని ఆయన రూపొందించారు. 2014 సాహిత్య నోబెల్‌ను అందుకున్న పాట్రిక్ మోడియానో రచనలలో నాజీల దురాగతాలు కళ్లకు కట్టినట్టు ఉంటాయి. 2012లో అదే పురస్కారం అందుకున్న మోయాన్ చైనాలో సాంస్కృతిక విప్లవ అనంతర పరిస్థితులను, దాని దుష్ఫలితాలను తన రచనలలో చిత్రించారు.

చారిత్రక నవలల మీద కొందరు భారతీయులు, లేదా భారత సంతతి వారు కూడా విశేషమైన శ్రద్ధ చూపుతున్నారు. అమితావ్ ఘోష్, సాల్మన్ రష్దీ అలాంటివారే. అమితావ్ నవల 'రివర్ ఆఫ్ స్మోక్' చైనాలో జరిగిన నల్లమందు యుద్ధాల నేపథ్యంగా సాగుతుంది. ఆ యుద్ధాల సమయంలో వ్యాపారం చేయడానికి అక్కడకు వెళ్లిన బహ్రామ్ మోదీ అనే పార్సీ కథ ఇది. అయితే చారిత్రక నవలలకు పాఠకులలో ఉన్న ఆదరణ ప్రశ్నార్థకమే.

* * *

చారిత్రక నవలా ప్రక్రియను పటిష్టం చేసుకోవడంలో, ఇష్టపడడంలో భారతీయులు, తెలుగువారు పాశ్చాత్యులతో పోటీ పడడం లేదు. పోటీ పడాలన్న తపన కూడా లేదు. అందుకే ఆ కొన్ని నవలలను గుర్తు చేయడం. అక్కడ వాల్టర్ స్కాట్ (ఇంగ్లండ్) ఆరంభించినట్టు చెప్పే ఈ ఆధునిక నవలా ప్రక్రియను ఇంగ్లిష్ వారితో సహా, రష్యన్లు, ఫ్రెంచ్ వారు, కెనేడియన్లు, ఆస్ట్రేలియన్లు కూడా పటిష్టం చేసుకున్నారు. ఆ ప్రక్రియను కొనసాగిస్తున్నారు. కానీ మన దగ్గర కొన్ని దశాబ్దాల క్రితం ఈ ప్రక్రియ పట్ల పాఠకులు చూపించిన కనీస ఆదరణ ఇప్పుడు కానరావడం లేదు. పాఠకుల సంగతేమోగానీ, రచయితలు కూడా ఈ వైపు చూడడం లేదు. అయితే అలాంటి ప్రయత్నం అసలేమీ జరగలేదని చెప్పడం ఇక్కడ ఉద్దేశం కాదు. తెలుగులో మంచి ప్రయత్నమే జరిగింది. భారతీయ భాషలలో చూసుకుంటే కొన్ని నవలలు కనిపిస్తాయి. వాటి అనువాదాలు కూడా తెలుగులో వచ్చాయి. తెలుగులో విశ్వనాథ (అనేక నవలలు), నోరి నరసింహశాస్త్రి (రుద్రమ దేవి, కవిత్రయం, నారాయణభట్టు), అడవి బాపిరాజు (నారాయణరావు, గోన గన్నారెడ్డి), చంఘిజ్‌ఖాన్ (తెన్నేటి సూరి), వట్టికోట ఆళ్వారుస్వామి (ప్రజల మనిషి), మహీధర (కొల్లాయి గట్టితేనేమి), గొల్లపూడి నారాయణరావు (తెలుగుగడ్డ), దాశరథి రంగాచార్య (చిల్లరదేవుళ్లు), సాధు సుబ్రహ్మణ్యశర్మ (బంకోలా) వంటివారు అప్పుడు చేసిన ప్రయత్నంలో ఇప్పుడు పదో వంతు కూడా కనిపించదు. కానీ ఇటీవల కాలంలో జరిగిన కొద్ది ప్రయత్నం, అంటే పాతిక సంవత్సరాల నుంచి జరిగినది – కొంత ప్రత్యేకంగానే కనిపిస్తున్నది. పీవీ నరసింహారావు, అంపశయ్య నవీన్, ముదిగొండ శివప్రసాద్, సాహు, ప్రాణ్‌రావు, సరిపల్లి కృష్ణారెడ్డి వంటి కొందరు ఈ ప్రయత్నం చేశారు. పీవీ 'లోపలి మనిషి', నవీన్ 'కాలం రేఖలు' చెప్పుకోదగినవి. పీవీ 'లోపలి మనిషి' ఒక అసాధారణ రచన అనిపిస్తుంది. స్వతంత్ర భారత దేశం మీద, అందులో నేతల, ప్రజల దివాలాకోరుతనం మీద 'లోపలి మనిషి' గొప్ప వ్యాఖ్య. తన సంస్కృతిని మొదలు పెట్టి, ఉత్కృష్టమైన స్వాతంత్ర్య పోరాటం ఇచ్చిన స్ఫూర్తిని ఆ జాతే ఎలా భ్రష్టు పట్టించిందో పీవీ గొప్పగా ఆవిష్కరించారు. తనను తాను దగా చేసుకున్న, చేసుకుంటున్న జాతిగా భారతీయులు ఇందులో మనకు కనిపిస్తారు. కానీ మొత్తంగా భారత దేశ చరిత్ర చూస్తే చరిత్రకు సంబంధించి ఈ సృజనాత్మక రచనా వ్యాసంగం ఏపాటిదన్న ప్రశ్న మిగులుతుంది.

* * *

భారతదేశం మీద అనేక తెగలు చేసిన దాడులు ఉన్నాయి. బయటి నుంచి వచ్చిన వారితో ఘర్షణ ఉంది. వారి మధ్య సర్దుబాట్లు ఉన్నాయి. కొత్త సంస్కృతులు, జీవన విధానాలు ఆవిర్భవించిన సంగతులు ఉన్నాయి. ఇక్కడి నుంచి ఇరుగు పొరుగు దేశాలకు, ఖండాలకు టీ తోటలలో పనికి

వెళ్లిన కుటుంబాల గాథలు ఉన్నాయి. మహా కట్టడాలు ఉన్నాయి. కొన్ని కూల్చివేతలు ఉన్నాయి. 1857 ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించే రచన వచ్చిందా? గాంధీ వంటి నాయకుడి మీద ఒక మంచి నవల వచ్చిందని ఇప్పటికైనా మనం చెప్పుకోగలమా? ఆయన ఘనతలు ఉన్నాయి. ఆయనే ఒప్పుకున్న తప్పిదాలూ ఉన్నాయి. అంతకు ముందు వందేమాతరం ఉద్యమం ఉంది. రామ్మోహనరాయ్, దయానంద, విద్యాసాగర్ వంటి సంస్కర్తలు ఇక్కడే నడయాడారు. వారి జీవితాల ఆధారంగా గానీ, వారి కాలం నాటి పరిస్థితుల మీద గాని దేశమంతటికీ తెలిసిన రచనలు రాలేదు. జవహర్‌లాల్ 'డిస్కవరీ ఆఫ్ ఇండియా', రాబర్ట్ సివెల్ 'ఫర్‌గాటెన్ ఎంపైర్', వి.డి.సావర్కర్ 'ఫస్ట్ వార్ ఇండియన్ ఇండిపెండెన్స్', కల్నల్ టాడ్ 'రాజస్థాన్ కథావళి' వంటి గ్రంథాలలో అనేక కదలించే ఘట్టాలు ఉంటాయి.

తెలుగు రాష్ట్రాలలో చూసినా సాంస్కృతిక, రాజకీయ ఉద్యమాలు కొన్ని జరిగాయి. అంతో ఇంతో ఘనమైన గతమే ఉంది. అయినా చారిత్రక రచనల మీద ఆసక్తి ఏర్పరుచుకోవడంలో తీవ్రమైన లోపం ఉంది. స్వాతంత్ర్య పోరాటం, సంస్కరణోద్యమాలు, గిరిజనోద్యమాలు, రైతాంగ పోరాటం, సాయుధ సమరాలు ఇక్కడ చోటు చేసుకున్నాయి. కందుకూరి వంటి వారు నడిపిన స్త్రీజనోద్ధరణ మీద, వాస్తవిక అంశాల మీద సృజనాత్మక రచనలు ఏవి? అల్లూరి సీతారామరాజు వంటి గొప్ప నాయకుడి జీవితం ఆధారంగా నిజంగా మంచి నవల వచ్చిందా? ముమ్మాటికీ లేదు. అలాగే ఇంకా ఎందరో. మనదొక ప్రత్యేకమైన సామాజిక దృశ్యం. అందులో అంటరానితనం చాలా పెద్ద అంశం. మంచి దళిత కవిత్వం వచ్చినా, అందరికీ అందుబాటులో ఉండే వచన రచనలు ఆ అంశంమీద ఏ మేరకు వచ్చాయి? ఉన్నవ 'మాలపల్లి', జి. కల్యాణరావు 'అంటరాని వసంతం' వంటివి కొన్ని మాత్రమే స్ఫురణకు వస్తాయి.

అంతర్జాతీయ చరిత్ర రచనా సంఘాలు ఒక ఘటన జరిగిన పాతికేళ్ల తరువాతనే వాటిని అక్షరబద్ధం చేయడం సముచితం అంటారు. అలాంటివే చారిత్రక రచనల కోవలోకి వస్తాయని అంటారు. అలా చూసినా ఎన్నో సంఘటనలు మనకు కనిపిస్తాయి. శ్రీకాకుళంలో జరిగిన నక్సల్ ఉద్యమం, తరువాత తెలంగాణకు వచ్చిన ఆ ఉద్యమంతో ఎందరో రచయితలు మమేకమై ఉన్నారు. సమాజాన్ని బాగా కదిలించిన ఆ ధోరణి మీద రావలసినన్ని రచనలు వచ్చాయా? వచ్చినా అవి ఎన్ని? ఉన్నవాటి మీద అయినా విలియం డార్లింపుల్ వంటివారు చేస్తున్న ఆరోపణ నిరాకరించలేనిది. అభిలేఖాగారాన్ని (ఆర్కైవ్స్) చూడకుండానే భారతీయులు చరిత్ర రచనకు పూనుకుంటారని డార్లింపుల్ ('ది లాస్ట్ మొఘల్' ముందుమాటలో) ఆరోపణ. నిజానికి దీనిని ఖండించడం అంత సులభం కాదు.

మనం మన మాతృభాషను గౌరవించలేకపోతున్నాం. మన చరిత్రను అధ్యయనం చేయడానికి మనం ఆసక్తి చూపించం. ఇక మన గతాన్ని మనం మననం చేసుకోవడానికి ఇష్టపడకపోవడంలో ఆశ్చర్యం ఏముంది? ఏ మహా ఘట్టాన్ని మనం అక్షరబద్ధం చేసుకున్నాం? ఎందరు మహా పురుషులను మన కావ్యాలలో హీరోలుగా చూసుకోగలిగాం? ఈ దుస్థితి నుంచి బయటపడే క్షణం వస్తుందని ఆశిద్దాం. చివరిగా - చరిత్రను చదవడమంటే స్వర్ణయుగాలను చూసి మురిసిపోవడమే కాదు, గర్వపడడమే కాదు, చీకటియుగాలను చూసి పాఠం నేర్చుకోవడం కూడా. గతంతో సంభాషిస్తూనే ఉండాలి. అప్పుడే సాహిత్యం ఉన్నతంగా ఉంటుంది.

# కాలమా నీవెక్కడ...?



డా॥పి.విజయలక్ష్మి పండిట్

**తనకంటూ** ఓ అస్తిత్వం లేని కాలం
కరిగిపోతోంది నిరంతరంగా
మనిషి ఆలోచనలలో...
మనిషి మస్తిష్కమే కాలం ఉనికి.
ప్రతి మనిషి వర్తమానకాలంలోనే
తన భూత భవిష్యత్కాలాలలోకి
తొంగి చూస్తుంటాడు
అంటే...గడుస్తున్న ఆ క్షణాలు
గడిచిన జ్ఞాపకాలు,
గడపబోయే కాల ఆశయాలు
మూడింటి సంగమ కాలం
వర్తమానమే!
తన మనసు సృష్టించే ఊహలే
కాలాన్ని దూరాన్ని కొలిచే కొలబద్దని,
తన మనసే కాలం నివాసమని
ఆలోచించడు మనిషి.
ఎందుకంటే...కాలాన్ని
తన అధీనంలో ఉంచుకున్న మనసు
మనిషి అసలు చైతన్యాన్ని
మూల కూర్చోబెట్టి
తానే ఆ మనిషినని విర్రవీగుతుంది.
వర్తమాన కాల ఆ జీవ క్షణాలలో
మనిషి మూల చైతన్యం
ప్రకృతి అందాలందించే ఆనందాన్ననుభవించక,
ఆ అనంత చైతన్య ప్రవంతి జాడలను
అన్వేషించి అందుకోవాలనే స్పృహ లేక
గడచిన జ్ఞాపకాల అందని ఊహల
కాలం సుడిగుండంలో మనిషి
అమాయకంగా కొట్టుకు పోతుంటాడు.






"నది డేవిడ్‌తో లేచిపోయింది" అన్నాడు అవినాష్, మేం తాగడం మొదలు పెట్టిన అర్థగంట తరువాత. ఆ ఇల్లంతా నది స్పర్శతో నిండి వుంది. చూపు ఎటు తిప్పినా ఆమెలోని ఉత్తేజాన్ని, ఆహ్లాదాన్ని, ముఖ్యంగా ఆ చలనశీలతని గుర్తు తెచ్చే విషయాలే అన్నీ...

"నది మంత్రగత్తె" ముఖం బిగించి కళ్ళు తీక్షణం చేసి అన్నాడీసారి.

నేనేం బదులీయలేదు.

"దానికి కామరూప విద్య వచ్చు. నిజంరా వరుణ్... నేనీ విషయాన్ని ఇంకెవ్వరికీ చెప్పలేదు. చెప్పినా నమ్మరు. నాకు పిచ్చి పట్టిందనుకుంటారు. అది సీతాకోకగా, త్రాచుపాముగా మారడం నా కళ్ళారా చూశాను. త్రాచుగా మారినప్పుడే దాని నడుము విరగ్గొట్టాను" అన్నాడు.

7

# పఫ్ : ది మాజిక్ డ్రాగన్

## సామాన్య

నేను ఉలిక్కిపడ్డాను..."కొట్టావా అవినాష్... నదిని కొట్టావా నువ్వు?" అన్నాను.

"ఔన్రా చచ్చేట్టు కొట్టా! ఒక అర్థరాత్రిపూట నేను నిదుర పోయాననుకుని, ఇంత పొడుగు గోధుమ వన్నె త్రాచుగా మారిపోయింది. మంచం దిగి సర్‌సర్‌మంటూ మా ఇంటి వెనకాల వున్న అడవిలోకి వెళ్ళింది. నేను వెంబడించాను. కాసేపటి తర్వాత జాడలేకుండా పోయింది. నేను అక్కడే కాపు కాశాను. దాదాపు నాలుగు గంటలు గడిచి పోయాయి. పక్షులన్నీ లేచి అరవడం ప్రారంభించాయి. సన్నగా వెల్తురు పడటం ప్రారంభమైంది. అదిగో అప్పుడొచ్చింది వెనక్కు. సూర్యకిరణాలు పడి తళ తళా మెరిసిపోతుంది. సూర్యకిరణమో, డేవిడ్‌ని కలిసిన ఆనందమో అనిపించిందో క్షణం. అంతే, పక్కనున్న చెట్టు కొమ్మను విరిచి దానిపై పెద్దవేటు వేశాను. దెబ్బ పడగానే తోకపై ఇంత ఎత్తున లేచి ఉగ్రంగా బుస కొట్టింది. మిరియం గింజలలాటి ఆ కళ్ళతో నన్ను సూటిగా చూసి నేలకి వాలింది. అంతే, ఇక ఎన్ని దెబ్బలు వేసినా కదల లేదు. ఎదురు తిరగలేదు. చివరకి నేనే కొట్టడం ఆపి కదిలించి చూసాను. ప్రాణం పోయింది. కానీ నాకు తెలుసు కదా, అది మంత్రగత్తె. మేజిక్ వచ్చు దానికి. నేను వచ్చేశాక రూపం మార్చుకుని అటునుంచి అటే ఆ డేవిడ్ దగ్గరికి వెళ్ళి ఉంటుంది" అన్నాడు.

ఒక వేకువన 'పఫ్'ని పరిచయం చేసిన నా ప్రియమైన అమ్మాయి మీనాక్షికి... రచయిత్రి






అవినాష్ చెప్పింది వినేసరికి నాకు పిచ్చెక్కి పోయింది. ఏం చెప్తున్నాడు వీడు? నది మీద చెయ్యి వెయ్యడమే...!

"రేయ్ అవినాష్...నది డేవిడ్ దగ్గరకి వెళ్ళిందని చెక్ చేసుకున్నావా? ఇప్పుడెక్కడ వున్నారు వాళ్ళు?"

"తెలీద్రా...వాళ్ళని గురించి ఆలోచించడం మొదలుపెడితే జంట హత్యలు చేయాల్సి ఉంటుంది. అందుకే మనసులోంచి తుడిచి పెట్టేశాను. ఇది కూడా నువ్వు ఇన్నేళ్ళకి వచ్చావు కదా అని జస్ట్ ఇన్ఫర్మేషన్ పాస్ చేస్తున్నాను. అంతే!" అన్నాడు.

నేను చేతిలో ఉన్న గ్లాస్‌ని ఎదురుగా ఉన్న పుస్తకాల అల్మారాకేసి విసిరి కొట్టాను. ఆ అల్మారా, అందులో ఉన్న పుస్తకాలు నదివి...గ్లాసు అలమారని కూడా గాయపరచి కిందపడి బద్దలయింది. అవినాష్ వంక ఒక్క చూపు కూడా చూడకుండా హాల్ దాటి, వరండా దాటి, కార్‌లో ఎక్కి యాక్సిలేటర్ బలంగా తొక్కాను. నల్లటి చీకటి... నల్లటి రోడ్డు...ఎదుట నక్షత్రాల ఆకాశం...నీలా కాశం... నీలాకాశాన్ని మెరిపిస్తూ తెల్లటి నక్షత్రాలు...అచ్చం నదిలాగా...నల్లటి నది ముఖాన తెల్లటి చిరునవ్వులాగా...ప్రపంచంలోని వెలుగునూ, స్వచ్ఛతనూ పోగుచేసి పెట్టుకున్న నది కళ్ళు. మిలమిలా మెరుస్తూ బాల్యంలోని నిష్పూచీని గుర్తు చేసే పెద్ద పెద్ద కళ్ళు...

పదేళ్ళ క్రితం భూటాన్‌లోని ఒక లాడ్జిరూంలో లాప్టాప్ ముందు కూర్చుని వున్న దృశ్యం ముందు ఆగింది మనసు. అప్పటికే భూటాన్‌కి వచ్చి పద్నాలుగు రోజులయింది. కాలి నడకన సైక్లింగ్ చేస్తూ ఆ దేశపు సౌందర్యాన్ని తనివితీరా అనుభవిస్తూ వున్నాను. ఆవాళ నా అనుభూతుల ట్రావెలాగ్ కి "ఆనందాల అంబరాన్ని చుంబించే భూతలం భూటాన్" అని పేరు పెట్టి మురిసిపోతూ వుండగా వచ్చాడు గైడ్ గేల్ఫో. ఆ రోజు తాక్సాంగ్‌కి వెళ్ళాలి. "ట్రెక్కింగ్ కనీసం ఆరేడు గంటలు పడుతోంది, మీబోటి వాడికయితే" అని చెప్పాడు గేల్ఫో నిన్ననే. కానీ రాత్రి చాలా అలస్యమైపోయింది. ఇప్పుడు అప్పుడే పన్నెండు కావొస్తుంది. లాప్‌టాప్ షట్డౌన్ చేసి గబగబా తయారయ్యాను. సరిగా ఆ ఆ కొండ దగ్గరికి వచ్చేసరికి సన్నటి తుంపర మొదలయింది. కొంత దూరం నడవగానే చిన్ని మందిరం ఒకటి కనిపించింది. అందులో నుండో, మరెక్కడినుండో మృదువుగా చిరుగంటలు మ్రోగుతున్న ధ్వని. విండ్ బెల్స్‌లా ఆ నిశబ్దాన్ని గాఢంగా కావలించుకున్నట్టు, ఆ పక్కనే ఒక వృద్ధుడు కూర్చుని కర్రల్ని చెక్కుతున్నాడు, ట్రెక్కింగ్ స్టిక్‌లాగా. కొని బయల్దేరాం.

చుట్టూ రంగు రంగుల అరణ్యం. తడిసిన నేలా...అడవి పెనవేసుకపోయిన ఒక మత్తయిన నూత్న పరిమళం. అడవి మధ్యనుండి వెళుతున్న డొంక దారి. అక్కడక్కడా కొన్ని మెట్లు, బుద్ధిస్టు మంత్రాలతోనో ఏమో, నిండి వున్న రంగురంగు జెండాల అల్లికలు. మందిరాన్ని చేరి మూర్తిని దర్శించి, అక్కడి ఆచారమేదోనంటే దీపం వెలిగించి, తిరిగి వస్తూ వస్తూ, అక్కడికి కొంత దూరంలో కొండ వాలు మీంచి దూకుతున్న జలపాతాన్ని చూస్తూ, ఆ సౌందర్యాన్ని ఏం చేసుకోవాలో తెలియక మోహ దు:ఖంతో విభ్రాంతమై, నిలబడిపోయి చూస్తూ వుంటే, చూస్తూ చూస్తూ ఉండగానే కనుల ముందు అప్పటికప్పుడు వెలసిందో ఇంద్ర చాపం. ఆ వర్ణాలను కెమెరాలో బంధించాలని ప్రయత్నించి వెళ్ళి సరిగ్గా జలపాతానికి దిగువగా కొంత దూరంలో ఉన్న మెట్ల దగ్గర నిలు చుంటే... ఎక్కడనుండో గుసగుసలు. ఎవరో మృదు వుగా మనోహరంగా, రహస్యంగా తీయని సంభా షణ ఏదో చేస్తున్నట్లు... చుట్టూ చూస్తే నిర్మా నుష్యం. గైడ్ గేల్ఫో ఎటెళ్ళాడో...? నిశ్చలంగా ఆగి, విని, చేతిని గిల్లుకుని మళ్ళీ అటూ ఇటూ చూసి "ఎవరూ..." అంటే ఆగిపోయిన సంభాషణ. సన్నగా మెత్తగా హత్తుకుంటున్న జలపాతపు ఝల్లుల చిన్ని సవ్వడి. పైనుండి వర్షపు ఝల్లు. శరీరం సమస్తం కేంద్రీకరించి, విని, ఏమీ వినిపించకున్నా భ్రాంతి కాదనే విశ్వాసంతో "ఎవరూ?" అంటే కొండవాలులో నుండి నడచి వస్తూ కనిపించిందో అమ్మాయి. ఎవరు...ఎవరీ అమ్మాయి? "ఎవరండీ మీరు ? అని అడిగితే ఏమందీ...!

"నేను నదిని"

"నదా... ఓహ్! మీ పేరా అది. మ్... నైస్ నేమ్. ఎక్కడ నుండి వచ్చారు.? ఐ మీన్ ఏ ప్రాంతం నుండి అని! ఒక్కరే వచ్చారా? మీతో వచ్చిన వాళ్ళందరూ ఎక్కడా?"

నా ప్రశ్నలన్నీ విని ఒక్క సారి ఆ పెద్ద కళ్ళతో నింపాదిగా చూసి "నేను నదిని. అదిగో అటువైపు ప్రవహిస్తూ వుంటాను. ఈ కొండ వాలునున్న పెద్ద చెట్టు నా నేస్తం. మాట్లాడుదామని వచ్చాను. నీ కళ్ళకి నేను కనిపించాను".

"నదివా... ఓహో ! అయితే మీ పేరేంటి?

"పేరా... పేరేంటి? నేను నదిని. అంతే..."

"నదే...కానీ పేరుంటుంది కదా! గంగ, యమున, సరస్వతి అని. నేనున్నాను కదా, నా పేరు వరుణ్. నా గైడ్ గేల్ఫో. అందరం మనుషులమే. కానీ వేరే వేరే పేర్లుంటాయి".

"అయ్యో...నీకు తెలియదా, ఈ సృష్టిలో, ఇక్కడ ప్రవహించే నేను...నేను ఒక్కదాన్నే వుంటాను. నేను ప్రత్యేకం. నాలా ఇంకెవ్వరూ వుండరు. నువున్నావు కదా, నీలా మరెవరూ వుండరు. నువ్వొక్కడివే! నీలా మాట్లాడే, నీలా నవ్వే, నీలా నడిచే నువ్వు.. నువ్వొక్కడివే ఉంటావు. ఇక ప్రత్యేకంగా నీకు గుర్తింపు ఎందుకని? అయినా ఏం చదువుకున్నావు నువ్వూ..."

"నేను ఫిసిసిస్ట్‌ని. భౌతిక శాస్త్రాన్ని చదువుకున్నాను. నువ్వు నిజంగా నదివా...ఈ కొండ వాలులో ఏమయినా జనావాసాలున్నాయా?. అక్కడి నుండి వచ్చావా? నువ్వేం చదువుకున్నావ్?"

"నేనా...నేను ఎత్తయిన శిఖరాలను, లోతయిన లోయలను, విశాల మైదానాలను, కల్మషం లేని అరణ్యాలను, మనోకల్మషం కడిగేసుకుంటే పోతుందనుకునే పిచ్చి మనుషులను చదువుకున్నాను. నీకు మెటాఫిజిక్స్ తెలుసా? నమ్మువా నన్ను ...కళ్ళకు నిత్యం కనిపించే అలవాటునే నమ్ముతావా...నేను నదిని...అమృతను... పిలిచేందుకు పేరు కావాలని తెలియని దాన్ని..." అని నవ్వి (కనీ కనిపించనట్లు నవ్విన తెల్లని సూతింగ్ స్మైల్) "నేను మెటా ఫిసిసిస్ట్‌ని. నాకు తెలియని, నేను పరిష్కరించలేని ఎన్నింటినో ఈ ప్రకృతి దాచుకుని వున్నదని, అంతిమమయినదేదో ఇంకా వున్నదని నమ్ముతున్నదాన్ని" అంది

కొండ దిగి వస్తుంటే 'నది' కొండ దిగే నది లాగే ఉల్లాసంగా, ఉత్సాహంగా, గలగలమని కబుర్లు చెబుతూ, పక్షులు కూజితంలా, ఇందాక కెమరాలో నేను బంధించి తెచ్చుకున్న ఇంద్ర ధనుస్సు మాట్లాడుతున్నట్లు నాకు తెలియని యేవో కొత్త వర్ణాలను కాంతివంతంగా ఎగురవేస్తూ, నా పక్కనే, పక్కన పక్కనే సర్పిణిలా...అలవోకగా, ఆ చీకట్లో వెన్నెల పడీ పడని ఆ మొరటు కొండ దారుల్లో కాంతిరూపంలా దిగి వచ్చింది.

రోడ్డుపైకి వచ్చాకా "వెళ్ళనా ఇక" అన్నప్పుడు "నదీ..." అని పిలిచి, "వెళిపోతావా..." అంటే మళ్ళీ అదే సూతింగ్‌స్మైల్‌ని పెదవులపై పూయించి జాలిపడే అమ్మలా, అవును కదా...అచ్చు అమ్మలానే "వచ్చేదా నీతో" అనేసి...వచ్చేసి, విమానం ఎక్కేసి, మనిషిలా మామూలు మనిషిలా మెసిలి, మధ్యలో ఎప్పుడో "వరుణ్...మాట ఇవ్వాలి నువ్వు. మనసా వాచా కర్మణా నా ఉనికిని ఈ ప్రపంచానికి ఎరుక పరచనని" అంటే మనస్ఫూర్తిగా మాట ఇచ్చేసి, ఇప్పటివరకు గుట్టు విప్పలేదు కదా తను...!

నది అవినాష్‌ని ఎందుకు ప్రేమించింద సలు? జాలా...నది లేకపోతే బ్రతికేదెలానని వాడు అనుకున్నపుడా... జాలేనా అది? ఒకానొక వసంత కాలాన తనూ, నదీ వెళ్ళేసరికి యునివర్సిటీ కొండ మూలల్లో కలువల కొలను వొడ్డున నీటి కాకులు చేస్తున్న ఏకైక అలజడుల మధ్యన, విరగబడి పూసిన ఎడారి మోదుగుపూల నిశ్శబ్ద నారింజ వర్ణాల మధ్యన, కేన్వాస్‌పై ఏకాగ్రతతో కుంచె కదిలిస్తూ... ఆర్టిస్టు అవినాష్. "అవినాష్...అవినాష్" అని పిలుస్తే, నీటి కాకుల చప్పుడు లాగే అనుకునో ఏమో పలకకపోతే, దగ్గరికెళ్ళి భుజం తడితే, వులికి పడి తిరిగి చూసినప్పుడు ఎలా ఉన్నాడు వాడు?. నుదుటి మీద జీరాడుతున్న రింగుల జుత్తు పాయ, మందపాటి భూతద్దాలు, వత్తయిన గడ్డం, నారింజ రంగు షర్ట్, కేన్వాస్‌పై నారింజరంగు స్త్రీ, నీలపు నది వడ్డున కూర్చుని పెదవులతో నవ్వుతూ కళ్లతో దుక్కపడుతూ... ఏదో అవ్యక్త నిగూఢ భావమేదో ఆమె ముఖంలో 'వాంగో - పెసెంట్ వుమన్' లాగ

నది ఆ వర్ణాలను, అవినాష్‌ను అలానే చూసి చూసి, దగ్గరికెళ్ళి వాడి చెక్కిలిపై చేయిపెట్టి, ఆ పట్టపగటి వేళ కళ్లలో కోటి నక్షత్రాలను వెలిగించి "ఎంత బాగా వేశావ్ అవినాష్" అని చెక్కిటిపై ఉంచిన ఆ చేతిని కుంచె పట్టుకున్న వాడి చేతిపైన వేసి, ఆ సన్నటి పొడవాటి వేళ్ళని చేతిలోకి తీసుకుని పెదవులకు ఆనించి ముద్దాడినపుడు అవినాష్ తానున్నది ఈ భూమండలం పైనేనా, ఇంకెక్కడైనానా అనుకుని ప్రశ్నార్థకంగానో, ఆనందంగానో, అయోమయంగానో తనను చూసినప్పుడు, తను చెప్పగలిగాడా నది 'అమర్త్య' అని. నదికి చెప్ప గలిగాడా ఈ మర్త్య లోకంలో ఇమ్‌పల్సివ్ స్పంద నలు నిషిద్ధాలు అని...అమ్మాయిలకసలే నిషిద్ధాలు అని...

ఏమన్నాడు ఇందాక అవినాష్? నది మాయలాడి అనేకదా...!వెటకంగానో, వికటంగానో నవ్వి "దానికి కామపిచ్చి. సమయం సందర్భం వుండదు...పిల్లలు పుడితేనన్నా పోతుందనుకున్నాను. నానమ్మ మొదట్లో ఇంకా ఎందుకు పుట్టడం లేదని నదిని సతాయించేదా... ఒక రోజు ఇదేం చేసిందో తెలుసా? వాలు కుర్చీలో కూర్చుని ఉన్న నానమ్మ దగ్గరకెళ్ళి, మోకాళ్ళమీద కూర్చుని, దాని కోడిగుడ్డు కళ్ళతో నానమ్మ కళ్ళలోకి చూస్తూ అమ్మమ్మా ! చూడు...నీ నది ఎంత చిన్నపిల్లో... అప్పుడేనా పిల్లలు ? నన్ను కొంచెం పెరగనీవూ... మొగ్గని విడనీవూ అన్నది. అచ్చంగా ఇవే మాటలు. నానమ్మ మరెప్పుడూ నదిని పిల్లల గురిం చి అడగలేదు. ఇప్పుడు కూడా నది బంగారు తల్లి అంటుంది. అంటుంటే, మాట్లాడే అవినాష్‌ని ఆపి "రేయ్ నిజం చెప్పు, నది బంగారుతల్లి కాదారా?" అంటే ముఖం వికారంగా పెట్టి "ఛీ... బంగారా... ఎంత భరించానని దాన్ని... ఆ డేవిడ్‌తో వెళ్ళిపోయి రోజులు రోజులు అడవుల వెంట, నదుల వెంట ఎక్స్‌ప్లోరింగ్ అనీ ఉద్ధరింపులు... ఊరగాయలూ అని. ఎన్ని రోజులు భరించాన్రా? ఏం నేను మగాడ్ని కాదా, నీలాగో మరొకరిలాగో. దానికి ఇంటో కాలు నిలవదు. అడిగితే ఆ కళ్ళతో గుడ్లగూబలా నావంక చూసేది. కానీ వులికేది కాదు, పలికేది కాదు. ఆ ముంగితనానికి విసుగెత్తి జుట్టు పట్టుకుని చావగొడితే కొట్టించుకుని కన్నీళ్ళతో నన్ను చూసి నవ్వేది నెమ్మదిగా. అంతే, మరేం మాట్లాడేది కాదు. ఎప్పుడో ఒకసారి అడగగా అడగగా అంది అవీ...నువ్వంటే చాలా ఇష్టం నాకు. డేవిడ్ అంటే కూడా చాలా ఇష్టం. రెండు ఇష్టాలూ విభిన్న వర్ణాలవి. ఒకదానితో ఒకటి ఏ విధంగానూ కలవనివి...వేరు వేరువి అని. దాని కవిత్వమూ పైత్యమూ వేర్వేరట, వేర్వేరు. అన్ని పైత్యాల పయనం పడక మీదికే కదా"

అవినాష్ వికారపు ముఖం చూసి వీడినేనా నది ప్రేమించింది అని ఆశ్చర్యపడి జ్ఞాపకం తెచ్చుకుని, కాదే ఈ అవినాష్...ఈ అవినాష్ కాదు... కొంచెం కూడా వీడు వాడు కాదు. బహుశా అదేనా ఆ రోజు నది చెప్పింది తనకు...ఒకసారెప్పుడో, అప్పటికి తను టోక్యో వెళ్ళి చాలా రోజులయింది కూడా.

హటాత్‌గా మాట్లాడాలనిపించి, అర్ధరాత్రి పూట వీడియో కాల్ చేస్తే, త్యాగరాయ కీర్తన "రామా నీ పై తనకు ప్రేమ పోదు సీతా / తామరస నయన నీదేమో మాయ కాని/ మనసు నీ పదములనే చేర/ కనులు నీ రూపమును కోర / విను నీ పేరులకే నోరూర / తనపై ఇది నీ కరుణరా...అంటూ'' వాగీశా నందం అంబరమయ్యేట్టు పాడి, రికార్డ్ చేసుకో నిచ్చి, "అయినా నదీ, ఏమిటీ అర్ధరాత్రి వేళ, మేలు కుని ఈ గానం?" అంటే ఓ దిగులు నవ్వు నవ్వి "ఒరేయ్ వరుణ్...మీకు ప్రేమించే, ప్రేమించగలిగే వయసు ఒకటుందిరా... ఆ తర్వాత ప్రేమించలేరు మీరు. మనుషుల్ని, మనుషులే కాదు, చెట్టునీ పిట్టనీ పువ్వునీ దేన్నీ ప్రేమించలేరు" అని, అంతలోనే ఆ కళ్ళలో రత్న ప్రభలు విరజిమ్ముతూ "మీ హాస్పిటల్స్‌లో ఏడాదికోసారి మనుషులందరికీ బాండింగ్ హార్మోన్‌ని హై డోస్లో ఇవ్వాలి. అప్పుడిక మీరు కులాలనీ మతాలనీ, నేను గొప్ప మీరు తక్కువ అనీ పోట్లాడుకోరు. ధనాన్నేకాదు, దేన్నీ నాకొక్కరికే కావాలని ఆశపడి దాచుకోరు, దోచుకోరు. అందరూ ప్రేమించుకుంటారు. బాల్యంలో లోకపు లౌక్యాలు మీలోకి చొచ్చుకు రానప్పుడు వుంటారే, అట్లా చలన శీలంగా వుంటారు. కొత్తగా ప్రేమలో పడ్డపుడు ఎలా వుంటుంది చెప్పు లోకమంతా...సంతోషంగా ఉల్లాసంగా... పెదవులపైకి తోసుకొచ్చే నవ్వు, శరీరం నదిలో చేపలా తుళ్ళిపడుతూ, అందరితో ఆహ్లాదంగా సహృదయంగా ఎంత బాగుంటాం... జీవితాంతం అలా వుంటే, హృదయంలో పసితనం పెరగక నిలిచిపోతే ఎంత బాగుంటుంది. సృష్టి లోపం కాదిది. మీరే మీలోని దురాశలతో, పేరాశలతో ప్రేమ క్షేత్రాన్ని బీటలు వారిస్తున్నారు" అన్న పుడు తనకేమన్నా అర్థమయిందా? నది కళ్ళలోని దిగులు...ప్చ్! బహుశా తను కూడా నది చెప్పిన పేరాశ దురాశల సముద్రంలో కదా పడి ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. తన చెవికెలా ఎక్కగలదూ ఆమె చెప్పింది! నదీ...నదీ...ఎక్కడున్నావురా?

అవును...డేవిడ్‌కి ఫోన్ చేస్తే... కానీ డేవిడ్ ఫోన్ నంబర్ ఉందా తన వద్ద? వెతుకు వరుణ్...

వెతుకు. అంతటా వెతుకు...కానీ ఈ రాత్రి వేళ, వాళ్ళేమయినా అనుకుంటేనో? పర్లేదు, పర్లేదు, ఏమయినా అనుకోనీ, తనకు నది కావాలి, నదితో మాట్లాడాలి. "హలో...హలో...డేవిడేనా మాట్లాడేది? కాదా...మీరెవరు...నేను వరుణ్‌ని. టోక్యోకి వెళ్ళిపోయాను చాలా ఏళ్ళక్రితం. ఇప్పుడొచ్చాను. నాకు డేవిడ్ కావాలి"

అవతలి నుండి "డేవిడ్ లేడు, చనిపోయాడు. మూడేళ్ళయింది."

"డేవిడ్ చచ్చిపోయాడా...యెలా?"

"నదిలో మునిగి"

"ఏవన్నారు, నదిలో మునిగా..."

నదిలో మునిగి...నదిలో మునిగి...అంటే ఏవిటా మాటలకు అర్థం? హలో హలో అంటుండగానే ఫోన్ కట్టయిన శబ్దం. కారు స్టీరింగ్‌లా తల గిర్రున తిరుగుతుంటే నల్లత్రాచు లాటి రోడ్లో, కటిక చీకట్లో కారుని రోడ్డుకి అడ్డంగా ఆపి అవినాష్‌కి ఫోన్ చేసి...చేసి... తాగి పడిపోయున్న వాడిని లేపే అంత మోత మోగించి, వాడు లేచాక "రేయ్ అవినాష్, డేవిడ్ చచ్చిపోయి మూడేళ్ళయిందట కదరా" అంటే , తాగుడు మత్తువల్లో మరెందుకో అస్సలేం ఆశ్చర్యపడకుండా "ఆహా..." అని "వరుణ్‌గా...అది మాయమైన కొన్ని రోజులకి నాకో మెయిల్ వచ్చిందిరా దాని మెయిల్ నుండి. నీకు ఫార్వర్డ్ చేశా చూసుకో...నీ కవిత్వపు పైత్యపు బుర్రతో నానార్థాలు వెతుక్కో" అని ఫోన్ టప్పున పెట్టేసాక, మొబైల్ తీసి మెయిల్ ఓపెన్ చేస్తే...సంభాషణా...సంభోదనా ఏం లేకుండా ఒకే ఒక పాట మృదువుగా ఏకాంతపు తొలి తొలి వేకువలో హృదయాన్ని తాకింది, బహుశా నదిని డీకోడ్ చేస్తూ....

Puff, the magic dragon lived by the sea
And frolicked in the autumn mist in a land called Honah Lee,
Little jackie paper loved that rascal puff,
And brought him strings and sealing wax and other fancy stuff. oh

Puff, the magic dragon lived by the sea
And frolicked in the autumn mist in a land called Honah Lee,
Puff, the magic dragon lived by the sea
And frolicked in the autumn mist in a land called Honah Lee.

Together They would travel on a boat with billowed sail
Jackie kept a lookout perched on puffs gigantic tail,
Noble kings and princes would bow whene'r they came,
Pirate ships would lower their flag when Puff roared out his name. oh!

Dragons live forever but not so little boys
Painted wings and giant strings make way for other toys.
One sad night it happened, Jackie paper came no more
And Puff that mighty dragon, he ceased his fearless roar.

His head was bent in sorrow, green scales fell like rain,
Puff no longer went to play along the cherry lane.
Without his life - long friend, Puff could not be brave,
So Puff that mighty dragon sadly slipped into his cave, oh!

Puff, the magic dragon lived by the sea
And frolicked in the autumn mist in a land called Honah Lee,
Puff, the magic dragon lived by the sea
And frolicked in the autumn mist in a land called Honah Lee.




## వస్తావా...?

దిగంతాలకావల
కన్నీరు లేదని విన్నాను
వెళదామా!
చెలీ...వస్తావా?

కన్నీరు కార్చి కార్చి
కనులు అమావాస్యలయ్యాయి
సమస్యల వలయంలో
మనసు చీకటి రాత్రిగా మారింది
ఇక్కడ అన్నిటికీ ధరే!
కన్నీటికి ధర లేదట
దిగంతాలకావల ధరలేదు...
కరువులేదని విన్నాను
వెళదామా!
సఖీ...వస్తావా?

అడుగు అడుగు ఓడిపోయి
అర్థరాత్రి గుండెలను
సముద్ర కల్లోలం చేసి
బ్రతుకుతున్నాను
సమయాన్ని లెక్కిస్తున్నాం
దిగంతాలకావల
ఆశల పుష్పాలు పూస్తాయట
వెళదామా!
నా ప్రాణమా...వస్తావా?

సిహెచ్.మధు
9949486122



ఎంత పురాతనమైన కోరిక హంపి శిథిలాలు, శిల్పాలు చూడాలని! బిఏ చరిత్ర చదువుతున్న రెండు పదుల చిన్న వయసులో మొలకెత్తిన హంపి అందాలు చూడాలనే తాపత్రయం నలభై సంవత్సరాల తరువాత రిటైరై తీరుబడిగా అరుగెక్కి కూర్చున్న అరుపదుల వయసులో నెరవేరింది, టీనేజ్‌లో ప్రేమించిన పిల్లని ముసల్దిగాకా పెళ్ళాడినట్టు. "యేం, సెలవు గీకిపారేసి అప్పోసప్పో చేసి ఎవడు వెళ్ళిచూసి రావొద్దన్నాడూ" అనొచ్చు. ఆ ధైర్యం, చొరవా లేకే కదా ఇంతాలస్యం. ఇహ ఇపుడు కూడా తెగించకపోతే ఈ జన్మలో హంపీ చూడకుండానే చచ్చిపోతానేమో అనిపించి, ఒంటరి ప్రయాణాలు చెయ్యడం చేతకాక పోయినా బయల్దేరాను.







# హంపిలో ఒక రోజు



9490169068

"ప్లీజ్! నువ్వు రాకూడదూ" అని పాతిక సార్లయినా బతిమాలి వుంటాను రుక్మిణిని, ఆవిడ రాదని తెలిసికూడా. రానివాళ్ళని పిలువ వేడుక కదా...ససేమిరా రాను పొమ్మంది. "ఎవరెవరో కొట్టుకు చచ్చి ఏనాడో కూలిపోయి గబ్బిలాల కంపుకొట్టే గర్భగుడులూ, గోపురాలూ, కళ్ళూ కాళ్ళూ విరిగిపోయి తగలబడి పొగచూరిపోయిన శిల్పాలూ, మొండిగోడలూ, బండరాళ్ళ గుట్టల్ని యేవిటి చూసేది, ఓ పుణ్యమా - పురుషార్థమా" అని ఈసడించింది. అదే ఏ కంచో, రామేశ్వరమో అనివుంటే మహా సంబరంగా బయల్దేరేదే, అప్పటికి అవి ఎన్నిసార్లు చూసినా సరే.

పుణ్యం పురుషార్థాలకి దోహదం చేయని తిరుగుడు ఆవిడ దృష్టిలో కుక్క తిరుగుడు! అంద మైన చారిత్రక ప్రదేశాల్ని జీవిత భాగస్వామి చేతిలో చెయ్యేసి పట్టుకుని నడుస్తూ ఆమెతో కలిసి చూడా లనే పెళ్ళికి ముందునాటినుంచీ వున్న నా ఆశ అడియాశగానే మిగిలిపోయింది. చారిత్రక దృక్ప థమూ, సౌందర్యం మీద ఆరాధనా, గౌరవమూ ఏమీలేని జాతి మనుషుల్ని తోడు రమ్మని అడగటం నాదే తప్పు అనుకుంటూ ఉసూరుమంటూ ఒంటరి గానే బయల్దేరాను. అభిరుచులు కల్సినవాళ్ళతో ప్రయాణించడం ఓ మధురానుభూతి. రుక్మిణిలో అటువంటివెపుడూ పంచుకునెరగను. లేనివాటి గురించి వగచి యేం లాభం...! ప్రాప్తమున్న తీరా నికి పడవ సాగిపోయింది అనే తాత్విక దృక్పథం తో ఎక్కడికక్కడ ఎంత సర్దుకు పోదామన్నా ఒకో సారి లోపల్నుంచి అసంతృప్తి బయటకు తన్ను కొస్తూంటుంది, అరగని ఆహారం పైకి తన్ను కొచ్చి నట్టు.

డి. ఆర్. ఇంద్ర

నా చేయిపట్టుకుని తోడుగా నడచే పిల్ల కావాలని నేను తలిస్తే అమ్మ మరొకటి తలచింది. చాలా చాలా వాటికి అమ్మకి నేను చాలా చాలా రుణపడివున్నాను. అమ్మని సంతోషపెట్టడంకన్నా మించిన ఎజెండా ఏదీ నాకు లేదు. రుక్మిణి అమ్మ ఛాయిస్. అందుకే రుక్మిణి ఏవరో ఎటువంటిదో తెలవకపోయినా రుక్మిణి మెడలో తాళికట్టాను. అమ్మ ఎంపిక తక్కువదేమీకాదు. రుక్మిణి తెలుగు సాహిత్యంలో బిఏ చేసింది. మనిషి బావుంటుంది కూడా. సంప్రదాయాలకి పెద్ద పీటవేసే అమ్మ కన్నా రుక్మిణి ఓ మెట్టు పైనే వుంటుంది, వాటిని నిష్ఠగా పాటించడంలో. పెద్దలపట్ల వినయ విధేయ తలు, వారి సమక్షంలో కూర్చోకుండా నిలబడే వుండటం, అందరూ తిన్నాకే ఆఖరున ఇంటి కోడలు తినాలంటూ మొగుడుతో కూడా కలిసి తినకపోవడం వంటివి చాలా వున్నాయ్ ఆవిడ తెచ్చుకున్న సంప్రదాయాల బోషాణప్పెట్లో. ఇంట్లో ఐనాసరే మొగుడు పక్కన కూర్చోడం, సినిమాకి షికారుకైనా సరే మొగుడిచెయ్యి పట్టుకుని నడవడం ఆవిడ దృష్టిలో ఎబ్బెట్టుతనం, సిగ్గులేనితనం. దాంతో నా చెయ్యి పట్టుకుని తోడు నడిచే జీవిత భాగస్వామి అనేది ఓ పగటి కలగానే మిగిలి పోయింది. చక్కని కనుముక్కుతీరైన మనిషి కదా, ఏటిగట్టుకి షికారుకి తీసుకువెళ్ళి రివ్వున వీచే ఏటి గాలికి పమిటా, ముంగురుల్లా రెపరెపలాడుతుంటే కాస్త రొమాంటిగ్గా ఆవిడ ఫొటోలు తీసుకుని మురి సిపోదాం అనే నా కోరిక అత్యాశగానే మిగిలి పోయింది. అది ఆవిడ దృష్టిలో అసభ్యత, పోకిరీ తనం, సంసార్ల లక్షణం కాదు. భుజాల మీదుగా నిండుగా పమిట కప్పుకుని కావాలంటే ఇప్పుడు తీసుకో ఫోటో అంటుంది. అలా నాలోని సౌందర్యా రాధకుడ్నీ, ఔత్సాహిక ఫోటోగ్రాఫర్నీ నిలువు లోతు గొయ్యితీసి సమాధి చేసింది రుక్మిణి, పూర్వం వితం తువుల్ని భర్త పక్కనే గొయ్యి తీసి సజీవంగా సమాధి చేసే నూతన సంప్రదాయ పరిరక్షకుల్ని తలపిస్తూ.

కాలం గడవటానికి జ్ఞాపకాల్తో కుస్తీ పదు తుంటే తెలియకుండానే రాత్రంతా గడిచి భళ్ళున తెల్లారేసరికి హంపిలో వున్నాను. హంపి గాలి తగు లుతూనే యుద్ధభేరీలు, వందల ఏనుగుల ఘీంకా రాలు, వేలగుర్రాల సకిలింపులు, లక్షల సైనికుల పదఘట్టనలు, కరవాలాల ఖణేల్ ఖణేల్మనే చప్పు ళ్ళు, కర్ణభేరులు పగిలేలా ఫిరంగి గర్జనలూ, నరుకు,

చంపు అనే కేకలూ వినిపించినట్లయింది.

బస్సు దిగగానే ఎదురుగా ఏడువందల సంవత్సరాల నాటి విరూపాక్ష దేవాలయం! దాన్ని అలాగే అబ్బురంగా చూస్తూ అక్కడ నుంచే దాని ప్రాచీనత్వపు వాసనని గుండెలనిండుగా పీల్చాను. నా వెనకే విదేశీ టూరిస్టుల బృందం ఒకటి దిగింది. నా దేశపు చారిత్రక సాంస్కృతిక విశేషాల్ని చూడ టానికి వేలమైళ్ళు ప్రయాణంచేసి వచ్చిన ఆ విదేశీ యుల్ని చూస్తే నాకు చాలా గౌరవం కల్గింది. ఆల యం బాట పట్టగానే రోడ్డుమీద పశువుల పేడ కంపు ముక్కుపుటాల్ని అదరగొట్టింది భారతీయ సంస్కృతిని ప్రతిబింబిస్తూ. ఒంటరిగా తిరిగే చొరవ తక్కువై ఎపుడూ ఎక్కడికీ వెళ్ళకపోవడంతో మొదట ఎక్కడికి వెళ్ళాలో, ఏం చేయాలో అర్థంకాక బుర్ర కాసేపు బ్లాంక్ అయింది. రోడ్ పక్కన పబ్లిక్ టాయ్ లెట్ బోర్డు కనిపించడంతో బతికాను అనుకుంటూ వందరూపాయలు చెల్లించి బకెట్ నీళ్ళు కొనుక్కుని కాలకృత్యాలు, స్నానం అయిందనిపించి బయట పడ్డాను. బస్సు దిగినచోటే ఓపెన్ డబ్బా హోటల్ వుండటం చూసి, అప్పటికే అక్కడకి టిఫెన్ కోసం చేరిన ఓ విదేశీ బృందాన్ని గమనిస్తూ వేడి పూరీలు లాగించాను. నిత్యం పెళ్ళివారి సందడిలావుండే హంపిలో స్వదేశీ పర్యాటకులకన్నా విదేశీయుల సందడే హెచ్చు అనిపించింది. కొంతమంది ఆడ వాళ్ళయితే బిగుతైన కురచ నిక్కర్, బనీనుతో మాత్రమే వున్నారు. వీళ్ళ వస్త్రధారణని చూస్తే రుక్మిణి నిస్సందేహంగా వెలపరించుకుంటుంది. అది వాళ్ళ సంస్కృతి కాబోలు అనుకోదు. వాళ్ళూ వేడివేడి పూరీ బజ్జీల్ని తెగలాగిస్తున్నారు. చూడ వలసిన ప్రదేశాలు ఏమిటో, అవెక్కడున్నాయో తెలి యని నేను చొరవగా దూసుకుపోయే ఈ ఎర్రతోలు బృందంతో పోతే పోలా అనుకుంటూ వాళ్ళని అనుసరించాను, విరూపాక్షాలయంలోకి.

తొలి విజయనగర పాలకులచేత హిందూ రాజ్య పునరుద్ధరణకి చిహ్నంగా నిర్మించబడిన ఆలయం ఏమాత్రం చెక్కు చెదరకుండా మోర ఎత్తి నిలబడ్డ వృషభరాజంలా ఈ గడ్డమీది వీర శృంగార బీభత్స చరిత్రకి మౌనసాక్షిని నేనే అన్నట్టు గంభీరంగా నిలబడివుంది రాజసాన్ని వొలకబోస్తూ. ఆలయం లోపల చాలా టన్నుల బరువుండే అంద మైన శిల్పాలు చెక్కిన భారీ కాలమ్స్‌తో నిర్మించ బడిన మహామండపం ఆనాటి ఆలయ నిర్మాతల ఇంజనీరింగ్ నైపుణ్యానికీ, ప్రతిభకీ అద్దంపడుతూ అబ్బురపరిచింది. ఆలయం అందాన్ని కెమెరాలో




బంధించాకా ఆలయానికి ఆనుకుని ఎడమ పక్క నున్న హేమకూట దిబ్బమీదవున్న గుడుల్నీ మండపాలనీ చూడటం కోసం దిబ్బ ఎక్కుతూంటే భారతీయ సంస్కృతి మరోసారి గుప్పుమంది కడుపులో దేవుతూ వాంతి అయ్యేలా. నిత్యం వందలమంది దర్శించే ప్రాచీనాలయం పక్కనే మలమూత్రాలు! సంగీత సాహిత్య శిల్పకళల సరసనే దుర్గంధానికి కూడా పెద్దపీటవేసి సమానత్వ భావనని చాటుకున్న, నాజాతి సంస్కృతిని ముక్కుమూసుకునే అభినం దించకుండా వుండలేకపోయాను. దిబ్బ ఎక్కాక లేత ఎండలో సుదూరంగా విస్తారంగా కనిపించే ఎత్తయిన గుట్టలూ, కొన్ని గుట్టలపై మెరుస్తున్న గుళ్ళూ, మండపాలూ, నా చుట్టూ ఎటు చూసినా బ్రహ్మాండమైన బండరాళ్ళ కౌగిట్లో వొదిగిపోయిన గుడులూ, మండపాల శిథిలాలూ మహా సుందరంగా కనిపించి వొళ్ళు పులకరించింది. భూమ్మీద అత్యంత సుందరమైన ప్రదేశాల్లో ఇది వకటి అనిపించింది. ఆ అందాల్ని తనివితీరా ఆస్వాదిస్తూ చకచకా కెమెరాలో భద్రపరిచాను. ఆ విదేశీ బృందమూ ఆ పనే చేస్తోంది. అక్కడి నుండి వాళ్ళ వెనుకే కృష్ణస్వామి ఆలయంలోకి ప్రవేశించాను.

ఆ విదేశీబృందం గైడ్‌ని నియమించుకుంది కాబోలు, అతను మహాద్వారం వద్దే వాళ్ళకి ఆ గుడి

గురించి పెద్ద గొంతులో ఇంగ్లీషులో చెపుతున్నాడు. అది వింటే నాకు నవ్వొచ్చింది. నా చిన్నతనంలో హిందీ సినిమాలు ఆడే థియేటర్లో ఒకతను పెద్ద గొంతుతో తన స్వంత కవిత్వపు పైత్యం రంగరించీ కల్పించీ తెలుగులో చెపుతూండేవాడు. నేను నవ్వుకుంటూ ఆ బృందాన్నిదాటి ఆలయం లోపలకి ప్రవేశిస్తోంటే ఆ బృందంలోంచి ఒకావిడ నా వెనుకే వచ్చి - ఎందుకు నవ్వుతున్నారు? ఆ గైడ్ చెప్పేది కరెక్ట్ కాదా - అని అడిగింది. అప్పుడు చూసాను ఆమెని. రుక్మిణి వయసుంటుందేమో, మోకాళ్ళ వరకూ పువ్వుల గౌను, నెత్తిమీద ఈతాకుల టోపీ, చేతుల్లో హేండ్‌బేగ్, కెమెరా, టూర్‌మేప్. అతను చెప్పేది వాస్తవంకాదు, ఏదేదో కల్పించి చెపుతున్నాడు - అన్నాను. కరెక్ట్ ఏదో మీరు చెప్పగలరా, హంపి చరిత్ర మీకు తెలుసా - అని పొలైట్‌గా అడిగింది. నేను నిరంతర చరిత్ర విద్యార్థిననీ, చరిత్ర అధ్యాపకుడుగా పనిచేసి రిటైరయ్యాననీ చెపుతుంటే నా వంక చాలా గౌరవంగా చూసింది. ఈ కృష్ణస్వామి టెంపుల్ గురించి చెపుతారా - అంది నాతో నడుస్తూనే. ఆమె ఆసక్తి నాకు సంతోషాన్ని కలిగించింది. నాకు తెలిసిన విషయాలే చెప్పాను.

విజయనగర పాలకులందరిలోనూ సమర్థుడని ప్రసిద్ధికెక్కిన కృష్ణదేవరాయలు సామ్రాజ్య విస్తరణ కాంక్షతో, తమతో వైరమేలేని కళింగ గజపతుల వశంలోవున్న ఉదయగిరికోటని ముట్టడించి, వశం చేసుకుని, ఆ కోటలో గుడిలో వున్న సుందరమైన బాలకృష్ణుడి విగ్రహాన్ని దౌర్జన్యంగా సాంప్రదాయ విరుద్ధంగా పెకలించి తీసుకువచ్చి ఇక్కడ ఈ గుడి కట్టించి ప్రతిష్ఠించాడు. అందుకే కళింగ పాలకులు కృష్ణదేవరాయల్ని నిరశనభావంతో బందిపోటు దొంగ అని పేర్కొంటారు. చక్రవర్తి, అతని రాణులూ బాలకృష్ణుడికి సమర్పించిన అత్యంత విలువైన వజ్రాల హారాలనూ, గుడిలోని సంపదనీ ఎవరూ తస్కరించకుండా గుడిచుట్టూ కోటలాటి ప్రహరీ, సైనికుల కాపలా వుండేది. ఇంత సుందరమైన దేవాలయాన్ని, బాలకృష్ణుడిని దర్శించడానికి గానీ, పూజించడానికిగానీ ప్రజలకెవరికీ ప్రవేశమే వుండేదికాదు. కేవలం చక్రవర్తీ, అతనికి ఇష్టమైన రాణులు, కుటుంబసభ్యులకి మాత్రమే ప్రవేశం పరిమితం అని చెపితే ఆవిడ ఆశ్చర్యపోయి... "రాజెంత స్వార్థపరుడు!" అంది. "అందులో వింతేముంది. రాచరికంలో అన్నీ రాజుకోసం మాత్రమే వుంటాయ్. సామాన్య జనాలకీ, అలగా జనాలకీ చిన్న చిన్న గుడులూ, చిల్లర దేవుళ్ళే గతి. ఆ చిన్న గుడుల్లోకి కూడా ప్రవేశించడానికి అర్హతలేని అంటరానివారు లక్షల్లో వున్నారు. అలగాజనాలకి కూడా అంటరానివారు లోకువే" అన్నాను. "ఇండియా ఈజె లేండ్ ఆఫ్ అన్‌టచబిలిటీ అని చదివాను. ఇలా సాటి మనుషుల పట్ల అస్పృశ్యతను పాటించే దేశాలు ఇంకా ఏమైవున్నాయా" అని అడిగింది. "ప్రపంచంలో ఎక్కడా లేవు. మనుషుల మధ్య సమానతని అంగీకరించని దుర్మార్గపు నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ, సాటిమనుషుల్ని మనుషులుగా పరిగణించడాన్ని వ్యతిరేకించే అస్పృశ్యులూ, తనకితానే గొప్ప ఆధ్యాత్మిక భూమిగా పేర్కొనే ఈ దేశపు రాచపుండ్లు" అన్నాను. ఆమె నిట్టూర్చింది. ఆలయ మండపాల్ని, తలలేని వికృతమైన మొండెలాంటి సగగోపురాన్నీ ఫోటోలు తీసుకునేసరికి ఆవిడ బృందం ఎక్కడా కన్పించలేదు.

"ఇపుడెలా?" అన్నాను. "డోన్ట్‌వర్రీ" అంటూ ఆవిడ అటువెడుతున్న టాక్సీని ఆపింది. నా వైపు తిరిగి - దయచేసి నాతో రాగలరా? - అంది. వొంటరిగా నెక్స్ట్ ఎక్కడికి వెళ్ళాలో తెలియని నేను సంతోషంగా అంటూ కారెక్కాను. తనపేరు ఎలిజబెత్ అనీ, అమెరికాలోని డల్లాస్ నగరమనీ, ఆర్కిటెక్చర్ సంస్థలో పనిచేస్తున్నాననీ, ఫేమిలీలేని వొంటరిననీ పరిచయం చేసుకుని "మీరు వొంటరా?" అంది. లేదు, సంసారినే అని నా పరిచయం చేసుకున్నాను. మీ భార్య ఎందుకు రాలేదని అడిగింది. ఆవిడ రెలిజియస్ వుమన్ అనీ, హనుమాన్ చాలీసాలు, లలితా సహస్రనామ పారాయణాల్తో తప్ప, చరిత్రలు, రాజకీయాలు, భౌతిక ప్రపంచపు సమస్యలు ఏవీ పట్టవు అన్నాను. "వో! టిపికల్ ఇండియన్ విమెన్!" అంది నవ్వుతూ. "మీ కుటుంబ వ్యవస్థా, భార్యాభర్తల మధ్యా, తల్లిదండ్రులు పిల్లల మధ్య వుండే పటిష్టమైన అనుబంధాల్ని చూస్తే నాకు చాలా అసూయగా వుంటుంది" అంది. "మీరనుభవించే వ్యకిగత స్వేచ్ఛని చూస్తే నాకూ అసూయగా వుంటుంది, మీరు మెచ్చుకున్న మా పటిష్టమైన అనుబంధాలే మా స్వేచ్ఛకి అడ్డం పడతాయి" అన్నాను. "దూరపుకొండలు నునుపు" అంది నవ్వుతూ.

దారిలో పాతాళేశ్వరాలయం చూసి రాచభవనాల పునాదులున్న చోటకి చేరుకున్నాం. భువన విజయ మండపం, అంతరంగిక సమాలోచనా మందిరాలు, అంతఃపుర అభ్యంతర మందిరాలు వేటి పునాదులేవో తెలియకుండా ఎటు చూసినా పునాదుల శిథిలాల కుప్పలే కనుచూపు మేర వరకూ. ఒకనాడు ఇదంతా ఎలా వుండేదో ఊహకి కూడా అందనంతగావుంది విధ్వంసంతో. ఫెంటాస్టిక్! అంది ఎలిజబెత్.

గొప్పదుస్తులు ధరించిన సామంత ప్రభువులు, సామ్రాజ్య ఉన్నతాధికార్లూ, మంత్రులు, గొప్ప బిరుదులున్న సేనానులు, సాయుధప్రాణులైన వేలసైనికుల కాపలాతో అలవికాని అధికార ప్రాభవాల్ని వొలకపోసిన ప్రాంతం ఇపుడు నిర్జనంగా, నిర్జీవంగా, నిశ్శబ్దంగా వుంది! ఈ మహారాచ సౌధాల నిర్మాతలు చెమటారక్తం ఓడ్చి కండరాలు కరిగించిన శ్రామికులు, కళాకారులూ, వీటికి స్పాన్సర్లు, ఎందుకు చెల్లిస్తున్నారో తెలవకుండానే వందల రకాల అన్యాయపు పన్నులు కట్టే పీడిత ప్రజలూ, గుడిసెలకీ, గోచీలకీ, గంజీకీ గతిలేని దరిద్ర నారాయణులూ. దీనినే సొమ్మొకడిదీ- షోకు మరొకడిదీ అంటారు. కాబట్టి ఇది నిజంగా ఫెంటాస్టిక్కే అన్నాను. బలే వ్యాఖ్యానిస్తారే - అంది ఎలిజబెత్ ఆశ్చర్యపోతూ.

అక్కడ్నుంచి మహానవమి దిబ్బకి చేరాం. దిబ్బ అంటే ఏదో అనుకున్నానుగానీ, ఇంత భారీగా కళాత్మకంగా వుంటుందని నేనే ఊహించ లేకపోయాను. అన్నిటా మహాసామ్రాజ్య చక్రవర్తులకి తగ్గ భారీతనమే! మూడు అంతస్తులుగా వున్న ఆ వేదిక మెట్లు ఎక్కడానికి నా అరవయ్యేళ్ళ మోకాళ్ళ కీళ్ళు కుయ్యో మొర్రోమని మొరాయిస్తూ మెట్టు మెట్టుకీ ఇబ్బంది పడుతున్న నన్ను చకచకా ఎక్కేసి పైకి చేరుకున్న ఎలిజబెత్ చూసి, కిందికి దిగివచ్చి చెయ్యి పట్టుకుని ఎక్కించింది. పైకి ఎక్కేసరికి ఆయాసమనిపించింది. థేంక్స్ అన్నాను చెయ్యి విడిపించుకోబోతూ. కానీ ఆమె నా చెయ్యి వొదల లేదు. చుట్టూ అతి విస్తారమైన ప్రదేశం. సామ్రాజ్య వైభవాన్ని ప్రతిబింబించేలా అత్యంత వైభవంగా చక్రవర్తి సమక్షంలో జరిగే తొమ్మిదిరోజుల ఉత్సవాలకి దక్షిణాదినుండీ దక్కన్‌నుండీ లక్షలాదిమంది చేరే ప్రదేశం. చక్రవర్తి ఎదురుగా వీరుల యుద్ధ విన్యాసాలు, జగజెట్టీల మల్లయుద్ధాలు, గుర్రపు స్వారీ విన్యాసాలు, అమెజాన్ స్త్రీ యోధురాళ్ళ ఖడ్గ విన్యాసాలతో జూలియస్ సీజర్ నాటి రోమన్ సామ్రాజ్య వైభవాన్ని తలదన్నే వైభవం విజయనగర చక్రవర్తుల స్వంతం అని చెపుతోంటే ఎలిజబెత్ శ్రద్ధగా వింటోంది. నా చెయ్యి దృఢంగా పట్టుకుని మెట్లు దిగడంలో సహకరించింది. అక్కడ నుండి గజసాల, లోటస్ మహల్ చేరుకున్నాం. రాణి వాసపు స్త్రీలు విహరించే లోటస్ మహల్ చుట్టూ నలభై యాభై అడుగుల ఎత్తువున్న రాతిగోడల్ని, నాలుగువైపులా ఇంకా ఎత్తుగా వున్న వాచ్‌టవర్లనీ చూస్తూ "ఇంత ఎత్తుగోడలు అవసరమా" అంది ఎలిజబెత్.

పులి లేడిని వేటాడి ఓమూలకి ఈడ్చుకు పోయి తీరుబడిగా ఆరగించినట్టు, సామ్రాజ్య విస్తరణ పేరు మీద వైరం లేని పొరుగు రాజ్యాలమీదా, శత్రురాజ్యాల మీదా పడి రక్తపు టేర్లు పారించి వేల ప్రాణాల ఉసురు తీసుకుని విధ్వసంం చేసి కొల్లగొట్టిన ధనరాశుల్తో జాటు దురదృష్టవశాత్తూ దొరికి పోయిన ఆడవాళ్ళని. వాళ్ళు కొంచెం అందంగా వుంటే చాలు, వాళ్ళు మరొకరి తల్లులు, భార్యలు, అక్క చెల్లెళ్ళు, కూతుళ్ళు, వొదినలూ ఐనాసరే బలవంతాన ఎత్తుకొచ్చి అంతఃపుర చెరశాలల్లో బంధించి అనుభవించడానికీ, వారు తప్పించుకోడానికి ఇతరులెవరూ వాళ్ళని దొంగిలించకుండా వుండటానికే ఇంత ఎత్తు గోడలూ, వాచ్ టవర్లూ, సాయుధ కాపలాలూ! ఈ రేపిస్ట్లేన్లే మా కవులు దక్షిణనాయకులనీ, శృంగార పురుషులనీ, విష్ణ్వాంశ సంభూతులనీ పొగుడుతూ కావ్యాలురాసి అగ్రహారాల్ని బహుమతులుగా పొందేవాళ్ళు. అంతఃపురమందిరాలు, రాణుల భవనాల నగిషీలలో ఎంత జిగేల్మనిపించినా వాస్తవంలో అవి అందమైన చెరశాలలే అంటోంటే – యూ ఆరే డిఫరెంట్ కామెంటేటర్, ఐ లైకిట్ – అంటూ నా చేతిని పట్టుకుని విశాలాలయం, కింగ్స్ బాలెన్స్ అనబడే తులాభారం దగ్గరకు తీసుకువెళ్ళింది. తులాభారాన్ని చూపిస్తూ ఇదేవిటంది.

ఇది రాజు బరువుని తూచే కాటా. దీన్నెందు కుపయోగిస్తారంటే అత్యంత వైభవంగా జరిగే చక్రవర్తి పుట్టినరోజు మహోత్సవంనాడు సాయంకాలం చక్రవర్తి తన పట్టపురాణులు, రాణులు, భోగకాంతలు, దాసీపరివారం, పురోహితులతో మేళతాళాల మధ్య అట్టహాసంగా ఇక్కడికి వస్తాడు. దీనికి వేలాడదీసిన ఒక వెండిసిబ్బెలో చక్రవర్తి కూర్చుంటే రెండో సిబ్బెలో బంగారు, వెండినాణాలని వేసి తూస్తారు. ఆ ధనాన్ని వెండి పళ్ళాలలో పోసి రాణులతో కలిసి ఆస్థాన బ్రాహ్మణులకి దానం చేస్తాడు చక్రవర్తి వారి ఆశీస్సులు కోసం. తరువాత తక్కువ విలువైన చిల్లర నాణేలను బస్తాలతో రప్పించి రాణులతో కలిసి నిరుపేద ప్రజలమీదకు గుప్పెళ్ళతో విసురుతాడు. దీనికి ముందు ఉదయం రాజదర్బారులో చక్రవర్తికి జన్మదిన శుభాకాంక్షలు తెలియజెయ్యడానికి సామ్రాజ్యపు నలుమూలల నుండి వచ్చిన రెండు వందల మంది సామంత ప్రభువులూ, పాళెగార్లూ, సేనాధిపతులూ, విదేశీ రాయబార్లూ ఒక్కొక్కరూ వరుసలో వచ్చి చక్రవర్తికి అత్యంత వినయ విధేయలతో వొంగి నమస్కరించి వారి వారి తాహతులను బట్టి అత్యంత విలువైన కానుకలు సమర్పిస్తారు. ఇది ఐచ్ఛికం కాదు, తప్పనిసరి. దీనికి హాజరుకానివారిని చక్రవర్తి



**దినపత్రికలలో రెండు మూడునెలల్లో రానున్న గోదావరి పుష్కరాల వార్తలు చదువు తుంటే రాజమండ్రి మళ్ళీ కళ్లముందు ఒక్కసారిగా ప్రత్యక్ష మయింది.**

**రాజమండ్రి** కళ్ళల్లో కనిపించగానే ఎన్నో జ్ఞాపకాలు చుట్టుముట్టి ఒక పట్టాన వదలడంలేదు. ముఖ్యంగా మా మాస్టారు భమిడిపాటి కామేశ్వర రావుగారయితే మరీమరీ గుర్తొస్తున్నారు.

అప్పుడెప్పుడో కొడవటిగంటి కుటుంబరావు గారు చెప్పినట్టు "గురజాడ అప్పారావుగారి తరువాత గానీ, కామేశ్వరరావుగారి తరువాతగానీ కామేశ్వర రావుగారి స్థానంలో పోటీ చేయగలవాడు లేడు" అన్నది ఎంత సత్యం...!

'నవ్వు' కి చిరునామాగా జగత్ప్రసిద్ధులైన కామేశ్వరరావుగారు పుట్టిన తరువాతే అసలు నవ్వు పుట్టిందంటారు. పుంఖానుపుంఖాలుగా వారు రాసిన నాటికలు, కథలు, వ్యాసాలే అందుకు సాక్ష్యం. ఆయన మాట్లాడితే నవ్వు...నోరు విప్పితే ఛలోక్తుల వరద. ముళ్ళపూడివారు ఏదయినా సమయమూ సందర్భమూ కుదిరితే భమిడిపాటివారి ఛలోక్తులు చెప్పకుండా ఉండేవారు కాదు.

## నవ్వు 'నవ్వులాట' కాదు...!

మచ్చుకి ఈ ఒక్కటీ పరికించండి...

ఒకసారి మాస్టారు స్కూలుకి ఓ అధికారి వచ్చి, సరాసరి మాస్టారు పాఠం చెబుతున్న క్లాస్ రూంలోకి చొరబడి, రెండు మూడు నిమిషాలు తమ దర్పాన్నంతా ప్రదర్శించి, పిల్లలపై అకాలమైన ప్రశ్నల వర్షం కురిపించటం మొదలు పెట్టారట.

భయం వల్లనో, ఝడుసుకునో ఒక్క పిల్లాడు కూడా నోరు విప్పితే ఒట్టు.

అప్పుడు ఇక లాభం లేదనుకొని కామేశ్వరరావు మాష్టారే స్వయంగా కలుగజేసుకొని తను పిల్లల్ని ప్రశ్నలడగడం ప్రారంభించారు. పిల్లలు ఠకీ ఠకీమని జవాబులు చెప్పేస్తున్నారు.

ఇంతకూ వారు పిల్లల్ని అడిగిన ప్రశ్నలెలాంటివంటే... "రామరావణ యుద్ధం ఎవరెవరికి జరిగిందో చెప్పండర్రా" లాంటివి.

ఇంకేం...పిల్లలు ఎంచక్కా "రాముడికీ రావణుడికీ" అని జవాబు చెప్పేశారు. అప్పుడు తనిఖీకి వచ్చిన అధికారి ఊరుకోకుండా మాష్టారు ప్రవాహానికి బ్రేక్ వేసే ఉద్దేశంతో "మీరు వేసినవి లీడింగ్ కొశ్చన్స్. అసలా ప్రశ్నలోనే జవాబుంది గదా" అన్నారట. అంతటితో ఆగక "మరి నేను అడిగితే జవాబులు చెప్పరేం" అని కూడా అన్నారు.

కామేశ్వరరావుగారు తడుముకోకుండా "అవి బహుశా మిస్‌లీడింగ్ కొశ్చన్స్ కావచ్చు" అని రిటార్ట్ ఇచ్చారు, ఏదయితే అదయిందని.

మాష్టారి సమయస్ఫూర్తికి ఆ అధికారి కూడా నవ్వకుండా ఉండలేక పోయాడట. ఇటువంటి సంఘటనలు ఎన్నో...ఎన్నెన్నో గుర్తుకొస్తున్నాయి.

అసలు "నవ్వు అంటే ఏమిటి?" అని ఒకసారి ఎవరో మాష్టార్ని అడిగితే "నవ్వును నిర్వచించడమంటే నవ్వులాట కాదు" పొమ్మన్నారు...అదీ సంగతి.

వేమూరి లింగమూర్తి

కఠిన శిక్షలకి గురిచేస్తాడు. చక్రవర్తికి చేరే కానుకల్లో వెండి బంగారాలు, వజ్ర వైడూర్యాల రాశుల్తోబాటు, బర్మా ఏనుగులు, పర్షియా గుర్రాలు, ఆఫ్రికన్ చిరుతలూ, చిలకలూ, చీనా పట్టువస్త్రాలు, జేడ్ పానీయపు కప్పులు, సిలోన్ ముత్యాలు, అందమైన దేశ విదేశీ పడుచుపిల్లలు కూడా వుంటారు. ఏటేటా చక్రవర్తికి చేరే అంతులేని ఈ సంపద అంతా రాజు వ్యక్తిగత సంపద కిందేలెక్క. ఈ ధనాన్ని రాజు ఎంత విచ్చలవిడిగా ఖర్చు పెట్టినా అడిగే అధికారం ఎవరికీ లేదు. ఈ ధనమంతా ఎక్కడిది? ప్రజల గోళ్ళూడగొట్టి లాక్కున్నదే. ఓ చిన్న స్వతంత్ర రాజ్యంలోని ప్రజలు ఆ రాజుకే పన్నులు కడతారు. కానీ అదే రాజు సామ్రాజ్య విస్తరణ పేరుమీద మరో పెద్ద రాజుకి లోబడి సామంతుడుగా మారితే, అతడు ఆ పెద్దరాజుకి కట్టాల్సిన కప్పాలు, కానుకల్నీ ఎక్కడ్నించి తీసుకువస్తాడు? తన ప్రజల మీదే ఇంకా ఎక్కువ పన్నులు వేసి రాబడతాడు. అంటే ఒక్క దుర్మార్గపు మొగుడ్నే భరిస్తూ వచ్చిన ఆడది ఇపుడు ఇద్దరు మొగుళ్ళని భరించాలన్న మాట. సువిశాల సామ్రాజ్యం, ఏకచ్ఛత్రాధిపత్యం అనే గొప్ప పెద్ద మాటల వెనక వున్నదంతా దౌర్జన్యమూ, దుర్మార్గమూ, అన్యాయమూ, హద్దులెరగని దోపిడీయే. రాచరికమంటే కాకుల్ని కొట్టి గెద్దలకి వేయడమే. రాచభవంతులు స్వర్ణకాంతులతో మెరవాలంటే సామాన్యులు పేదలుగా, పేదలు గోచిపాతరాయుళ్ళుగా కుములుతూ వుండాల్సిందే.

ఎలిజబెత్ నా చేతిని తన రెండు చేతుల్తోనూ పట్టుకుని ఏకాగ్రతతో వింటోంది. "అమెరికాలో పుట్టి పెరిగిన మీకు రాచరికపు వ్యవస్థల గురించి ఏమీ తెలియదు. కానీ ఈ గడ్డ మీద వేల సంవత్సరాలుగా ఈ దుర్మార్గపు రాచరికమే మొన్నటివరకూ రాజ్యమేలింది. అసమానతలకి పట్టంకట్టే నీచమైన కులవ్యవస్థనీ, అంతకన్నా పరమ నీచమూ, అమానుషమైన అస్పృశ్యతనీ నిర్లజ్జగా కాపాడుతూ వచ్చిన రాచరికపు ఇనుప పాదాలకింద నలిగిపోయిన అసంఖ్యాక పీడితజనాలు చేసిన సుదీర్ఘ ఆర్తనాదాలు వినగలిగే చెవులకి ఈనాడూ వినిపిస్తూనే వుంటాయ్. శూద్రులు అగ్రవర్ణాలకి వెట్టిచాకిరీ చేస్తూ హీనంగా బతకాలేతప్ప, అందుకు తిరస్కరించి అగ్రవర్ణాల పరిమితమైన విద్యాసంపదల్ని కోరితే ఆ శూద్రుల శిరస్సులు ఖండించాలని అమలు చేసి చాటి చెప్పిన రామాయణ గాథల్ని అమాయకులైన ఆ శూద్రుల చేతే గుడుల మీద చెక్కించడం యాదృచ్ఛికంకాదు. కళల్నికూడా అణచివేతకి, దోపిడికీ అనుకూలంగా మలచుకున్న మేధోతనం ఈ దేశపు బుద్ధిజీవులది. కళలూ, సాహిత్యాలూ ప్రజల కోసం కాకపోతే అది నిస్సందేహంగా ప్రజావ్యతిరేకమైనవనే అర్థం చేసుకోవాలి. కళ్ళు మూసుకుని ఎలిజబెత్ శ్రద్ధగా వింటోంది. లేవండి, తెలియకుండానే పొద్దుపోతోంది అన్నాను. కాసేపట్లో మాతంగ హిల్స్ పాదాల వద్ద వున్నాం మెట్లు ఎక్కుతూ. ఎలిజబెత్ నా చేయి గట్టిగా పట్టుకుని తల్లి పిల్లవాడిని మెట్లు ఎక్కిస్తున్నట్లు ఒకోమెట్టు జాగ్రత్తగా ఎక్కిస్తూ పైకి తీసుకువెళ్ళింది.

అక్కడనుండి చుట్టూ చాలా దూరం చాలా మనోహరంగా కనిపించింది. ఎలిజబెత్ అక్కడే బండరాయి మీద కూర్చుని తన కెమెరా ఇచ్చి తనని ఫోటోలు తీయమంది. అంత ఎత్తులో రివ్వున వీస్తున్న గాలికి ఆమె లేతబంగారు వర్ణపు శిరోజాలు గులాబిరంగు మొఖంపై అల్లరిగా చిందులేస్తున్నాయ్...తను భంగిమ మార్చినపుడల్లా క్లిక్‌మనిపిస్తూ చాలా కోణాల్లోంచి చాలా ఫోటోలు తీసాను. ఆమె వెనుక వైపు కిందకి చూస్తూ – ఈ మొండి దేవాలయం అచ్యుతరాయల టెంపుల్ కదూ అంది మేప్ చూస్తూ..."అవును, అచ్యుతరాయలు కృష్ణదేవరాయల సవతి తమ్ముడు. అచ్యుత రాయలు అసమర్థుడూ, అవినీతి పరుడేకాక క్రూరుడు కూడా. ఐనా అతనూ తనపేరు చిరస్థాయిగా వుండాలని ఈ ఆలయ నిర్మాణానికి పూనుకున్నాడు. రాజుల సొమ్ము రాళ్ళ పాలు అంటారు. కానీ అది రాజుల సొమ్ముకాదు, ప్రజల సొమ్ము. ప్రజల సొమ్ము రాజులద్వారా రాళ్ళపాలు అనాలి. ఈ గుళ్ళూ – గోపురాలూ ఎంత అందమైనవైనా ప్రజలకి ఏం వొరగబెట్టాయ్? ప్రజల అవసరాల్ని తీర్చాల్సిన బాధ్యతలనుండి తప్పుకుని ప్రజాధనంతో ప్రజలకి పనికిరాని గుళ్ళుగోపురాలూ కడతారు ఈ పాలకులు. ఈ హంపిలో అడుగడుగుకీ ఓ గుడీ, ఓ మండపం! వీటికి అంతులేదు. విజయనగర ప్రభువులూ, సామంతులూ, వ్యాపారవర్గాలూ అంతులేని వైభోగాలతో విలసిల్లుతోంటే పేదల వొంటిమీద గోచితప్ప మరేదీలేదని కళ్ళారా చూసిన విదేశీ యాత్రీకులే చెప్పారని మరువకూడదు – చీకటి పడుతోంది, ఇక వెడదాం" అన్నాను.

ఎలిజబెత్ నా చెయ్యి పట్టుకుని ఒకో మెట్టూ మెల్లగా దింపింది. కింద మెట్లతో ఒక వేదిక వుంది. దాన్ని చూపిస్తూ చెప్పాను – కృష్ణదేవరాయలు సింహాసనం ఎక్కి ఐదువందల సంవత్సరాలైన సందర్భాన్ని పురస్కరించుకుని ఇక్కడి ప్రభుత్వం ఇటీవల ఇక్కడ పెద్ద ఎత్తున ఉత్సవాల వేడుకల్ని జరిపింది, కోట్లు ఖర్చు పెట్టి రాచరికాన్ని సిగ్గులేకుండా కీర్తిస్తూ. తమ స్వంత రక్షణకితప్ప ప్రజల ధనమాన ప్రాణరక్షణలకే మాత్రమూ విలువనివ్వని రాచరికాలకన్న పెద్ద ప్రజాస్వామ్యమే వందరెట్లు మేలు. ఐనా ఈ ఆధునిక ప్రజాస్వామ్య ప్రభువులు ఇంకా రాచరికపు బూజునే కీర్తిస్తున్నారంటే, ఆ రాచరికం సాగించిన ప్రజాపీడక పద్ధతుల్నే ఈ ప్రజాస్వామ్య ప్రభువులూ రంగులూ వేషాలూ మార్చి ఆధునిక రూపాల్లో కొనసాగిస్తున్నారని అర్థం చేసుకోవాలి అన్నాను.

విరూపాక్షాలయపు రథం షెడ్‌వరకూ చేతులు పట్టుకుని రోడ్డుకి రెండు వైపులా వున్న మందిరాల్నీ, నిర్మాణాల్నీ చూస్తూ నడుచుకుంటూ వచ్చాం దీపాలు వెలుగుతోంటే. ఎవరితోవన వారు వెళ్ళాల్సిన సమయం వచ్చింది. ఐనా ఆమె నా చెయ్యి వొదల లేదు, వొదలడానికి ఇష్టం లేనట్టు. "మీతో కలిసి నడచిన ఈ కొద్ది గంటల్లోనూ నేను చాలా విషయాలు మీనుండి తెలుసుకున్నాను. చరిత్రనెలా అర్థం చేసుకోవాలో చెప్పారు. మిమ్మల్ని ఎపుడూ మరచిపోలేను. సెలవా మరి నా భారతీయ మిత్రుడా...!" అంది చెయ్యి వొదిలి, రెండూ చేతులూ జోడించి నమస్కరిస్తూ. నాకూ నోటమ్మట మాట పెగల్లేదు. బొమ్మలా చేతులు జోడించాను. జనంలో ఆమె కనుమరుగయ్యే వరకూ అలాగే నిలబడ్డాను.

వచ్చిన పని విజయవంతమైంది. ఎలిజబెత్తే తారసపడి చకచకా నడిపించకపోతే అన్నీ చూడలిగేవాడ్ని కాదు. నా చేయి పట్టుకుని తోడుగా నడిచే ఆత్మీయహస్తం కోసం ఒకపుడు కలలు కన్నాను. తాత్కాలికమే ఐనా, ఆ కోరిక ఇలా కొంత మేరకి తీరింది. ఇందుకోసమే ఇన్నేళ్ళుగా నా హంపి యాత్ర వాయిదా పడుతూ వచ్చిందా? యేమో! అన్ని ప్రశ్నలకి జవాబులే దొరికితే అది జీవితం ఎందుకవుతుంది? ఏదేమైనా నా హంపి దాహం తీరింది.

"మీకు చొరవా, నోట్లో నాలుకా లేవు. తిరుగు ప్రయాణంలో డ్రైవర్ని – బాబూ, ఇది మా రాజమండ్రం వెళ్ళేదేనా అని అడిగి మరీ ఎక్కండి" అని పదిసార్లు రుక్మిణి చెప్పిన మాట గుర్తుకు వచ్చింది. నిజమే, లేకపోతే, కిందటేడు విజయవాడ బుక్ ఫెస్టివల్‌కి అని బయల్దేరి విజయవాడ బండనుకుని విశాఖపట్నం బండెక్కేసినట్టు, ఇపుడు ఏ బెంగుళూరు బస్సో ఎక్కేస్తానేమో అనుకుంటూ, జాతరని వొదలలేని పిల్లాడిలా విరూపాక్షాలయాన్ని వెనక్కి తిరిగిచూస్తూనే బస్టాండ్‌కేసి నడిచాను.




# కవితా...దేవతా!

నీ కడుపున పుట్టక పోయినా
పుత్రవాత్సల్యంతో నన్ను చంకనెత్తుకొని తిప్పుతున్నావు
ఉత్తి తోలుతిత్తిలా తొక్కుడు బండిలా
నన్ను చూడ్డానికి నీ మనసు అంగీకరించక
నా అంతర్లోకాలను శుద్ధి చేసి
నా కోసం వెలుగు దారులు పరిచి నడిపిస్తున్నావు
పచ్చని చెట్టులా పెంచుతున్నావు
నీ ఋణం ఎలా తీర్చుకోను!

* * *

మెరిసే మెరుపులోనూ ఉరిమే ఉరుములోనూ
కురిసే వానలోనూ విరిసే పువ్వులోనూ
నువ్వే నాకు కనిపిస్తావు
నాలుగు పదాలు అల్లి ఏ వేదిక మీద చదివినా
కరతాళ ధ్వనుల కానుకలతో నన్ను ముంచెత్తింది నువ్వే కదా!

* * *

ఇటు మూడు తరాలు అటు మూడు తరాలు
నా సొంతానికి అంటని వాసన నాకు సొంతం చేసి
ఈ పల్లెటూరి ఆసామిని పట్టణానికి పిలిపించి
ప్రముఖుల సరసన చోటిచ్చి
నా శిరసు మీద ప్రశంసల జల్లు కురిపించింది
నీవుగాక ఇంకెవరు?

* * *

పదుగురితో కలిసి పనిచేసినపుడో
ఆసరసాలలో కష్టసుఖాలు కలబోసుకున్నపుడో
నా కొడుకు ఇంజినీరు, నా కొడుకు డాక్టరు అని
ఒకరికొకరు చెప్పుకుని మురిసి పోతుంటే
నా కొడుకు కవి అని గుండెల మీద చెయ్యేసుకొని
మా అయ్య గర్వంగా చెబుతున్నపుడు
నా కళ్లలో వెలుగు పూలు పూయించిందీ నువ్వే

* * *

నీ చల్లని చూపులు సోకాలిగానీ
మన్ను పిసికిన రైతన్నలు పోతన్నలవుతారు
నీ ఆశీస్సులు అందుకోవాలి గానీ
పశువుల కాపరి కాళిదాసు కావచ్చు
నీ దయా వర్షం కురవాలిగానీ
కరకు బోయడు కవిగా మారలేదూ!?

* * *

ఎన్నెన్నో వాదాల వరదలై పొంగుతున్నావు
ఉద్యమాలై ఉరుకుతున్నావు
బడుగు జీవులతో కలిసి అడుగులేస్తున్నావు
కోటలు దాటి...కొండలు దాటి...
ఊళ్లు దాటి... వాడలు దాటి...
వర్ణాలకు అతీతంగా వెన్నుతట్టి
మమ్ములను నడిపిస్తున్నది నువ్వుగాక ఇంకెవరు?!

* * *

మా పేడసాలలు దాటి
మా అమ్మలు అలికి ముగ్గులేసిన గడపలో
నీ అడుగులు పడే వుంటాయి
బంగురుతూ తపట తపట అడుగులేసి పడుతూ
తలమీద ఇసక పోసుకుని ఆడుతున్న వేళ
నీ ఆశీస్సుల అక్షతలు
ఆ ఇసకతో జత కలిసి నాపై కురిసేవుంటాయి
లేకుంటే నాకీ వైభవమెక్కడిది?

* * *

నన్ను కరుగుతున్న మబ్బును చేసింది నువ్వు
నా చేత అక్షర సేద్యం చేయించింది నువ్వు
పదాలై పద్యాలై ప్రజల గుండెల్లో నిలిపి
నన్ను చిరంజీవిని చేసింది నువ్వు
ఓ కవిత దేవతా!
ఏమిచ్చి నీ ఋణం తీర్చుకోగలను?
నవనవోన్మేష కవితా సుమహారాలను
నీ గళమున అలంకరించడం తప్ప.

చింతా అప్పల నాయుడు
94417 13185

# సినీ వాగ్గేయకారుల సాహిత్య సౌరభాలు

సినిమా పాటలు మన జీవన సాహిత్య సారాన్ని వినసొంపుగా మనకు తెలిపేవి. వీటిపై పరిశోధన జరిపి రెండు పుస్తకాలు వ్రాసిన డా. పైడిపాల గారన్నట్టు, సినిమా పాట ఇరవయ్యో శతాబ్దంలో ఉద్భవించిన నవ్య కళ. సంగీత – సాహిత్యాల మేలు కలయిక ఈ కళ. సర్వ జనాదరణ వల్లే పరిమళిస్తున్న ఏకైక సాహితీ రూపం. అందరూ కవిత్వాన్ని ఆస్వాదించలేరు. ఆస్వాదించే కొందరు కూడా సర్వవేళ సర్వావస్థలందు కవితా మాధుర్యాన్ని చవిచూడలేరు. మంచి కవితను మనసారా అనుభవించాలంటే ఒక సందర్భం అవసరం. సినిమా పాటలు అందుకు దోహదం చేస్తాయి.

సినీ కవులు ధన్యజీవులు. ఎందుకంటే, పాటకు సంబంధించిన సందర్భమో లేక సన్నివేశమో వారికి లభిస్తుంది. పాట రాశాక, గొప్ప సంగీత దర్శకులు మంచి బాణీ కట్టేస్తారు. ఘంటసాల గారో, బాలసుబ్రహ్మణ్యం గారో, సుశీల గారో, జానకి గారో... అలాంటి వారె వరో కమ్మగా పాడేస్తారు. ఆపై, ప్రసిద్ధ నటీనటులు నవరసాలు చిందిస్తూ ఆడేస్తారు, నటిస్తారు. జనులను రంజింప జేస్తారు. ఆ పాటలకు నిర్మాతలు, డిస్ట్రిబ్యూటర్స్ పబ్లిసిటీ ఇస్తారు. సీడీలు, రేడియోలు, టీవీలు, ఇంటర్నెట్ ఆ పాటల్ని జనుల చెవులదాకా తీసికెళతాయి. ఈ భాగ్యం ఏ ఇతర కవులకి లభిస్తుంది? అందుకే, గొప్ప కవులు కూడా (దేవులపల్లి, శ్రీశ్రీ, సినారే తదితరులు) అభ్యంతరం లేకుండా సినీ కవులయ్యారు. మనల్ని తమ కవితా ఝరిలో ఓలలాడించారు. చివరికి త్యాగయ్య, అన్నమయ్య, రామదాసులు కూడా ముందుచూపుతో సినిమా పాటలు రాసారా అనిపిస్తుంది.

వాద్య సంగీతం వాక్కు సంగీతాన్ని మించి వినిపించే ఈ రోజుల్లో కూడా మంచి పాటలకు కొదవేమీ లేదు. కాలానుగుణంగా మారుతూ, అన్య భాషా పదాల్ని పోగు చేసుకొంటూ, భావానికి వెలితి లేకుండా, శ్రావ్యంగా మన చెవులకు వినిపిస్తూనే వున్నాయి. హిందీ సినీ కవి గుల్జార్‌కి దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు వచ్చింది గత సంవత్సరం. ప్రసూన్ జోషీ గారికి పద్మ పురస్కారం లభించింది ఈ ఏడు. తెలుగు సినీ కవులకూ రాకపోదు, జాతీయ స్థాయిలో గుర్తింపు. అలనాటి సముద్రాల సీనియర్ మొదలు ఈనాటి అనంత్ శ్రీరామ్ వరకూ ఎందరో కవులు మనలను అలరిస్తూనే వున్నారు. సినీ కవులు ప్రజల కవులు. వారి కవితలు మన పెదవులపై తరచూ పలుకుతూనే వుంటాయి. మన హృదయాల్లో మెదులుతూనే వుంటాయి. అందుకే మచ్చుకి ఇక్కడ ముగ్గురు తెలుగు సినీ వాగ్గేయ కారుల భావ విన్యాసం వినండి...'చినుకు' ప్రత్యేక సంచిక కోసం...మరుసంచికలలో మరి కొందరు...!



ప్రత్యేక వ్యాసం

## పాటల కడలి 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి

"మల్లెల దారిలో మంచు ఎడారిలో
పన్నీటి జయ గీతాల, కన్నీటి జలపాతాల
నాతో నేను సంగమిస్తూ, నాతో నేనే రమిస్తూ
ఒంటరినై అనవతరం, కంటున్నాను నిరంతరం
కలల్ని, కథల్ని, మాటల్ని, పాటల్ని, రంగుల్ని, రంగవల్లుల్ని
కావ్య కన్యల్ని, ఆడపిల్లల్ని"

అప్పటికి తెలుగు సినిమా పాట కొత్త పుంతలు తొక్కి పది పదిహే నేళ్ళు అయి ఉంటుంది. అందమైన సాహిత్యం అంతరించిపోయి సున్నితమైన భావాలన్నీ రచయితలు అతిగా ఆరేసుకుని పారేసుకున్నాక, కొత్తరకం పాటల కోసం రచయితలు అత్తమడుగు వాగులూ, చెత్తకుండీలూ వెతికేసి వేసారిన రోజులు. అమ్మాయిలని వర్ణించటానికి బంగినపల్లి మామిడిపళ్ళు, బొమ్మిడాయి పులుసులు అన్నీ కాలం చేసాక తెలుగు సాహిత్యాన్ని ద్వంద్వార్థాలతో నడివీథిలో అమ్మకానికి పెడుతుంటే, సిగ్గుతో తెలుగుపాట ఉరేసుకుంటున్న తరుణంలో

చిమ్మచీకటైన సినీసాహిత్యపు ప్రాగ్దిశపై దినకరుడై ఉదయించి సంగీత ప్రియుల ఎదకనుమల్లో విశ్వరూప విన్యాసం చేసిన మహానుభావుడు 'సిరివెన్నెల' సీతారామశాస్త్రి.

నాకు తిలక్ కవితల్లో ఆర్ద్రత ఇష్టం. కృష్ణశాస్త్రి కవితల్లో భావుకత ఇష్టం. శ్రీశ్రీ కవితల్లో ఆవేశం ఇష్టం. 'సిరివెన్నెల' పాటల్లో ఇవన్నీ ఇష్టం. తిలక్ అప్సరసల దోసిళ్ళ నుంచి తాగుతూ వదిలేసిన అమృతపు ధారలు సిరివెన్నెలై కురిసి, కృష్ణశాస్త్రి సుందరాంగుల కనుదోయి నల్లకలువల్లో వెతుక్కుంటూ పారేసుకున్న భావాలు సన్నజాజి నవ్వులై ఆ వెన్నెల్లో విరిసి, స్వాతి వానలో స్నానమాడే ఆత్మగానాలైతే, ఆకాశపుటెడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటె జాబిల్లి అంటూ నవయుగం కావాలని యువతరాన్ని ఉడికించిన శ్రీశ్రీ అగ్ని నిట్టూర్పులు సిరివెన్నెలపూతల మంటలై, చైతన్యపు ఉప్పెనల్లాంటి పాటలయ్యాయి. ఆ పాటల సౌరభాలు విశ్వమంతా వ్యాపించి ఆయనకు జగమంత కుటుంబమయ్యింది. సాహితీప్రియులు శబ్దకోశాల్లో ఆయన పదాలకు అర్థాలు వెతుక్కుంటే, సంగీత ప్రియులు స్వరాలకే వరాల్లాంటి ఆయన పాటల మాధుర్యంలో పులకించిపోయారు. అన్ని తరాల గీత సంగీత ప్రేమికులని సమానంగా అలరించగలిగిన సిరివెన్నెల సాక్షాత్కారంతో తెలుగు పాట అందలమెక్కి అందంగా చిందులు వేసింది.

అన్ని రసాలనీ తన పదాల పొందికకు, భావ గాంభీర్యానికి, సాహితీ నిబద్ధతకు అన్యాయం చెయ్యకుండా పాటల్లో పొందుపరిచిన ఘనుడు సిరివెన్నెల. అన్ని రసాలకంటే ఎక్కువగా ప్రేమరసం ఆయన వేళ్ళ నుంచి జాలువారి తెలుగు యువజంటలకు అధికారిక ప్రేమ పరిభాషయ్యింది. "ఈ వేళలో నీవు ఏం చేస్తూ ఉంటావో... అనుకుంటూ ఉంటాను. ప్రతి నిమిషమూ నేను..." అని అబ్బాయి సందేశం పంపిస్తే "చిరునవ్వుల వరమిస్తావా? చితి నుండి బతికొస్తాను. మరుజన్మకు కరుణిస్తావా? ఈ క్షణమే మరణిస్తాను" అని అమ్మాయి సమాధానం పంపేంతగా ఆయన పాటలు ప్రేమికులను ఆకట్టుకున్నాయి.

"వలపు వాన దారాలే పంపుతున్నది ఆకాశం...చినుకు పూల హారాలే అల్లుతున్నది మనకోసం. .తడిపే తడికి తనతో నడిపి హరివిల్లును వంతెన వేసిన శుభవేళా" అని పరళంగా చెప్పినా, "తరిమిన ఆరుకాలాలు, ఏడు లోకాలు చేరలేని ఒడిలో...విరహపు జాడలేనాడు వేడి కన్నేసి చూడలేని జతలో... శతజన్మల బంధాల బంగారుక్షణమిది... తెలుసా మనసా ఇది ఏనాటి అనుబంధమో" అని గుంభనంగా చెప్పినా ఆయన పాటలు సాహితీ పన్నీటి ముళ్ళై ఎన్నో హృదయాలను గిల్లి అల్లరి చేశాయి..

కునుకురాక గుబులుగున్న బుట్టబొమ్మలు, బలపం పట్టి భామ బళ్ళో ప్రేమ పాఠాలు నేర్చుకునే అబ్బాయిలు ఆయన పాటల్లో అందంగా కలిసిపోయి మురిసిపోయారు. ప్రేమతో పాటే విరహం కూడా సిరివెన్నెల ఆటల్లో పన్నీరై ప్రవహించి కలవని జంటల మంటలను కన్నీరై ఊరడించింది. "వేధించే దూరమంత కరిగేలా విరహాలవిల్లు ఇట్టే విరిగేలా విడిపోని బంధమేదో కలిపేలా మెడలోన వాలనుంది వరమాల" అనే పాటలో విరహాన్నే శివధనువు చేసి దాన్ని విరిస్తేనే కలయిక అని చెప్పటంలో ఆయన చాతుర్యం, "నీ స్నేహం, ఇక రాదు అని కరిగే కలగా అయినా ఈ దూరం నువ్వు రాకు అని నను వెలివేస్తూ ఉన్నా..." అనటంలో సున్నితత్వం, "తేనెల చినుకులు చవి చూపించి, కన్నుల దాహం ఇంకా పెంచి, కమ్మని కలలేమో అనిపించి, కనుమరగై కరిగావా సిరివానా" అనటంలో ఆర్ద్రత, "సముద్రమంతా నా కన్నుల్లో కన్నీటి అలలౌతుంటే...ఎడారి అంతా నా గుండెల్లో నిట్టూర్పు సెగలవుతుంటే" అనటంలో ఆవేదన విరహంతో వేగే ప్రేమికులతో పాటే విన్న ప్రతి ఒక్కరి హృదయాన్ని కదిలిస్తాయి. మసాలా పాటలకి కూడా అశ్లీలత అంటకుండా ఎంత అందంగా ఆయన రాయగలరో "పూల ఘుమఘుమ చేరని ఓ మూల ఉంటే ఎలా..." అనే పాట వింటే అర్థమవుతుంది.

సిరివెన్నెల పాటల్లో మాటలకందని ఊహలుంటాయి. ఊహలకందని మాటలుంటాయి. "చందమామ మనకందదని...ముందుగానే అది తెలుసుకుని...చేయి చాచి పిలవద్దు అని...చంటిపాపలకు చెబుతామా? లేని పోని కలలెందుకని...మేలుకుంటే అవి రావు అని...జన్మలోనే నిదరోకు అని...కంటిపాపలకు చెబుతామా" అన్న వాక్యాల్లో భాషకు మించిన భావాన్ని చూడొచ్చు. "తరలిరాదా తనే వసంతం...తన దరికి రాని వనాల కోసం" అనే పాట తరాలు మారినా విలువ తరగని భావాల గని. ఇదే పాటలో "గగనాల దాకా అల సాగకుంటే మేఘాల రాగం ఇల చేరుతుందా..." అని వర్షం వెనుక రహస్యాన్ని చెప్తూనే "అడవి కాచిన వెన్నెల" అనే ప్రయోగాన్ని వెక్కిరిస్తూ "వెన్నెల దీపం కొందరిదా...అడవికి సైతం వెలుగు కదా.." అని ఆలోచింపజేస్తారు.

సిరివెన్నెల పాటల్లో పదాల అల్లికతోపాటే సాహితీ విలువలకు దర్పణం పట్టే అలంకారాలు, ప్రయోగాలు పుష్కలంగా దొరుకుతాయి. "తేనెలొలికే పూల బాలలకు - మూన్నాళ్ళ ఆయువిచ్చిన వాడినేది కోరేది...బండరాళ్ళను చిరాయువుగ జీవించమని ఆనతిచ్చిన వాడినేది అడిగేది" అంటున్నప్పుడు నిందాస్తుతి, "వివరిస్తున్నది అద్దం, మన అనుబంధానికి అర్థం, నువ్వు నాలాగా నే నీలాగా కనిపించడమే సత్యం" అన్నప్పుడు ఉపమేయోపమాలంకారం, "సిరుల రాణి నీ చేయి పట్టి శ్రీహరిగ మారునని రాసిపెట్టి యే వరుని జాతకం వేచి ఉన్నదమ్మా" అన్నప్పుడు వృత్త్యనుప్రాసాలంకారం, "విందడిగారే అందాలని, ముందుకురారే అందాలని... నిన్నొదిలి పోలేరమ్మ, ఓ పోలేరమ్మ..." అన్న పాటలో యమాలంకారం, 'చంద్రుళ్ళో ఉండే కుందేలు కిందికొచ్చిందా...కిందికొచ్చి నీలా మారిందా" అన్నప్పుడూ, మళ్ళీ "అనగనగా ఆకాశం ఉంది. ఆకాశంలో మేఘం ఉంది, మేఘం వెనుక రాగం ఉంది, రాగం నింగిని కరిగించింది" అన్న పాటలో ముక్తపదగ్రస్తాలంకారం, "పడమర పడగలపై వెలిగే తారలకై రాత్రిని వరించకే సంధ్యా సుందరీ, తూరుపు వేదికపై వేకువ నర్తకివై రాత్రిని వెలిగించే కాంతులు చిందనీ" అన్నప్పుడు ఉత్ప్రేక్షాలంకారం.. చెప్పుకుంటూ పోతే ఎన్నెన్నో! ఒక పాటలో ఆయన "కాటుక పిట్టల్ల మాదిరి ఎగిరే కన్నులు రెండు" అంటారు. ప్రియురాలి కళ్ళను కాటుక పిట్టలతో పోల్చి అవి ఎగిరి ప్రియుడిమీద వాలాయనటం ఎంత అందమైన భావం!

సీతారామశాస్త్రిగారు సామాజిక స్పృహ ఉన్న పాటలు కూడా చాలా రాసారు. "కొంతమంది ఇంటిపేరు కాదుర గాంధి, ఊరికొక్క వీధిపేరు కాదుర గాంధి" అని సగటు భారతీయుడి ఆవేదనని పంచుకొని, "అర్థ శతాబ్దపు అజ్ఞానాన్ని స్వతంత్రమందామా స్వర్ణోత్సవాలు చేద్దామా...నిత్యం కొట్టుకు చచ్చే జనాల స్వేచ్ఛను చూద్దామా, దాన్నే స్వరాజ్యమందామా..." అంటూ తల్లడిల్లిపోయి "నిగ్గదీసి అడుగు ఈ సిగ్గులేని జనాన్ని అగ్గితోటి కడుగు ఈ సమాజ జీవచ్ఛవాన్ని...మారదు లోకం మారదు కాలం..." అని తన స్వరంతోనే ఉసిగొలిపారు. అత్యాచారానికి గురైన ఆడపిల్లను ఓదారుస్తూ "నువ్వేమి చేసావు నేరం...నిన్నెక్కడంటింది పాపం...శీలం అంటే గుణం అని అర్థం..."

అన్న ఒక్కమాటతో ఎంతో ఎత్తుకు ఎదిగిపోయారాయన. "పశ్చిమాన పొంచి ఉండి రవిని మింగు అసుర సంధ్య ఒక్కనాడూ నెగ్గలేదురా...గుటకపడని అగ్గి ఉండ సాగరాలనీదుకుంటూ తూరుపింట తేలుతుందిరా...ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమీ"అన్న పాటతో నైరాశ్యానికి సమాధి కట్టేసి ఎంతో మందికి స్ఫూర్తినిచ్చారు. "చుట్టుపక్కల చూడరా చిన్నవాడా...చుక్కల్లో చూపు చిక్కుకున్నవాడా" అని హెచ్చరిస్తూ "చెమట బొట్టు సమురుగా సూరీడ్ని ఎలిగిద్దాం...ఎలుగుచెట్టు కొమ్మల్లో అగ్గిపూలు పూయిద్దాం...ఏకువ చెట్టుల కత్తులు దూసి రేతిరి మత్తును ముక్కలు జేసి...తెల్లారింది లెగండో..." అంటూ చీకటిలో నిద్రిస్తున్న జాతిని తట్టిలేపాయి సిరివెన్నెల బాణాలు.

సిరివెన్నెల పాటల్లో సంస్కృతం తప్ప తెలుగు లేదు అని విమర్శించే వాళ్ళు ముక్కున వేలేసుకునేలా "భద్రం బీ కేర్‌ఫుల్ బ్రదరూ... భర్తగ మారకు బాచిలరూ" అని చిరునవ్వులు పూయించిందీ సిరివెన్నెలే. "కన్నీరై కురవాలా... మన చుట్టూ ఉండే లోకం తడిసేలా... ముస్తాబే చెదరాలా... నిను చూడాలంటే అద్దం జడిసేలా..." అని నవ్వుతూ బ్రతకటమే జీవిత పరమార్థం అనే సత్యాన్ని వాడుక భాషలో సరళంగా తేల్చేసి "నీ నవ్వు చెప్పింది నాతో... నేనెవ్వరో ఏమిటో" అని ప్రేమని సిరివన్నెల కోణంలో చూపించి "అమాయకంగా చూడకలా వేడుకలా చిలిపి కలా...అయోమయంగా వేయకలా హాయివల" అని మాటలతో మైమరపించటం ఆయనకే సాధ్యం.

"శివపూజకు చిగురించిన సిరిసిరి మువ్వా" అనే పాటలో "మృదు మంజుల పదమంజరి పూచిన పువ్వా...యతిరాజుకు జతిస్వరముల పరిమళమివ్వా..." అని కళారాధకుడి తృష్ణని, "పరుగాపక పయనించవే తలపుల నావా...కెరటాలకు తలవంచితే తరగదు త్రోవ..."అని అమ్మాయి కనే సహజమైన కలలని పండిత పామర మనోరంజకంగా సాహితీకరించారు.

సిరివెన్నెల గొప్ప స్వాప్నికుడు. "చంద్రుళ్ళో ఉండే కుందేలు కింది కొచ్చిందా" అనేది స్వప్నం. ఎంతటి స్వాప్నికుడో అంతటి భావుకుడు. "పడమర పడగలపై వెలిగే తారలకై రాత్రిని వరించకే సంధ్యా సుందరీ తూరుపు వేదికపై వేకువ నర్తకివై రాత్రిని వెలిగించే కాంతులు చిందనీ" అనేది భావుకత. ఎంతటి భావుకుడో అంతటి సౌందర్యారాధకుడు. "లయకే నిలయమై నీ పాదం సాగాలి... మలయానిల గతిలో సుమబాలగ తూగాలి" అనేది సౌందర్యారాధన. ఎంతటి సౌందర్యారాధకుడో అంతటి తాత్వికుడు. "సంసార సాగరం నాది...సన్యాసం శూన్యం నాది" అన్నది వేదాంత తత్వం.

నా మాటల్లో చెప్పాలంటే, సిరివెన్నెల పాట అప్పుడే పుట్టిన పాపాయిలా స్వచ్ఛంగా ఉంటుంది. ఆ పాపాయి బోసినవ్వులా అందంగా ఉంటుంది. ఆ నవ్వులో విరిసే వెన్నెల్లా మనసంతా పరుచుకుంటుంది. ఆ వెన్నెల వెలుగులో ఆడే పడుచుపిల్లలా సందడి చేస్తుంది. ఆ పిల్లని చూసి మనసు పారేసుకున్న భావుకుడిలా ఉద్విగ్నంగా ఉంటుంది. ఆ భావుకుడి తలపులో మెరిసిన వలపు గీతంలా మధురంగా ఉంటుంది. ఆ పాట విని పరవశించే రసికహృదయంలా తృప్తిగా ఉంటుంది. ఎన్నో వేల పాటలు... వందల అవార్డులు... లెక్కలేనని రివార్డులు...వీటన్నిటిని మించి తెలుగుపాట స్థాయిని పెంచి, వేటూరి ఆత్రేయల పాత తరానికి, అనంతశ్రీరాం భువనచంద్రల కొత్తతరానికీ వారధిలా నిలిచి భాషని భావితరాలకి అందించాలనే ఆశయమే సారధిగా, తన ఉచ్ఛ్వాసల కవనంగా, నిశ్వాసం గానంగా పంచామృతంలాంటి పాటల్ని నిరంతరం రచిస్తూ మనల్ని పరిమళింపజేస్తున్న పాటల కడలి సిరివెన్నెల.

ప్రొఫెసర్ మాధవీ లత



# మనసు కవి ఆత్రేయ

**"తాగితే మరచి పోగలను తాగ నివ్వదు. మరచిపోతే తాగగలను మరువ నివ్వదు."**

If X is true. Y is true; but X is not true. If Y is true, X is true; but Y is not true.

ఆలోచించండి. అదీ నిజం కాదు. ఇదీ నిజం కాదు. అది చేయలేదు. ఇదీ చేయలేదు. ఇదొక మీమాంస. కర్మ మీమాంసయో, బ్రహ్మ మీమాంసయో తెలియని పరిస్థితి. "నన్నోడి తన్నోడెనా? తన్నోడి నన్నోడెనా?" లాంటి paradoxical situation. అన్యోన్య విరుద్ధత. A conflict between cause and effect. అటా, ఇటా, అదా, ఇదా అనే అయోమయం. ఏం చేయాలో దిక్కు తోచని స్థితి. ఒక వ్యక్తి దీన స్థితిని అన్ని తక్కువ మాటల్లో చెప్పగలిగే శక్తి, యుక్తి ఒక్క ఆత్రేయ గారికే సొంతం.

ఇంకా ఆలోచించండి. గణిత శాస్త్రంలో Iff అంటే if and only if అని. దీన్ని ఉపయోగించి, పై వాక్యాలను ఇలా మారిస్తే?

"తాగితేనే మరచి పోగలను, తాగనివ్వదు. మరచి పోతేనే తాగగలను. మరువనివ్వదు."

లాజికల్‌గా, అర్థం కొంత మారినా, ఆ సందర్భానికి ఎక్కువగా ఒరిగేదేం లేదు. అందుకే కాబోలు, ఆత్రేయగారు, ఆ "ప్రేమనగర్" పాట సాకీలో రెండక్షరాలు అదనంగా వాడలేదు. ఆయన ప్రతి పదాన్ని కాదు, ప్రతి అక్షరాన్ని తూచి తూచి Marshal's Law of Marginal Utility ని అప్లై చేసి రాసారనిపిస్తుంది పాటలన్నీ. ఇక సాకీని దాటి పల్లవి దగ్గరికొస్తే భావ గాంభీర్యం ఇంకాస్త ఇనుమడిస్తుంది.

"మనసు గతి ఇంతే, మనిషి బతుకింతే, మనసున్న మనిషికీ సుఖము లేదింతే..."

పట్టుమని పది పదాలు లేవు. కానీ అర్థం మాత్రం అనంతం. కట్టడాల నిర్మాణంలో ఒక సూత్రం ఉంది. ఎంత ఎక్కువ ఆలోచిస్తే అంత తక్కువ పదార్థం చాలని. అదే పాటించే వారు ఆత్రేయ, తమ వాక్య నిర్మాణంలో. ఎంతో ఆలోచించి, అతి తక్కువ మాటల్లో, చాలా భావాలను ఇమడ్చగలిగే తీరు కిళాంబి వేంకట నరసింహాచార్య గారిది. అది ఆయన పూర్తి పేరు. అంత పొడువాటి పేరెందుకులేనని, తన కలం పేరు కూడా స్వగోత్రంతో, 'ఆత్రేయ' అని పెట్టుకొన్న పదాల ఎకనామిస్ట్ ఆయన.

ఆత్రేయ పాటల గురించి నాలుగే నాలుగు ముక్కల్లో చెప్పాలంటే, ఇలా చెప్పొచ్చు. మనసు... మమత... వీణ... వాన.

మొదట మనసు గురించి. సిగ్మండ్ ఫ్రాయిడ్ కలల గురించి ఎంత విశ్లేషించారో, ఆత్రేయ మనసు గురించి, అందరికి అర్థమయ్యే రీతిలో అంతే విశ్లేషించారు సినిమా పాటల్లో.

"ఒకరికిస్తే మరలిరాదు, ఓడిపోతే మరచి పోదు. గాయమైతే మాసిపోదు, విరిగి పోతే అతుకు పడదు" **(ప్రేమనగర్).**

మనసు యొక్క Vulneralability ని, సౌకుమార్యాన్ని గొప్పగా చెప్పారు ఆత్రేయ.

"మనసు మనిషిని మనిషిగ చేస్తుంది. వలపా మనసుకు అందాన్నిస్తుంది. ఈ రెండూ లేక జీవితమేముంది. ఆ దేవుడికీ మనిషికీ తేడా ఏముంది..." మనసున్న మనిషిని దేవుడి కన్నా ఓ మెట్టు పైనే పెట్టారు ఆత్రేయ ఈ పాటలో.

"కునుకు పడితె మనసు కాస్త కుదుట పడతది. కుదుట పడిన మనసు తీపి కలలు కంటది" **(మూగమనసులు).**

మనసు తనను తనే ఓదార్చుకోగలదని ఆయన భావన. మనసే మనిషి కున్న గొప్ప ధనంగా భావించారాయన. "మనసు లేని బ్రతుకొక నరకం" అన్నారు. ఆయన పాటల్లో మనకు ప్రత్యేకించి కనిపించేది మనసు మూగదని.

"మనసు మూగదే గానీ బాసుంటది దానికి. చెవులుండే మనసుకే వినిపిస్తుందా ఇది" **(మూగమనసులు).**

'మనసు మూగది, మాటలు రానిది, మమత ఒకటే అది నేర్చినది" **(మరో చరిత్ర).**

"మౌనమే నీ భాష ఓ మూగ మనసా..." **(గుప్పెడు మనసు).**

అదే పాటలో, ఇంకా ఇలా చెప్పారు...

"చీకటి గుహ నీవు. చింతల చెలి నీవు. నాటక రంగానివే, మనసా, తెగిన పతంగానివే...

ఎందుకు వలచేవో, ఎందుకు వగచేవో, ఎందుకు రగిలేవో, ఏమై మిగిలేవో..."

మనసు గురించి ఎంతో ఆలోచించిన ఆయనే, మనసు పోకడలు తెలియనట్టు రాసారు. చివరికి "మనసే మనిషికి బందిఖానా" అని, "మనసే మనిషికి తీరని శిక్ష..." అని కూడా అనేశారు.

"ఎవరికి తెలుసు చితికిన మనసు చితిగా రగులునని? ఆ చితిమంటల చిటపటలే నాలో పలికే కవితలని...." **(మల్లెపూవు)** అని కూడా చెప్పేశారు.

ఆత్రేయ గారు వ్రాసిన మనసు పాటలు చాల లోతైనవి. ఆలోచించేకొలదీ క్రొత్త క్రొత్త అర్థాలు స్ఫురింపజేసేవి. మన మనసులని మురిపించేవి, అలరించేవి. అప్పట్లో ఆయన పాటలు ప్రేక్షకులను బాగా ఏడిపించేవట. "రాసి ప్రేక్షకులను, రాయక నిర్మాతలను ఏడిపించేవారని" పైడిపాల గారన్నారు తను రాసిన పుస్తకంలో. ఎంత బాధలోనూ మన పెదవుల మీదికి నవ్వు రప్పించే ఆయన సూక్తి ఇది.

"...తెలిసీ తెలిసీ విలపించుటలో తీయదనం ఎవరికి తెలుసు?"

అది ఒక్క ఆత్రేయగారికే తెలుసు.

ఇక మమత గురించి, ప్రేమ తత్త్వం ఆయనకు తెలిసినట్టు వేరెవరికీ తెలియదనలేం. కానీ ఆయన రాసినన్ని ప్రేమ గీతాలు అంత బాగా ఎవరూ రాయలేదనిపిస్తుంది. ఏమీ తోచక కాదు ఆయన ఈ పల్లవి రాసింది.

"నువ్వంటే నాకెందుకో అంత ఇది... నువ్వన్నా నాకెందుకో అదే ఇది" **(అంతస్తులు)**

ఆ "ఇది" లోనే వేరే మాటల్లో చెప్పసాధ్యం కాని ప్రేమ ఇమిడి వుంది.

"మీ నగుమోము నా కనులార కడదాకా కననిండు" **(బడిపంతులు)** అనటంలోనే ఓ వృద్ధ పత్నికి తన భర్తపట్ల గల ప్రేమ అపారంగా పొంగింది.

ప్రేమను బాధతో ముడి పెట్టడం ఆయన ప్రత్యేకత. మధ్యలో మగువను ఇరికించడం ఆయన ముద్ర.

"ప్రేమ ఎంత మధురం, ప్రియురాలు అంత కఠినం చేసినాను ప్రేమ క్షీరసాగర మథనం, మింగినాను హాలాహలం..." **(అభినందన).**

'ఆహా' అనాలనిపించే పల్లవి ఇది. ఇక చరణాలు ఎందుకులే ననిపిస్తుంది, చెప్పాల్సిందంతా పల్లవిలోనే ఉంటే.

మనసుతో లాగే మగువతో కూడా ఆత్రేయకీ లవ్ - హేట్ రిలేషన్‌షిప్ వుందనిపిస్తుంది.

'నిను చూడక నే నుండలేను...మన ప్రతి సంగమం ఎంత హృదయంగమం" **(నీరాజనం)** అని ఒక పాటలో, మరో పాటలో, "రాయి మీటినా రాగం పలుకును, రాయి కన్నా రాయివి నీవు, కసాయివి నీవు" అన్నారు.

అలాంటి బాధల్లోనూ లోతైన భావాన్ని ఒలికించారాయన.

" ఆడవాళ్ళు ఆడుకొనే ఆట బొమ్మ ఈ మగవాడు. ఆడుకున్నా ఫరవాలేదు. పగులగొట్టి పోతారెందుకు?" అనటంలో పోలికను ఎంత దూరం తీసికెళ్ళవచ్చో తెలిపారు. ఆయన ఆలోచనా పటిమ అలాంటిది.

ఇక వీణ పాటల విషయానికొద్దాం. ఆత్రేయగారు వ్రాసిన వీణ పాటల పాపులారిటీ చూసి, దర్శకులూ నిర్మాతలూ కావాలనే వీణ పాటల సందర్భం ఇరికించేవారట తమ సినిమాల్లో. "ఈ వీణకు శ్రుతి లేదు..." **(దేశోద్ధారకులు)** మరియు "నీవు లేక వీణ నిలువలేనన్నది" **(డాక్టర్ చక్రవర్తి)** పాటలు విన్నవారెవరూ ఇష్టపడకుండా వుండలేరు. 'ప్రేమనగర్' లోని "ఎవరో రావాలి..." పాట ఆ సినిమా కథకు ఎంత నప్పిందనేది ఆ సినిమా చూసిన వారందరికీ తెలుసు. "మూల దాగి, ధూళి మూగి, మూగపోయిన మధుర వీణ..." అని తన కర్తవ్యం తెలుసుకోకుండా ప్రవర్తిస్తున్న కథానాయకుని పోల్చి "కొనగోట మీటిన చాలు. కోటి స్వరములు నీలో పలుకును..." అని కథానాయకి పాడడం అద్భుతంగా అతికింది. పాటలోని ప్రతి భావం అటు వీణకి ఇటు కథానాయకునికి వర్తిస్తుంది. అంత పొందిక కలిగిన పాట ఇంకోటి అంతకు ముందు లేదు, తరువాత రాలేదు. **'చక్రవాకం'** లోని "వీణలోనా, తీగలోనా, ఎక్కడున్నది రాగము? అది ఎలా జనో గానము?" వింటే మనకనిపిస్తుంది "మాటలోనా, మనసులోనా, ఎక్కడున్నది భావము? అది ఎలాగానో కవనము?" అని. ఆత్రేయ గారు "మనసులోనే" అనొచ్చు. మనసు కవి కదా!

ఆత్రేయగారి పాటలు మాటల్లా (అంటే డైలాగ్స్ లాగా) వుంటాయి. కానీ ఆ ప్రోస్‌లో పొయెట్రి కనిపిస్తుంది. కనిపించని లయ వినిపిస్తుంది. అర్థం చేసుకొంటే భావం స్ఫురిస్తుంది. ఆయన సినీ కవిత ఆపాత మధురము, ఆలోచనామృతము కూడా. ఈ ఉదాహరణలు పరికించండి.

"నవ్వినా ఏడ్చినా కన్నీళ్ళే వస్తాయి. ఏ కన్నీటెనకాల ఏముందో తెలుసునా?" **(మూగమనసులు).**

"...కనుచూపు కరువైన వారికైనా కనిపించి కనువిందు కలిగించు రీతిగా...శిలలపై శిల్పాలు చెక్కినారు. మనవారు సృష్టికే అందాలు తెచ్చినారు...కనులు లేవని నీవు కలత పడవలదు, నా కనులు నీవిగా చేసికొని చూడు..." **(మంచిమనసులు).**

"అనుకొన్నామని జరగవు అన్నీ, అనుకోలేదని ఆగవు కొన్ని, జరిగినవన్నీ మంచికని అనుకోవడమే మనిషి పని..." **(మురళీకృష్ణ).**

ఆర్.డి.బర్మన్‌గారు గుల్జార్ పాటలు చూసి అనేవారట "ఈయన న్యూస్ పేపర్ కటింగ్స్ పంపిస్తాడేమో ఇక" అని 'ఇజాజత్' లోని టెలిగ్రామ్ పాట చూసి..."మేరా కుచ్ సామాన్ తుమ్హారే పాస్ పడా హై..."

ఆత్రేయగారి పొయెటిక్ ప్రోస్ వినుంటే ఏమనేవారో?

సరళమైన మాటల్లో, అతి తక్కువ పదాల్లో హృదయాన్ని హత్తుకొనేలా వ్రాయటం ఆయన తీరు. ఆయన వ్రాసిన పధ్నాలుగువేల పాటల్లో ఆరు వందలకి మించి పదాలు వాడలేదని ఆయన సాహిత్యంపై పీహెచ్.డి చేసిన పన్నెండు మంది తేల్చారని ప్రతీతి.

ఆత్రేయ పాటల్లో సైంటిఫిక్ మెథడ్ అగుపిస్తుంది. పట్టు సడలని లాజిక్ కనిపిస్తుంది. లోతైన ప్రశ్నలుంటాయి. తేల్చేసే సమాధానాలుంటాయి. 'కలువకు చంద్రుడు ఎంతో దూరం. కమలానికి సూర్యుడు మరీ దూరం. దూరమైన కొలదీ కలుగును అనురాగం..." **(చిల్లర దేవుళ్ళు)** అనే పాటలో, అనురాగానికి దూరానికి వున్న డైరెక్ట్ ప్రపోర్షనాలిటీ సూత్రం వుంది. "గుండె గొంతుక దగ్గరున్నది కళ్ళు మాత్రం దూరమైనవి. చూడలేనిది పాడగలను..." లో ఫిసియాలజీని పొయెటిక్‌గా వాడుకోవటం జరిగింది. "మూడే ముళ్ళు, ఏడే అడుగులు, మొత్తం కలిసి నూరేళ్ళు" **(త్రిశూలం)** అనడంలో గణిత శాస్త్రాన్ని వెక్కిరించే చమత్కారముంది.

ఇక చివరికి వాన గురించి..."చిటపట చినుకులు పడుతూ వుంటే..." మొట్టమొదటిసారిగా ప్రశస్తి చెందిన తెలుగు వాన పాట అట. వాన అంటే ఉత్సాహం, హుషారు. ఆత్రేయ పాటలన్నీ మనసుని కదిలించేవే కావు, మనసుని ఉల్లాస పెట్టేవి కూడా వున్నాయ్. "పాండవులు పాండవులు తుమ్మెదా..." పాటలో "కన్నెగానే బతుకు గడిచి పోతుంది నన్నెవరేలుకుంటారు అనుకొన్నది జానకి అనుకొన్నది" లో కన్య కలల కలవరంతో పాటు, కాస్త చిలిపిదనముంది. చివరికి, "శేషశైలావాసా, శ్రీవేంకటేశా" లో కూడా "శ్రీదేవి వంకకు చిలిపిగా చూడకు... అలమేలు మంగకు అలుక రానీయకు" అంటూ చమత్కరించారు. "చెంగావి రంగు చీర కట్టుకున్న చిన్నది" లాంటి ఉరుకు - పరుగు వున్న పాటలు కూడా చాలానే వ్రాసారు ఆత్రేయగారు.

పాత్రకు, సన్నివేశానికి, కథకి తగిన పాటలు వ్రాయడంలో ఆత్రేయది పైచేయి."అమ్మా చూడాలి. నిన్ను, నాన్నను చూడాలి", చక్కనయ్యా చందమామ ఎక్కడున్నావు"...వంటి పాటల్లో పిల్లల మనసును అర్థం చేసుకొని వారి స్థాయిలోనే వ్రాసారు. జంట పాటలు వ్రాయడంలోనూ ఆయన అగ్రగణ్యులు. అటు ఆనందం, ఇటు విషాదం పదాల్లో కాస్త తేడాతో పండించారాయన. 'చేతిలో చెయ్యేసి చెప్పు బావా...", "నల్లవాడే..." మంచి ఉదాహరణలు. మొత్తానికి మాటల గారడీ లేకుండా భావానికే పెద్దపీట వేసిన కవి ఆయన.

తన పాటల్లో జీవితసారాన్ని వడపోసి వస్త్ర కాగితం పట్టి సులువుగా అందరికీ ఇట్టే అర్థమయ్యేలా వ్రాసారాయన. "తెలిసేట్టు చెబితే సిద్ధాంతం, అది తెలియక పోతేనే వేదాంతం" **(అంతులేని కథ)** అని ఆయనే అన్నారు. అందుకే ఆయనను సినీ వేమన అంటారు. మనసు కవిగా, తెలుగు శ్రోతలకు ఎప్పటికీ గుర్తుండిపోయే పాటల రచయితల్లో టాప్‌త్రీలో తప్పక ఉంటారాయన, చాలమంది లిస్ట్‌లో నైనా.

**జి.కె. అనంతసురేశ్**



# పాటల మణిహారాల తరగని గని దాశరథి

**మిగతా భాషల గురించి నాకు అంతగా తెలియదు. హిందీ గురించి కొంతగా తెలుసు.**

మన తెలుగులో 20లు - 40ల నాటి అభ్యుదయ కవులు 50లు - 60ల నాటికి సినీగేయ రచయితలు అయ్యారు.

శ్రీశ్రీ (1962 - పల్లెటూరు), ఆరుద్ర (1952 - బీదల పాట్లు), ఆత్రేయ (1951 - దీక్ష), దేవులపల్లి (1951- మల్లీశ్వరి), అనిసెట్టి (1955 - సంతానం), మల్లాది (1952 - చిన్నకోడలు), మహారథి (1959)...

ఇదే ఒరవడిలో, దాశరథి 1960లో ఆత్రేయగారి **'వాగ్దానం'** - 'నీ కంటి పాపలో నిలిచి పోనీరా" ద్వారానూ, 1961లో అక్కినేని 'ఇద్దరు మిత్రులు' పాటలతోనూ ఆ వరుసలో చేరి నిలిచారు.

సినీగీతాలు రాసినా, శ్రీశ్రీ 'మహాకవి గుణం' చెదరలేదనీ, సినీగీతాల వల్లనే ఆరుద్ర, దేవులపల్లి పదిమందికీ చేరువయ్యారనీ, మనలో ఓ అభిప్రాయం ఉంది. అది నిజమని నేనూ నమ్ముతాను.

దాశరథిది ఓ విచిత్రమైన శైలి. ఆ పేరు వినగానే అగ్నిధార, రుద్రవీణ, తిమిరంతో సమరం, గాలిబ్ గీతాలూ ఠక్కున గుర్తొస్తాయి. "నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అన్న మంత్రం గుర్తుకొస్తోంది.

కానీ, ఆయన రాసిన అనేకానేక సుప్రసిద్ధ సినీగీతాలకు ఆయనే సృష్టికర్త అన్నమాట మనకు, కనీసం నాకు గుర్తురాదు. నేను యథాలాపంగా దాశరథిని ఎంచుకున్నపుడు నేనో పాటల మణిహారాల తరగని గనిలో అడుగు పెడుతున్నానన్న స్పృహ రాలేదు. అలా అడుగుపెట్టి ఆయా పాటల్ని తవ్వి తీసుకుని మననం చేసుకుంటుంటే మనసు స్పృహ తప్పుతోంది.

సినిమా పాట అంటే అందులో సాహిత్యమే కాదు, సంగీతం- పాటని కట్టిన బాణీ, వినిపించిన వాద్యాల విన్యాసాలు, గాత్రం - ఘంటసాలో, సుశీలో, జిక్కీనో, బాలసుబ్రహ్మణ్యమో ఆయా మాటలకు పోసిన ప్రాణాలు, నటన - దేవదాసుగానో, శంకర శాస్త్రిగానో ఆయా నటులు ఆయా పాటలపై వేసే ముద్ర, చిత్రీకరణ - అద్భుత వనారణ్యాలలో, కొండలూ, లోయల్లో ఆ పాటలని చిత్రీకరించినపుడు మనలో కలిగే మైమరపు ఇన్ని - ఇంకా మరికొన్ని లేయర్స్, పొరలు ఉంటాయ్ ఓ సినిమా పాటలో. కానీ "కల కానిదీ విలువైనదీ" విన్నప్పుడూ, "మంటలు రేపే నెలరాజా" విన్నప్పుడూ, అన్ని లేయర్లూ ఆయా పాటల మాటల చాటున మరుగున పడిపోతాయి.

అచ్చమైన ఆ పాటల సాహిత్యమే మనలను పదే పదే పులకరింపజేస్తుంది. అదిగో, అలాంటి అనేకానేక పాటల సృష్టికర్త దాశరథి.

రాసిన కాలం మరీ ఎక్కువ కాదు, 1960 నుంచీ 70ల నడుమదాకా. రాసిన పాటలు మరీ ఎక్కువేం కాదు, అన్నీ కలిపి ఓ ఆరొందలు.

విలక్షణ భక్తి గీతాలు - "నడిరేయి ఏ జాములో", లలిత శృంగార గీతాలు- "తనివి తీరలేదే", జానపద గీతాలు - "గోదారీ గట్టుందీ", అచ్చమైన కవిత్వం - "సిరిమల్లె సొగసు జాబిల్లి వెలుగు", ఖవాలీలు- "నవ్వాలి, నవ్వాలి మీ నవ్వులు నాకే ఇవ్వాలి", వీణ పాటలు - "మదిలో వీణలు మ్రోగే", సినీ భావ గీతాలు - "వినిపించని రాగాలే కనిపించని అందాలై", చచ్చు బూతు పాటలు - "సందులో బేరం, సూదిలో దారం"...అవన్నీ మనకు బాగా తెలిసిన పాటలే! కానీ నిన్న మొన్నటిదాకా వీటి సృష్టికర్త దాశరథి అన్న స్పృహ నాకులేదు.

ఇంకో విశేషం - ఘంటసాల ప్రైవేటు పాటలు, అంటే, పుష్పవిలాపం, భగవద్గీత, పోలీసెంకటసామి- గుర్తొస్తాయి. కొద్దిమందికి "తలనిండ పూదండ దాల్చిన వాణి" కూడా గుర్తొస్తుంది. అదిగో, ఆ పాట రాసినదీ మన దాశరథే. మళ్లా ఆయన రాశారని చాలామందికి తెలియనవి, ప్రసిద్ధ సినీగీతాల దగ్గరకు వస్తే, అందులో తలమానికం- "నడిరేయి ఏ ఝాములో" **(రంగులరాట్నం-1967)**...తిరుమలవాసుని నిందాస్తుతి చేస్తూ అలమేలు మంగతో మొరబెట్టుకొన్న ఈ భక్తిగీతం మరపురాని పాటగా మిగిలింది. అలాగే, "శరణం నీ దివ్య చరణం" **(మట్టిలో మాణిక్యం-1971)**, "మము పాలింపగ నడచి వచ్చితివా" **(బుద్ధిమంతుడు-1969)**, "తనివి తీరలేదే, నా మనసు నిండలేదే" లలితమైన శృంగారమున్న ఈ పాట పున్నమా అని. సూపర్ స్టార్ కృష్ణని నేను ఇష్టపడిన అరుదైన రోజులవి. అలాగే "చిలిపి నవ్వుల నిను చూడగానే" అనే పాట. "ఎన్నెన్నో జన్మల బంధం" అనే **'పూజ'** సినిమా పాట రాసినది దాశరథే అని తెలుసునా?

దాశరథి ఉర్దూ చదువుకున్నారు. గాలిబ్‌ను ఔపోసన పట్టారు. తన పాటల్లో ఉర్దూ పదాల్ని అందంగా పొదిగారు. ఖుషీ ఖుషీగా నవ్వుతూ, నిషాకనులను కీర్తిస్తూ హుషారుగా ఉండే, హమేషా మజాగా ఉండే పాటలు రాశారు. పాటల్లో ఉర్దూ పదాల్ని వాడటం ఒక ఎత్తు. ఆ ఉర్దూ సంప్రదాయపు ఖవ్వాలీలను (నవ్వాలీ, నవ్వాలీ, మీ నవ్వులు నాకే ఇవ్వాలి) తెలుగు పాటలో ప్రవేశపెట్టడం ఇంకో ఎత్తు.

తెలుగు సినిమాలంటేనే సెంటిమెంట్ల పుట్ట, అనుబంధాల గుట్ట. దాశరథిగారు ఈ బంధాల్లో చక్కగా ఇరుక్కుని పోయారు, మనల్నీ ఇరికించారు. "బాబూ వినరా అన్నాదమ్ములా కథ ఒకటి" అంటూ **'పండంటి కాపురం'** లో పాడించారు. అనుబంధ సినీ గీతాలలో తలమానికం అనబడే "ఇదే రక్తసంబంధం" **(రక్తసంబంధం)** అనే పాట, "అన్నా నీ అభిమానం" అనే **'ఆడపడుచు'** సినిమాలోని పాట కూడా దాశరథి రాసినవే.

వీణపాటలు అంటే ఎన్నెన్నో గుర్తొస్తాయి. కానీ దాశరథి గుర్తుకురారు. "మదిలో వీణలు మ్రోగే" అనే **'ఆత్మీయులు'** చిత్రంలోని పాట, "పాడెద నీ నామమే" అన్న 'అమాయకురాలు' సినిమాలోనిపాట దాశరథి గీతాలే.

వేల వేల మాటల్లో అంతే లేని ఆందోళన..."ఓహో గులాబి బాలా" **(మంచిమనిషి - 1964)** ఆ ఏడాది తెలుగు సినీ జాతీయగీతమైంది. ఇప్పటికీ వసివాడని గులాబీ అది.

చక్కని ప్రణయ గీతాలు తెలుగు సినిమాల్లో కోకొల్లలు. "వెన్నెల రేయి, ఎంతో చలీ చలీ" అన్నారు 1965లో దాశరథి 'ప్రేమించి చూడు'లో..."చిలిపి నవ్వుల నిను చూడగానే" గురించి ముందే అనుకొన్నాం.

పల్లెపదుచు పాటలు - "గోదారీ గట్టుందీ", **"డాక్టర్ చక్రవర్తి"** లో "ఓ ఉంగరాల ముంగురుల రాజా"...

భావగీతాలు - 1963లోనే "వినిపించని రాగాలే" వినిపించారు **'చదువుకున్న అమ్మాయిలు'** లో. 1968లో "విన్నవించుకోనా చిన్న కోరికా" అని మనసు విప్పారు. 70లో "రాశాను ప్రేమలేఖలెన్నో" అన్నారు. అలా మనతో "తనివి తీరలేదే" అనిపించారు. "ఆవేశం రావాలి. ఆవేదన కావాలి. గుండెలోని గాయాలు - మండించే గేయాలు - వేదనై...శోధనై కదలాలీ విప్లవాలు" అని కూడా అన్నారు 1967లో **'మనసు - మాంగల్యం'** లో.

ఇలా తలచుకుంటూ వెళితే ఎన్నో ఎన్నెన్నో...

"నన్ను వదలి నీవు పోలేవులే", "అందాల ఓ చిలుకా, అందుకో నా లేఖ", "అందాల బొమ్మతో ఆటాడవా," "ఓ చెలీ కోపమా!", "నీవు రావు, నిదుర రాదు", "మంచివాడు మా బాబాయి"...ఇలా ఎన్నో జ్ఞాపకాలు. ఎంతో నాస్టాల్జియా. "అరె! ఇవన్నీ దాశరథి వేనా?" అన్న ఓ కొత్త సంతోషం పురివిప్పుతుంది. 1960నాటి 'వాగ్దానం' నుండి 1978 నాటి 'అన్నదమ్ముల సవాల్' వరకూ దాశరథి సాగించిన సినీగేయ ప్రస్థానం మన అందరి జీవితాల్లో ఓ సువర్ణ అధ్యాయం అనడం అతిశయోక్తి కానేకాదు!

దాసరి అమరేంద్ర








ఈ రోజు రాత్రి గౌతమికి హైదరాబాదు ప్రయాణం! సూట్‌కేస్ ఎత్తి చూస్తే చాలా బరువుంది. ఇంత బరువుని నేను హేండిల్ చెయ్యలేనని అనిపిస్తోంది. కానీ తప్పదు మరి. ఆనంది క్రితంసారి వచ్చినపుడు కొన్ని ఏవో వదిలేసి వెళ్ళింది. "పట్టుకు పోతానమ్మా!" అని అది అన్నా "వద్దులే! నేను వచ్చేటప్పుడు తెస్తాను ఉంచెయ్య"మన్నాను. కానీ బరువుగానే అనిపిస్తున్నాయిప్పుడు. అరవైఏళ్ళ వయసులో ఇంక నా బరువంటూ పెద్దగా ఏమీలేదు. దానిదే ఈ సామాను. మళ్ళీ అన్నీ తీసి సర్దుతుంటే, 'పలుకే బంగారమాయెనా!' అని ఎవరో నిష్ఠూర మాడుతున్నారు. రాముడేమో కానీ, మనం తాత్సారం చెయ్యడానికి లేదు. వెళ్ళి ఫోను తీశాను...

# వానకి తడిసే పక్షి


99494 87680

"అక్కా ఏం చేస్తున్నావు? చాలా కంగారుగా ఉంది. రాజీ ఆఫీసునుండి వస్తూ ఆటో ఎక్కగానే ఫోన్ చేసింది. చాలా సేపయింది. ఈపాటికి దిగిపోయి వుండాలి... ఇంకా ఫోనూ లేదు. మెసేజ్ లేదు. అనిల్‌కి చేస్తే ఏ కబురూ తెలుస్తుందని అలా చేస్తూనే ఉన్నాను. ఆ అబ్బాయి తియ్యడం లేదు. ఎందుకు ఇన్నిసార్లు చేస్తున్నారో అని కాస్త ఇంగితం ఉండాలి కదా! దిగి ఉంటుందంటావా? ఏమిటో భయంగా ఉందే!" అని మా శైలూ నన్ను మాట్లాడనివ్వకుండా దాదాపు ఏడ్చేస్తోంది.

శైలు నా పెద్ద చెల్లెలు. దాని ఒక్కగానొక్క కూతురు రాజీవలోచన – ముద్దుగా రాజీ! ఈ మధ్యే దాని పెళ్ళి చేసింది మా శైలూ. ఏడాదయ్యిం దనుకోండి. ఏరి కోరి వెతికి వేశారి చివరకు ఒక ఐఐటి ఖరగ్‌పూర్ అబ్బాయిని పట్టుకుని, రంగ రంగ వైభవంగా పెళ్ళి చేసింది. అతడేమో పెద్ద ఎమ్మెన్సీ కంపెనీలో మంచి స్థాయిలో ఉన్నాడు. అస్సలు తీరిక ఉండదట! వాళ్ళకీ ఒక్కడే కొడుకు. ఆ తల్లి దండ్రులకీ, ఈ తల్లిదండ్రులకీ ముఖ్యంగా తల్లులకి వాళ్ళమీదే దృష్టి. ఈ పిల్లలిద్దరూ బాధ్యత ఎక్కువ పడాల్సిన ఉద్యోగాల్లో ఉన్నారు. వాళ్లిద్దరికీ కూడా ఒకళ్ళతో ఒకళ్ళు పంచుకునే సమయమే దొరకడం లేదని వాపోతూ ఉంటారట. ఆ ఉన్న కాసింత సమయంలోనే పేరెంట్స్‌ని పట్టించుకోవాలి...వాళ్ళ యోగక్షేమాలు కనుక్కోవాలి. ఈ లోపులోనే ఆ తల్లీ – ఈ తల్లీ ఇద్దరూ, అరంగుళం దూరంగా కూడా ఎప్పుడూ ఉండని ఆ చిన్ని బుజ్జిముండతో – రకరకాల apps లో వీళ్ళని పలకరిస్తూ మురిసి పోతూ ఉంటారు. ఒక్కొక్కసారి ఇలా మా శైలూలా దు:ఖంతో తడిసి ముద్దయిపోతూ ఉంటారు. అత్తగా రయితే మాత్రం ఫోను చేసిన ఐదు నిమిషాల్లో మళ్ళీ కాల్‌బాక్ చెయ్యకపోతే అగ్గి మీద గుగ్గిలంలా మండిపోతూ ఉంటుందన్నమాట ప్రచారంలోఉంది. కొత్తగా పెళ్ళయిన జంట! ఎంతకీ సమయం చిక్కని పిల్లల సమయ సందర్భాలు ఎలా ఉంటాయో అన్నది వీళ్ళ ప్రేమల జడివానలో ఫ్రీజ్ అయిపో యిన విషయం...సరే!

"శైలమ్మా ! ఫోన్ రాలేదన్న బెంగనుండి – ఫోన్ వచ్చిందమ్మో వీళ్ళద్దరి దగ్గరనుండి, ఏమిటి విషయం, అన్న పరిస్థితిలోకి రావాలి నువ్వు మెల్లిగా ఇంక! అది చిన్నపిల్లేమీ కాదు. ఐదారుగురు తనతో సమానమైన వాళ్ళని హేండిల్ చేస్తున్న గ్రూప్ లీడరు అది! బయటి పరిస్థితులు బాగుండ లేదన్న మాట నూటికి నూరుపాళ్ళు నిజం! కానీ మనం దూరంగా ఉండి అనుక్షణం చెడు ఊహించు కుంటూ ఉంటే మనకేదైనా అయితే అదికూడా దానికి సమస్యే కదా! అంతే కాకుండా అది చాలా వ్యవహారాలు చూసుకోవాలి. అటు అత్తగారు... వాళ్ళా యన... ఇల్లు ఆఫీసు... ఇన్ని దాని బుర్ర నిండా నిండిపోయి ఉంటాయి. అవునుగానీ, మరచిపోయాను. నిన్న 'ప్రేమించిచూడు' సినిమా చూసేనే... 'దొరి కేరూ దొరగారూ' అన్నపాట వింటూంటే – నువ్వు ఆ రోజుల్లో నీ పొడుగుజడని ముందుకీ – వెనక్కీ వేస్తూ ఇంట్లో తిరుగుతూ వయ్యారంగా ఆ పాట పాడే దృశ్యం పదేపదే గుర్తుకువచ్చిందే!" అన్నాను.

"అవునా అక్కా...నాకూ చెప్పవలసిందే! సినిమా చాలా బాగుంటుంది. ఎన్నిసార్లు చూశామో..." అని కొంచెం రిలాక్సయి ఏవో చిన్నప్పటి సంగతులు మాట్లాడుతూ కొంచెం తెరిపిన పడింది. ఇంతలో రాజీ నెంబరు కనిపించిందనుకుంటాను – "అక్కా రాజీ ఫోను చేస్తోంది ఉంటానక్కా" అని హడావిడిగా పెట్టేసింది.

మళ్ళీ సూట్‌కేస్ దగ్గరకు వెళ్ళాను. నొక్కి నొక్కి పెడుతోంటే అన్నీ బయటకు తంతు న్నాయి. ఇక దీని సంగతి తరువాత చూద్దామని పక్కన పెట్టి వంటింట్లో ప్రవేశించాను. తోమిన గిన్నెలన్నీ శుభ్రంగా గుడ్డతో తుడిచి, అలమార్లో సర్ది – పేపర్లో సాహిత్యం పేజీలో ఏముందో అని తీశాను. మళ్ళీ ఎవరో 'పలుకే బంగారమాయెనా' అని బతిమాలుతున్నారు. పలుకేమో కానీ 'సమ యం' మాత్రం బంగారమే అయిపోయింది. కాసేపు ఉపేక్ష చేద్దామా అని ఒక క్షణం అనిపించినా, ఏమో, ఎవరు ఏ తీపి కబురు చెప్పడానికి వేచి ఉన్నారో అన్న టెంప్టేషన్ ఆగనివ్వలేదు.

డా|| ధూళిపాళ అన్నపూర్ణ

మా ఆడపడుచు సూర్యం ఫోను..."హలో వదినా! ఎందులో మునిగిపోయావు? ఎంతకీ ఫోను తియ్యవు" అని నాకు చిన్న చురక.

"ఈ టైములో చేశావేంటి సూర్యం కొత్తగా... పూజలన్నీ పూర్తయ్యాయా?" అన్నాను నేను మాత్రం వదలడమెందుకని.

"ఏంలేదు వదినా, తేజాగాడికి ఒక సంబంధం వచ్చింది. ఆవిడకు నువ్వు తెలుసని చెప్పింది. ఏ ఇంటినుండి పిల్లను తెచ్చుకున్నా వాడు సుఖపడాలి కదా వదినా! వాళ్ళ ఇంటి పరిస్థితి అదీ ఏమిటి? ఆడ పెత్తనమా? కాస్త జాగర్తయిన మనుషులేనా? నువ్వు ఎంక్వైరీ చేస్తావని చేశాను" అంది.

నాకు ఏం చెప్పాలో తెలియక నవ్వు వచ్చింది. గళ్ళలో పావులన్నీ చక్కగా నప్పించి, జీవితాన్ని వాళ్ళ చేతిలో పెట్టాలని తల్లిదండ్రులం ఎంత తాపత్రయపడతాం! సూర్యం ఏది సుఖమను కుంటోందో – అదే తేజాకు సుఖమవుతుందన్న నిశ్చయం ఏమైనా ఉందా? అంతే కాదు, పదిమందిలోని మనుషులు – వాళ్లు ఒంటరిగా ఉన్నప్పటి మనుషులు ఒకటే అని చెప్పడానికి ఉందా? ఎవరైనా సుఖంగా ఉంటారా అన్నది ఒక శాతం చెప్పగల మేమోకానీ, ప్రశాంతంగా వాళ్ళిద్దరూ ఉంటారా అన్నది మాత్రం ఆమాత్రంగా కూడా చెప్పలేమని నాకనిపిస్తుంది. ఇంతకూ నా ఆలోచనల్లో సూర్యం మాటలు సమంగా వినడంలేదు. "ఓ వదినా వింటున్నావా? మన ఇంటి పద్ధతి – మన సంప్రదాయం పాటించే పిల్లయి ఉండాలి. ఇది మాత్రం గుర్తుపెట్టుకో" అని నొక్కి చెప్పింది.

"అలాగే సూర్యం! ఆవిడ నాకు గుళ్ళో పరిచయం. ఎవరైనా వాళ్ళింటి పద్ధతీ – పరిస్థితి కనుక్కుంటాలే. అయినా సూర్యం! ఒక్కమాట! మనం ఇరవై మూడేళ్ళ పిల్లను తెచ్చుకుంటున్నాం. నలభై నలభై ఐదు వేలు సంపాదించుకుంటోం దన్నావు నిన్న. ఆ అమ్మాయిని మనం మనకు నచ్చినట్టు ఉండాలని బలవంతపెట్టడంకంటే, ఆ అమ్మాయికి మనం నచ్చి మనల్ని ప్రేమించాలి అన్న ఆలోచన పెట్టుకోవడం నీకు మంచిది. ఇది ముందు జరిగితే మిగిలినవన్నీ వాటంతట అవే సర్దుకుంటాయి. నువ్వు నేను మాత్రం మన అత్త గార్లు ఏం చెప్పారో ఎలా చేశారో అలాగే చేయ గలిగామా చెప్పు?. కాలానుగుణంగా మార్పులు తప్పవు. నీకసలే బ్లడ్ ప్రెషర్, షుగర్. ఎక్కువ ఆలోచించకు" అని ఫోన్ పెట్టేశాను.

సూర్యంతో మాట్లాడుతున్నంతసేపు ఎవరో మళ్ళీ మళ్ళీ చేస్తూనే ఉన్నారు. ఎవరా అని చూస్తే లక్ష్మి. అబ్బ! చాలా సంతోషంగా అనిపించింది. ఇలాంటి సందర్భంలోనే ప్రాణంలేని ఈ వస్తువు తెగ ముద్దొచ్చేస్తుంది. అందుకే గంటగంటకీ దానికి ప్రాణం పోస్తూ ఉంటాను.

లక్ష్మి, నేను చిన్నప్పటి స్నేహితులం. ఈ మధ్యే మళ్ళీ కలిశాం. మొదటినుంచి లక్ష్మి చాలా చురుకు. అన్నింటిలోనూ ముందుండేది. దాని ధైర్యం చూస్తే నాకు సమ్మోహనంగా ఉండేది. మేము పి.జి. చేస్తూ ఉండగానే అది బేంక్ పరీక్షలో సెలక్టయి వెళ్ళిపోయింది. తరువాత పెళ్ళి. కులాంతరం. ఎక్కడ ఉందో తెలియలేదు. కానీ చాలా సందర్భాల్లో తలుచుకుంటూ ఉండేదాన్ని.

అనుకోకుండా ఈ మధ్య మళ్ళీ కలిశాం. మా ఆనంది తన స్నేహితురాలి పెళ్ళి ఫొటోలు ఫేస్




బుక్‌లో ఉన్నాయని చూపిస్తోంటే ఆ ఫొటోల్లో లక్ష్మిని చూశాను. మొత్తానికి మా అమ్మాయి దాని ఎడ్రస్, ఫోను నెంబరు సంపాదించింది. మాకు దగ్గర్లోనే ఉందని తెలిసి మరింత సంతోషపడ్డాను. చివరకు వెళ్ళాను ఒకరోజు.

* * *

నేను ఎవరో చెప్పకుండా ఫోనుచేసి, తనని కలవవలసిన పనిఉందని, ఇంటికి వస్తానని చెప్పాను. "నన్నా...నన్నెందుకు కలవడం... మీరెవరు?" అని ప్రశ్నల వర్షం కురిపించడం మొదలు పెట్టింది. ఏమిటో...లక్ష్మిని కలుస్తున్నానన్న ఆలోచన నన్ను మళ్ళీ చిన్నపిల్లను చేసేసింది. చెప్పకుండా

వెళ్ళి దాన్ని ఆశ్చర్యపరచాలన్న చిన్న కొంటె సరదా! అదీ ఈ వయసులో! నాకే ఆశ్చర్యం. నేను ఎవరో చెప్పదల్చుకోలేదు. ఏదో లోన్ విషయంలో మీ దంపతుల సలహా కావాలని, ఎంతోసేపు ఇబ్బంది పెట్టనని, ఆదివారం వస్తానని చెప్పాను. కొంచెం విసుగ్గానే "సరే" అంది.

సమంగా ఇల్లు లోకేట్ చేసి గేటుముందు నిలబడ్డాను. గేటు దగ్గర ఆకాశానికి హారతి పడుతున్నట్లు ఎర్రటి ఆకులతో గుండ్రంగా విచ్చుకున్న లేత బాదంచెట్టు. దానిక్రింద నుంచుని చూస్తోంటే బంగారు రంగుతో చెక్కిన అక్షరాలతో నల్లటి నేమ్ ప్లేట్...యస్. స్వయంభూలక్ష్మి, క్రింద యస్. లక్ష్మీ నారాయణ అన్నపేర్లు దానిమీద. లక్ష్మి పేరే కొంచెం కొత్తగా ఉండేది. మళ్ళీ మళ్ళీ అడిగేవారు ఆ పేరుని. మేము కొంచెం పెద్దయ్యేకొద్దీ నిజంగా ఈ లక్ష్మి 'స్వయంభూ'యేనా అని అనుకునే వాళ్ళం! ప్రతీదాన్నీ గమనించడం - పరిశీలించడం - విమర్శించడం - తన నిర్ణయాన్ని ధైర్యంగా చెప్పెయ్యడం - ఇవన్నీ ఆ రోజుల్లో ఆడపిల్లల్లో చాలా తక్కువ మందిలో కనబడేవి. దానికి బ్యాంక్‌లో ఉద్యోగం వచ్చిందని చెప్పినపుడు మా నాన్న దాన్ని "నిజంగా స్వయంభూలక్ష్మివే నువ్వు! సంపాదనలో కూడా పడ్డావు" అని మెచ్చుకున్నారు. అవన్నీ గుర్తుకు వస్తున్నాయి. కనకాంబరం రంగు పూవులు - పసుపు రంగు పూవులు కలగలసిపోయి పూసి ఉన్నతీగలు ఇంటిముందర పాకి ఉన్నాయి. ఆ రంగుల కలయిక కొత్తగా ఆహ్లాదకరంగా ఉంది. నెమ్మదిగా వరండాపైకి వెళ్ళి కాలింగ్‌బెల్ మోగించాను. రెండు నిమిషాలకి రెండు వైపుల నుండి ఆడ మగ ఇద్దరూ ఒకేసారి గుమ్మం దగ్గరకు వచ్చారు. ఆయన "మీరేనా వస్తానన్నది!"అని అన్నారు. లక్ష్మి అక్కడే నిలబడి తేరిపార చూస్తూ ఒక్క నిమిషానికి "అపర్ణా" అని వచ్చి ఇంచుమించు మీద పడిపోయింది. చేయి పుచ్చుకుని తీసుకు వెళ్ళి సోఫాలో కూర్చోపెట్టింది.

"ఎలా? ఇలా?" అని ఎన్నో ప్రశ్నలు రెండు మాటల్లో అడిగింది."ఫేస్‌బుక్... ఫేస్ వ్యాల్యూ తల్లీ!" అని రెండు మాటల్లోనే నేనూ సమాధానం చెప్పాను. తరవాత మంచినీళ్ళు, కాఫీ, టీ ఏమీ అది అడగలేదు. నాకూ గుర్తు రాలేదు చాలా సంగతులు మాట్లాడుకున్నాం. అన్నీ పాత మనుషుల పాత సంగతులు. ఇంకా ఇంకా ఊరుతున్నాయి. అలా గతంలోని ఎన్నో సంగతుల్లో కూరుకుపోయాం!

ఇంతలో ఆయన మూడుకప్పులు ఒక ట్రేలో పెట్టి పక్కన పంచదార గిన్నె - చెంచాతో సహా తీసుకువచ్చి టీపాయ్ మీద పెట్టి కూర్చున్నారు. "పంచదార మీక్కావలసింది వేసుకోండి" అని కప్పు చేతికిచ్చారు. అప్పుడు ఆయన్ని, ఆయనతో పాటు గదినీ పరిశీలనగా చూశాను.

"నేను లక్ష్మీనారాయణ...మీ లక్ష్మి బెటర్ ఆఫ్" అన్నారు. గదిలో మూడువైపులా పెద్ద పెద్ద ఫొటోలు. ఒకే పాప అన్నింటిలో! కోటేసినట్టున్న ముక్కు - చిలిపి కళ్ళు - గిరజాల జుట్టు ఒత్తుగా! బహుశా ఏడెనిమిది నెలలప్పటి ఫొటోలు. నేను పరిశీలనగా చూస్తోంటే లక్ష్మి ఏమీ మాట్లాడకుండా తదేక ధ్యానంతో కాఫీ తాగుతోంది నిశ్శబ్దంగా! భార్యా భర్తలిద్దరి ఫొటో ఎక్కడా కనిపించలేదు. అలమార్లలో కూడా ఎక్కడా ఉన్నట్టు లేదు. నేను లక్ష్మికేసి చూస్తోంటే నాకేసి చూడకుండా కాఫీ తాగుతూనే ఉంది. నాలుగు వైపులా నాలుగు గాజు గిన్నెలనిండా నాలుగు రంగుల గులాబీలున్నాయి. గులాబీ అగరువత్తుల వాసన ఇల్లంతా! "పాప చాలా బాగుంది లక్ష్మీ..." అన్నాను. అలా అనగానే "రా..." అంటూ నా చెయ్యి పట్టుకుని లోపలికి తీసుకెళ్ళింది. లోపలకు వెళ్ళాక ఇంటికి చివర భాగంలో ఇల్లంత వెడల్పున ఉన్న ఒక గదిలోకి తీసికెళ్ళి కర్టెన్ తీసింది. ఆ గది గోడల న్నిటిపై పెయింటింగ్స్. ఒక వైపున పక్షుల బొమ్మలు "ఇంక ఎగురుతాయి" అన్నట్టుగా ఉన్నాయి. ఒకవైపు నీళ్ళలో కమలాలు, కలువలు. ఇంకోవైపు చిన్న పిల్లలు. మరోవైపు పెద్ద ఆంజనేయస్వామి పెయింటింగ్. గుమ్మం పక్కగా ఒక వీల్‌ఛైర్. దాని పక్కగా ఒక పడక కుర్చీ. అక్కడంతా పొడుగ్గా అందమైన పనితనంతో ఒక గోడకు చేర్చి అరు గులా కట్టారు. దానిమీద రెండు చివర్లలోను రెండు స్టీరియో బాక్సు లున్నాయి. ఒక పక్క మంచం ఉంది. ఖాళీ గా ఉంది. చిన్న చిన్న చెవుల పిల్లులు నిదరపోతున్న ట్లున్న బొమ్మల దుప్పటి. ఏమిటో ఆ గది అమరిక...ఒక కుతూహలాన్ని రేకెత్తిస్తోంది.

"పాప స్నానం చేస్తోంది. కూర్చుందాం ఇక్కడ" అని లక్ష్మి రెండు ఫైబరు కుర్చీలు లాగింది. లోపల్నించి ఏవో మాటలు, పాటలు వినిపిస్తున్నాయి. రెండు నిమిషాలకి ఒక అమ్మాయి బయటకు వచ్చింది. ముప్పయ్ ఏళ్ళు ఉంటాయి. "మీ అమ్మాయా...?" అని అనబోయాను. "అమ్మా పాప...ఎర్ర టాప్ వేసుకుంటానంటోంది" అంటూ బీరువా తీసి పట్టుకెళ్ళింది. నాకంతా అయోమయంగా ఉంది.

"ఈ అమ్మాయి కరుణ. పాపకి అక్క" అంది. ఇంతలో తలుపు తీసికొని ఒక అమ్మాయిని జాగ్రత్తగా పట్టుకుని తీసుకువచ్చి వీల్‌ఛైర్‌లో కూర్చోబెట్టింది. బాగుంది పాప..."అయ్యో - ఏమయింది? నడవలేదా?" అన్నాను గబుక్కున. కానీ పాప ముఖంలోకి చూడగానే అర్థమయిపోయింది. ఆ పాప నడవలేకపోవడమే కాదు, బహుశా ఏమీ చెయ్యలేదు. ఇంక నా నోట మాట రాలేదు. శరీరంలో ఎంతో పరిణతి. కళ్లల్లో మాత్రం పసితనం అలాగే ఉంది. చక్రాల కుర్చీ జరుపుకుంటూ వచ్చింది.

"హాయ్ గులాబీ! అత్త!" అని నన్ను చూపించి చెప్పింది స్వయంభూలక్ష్మి. పాప చెయ్యి నా బుగ్గ దగ్గరగా తెచ్చి ముట్టుకోబోయి మానేసింది. నేను పట్టుకోబోతే వెనక్కి జరిగి పక్షులున్న గోడ దగ్గరకు వెళ్ళి వాటికేసి చూస్తూ ఉండిపోయింది. మధ్యమధ్యలో నాకేసి చూస్తోంది. పాపకి కరుణ తల దువ్వుతోంది. లక్ష్మి ఒక ఎర్ర గులాబీ తెచ్చి చెంపపిన్నుతో తల్లో పెట్టింది. మంద్రస్వరంతో ఎం.ఎస్.సుబ్బలక్ష్మిగారి హనుమాన్ చాలీసా మొదలయింది. పాప దాని దగ్గరగా వెళ్ళి రెండు చేతుల్లో ముఖం పెట్టుకుని కూర్చుంది. ఎదురుగా గోడమీద ఆంజనేయస్వామి.

"దీనికి ఎదురుగా ఉన్న స్వామి అన్నా, ఆ హనుమాన్ చాలీసా అన్నా ఎంతో ఇష్టం. రోజూ ఆ స్వామి ఎదురుగా కూర్చుని అది వినవలసిందే! లేకపోతే తిక్కగా అయిపోతుంది" అంది.

"జాలి పడుతున్నావా నన్ను చూసి అపర్ణా! వద్దు! నాకిప్పుడు ఎవరి సానుభూతి, జాలి అక్కర్లేదు. అయామ్ ఆల్‌రైట్ నౌ" అంటూ మనసులో ఘోష బయటకు చెప్పింది...

"నేనూ నారాయణా హనుమాన్ జంక్షన్‌లో కలిసి పనిచేసేటప్పుడు ఒకర్నొకరు కావాలనుకున్నాం. కానీ అమ్మా నాన్న ఒప్పుకోలేదు. వాళ్ళ అమ్మా ఒప్పుకోలేదు.కానీ మేం వాళ్ళని లెక్కచెయ్యలేదు. పెళ్లి చేసేసుకున్నాం. అమ్మగురించి బెంగగా ఉండేది, నాన్న అమ్మని తప్పుపట్టి బాధపెడతారేమో అని. కానీ వేరే మార్గం లేదు. దగ్గర్లో ఉంటే వాళ్ళకిబ్బంది అవుతుందని మహారాష్ట్ర ట్రాన్స్‌ఫర్ చేయించుకుని వెళ్ళిపోయాం. ఐదారు సంవత్సరాలు చాలా బాగా గడిచిపోయాయి. కాలం తెలియలేదు. ఆరో సంవత్సరంలో 'గులాబి' కడుపున పడింది. పండగే పండగ. అప్పటికి మా అత్తగారు కొడుకుని విడిచి ఉండలేక మా దగ్గరకు వచ్చేసారు. తొమ్మిది నెలలు ఇట్టే గడిచిపోయాయి. హనుమజ్జయంతి నాడు గులాబీ పుట్టింది. 'వాగ్నిని'

అని పేరుపెట్టాం. చాలా మంచి రంగు. పాలు, పసుపు, గులాబీ రేకులు కలిపిన రంగు. నల్లని ఉంగరాల జుట్టు. ఎంతో ముద్దుగా ఉండేది. తేడా ఏమీ నాకు తెలిసేది కాదు. పది నెలలు నిండాక చూపులో ఏదో తేడా ఉందని నారాయణకి అనిపించినా నాతో ఏమీ అనలేదు. బయట ఒకరిద్దరు అనేటప్పటికి నాకు ఒకటే భయం! గుండె బిగపట్టుకుపోయేది. దండాలు - పూజలు - మొక్కులు- పరీక్షలు రకరకాలు. మెల్లగా వాస్తవంలోకి రాక తప్పలేదు. డాక్టర్ల పరిభాషలో ఏవేవో చెప్తూ ఉండేవారు. నాకవేవీ తల్చుకోవడం - ఆ పదాలు నా పెదాలు పలకడంకూడా నాకు ఇష్టం ఉండేది కాదు. మా ఇద్దరి మధ్యన మాటలే లేవు. ఆ భయంకర నిశ్శబ్దంలో ఉండలేక మా అత్తగారు వెళ్ళిపోయారు.

"సెలవుమీద సెలవు పెడుతూనే ఉన్నాను. నారాయణ సెలవు పెడతానన్నా నేను బాంకుకు వెళ్ళలేక పోయేదాన్ని. దు:ఖం - దు:ఖం -బరువు - గుండెబరువు తల బరువు - అనారోగ్యం - ఇలా నేను పోతే! అమ్మో భయం. ఏంచెయ్యాలి? ఎలా? ఎలా? ఒకటే ఆలోచన. పాప ఎదుగుతూ ఉంది. డాక్టర్లు పరీక్షలు చేస్తూనే ఉన్నారు. ఇలా మూడు సంవత్సరాలు గడిచాయి. అపర్ణా! ఆ సమయమంతా ప్రళయకాలం. ఒళ్ళు, మనసు మొద్దుబారిపోయిన కాలం! కాని మెల్లగా బుద్ధి నాకు తెలియజెప్పడం మొదలుపెట్టింది. ఇది నేను భరించాలి. ఇలా పాపతో మేమిద్దరం జీవించాలి అన్నది నా మనసుకు తెలిసింది.

"ఆ సమయంలో మా ఆడపడుచు వచ్చింది. మా పరిస్థితి చూసింది. ఇలా కాదు లక్ష్మీ... మీకు ఒక మనిషి తోడుండాలి, నేను చూస్తాలే అని కరుణను పంపించింది వాళ్ళ అమ్మానాన్న ట్రాక్టరు తిరగబడి చనిపోయారు. ఇక్కడకు కరుణ వచ్చినప్పటినుండీ నాకు ఇంకో అమ్మాయి ఉన్నట్లే అనిపించేది, పాప తనని చాలాగే ఏక్సప్ట్ చేసింది, ఏ రుణానుబంధమో అనుకుంటాను.

"మేం కూడా వేరే వేరే టైమింగ్స్ ఉన్న బ్రాంచీల్ని చూసుకున్నాం. మా పరిస్థితి తెలుసుకుని మాకిబ్బంది కలగకుండా ఉండేలాగా మా యూనియన్ లీడర్లు మాకు అవకాశం ఇచ్చారు. నారాయణ నేను ఇంటికి వచ్చాక వెళ్ళేవాడు. కరుణ కూడా దూరవిద్యావిధానంలో చదువుకుంటూ ఉండేది. ఇలా పాపను మేం ముగ్గురం కలసి పంచుకున్నాం.

# హితవు




నిరుత్సాహపు లోగిలిలో
కలలల్లిన కాటుక గదిలో
జీవితాన్ని చింకి చాపలా పరుచుకొని
ఆశల మీనాల్ని
ఆశయాల మేషాల్నీ
లెక్కిస్తూ గుడిస్తూ
జీవిస్తూ జీర్ణిస్తూ
నీకు నీవే నిర్మించుకున్న
నరకపు సౌధంలో

రమ్యమైన బతుకును
అగమ్యం చేసుకోకు
భయాల కిటికీల్నీ
బాధల తలుపుల్నీ
భళ్ళున తెరిస్తేనేగాని
ధైర్య పవనాంకురాలు
దూసుకురావు
జ్ఞాన కిరణ పుంజాలు
మోసుకురావు

**వేదాంతం తేజోమయి**

"తప్పక మొయ్యాల్సిన బరువుగా ఈ దు:ఖాన్ని మొయ్యడం నాకు సబబు అనిపించలేదు. ఆ దు:ఖాన్ని నాలో ఒక భాగంగా సంతోషంగా ఇంకించుకున్నాను. దానికి నా ఉద్యోగం - నాకిష్ట మైన పనులు - నాకు ఆనందం కలిగించే సాహి త్యం - సంగీతం మార్గం చూపించాయి. ఇపుడు నాకే మీ చింతలేదు. దానికి అలాంటి జీవితాన్ని దేముడు ఇచ్చాడు. ఆ జీవితాన్ని అది కోరుకోలేదు. నేనూ కోరుకోలేదు. నేనూ నారా యణా ఒకరిమీద ఒకరికున్న ఇష్టంతో ఎంతో సంతోషంగా కలిసి ఉన్నాం...మా ఇష్టానికి ఎంతో అద్భుతమయిన ఫలితం మా కళ్ళ ముందుంటుంద నుకున్నాం. ఇపుడు ఇదే ఆ అద్భుతమని అనుకుంటున్నాం! ఫలితాలు మనం నిర్దేశించుకోలేం! అవి భగవంతుడు నిర్ణయిస్తాడు. ఆయన ఇచ్చినదే ప్రసా దం అపర్ణా..."!

ఏకబిగిని చెప్పింది. మధ్యలో ఎలా ఆపాలో, ఏం అడగాలో నాకు అర్థం కాలేదు. ఇంతలో కరుణ గులాబికి టిఫిన్ పట్టుకుని వచ్చింది. "ఈ కరుణ అప్పటినుండి అలాగే ఉండిపోయిందా!" అన్నాను.

"అవును దానికి ఇరవై రెండేళ్ళు వచ్చాక ఒక అబ్బాయిని వెదికి పెళ్ళి చేశాము. ఒక బాబు. ఆ చిన్నవాడు కూడా గులాబి కూడానే ఉంటాడు".

"మరి కరుణభర్త కూడా బాగానేఉంటాడా?" అన్న నా సంశయాన్ని గమనించినట్లు - "సూరిపండు, అదే కరుణ భర్త మనని పట్టించుకోకపోయినా ఇబ్బంది పెట్టడు. ఎందుకంటే నారాయణ మంచి ఉద్యోగం ఇప్పించాడు. పైన వాళ్ళ కోసం ఒక వాటా వేసి సుఖంగా ఉండడానికి తగిన ఏర్పాట్లు చేసాడు. నారాయణ ఐతే సొంత అల్లుడిలాగా చూసుకుంటాడు" అంది.

ఇద్దరం కూర్చుని మెహదీ హసన్‌ని విన్నాం. మాతోపాటు గులాబీ వింటూనే ఉంది. దానికి సంగీతంలో ప్రశాంతతట. ఏదో ఒకటి మంద్ర స్వరంలో పెట్టి ఉంచితే, వింటూ అలా ఉండిపోతుందట. సాయంత్రం దాకా మాట్లాడుకుంటూనే ఉన్నాం!

బయల్దేరబోతూ అన్నాను "లక్ష్మీ...ఎంత భారాన్ని - ఎంత తేలికగా మోస్తున్నావో ఆశ్చర్యంగా ఉంది" అన్నాను.

"బరువుని తేలిక చేసుకున్నాను! మోస్తున్నట్లు లేదు ఎందుకో!" అంది లక్ష్మి. ఆ మాట విన్నాక వర్షానికి తడిసిన పక్షి తన రెక్కలమీద ఉన్న నీటి బరువును విదుల్చుకుని - విదుల్చుకుని - తడి రెక్కలతో ఆకాశంలోకి ఎగిరే దృశ్యం పదేపదే గుర్తుకొచ్చింది.

అక్కర్లేని బరువుని గాడిదల్లా మోయడం అవసరమా అని కూడా నాకు తరుచు అనిపిస్తోంది. ఈ మాటే శైలూకి, సూర్యంకి చెప్పాలని ఉంది. లక్ష్మి గురించి కూడా చెప్పాలి... ఏమంటారో... !






పెద్దపెద్ద పట్టణాల్లో గుర్రపుబళ్లు నడిపేవాళ్ల మాటల కొరడాదెబ్బలు తిని వీపు చిట్లినవాళ్లకి, వాళ్ల చమత్కారపు భాష విని విని చెవులు పండినవాళ్లకి నాదొక విన్నపం - అమృతసర్‌లో జట్కాబళ్ల వాళ్ల నోటికి కళ్లెం వెయ్యగలరేమో చూడండి! పెద్దపెద్ద పట్టణాల్లో విశాలమైన రహదారుల్లో గుర్రపు వీపులపై కొరడాతో బాదుతూ, జట్కావాళ్లు అప్పుడప్పుడు గుర్రం అమ్మమ్మతో తనకు సంబంధాన్ని అంటగడతారు, మరొకప్పుడు పాదచారులకు కళ్లులేవని జాలిపడు తుంటారు, ఇంకొకప్పుడు వాళ్ల కాళ్ల వ్రేళ్లని తొక్కించి వాళ్లే తమని ఇబ్బందిపెట్టారని దబా యిస్తూ, లోకంలోని నిరాశా నిస్పృహలకు, దుఃఖానికంతటికే తామే ప్రతిరూపాలుగా ముక్కు సూటిగా తమ జట్కాలను తోలుకుపోతుంటారు.

# ఆమె చెప్పినట్టుగానే...

**అయితే** అమృతసర్‌లో మాత్రం జట్కాబళ్ల వాళ్ల తీరు ఇందుకు భిన్నంగా ఉంటుంది. ఇక్కడి బళ్లవాళ్లు మెలికలు తిరిగిన ఇరుకు వీధులలో ఏ ఎడ్లబండి ఎదురొచ్చినా ఆగి సముద్రమంత ఓరిమిని పొంగిపొర్లించి "తప్పుకోండి ఖాల్సాజీ!", "తప్పుకో సోదరా!", "కొంచెం ఆగు తమ్ముడూ", "రానివ్వండి లాలాజీ", "ప్రక్కకు జరుగుబిడ్డా" అంటూ తెల్ల పేంటులు, కంచరగాడిదలు, బాతులు, వీధివర్తకులు, బరువులు మోసే వాళ్ల అరణ్యంలో దారి చేసుకుంటూ ముందుకు సాగిపోతుంటారు. "అమ్మా తల్లీ", "అయ్యా బాబూ" అనకపోతే ఎవరైనా తప్పుకుంటే ఒట్టు. అంటే దీని అర్థం జట్కా వాళ్ల నాల్కకు పదును లేదని కాదు. అలా మాత్రం అనుకోవద్దు. వాళ్ల మాటలు తియ్యని బాకుల్లాగా మెత్తగా కోసేస్తాయి. ఎవరైనా ముసలావిడ పదేపదే హెచ్చరించినా తప్పుకోలేదనుకోండి - అప్పుడు జట్కావాళ్ల వాక్ప్రరంపర ఎలా ఉంటుందో చూడండి..."తప్పుకో తప్పుకో నువ్వెంతో కాలం జీవించాలి", "తప్పుకో తప్పుకో నువ్వెంతో అదృష్టవంతురాలివి", "తప్పుకోవమ్మా నువ్వు నీ సంతానానికి ప్రేమ పాత్రురాలివి", "తప్పుకో జీవించాల్సిన వయసెంతో ఉంది నీకు", "ఎందుకు నా బండి కింద పడతావు తప్పుకోవమ్మా!..."

అలాంటి జట్కా బళ్ల వాళ్ల మధ్యనుంచి ఒక కుర్రాడు, ఒక అమ్మాయి వచ్చి నాలుగు రోడ్ల కూడలిలో ఒక దుకాణం వద్ద కలిసారు. వాళ్ల తల వెంట్రుకలు, వదులు సల్వార్లను బట్టి ఇద్దరూ సిక్కుల పిల్లలని అనిపిస్తుంది. అబ్బాయి తన మామయ్య జుట్టుకు పట్టించటానికి పెరుగు కొనుక్కు వెళ్ళటానికి వచ్చాడు, అమ్మాయేమో వంట కోసం వడియాలు కొనటానికి వచ్చింది. షాపువాడు ఎవరో భాష తెలియని పరదేశితో తంటాలుపడు తున్నాడు - అతనేమో సేరు అప్పడాల దొంతరని లెక్క పెట్టుకుని తృప్తిపడకుండా అక్కడి నుంచి కదలటంలేదు.

"నీ ఇల్లెక్కడ?'

"ఇక్కడ కాదు, నగరేలో! నీ ఇల్లు?"

"మాంఝాలో... మరి ఇక్కడ ఎక్కడుంటున్నావు?"

"అతర్‌సింగ్ గారి ఇంట్లో. ఆయన మా మామయ్య"

హిందీ మూలం
చంద్రధర్‌శర్మ 'గులేరి'

అనువాదం
డా॥ వెన్నా వల్లభరావు

చంద్రధర్ శర్మ 'గులేరి' (1883-1922) హిందీలో తొలితరం కథా రచయిత. చీనాబ్ నదికి తూర్పువైపునున్న పంజాబ్ ప్రాంతం (లాయల్‌పూర్ పరిసర ప్రాంతం) 'గులేర్'గా చెప్పుకోబడుతుంది. ఆ ప్రాంతంలో జన్మించిన కారణంగా చంద్రధర్ శర్మ పేరులో 'గులేరి' వచ్చి చేరింది. హిందీ కథా సాహిత్యంలో సుప్రసిద్ధుడైన 'గులేరీ' రాసింది చాలా తక్కువ, పొందిన ఖ్యాతి అపారం. ఈయన రాసిన మూడంటే మూడు కథల్లో 'ఆమె చెప్పినట్టుగానే...' సరిగ్గా వంద సంవత్సరాల క్రితం 1915లో, పేరు మోసిన హిందీ సాహిత్య పత్రిక 'సరస్వతి' లో ప్రచురితమైంది. ఈ ఒక్క కథ కారణంగానే 'గులేరి' పేరు హిందీ సాహిత్య చరిత్రలో సుస్థిరమై వెలుగొందుతోంది. 'గులేరి' వలె ఇంత తక్కువ రాసి, ఇంత ఘనమైన కీర్తినార్జించటం ప్రపంచ సాహిత్య చరిత్రలోనే చాలా అరుదైన విషయం. ఈ కథకి వంద వసంతాలు.








"నేను కూడా మా మామయ్య గారింటికి వచ్చాను. వాళ్ల ఇల్లు గురుబజార్లో"

అప్పటికి షాపువానికి తెమిలింది. వీళ్లిద్దరికీ ఏమి కావాలో ఇచ్చాడు. కొనుక్కున్నవి చేతబట్టుకుని ఇద్దరూ షాపునుంచి బయలుదేరి నడవ సాగారు. కొంచెం దూరం వెళ్ళాక కుర్రాడు చిరునవ్వు నవ్వి అమ్మాయిని "నీకు వివాహం నిశ్చయమైందా?" అని అడిగాడు. అప్పుడా అమ్మాయి కళ్లెత్తి అతని వంక కోపంగా చూసి "ఛీ" అనేసి పరుగెత్తింది. కుర్రాడు కళ్లప్పగించి నిల్చొని చూస్తూ ఉండి పోయాడు.

రెండవ రోజు...మూడవ రోజు కూరగాయలు వాని దగ్గరో, పాలవాని దగ్గరో అనుకోకుండా అగస్మాత్తుగా ఇద్దరూ కలుసుకున్నారు. నెలంతా ఇదే పరిస్థితి. రెండు మూడుసార్లు కుర్రాడు మళ్లీ "నీ వివాహం నిశ్చయమైందా?" అని అడిగాడు. దానికి పూర్వంలాగే 'ఛీ' అనే సమాధానమే వచ్చింది. ఒకరోజు కుర్రాడు మళ్లీ అమ్మాయిని ఆటపట్టించటానికి అదే ప్రశ్న వేశాడు. ఈసారి అతను ఊహించిన సమాధానానికి విరుద్ధంగా ఆ అమ్మాయి "ఆ...అయ్యింది" అన్నది.

"ఎప్పుడు?"

"నిన్న...చూస్తున్నావుగా ఈ ఎర్రరంగు పట్టు దుస్తులు... ఈ చున్నీ!"

అమ్మాయి పరుగెత్తుకు వెళ్లిపోయింది. కుర్రాడు ఇంటిదారి పట్టాడు. దారిలో అన్యమనస్కంగా నడుస్తూ ఎవరో పిల్లాడిని ఢీకొట్టి వాణ్ణి మురికి కాల్వలో పడేటట్టు చేశాడు. వీధి వీధి తిరిగి తినుబండారాలు అమ్ముకునే వాడు రోజంతా సంపాదించుకున్న సొమ్ము నేలపాలు చేశాడు. దారిలో కనపడిన కుక్కపై అకారణంగా రాయి విసిరాడు. తోపుడు బండిపై క్యాబేజి అమ్మేవాని బండిపై తాను తీసుకువెళుతున్న పాలు ఒలకబోసాడు. ఎదురుగా స్నానం చేసి, మడి కట్టుకుని వస్తున్న వైష్ణవ భక్తురాలిని ఢీ కొట్టి 'గుడ్డి వెధవ' అనే బిరుదు పొంది, చివరికి ఇంటికి చేరాడు.

## 2

"రామ రామ, ఇదీ ఒక యుద్ధమేనా? పగలు రాత్రి కందకాల్లో కూర్చొని ఎముకలు కొంకర పోతున్నాయి. మన లూధియానాలో కంటే పదిరెట్లు ఎక్కువ చలి. ఆపైన మేఘాలు, మంచు. ఇవన్నీ కాకుండా కందకాల్లో పిక్కలదాకా బురద. శత్రువన్నవాడు కంటికి కనపడడు. గంటకి, రెండు గంటలకి కర్ణభేరి పగిలిపోయేటట్టు పేలుళ్ళతో కందకమంతా అదిరిపడుతుంది. వంద గజాల వరకు నేల కంపించిపోతుంది. చడీ చప్పుడు లేకుండా అదృశ్యంగా వచ్చిపడే పేలుడు పదార్థాల నుంచి బ్రతికి బయట పడితేగదా ఎవరైనా యుద్ధం చెయ్యగలిగేది! నాగర్‌కోటలో భూకంపం మనకు తెలిసిందే, కాని ఇక్కడ రోజుకి పాతిక సార్లు భూకంపాలు చవిచూస్తున్నాం. కందకం నుంచి పొరపాటున తలపాగానో, మోచేయో పైకి కనిపించిందంటే ఇక అంతే - క్షణంలో ఎటువైపు నుంచో తుపాకి గుండు రయ్యిన వచ్చి తగులుతుంది. నమ్మక ద్రోహులు నేలను కరుచుకుని ఉన్నారో, గడ్డిలోను ఆకులు చుట్టుకుని నక్కి ఉన్నారో తెలియదు"

"లహనాసింగ్! ఇంకా మూడు రోజులే. నాలుగు రోజులు ఎలాగో కందకంలో గడిపేశాం. ఎల్లుండి 'రిలీఫ్' వస్తుంది. ఆ తర్వాత వారం రోజులు శెలవు. హాయిగా చేతులు విదిలించు కోవచ్చు. మేకను కోసుకోవచ్చు. కడుపునిండా తిని కంటినిండా నిద్రపోవచ్చు. ఆ ఫ్రెంచ్ మేడమ్ తోటలో మఖమల్ లాంటి పచ్చిక ఉంది. ఆవిడ పళ్ళు, పాలు మంచినీళ్లలా సరఫరాచేస్తుంది. డబ్బు తీసుకొమ్మని లక్షసార్లు చెప్పినా ఒప్పుకోవటం లేదు. 'మీరు మా దేశాన్ని కాపాడటానికి వచ్చారు, మీరు మమ్మల్ని రక్షిస్తున్నారు' అంటుంది".

"నాలుగు రోజుల నుంచి కంటి మీద కునుకులేదు. పరుగెత్తకపోతే గుర్రానికి చలాకీతనం ఉండదు. యుద్ధం చేస్తుండకపోతే సిపాయికి ఉత్సాహం ఉండదు. ములికి ఉన్న తుపాకి చేత్తో పట్టుకుని నన్ను మార్చ్‌చెయ్యమని ఆజ్ఞాపిస్తే బాగుండును. నేను ఒంటరిగానే కనీసం ఏడుగురు జర్మన్ సిపాయిలను చంపకుండా తిరిగొస్తే స్వర్ణదేవాలయం గడపవద్ద మోకరిల్లే అర్హతే నాకు లేదనుకుంటాను. నీచపు వెధవలు, పిరికి పందలు– తుపాకి ములికి చూస్తే చాలు, ముఖం చాటేస్తున్నారు. కాలికి బుద్ధి చెపుతున్నారు. చీకట్లో మాత్రం ముప్పైముప్పై మణుగుల మందుగుండు సామాగ్రి జారవిడుస్తున్నారు. ఆ రోజు ఆక్రమణ చేశామే – ఆ రోజు నాలుగు మైళ్ల వరకు ఒక్క జర్మన్ సిపాయిని కూడా విడిచిపెట్టలేదు. వెనుక నుంచి జనరల్ సాహబ్ 'ఆగిపోయి వెనక్కి వచ్చేయండి' అని ఆజ్ఞాపించారుగాని, లేకపోతేనా..."

"లేకపోతే బెర్లిన్ దాకా వెళ్లిపోయేవాడివా ఏమిటి?" సూబేదార్ హజారాసింగ్ చిరునవ్వు నవ్వి "యుద్ధం విషయంలో జమాదార్లు, నాయబ్‌లు నిర్ణయాలు తీసుకోకూడదు. పెద్ద ఆఫీసర్లు దూరదృష్టితో ఆలోచనలు చేస్తారు. మూడు వందల మైళ్ల మేర స్వాధీనం చేసుకోవాలి. ఒక్కవైపు మనం మాత్రమే ముందు ముందుకు వెళ్లిపోతే ఏమిటి ప్రయోజనం?"

"సూబేదార్ గారూ, నిజమే" లహనాసింగ్ వివశత్వం ప్రకటిస్తూ అంటాడు... "ఏం చెయ్యమంటారు చెప్పండి? ఎముకల్లోకి చలి చొచ్చుకుపోతుంది. సూర్యుడు ఉదయించటమే లేదు. కందకంలో రెండు వైపుల నుంచి మంచు కరిగిన నీటి ప్రవాహం వచ్చి చేరుతుంది. ఒక్క దాడి అయినా జరిగితే ఒంట్లో వేడి పుడుతుందని ఆశ"

"ఉదమీ సింగ్ లెగు, నిప్పుల కొలిమిలో బొగ్గులు వెయ్యి. వజీరాసింగ్! మీరు నలుగురు బక్కెట్లు తీసుకుని కందంకంలోని నీరు తోడి బయట పారబొయ్యండి. లహనాసింగ్! సాయంత్రమైంది, కందకపు ముఖద్వారం వద్ద కాపలా దారుని మార్చు" పనులు పురమాయించి సూబేదారు హజారాసింగ్ కందకమంతా కలయ దిరిగాడు.

వజీరా సింగ్ ఆ పటాలంలో విదూషకుడు లాంటివాడు. బక్కెట్లో బురదనీరు నింపి బయట పారబోస్తూ "నేను ఇప్పుడు పురోహితుణ్ణయ్యాను. మీరు జర్మనీ పాదుషాకు తర్పణం వదలండి!" అన్నాడు. అతని మాటలకి పగలబడి నవ్వారు. దానితో నిరుత్సాహపు మేఘాలు తొలగిపోయాయి.

లహనా సింగ్ రెండవ బక్కెట్ నింపి వజీరా చేతికి అందిస్తూ "నీ తోటలోని ఖర్బూజా పాదులకు నీళ్లు పోస్తున్నావనుకోరాదూ! ఈ నీరు ఎరువులా పనిచేస్తుంది. ఇలాంటి నీరు మన పంజాబ్ అంతా గాలించినా దొరకదు తెలుసా?" అన్నాడు.

"అవునవును. ఆహా ఏం దేశం – స్వర్గం అనుకోవచ్చు. యుద్ధం ముగిశాక ప్రభుత్వాన్ని పది కుంటల భూమి అడిగి తీసుకుని, ఇక్కడ పళ్లతోట వేసుకుంటాను"

"నీ ప్రేయసి హీరాని కూడా ఇక్కడికి పిలిపిస్తావా? లేక పాలు పళ్లు ఇచ్చే ఆ ఫ్రెంచి మేడమ్..."

"నోరు ముయ్యి, సిగ్గు లేదూ?"

"ఒక్కో దేశపు నడత ఒక్కో తీరుగా ఉంటుంది. ఈ రోజు వరకు నేను ఆమెకు ఎన్నోసార్లు చెప్పాను గాని, సిక్కులు పొగత్రాగరని నేను నచ్చజెప్పలేకపోయాను. సిగరెట్ త్రాగమని మాటిమాటికి బలవంతపెడుతుంది. నోటికి అందించాలని ఉబలాట పడుతుంది. వద్దని నేను వెనక్కి జరిగితే చిన్నబుచ్చుకుంటుంది. కోపం వచ్చిందా? మా దేశం కోసం యుద్ధం చెయ్యటం మానెయ్యవుగా? అంటుంది".

"సరేలే బోధాసింగ్ ఇప్పుడు ఎలాఉన్నాడు?"

"బాగానే ఉన్నాడు"

"నాకు అర్థం కావటంలేదు లహనాసింగ్! రాత్రంతా నువ్వు నీ రెండు కంబళ్లు అతనికి కప్పుతున్నావు, నువ్వు నిప్పుల కొలిమి సాయంతో గడిపేస్తున్నావు. అతను కాయాల్సిన పహరా కూడా నువ్వే కాస్తున్నావు. నువ్వు నడుం వాల్చే కొయ్యల బల్లపై అతన్ని పడుకోబెడుతున్నావు, నువ్వేమో బురదలోనే రాత్రంతా నించుంటున్నావు. అలిసిపోయి నువ్వు అనారోగ్యం పాలౌతావేమో జాగ్రత్త. చలి ఎంత భయంకరంగా ఉందో గమనిస్తున్నావా? ఎముకలు కొరికేస్తుంది. నిమోనియా వచ్చి చచ్చిపోయే వాళ్ల కుటుంబాలకి హెక్టారు భూమి కూడా ఇవ్వదు ప్రభుత్వం!"

"నా గురించి నువ్వు భయపడవద్దు. నేను బులేల్ గుంట ఒడ్డునే మరణిస్తాను. చనిపోయేటప్పుడు తమ్ముడు కీరత్‌సింగ్ ఒడిలోనే నా తల ఉంటుంది. స్వయంగా వాకిట్లో నా చేతులతో నాటిన మామిడి చెట్టు నీడ నాపై ఉంటుంది"

వజీరాసింగ్ కోపంగా "ఇప్పుడు చావుని గురించి ఈ మాటలేమిటి? జర్మన్లు చావాలి, తురకలు చావాలి!" అన్నాడు.

"సోదరులారా! ఇప్పుడు ఏమైనా పాడుకుందాం"

గడ్డాలు పెంచిన, భార్యా పిల్లలున్న సిక్కులు అలాంటి పోకిరీ పాటలు పాడతారంటే ఎవరైనా నమ్ముతారా? కందకమంతా వాళ్ల పాట ప్రతిధ్వనించింది. దాంతో సిపాయిలందరూ నూతనోత్సాహం నింపుకున్నారు. ఆ క్షణాన వాళ్లని చూస్తే వాళ్లు నాలుగు రోజులు నుంచి కంటినిండా నిద్రపోతూ సంతోషంగా ఉన్నారనే అనిపిస్తుంది.

## 3

రాత్రి రెండు జాములు గడిచిపోయాయి. గాఢాంధకారం. నిశ్శబ్దం అలుముకుంది. బోధాసింగ్ ఖాళీ అయిన బిస్కెట్ టిన్నులు మూడింటిపైన తన రెండు కంబళ్ళు పరుచుకొని, లహనాసింగ్ ఇచ్చిన రెండు కంబళ్ళు– రెండు 'బరాన్' కోటులు కప్పుకుని నిద్రపోతున్నాడు. లహనాసింగ్ పహరా కాస్తూ నిలబడి ఉన్నాడు. అతని ఒక కన్ను కందకపు ప్రవేశం వైపు, మరొక కన్ను బలహీనంగా ఉన్న బోధాసింగ్ శరీరంవైపు ఉన్నాయి. బోధాసింగ్ మూలిగాడు.

"ఏం బోధాసింగ్! ఎలా ఉంది ఒంట్లో?"

"దాహంగా ఉంది. మంచినీళ్లు కావాలి!"

లహనాసింగ్ నీటి బాటిల్ అతని నోటికి అందించి తాగిస్తూ "ఇప్పుడు ఎలా ఉంది?" అని అడిగాడు.

నీళ్లు త్రాగి బోధాసింగ్ "వణుకైతే తగ్గుతున్నట్టుంది. కాని ఒళ్లంతా విపరీతమైన నొప్పులు. పళ్ళు పటపట కొట్టుకుంటున్నాయి!" అన్నాడు.

"అలాగా! అయితే నా 'జరసీ' తొడుక్కో"

"మరి నువ్వు?"

"నాకు దగ్గర్లోనే నిప్పుల కుంపటి ఉంది. చాలా వేడిగా ఉంటుంది అక్కడ. చెమట కూడా పడుతుంది"

"వద్దొద్దు, నేను తొడుక్కోను. నాలుగు రోజుల నుంచి నువ్వు నా కోసం..."

"ఆ... నాకు జ్ఞాపకం వచ్చింది. నా దగ్గర

ఇంకొక ఉన్ని 'జరసీ' ఉంది. ఈ రోజు ఉదయమే ఇచ్చారు. విదేశాలలోని స్త్రీలు మన కోసం అల్లి పంపిస్తున్నారు. భగవంతుడు వాళ్లకి మేలు చెయ్యాలి!" అని లహనాసింగ్ తనకోటు విప్పి, లోన తొడుక్కున్న 'జరసీ' విప్పసాగాడు.

"నిజమే చెపుతున్నావా?"

"అబద్ధం అనుకుంటున్నావా?" అంటూ బోధాసింగ్ వద్దంటున్నా, బలవంతంగా అతనికి 'జరసీ' తొడిగాడు లహనాసింగ్. తాను ఖాకీ కోటు, జీన్ చొక్కా మాత్రమే తొడుక్కుని పహరాకాస్తూ నిలుచున్నాడు. స్త్రీలు 'జరసీ'లు అల్లి పంపిన విషయం కేవలం కథ.

అరగంట గడిచింది. అంతలో కందకం ప్రవేశం వద్ద వెలుపల నుంచి కేక వినిపించింది "సుబేదార్ హజారాసింగ్!"

"ఎవరు? లపటన్ సాహబ్? ఆజ్ఞ... సెలవివ్వండి" అంటూ క్షణంలో సుబేదార్ అతని ఎదుట నిలిచి సైనిక వందనం చేశాడు.

"చూడు, ఈ రాత్రే ఆక్రమణ చెయ్యాల్సి ఉంది. తూర్పున ఒక మైలు దూరంలో జర్మన్ సైనికుల కందకం ఉంది. దానిలో ఏభయ్ కంటే ఎక్కువ మంది సైనికులు లేరు. మంచి అదను. ఈ చెట్ల క్రిందగా రెండు పొలాలు దాటి వెళితే బాట ఉంటుంది. రెండు మూడు మలుపు లుంటాయి. మలుపు దగ్గర పదిహేను మంది సైనికులను అట్టిపెట్టి వచ్చాను. నువ్వు ఇక్కడ పది మందిని అట్టిపెట్టి, మిగతా అందర్నీ వెంట పెట్టు కుని వెళ్లి వాళ్లను కలుసుకో శత్రువుల నుంచి కందకం ఆక్రమించుకుని, తదుపరి నా ఆజ్ఞ అందే వరకు అక్కడే ఉండు. మేము ఇక్కడ ఉంటాం"

"ఆజ్ఞ!"

మారు మాట్లాడకుండా అందరూ సిద్ధమయ్యారు. బోధాసింగ్ కూడా కంబళ్లు మడతపెట్టి వెళ్లటానికి ఉద్యుక్తుడయ్యాడు. అప్పుడు లహనాసింగ్ అతన్ని ఆపాడు. లహనాసింగ్ ప్రయాణమౌతుంటే బోధాసింగ్ తండ్రి సుబేదార్ వ్రేలుతోనే బోధావైపు సైగ చేశాడు. లహనా సింగ్‌కు అర్థమై ఆగిపోయాడు. పదిమందిని ఎవరిని ఉంచటం అనేది పెద్ద సమస్య అయింది. ఉండటానికి ఎవరూ సంసిద్ధంగా లేరు. ఏదో విధంగా నచ్చజెప్పి లహనా, బోధాలతోపాటు ఇంకో ఎనిమిది మందిని కందకంలో ఉంచి, సుబేదార్ మిగతా పటాలంతో బయలుదేరి వెళ్లిపోయాడు. లపటన్ సాహబ్, లహనా పహరా కాసేచోట ఉన్న నిప్పుల కుంపటివైపు చూస్తూ నిలబడ్డాడు. జేబులోనుంచి సిగరెట్ కేస్ తెరిచి ఒక సిగరెట్ వెలిగించాడు. పది నిముషాల తర్వాత ఇంకొక సిగరెట్ తీసి లహనా సింగ్‌కు ఇవ్వబోతూ "ఇదిగో తీసుకో, నువ్వు కూడా సిగరెట్ తాగు" అన్నాడు.

తృటిలో లహనా సింగ్‌కు విషయమంతా అర్థమైపోయింది. తన ముఖంలోని భావాలను దాచిపెట్టుకుని "ఇటివ్వండి సాబ్" అంటూ చెయ్యి చాచి సిగరెట్ అందుకున్నాడు. తీసుకునేటప్పుడు నిప్పుల కుంపటి వెలుగులో సాహబ్ ముఖం చూశాడు. తలకట్టు చూశాడు. అప్పుడతనికి ఘోరమైన సందేహం కలిగింది. లపటన్ సాహబ్ కుండే పాపిడి తీసిన పొడవాటి జుట్టు ఒక్క రోజులో ఎలా మాయమైంది? దాని స్థానంలో ఖైదీలకు ఉండేలాంటి కత్తిరించిన జుట్టు ఎక్కడ నుంచి ఊడి పడింది?

బహుశా సాహబ్ బాగా త్రాగి ఉంటారు. అందుకే క్రాపుచేయించుకు అవకాశం ఏర్పడి ఉంటుంది. ఏది ఏమైనా లహనాసింగ్ సాహబ్‌ని పరీక్షించాలనుకున్నాడు. లపటన్ సాహబ్ గత ఐదు సంవత్సరాలుగా వాళ్ల రెజిమెంట్‌లోనే ఉన్నాడు.

"ఏమిటి సాబ్, మనం హిందుస్తాన్ ఎప్పుడు తిరిగి వెళతాం?"

"యుద్ధం సమాప్తమైన తర్వాత. ఏం, ఎందుకు? ఈ దేశం నచ్చలేదా?"

"నచ్చక పోవటంకాదు సాబ్! వేటకి వెళ్లటంలో ఉన్న మజా ఇక్కడ ఎక్కడుంటుంది చెప్పండి? మీకు గుర్తుందా, గతంలో నకిలీ యుద్ధం తర్వాత మీరు, మేము కలసి జగాధరీ జిల్లాలో వేటకి వెళ్లాం"

"అవునవును"

"అప్పుడు మీరు కంచరగాడిదనెక్కి వచ్చారు. మీ వంటవాడు అబ్దుల్లా మార్గమధ్యంలో ఒక గుడి కనబడితే.... అభిషేకం చెయ్యటానికి గాబోలు ఆగాడు?"

"నిస్సందేహంగా అందుకే, వెధవ ఎప్పుడూ అంతే"

"అప్పుడు మన కెదురుగా ఒక దుప్పి వెళ్లింది. అబ్బో ఎంత పెద్ద దుప్పో! అంతపెద్ద దుప్పిని నేను అంతకు మునుపు ఎప్పుడూ చూడలేదు. మీరు గురిపెట్టి కాలిస్తే తుపాకి గుండు దాని తొడకు తగిలి పృష్ఠభాగం నుంచి బయటకు పోయింది. అలాంటి ఆఫీసర్‌తో వేటకు వెళ్లటంలో ఉన్న మజానే వేరు సాబ్! ఆ దుప్పి తలకాయ మాంసం సిమ్లాలో వండించి తెప్పించారా? రెజిమెంట్ మెస్‌లో దాన్ని సర్వ్ చేయిస్తానని మీరు చెప్పారప్పుడు"

"అవును అన్నాను. కాని నేను దాన్ని విదేశానికి పంపించేశాను"

"దానివి ఎంత పెద్ద కొమ్ములో! రెండేసి అడుగులైనా ఉండుంటాయి ఒక్కొక్కటి!"

"రెండేమిటి లహనాసింగ్! రెండడుగుల నాలుగు అంగుళాలు, అది సరే నువ్వు సిగరెట్ వెలిగించనే లేదు?"

"వెలిగిస్తాను... సాబ్... అగ్గి పెట్టె తెచ్చుకుంటాను" అని చెప్పి లహనాసింగ్ కందకంలోనికి చొరబడ్డాడు. ఇప్పుడిక అతనికి సందేహం లేదు. వెను వెంటనే తాను ఏం చెయ్యాలో నిశ్చయించుకున్నాడు.

చీకట్లో ఎవరో నిద్రపోతున్న వానిని ఢీకొన్నాడు.

"ఎవరు? వజీరాసింగ్?"

"ఆ నేనే! ఏమిటి లహనా? ఏం ప్రళయం వచ్చింది? ఇప్పుడే కునుకుపట్టింది. కొంచెంసేపు పడుకోనివ్వచ్చుగా?"

## 4

"వజీరా! లే, మెలకువ తెచ్చుకో! ప్రళయమే వచ్చింది...మన లపటన్ సాహబ్ యూనిఫాం ధరించి వచ్చింది!"

"ఏమిటి నువ్వనేది?"

"లపటన్ సాహబ్ శత్రువుల చేతిలో హతమైనా అయ్యుంటారు, లేక బందీ అయినా అయ్యుంటారు. ఆయన యూనిఫాం వేసుకుని ఎవడో జర్మన్ వాడు వచ్చాడు. మన సుబేదార్ చీకట్లో అతన్ని సరిగా చూడలేదు. వాడు ఆజ్ఞాపించిందే తడవుగా పటాలాన్ని వెంటబెట్టుకుని వెళ్లిపోయారు. నేను వాణ్ణి పరిశీలనగా చూశాను, మాట్లాడాను కూడా. ఆ మోసగాడు స్వచ్ఛమైన ఉర్దూ మాట్లాడుతున్నాడు, కాని అది గ్రాంధిక భాష. అంతేకాదు, నాకు సిగరెట్ కూడా ఇచ్చాడు తాగమని!"

"అయితే ఇప్పుడు...?"

"ఇక మన చావు ఖాయం. మోసం. సూబేదార్ మన పటాలంతో అక్కడ బురదలో దారి, తెన్ను తెలియక తిరుగుతూ ఉంటారు. ఇక్కడ మన కందకంపై దాడి జరుగుతుంది. అక్కడ మన వాళ్లు బహిరంగంగా శత్రువులకు దొరుకుతారు. వాళ్లపైన ఆక్రమణ జరుగుతుంది. నువ్వు లెగు, ఒక పని చెయ్యి. మన పటాలం వెళ్లిన అడుగు జాడలు పరికించుకుంటూ పరుగెత్తుకు వెళ్లు. ఇప్పటికి ఇంకా ఎక్కువ దూరం వెళ్లి ఉండరు. వెనువెంటనే పటాలంతో సహా మన కందకానికి తిరిగి వచ్చెయ్యమని సూబేదార్ గారికి చెప్పు. శత్రువుల కందకం, వాళ్లపై దాడి - అన్నీ పచ్చి అబద్ధాలు.

త్వరగా వెళ్లు, కందకం వెనుకవైపు నుంచి వెళ్లు. జాగ్రత్త, ఆకులు కదిలిన చప్పుడు కూడా అవ్వటానికి వీల్లేదు. ఆలస్యం చెయ్యొద్దు"

"సూబేదార్ గారి ఆజ్ఞ – మనల్ని ఇక్కడే..."

"ఆ ఆజ్ఞ విషయం పక్కన పెట్టు! నా ఆజ్ఞ – జమాదార్ లహనాసింగ్ ఆజ్ఞ – ఇప్పుడు ఇక్కడ అందరికంటే పెద్ద ఆఫీసర్ని నేను. నా ఆజ్ఞ పాటించు.... ఈ దగుల్బాజీ లపటన్‌గాడి సంగతి నేను చూసుకుంటాను. వజీరా! నువ్వు త్వరగా వెళ్లు"

"కాని, నేను కూడా వెళ్లిపోతే ఇక్కడ మీరు ఎనిమిదిమందేగదా!"

"ఎనిమిదిమందిమి కాదు మేము, పది లక్షల మందిమి. ఒక్కొక్క అకాలి సిక్ఖు లక్షా పాతిక వేల మందితో సమానం. సందేహించకుండా వెళ్లు".

లహనాసింగ్ తిరిగివచ్చి కందకపు ప్రవేశానికి చేరువగా గోడను అనుకుని నకిలీ లపటన్ ఏమి చేస్తున్నాడో గమనించసాగాడు. వాడు తన జేబులో నుంచి గుండ్రటి గుళ్లు మూడు బయటికి తీశాడు. వాటిని కందకపు గోడలకి వేరు వేరు చోట్ల అమార్చడు. ఆ మూడు గుళ్లని మందపాటి దారంలాంటి దానితో కలిపాడు. ఆ దారానికి అంచున దూది వత్తి ఉంది. బయట నుంచి ఆ వత్తిని అంటించటానికి అగ్గిపెట్టె తీసి చేతిలో...

లహనాసింగ్ మెరుపు వేగంతో తన రెండు చేతులతో తుపాకి వెనక్కి తిప్పి నకిలీ లపటన్ మోచేతిపై బలంగా మోదాడు. అతని చేతుల్లో నుంచి అగ్గిపెట్టె కింద పడిపోయింది. అతను తేరుకునే లోపే లహనా తుపాకి మడమతో వాడి మెడపై గట్టిగా బాదాడు. ఆ దెబ్బకి లపటన్ దొర "ఓహ్ మై గాడ్!" అని అరిచి తెలివి తప్పి నేల కూలాడు. వాడు కందకంలో పెట్టిన మూడు గుళ్లను తీసి కందకం బయటకు విసిరేశాడు లహనాసింగ్. వాణ్ణి ఈడ్చుకువచ్చి నిప్పుల కుంపటి వద్ద పడుకోబెట్టాడు. వాడి జేబులు వెదికాడు. మూడు – నాలుగు కవర్లు, ఒక డైరీ తీసుకుని తన జేబులో పెట్టుకున్నాడు.

ఇంతలో అయ్యగారికి మూర్ఛ తొలగింది. లహనాసింగ్ పరిహాసంగా అడిగాడు – "ఏం లపటన్ మహాశయా! ఒంట్లో ఎలా ఉంది? ఇవాళ నేను నీ నుంచి ఎన్నో కొత్త విషయాలు తెలుసుకున్నాను. సిక్ఖులు సిగరెట్ తాగుతారని తెలుసుకున్నాను, జగాధరీ జిల్లాలో దుప్పులుంటాయని, వాటికి రెండు అడుగుల నాలుగు అంగుళాల కొమ్ములుంటాయని తెలుసుకున్నాను. అంతేకాదు, మహమ్మదీయుడైన వంటవాడు గుడిలో విగ్రహానికి అభిషేకం చేస్తాడని, మా లపటన్ సాహబ్ కంచర గాడిద మీద ఎక్కుతారని నీ వల్ల తెలుసుకున్నాను. సరేగాని, ఒక్క విషయం చెప్పు – ఇలాంటి స్వచ్ఛమైన ఉర్దూ ఎక్కడ నేర్చుకుని వచ్చావు? మా లపటన్ సాహబ్ మాకు తెలియదా? ఆయన 'డేమ్' అన్న మాట మాట్లాడకుండా ఐదు మాటలు కూడా మాట్లాడరు"

లహనాసింగ్ నకిలీ లపటన్ పేంటుజేబులు సోదా చెయ్యలేదు. వాడు బహుశా విపరీతమైన చలి కారణంగా రెండు చేతులు జేబుల్లో పెట్టుకుని ఉన్నాడు.

లహనాసింగ్ మాట్లాడుతునే ఉన్నాడు "నువ్వు చాలా చతురుడివే. కాని మాంఝా గ్రామస్థుడైన లహనా ఇన్ని సంవత్సరాలు లపటన్ సాహబ్‌తోపాటు ఉన్నాడే, వీడికి మస్కా కొట్టాలంటే నాలుగు కళ్లు కావాలి. మూడు మాసాలయింది, టర్కీదేశపు మౌల్వీఒకడు మా ఊరు వచ్చాడు. ఆడవాళ్లకి సంతానం కలుగుతుందని తాయిత్తులు, పిల్లలకు జబ్బులు నయమవ్వటానికి మందులు ఇవ్వటం మొదలెట్టాడు. చౌదరి గారి మర్రిచెట్టు క్రింద బిచానా పరిచి హుక్కా తాగుతుండేవాడు. జర్మనీ వాళ్లు గొప్ప పండితులని, వేదాలు చదివి చదివి వాటి ద్వారా విమానం నడిపే విద్య తెలుసుకున్నారని, గోవుల్ని చంపరని, వాళ్లు హిందుస్థాన్‌కి వస్తే గోవధ నిరోధిస్తారని చెపుతూ వచ్చాడు. 'పోస్టాఫీసుల్లో దాచుకున్న డబ్బులన్నీ తీసేసుకోండి, ఆంగ్లేయ ప్రభుత్వం త్వరలోనే పోతుంది' అని నూరిపొయ్యటం మొదలెట్టాడు. పోస్ట్‌మాస్టర్ పోల్హూరామ్ కూడా భయపడి పోయాడు. నేను ఆ మౌల్వీ గడ్డం గొరిగించి మా గ్రామంనుంచి వెళ్లగొడుతూ మళ్లీ ఈ ఊళ్లో అడుగు పెట్టావో..."

నకిలీ లపటన్ జేబులోనుంచి పిస్తోలు పేలింది. గుండు తిన్నగా వచ్చి లహనాసింగ్ తొడకి తగిలింది. ఇటు నుంచి హెన్రీ మార్టినీ ఫైర్లు రెండు లపటన్ పుర్రెను ఎగరగొట్టి అతని కపాలక్రియ గాలించాయి. పేలుళ్ల చప్పుళ్లకి అందరూ పరుగెత్తుకు వచ్చారు.

బోధాసింగ్ గట్టిగా అరిచాడు "ఏమయింది?"

లహనాసింగ్ అతనికి "ఏమీలేదులే, పిచ్చి కుక్క ఒకటి వచ్చింది – చంపి పారేశాను" అని చెప్పి నిశ్చింతగా పడుకోమన్నాడు. మిగిలిన వాళ్లకి మాత్రం పరిస్థితి మొత్తం తెలియజెప్పాడు. వెంటనే అందరూ తుపాకులు తీసుకుని సిద్ధమైపోయారు. లహనాసింగ్ తలపాగా చింపి తన తొడకైన బలమైన గాయానికి గట్టిగా బిగించి కట్టు కట్టుకున్నాడు. గాయం కండకు మాత్రమే అయింది. కట్టు కట్టడంతో రక్తస్రావం ఆగి పోయింది.

ఇంతలో డెబ్బయ్ మంది జర్మనీ సిపాయిలు భయోత్పాతం కలిగించేటట్టు గట్టిగట్టిగా అరుస్తూ కందకంలోకి చొరబడ్డారు. సిక్ఖు సిపాయిల తుపాకి గుళ్ల వరద తొలి ఆక్రమణదారుల్ని నిరోధించింది. రెండవ బృందాన్ని ఆపగలిగింది కాని ఇక్కడున్న వాళ్లు ఎనిమిది మంది, వాళ్లేమో డెబ్భైమంది. లహనాసింగ్ నిలబడి, తుపాకి గురిపెట్టి శత్రువుల్ని నేల కూలుస్తున్నాడు. ఇతర సిక్ఖు జవాన్లు కందకంలోకి చొరబడిన వాళ్లని చొరబడ్డట్టు కాల్చి పారేస్తున్నారు. చనిపోతున్న తన జవాన్ల శరీరాల్ని తొక్కుకుంటూ జర్మనీ సిపాయిలు సిక్ఖుల కందకంలోకి ఉరుకుతున్నారు. కొద్ది నిమిషాల్లో వాళ్లు...

అకస్మాత్తుగా అరుపులు, కేరింతలు..."వాహ్ గురుజీ! విజయం చేకూర్చు! వాహ్ గురుజీ! మేము నీవారం! వాహ్ గురూజీ నీదే విజయం!" తుపాకి గుళ్లు జర్మనీ జవాన్ల వీపుల్లో చొరబడి వాళ్లని నేల కూలుస్తున్నాయి. సరైన సమయానికి జర్మన్లు తిరగలి రాళ్ల మధ్య ధాన్యపు గింజల్లా నలిగిపోసాగారు. వెనుక నుంచి సూబేదార్ హజారాసింగ్ పటాలం శత్రువులపై నిప్పులు కురిపిస్తుండగా, ఎదురుగా లహనాసింగ్ – అతని సహచరులు తుపాకి ములికితో వాళ్లని మట్టుపెట్టసాగారు. చేరువగా వచ్చిన తర్వాత వెనకనున్న సిక్ఖు సిపాయిలు కూడా ములికితో హతమార్చటం మొదలెట్టారు.

మరొకసారి కేరింతలు..."అకాలీ సిక్ఖులదే గెలుపు! వాహ్ గురూజీ విజయం ప్రసాదించావు! సత్యమే భగవంతుడు! సత్యానికే జయం!"

యుద్ధం సమాప్తమైంది. అరవైమూడు మంది జర్మన్లు చనిపోనైనా చనిపోయారు లేక మూల్గుతూ నేలపై పడి గిలగిల తన్ను కుంటున్నారు. సిక్ఖు సిపాయిల్లో కూడా పదిహేను మంది ప్రాణాలు కోల్పోయారు. సూబేదార్ భుజం నుంచి తుపాకి గుండు ఇటు నుంచి అటు వెళ్లిపోయింది. లహనాసింగ్ ప్రక్కటెముకల్లో గుండు దిగింది. అతను తన గాయాన్ని కందకంలోని బంక మన్నుతో పూడ్చి, దానిపై తలపాగాలో మిగిలిన గుడ్డని బెల్టు బిగించినట్టుగా నడుముకు గట్టిగా బిగించి కట్టుకున్నాడు. సహచరులెవ్వరికీ తనకు తగిలిన రెండవ గాయం – పెద్ద గాయమయిందని తెలియనివ్వలేదు.

యుద్ధం జరిగే సమయంలో చంద్రుడు ఉదయించాడు. ఎలాంటి చంద్రుడంటే, అతని వెలుగు కారణంగా సంస్కృత కవులు అతనికిచ్చిన 'క్షయీ' అనే పేరు సార్థకమయ్యే చంద్రుడు. బాణభట్టు భాషలోనైతే "దంత వీణోప దేశాచార్య"

అని చెప్పబడుతుంది. వజీరాసింగ్ తాను సూబేదార్ ని త్వరగా కలుసుకుని జరిగిన మోసం తెలియజేయటానికి ఎంత వేగంగా వెళ్లింది వర్ణించి చెపుతున్నాడు - ఫ్రాన్స్ నేలని తన బూట్లు ఎలా తొక్కేశాయో, ఆ మట్టి తన బూట్లకు ఎలా కరుచుకుపోయిందో మిత్రులకు వివరిస్తున్నాడు. లహనా సింగ్ ద్వారా జరిగిన సంగతంతా విని, అతను అందజేసిన కాగితాలు తీసుకుని సూబేదార్ హజారాసింగ్ అతను ప్రదర్శించిన సమయస్ఫూర్తికి మరీ మరీ ప్రశంసించాడు. కృతజ్ఞతతో "లహనా సింగ్! నువ్వు లేకపోతే ఈ రోజు మేమందరం చచ్చిపోయేవాళ్లం" అన్నాడు.

రాత్రి జరిగిన ఈ యుద్ధపు ధ్వనులు వీరికి మూడు మైళ్ల దూరంలో కుడివైపున ఉన్న కందకం వాళ్లు విన్నారు. వాళ్లు అధికారులకు టెలిఫోన్ చేసి తెలియపరిచారు. అక్కడి నుంచి వెంటనే డాక్టర్లు, క్షతగాత్రులను తీసుకువెళ్లే రెండు వాహనాలు బయలుదేరాయి. సుమారు గంటన్నర వ్యవధిలో ఘటనాస్థలికి చేరుకున్నాయి. ఫీల్డ్ హాస్పటల్ చేరువలోనే ఉంది. గాయపడిన వాళ్లని తెల్లవారే సరికి హాస్పటల్‌కి తీసుకువెళ్లే వీలుంది కాబట్టి మామూలు ప్రథమ చికిత్స చేసి, కట్టుకట్టి ఒక వాహనంలో క్షతగాత్రుల్ని, రెండవ దానిలో శవాల్ని ఎక్కించారు. లహనాసింగ్ తొడకి అయిన గాయానికి కట్టు కట్టించే ప్రయత్నం చేశాడు సూబేదార్ హజారాసింగ్. కాని అతను "చిన్న గాయమే ప్రొద్దున చూసుకోవచ్చు" అని దాటవేశాడు. బోధాసింగ్ జ్వరంలో ఏదో పలవరిస్తు న్నాడు. అతన్ని వాహనంలో పడుకోబెట్టారు. లహనా సింగ్‌ని విడిచి పెట్టి సూబేదార్ వెళ్లటం లేదు. లహనాసింగ్ "మీరు ఇప్పుడు వెళ్లకపోతే బోధామీద ఒట్టు. పదండి, ఈ వాహనం ఎక్కకపోతే మీ భార్యగారి మీద ఒట్టు" అన్నాడు.

"మరి నువ్వు?"

"మీరు ముందు హాస్పిటల్‌కి చేరుకున్నాక నా కోసం వాహనం పంపించండి. జర్మనీ సైనికుల కళేబరాల కోసం ఎలాగో బళ్లు వస్తూ ఉండొచ్చు. నా పరిస్థితి చెడ్డగా లేదు. చూస్తున్నారుగా, నేను నిలబడగలుగుతున్నాను! వజీరాసింగ్ నా దగ్గర ఉండనే ఉన్నాడు!"

"అది సరే, కాని..."

"బోధాసింగ్ వాహనంలో పడుకున్నాడు. దయచేసి మీరు కూడా బండి ఎక్కండి. ఒక్క మాట, మీ భార్యగారికి ఉత్తరం రాస్తే, నా నమస్కారాలు తెలియజెయ్యండి. ఇంటికి వెళ్లినప్పుడు ఆమెతో, ఆమె చెప్పింది నేను చేశానని చెప్పండి."





## బలివాడ కాంతారావు స్మారక కథల పోటీ

భారత నిధి ఫౌండేషన్ ఛారిటబుల్ ట్రస్ట్ సౌజన్యంతో విశాఖ రచయితల సంఘం, 'విశాఖ సంస్కృతి' మాసపత్రిక సంయుక్తంగా బలివాడ కాంతారావు స్మారక కథల పోటీ నిర్వహిస్తోంది. దీనితో పాటు ఒక విశిష్ట రచయితకు బలివాడ స్మారక పురస్కారం అందజేస్తారు. ఎంపిక చేసిన మూడు కథలకు ప్రథమ బహుమతిగా రూ.7,500/-, ద్వితీయ బహుమతిగా రూ.5000/-, తృతీయ బహుమతిగా రూ.2,500/- అందజేస్తారు.

రచయితలు అముద్రితమైన, అనువాదాలు, అనుకరణలు కాని తమ కథలను ఎ4 సైజు కాగితంపై చేతిరాతలో ఏడు పేజీలు, డి.టి.పిలో 5 పేజీలు మించకుండా ఈ పోటీకి పంపవచ్చు. కవరుపై బలివాడ కాంతారావు కథల పోటీకి అని రాసి ఇంటి నెం.43-21-21, వరుణ్ షోరూమ్ ఎదురుగా, వెంకటరాజు నగర్, దొండపర్తి జంక్షన్, విశాఖపట్నం - 530 016 చిరునామాకు మే 31 లోగా పంప వలసి ఉంటుంది. విశాఖపట్నంలో జూలై 3 వ తేదీన నిర్వహించే బలివాడ కాంతారావు జయంతి సభలో బహుమతి ప్రదానం జరుగుతుంది.

మిగిలిన వివరములకు సిరేల సన్యాసిరావు, ఎడిటర్, విశాఖ సంస్కృతి మాసపత్రిక, ఫోన్ నెం. 96030 76777 లో సంప్రదించగలరు.

వాహనాలు బయలుదేరాయి. వెళుతూ వెళుతూ సూబేదార్ లహనాసింగ్ చేతులు పట్టుకుని "నువ్వు నా ప్రాణాలు, మా బోధాసింగ్ ప్రాణాలు కాపాడావు. ఉత్తరం రాయటం ఏమిటి? మనం కలిసే వెళదాం. బోధావాళ్ల తల్లితో నువ్వే చెబుదువుగాని. అవును...ఆవిడ ఏం చెప్పింది?" అని అడిగాడు.

"ముందు మీరు త్వరగా వెళ్లాలి. నేను చెప్పిన విషయం ఉత్తరంలో రాయండి, చెప్పను కూడా చెప్పండి- మర్చిపోవద్దు!"

వాహనం వెళ్లిందో లేదో, లహనాసింగ్ నేల మీద పడుకుని పోయాడు. "వజీరా...దాహంగా ఉంది. మంచి నీళ్లు కావాలి. నా నడుముకు కట్టుకున్న కట్టు విప్పేసెయ్యి. రక్తంతో చెమ్మగిల్లిపోయింది"

## 5

మరణించటానికి కొద్ది సమయం ముందు జ్ఞాపకశక్తి చాలా స్పష్టంగా ఉంటుంది. జీవితాంతం జరిగిన సంఘటనలన్నీ ఒక్కటొక్కటే కళ్లముందు తారసపడతాయి. అన్ని దృశ్యాల రంగులు స్పష్టంగా గోచరిస్తాయి. కాలగమనం వల్ల ఏర్పడే మసకదనం వాటిపై నుంచి పూర్తిగా తొలిగిపోతుంది.

*

లహనాసింగ్‌కి అప్పుడు పన్నెండేళ్ల వయసు. అమృతసర్‌లో తన మామయ్య గారింటికి వెళ్లాడు. పెరుగు అమ్మేచోట, కూరగాయలు అమ్మే చోట...ప్రతిచోట అతనికి ఎనిమిదేళ్ల అమ్మాయి కలుస్తూ ఉంది. "నీకు వివాహం నిశ్చయం అయిందా?" అని లహనాసింగ్ అడిగినప్పుడల్లా ఆ అమ్మాయి "ఛీ" అని పరుగెత్తుతుంది...ఒక రోజు అలాగే అతనడిగిన ప్రశ్నకి ఆ అమ్మాయి... "ఆ...నిన్ననే అయింది. చూస్తున్నావుగా, ఈ ఎరుపు రంగు పట్టుదుస్తులు, ఈ చున్నీ!" అని సమాధానం చెప్పింది. ఆమాట వినటంతోటే లహ నా సింగ్‌కి బాధ కలిగింది. కోపం వచ్చింది, ఎందుకు...?

"వజీరాసింగ్, మంచి నీళ్లు తాగించవూ!"

పాతిక సంవత్సరాలు గడిచిపోయాయి. ఇప్పుడు లహనాసింగ్ 77 రైఫిల్స్ పటాలంలో జమాదార్ అయ్యాడు. ఆ ఎనిమిదేళ్ల అమ్మాయి అసలు జ్ఞాపకమే లేదు. ఎప్పుడైనా తారసపడిందో లేదో - స్ఫురణలో లేదు. వారంరోజులు సెలవు పెట్టి లహనాసింగ్ సొంత ఊరు వెళ్లాడు. భూమికి సంబంధించిన కేసు విచారణ నిమిత్తం ఇంటికి రావాల్సివచ్చింది. సెలవులో ఉండగానే రెజిమెంట్ ఆఫీసర్ నుంచి ఉత్తరం వచ్చింది- "సైన్యం యుద్ధానికి వెళుతుంది, వెను వెంటనే వెనక్కి తిరిగి వచ్చెయ్యాలి...!" దానితోపాటే సూబేదార్ హజారాసింగ్ రాసిన ఉత్తరం కూడా అందింది. "నేను, బోధాసింగ్ కూడా యుద్ధానికి వెళుతున్నాం. నువ్వు తిరుగు ప్రయాణంలో మా ఊరు వచ్చెయ్యి. మనం కలిసి వెళదాం..." సూబేదార్‌గారి ఊరు దారిలోనే. అందునా సూబేదార్‌కి లహనాసింగ్ అంటే ఎంతో అభిమానం. లహనాసింగ్ సూబేదార్ గారి ఇంటికి చేరుకున్నాడు.

ప్రయాణమయ్యి బయలుదేరేటప్పుడు సూబేదార్‌గారు ఇంటోనుంచి బయటికి వచ్చి "లహనా! నా భార్యకి నువ్వు తెలుసునంట! నీతో మాట్లాడతానని అంటున్నది. ఒకసారి మాట్లాడిరా, వెళ్లు లోపలికి వెళ్లు" అన్నారు. లహనాసింగ్ లోనికి వెళ్లాడు. సూబేదార్ గారి భార్యకి నేను తెలుసా? ఎలా తెలుసు? ఎప్పట్నించి తెలుసు? రెజిమెంట్ క్వార్టర్స్‌లో అయితే సూబేదార్ గారి కుటుంబం ఎప్పుడూ ఉన్నదే లేదు... అనేక ప్రశ్నలు... సందేహాలు మనసులో మెదులుతూ ఉండగానే గుమ్మం దగ్గరికివెళ్లి "నమస్కారం" అన్నాడు. ప్రతి నమస్కారం అందుకున్నాడు. లహనాసింగ్ మౌనంగా ఉన్నాడు.

"నన్ను గుర్తు పట్టావా?"

"లేదు"

"నీకు వివాహం నిశ్చయం అయిందా? ఛీ...నిన్ననే అయింది... చూస్తున్నావుగా...ఈ ఎరువు రంగు పట్టుదుస్తులు, ఈ చున్నీ...! అమృతసర్‌లో..."

భావోద్వేగం హెచ్చవ్వటం వల్లనేమో స్పృహ వచ్చింది. ప్రక్కకి ఒత్తిగిల్లాడు. ప్రక్కటెముకల్లోని గాయం నుంచి రక్తం ప్రవహించింది.

"వజీరా, మంచినీళ్లు... ఆమె చెప్పింది"

*

కల కొనసాగుతుంది. సూబేదార్ గారి భార్య అంటున్నది..."నువ్వు రాగానే నేను నిన్ను గుర్తు పట్టాను. ఒక్క విషయం చెపుతాను. నా తలరాత తిరగబడింది. ఇప్పటివరకు నాకు ఏ లోటు లేదు. ప్రభుత్వం నా భర్త వీరత్వానికి బిరుదు ఇచ్చింది, లాయల్‌పూర్‌లో భూమికూడా ఇచ్చింది. ఇప్పుడు వీటన్నింటికీ కృతజ్ఞత చెల్లించుకునే అవకాశం వచ్చింది. అసలు ప్రభుత్వం మా స్త్రీలతో ఒక పటాలం ఎందుకు ఏర్పరచలేదు? అలా చేసి ఉంటే నా భర్తతో పాటు నేను కూడా యుద్ధానికి వెళ్లిపోయేదాన్ని. ఒక్కగానొక్క కొడుకు... సైన్యంలో చేరి ఒక్క సంవత్సరమే అయింది. ఇతని తర్వాత నలుగురు పుట్టారు, కాని ఒక్కరు కూడా బ్రతకలేదు" ఆమె కంట తడిపెట్టి ఏడ్వసాగింది. "ఇప్పుడు ఇద్దరూ యుద్ధానికి వెళుతున్నారు. నా నుదిటి రాత? నీకు జ్ఞాపకముందా, ఒకరోజున జట్కావాని గుర్రం పెరుగు దుకాణం వద్ద అదుపు తప్పి అలజడి సృష్టించింది. ఆ రోజు నువ్వు నా ప్రాణాలు కాపాడావు. నువ్వు గుర్రం కాళ్లక్రింద చిక్కుకుని నన్ను లేవనెత్తి దుకాణపు గట్టుపై నిలబెట్టావు. అలాగే వీళ్లిద్దరినీ కాపాడు, నేను పవిట చాచి నిన్ను అర్థిస్తున్నాను. నిన్ను యాచిస్తున్నాను"

ఏడుస్తూ ఏడుస్తూ సూబేదార్‌గారి భార్య లోపలికి వెళ్లిపోయింది. లహనా సింగ్ కూడా కళ్లు తుడుచుకుంటూ బయటికి వచ్చాడు.

"వజీరాసింగ్! మంచినీళ్లు...ఆమె చెప్పింది"

లహనాసింగ్ తల తన ఒళ్లో పెట్టుకుని కూర్చున్నాడు వజీరా సింగ్. అడిగినప్పుడల్లా మంచినీళ్లు త్రాగిస్తున్నాడు. అర్థగంటవరకు లహనాసింగ్ మౌనంగా ఉండిపోయాడు. ఆ తర్వాత "ఎవరు? కీరత్‌సింగ్?"

వజీరాసింగ్‌కి ఏదో అర్థమయ్యి "అవును నేనే" అన్నాడు.

"తమ్ముడూ! నన్ను కొద్దిగా లేపు. నీ తొడపైన నా తలపెట్టుకో"

వజీరాసింగ్ అలాగే చేశాడు.

"ఆ, ఇప్పుడు ఇలా బాగుంది. మంచినీళ్లు త్రాగించు...ఆ...చాలు...ఈ విడత ఈ మామిడిచెట్టు బాగా కాస్తుంది. నువ్వు, మా అబ్బాయి ఇక్కడే కూర్చుని మామిడి పళ్లు తినాలి. మా అబ్బాయికి ఎంత వయసో, ఈ చెట్టు వయసు అంతే. వాడు పుట్టిన నెలలోనే నేను ఈ మొక్క నాటాను"

వజీరాసింగ్ కన్నీళ్లు...టపటప రాలుతున్నాయి.

*

కొద్దిరోజుల తర్వాత వార్తాపత్రికల్లో వార్త వెలువడింది...

"ఫ్రాన్స్...బెల్జియం...68వ జాబితా... యుద్ధభూమిలో క్షతగాత్రులై మరణించిన వారు... 77 సిక్కు రైఫిల్స్‌లో జమాదార్ లహనాసింగ్..."

# వాళ్లు...




చీకటి రేకులు చుట్టుకొని
తెల్లని పొగమంచు తెరల మధ్య
పోడుపై రెండు పూలై విచ్చుకుంటారు వాళ్లు
ఆకలి కావ్యానికి
పోడు పుటలపై వాక్యాల్ని లిఖించడానికి
కంకాల కలాల్లో చినుకుల సిరా నింపుకుంటూ వాళ్లు
అలసటని చెట్టుకొమ్మకి వేలాడదీసి
ఒకరు పిల్లకర్రై
ఇంకొకరు పాటై కొండను పరవశింపజేస్తారు వాళ్లు
అతని మాటల చెలమల్లో ఆమె
ఆమె నవ్వుల వానలో అతడు
సేదదీరిన తీపుకు కొండ మురిసి పోతుంది
స్వేదం పాయలైన లోయల నిండా
కందిపూలు నవ్వుతుంటాయి
వీపుల బండలపై సూర్యుణ్ణి మోసీ మోసీ
సాయంత్రానికి సాగనంపి
పంటను కలగంటూ ఆకుపచ్చగా వాళ్లే
ఆకులు రాలి మోడైపోయిన
అడవి లాంటి ఆమె చేతుల రెమ్మలకి
సంతలో మట్టి గాజులు తొడిగి
నవ్వుల చిగురులు మొలిపిస్తాడతడు
అరటి గెలై కొండ దిగి సంతంతా తిరిగి తిరిగీ
అలసటై అసహనమై
షావుకారి చవకబేరాల దారాలకు చిక్కుబడి
ఆమె కోసం రంగుల చీరవుతాడు
జీలుగు కొమ్మల్లోంచి
మత్తుగా జారుతూ
థింసా అడుగులకు డప్పుదరువవుతాడు

* * *

సంబరాలు చల్లబడతాయి
అటకలోని గింజలూ చెల్లిపోతాయి
దేహానికి పడ్డ గాయాలు
పోడు పోరుకు సాక్ష్యాలుగా మిగిలిపోతాయి
తొలకరి తొలిచినుకుల మట్టి పరిమళం
లేపనమై గత గాయాల్ని మరిపిస్తుంది
వర్తమానం విచ్చుకుంటున్న మట్టి పువ్వవుతుంది.

తిమ్మక రాంప్రసాద్

77023 40742

# సమత

దేవదేవు దృష్టిలోన
యేవైనా ఒకటేలే
భరతమాత పుత్రులమౌ
మనమంతా ఒకటేలే...

వన్నెలు చిన్నెలు కురిసే
తోటగులాబీలైనా
నెత్తావుల విరజిమ్మే
కొండమల్లెపూలైనా

యేవైనా యేవైనా
యేవైనా ఒకటేలే
దేవదేవు దృష్టిలోన
యేవైనా ఒకటేలే...

కులమతాల వ్యత్యాసం
కుహనా వర్గ ద్వేషం
మనిషి యెదను మొలకెత్తిన
మాత్సర్యపు కావేశం

ఈ వాదం ఈ భేదం
ఈ ధరకిదె నొక ఖేదం
వలదు వలదు విద్వేషం
వలయు ప్రేమ సందేశం...

దేవదేవు దృష్టిలోన
యేవైనా ఒకటేలే
భరతమాత పుత్రులమౌ
మనమంతా ఒకటేలే...




శ్రీహస్త

94940 51021

# జలం జీవామృతం

'జలం' జీవులకు జీవాన్నిస్తుంది కాబట్టి దానిని జీవామృతం అంటారు. జీవాన్ని ఇవ్వటమే కాదు జీవుల పుట్టుకకు, వాటి మనుగడకు కూడా అదే కారణం. భారతీయ వాఙ్మయ చరిత్ర ఆధారంగా తొలుత అగ్నినుండి నీరు, నీటి నుండి భూమి ఉద్భవించినట్లుగా తెలుస్తుంది. భూమి మాత్రమే కాదు జీవరాశి కూడా నీటి వల్లనే ఉద్భవించింది. అందుకే మన పూర్వీకులు "చరాచర జగద్బీజం జలమేవ న సంశయ్ఞ, కిం పునర్బహునోక్తేన జలాధిక్యం పదామ్యహమ్" అంటూ చరాచర జగత్తునకు కారణం నీరే అనడంలో సందేహం లేదు, పలు మాటలెందుకు? నీరే గొప్పదని తెలిపారు.

మానవ విజ్ఞానం విస్తరించినంతవరకు ఈ అనంతవిశ్వంలో ఏ ఇతర గ్రహం మీద కూడా జీవరాశి గాని, దాని పుట్టుకకు కారణమైన జలరాశిగాని వున్న దాఖలా కనిపించటం లేదు. అందుకే "అన్ని గ్రహములకన్న అవని మిన్న, ఎంచి చూసి మీరు ఏమి ఘనమటన్న, నారములగన్న నీరముండుటేనన్న, ఒలుకు తేనెల ఊట వరప్రసాదరావు మాట" అని నేను నా 'జలగీతిక' పుస్తకంలో తొలి పద్యంగా వ్రాశాను.




ఎ.వరప్రసాదరావు




పుడమి మీద ప్రాణికోటి పుట్టుకకు కారణమైన ఈ జలం పరమాత్మ మనకు ప్రసాదించిన ఓ ప్రవహించే వరం. ఈ ప్రవహించే వరం అంత సులభంగా దివి నుండి భువికి దిగి రాలేదు. పూర్వం ప్రాణులంటే గిట్టని వృతుడనే దుష్టుడు తన దుర్బుద్ధితో నీటితోపాటు సమస్తాన్ని కట్టిపడేస్తే, ఇంద్రుడు కలుగజేసుకుని ముందుగా నీటికి బంధవిమోచనం కలిగించాడని వేదోక్తి. సుదీర్ఘమైన తపశ్శక్తితో తన ముత్తాతల ముక్తికి సురగంగను దివి నుండి భువికి రప్పించిన భగీరథుని ఇతివృత్తం మనందరికీ తెలిసిందే.

అటువంటి ఈ జలం భూగోళం మీద మూడొంతుల మేర విస్తరించివుంది. మన శరీరంలో కూడా సగానికి పైగా నీరే వుండి మనకు ఒక ఆకారాన్ని, ఆకృతిని ఇస్తుంది. ఆరోగ్యాన్ని, ఆర్థిక పరిపుష్టిని ఇచ్చేది కూడా ఈ నీరే. అందుకే ఆదికాలం నుండి నీరున్నచోటే తీరైన జీవనం కొనసాగి, అక్కడే నాగరికతకు పునాదులు పడ్డాయి.

చరిత్ర చూసినట్లయితే ప్రాచీన నాగరికతలన్నీ నదుల ఒడ్డునే పరిఢవిల్లాయి. ఉదాహరణకు మన దేశంలోని వేదనాగరికత సరస్వతీనదీ ఒడ్డున, ఈజిప్టు నాగరికత నైలునది తీరాన, బాబిలోనియా, గ్రీకు నాగరికతలు యూఫ్రటీస్, టైగ్రిస్ నదులను ఆధారం చేసుకునే మనుగడ సాగించాయి.

అందుకే మానవుడు తన జీవనానికి ఆలంబన, ఆధారము అయిన నదీమ తల్లులను, ఇతర నీటివనరులను ప్రకృతి దేవతలుగా ఆరాధిస్తూ, వాటి చుట్టూ కథలు, కావ్యాలు అల్లుకున్నాడు. గంగమ్మ, కృష్ణమ్మ, గోదారమ్మ అంటూ వాటిని జలదేవతలుగా భావించి శిల్పాలుగా, చిత్రాలుగా, నృత్య రూపకాలుగా మార్చుకున్నాడు. పుష్కరాల పేరిట మనం ఒక్కో సంవత్సరం ఒక్కో నదిని ఆరాధించుకోవటం అందులో భాగమేనని చెప్పుకోవచ్చు.

***గంగాధరో హరస్సోపి విష్ణురంభోధి మందిర్ణ, బ్రహ్మోజలజ సంభూత్ణ తస్మాత్ సర్వాధికం జలం*** అని ఓ కవి పేర్కొన్నట్లు మనం త్రిమూర్తులుగా ఆరాధించుకునే సృష్టి స్థితి లయకారులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడా నీటినే ఆశ్రయించుకుని వున్నారు. నీటిలో పుట్టిన కమలంలోనే బ్రహ్మ జన్మించాడు, విష్ణువు నీటిలోనే కాపురం పెట్టాడు. ఇక శివుడు గంగను సదా నెత్తిన బెట్టుకునే తిరుగుతుంటాడు. ఇలా దేవుని పేరుతో నీటి యొక్క ప్రాధాన్యతను పూర్వీకులు మనకు తెలియపరిచారు.

మానవుడి మనుగడకు ఇంతగా కారణమైన ఈ జలసంపద మన భూమ్మీద ఎంత ఉంది, అదంతా మనకు ఉపయోగకరమేనా అని చూస్తే... భూమ్మీద మూడొంతులు నీరున్నా అది మన నిత్యావసరాలకు ప్రత్యక్షంగా ఉపయోగపడటం లేదు. కారణం అది సముద్రాల్లో ఉప్పునీరుగా వుండటమే. మరి మనకు ఉపయోగపడే మంచినీరు ఎంత వుంది, అది ఎక్కడనుండి వస్తుంది తెలుసుకోవాలంటే ముందు మనం జలచక్రాన్ని గురించి తెలుసుకోవాలి.

అపార జలరాశి పోగుపడి వున్న సముద్రాల నుండి సూర్యుని వేడికి నీరు ఆవిరిరూపంలో ఆకాశానికి వెళ్ళి మేఘాలుగా మారి వాతావరణం చల్లబడినపుడు తిరిగి వర్షం రూపేణా భూమిమీదకు వానచినుకులై రాలి వాగులై, వంకలై, ఏరులై, సెలయేరులై, ఝరులై, ఉపనదులై, నదులై, మహా



నదులై చివరకు సముద్రాన్ని చేరుతుంది. ఇలా సింధువు నుండి బిందువుగా మారి తిరిగి సింధువును చేరే ఈ ప్రక్రియనే 'జల చక్రం' అంటారు.

ఈ జలచక్రంలో భాగంగా మన నేలపైకి రాలే వానచినుకులే మనకు మంచినీటి రూపేణా భూమ్మీద నదులలో, సరస్సులలో అలాగే నేలపొరల్లో భూగర్భజలంగా అందుబాటులో వుండి, మన అవసరాలు తీరుస్తుంది. అందుకే **వానగురియుటచేత వర్మిలు జగతి–కాన అమృతమగుగాదె వర్షమ్ము** అని ప్రముఖ తమిళకవి తిరువళ్ళువర్ తన తిరుక్కురల్ వర్షం మహిమను తెలుపుతాడు. **వాడిపోయిన పైరులైన నీరుగని నర్తింతునే...**అని ఓ తెలుగు సినీకవి పేర్కొన్నాడు.

కాలచక్రంలో కరిగిపోయిన ఎన్నో నాగరికతలకు, వాటి ఉత్థాన పతనాలకు ఈ జలమే కారణం. అలా వానచినుకులుగా రాలిన నీటిబిందువులు మనకు ఆత్మబంధువులై మన అవసరాలన్నీ తీరుస్తున్నాయి. మానవుడు ఓ వ్యక్తిగా వికాసం పొందాలంటే 'జ్ఞానం' అవసరమేమో కానీ, ఓ జాతిగా వికాసం పొందాలంటే మాత్రం 'జలం' మూలాధారం. అంటే వ్యక్తివికాసం 'జ్ఞానం' మీద, జాతివికాసం 'జలం' మీద ఆధారపడి వుంటుంది.

ఓ జాతి వికాసానికి, ఆ జాతి సౌభాగ్యానికి ఇంతగా కారణమవుతున్న మంచినీరు మనకు చాలా కొద్దిగానే వుంటుంది. భూమిమీద వున్న నీటి మొత్తాన్ని నేలమీద సమానంగా పరిచినట్లయితే ఎక్కడ చూసినా నేలంతా 3

కిలోమీటర్ల లోతు నీరుంటుంది. ఈ మొత్తం నీటిపరిమాణాన్ని లెక్కిస్తే అది సుమారు 140 కోట్ల ఘన కిలోమీటర్లు వుంటుందని అంచనా. కానీ ఈ నీటిలో 136.2 కోట్ల ఘ.కి.మీ. (97.3శాతం) ఉప్పునీటి రూపంలో సముద్రం లో వుండి మనకు ప్రత్యక్షంగా ఉపయోగపడటం లేదు. మిగిలిన 3.8 కోట్ల ఘ.కి.మీ.లో 2.9 కోట్ల ఘ.కి.మీ. ధృవప్రాంతాల్లో మంచురూపంలో గడ్డకట్టు కుపోయి అది కూడా మనకు నేరుగా ఉపయోగపడటం లేదు. మిగిలినదానిలో 0.85 కోట్ల ఘ.కి.మీ. నేలపొరల్లో భూగర్భజలంగాను, 0.05 కోట్ల ఘ.కి.మీ. భూమిపైన నదులు, సరస్సుల రూపేణా అందుబాటులో వుంటుంది. మొత్తమ్మీద భూమిపైన, భూమిలోపల వున్న 0.90 కోట్ల ఘ.కి.మీ.లో మన ఉపయోగార్థం అందుబాటులో వున్న నీరు అందులో సగమే. అంటే కేవలం 0.43 కోట్ల ఘ.కి.మీ. మాత్రమే. ఇది మొత్తం భూమ్మీద వున్న జలరాశితో పోల్చినపుడు కేవలం 0.3 శాతం మాత్రమే. ఇది కూడా భూమ్మీద అన్నిచోట్లా సమానంగా పరచుకొనిలేదు. ఈ కొద్దిపాటి నీటిని ఏ జాతి సక్రమంగా వినియోగించుకుంటే ఆ జాతి పురోగమించగలుగుతుంది.

ఏ జీవికైనా ఆకలిదప్పులు సహజం. జీవులు పుట్టాక అవి బ్రతికి బట్టగట్టాలంటే గాలి, ఆ తరువాత నీరే అత్యవసరం. ఆహారం కూడా ఆ తరువాతే. ఆహారం లేకుండా కొద్ది రోజులు వుండవచ్చునేమో గాని, నీరు లేకుండా కొన్ని గంటలు కూడా ఉండలేవు. మానవులమైన మనం కూడా దానికతీతులమేమీ కాదు. మనం ఆకలినైనా అణచుకోగలుగుతాము కానీ దాహాన్ని లేదా దప్పికను అణచుకోలేం. ప్రయాణాల్లో ఎంత ఆకలి వేసినా తోటివారిని అన్నం పెట్టమని అడగలేం కానీ దాహం వేసినప్పుడు గొంతెండిపోతోంది కొంచెం నీళ్ళివ్వండి...గొంతు తడుపుకుంటాం అంటూ నీళ్ళు అడుగుతాం. దాహం ఎంతటివారినైనా చేయిచాచేలా చేస్తుంది. అదే దాహం ప్రభావం. ఇంతెందుకు భారత ఇతిహాసాలైన రామాయణ, భారత, భాగవతాలు ఓ అనూహ్యమైన మలుపు తిరగటానికి కూడా ఈ దాహమే కారణమైందంటే మీరు నమ్ముతారా? కానీ అది నిజం. అదేంటో తెలుసు కుందాం.

తల్లిదండ్రుల దాహం తీర్చడానికి ఏటిలో కడవ ముంచుతున్న శ్రావణ కుమారుని ఏదో జంతువు నీరు త్రాగుతూ గుడగుడమని శబ్దం చేస్తుందని భావించి, దశరథుడు తన శబ్దభేది విద్య సాయంతో బాణం వదిలి, ఆ బాలుని మరణానికి కారణమై.... 'నీవును పుత్రశోకముతో మరణింతువు గాక!' అన్న ఆతని తల్లిదండ్రుల శాపానికి గురికావటం, పుత్ర సంతానం లేని దశరథుడికి రాముడు జన్మించి, అదే రామాయణానికి మూలమైంది.

అరణ్యవాస సమయంలో కొలనులో దప్పిక తీర్చుకోడానికి వెళ్ళి యక్షుని ధిక్కరించి, మరణించిన తన సోదరులను బ్రతికించుకునే క్రమంలో యక్షప్రశ్నలకు సమాధానం చెప్పి, ముందుగా నకులుడిని బ్రతికించమంటూ యుధిష్ఠరుడు ప్రదర్శించిన ధర్మదృష్టికి మెచ్చి, యక్షుడు నలుగురినీ బ్రతికించటం మహాభారతం ముందుకు నడవటానికి కారణమైంది.

పరీక్షిత్తు మహారాజు వేటలో అలసిపోయి శమీక మహర్షి ఆశ్రమానికి వెళ్లి దాహం తీర్చమని కోరగా తపోదీక్షలో వున్న మహర్షి పట్టించుకోకపోవటం, ఆగ్రహంతో మహారాజు ఆయన మెడలో చచ్చిన పాముని వేయటంతో ఆ మహర్షి కుమారుడు మహారాజును 'వారం రోజుల్లో మరణింతువుగాక!' అని శపిస్తాడు. ఆ శాప ఫలితమే చివరకు శుకుని మహాభాగవత బోధకు కారణ మైంది. ఆ విధంగా మంచినీటి దాహం మన ఇతిహాసాలను ఓ మలుపు తిప్పిందనడంలో అతిశయోక్తి లేదు. అదే నీటి మహిమ.

ఇంతటి మహత్తు కలిగిన నీరు ప్రతీ ఏటా సుమారు 4000 ఘ.కి.మీ. వర్షం రూపేణా మన భరతభూమికి చేరుతుంది. అందులో సుమారు 1670 ఘ.కి.మీ. ఆవిరి రూపేణా తిరిగి వాతావరణంలో కలిసిపోగా, 1880 ఘ.కి.మీ. ప్రవాహరూపేణా వాగుల్లోకి, నదుల్లోకి చేరుతుంది. సుమారు 450 ఘ.కి.మీ. నేలలోకి ఇంకి భూగర్భజలంగా మారుతుంది. దీన్నిబట్టి అర్థమవుతుందేమిటంటే మనకవసరమైన మంచినీరు కేవలం వర్షం రూపేణానే మనకు అందు బాటులోకి వస్తుంది. అయితే సంవత్సరంలో 4 మాసాలు మాత్రమే వున్న వానాకాలంలో 90 శాతం వాననీరంతా కేవలం 60 రోజులలోపు ఇంకా సూక్ష్మంగా చెప్పాలంటే 100 గంటల్లోనే భూమిని చేరుతుంది. ఆ కొద్దిపాటి కాలంలో చేరిన నీటినే మనం సంవత్సరమంతా వాడుకోవాల్సి వుంటుంది. లేకపోతే అది ఏరులు, నదుల రూపేణా సముద్రంపాలు అవుతుంది. అందుకని ప్రవాహరూపేణా పల్లానికి ప్రవహించే నీటిని డ్యాములు, ఆనకట్టలు కట్టుకుని నిలవబెట్టుకోవాలి. దీనికి తగిన స్థలం దొరకటం, పర్యావరణ అనుమతులు, పునరావాసం, సాంకేతిక, ఆర్థిక తదితర ప్రతిబంధకాలు ఎన్నో వుంటాయి. వీటిని అధిగమించి ఇప్పటివరకూ మనం ఏర్పాటుచేసుకున్న జలాశయాలలో సుమారు 690 ఘ.కి.మీ. నిలువ చేసుకోవచ్చు.

సంపన్నదేశాల తలసరి నీటినిల్వ సామర్థ్యంతో పోల్చినపుడు అమెరికాలో అది 5961 ఘ.మీ., ఆస్ట్రేలియా 4717 ఘ.మీ., బ్రెజిల్ 3988 ఘ.మీ., చైనా 1486 ఘ.మీ., భారతదేశం యొక్క తలసరి నీటినిల్వ సామర్థ్యం కేవలం 200 ఘ.మీటర్లే. మరోప్రక్క దేశంలో జనాభా ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోతూవుంది. ఈ జనాభాకి అవసరమైన ఆహారపంటలు పండించాలంటే సుమారు నేల, నీరు చాలా కీలకం.

1950వ దశకం తొలినాళ్లలో తలసరి భూ లభ్యత 1.32 ఎకరాలు వుండగా నేడు అది 0.39 ఎకరాలకు తగ్గిపోయింది. అలాగే తలసరి నీటిలభ్యత ఈ కాలంలో 5177 ఘ.మీ. నుండి 1545 ఘ.మీటర్లకు తగ్గి పోయింది. అంటే వాస్తవానికి 60 సంవత్సరాల క్రితం ఎంత నేల, నీరు వుండేదో ఇప్పుడూ అంతేవుంది కానీ దాని మీద ఆధారపడిన జనాభా పెర గటం వలన ఈ పరిస్థితి ఏర్పడింది. ప్రస్తుతం 121 కోట్లున్న భారత జనాభా 2050 నాటికి 164 కోట్లకు చేరవచ్చని అంచనా. ఆ మేరకు తలసరి నేల, నీటి లభ్యత మరింత తరిగిపోతుంది. కాబట్టి వున్న నీటినే మనం సక్రమంగా, సమర్థవంతంగా వాడుకున్నప్పుడే అంతమంది జనాభాకు సరిపడ ఆహారాన్ని ఉత్పత్తిచేయగలిగే అవకాశం వుంటుంది.

అయితే మనలో చాలామంది ఈ విషయాన్ని గ్రహించకపోవటం వలన నీరంటే అది మనకు ఉచితంగా దొరికేదనని, ఎలా వాడుకున్నా, ఎంత వాడుకున్నా వచ్చే ముప్పేమీ లేదనే భావిస్తూ వుంటారు. దాంతో మనం ఎంతోనీటిని వృథా చేస్తుంటాం, దుర్వినియోగం చేస్తుంటాం, అవసరాన్ని మించి వాడుతుంటాం. కొందరు రైతులైతే పంటకు ఎంత ఎక్కువ నీరు పెడితే అంత దిగుబడి వస్తుందని భావించి అవసరాన్ని మించి పంటలకు నీరు పెడుతుంటారు. ఇలా జాతీయ సంపదైన జలం అనేక విధాలుగా వృథా కాబడుతోంది.

పోనీ శాస్త్రసాంకేతికంగా మానవుడు బాగా పురోగమించాడు కదా అని పెరిగే జనాభాకు తగినట్లుగా నూతన సాంకేతికతను జోడించి నీటిని ఉత్పత్తి చేద్దామా అంటే చేయలేం. మంది ఎక్కువైనప్పుడు మజ్జిగ పలుచగ చేసి వాడుకున్నట్లు వాడుకుందామా అంటే అలా కూడా కుదరని పదార్థ మైపోయె. ఏదో ఒకటి చేసి వానచినుకును నేలకు రప్పించుదామా అంటే

అణువును ఛేదించటం సాధ్యం చేసుకున్నాడు కానీ చినుకును సృష్టించటం మానవుడికి సాధ్యం కావటం లేదు. కాబట్టి ప్రకృతి కరుణించి, ప్రసాదించిన ఆ కొద్దిపాటి 'జలప్రసాదాన్నే' అతి జాగ్రత్తగా వాడుకోవాలి.

కానీ నేటి ఆధునికకాలంలో మానవుడు మన పూర్వీకులు పాటించిన నీటిపొదుపు సూత్రాలను మర్చిపోవటమే కాకుండా, నీటిని ప్రత్యక్షంగా వృధా చేయటం అంతేగాకుండా అతను అలవర్చుకున్న వాడిపడేసే వినిమయ సంస్కృతి వలన ప్రతిదీ దుబారా చేయటానికి అలవాటుపడ్డాడు. ఆఖరికి పరబ్రహ్మ స్వరూపమైన ఆహారాన్ని కూడా ఎంతో వృధా చేయటం నేడు మనం కళ్ళారా చూస్తున్నాం. మనం తినే ఆహారం, వాడే వస్తువులు ఉత్పత్తి చేయటానికి ఎంత నీరు వినియోగించబడుతుందో నిపుణులు వేసిన అంచనాలు తెలుసుకుంటే మనం ఎంత నీరు వృధా చేస్తున్నామో తెలుస్తుంది.

మనం తినే బియ్యం ఒక కేజీ ఉత్పత్తి చేయటానికి సుమారు 3,400 లీ. నీరు ఖర్చవుతుంది. మాంసాహారం బలమంటూ ఎంతో ఇష్టంగా తినే ఓ కేజీ కోడిమాంసం తయారీకి సుమారు 3,900 లీ., మేకమాంసానికి 4,100 లీ. వినియోగించబడుతుంది. ఇంతెందుకు ఉదయం నిద్రలేవగానే మనం త్రాగే ఓ కప్పు కాఫీ తయారవ్వాలంటే 140 లీటర్ల నీరు, అదే ఓ కప్పు టీ కయితే 30 లీ., ఓ గ్లాసు పాలకైతే 125 లీ. ఖర్చయితే కానీ మనకు అవి వేడివేడిగా మన నోటి ముందుకు రావు. ఉపాహారంగా తీసుకునే ఓ బ్రెడ్ ముక్క తయారవ్వాలంటే సుమారు 40 లీ. ఖర్చవ్వాల్సిందే. అలాగే ఓ కోడిగ్రుడ్డు ఉత్పత్తికి దాదాపు 200 లీ. ఖర్చవుతుంది. భోజనం తర్వాత తీసుకునే ఒక అరటిపండు పండించాలంటే సుమారు 100 లీ, ఒక యాపిల్‌కి 70 లీ, ఒక కమలాకి 50 లీ. ఖర్చవుతుంది. వేసవితాపం ఉపశమనానికి మనం సేవించే కొబ్బరిబోండాం ఒకటి తయారవ్వాలంటే సుమారు 2500 లీ. వినియోగించబడాల్సిందే. కాలక్షేపానికి తినే ఓ మొక్కజొన్నకండె పండించాలంటే సుమారు 125 లీ.ఖర్చు కావాల్సిందే.

మనం వాడే ఒక టీషర్టు తయారవ్వాలంటే సుమారు 2700 లీ. మన జీవితంలో ఒక భాగమైన కంప్యూటర్ లేదా సెల్‌ఫోన్‌లో వినియోగించే చిప్‌ను తయారుచేయటానికి సుమారు 2000 లీ. పైగా వినియోగించబడుతుంది. అలాగే మన కార్యాలయాల్లో వాడే ఎ4 సైజు తెల్లకాగితం ఒక్కటి తయారవటానికి సుమారు 10 లీ. నీరు వినియోగించబడుతుంది. ఈ ప్రకారం చూస్తే ప్రతీ ఆహారపదార్థం, వినియోగించే వస్తువు తయారీ వెనుక సుమారు ఎంత నీరు వినియోగించబడితే అవి మన ముందుకు వస్తున్నాయో తెలుసుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది కదూ. అందుకే పూర్వీకులు ***అపోవా ఇదం సర్వం (సర్వమూ జలమే), విశ్వభూతాన్ అపా (విశ్వము, సకల ప్రాణికోటి జలమయమే), ప్రణవ అపా (జలమే ఓంకారం), అన్నం అపా (జలమే జీవం), అమృతం అపా (జలమే అమృతం), సామ్రాట్ అపా (జలమే సర్వాధిపతి)*** అని చెప్పారు.

ప్రకృతి ప్రసాదితమైన ప్రవహించే ఈ జలసిరిని ప్రజలు వినియోగించుకునేదానికంటే వృధా చేసేదే ఎక్కువ. ప్రవాహాల రూపేణా సముద్రానికి చేరిపోయే నదీజలాలను నిలువజేసుకోవటం, చెరువులు, సరస్సులలో నిల్వవుండే నీటిని సక్రమంగా వినియోగించుకోవటం, ఎక్కడ కురిసే వర్షాన్ని అక్కడే భూమిలోకి ఇంకేలా చేసి భూగర్భంలో నీటిని దాచుకోవటం, వాడటంలో అనేక విధాలుగా జరుగుతున్న నీటివృధాని అరికట్టటం మనముందున్న కర్తవ్యం. జీవాన్ని కాపాడేది జలం-జలాన్ని కాపాడేది మనం అని గ్రహించి ప్రభుత్వం, ప్రజలు కలిసి ముందుకునడిచినపుడే ఇది సాధ్యమవుతుంది.

అందుకు ప్రభుత్వ పరంగా కొండలపైనుండి కిందికి జారే వాననీటిని ఒడిసిపట్టుకోటానికి వాటర్‌షెడ్ పథకాలు అమలుచేస్తూ, వాగులు, వంకలపై ఎక్కడికక్కడ మట్టికట్టలు, రాతికట్టలు, జీవగట్లు ఏర్పాటుచేయాలి. అవకాశం వున్నచోటల్లా నీటివేగాన్ని నిరోధించే వృక్షాల్ని పెంచాలి. వాగుల్లో కూడా నీరు ఇంకేలాగా మధ్య మధ్యలో ఇంకుడుగుంతలు తవ్వాలి. వాగు ఉరవడి పెరిగినచోట చెక్‌డ్యాంలు నిర్మించాలి. అనుకూలమైన భూమి లభించినచోట ఊటచెరువులు నిర్మించాలి.

అలాగే గ్రామ ఆర్థికవ్యవస్థలో కీలకపాత్ర వహించే చెరువులను బాగు చేయాలి. మా ఊర్లోనూ ఓ చెరువు వుంది అనుకుంటాం కానీ నిజానికి చెరువు ఒడ్డునే ఊరు వుంది అని తెలుసుకోవాలి. మన పల్లెసీమల సౌభాగ్యమంతా ఈ చెరువులమీదే ఆధారపడి వుందని మన పెద్దలు గ్రహించారు కాబట్టే చెరువు ఒడ్డున గంగమ్మ పేరిట గుడులు కట్టుకుని ప్రతి ఏడాదీ చెరువు పూడిక తీసుకుంటూ ఊరూరా గంగమ్మ జాతరలు జరుపుకుంటూ చెరువు ప్రాధాన్యత ప్రజలకు తెలియజెప్పిన సంస్కృతి మనది. ***చరాచర జగద్రక్షా యత్తటాకాంబు నా భువి, తస్య పుణ్యఫలం వక్తుమశక్త కమలాసన్న*** అంటూ చరాచర లోకాన్ని రక్షించేది చెరువు నీరే కాబట్టి చెరువు నిర్మాణం బహు పుణ్యకార్యం. ఆ పుణ్యఫలాన్ని వర్ణించటం బ్రహ్మతరం కూడా కాదని మన పెద్దలు చెప్పారు. అందుకే పూర్వం డబ్బున్న మారాజులు పుణ్యం వస్తుందని చెరువులు తవ్వించేవారు. వాటిని పూడిక తీసుకుంటూ కాపాడుకోవటం మన విధి. లేకపోతే చెరువుపూడు-ఊరుపాడు అనే సామెత నిజమవుతుంది.

సుజలాం సుఫలాం అని వింధ్య హిమాచల యమునాగంగా ఉచ్ఛల జలధితరంగ అంటూ భరతమాతకు కైమోడ్పులర్పించే మనం జలధితరంగను మురికికూపంగా మార్చకుండా సుజలాలు కలుషితం కాకుండా సుజలాలుగానే వుండేటట్లు చూసుకోవాల్సిన బాధ్యత మనదేనని అలాగే ప్రతి నీటిబొట్టూ ఎంతో విలువైనదేననే విషయం నూటపాతిక కోట్ల జనం గుండెల్లో నాటుకునేలా జలచైతన్యం కలిగించి, నీటిసంరక్షణలో ప్రజలు భాగస్వామ్యులయ్యేలా చూడాలి.

ప్రజలు కూడా నీటిసంరక్షణ అంటే మనం కాదు ప్రక్కింటివాళ్ళు చేయాలి అనుకోకుండా ఎవరికివాళ్ళే తమ ఇంటినుండే మొదలుపెట్టాలి. వ్యక్తిగత పనుల్లో జరిగే వృధాను అరికట్టటం, ఇంటి పైకప్పు మీద కురిసే వాననీటిని మన ఇంటి ఆవరణలోనే ఇంకేలాగా ప్రతి ఇంటిలో ఒక ఇంకుడు గుంతను నిర్మించుకుంటూ మన పూర్వీకులు గుంతలక్ష్మమ్మ అంటూ పూజించిన సంస్కృతిని పునరుద్ధరించుకోవటం చేయాలి. అలాగే రైతులు కూడా తమ పొలాలను వాలుకడ్డంగా దున్నుకోవటం, చేలో చిన్న నీటికుంతను ఏర్పాటుచేసుకోవటం ద్వారా ఎంతో నీటిని సంరక్షించవచ్చు. ఇంతగా మన జీవితాన్ని ప్రభావితం చేసే నీటిని సంరక్షించుకోకపోతే కర్ర వున్నవాడిదే బర్రె అన్నట్లు రేపటినాడు నోరున్నవాడిదే నీరు అనే తీరుగా తయారైనా మనం ఆశ్చర్యపోనక్కర్లేదు. అందుకే పల్లెసీమలు పచ్చని పొలాలు, వనాలతో అలరారుతూ జలసిరులతో కళకళలాడుతూ వుండాలంటే మనందరం నీటిని సంరక్షించుకోవాల్సిందే.

**జననానికి అమ్మ అవసరం**
**జీవనానికి జలం అవసరం**
**జలానికి పొదుపు అవసరం**
**పొదుపుకు ప్రజల సహకారం అవసరం.**









కొండ దిగి నాలుగడుగులు వేసేసరికి తా(రోడ్డు తగిలింది. కొత్తగా వేసింది. తారు వాసన ఇంకా గాల్లో తేలియాడుతోంది. తూరుపు దిక్కునుండి రాలుతున్న తొలికిరణాల్లో రోడ్డు నల్లగా నిగనిగా మెరుస్తోంది. రోడ్డు మీదికొచ్చి నిలబడ్డాను. ఇటూ అటూ చూసేను. ఎక్కడ మొదలయ్యిందో ఎక్కడ అంతమవుతోందో తెలుసుకోలేనంతగా నల్లగా, కొత్తగా వుంది రోడ్డు. కళ్లు చిట్లించి చూసేను. ఎందుకో ఆ రోడ్డు చీకటి వైపు అడుగులు వేస్తున్నట్టు కనిపించింది. మరో వైపు మనసు ఉత్సాహంగా గంతులేసినట్టైంది. ఎందుకంటే ఇక నుంచి ప్రయాణానికి ఇబ్బంది పడనక్కరలేదు. రోడ్డు బాగులేని కారణంగానే ఊరు ఈ ప్రపంచానికి కానిదైపోయిందిన్నాళ్లు. జ్వరమో,జబ్బో వస్తే డోలీలు కట్టి ఇద్దరు భుజాన మోసుకొస్తే గానీ రోగి హాస్పిటల్ కి చేరలేని పరిస్థితి ఇక వుండబోదు. రోడ్డు మా బతుకుల్లో ఒక వెలుగును నింపాలి ఇప్పటికైనా.

# తా(రోడ్డు

నిన్న నాన్న అన్న మాటలు నన్ను బాధిస్తున్నాయి. పదే పదే నన్ను నిలదీస్తున్నాయి. ఇన్ని రోజులుగా నాకు నేను వేసుకోలేని ప్రశ్నలు గుచ్చి గుచ్చి వేధిస్తున్నాయి.

తాగి తూలుతూ వచ్చేడు ఇంటికి. పొద్దు పోయి చాలా సేపయ్యింది. వీధిలోని కరెంటు స్థంబం జిగ్ మని వెలిగింది. గడపల్లో నిన్నాగిపోయిన సీరియళ్లు సాగడం మొదలయ్యాయి. రెండ్రోజుల కిందటే ఈనిన ఆవు మాత్రం ఇల్లు చేరలేదు. అప్పటికే నులక మంచాన్ని వీధిలో పరిచి చేరబడిపోయేడు నాన్న. మంచమ్మీద నుంచి ఆకాశం వైపు చూస్తూ ఏదో బూతు పాట పాడుతూ దొర్లుతున్నాడు.

"బక్కేది నానా?" అడిగాను చిరాకుగా.

"నాకేటి తెలుసురా... నా కొడకా" అన్నాడు తల పక్కకి తిప్పి వుమ్మి వూస్తూ.

"బక్కనొగ్గేసి ఎక్కడ తిరుగుతున్నావైతే?"

"నీనొగ్గడం కాదురా అదే నాకొగ్గేసి ఎలిపోయింది. గెడ్డొడ్డున మేస్తుంది. గెడ్డతల కెల్లొచ్చేసరికి ఎటో ఎలిపోయింది" అన్నాడు ముద్ద ముద్దగా. నాకు అర్ధమైపోయింది. గెడ్డవతల సారా బట్టీ వుంది. తాగడానికి వెళ్లినోడు ఆవు సంగతి మరిచిపోయి ఇల్లు చేరిపోయేడు. అదే మాట అనీసరికి నాన్నకి కోపమొచ్చింది.

"ఔన్రా... తాగేను. ఐతేటి?... తాగడం తప్పా? తాగకుండా నీనెన్నాలు బతికీయాల?"

"నోర్ముయ్యి నానా..." అన్నాను చికాగ్గా అడివిలో తప్పోయిన ఆవు దూడ గానీ ఏ జంతువు గ్గానీ దొరికిపోయిందేటోనని.

"నా కడుపున పుట్టి నాకే తిడతావురా. నీయమ్మ" ఒకబూతు మాటతోమాటని పూర్తి చేసేడు.

నా కళ్లు చుట్టు ప్రక్కలా వెతుకుతున్నాయి. నాన్న మాత్రం ఏదో గొణుక్కుంటున్నట్టు...మత్తులో తనలో తాను మాట్లాడుకుంటున్నాడు.

"నీను బతికినన్నాలూ రాజు లాగ బతికేనా(రా! సెంటు బూమి లేదు. సేతిల పైసా లేదు. నిర్బూసీగ బతికినాను. నీనే కాదురా కొడకా నిన్నూ ఇంతోడిని సేసినాను. నాకేటి కావాల(రా ఇప్పుడు? రేపోమాపో ఎలిపోయినోడిని. నువ్వు నాలాగ బతకగలవా? రేపు నీకొడుకుని నీకంట బాగా పెంచగలవా? ఆ నమ్మకం నీకీరోజున్నదా? సెప్పో"

ఆ మాటలు నేరుగా నా గుండెల్లోకి తాకేయి. ఆ ప్రశ్న మామూలుగానే కనపడుతున్నా కనుచూపుమేరా సమాధానం కనపడ్డం లేదు.నాన్న మాటల్లోని 'నిర్భూసీ తనం' తో నేడు బతకగలనా అనే సందేహం పదే పదే ఎదురౌతోంది.

వీపు వెనుక లెదర్ బేగ్ లోని సర్టిఫికేట్లు కళ్ల ముందు కదలాడేయి. నా గుండె బరువెక్కుతున్న కొద్దీ ఆ సర్టిఫికేట్లు ఎందుకో తేలికై పోతున్నట్టు అనిపించింది.

ఇన్నాళ్లూ నాన్నెలా బతికేడు? సెంటు భూమి లేక పోయినా కొండమీద పోడు చేసి బతుకు నెట్టుకొచ్చీసాడు. అదీ చాలక పోతే అడవి లోని చింతపండూ చీపుళ్లు, పనసపళ్లూ సీతాఫలాలో అమ్మి కుటుంబాన్ని లాక్కొచ్చేడు. నన్ను హాస్టల్లో పెట్టి ఇంతవాడిని చేసేడు. తీరా చదువుకుని నాలుగు సర్టిఫికేట్లు సంపాదించే సరికి భరోసా లేని బతుకైపోయింది. ఎందుకంటే నేనింతయ్యేసరికి లేని భూమి ఎలాగూ లేదు. అటవీ ఉత్పత్తులు అమ్మి బతుకుదామంటే అడవి తరిగిపోయి పూర్తిగా మైదానమైపోయింది. పల్లెటూర్లు టౌన్లుగా మారిపోయేయి. ఆ రోజు నాన్న రోజంతా కష్టపడి కుటుంబాన్ని ఎలాగైనా పెంచాలని రోజంతా శ్రమ

జగదీశ్ మల్లిపురం




డ్రైవరు కి దారి కనబడేట్టు బేలెన్స్ చేస్తూ ఎక్కాలి. ఏ మాత్రం ఏమరుపాటుగా ఉన్నా ముందుకు తూలి పోతాం. తప్పదు కాబట్టి ఎక్కాను. కాదు డ్రైవరు వైపునున్న ఇనప చువ్వకి వేలాడేను.

ఎటు వెళ్లాలో ఏమీ నిర్ణయించుకోలేదు. ఎక్కడికి చేరుకోవాలో తెలీడం లేదు. కోపం, బాధ. ఎవరి తోనైనా దెబ్బలాడితే బాగున్నట్టనిపిస్తోంది. వీపునున్న బేగులో వేలాడుతూన్న సర్టిఫికేట్లు ఎందుకూ పనికి రానివిగానూ, జీవితానికి సరిపడా భరోసా ఇవ్వలేనివి గానూ తోచేయి. జేబులో రెండొందలున్నాయి. అవి కూడ నిన్న సంతలో చింతపండు అమ్మి తెచ్చేడు నాన్న.

ఆగి ఆగి వెళ్తోంది ట్రక్కు. ఎక్కేవాళ్లే గానీ దిగేవాళ్లు లేరు. అంతా మండల కేంద్రం లోనే



పడే వాడు. ఈ రోజు నేను? చదువుకుని నాలుగు రాళ్లు సంపాదించాలని ఆఫీసుల చుట్టూ ఒక దర ఖాస్తులా మారిపోయాను. దరఖాస్తు మీద సంతకం కోసం ఎదురుచూసే ఒకానొక బిచ్చగాణ్ణిపోయాను. ఏ పనీ చేయలేక శ్రమకు దూరమైపోయేను.

రోడ్డు మీద ఏదో వాహనం అలికిడైతే అటు చూసేను. మనుషులందరూ నాలుగు చక్రాల మీద మూటకట్టి దొర్లించుకొస్తున్నట్టు ఒక ట్రక్కరు వస్తోంది. అనడానికి అది వాహనం గానీ దాన్ని మనుషుల మూట అంటే బాగుంటుందేమో! వాహ నం కనబడడం లేదు. నిండా వేలాడుతూ జనం. అంతా గిరిజనం. పదిమందిని ఎక్కించే సామర్థ్య మున్న ట్రక్కు మీద యాభై మందిని వేలాడదీసు కొస్తోందా వాహనం.

ఈ కొత్త రోడ్లు ఇందుకు పనికొచ్చేయి. వాహనాలు పెరిగాయి. వాహనాల మీద ఇక్కడి గిరిజనులుని మోసుకు పోయి ఎక్కడికో తీసుకు పోవడానికి, దాని ద్వార గిరిజనేతరుడు రెండు చేతులా సంపాదించి మేడ మీద మేడలు కట్టు కోవడానికీ రోడ్లు పనికొస్తాయి.

చెయ్యెత్తకుండానే నాముందర ఆగింది. ఎక్కడ ఎక్కాలో తెలీక చూస్తూ నిలబడిపోయేను. చుట్టు పక్కలా అందరు వేలాడుతూ వున్నారు. కాళ్లు పెట్టడానికి కూడా స్థలం లేదు. అలాగని ఎక్కకుండా వదిలేస్తే మళ్లీ మధ్యాహ్నం దాకా మరే వాహనమూ రాదు. చుట్టూ తిరుగుతున్నాను. డ్రైవరు సైగ చేసేడు, బోనెట్ మీద ఎక్కమని. అప్ప టికే అక్కడ నలుగురు కూర్చున్నారు. అక్కడ కూర్చుంటే పట్టుకోడానికి ఏ ఆధారమూ ఉండదు.

దిగుతారు. మళ్లీ సాయంత్రమయితే గానీ ఈ ట్రక్కు రాదు. ఆకు పచ్చని కొండల మధ్యలోంచి మలుపులు తిరుగుతూ, ఎగుడు దిగుడు ల రోడ్డు... దానిమీద గుంపు గుంపులుగా ప్రయాణం. నేను పుట్టినప్పటికి ఈ రోడ్డు కంకర రోడ్డు. దానికి ముందు బండి గోర్జి. అంతకు ముందు ఇది కాలిబాట. అంతకు ముందు అడివి. రోడ్డు వెడల్పు అవుతున్న కొద్దీ అడవి తరిగిపోతోంది. ప్రయాణం ముందుకు సాగుతోందా? వెనక్కా?

"కొత్తగూడ దిగండి..." అన్న అరుపుతో పాటుగా ట్రక్కరు ఆగింది.

వేలాడిన వాళ్లందరు కిందికి దిగి చేతులకంటిన ఇనప తుప్పుని చూసుకుంటున్నారు . మరికొందరు సంచులు సర్దుకుంటూ వేలాడ్డానికి స్థలం పోకుండా ఇంకా అలాగే వుండిపోయేరు. రోడ్డుకి కుడి వైపున విశాలమైన ఆటస్థలం. ఆ తరువాత ఒక కూలిపోయిన భవనం. దానికవతల రెండంతస్థుల కొత్త భవనం. గిరిజన సంక్షేమ ఆశ్రమ ఉన్నత పాఠశాల. నేను మూడో తరగతి నుండి పదోతరగతి దాకా చదువు నేర్పిన విద్యాలయం. పాత భవనాల స్థానంలో కొత్త భవనాలు వచ్చి చేరుతున్నాయి కానీ ఒక్క ప్రహరీ గోడ లేక ఏ విద్యార్థి ఏ వైపునుండి ఎటు వెల్తున్నాడో మాష్టార్లకే కాదు ఆ దేవుడికి కూడా తెలీదు. ప్రతీ యేటా ఇలాంటి స్కూళ్ల నుంచి కొన్ని వందల మంది విద్యార్థులు విడుదలవుతూ వెళుంటారు. ఐటీడీయేలో శత శాతం ఉత్తీర్ణత సాధించిన స్కూళ్లలో ఇదెప్పుడూ ముందుంటుంది. శత శాతం... శతశాతం... శతశాతం. అంకెలకే పరిమితమవడమే తప్ప పిల్లలకి స్వంతంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోగల సామర్థ్యాన్ని ఇవ్వగలుగుతున్నాయా అంటే అదీ లేదు.

పరీక్షలు ఎలా జరుగుతాయో గుర్తొచ్చాయి. పిల్లల్ని చూసి రాయించడానికి విద్యాసంవత్సరం మధ్యలోంచే ప్రయత్నాలు మొదలవుతాయి. దానికోసం వార్డెన్లు ఎక్కువ మొత్తంలో ఖర్చు చెయ్యాల్సి వస్తూంటుంది. దానికోసం పిల్లల మెనూలోంచి కత్తిరింపులూ, ఏమైనా అడిగే పిల్లలుంటే "మీరెలా పాసవుతార్రా?" అని బెదిరింపులు...అన్నీ గుర్తొచ్చేయి. ఆ రోజుల నుండి ఈ రోజు వరకూ పిల్ల లకు కావలసింది ఎలాగోలాగ పాస్ అవడం. మాష్టార్లకి కావలసింది ఎలాగో ఒకలాగ శత శాతం రిజల్ట్స్. ఎవరికి కావలసింది వాళ్లు చూసుకుంటూ ప్రతి యేట నాలాంటి వందల మంది గిరిజన విద్యార్థుల్ని త...యా...రు...చే...స్తోం...ది. వీళ్ళంతా ఇంటర్మిడియట్‌లో చేరు తున్నారా? చేరిన వాళ్లు ఎలా పాస్ అవుతున్నారు అన్న ఆలోచన చేస్తే...అక్కడ కూడ శతశాతం కోసం ఇంకా ఎక్కువ ఒత్తిడి వుండడం వల్ల ఇంకా బాగా కాపీల్ని ప్రోత్సహిస్తూ కాలేజీలు స్కూళ్లకి మాంచి పోటీ ఇస్తున్నాయి. అలా అక్కడా పాస్ చేయించే బాధ్యతను తీసుకుని రాబోయే తరాల్ని ఎంత నిర్వీర్యం చేస్తున్నాయో ఆలోచిస్తే భయమేస్తుంది.

నాకు తెలుసు...పదో తరగతి డిష్టింక్షన్లో పాసైన విద్యార్థి కి కార్పోరేట్ కాలేజీల్లో అధిక ఫీజులు చెల్లించి చేర్పిస్తే అక్కడ ఇంగ్లీషుని అర్థం చేసుకోలేక, అక్కడి వేగాన్నీ అందుకోలేక కాలేజీ మానేసి ఉపాధి హామీ పనులు చేసుకుంటూన్న నా తోటి వాళ్లు నాకు బాగ తెలుసు.

ట్రక్కరు వేగం పెరిగింది. ఎదురుగా ఒక బస్సు. వేగంగా దాటి పోయింది. ఒక్కసారిగ కుదుపుతో వంపు తిరిగింది ట్రక్కరు. డ్రైవరు ఒక్క బూతు తిట్టి రోడ్డు సైడుకు తీసి ఆపేడు. రోడ్డు సైడునుంచి తలమీద బరువులతో సంతకు నడిచి పోతున్న గిరిజనులు గతుక్కుమన్నారు. గేరు మార్చి మళ్లీ రోడ్డెక్కించేడు. కొందరు అతన్ని పొగుడుతున్నారు. మరికొందరు బస్సుడ్రైవరుని తిడుతు వేలాడుతున్నారు.

మండల కేంద్రాన్ని చేరుకోడానికి మరో పది నిముషాలు పడుతుంది. అక్కడి నుండి పార్వతీపురం చేరుకోవడానికి బస్సులో వెళ్లాలంటే రెండు గంటల ప్రయాణం. ఐటీడీయే కి వెళ్లి అక్కడ పోష్టులేమైనా ఉన్నాయేమో అడగాలి. వీలైతే ఒక అప్లికేషను పెట్టి రావాలి. మరో వైపు ఆ ఆఫీసు అంటేనే భయం పుట్టుకొస్తుంది.

డిగ్రీ పూర్తయ్యాక ఎంప్లాయ్‌మెంట్ సెల్లో పేరు నమోదు చేసుకోవడానికి వెళ్లేను. నా సర్టిఫికేట్లు ఎంప్లాయిమెంట్ కోసం రిజిష్టరు చేయండని దరఖాస్తు రాసి ఇచ్చేను. అక్కడున్న అధికారి మొత్తం చదివి "నువేం చదివేవు?" అని అడిగారు. చెప్పాను. సర్టిఫికేట్ల జెరాక్సులన్నీ చూపించేను. అన్నీ చూసి "మరి...ఇన్ని తప్పులేంటయ్యా రాతలో ?" అన్నారు. "డిగ్రీలు చేసీడం కాదువోయ్... దరఖాస్తు రాయడం రావాలి. ఇదే అవకాశాలు ఇతరులకిస్తే వాళ్లెంత అభివృద్ధిచెందుతారో తెలుసా...? ఉపయోగించుకోండి..." అని హితబోధ చేసేరు.

ఆ వెళ్లడం కొత్తకాదు. మొదటిసారీ కాదు. ఎన్నో సార్లు ఆ వరండాలో తిరిగాను. ఎన్నో సార్లు అక్కడి మెట్లెక్కి దిగేను. ఎన్నో దరఖాస్తుల్ని పట్టుకుని ఆ చెట్లకింద పడిగాపులు కాసేను. ఐనా ఏదో భయం. అక్కడున్నవాళ్లు ఎవరూ తెలిసిన వాళ్లు కాదు. ఒక గిరిజనుడిగా అక్కడ అడుగుపెడితే ఒక్క గిరిజనుడూ కనిపించడు. ఒకరిద్దరు ఉన్నా ఏ అటెండరుగానో, డ్రైవరు గానో ఉన్నోలే కానీ అధికారిగా ఎవ్వరూ అక్కడ లేరు. నేను తరగతి గదిలో ఉన్నపుడు మాత్రం ఉపాధ్యాయులు "రేపు మీరు పీవోగానో, డీడీ గానో రావాలి" అని చెప్పేవారు. ఇప్పుడనిపిస్తూంది. ఎలా వస్తారు? కాకి లెక్కల కాగితాల కోసం ఈ బడులు చూసిరాతల్తో పనికి మాలిన భవిష్యత్తునిస్తుంటే. చెప్పుకోడానికి డిగ్రీలు...చేతిలో రెండు కాగితమ్ముక్కలు. ఈ ఆఫీసు ఎదుట దరఖాస్తులు రాసుకోడానికే. అవెప్పుడూ నాకు రేపటి గురించి భరోసా ఇవ్వలేదు. బతకగలనన్న నమ్మకాన్నీ ఇవ్వలేదు. ఈ చదువులు ఏ కానిష్టేబుళ్లు గానో, జీసీసీ సేల్స్‌మేన్లు గానో, హాష్టల్లో వంటకుక్కులు గానో తయారు చెయ్యడానికే పనికొచ్చేవి నిన్న మొన్నటి వరకు. ఈ రోజు అదీ లేదు. ఎందుకంటే తగిన ఉద్యోగావకాశాల్ని కల్పించకుండా ప్రతి యేడూ కొన్ని వేల మంది గ్రాడ్యుయేట్లని ఉత్పత్తి చేస్తోందీ ప్రభుత్వం.

కిందటి నెల ఒక అటెండరు పోష్టు కోసం నోటిఫికేషను ఇచ్చేరు. నేనూ దరఖాస్తు చేసేను. డిగ్రీచేసిన నాకే వస్తుందని ధీమాతో ఉండి పోయాను. తీరా అది నాకు రాక పోయేసరికి ఆశ్చర్యపోయి ఇందులో ఏదో కుట్ర వుందని అడిగాను. అప్పుడు చెప్పారు కదా! ఆ పోష్టుకి రెండు వేల అప్లికేషన్లు వొచ్చేయని. అందులో అందరు గ్రాడ్యుయేట్లతో పాటు పోష్టు గ్రాడ్యుయేట్లు కూడా వున్నారని, వాళ్లలో మెరిట్ చూసి ఒకరికి అప్పాయింట్‌మెంట్ ఆర్డరు ఇచ్చేసారని.

అయితే...చదువుకున్నది ఉద్యోగానికేనా? ఉద్యోగమంటే జీతమొచ్చేదేనా?

ఊరికి కిలోమీటరు ముందు మామిడి చెట్టు కింద ఆపేసాడు ట్రక్కు. టిక్కెట్లు వసూలు చేస్తున్నాడు. వేలాడినా, కూర్చున్నా ఒకటే చార్జి. ఊర్లోకి వెళ్లాలంటే పోలీసు స్టేషను ముందునుంచే వెళ్లాల్సి ఉంటుందని, వెళ్తే ఫైను కింద నెల రోజుల రాబడి వసూలు చేస్తాడని ట్రక్కరు వాడికి తెలుసు. దిగిపోయిన వాళ్లు అడ్డగా సంత దరి నుంచి నడిచి వెళ్లి పోయేరు. మరికొందరు బస్సు కెళ్లే వారు సీట్లు దొరుకు తాయని ఇక్కడే దిగి పోయారు. మొత్తంగా ట్రక్కరు వేలాడే వాళ్లు కాకుండా కూర్చునే వాళ్లతోనే కదిలింది. ఎంపీడీవో ఆఫీసు దాటుకుంటూ వెళ్తోంది. నాకు తెలీకుండానే నా గుండెల్లో వణుకు సన్నగా మొదలయ్యింది, ఏ ఆఫీసరు ఎదురై లోను బకాయి కట్టమంటాడోనని. ఇక్కడి పోష్టుమాను కనపడి నోటీసులెక్కడ అందిస్తాడోనని గుండెల్లో సన్నని భయం.

ఆ రోజు నిరుద్యోగ గిరిజన యువకులకు ట్రైకార్ ఋణాలు ఇస్తాం, అప్లికేషను పెట్టుకోండని ఊర్లోకి కబురొచ్చింది. ఆ పేరెప్పుడూ వినలేదు. అసలు ఋణమంటేనే తెలీని నాకు ఆ పదాన్ని నేర్పింది ఐటీడీయ్యేనే. అందరితో పాటూ నేనూ కాగితం రాసిచ్చేను. మరి కొద్ది రోజుల తర్వాత

మళ్లీ కబురొచ్చింది. నాకు ట్రాక్టరు యూనిట్ మంజూరయ్యిందని, కానీ డౌన్ పేమెంట్ కొంత కట్టాలని. చేతిలో సిల్లిగవ్వలేదని నీనేడుస్తుంటే పేమెంటు చెయ్యమంటే ఎక్కడికెల్లి తేవాలి? అప్పు డొచ్చేడు మా వూరి పాత షావుకారి. అతను మా చిన్నతనంలో వ్యాపారం చేస్తూ మా ఊర్లోనే వుండే వాడు. హఠాత్తుగా ఓ రోజు అతను ఆస్తుల్నీ, ఇల్లునీ అమ్ముకుని విశాఖపట్నం వెళ్లిపోయేడు. ఎందుకెల్లి పోయేడో మా వయసులో ఉన్నోళకి అర్థం కాలేదు అప్పుడు. ఆ తర్వాత రోజుల్లో అతన్ని అన్నలు బెదిరించేరని, అందుకే కొండదిగి, ఊరొదిలి పారి పోయేడని పెద్దోళ్లు అనుకుం టుండగా విన్నాను. మళ్లీ ఇన్నాళకి కనిపించేడు. కాస్త సన్న బడ్డాడు. కానీ జీన్స్‌లో మోడరన్‌గా కనిపిం చేడు. చేతి వుంగరాలు మరింత మెరుస్తు న్నాయి. మెడలో గొలుసు మాత్రం అప్పటికంటే ఇంకా లావుపాటి దయ్యింది. పలకరింపులు తర్వాత ఏటి సంగతని? అడిగేడు. విషయం చెప్పాను. ఓసింతేనా అన్నాడు. అర్థం కాక అతని నవ్వువైపు చూస్తూ వుండి పోయేను. అప్పుడు తీరిగ్గా చెప్పాడు. ఆ పేమెంట్ నేనిస్తానన్నాడు. ఎలా అని అడగలేదు. ఎందుకనీ అని అస్సలు అడగలేదు. అప్పటికప్పుడు డబ్బు లిచ్చి ఆదుకున్నవాడిగానే కనిపించాడు తప్ప అతని లో ఇంకే ఇతర భావాలేమీ కనపడలేదు. ఇన్నాళూ కనపడని వాడు ఇప్పుడెందుకొచ్చేడు? ఎక్కడో వైజా గులో స్థిరపడిన వాడు ఇక్కడికొచ్చి ఏమీ ఆశిం చకుండా ఉత్తినే అంత అప్పు ఎందుకు ఇస్తున్నట్టు? ఇవేవీ నాకు ఆలోచనలోకి రాలేదు. కనపడిందల్లా ట్రాక్టరు, దానిమీదొచ్చే రాబడి.

షావుకారి అప్పుతో ఐటీడీయే అప్పుని పొందే ను. ఒక అప్పుకోసం మరో అప్పు వాడి ఋణ గ్రస్తుడినయ్యేను. ట్రాక్టరు ఇంటికొచ్చింది. అందాక ఒక డ్రైవరుని మాట్లాడుకున్నాను. వోనర్నే గానీ డ్రైవింగు రాదుమరి నాకు. పసుపూ కుంకుమ రాసి జాకరమ్మ దగ్గరి బొట్టు బెట్టింది అమ్మ. నాన్న కైతే ఏమీ తెలీక "ఇదేమిటి... ఎక్కడిది?" అన్నాడు. చెప్పేను. మరింత ఆశ్చర్యపోయేడు. "దుక్కి మల్లా దున్నేస్తాది తెలుసునా?" అన్నాడు పక్కనే వున్న డ్రైవరు. ఆ సంగతి నాక్కూడా తెలీదు. ఇద్దరం ఆశ్చర్యపోయేము. అప్పుడు చెప్పేడు దుక్కి సెట్టు కొనుక్కోవాలని. ఆ మాటకి నేను గతుక్కుమన్నాను. ఎందుకంటే దానికోసం మరింత డబ్బు కావల్సి వస్తుందని. కానీ నాన్న గొణుక్కుంటున్నట్టు అన్న మాటలు నా చెవిన పడకనే పడ్డాయి. "ఈ కొండ మీద ఏమి దుక్కి పనుంతాది? తువ్వడం తప్ప" అని చుట్ట ముట్టించు కుంటూనే మరొక మాట న్నాడు, "ఇంతపిసర భూమున్నా బాగున్ను" అని. అప్పటికి నాకా మాటలు అర్థమవలేదు. అర్థమ యేసరికి రావలసిన అనర్థం ముంచుకొచ్చేసింది.

బస్సు కోసం ఎదురు చూస్తున్నాను. పొద్దు రెండు బారలెక్కింది. అప్పుడే షాపులన్నీ ఒక్కొక్కటీ తెరుచుకుంటున్నాయి. ఇప్పుడు బస్సొస్తే సరిగ్గా ఐటీడీయే తెరుచుకునే సమయానికి చేరుకోవచ్చు.

బస్సొచ్చింది. కిటికీ పక్కసీటు. ఆకుపచ్చ కొండలు,ఎత్తైన చెట్లు, ఖానాలు, పొలాలూ, వాగు లూ వంకలూ వెనక్కి వెళ్లిపోతున్నాయి. ట్రాక్టరు కి ఓనరు అయినా డ్రైవింగు రాక పోతే ఎంత నష్టమో కొన్ని రోజుల తర్వాత తెలిసొచ్చింది. చుట్టు పక్కల ఊళ్లు తిరిగి ఎక్కడ బేరాలున్నాయో తిరిగి తిరిగి రావడం ఒక ఎత్తైతే పనైన తర్వాత డబ్బులు రాబట్టడం మరొక ఎత్తు. అందరు తెలిసిన వాళ్లే. ఎవరినీ గట్టిగా అడగలేకపోవడం... కొన్ని చోట్ల మొహమాటానికి పోవడం. కొందరు తర్వాత ఇస్తామనడం, మరికొందరు డబ్బులు ఎగ్గొట్టడం. ఎలా అడగాలో తెలీక కొన్ని పద్దులు వొదులు కోవడం. ఇసుక లోడ్లు, రాయి లోడ్లు, ఇటికి లోడ్లు...ట్రాక్టరొచ్చిన కొత్తలో ప్రతి పనికీ బండితో వెళ్లే వాడిని. కానీ కొన్ని లోడులకి స్వయంగా వెళ్లకపోతే డ్రైవరు ఎంత చెప్తే అంత. వాడు ఎన్ని లోడ్లు వేసేడో తెలిసేదికాదు. తొలిరోజుల్లో తెలిసి రాలేదుగానీ తర్వాత్తర్వాత వాడు అబద్ధం చెప్తున్నా డని తెలిసిపోయింది. వాడు మానే స్తాడంటే మరొ కడిని వెతక లేక అలా అలా గడిచి పోయేది.

నెల తిరిగేసరికి వాయిదా కట్టాల్సి రావడం. రోజులు గడుస్తున్న కొద్దీ ఋణమెంత భారమో తెలిసొస్తూ వుండగా నాకు ఒక కొత్త సమస్య వొచ్చి పడింది. నాకు పోటీగా మరొక ట్రాక్టరు రావడం. అది ఒక విలేఖరిది. అతను కాంట్రాక్టు పనులు కూడా చేస్తూ వుంటాడు. దానికోసం పత్రికను ఎంతలా వాడుకోవాలో అతనికి బాగా తెలుసు. అతని పరిచయాలు... అతని పలుకుబడి ముందు నేను నిలబడి వర్కులు సంపాదించడం సాధ్యం కాని పనని కొద్దిరోజు ల్లోనే తెలిసొచ్చింది.

ఒక పొద్దు పోతున్న సమయాన పోష్టు రన్న రన్న ఒక కవరు అందించేడు. అది వాయిదా కట్టడం లేదని ట్రాక్టరుని జప్తు చేస్తున్నామని ఐటీ డీయే వారు ఉత్తరం పంపేరు. దాన్ని మడతబెట్టి జేబులో పెట్టేనో లేదో పాతషావుకారి బండేసుకొని వొచ్చేడు ఊర్లోకి. దెబ్బమీద దెబ్బ. "మొదటోడు మొగుడు...రెండో వోడు రంకు మొగుడు" అన్నట్టు గుంది నా పరిస్థితి. వాయిదాలు ఎగ్గొట్టి దాగి దాగి తిరుగుతున్న నాకు అతన్ని తప్పించు కోవడం వీలు కాలేదు. ఏమి చెప్పాలో తెలీక నీళ్లు నమిలేను. ఇంట్లోకి తీసుకొచ్చి మంచమేసి కూర్చో బెట్టేను. తాగడానికి మంచి నీళ్లిచ్చేను. అతనికి ఏమి సమా ధానం చెప్పాలో సిద్ధం చేసుకున్నాను.

"ట్రాక్టరు ఎలా నడుస్తుంది?" అడిగాడు. కష్టాలన్నీ చెప్పేను...కరుణిస్తాడని. చిత్రంగా నవ్వే డు. ఆ నవ్వుకి అర్థం తెలుసుకోలేకపోయేను. "ఇదీ నా పరిస్థితి' అన్నట్టు పోష్టరన్నరన్న అందిం చిన కవరు కూడా చూపించేను. అప్పుడతను మరింత ప్రశాంతంగా నవ్వి... "నేనొక మాటం టాను వింటావా?" అన్నాడు. అతని వైపు అనుమా నంగా చూసేను. నా చూపుల్ని తప్పించుకుంటూ సూటిగా అన్నాడు..."నీ ట్రాక్టరు ముందు జప్తు జరక్కుండా చూద్దాం" అన్నాడు. "ఎలా?" అన్నట్టు అతని వైపు చూసేను. "డబ్బులు కట్టేద్దాం" అన్నాడు కొన్ని నిముషాల తర్వాత. ఆశ్చర్యపోయాను. ముందు అప్పే తీరలేదు, మళ్లీ ఇంకా నా మీద ఏ నమ్మకంతో ఇంత ప్రేమ కురిపిస్తున్నాడో నాకు ఒక పట్టాన అర్థం కాలేదు. మరికొంత నిశ్శబ్దం తర్వాత మళ్లీ అతనే అన్నాడు "మన పరువు పోకూ డదు" అని. పోడానికి ఇంకెక్కడ మిగిలుంది గాకనా పరువు? అని మనసులో అనుకుంటుం డగానే షావుకారి "అయితే ఒక షరతు..." అని కాసేపు ఆగేడు. "ట్రాక్టరు పనులు కలిసి చేద్దాం" అన్నాడు. అలాగే అన్నట్టు తలవూపేను. నాకేమి చెయ్యాలో తోచలేదు. ఒప్పుకోవడం తప్ప వేరే దారిలేదు నాకు. ఆ వెంటనే లేచి నిలబడి బైకు ఎక్కేసాడు.

ఆ తెల్లారే వాయిదా కట్టేయడం, అటునుం డటే ట్రాక్టరు రిపేర్లకని తీసుకెళ్లడం, కొత్త డ్రైవరుని పెట్టుకోవడం వెనువెంటనే జరిగిపోయాయి. అలా వెళ్లిన ట్రాక్టరు మళ్లీ తిరిగి రాలేదు. ఐటీడీయే వాళ్లు కూడా నాకు నోటీసులూ పంపలేదు. ఆ తరువాత సబ్సిడీ కింద ఋణం మాఫీ అయి పోయినట్టు తెలిసింది. చివరికి నేను పెట్టుకున్న డ్రైవరుకివ్వాల్సిన జీతం డబ్బులు, నేను రిపేర్లకని పెట్టిన డబ్బులూ అప్పుగా మిగిలి పోయేయి. ట్రాక్టరు మీద తిరిగి నందుకు నాకు ఒళ్లు నొప్పులూ మిగిలేయినాకు.

నాకు ఏ శబ్దాలూ వినపడ్డం లేదు. బస్సు టౌనుకి దగ్గరవుతోంది. తోటపల్లి బేరేజీ కొత్తరోడ్డు మీదుగా బస్సు వేగంగా కదులుతోంది. రోడ్డు విశా లంగా వుండడం వల్లేమో డ్రైవరు మరింత హుషా

రుగా పరిగెత్తిస్తున్నాడు. ప్రయాణీకులెవరూ ఊపిరి తీయడం లేనట్టు...అందరూ మూగగా రోదిస్తున్నట్టు అంతా నిశ్శబ్దంగా...దృశ్యమొక్కటే కనిపిస్తోంది. నా ఊపిరి నాకే వినిపిస్తోంది. నా గుండె శబ్దం నాకు స్పష్టంగా చెవులకు సోకుతోంది. విశాలంగా తెరుచుకున్న తార్రోడ్డు నోటిలోకి బస్సుతో సహా నేనూ జారిపోతున్నట్టు, నగరభూతం నోరు తెరుచుకొని గాలితో సహా మింగడానికి సిద్ధపడుతున్నట్టు, రోడ్డు మీద వాహనాలన్నీ కుప్పలు కుప్పలుగా అందులోకి కూలబడిపోతున్నట్టు....

తార్రోడ్డు మీద ప్రయాణిస్తున్నా...నాకు ఏ దారీ కనిపించడం లేదు. ఏ ప్రయాణమూ గమ్యం చేరుతున్నట్టనిపించడం లేదు. ఉరుకుల పరుగుల వేగం తో ముందుకు వెళ్తున్నా ఒక్క అడుగూ కదిలినట్టనిపించడం లేదు.

సరిగ్గా ఇలాంటి సమయం లోనే అనుకుంటాను మా వూరి సోములు గాడు "నా మాటిను బావా..." అన్నాడు. ఏమిటన్నట్టు? అతనివైపు చూసేను. అంతదాకా ఇంటరు పోయి ఉపాధి హామీ పనులకెళ్లి బతుకుతున్నోడు ఒక్కసారిగా రాత్రికి రాత్రే మారిపోయిన వాడి రూపం నన్ను ఆశ్చర్యానికి గురి చేసింది. వైట్ డ్రెస్ లో ఇన్ చేసుకుని...చేతిలో ఒక లెదర్ బేగుతో కనిపించేడు. దాంట్లో బైబిలూ మరికొన్ని సువార్త వచనాలూ. ఎప్పటినుండో మా ఊర్లో క్రైస్తవ సంఘం పెట్టి చర్చి నడుపుతున్నాడు. వాక్యం చదివి నలుగురిని సంఘం చేర్పించుకుంటే చాలు, కష్టాలన్నీ తీరిపోతాయని చెప్పేడు. దానికోసం కష్టపడక్కరలేదనీ చెప్పాడు. మత వ్యాప్తి చెయ్యడమెలాగో ట్రైనింగు కూడ ఇస్తారనీ, నెలకు జీతంతో పాటు మతస్తుల నుంచి 'దశమభాగం' కూడ వస్తుందనీ చెప్పాడు.

నాకెందుకో అది నచ్చలేదు...బతకడం కోసం జనాల నమ్మకాన్ని వాడుకోవడం...అస్థిత్వాన్ని వదులుకోవడం...నాకెందుకో నచ్చలేదు. మతాన్ని ఉపాధి మార్గంగా వాడు కోవడం... అందులోనూ స్వంత అలవాట్లనీ, సంస్కృతీసంప్రదాయాల్ని వదిలించుకోవడం అస్సలు నచ్చలేదు. ఐనప్పటికీ తోటి జనాలు గుడ్డిగా అటువైపే అడుగులు వేస్తున్నారు. తొలిరోజుల్లో నాకు అర్థమవలేదు. ఇప్పుడిప్పుడే నాకూ అర్థమవుతూ వస్తోంది ఏమిటంటే అభివృద్ధి చేస్తామని ఏర్పాటు చేసిన ఐటీడీయేలు ఎక్కడ ఫెయిల్ అయ్యాయో సరిగ్గా అక్కడే ఈ మతసంస్థలు అడవుల్లోకి దూరి అమాయక ఆదివాసుల్ని మెస్మరైజ్ చేస్తున్నాయన్న వాస్తవం. ఈ విషయం నా వాళ్లకి ఎప్పుడు తెలిసొస్తుందో!?

బస్సు పార్వతీపురం కాంప్లెక్స్ చేరింది. దిగి నడుస్తుంటే చాలా మంది స్నేహితులు కలిసారు. అందరూ ఒక్కొక్క గ్రీవెన్సు కోసం...ఒక్కొక్క దరఖాస్తు చేత బట్టుకొని. అందులో చాలా మంది గ్రాడ్యుయేట్లే. మరికొందరైతే బీఈడీ, పోస్టుగ్రాడ్యుయేషన్ చేసిన వాళ్లూ వున్నారు. ఆఫీసు వైపు నడుస్తుంటే ఔట్సోర్సింగు ఉద్యోగులు జీతాల కోసం ధర్నా చేస్తున్నారనీ తెలిసింది. ఆఫీసు దగ్గరవుతున్న కొద్దీ జనం చిక్కనవుతూవున్నారు. గేటు ముందర పోలీసు పహారా. లోపలికి వెళ్లే వీలు లేదు. వెనక్కి చూసేను, తిరిగి వెళ్లే దారి కనిపించలేదు. జనంలో నినాదమై పోయేను.

జనం మా గోడు వినాలంటారు. ప్రోజెక్టు అధికారి మేడ మెట్లు దిగి రానంటాడు. పోలీసులు హద్దులు దాటొద్దంటారు.

పొద్దు నడి నెత్తి దాటి కిందకి జారుతూ ఒంటి మీద ఉప్పు పేలుస్తోంది. ఆకలి మంట... ఆపై కడుపు మంట. దేనర్థం ఏదో తెలీని వెర్రి ఆవేశం. మా కోసమని ఏర్పడిన ఆఫీసులో నీడ లేకపోవడం...మా మాట వినే నాథుడు లేడని యువత బాధ. వెరసి తోపులాట. గేటు కవతల పోలీసులు... ఇవతల జనం. జనం అదుపు తప్పేరు. పోలీసులు సహనం కోల్పోయేరు. గుంపు లోంచి ఒకడు తన నిరసనని రాయిగా మార్చి బలంగా పీవో ఆఫీసు కేసి విసిరేడు. పీవో గారి చూపు లాఠీ అయ్యింది.

వెనుక నుంచి జనం ఒక్కసారిగా తోసుకోవడం...ఏమరుపాటుగా వున్న నేను కిందపడిపోవడం...నా మీద మరి కొందరు పడిపోవడం... నా తల మీద ఒక లాఠీ తగలడం...స్పృహ కోల్పోవడం నిముషాల వ్యవధిలో జరిగిపోయాయి.

కళ్లు తెరిచేసరికి నేను హాస్పిటల్ బెడ్ మీద వున్నాను. చుట్టూ రోగులు. ప్రక్కనే మా వూరి తోయిక రాములు మామ.నేనెప్పుడు కళ్లు తెరుస్తానా అన్నట్టు. "నువ్వేటి మామా ఇక్కడ?" అన్నాను. అతని వెనుకే అత్త, ఇద్దరు పిల్లలు... వాళ్ల మూటలు. అప్పుడు మామ అంతా చెప్పుకొచ్చేడు. నిన్న సాయంత్రం కాంప్లెక్స్ నుంచి రైల్వే స్టేషన్ వైపు నడిచొస్తుంటే పక్క వూరి వాళ్లెవరో ఎదురై చెప్పారట, లాఠీ దెబ్బలు తిని కింద పడిపోయిన నన్ను పోలీసులే హాస్పిటల్ లో జాయిన్ చేసారని, నన్ను మామకి అప్పజెప్పేసి పోలీసులు వెళ్లిపోయేరని. "నిన్న చెన్నై మెయిల్ ఎక్కేసుంటే ఈ పాటికి దిగి పోయుందుము అల్లుడూ!"




## వాయిదా

విద్యావంతులతో
పని లేదు...
చేతులెత్తేవారు
బూతులెత్తేవారు
చాలు...
సభ
రేపటికి
వాయిదా

**డా॥జముళ్ళముడి**

77028 24174

అన్నాడు. అప్పుడు గుర్తొచ్చింది ఆ కుటుంబం ఊరొదిలి కిందటి వేసవిలో పనుల కోసం చెన్నై వెళ్లి పోయేరని. రేషన్ కార్డులకి ఫొటోలు తీస్తున్నారంటే ఈ మధ్యనే వొచ్చేరు.

నా సర్టిఫికేట్లు గుర్తొచ్చి.. "మామా! నా బేగో?" అడిగాను. తెలీదని అడ్డంగా తలూపేడు. నిన్న తొక్కిసలాటలో ఎక్కడో పోయుంటాయని గుర్తొచ్చింది. ఎందుకో వాటికోసం ప్రయత్నం చెయ్యాలనీ అనిపించలేదు. నాన్నడిగిన ప్రశ్నకి అవి జవాబు అవుతాయని నమ్మకం పోయింది నాకు.

నిన్నటి నుండి నేను చేసిన ప్రయాణం గుర్తొచ్చింది. తార్రోడ్డు మొదలు కొని హాస్పిటల్ బెడ్ దాకా. రోడ్డు మా వూరి వైపు...నేను వూరికి దూరంగా మరో వైపు... వ్యతిరేక దిశల్లో.

నొప్పి ఇంకా పచ్చిగానే వుంది. చుట్టూ చీకటిగా వుంది...నా భవిష్యత్తులా. మా ఊరొదిలి కూలి పనులకోసం వలసెళ్లి పోతున్న మామ కుటుంబం నా ప్రక్కనే వున్నారు... చిరు దీపం లా.

"మామా! ట్రైను ఎన్ని గంటలకి?" అని అడిగాను.



బైట ఉండాల్సినవేమిటో
లోన ఉండాల్సినవేమిటో
అన్నీ నాకు తెలుసు
ఐతే, ఈ కిటికీకి
ఇక్కడేం పని?

...ఇస్మాయిల్ 'గోడ'

**'గది ఆమె అంతరంగంలా ఉంది'** అని ఒక వాక్యముంటుంది, 'కొండఫలం' కథా సంపుటిలోని 'ఈ రాత్రి గడిచింది' అనే కథలో. 'కిటికీ బయటి వెన్నెల' కథాసంకలనంలోని కథలన్నిటికీ అంతస్సూత్రమైన భావనను ఈ వాక్యంలో వీరలక్ష్మీదేవి సూచించారా అనిపిస్తుంది. నిజానికి ఒక భౌతిక స్థలం అంతరంగానికి ప్రతిబింబంగా వుండడం కథకురాలిగా వీరలక్ష్మీదేవి సాధన చేస్తూ వచ్చిన తాత్త్విక నైశిత్యానికి నిదర్శనం. '(పురూరవ' రేడియో నాటకానికి వీరలక్ష్మీదేవి చేసిన పరిచయంలో ఊర్వశీ పురూరవుల సంవాదం నడిచే తోటను పురూరవుడి 'మానసిక క్షేత్రం' అనటంలో కూడా ఈ తెలివిడే కనిపిస్తుంది.)

రచయితలు చూపించని lucidity, తేటతనం ఈ కథల్లో కనిపిస్తుంది.

కిటికి, అకడెమిక్ పరిభాషలో చెప్పాలంటే, ఒక 'లిమినల్ స్పేస్'. ఇస్మాయిల్‌గారి కవితలోలాగా బయటా, లోపలా కాని చోటు. బయటో లోపలో మాత్రమే ఉండాల్సిన వస్తువుల స్థానాలు భ్రంశమయ్యే చోటు. ఇటు వంటి 'లిమినల్ స్పేస్'ని ఆలంబనగా కథ నిర్మిస్తూ రచయిత్రి 'ప్రైవసీ', 'చౌర బాటు', 'సర్వైలన్స్' వంటి భావనల్ని సమస్యాత్మకం చేయడం చూస్తాం. మరో మనిషి సాంగత్యాన్ని మనం కోరుకునే, పొందే పద్ధతుల్లో వచ్చిన మౌలికమైన మార్పును ఏమాత్రం సెంటిమెంటలిజమ్ లేకుండా చెప్పగలగడం ఈ కథ ప్రత్యేకత.

ఎంచుకునే ఇతివృత్తాల్లో వైవిధ్యమే కాక, ప్రతి కథలోనూ సంక్లిష్టతకీ, ఆరోగ్యకరమైన సంశయాత్మకతకీ తావుంచారు. ప్రతి కథలోనూ సూచన ప్రాయంగా విడిచిన ఉపకథలెన్నో ఉన్నాయి. ఒక రకంగా ఈ సంపుటిలోని ప్రతి కథ కూడా రెండు కథలు కలుసుకునే చోటు. ఉదాహరణకి 'పునరుత్థానం' కథలో ప్రధాన పాత్ర ఉద్యోగం పోయినప్పుడు, ఇంట్లో నెలకొన్న కుహనా ప్రశాంత వాతావరణాన్ని చిత్రించిన తీరు, ఐదారు పంక్తుల్లో చిన్న ప్రపంచాన్నొకదాన్ని సృష్టించి ముందుకు సాగిపోతుంది కథనం.

# ఆధునికతతో నిరంతర సంభాషణ

'కిటికీ బయటి వెన్నెల మరికొన్ని కథలు' లోని కథలు స్థూలంగా 'స్పేసెస్' ని పొంది, కోల్పోయి, తిరిగి పొందే క్రమాన్ని చిత్రించిన కథలు. ఇంత అమూర్తస్థాయిలో వ్యాఖ్యానం ఎందుకంటే ఈ కథల్ని మనకు పరిచితమైన కొన్ని ద్వంద్వాలతోనో (binaries), కొన్ని కృతక వైరుధ్యాలతోనో (artificial dichotomies) అర్థం చేసుకోవాలనుకోవడం సులువు. దమనులు, దమితులు, సమస్య పరిష్కారం, స్వీయ పర వంటి నమూనాలతో స్త్రీల సమస్యల్ని, ఆపైన సామాజిక చలనాన్ని పరిశీలించడం మన సాహిత్య వాతావరణంలో సర్వసాధారణమైపోయిన పద్ధతి. ఈ ద్వంద్వాల్ని దాటి చూడ గలగడమే కథకురాలి దార్శనికత.

సాంద్రమూ, సార్థకమూ అయిన నిర్మాణం కలిగిన 'కిటికీ బయటి వెన్నెల' ఈ సంపుటిలోని 10 కథల్లోకల్లా విశిష్టమైనది. ఒక కథ ఏకకాలంలో వాస్తవికతలంలో విశ్వసనీయంగా ఉంటూనే, ప్రతీకాత్మకంగా కూడా సఫలమవడం సాధారణ విషయంకాదు. 'ఇంప్రెషనిస్టిక్' శైలిలో కథనం సాగడం వల్లనూ, చెకోవ్ లాగే పాత్రలను నిర్మమత్వంతో, సహానుభూతితో చిత్రించడం వల్లనూ సమకాలీన జీవితాన్ని వ్యాఖ్యానించేటప్పుడు చాలా మంది




ఈ కథల్లో వీరలక్ష్మీదేవి ఒక 'pragmatic idealist' గా కనిపిస్తారు. పరిణామం తాలూకు సూక్ష్మ చలనాల్ని గమనించడంలో, వాటిని చిన్న చిన్న వివరాలలో నిక్షిప్తం చేయడంలో వారి ప్రత్యేకత కనిపిస్తుంది. నిజానికి, ఆధునికత అనివార్యమని గుర్తిస్తూనే దానితో నిరంతర సంభాషణ సలుపుతూ స్వీయ అస్తిత్వాన్ని కోల్పోకుండా ఉండవచ్చునని గుర్తించి రచనలు చేస్తున్న అతి తక్కువమందిలో వీరలక్ష్మీదేవి ఒకరు.

మనముండే చోటును మనం నిర్దేశించుకునే క్రమంలోనైనా, మన ముండే చోటు మనలని నిర్వచించే క్రమంలోనైనా మన ప్రమేయాన్ని, నిర్ణయాధికారాన్ని లాగేసుకునే వ్యవస్థీకృత హింసను గుర్తించాలనే స్పృహ ఈ కథల్లో ఉంది.

స్వర్ణయుగాల కోసం, యుటోపియాల కోసం తృష్ణ అధికమవుతున్న

**ఆదిత్య కొర్లపాటి**
8978863234

కాలమిది. విశుద్ధమూ, నిర్మలమూ అయిన కొన్ని సాన్నిధ్యాల్లో మాత్రమే ధ్వంసమైన మన పూర్వీకుల నివాస స్థలాల్ని మనం తిరిగి నిర్మించుకోగలమనే మెలకువ కనిపిస్తుందీ కథల్లో. ఇంటినీ, గదుల్నీ, ఇంటి చుట్టూవున్న స్థలాన్ని, పొరుగు మనిషికీ నీకూ మధ్య కౌముదీ సేతువును నిర్మించే కిటికీని, అందుకనే వీరలక్ష్మీదేవి ఇంతగా పట్టించుకున్నారనిపిస్తుంది.

వీరలక్ష్మీదేవిగారి కథలు చదవడమంటే పెద్దనగారి పద్యంలోలా తిలతండులన్యాయమున ప్రకాశించే జీవిత రంగభూమిని ఆనందాశ్చర్యాలతో చూస్తూ వుండడం...!



"ఘంటశాలలో ఉన్నాను. ఇక్కడికి వచ్చిన పని పూర్తి అయ్యింది. బెజవాడ బయలుదేరుతున్నాను. రాత్రికి హైదరాబాద్ ప్రయాణం. నన్ను అంగీకరించకపోయినా, నా "ఫీలింగ్స్ అర్థం చేసుకుంటావన్న నమ్మకం మాత్రం నాకుంది".

జనార్దన పంపిన ఎస్ఎమ్ఎస్ అప్పటికి చాలాసార్లు చూశాడు రాఘవ.

తను పని చేస్తున్న కార్యాలయం దక్షిణ రీజియన్ కౌన్సిల్ సమావేశానికి ఢిల్లీ నుండి బెంగుళూరు వచ్చిన రాఘవ, మర్నాడు ఆదివారం ఫ్లైట్‌కి టిక్కెట్ దొరకకపోవడంతో, ఆ రోజు అక్కడే ఉండిపోయాడు. రేస్ క్లబ్బుఎదురుగా ఉన్న సెంట్రల్ హోటల్ నాలుగవ అంతస్థు గది నుండి ఆ సాయంత్రం వేళ గుర్రాలకు మాలిష్ చేస్తున్న పనివాళ్లను చూస్తూ చాలాసేపు అలాగే ఉండిపోయాడు.




12

# నిమజ్జనం

## జాన్‌సన్ చోరగుడి


99493 51561

గదిలో టేబుల్ మీద బొకేలు, పళ్లు, స్వీట్ ప్యాకెట్లు. సృజనరంగంలో క్రియాశీలంగా ఉన్న వాళ్ళు కూడా రాజ్యం దృష్టిలో పడడానికి ఈ మధ్య కాలంలో పెరుగుతున్న రద్దీ గురించి ఆలోచిస్తున్నాడు రాఘవ. కేంద్ర సర్వీసులో కార్యదర్శిగా రిటైరయ్యాక, మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖకు అనుబంధంగా పనిచేస్తున్న సాహిత్య సాంస్కృతిక మండలి వైస్ ఛైర్మన్‌గా వ్యవహరిస్తున్నాడు రాఘవ. కేంద్రం నుంచి జిల్లాల వరకు ఓ పెద్ద అంచెలంచెల అధికారిక వ్యవస్థ అది.

ఇంత ఉన్నప్పటికీ, దీని ఉనికిని కూడా ఏనాడూ పట్టించుకోకుండా, వాళ్ళ పని వాళ్ళు చేసు కుపోయే వ్యక్తులు. వాళ్ళ సృజన పట్ల రాఘవకు అపారమైన గౌరవం.

ప్రభుత్వాలు, అధికారాలు వాటి అమలులో ఉండే పరిమితుల వల్ల కొన్ని గౌరవానికి అంగీకరించ బడకపోవచ్చు. విషయం అదికూడా కాదు. అస్సలు రాజ్యపక్షంగా సృజనరంగ ధర్మకర్తల హోదాలో మేమంటూ ఒకరం ఉన్నామనే స్పృహ కూడా లేకుండా మమ్మల్ని పట్టించుకోకుండా, మా దృష్టిలో తమ సృజన కూడా పడాలనుకోకుండా, కొందరు తమ పనిని నిర్నిమిత్తంగా చేసుకోవడం మాత్రం వ్యక్తిగతంగా రాఘవకు అంతరాంతరాలలో ఆనందమైన ఆత్మతృప్తి కలిగించే విషయం.

వర్షం మొదలుకావడంతో కిటికీ గ్లాస్ ముందున్న కర్టన్ మూసి, రిసెప్షన్‌కు ఫోన్ చేసి కాఫీ పంపమని చెప్పాడు.

జనార్దన దగ్గరనుండి వచ్చిన చిన్న మెసేజ్, ఎంతగా తన దృష్టిని మరల్చింది? దాని గురించే తాను ఆలోచిస్తున్నాడు. దాన్ని తాను అందుకున్న సమయాన్ని, తానున్న సందర్భంతో సరిపోల్చడానికి అతను ప్రయత్నిస్తున్నాడు.

జీవితంలో 'డ్రామా' మరీ ఇంత పొందికగా కుదురుకుంటుందా! అని తలపోతలకు లోనవుతున్నాడు రాఘవ. నిజమే, బ్యాలెన్స్ అనేది ఇలాగే కనుక లేకపోతే మన ప్రమేయంతో పనిలేకుండా పరిస్థితులు మన నియంత్రణను విదిలించుకొని మరీ మనల్ని కూడా ఏదో ఒక పక్కకు అవి ఈడ్చుకు పోవూ...అయినా ఇంత సుదీర్ఘమైన సర్వీస్‌లో కేవలం ప్రేక్షక పాత్రకే పరిమితమైన సందర్భాలు ఎన్నిలేవు కనుక...!

అయినా అస్సలు ఏ మాత్రం పొంతన కనపడదేం?!

లెజిస్లేచర్, ఎగ్జిక్యూటివ్, జ్యుడిషియరీ... దేని పట్ల గౌరవంలేనట్టుగా ఒక ప్రక్క వీరి ప్రవర్తన. ఇక పార్లమెంటరీ ప్రజాస్వామ్యంపట్ల అయితే విపరీతమైన చులకన భావం, వాళ్ళేం మనుష్యులే కానట్టు ఈ సదలింపు. కాని ప్రభుత్వ గౌరవ పురస్కారాల కోసం మాత్రం అంతులేని వెంపర్లాట. ఒక పక్క శుంఠలంటూనే, మళ్ళీ వాళ్ల లెటర్ హెడ్స్ మీదే సిఫార్సుల ఉత్తరాలు. వాళ్ళ చేతుల మీదుగానే సత్కారాలు. మరి నీ నిరసన దేనిపట్ల? అయినా అస్సలు ఇటువంటి గౌరవ పురస్కారాలను నిజానికి ప్రజలు పట్టించుకుంటారా? ఏమో అనుమానమే...!

కాఫీ, కాలింగ్ బెల్ రూపంలో శబ్దం చేసి ఆలోచన్ని భగ్నం చేసింది. ఆ వర్షం పడుతున్న సాయంకాలం ఒంటరిగా హోటల్ గదిలో కూర్చొని తాగుతున్న కాఫీ అనుభవం అద్భుతంగా ఉంది.

కానీ, కొంతసేపటిగా ఒక పక్క నుంచి గదంతా క్రమక్రమంగా జనార్దన్ వ్యాపిస్తున్నాడు. తనకా విషయం తెలుస్తూనే వుంది. ఇప్పటికిప్పుడు జనార్దన్‌తో ఏదో ఒక సయోధ్య కుదిరితే తప్ప, తనా గదిలో సౌకర్యంగా కూర్చోవడం కష్టమని పిస్తున్నది. లేదంటే, అతని ఆక్రమణతో తానొక మూలకు నెట్టివేయబడతానని అర్థమవుతూనే ఉంది.

బహుశా వాళ్ళ పెరట్లోని బావి దగ్గరనుంచే జనార్దన్ నాకీ ఎస్ఎంఎస్ ఇచ్చి ఉంటాడు. ఇప్పుడు తాను బందరు - బెజవాడ రోడ్డుమీద ప్రయాణిస్తూ ఏ పామర్రు - ఉయ్యూరు మధ్యో ఉండి వుంటాడు. కానీ అతడు బెంగుళూరులో ఉన్న నన్నిక్కడ, ఈ సెంట్రల్ ఎయిర్ కండీషన్డ్ గదిలో ఆసాంతం ఆక్రమించేస్తున్నాడు.

నిజమే కావచ్చు. ప్రతిదీ అంతగా లోపలికి తీసుకోవడం అంత అవసరమా? పట్టనట్లు ప్రవర్తించడం చాతనవును. హోదాలు అందుకు బహుబేషుగ్గా పనికి వస్తాయి. కాని ఇంత చిన్న జీవితంలో అంత కృతకమయితే ఎలా...కొంతైనా నా స్వంత

మంటూ నిర్మలంగా నిలుపుకోవద్దూ?

"సిగ్గుతో చితికి పోతున్నానురా రాఘవా" అంటాడు, అదేదో ఆంగ్ల నాటకంలో పదేపదే రిపీటయ్యే ఫేమస్ డైలాగ్ మాదిరిగా...మరో మార్గం లేదు. జనార్దన్‌ను మళ్ళీ మాట్లాడిస్తేనే ఇప్పుడీ వత్తిడి కొంతైనా తగ్గుతుంది.

గదిలో లైటు వెలిగింది.

మెయిల్‌లో నుంచి జనార్దన్...

"రాఘవ ...

నా ఈ యూరప్ పర్యటన మరోవారంలో పూర్తికావల్సి ఉంది. ముందుగా నిర్ణయించిన కార్యక్రమాలు అన్నీ అనుకున్నట్టుగానే జరిగి పోయాయి. అంచెలంచెలుగా ఇప్పటివరకూ ఎదుగుతూ వచ్చిన నా ప్రతిష్టకు పరాకాష్ట ఇక్కడ లండన్‌లో నాకు జరిగిన పౌర సన్మానం అదే బ్లాక్ అండ్ వైట్ రోజుల్లో అయితే అక్కడికి వచ్చాక ఈ ఫోటోలు మన పత్రికలకు ఇవ్వాల్సి వచ్చేది.

ఇప్పుడు కార్యక్రమం పూర్తి అయ్యాక కళా మందిరాల మెట్లు దిగుతుండగానే నెట్లో లైవ్! కానీ ఎంత వేగంగా ఎంత ఎక్కువ చూపిస్తున్నారో, అంతే వేగంగా అన్నీ మర్చిపోతున్నారనుకో... అది వేరే సంగతి.

హైస్కూల్లో చదువుతున్న రోజుల్లో ఒకసారి నాన్న చెప్పారు, ఎమ్మెస్ సుబ్బలక్ష్మి కచ్చేరి విని ఆ పరవశంలో ఆమెను అప్పటి ప్రైమ్ మినిస్టర్ జవహర్‌లాల్ నెహ్రూ ఆర్తిగా హత్తుకున్న ఫొటో ఒకటి అప్పట్లో పేపర్లో వేశారట. ఎక్కడ ఢిల్లీ... ఎక్కడ కృష్ణాజిల్లాలోని చిన్న ఊళ్ళో స్కూల్ టీచర్? 'ఇమేజెస్' ద్వారా ఒక మూడ్ సుదూర ప్రాంతాలకు సైతం ట్రాన్స్‌మిట్ కావటం గురించి చెబుతున్నాను. అటువంటివి చూసినప్పుడు మనలో కలిగే రసాయనిక చర్య, దాని ప్రభావం, ఆయా వ్యక్తుల పట్ల ఎంత గౌరవాన్ని కలిగించకపోతే ఆయన మనస్సు లోని ఆ ముద్రను మళ్ళీ నాకు బదిలీ చేస్తారు? సరే, ఇప్పుడు దేన్ని చూసినా మనకేం అన్పించడం లేదనుకో...ఒకవేళ అటువంటి ఫీలింగ్స్ ఏవో కొన్ని సందర్భాలలో ఉన్నాయనుకున్నా అవి తాత్కాలికమే...!

ఫ్లైట్‌లో ఉన్నాను. లండన్ నుంచి మాస్కో వెళుతున్నాను. నాతోపాటు వచ్చిన మన బృందమంతా ఈ ఉదయం తిరుగు ప్రయాణమయ్యారు. మా పెద్ద చెల్లి కొడుకు వినోద్ మాస్కోలో అసోసియేట్ ప్రెస్ (ఎపి) లో పనిచేస్తున్నాడు. వాడికి ఈమధ్య కూతురు పుట్టింది. వచ్చి వెళ్ళమని అడిగాడు. దాంతో ఇప్పుడు ఈ ప్రయాణం. ఇక్కడొక




నాలుగు రోజులు ఉండి వచ్చేలా ప్లాన్ చేసుకున్నాను. దిగాల్సిన టైం వచ్చిందనుకుంటా మళ్ళీ దీన్ని పూర్తి చేస్తాను...!"

మెయిల్ చదవడం పూర్తిచేసి రాఘవ కాసేపు గదిలో పచార్లు చేశాడు. దానికి కొనసాగింపుగా ఆ తర్వాత మాస్కో ఎయిర్‌పోర్టు లాంజ్ నుంచి అతను పంపిన మెయిల్‌ను వెంటనే చదవలేదు. ల్యాప్‌టాప్ స్క్రీన్ మీద అప్పటివరకు చదివిన మెయిల్‌తోపాటు పంపిన ఫొటో ఉంది. లండన్ పార్లమెంట్ స్క్వేర్ సమీపంలోని చర్చి రోడ్‌లో టౌన్ హాల్లో జరిగిన సభలో జనార్దన్‌కు జరిగిన పౌర సన్మానం ఫొటో అది. సిటీ మేయర్, ఇండియన్ ఎంబసీ అధికారి, అక్కడి తెలుగు సంఘం అధ్యక్షులు తనతోపాటు ఫొటోలో ఉన్నారు. శాలువాతో ఉన్న జనార్దన్ చేతిలో సన్మాన పత్రం, మొమెంటో. జనార్దన్ పొట్ట కొంచెం ముందుకు వస్తే, జుట్టు చాలా వెనక్కి వెళ్ళింది. మీసాలకు వేసిన రంగు వాటి మొదళ్ళ తెలుపును దాచలేక పోతున్నది.

రాఘవకు అసహనంగా ఉంది. గదిలో పచార్లు ఆపి ఫోటోవైపు చూస్తే స్క్రీన్ ఆఫ్ అయి ఉంది. ఇంటర్‌కమ్‌లో ఫుడ్ ఆర్డర్ చేసి, బెడ్ పక్కన ఉన్న కబోర్డ్ తీసి నిన్న మిగిలిన డ్రింక్ బాటిల్ బయటకు తీశాడు. మొదటినుంచీ అతనిది ఒక పెగ్గు పరిమితి. అది కూడా సోషల్ లైఫ్ కోసం మొదలు పెట్టింది.

టివి ఆన్ చేసి తెలుగు ఛానళ్ళ కోసం వెతుకుతుంటే 'మిస్సమ్మ' సినిమా కన్పించింది. సినిమా చూస్తూ నెమ్మదిగా భోజనం కూడా ముగించి, లాంజ్‌లో కాసేపు పచార్లు చేసి రూం క్లీనింగ్ అయిపోయాక లోపలికి వచ్చాడు. ల్యాప్ ట్యాప్ చేతిలో

తీసుకుంటే మళ్ళీ స్క్రీన్ మీద అదే ఫొటో.

జనార్దన్‌కు ఎందుకింత గౌరవం? నిజానికి ఆ ప్రశ్నకు వేరెవరో కాదు, బహుశా తానే జవాబు చెప్పలేకపోవచ్చు. పాతికేళ్ళకాలంలో నగర సాంస్కృతిక రంగంలో చూస్తూ చూస్తూ జనార్దన్ ప్రముఖుడై, ప్రతివారికి తలలోనాలుకై పోయాడు. ఎంతగా అంటే ప్రభుత్వ ప్రముఖులు ఉన్న చోట ఒకస్థాయి భద్రతాఆంక్షలు అతని రాకపోకలకు వర్తించనంతగా! పోనీ తన ఏరియా ఇది అని చెప్పడానికి ఏదైనాఉందాఅంటే, అలాకూడా ఏమీ లేదు.

అయినప్పటికి, నగర సాంస్కృతిక సమయాలలో అతనొక సంధ్యా వందనం

హైస్కూల్ వరకూ రాఘవ, జనార్దన్ కలిసి చదువుకున్నారు. ఇద్దరూ ఆప్తమిత్రులు. ఆ తర్వాత పైచదువులు, సర్వీసుల్లో చెరోదారి అయినా, ఇన్నాళ్ళ తర్వాత కూడా ఇప్పటికీ కలిసినప్పుడు వారి మధ్య ఉన్నది బాల్య స్నేహ స్పర్శే. రాజధాని నగరంలో ఓ కేంద్ర ప్రభుత్వ సంస్థలో ఆడిటర్‌గా సర్వీసులో స్థిరపడ్డాడు. మొదట్లో కొంచెంలో ఉన్న తృప్తిని వెదుక్కోవడంలో ఉన్న ఆనందాన్ని ఆస్వాదిస్తూ ఉండేవాడు. రాఘవ వద్ద దాన్ని పంచుకునే వాడు కూడా. ఆ తర్వాత ఒక సాంస్కృతిక సంస్థను ప్రారంభించి క్రమంగా బిజీ అయి పోయాడు. తన ఇప్పటి ఆరంభమది. అయితే ఈ ఆద్యంతాల మధ్య తనేం చేశాడు అనేది, ఆ స్నేహితుల మధ్య వారు కలిసినప్పుడు ముచ్చట్లు గానే మిగిలేది తప్ప, దాన్ని దాటి అది లోతుల్లోకి వెళ్లిన సందర్భాలు కూడా పెద్దగా ఉండేవి కావు.

వారి ఉద్యోగాల్లో, హోదాల్లో, గౌరవాల్లో, చూపుల్లో అంతరం ఉన్నప్పటికీ వారిద్దరి కలయిక వద్దకు వచ్చేసరికి ఒకరిని ఒకరు అంగీకరించుకోవడానికి వారొక మీటింగ్ పాయింట్‌ను ఎంచుకున్నారేమో అనిపిస్తుంది. ఎందుకుంటే దాన్లో తప్పొప్పుల్ని చూడ్డం ఉండదు. ఒకవేళ ఉన్నప్పటికీ, ఉంటే అది వారిద్దరిమధ్య వ్యవహారంగానే ఉండేదేమో...! కనుక వివరం బయటకు తెలియదు. జనార్దన్ సంస్థ కార్యరంగంలో రాఘవకు సముచిత గౌరవం ఉండేది. అది బయటకు తెలిసేది. కానీ రాఘవ నుంచి జనార్దన్‌కు కలిగే ప్రయోజనం ఇదీ అని మాత్రం బయటకు తెలిసేది కాదు. అలాగని అటువంటిది ఒకటి అస్సలు ఉందో లేదో కూడా తెలియదు. వారి మధ్య 'కెమిస్ట్రీ' అలా అమిరింది.

అయితే ఇప్పుడు జనార్దన్ లండన్ టూరు మధ్య నుండి, ఉన్నటుండి ఎమోషనల్ అయిపోయాడు. వచ్చాక అతను రాఘవను కలవలేదు. కానీ అతనితో ఎప్పటికప్పుడు 'టచ్' లోనే ఉన్నాడు. బాల్యమిత్రుడు కనుక తనతో మాత్రం దాపరికం లేకుండా ఉన్నది ఉన్నట్టే మాట్లాడుతున్నాడు. ఎందుకో తనకు తానే "హ్యూమిలేట్' అవుతూ, కుపితుడు అవుతున్నాడు. అయితే జనార్దన్ తీసుకున్న 'యూటర్న్' రాఘవకు కొరుకుడుపడ్డం లేదు.

దీనంతటికీ ఇన్నాళ్లూ తనని 'పార్టీ'ని చేసి ఉన్నట్టుండి మొదలుపెట్టిన ఈ కొత్తధోరణి వల్ల తనుగాని రాఘవను కించపరుస్తున్నాడేమో అనే ఇంగితం కూడా ఇక అక్కర్లేదనే బండతనానికేదో అతను వచ్చినట్లున్నాడు. భావోద్వేగాలు ఇక దాచుకోలేనక్కర్లేనివనే కొత్త వైఖరి ఏదో అతన్లో మొదలయింది.

నడుం వాల్చిన రాఘవ లేచి మంచం మీదే కూర్చుని ల్యాప్‌టాప్ ఒళ్ళో పెట్టుకున్నాడు. మాస్కో ఎయిర్‌పోర్టు లాంజ్ నుంచి జనార్దన్ పంపిన మెయిల్ తీశాడు.

ఇదీ దాని సారాంశం...

"ఇప్పుడే ఇక్కడ దిగాను. నన్ను రిసీవ్ చేసుకోవడానికి రావల్సిన మా మేనల్లుడు వినోద్ - వాడు ఎయిర్‌పోర్టులోనే డ్యూటీలో ఉన్నాడు ఇక్కడ డ్యూటీ ఏంటి అంటే "యూ కమ్ డౌన్ మావయ్యా, వచ్చాక చెప్తాను" అంటూ ఫోన్ కట్ చేశాడు. చూద్దును కదా, ఎరైవల్ బ్లాక్‌లో వందల సంఖ్యలో జర్నలిస్టులు, మీడియా యూనిట్లు. లగేజ్ రావడానికి టైం పడుతుంది, ఎయిర్‌పోర్టులో ఎమర్జన్సీ ఎలర్ట్ ఉంది, లాంజ్‌లో వెయిట్ చేయండన్నారు. కూర్చున్నాను. లాంజ్ పక్కనే ఒక ఫ్లైట్ దిగి మరొక ఫ్లైట్ ఎక్కడానికి కనిపెట్టే ట్రాన్సిట్ ఏరియా ఉంది. అందులో ఆడా మగా పిల్లా జల్లా ఓ పాతిక, ముప్పై మంది వరకు ఉన్నారు. అక్కడే ఉన్న కాఫీ కియోస్క్‌లో కాఫీ తీసుకుంటున్నాను. ఇంతలో ట్రాన్సిట్ ఏరియావద్ద సడన్‌గా సెక్యూరిటీ పెరిగింది.

జరుగుతున్నది ఏమిటో అర్థం కాలేదు.

ఇంతలో లోపల ఉన్న వాళ్ళందర్నీ వాళ్ళ లగేజీతో సహా మేమున్న చోటికి మార్చారు. సీనియర్ పోలీస్ అథార్టీలాగ కన్పిస్తున్న ఇద్దరు, ఒక సివిల్ డ్రస్‌లో ఉన్న ఆ వ్యక్తి ట్రాన్సిట్ ఏరియాలోకి వెళ్ళాడు. లోపల మిగిలిపోయిన ఒకే ఒక్క పాసెంజర్‌తో వాళ్ళు మాట్లాడుతున్నారు. గ్లాస్ ప్యానల్స్ లోంచి బయటకు కన్పిస్తూనే ఉంది.

కొంపతీసి వీడేమన్నా టెర్రరిస్టా...గుండె గుభేలుమంది.

ఇంతలో ఫోన్ మోగింది. ఫోన్లో మా వినోద్ గాడు...

"ఏరా?" అన్నా దిగులుగా...

"మావయ్యా, ఎక్కడున్నావ్? ఎరైవల్ లాంజ్ లోనేనా?"

"అవును ఏం...?"

"దాని పక్కనే ట్రాన్సిట్ ఏరియా అని ఉంది. బయట బోర్డు కూడా ఉంటుంది".

"చూస్తున్నాన్లేరా...ఇంతకీ ఎవడు లోపల ఉన్నది?

"ఏంటి?! తనని నువ్వు చూశావా?"

కంగారు పడ్డాను, వాడి హడావిడికి.

"అవును ఏం...ఉండు, చూసి చెప్తా...కుర్రాడేరా ముప్పై ఉంటాయేమో...ఇప్పుడు ఓ ముగ్గురు లోపలికి వెళ్ళారు. వాళ్ళతో వాడు సోఫాలో కాలు మీద కాలేసుకుని మరీ, మొక్కజొన్న పొత్తులు తింటూ మాట్లాడుతున్నాడు".

"మావయ్యా ప్లీజ్, అక్కడేం జరుగుతోందో నాకు చెబుతూ ఉండు. నేను లైన్లోనే ఉంటా..."

"ఇంతకీ ఎవరతను?"

"ఎడ్వర్డ్...అమెరికన్ సెక్యూరిటీ సీక్రెట్స్ లీక్ చేసిన ఎడ్వర్డ్ స్నోడెన్. అక్కణ్నించి అరెస్టు తప్పించుకోవడానికి, హాంకాంగ్ మీదుగా మాస్కో వచ్చాడు".

"ఎడ్వర్డా?"

ఇంతలో ఓ పోలీసు అధికారి నా దగ్గరకొచ్చి నేను ఫోన్ పట్టుకున్న చేతిని, తన చేతిలోని రూళ్ళ కర్రతో నెమ్మదిగా తాకాడు.

అంతే, నా ఫోన్ స్విచ్ ఆఫ్ అయిపోయింది.

* * *

ఇదంతా వేసవిలో జరిగింది.

అదే ఏడాది డిశెంబరులో రాఘవ తన పన్లు మీద హైదరాబాద్ వచ్చి బేగంపేట దగ్గర్లోని మంజీర గెస్ట్‌హౌస్‌లో ఉన్నాడు. వస్తానంటే, రమ్మంటే జనార్దన వెళ్ళి కలిశాడు. ఇద్దరూ రాత్రి లాన్స్‌లో కూర్చున్నాము. పిచ్చాపాటి అయ్యాక...

జనార్దన మళ్ళీ మాస్కో ఎయిర్‌పోర్టు 'ట్రాన్సిట్ ఏరియా' నుంచి మొదలు పెట్టాడు.

"అందులోనే వాడు ఐదు వారాలు ఉన్నాట్ట! ఏంటి రాఘవా ఇది?! మొన్న అక్టోబరులో వాళ్ళ నాన్న అక్కడికి వచ్చి వకీల్ని కలిశాడు. తండ్రీ కొడుకుల మధ్య పెద్దగా సంబంధాలు లేవట. మావాడు మళ్ళీ అమెరికా రాకపోవచ్చు. తను మళ్ళీ ఇలాంటివి చేయకుండా ఉంటే బావుణ్ణు. ఇక్కడ క్షేమంగా ఆరోగ్యంగా ఉంటే చాలు అన్నాడని



ఎడ్వర్డ్ స్నోడెన్ : అమెరికా గూఢచార వ్యవస్థ నిఘానేత్రాల గుట్టు బయటపెట్టిన 31 ఏళ్ళ కార్యకర్త

చదివాను. ఇప్పుడు రష్యా అతనికి ఆశ్రయ మిచ్చింది".

రాఘవ మౌనంగా వింటున్నాడు.

'ఏంటో నాకైతే వాడు నన్ను ఆవహించే సినట్లు అనిపిస్తుంది. రాఘవా. చాలా డిస్టర్బ్ చేస్తు న్నాడు. ఒంటరిగా ఉన్నప్పుడు మరీనూ. అవునూ వాడి దెబ్బకి అమెరికా బిక్కచచ్చి పోలేదూ?నాకైతే ఎన్నో వేల యోజనాల ప్రయాణాన్ని వాడు ఒకే ఒక్క అడుగులో పూర్తి చేశాడనిపిస్తుంది."

ఆ రాత్రి అక్కడే భోంచేసి వెళ్ళాడు జనార్దన.

* * *

మళ్ళీ ఈ మధ్య ఢిల్లీ నుంచి రాఘవ బెంగుళూరు బయల్దేరడానికి కొద్ది రోజులు ముందు జనార్దన ఫోన్ చేశాడు.

"వాడి ముందు సిగ్గుతో చితికి పోతున్నానురా రాఘవా, నావల్ల కావట్లేదు. ఈ జంజాటం అంతా వదిలించుకోవడానికి నిర్ణయించుకున్నాను. తేలిక పడదామనుకుంటున్నాను ఇప్పుడు కొత్తగా నేనేం చేయలేకపోతున్నాను. మళ్ళీ పాత మనిషిని కావడమే నేను చేయగల్గిన కొత్తపని అన్పిస్తుంది. వెంటనే, త్వరలోనే అది చేస్తాను. లండన్‌లో నాకి చ్చిన పురస్కారాన్ని మన ఊళ్ళో మా ఇంటి పెరట్లో పాడుపడ్డ బావిలో వదులుతున్నాను!"

వినడం తప్ప జనార్దన్ మాటలకు రాఘవ ఈ మధ్య బదులు చెప్పడం లేదు.

ఇంతలో ఇదిగో ఇప్పుడీ ఎస్ఎంఎస్.

రచనా కాలం : డిసెంబర్, 2014

# కొత్త సినిమా




ఓ రోజు సాయంకాలం ఇంజనీరింగు చదువుతున్న మా మనవడు నా దగ్గరకు వచ్చి, "తాతయ్య... తాతయ్యా! కొత్త సినిమా వచ్చింది. ఫలానా వాడు హీరో. నా అభిమాన హీరో. టిక్కెట్లు తెస్తాను, వస్తావా?" అన్నాడు.

"నావల్ల కాదురా బాబూ! నేను చదువు కోవాలి. రాసుకోవాలి" అన్నాను విసుగ్గా.

"నీ రాతకోతలు ఎప్పుడూ ఉండేవేగా! ముసలి వయస్సులో మనస్సుకి మధ్య మధ్య కొంత విశ్రాంతి ఉండాలి. కాబట్టి నువ్వు తప్పకుండా రావాలి" అన్నాడు మా మనవడు, నన్ను బలవంతం చేస్తూ.

"రాలేనురా బాబూ! పాటలు వచ్చినప్పుడు డిజిటల్ సౌండుతో నా చెవులు చిల్లులు పడిపోతు న్నాయి. గుండె దడదడలాడి పోతోంది. భరించడం కష్టం!" అన్నాను.

"నువ్వు ఎప్పుడూ చెవులు మూసుకొనేగా పాటలు వినేది! అలాగే విందువుగాని. ఇక నువ్వు అడ్డు చెప్పొద్దు. నేను వెళ్ళి క్షణంలో టిక్కెట్లు తెచ్చేస్తాను" అని మోటర్ బైక్ మీద రివ్వున వెళ్ళి పోయాడు.

బలవంతం చేస్తున్నాడు కుర్రవెధవ. రానంటే బాధపడతాడేమో! ఎంతో మొహమాటంగా నా మనస్సు మొదట ఒప్పుకుంది. వాడు టిక్కెట్లు తెచ్చేలోగా నా అంతరంగంలో ఎన్నో ఆలోచనలు...

పూర్వం సినిమాలు, బ్లాక్ అండ్ వైట్ సిని మాలే అయినా, ఎంత గొప్పగా ఉండేవి! టెక్నికల్ గా ఎంతో అభివృద్ధి సాధించిన నేటి కలర్ సినిమా లు ఎంతో చెత్తగా ఉంటున్నాయి! ఎన్టీఆర్, ఏఎన్నార్ లు హీరోలుగా ఉన్నప్పుడు ఎంతో అద్భు తంగా ఉండేవి సినిమాలు! నటన, వాచకాభినయం ఎంతో ఉన్నతంగా ఉండేవి! ఎంత హుందాగా ఉండేవని ఆ సినిమాలు! తరువాత వచ్చిన కృష్ణ, శోభన్‌బాబు లు కూడా ఆ ఉన్నత సంస్కృతిని నిల బెట్టారు. స్వచ్ఛమైన నాగరికమైన తెలుగు భాష మాటలాడే వారు. ఆ పిమ్మట వచ్చిన హీరోలు పూర్వం నీచ పాత్రలు మాట్లాడే భాషను (అంటే జానపద భాషను లేదా గ్రామీణ భాషను) మాట్లాడటం మొదలు పెట్టారు. "అడు...ఈడు...ఒత్తాడు... ఎల్తాడు... ఎలిపోద్ది...ఒచ్చేద్ది...కూకో... లెగు... ఏంటి?" ఇత్యాది నేటి హీరోల భాష నా మెదడులో మెదిలి మనసంతా వికలమైపోయింది. పైగా పూర్వం భానుమతి, శ్రీరంజని, అంజలీదేవి, సావిత్రి, జమున, వాణిశ్రీ మొదలైన హీరోయిన్లు ఎంతో హుందాగా వస్త్రధారణ చేసేవాళ్ళు. వాళ్ళని చూస్తే మనసులో ఒక విధమైన గౌరవ భావం కలిగేది. ఈనాటి హీరోయిన్ల డ్రస్సులు, 'అందాల ఆరబోతలు' తలచుకుంటే ఒళ్ళంతా కంపర మెత్తు తోంది అని నామనస్సు రోదిస్తోంది...

ఇంతలో మా మనవడు ఇంటిల్లపాదికీ టిక్కెట్లు తీసికొని ఈల వేసుకుంటూ హుషారుగా వచ్చాడు.

"లే...తాతయ్యా! వెడదాం! చాలా గొప్ప సినిమా!"

నేను మౌనంగా ఉండిపోయాను.

నాలో కదలిక లేకపోవడం చూసి వాడికి ఒళ్ళు మండింది.

"వస్తున్నావా లేదా?" అని గద్దించాడు మా మనవడు.

నాకు అరికాలి మంట నెత్తికెక్కింది. వెంటనే పెద్ద గొంతుకతో..."ఏంటొచ్చేది నా తొక్కలో సిని మా! నేను రాను! ఏం పీక్కుంటావో పీక్కో!" అని అరిచాను.

మా మనవడు నిర్ఘాంతపోయాడు.

"ఏమిటి తాతయ్యా! అలా మాట్లాడు తున్నావ్? యూనివర్శిటీలో 30ఏళ్ళు తెలుగు పాఠా లు చెప్పిన ప్రొఫెసరేనా ఇలా మాట్లాడేది!" అన్నాడు.

"అవును! తెలుగు ప్రొఫెసర్నే! నీవు తీసుకెళ్ళే కొత్త సినిమాలో నీ అభిమాన హీరో ఇలాగే మాట్లా డుతాడు. వాడి మాయదారి భాష నేను భరించ లేను. అందుకే రావడం లేదు!" అని కరాఖండిగా చెప్పేశాను.

మా మనవడు ముఖం చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయాడు.

నేను నిట్టూరుస్తూ కుర్చీలో కూలబడి పోయాను.

తంగిరాల సుబ్బారావు
09945422742

విహారి...! తెలుగు సాహితీ లోకానికి దాదాపు అర్ధశతాబ్ది పైచిలుకు కాలంగా ఈ పేరు చిరపరిచితం. 12 కథా సంపుటాలు, 7 నవలలు, 6 విమర్శనాత్మక వ్యాస సంపుటులు, ఒక సాహిత్య కదంబం, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథా కావ్య సంపుటి, మరెన్నో ఇతర రచనల తోబాటు శ్రీపద చిత్ర రామాయణాన్ని ఛందస్సుందర పద్య కావ్యంగా ఆరు కాండాలుగా రాయడం వారి సాహితీ తపస్సుకు శిఖరాయమానమైన దీపం. అనేక అవార్డులు వరించాయి. వారి రచనలపై పిహెచ్.డిలు, ఎమ్.ఫిల్స్ పరిశోధనలు జరిగాయి, జరుగుతున్నాయి. తెలుగు శాఖలో విశ్వ విద్యాలయాలలో పనిచేస్తున్నవారు కూడా చేయలేనంత కృషి, ఎల్.ఐ.సి.హౌసింగ్ ఫైనాన్స్ కంపెనీ నుండి జనరల్ మేనేజర్‌గా పదవిలో ఉన్నప్పుడు, పదవీ విరమణ తర్వాత మరింతగా తెలుగు సాహితీ రంగ విహారం చేస్తున్న ఈ సౌజన్య సాహితీమూర్తి నిరంతరంగా సృష్టిస్తున్న కథా ప్రవాహంలో 'వి'గతం ఒక అద్భుత కెరటంలా కన్పిస్తుంది,

# బ్రతుకు చదువుకు దిక్సూచి

**'విహారి'** కథల్లో ఒక తాత్విక స్ఫురణ, ఒక ప్రత్యేకత. **'వి'గతం** 'చినుకు' పత్రికలో వచ్చినప్పుడే అందరి దృష్టిని ఆకర్షించింది. ప్రథమ పురుషలో సాగిన ఈ కథ మన ముందు అనేకానేక సత్యాల గురించి ప్రశ్నల్ని సంధిస్తుంది. మూర్తి మానసిక ప్రశాంతత కోసం అమృతసర్, ఢిల్లీ తిరగటానికి వెళ్లాడు. అమృతసర్‌లో మన్‌జీత్ కౌర్, ఒకనాటి కొలీగ్. ఆమెని చాలా కాలం తర్వాత కలవటం...స్వర్ణదేవాలయం, వాఘా హద్దు, జలియన్‌వాలాబాగ్...ఇవన్నీ సరే! మన్‌జీత్ తండ్రిలేని కుటుంబం కోసం నిలబడింది. చివరికి ఆస్తికోసం రక్తబంధువులు రక్తం పిండేస్తున్న సందర్భం!

వీడ్కోలు పలికేటప్పుడు ఆమె మాట... "గతంలో బతక్కు, ప్రస్తుతంలో జీవించు" జీవితానికి గొప్ప వాక్యం.

ఢిల్లీలో ఆత్మీయుడు ప్రవీణ్ కుటుంబ పరిచయం. చివరిగా అతని మాట..."ఘనంగా కావాలని మన పిల్లలని చెడ్డవాళ్ళని చేసుకుంటామా?" ఈ ప్రశ్న మనందరికీ వేసిందే! రైల్లో వెంకటరెడ్డి తమ్ముడి గురించి మొదలై కొడుకు సుందరం దాకా ఆలోచనల దాడి.

"ఎవ్వరి చేతా ప్రేమించబడకుండా ఎందుకు బతుకుతున్నాం?" మన్‌జీత్‌ది కాదు ఈ ప్రశ్న, మనలో చాలామందికి అనుభవంలో ఉన్నదే!

ఎవరికెవరు ఈ లోకంలో ఎవరికి తెలుసు? ఏ దారెటు పోతుందో ఎవరికీ తెలియదు? మానసిక ప్రశాంతత ఎక్కడుంది? ఎన్ని కిలోలు ఏ వూర్లో, ఏ గుళ్ళో దొరుకుతుంది? పిల్లలకి చదువు రాకపోవటానికి కారణం తల్లిదండ్రుల నిర్లక్ష్యమా? అసలీ సంరక్షణ సంతానాన్ని తీర్చి దిద్దుతుందా? సమానావకాశాలు, సమాన పోషణ, సమాన ఆదరణ అందించినా సంతానమంతా పెరిగి ఒకే స్థాయి అభ్యుదయాన్నీ, ఆనందాన్నీ సాధించగలరా? ఇలాంటి తాత్వికమైన ప్రశ్నలకు ఓ పరిష్కారం. బాధలు కష్టాలు అర్థం చేసుకుంటే సరిపోదు. అంతటితో ఆగి పోకూడదు. మనల్ని మనం ఎలా మార్చుకోవాలో తెలుసుకోవాలి, ఇది ఏ వ్యక్తిత్వ వికాస పాఠమో కాదు, తరగతి గదిలో కాదు, ఇది విహారి కథా పాఠం.

చివరికి అతను ఏం చేశాడు?

"ఇప్పుడు ఏడుస్తూ, నన్ను శపిస్తూ, నా తదనంతరం సుఖపడటానికి ఎందుకు ఎదురు చూడాలి వీళ్ళంతా" అనుకుని పెన్షన్ భరోసా, ఆనందం డిగ్నిటీ హోం ఆదరణతో ప్రశాంతతలోకి అడుగుపెట్టాడు. "మనసే ప్రశాంతతకి పుట్టిల్లు కదా!" అంటారు రచయిత. బతుకు పయనంలో విలువల నావకి దిక్సూచి ఇది!

గీతోపదేశంలాంటి **'విగతం'** కథతో పాటు 16 కథలున్నాయి. ఇతివృత్తాలన్నీ మధ్య తరగతికి చెందిన వారివే! వారి వాతావరణం, వారి పాత్రలు, కలలు, కల్పనలు, ఆర్థిక సమస్యల మధ్య ఊపిరాడని మానవ సంబంధాలు.

సాధారణంగా సామాన్యాంశాలుగా నిత్యమూ కన్పించే వ్యవహారాల వెనుక దాగిన రహస్యాలు (నీటిమబ్బు), నిస్పృహతో మొదలై నిష్ఠూరాలు దాటుకుని, కినుకలో ప్రవేశించి కోపంలోకి

**డా॥సి.భవానీ దేవి**

# పుస్తక సమీక్ష

'వి' గతం

విహారి కథలు



చినుకు

**'వి'గతం**

**విహారి కథలు**

**పుటలు : 132**

**మూల్యం : రూ.100/-**

**ప్రతులకు :**

**చినుకు పబ్లికేషన్స్**

**గాంధీనగర్, విజయవాడ - 3**

**మరియు**

**అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు**




పొంగి, మిగిలి ఉన్న వివేకంలో కరిగి, చివరికి పబ్లిక్ సెక్టార్‌నీ, యాజమాన్యాన్నీ తిట్టి తిట్టి, శపించి, విరసించి, ఆనక పరస్పర సానుభూతిలో తడిసిన ఉభయులు ఉద్యోగులైనప్పుడు చెరో చోట పనిచేసే భార్యా భర్తల జీవితంలోని చేదు పరిమళాలు (పునర్మూల్యాంకనం), డబ్బుకోసం కూతుర్ని వేధించే అల్లుడి వల్ల సర్వం కోల్పోయి దుఃఖం పోటుకి గురయిన శంకరయ్య కన్నీటి వెల ఒంటిపూట భోజనాన్ని దృశ్యీకరించిన 'ఆకురాలు కాలం', గతం న స్మరామి అనే 'వాదోడు', జస్ట్ సెంటిమెంట్ చేసే విచిత్రాలు జీవితాన్ని మార్చే దారుణాలు అప్పుడప్పుడు సెంటిమెంట్, మింగుడు పడని నిజాలు (నిజానిజాలతో ముఖాముఖి), ఓటమిలోంచి గెలుపు సాధించే రాజకీయం (తెలివిచెట్టు), 'ఆడ' పిల్లగా ఆరిపోయిన వరమ్మలాంటి జీవితాలు (ఒంటరి దుఃఖం), మనుషుల్లో బతకాలనుకునే (అసలు సగం), వృద్ధాప్యంలో కావాల్సింది మనుషులు గానీ డబ్బుకాదనే 'జాడ', చికిత్సకంటే నివారణ వాంఛనీయం అనే 'సంకల్పం సగం బలం', పదిమంది కోసం ఇంటిని అర్పించే 'ఇల్లు', ఆడపిల్ల వ్యక్తిత్వ స్పృహ గురించి ఆలోచింపజేసిన 'ఈ చూపు - రేపటి వైపు'...ఇలా ప్రతి కథా చూపుడు వేలులా...మనల్ని హెచ్చరిస్తుంది. దారి చూపిస్తుందికూడా!. ఏకథా కాలక్షేపానికి రాసింది కాదు.

ఈ కథల్లో 'చిత్తగించవలెను' అనే కథ గురించి ప్రత్యేకంగా చెప్పాలి. కథా శిల్ప విధానాల్లో ఒకటైన 'కొలేజ్' నిర్మాణ పద్ధతిలో రాయబడిన ఈ కథలో 'అందరూ ఆదరించకుండా తిరస్కరిస్తున్న 'ఐదు రూపాయల నోటు' విలువ పడి పోయినందుకు ఆ నోటు మానసిక వ్యధ - ఈ కథ. ఇందులోని అంతరార్థ కథా శిల్పం చమత్కార భరితంగా ఉంటూనే ఆలోచింప జేస్తూ ఆకట్టుకుంటుంది. 'విహారి' కథాశిల్పాన్ని అధ్యయనం చేస్తే మంచి కథకులు కావచ్చునని హామీ ఇస్తుంది.

విహారి కథల్లో స్త్రీ పాత్రలేవీ అసహజంగా ఉండవు. మన చుట్టూ ఉన్న స్త్రీలే వీళ్ళు. కళ్ళొత్తుకుంటూ, కుమిలిపోతూ, ఒకచో అగ్నిలా జ్వలిస్తూ... 'విగతం'లో మన్‌జీత్, ప్రమీల, మధుమతి, 'మళ్ళీ చివరికి మొదలు' లో సుశీల, 'నీటి మబ్బులో' సీత. 'ఒంటరి దుఃఖంలో' వరమ్మ - అంతా మనకి బాగా తెలిసిన స్త్రీలలా కన్పిస్తారు. వాళ్ళల్లో మన చెల్లి, తల్లి, మరో తోటి స్త్రీలు కన్పిస్తారు. ఉద్యోగినుల బాధ 'మమత' ద్వారా 'పునర్మూల్యాంకనం'లో చెప్పారు. నాలాంటి ఉద్యోగినులకు తెలిసిన కథలు ఇలాంటివెన్నో ఉన్నాయి. స్త్రీ అస్తిత్వ ప్రకటనాన్ని పురుష ప్రపంచం భరించలేదంటూనే "ఈ చూపు రేపటి వైపు" లో ఛాయ పెళ్ళికి ముందు తనకీ భర్తకీ హెచ్.ఐ.వి. టెస్ట్ చేయించుకోవాలనే నిబంధన ఎంత వరకు ఆచరణలో సాధ్యమవుతుంది? అని రచయిత ప్రశ్నించారు. చాలామంది జీవితాలు కాలిపోతున్న సమాజానికి ఇది మంచి సందేశం. హెచ్.ఐ.వి. పాజిటివ్‌ల జీవనగాధల్ని సమాజంలో మరింతగా ప్రచారం చేస్తే ఛాయలాంటి అమ్మాయిల కోరిక ఎంత న్యాయ బద్ధమైనదో తెలుస్తుంది. 'ఒంటరి దుఃఖం' చదువుతుంటే వరమ్మపట్ల హృదయం ఆర్ద్రమై కళ్ళు చెమరుస్తాయి. స్త్రీ పాత్రలు విప్లవాన్ని ప్రకటించవు. ఉపన్యాసాలీయవు. రాజ్యాంగ సూత్రాలు చెప్పవు. స్త్రీ హృదయ ఘోషని నిశ్శబ్దంగా విన్పిస్తాయి. 'నెత్తుటి కంటే చిక్కనిది' కథలో జానకి పాత్ర ఇదే! ఈ కథలు మనలోని మానవత్వాన్ని నిద్రలేపుతాయి. కథకి సార్థక్యం అదే కదా!

విహారి భాషలోని తెలుగు నుడికారం అమ్మతనమంత కమ్మగా ఉంటుంది. కథలో లీనమయి చదువుతూ పాత్రల చేయి పట్టుకొని సాగి పోతుంటే గుండె కాగితం మీద ముద్రితమయే పంక్తులు కోకొల్లలు. ఇంత మంచి తెలుగు నుడికారం, శిల్ప చాతుర్యం, సంభాషణా నైపుణ్యం కల్గిన రచయితలు చాలా తక్కువ మందే ఉన్నారు. ఇవన్నీ కావాలని రాసినట్లుండవు. సముద్రంలో ముత్యాలుద్భవించినట్లు జీవితంలోంచి రచనలోకి అలవోకగా జారిపోయి అలరిస్తాయి.

"పొయ్యిలో పిల్లి లేస్తుందో లేదో!" / "తాడూ బొంగరమూ లేని వాడు" / "స్త్రీ పట్ల కపటత్వమే విలువ గలిగిన పితృస్వామ్య వ్యవస్థ" / "పీకలు తీసేసిన సన్నాయి బూరల్లా" / "చేసుకున్నవారికి చేసుకున్నంత" / "మన్ను తిన్న పాము" / "అగ్గిమీద గుగ్గిలం" / "గుప్పిట పట్టని రాయి" / "పులి మీద పుట్ర" / "సున్నాకు సున్నా, హళ్ళికి హళ్ళీ" / "తుమ్మల్లో పొద్దు పొడిచింది" / "జారుడు మెట్ల ఎగదీత, దిగతీత" / "ఈ పిల్ల మరీ నవసి పోస్తున్నది. దూసిన గోరింట కాడలా కనిపిస్తోంది" / "కుమ్ము పొగని కొంగున కట్టుకూర్చున్నట్టుంది" / "జీవం ఆర్చుకు పోతున్న ప్రాణి. జీవకణాల్ని కోరుతున్న సైగ" / "కనురెప్పల అంచుల మీద సన్నని నీడ పొడ" / "గాలి తాకిడికి కదిలిన తాటాకు పుట్టివి" / "ఆరిన కుంపటిలా" / "పాలల్లో ముంచి తీసిన బొగ్గులా" ఇలా తెలుగు భాషలోని కమ్మదనం, అందం విహారి కథలంతా పరుచుకొని మురిపిస్తుంది. భాషకి దూరమౌతున్న యువత ఈ కథలు చదివితే మళ్ళీ భాషమీద ప్రేమని పెంచుకోక తప్పదు.

విహారి కథకుడే కాదు కవి కూడా! తిలక్ కవిగా గుర్తింపు పొంది కథలు రాసినప్పుడు ఆ కథల్లో కవిత్వం తొంగి చూసినట్లే విహారి కథల నిండా ఉపమానాలు, రూపకాలు, ఉత్ప్రేక్షలు, కమనీయ కవితా పంక్తులు చాలా కన్పిస్తాయి.

విహారి తాత్వికత, జీవితానికి సంబంధించిన సత్య స్ఫురణ. ఎలా బతకాలి, ఎలా ఆలోచించాలి, ఎలా వెళ్ళి పోవాలి? మనిషి మనిషిగా బతకాలంటే, మనుషులకోసం, మనుషుల మధ్య నిజమైన మనిషిలా జీవించే అర్హత ఎలా వస్తుంది? మనుషుల పరిస్థితులే అన్నిటికీ కారణం అని కూడా సున్నితంగా నిరూపిస్తారు రచయిత.

'కథాశిల్పి' విహారి గారి కథల గురించి ఎంతయినా విశ్లేషణ చేయవచ్చు. అద్భుతమైన మానసిక విశ్లేషణతో సమాజాన్ని, సమాజ పరిణామాల్నీ, మానవసంబంధాల్లోని వైరుధ్యాల్నీ వడబోసి కథలుగా అందించి మానవత్వపు మేఘాల్ని భూమినిండా పరిచి అక్షర హరితాన్ని పంచి పెడుతున్న విహారిగారికీ, 'చినుకు' రాజగోపాల్‌గారికి - 'విగతం' కథా సంపుటిని అందించినందుకు కృతజ్ఞతాభివందనాలు తెల్పుతున్నాను.






# స్థిర విజయం

క.వ.న.శర్మ

13

తూర్పున వెలుగు రేఖలు విచ్చుకుంటున్నాయి. సైనికులు నది ఒడ్డుకి చేరుకుంటున్న జనాన్నీ, ఈతగాళ్ళనీ అదుపు చేస్తూ హడావిడి చేస్తున్నారు. ఆ దినం దేశంలో అతి పెద్ద ఈతల పోటీని రాజుగారు నిర్వహిస్తున్నారు. ఈదవలసిన దూరం ఎంతో పెద్దదిగాదు, కేవలం వెయ్యి బారలు. గెలిచిన ఈతగాడికిచ్చే బహుమానం పెద్దది. ఆ దేశపు సింహాసనమే, ఆనాటి పోటీలో విజేతకిచ్చే బహుమానం!

ఆ పోటీ చూడటానికి పై దేశాల నుంచి కూడా వీక్షకులు వచ్చారు. రంగురంగుల ధోవతీలు, తలపాగాలు ధరించి వచ్చారు. స్త్రీలు ఎక్కువమంది లేరు, అక్కడ కారే రక్తానికి కన్నీళ్ళు కార్చకుండా స్త్రీలు ఉండలేరన్న వాడుక మాటల కారణంగా.

**ఆ ఈతల పోటీ** నది ఒడ్డు నుంచి నది మధ్యలో ఎత్తుగా ఉన్న గుట్టదాకా. అక్కడ, ఆ గుట్ట వద్ద నది రెండు పాయలుగా చీలి గుట్ట వెనకాతల కలుస్తుంది. గుట్టమీద కోట వుంది. కోటమీద మకర ధ్వజం ఎగుర్తూ ఉంటుంది. పోటీలో గుట్ట దాకా చేరుకోవటం ఒక సాహసం. నది నిండా మొసళ్లు. పోటీదారులు తమతో ఒక బాకు తీసుకు వెళ్లవచ్చు అవసరమైతే మొసళ్ల మీద ప్రయోగించవచ్చు. గుట్టకి చేరుకున్న అదృష్టవంతుడు కోట వరకు పరిగెత్తి, కోట పైన ధ్వజాన్ని చేత్తో లేపి అందరు చూసే విధంగా ఊపాలి. ఎవరాపని చేయగలిగితే ఆనాటి నుండీ అతడే ఆ రాజ్యానికి రాజు.

పోటీకి వచ్చిన వారికి సేనాధిపతి నిబంధనలు వివరించాడు.

"పోటీలో పాల్గొనేవారు పాతిక సంవత్సరాల వయస్సు లోపలివారై ఉండాలి. ప్రభువులు నిర్ణయించిన రాచకన్యను వివాహం చేసుకోవటానికి సిద్ధపడాలి. ఆమె పట్టమహిషి అవుతుంది కనక, పోటీదారులకి అంతకుముందు వివాహం అయి ఉండరాదు. ఈ దేశ ప్రజలలో ఒకరైన రాజ కుమారులు శ్రీ వీరసేనులు కూడా పోటీలో పాల్గొంటారు. వారికి ఇరు పక్కల నిలబడి పోటీలో పాల్గొన గలిగిన వారిని, ఆరుగురిని ప్రభువులే ఎన్నిక చేసారు. వారు నీలి లంగోటీలను ధరించి ఉన్నారు. శ్రీ వీరసేనులు పసుపురంగు లంగోటి ధరించి ఉన్నారు. ఈ రెండు రంగుల లంగోటీలు ఇతర్లు ధరించరాదు. నేను నా కరవాలాన్ని గాలిలోకి లేపగానే మీరు సిద్ధంగా ఉండి, దూరంగా మీ వెనకాతల ఉన్న, నగారా మోగగానే మీరు నీటిలోకి దిగవచ్చును. నగారా మోగక ముందు నీట దిగిన వారిని సైనికులు పోటీ నుంచి తొలగిస్తారు. న్యాయనిర్ణేతగా న్యాయాధికారి వ్యవహరిస్తారు. మంత్రి వర్యులు విజేతను ప్రకటిస్తారు"

సైన్యాధిపతి కరవాలాన్ని గాలిలోకి లేపాడు. నగారా మోగింది. పోటీ మొదలైంది. ఈతగాళ్ళు కొద్ది దూరం వెళ్ళాక జనం వారి వారి పోటీదార్లను ఉత్సాహపరిచే గుంపులుగా విడిపోయారు.

ఆ పోటీ చూడటానికి ఆంధ్రదేశం నుంచి వెళ్ళిన సింగమ నాయుడు, జనాలకి దూరంగా ఓ ఇసుక తిప్పమీద ఒంటరిగా కూర్చున్న వ్యక్తిని చూసి, నిరాసక్తతని, దుఃఖపు ఛాయని నింపుకున్న అతని ముఖాన్ని చూసి అతన్ని చేరుకున్నాడు.

సింగమ నాయుడు ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళాడు. ఆ వ్యక్తి డెబ్బయ్ ఏళ్ళ వృద్ధుడై ఉంటాడని

## కథా నేపథ్యం

***19**వ దశకం (**1981-1990**) లో నేను సెంట్రల్ వాటర్ కమీషన్ ఆహ్వానం మీద మధ్యప్రదేశ్‌లోని నర్మదా సరోవర్ డామ్ ప్రాంతానికి వెళ్లాను. వారు విహారానికి నన్ను నర్మదా నది మధ్యలో ఉన్న ఒక కోటకి, ప్రభుత్వ నావలో తీసుకు వెళ్ళారు. అక్కడ, ఒక వృద్ధ రాజవంశ బంధువుని, చూసాను. ఆయన్ని "మీకు పి.యస్.రావుగారు తెల్సా?" అని అడిగాను. దానికి ఆయన "తెలుసు, ఆయన ఇక్కడ బ్రిటిష్ వారి రాజ్యాధికారి! (ప్రతినిధి)గా పని చేసారు. ఆయన మీకు తెలుసా" అని అడిగాడు. "తెలుసును. పెంద్యాల సత్యనారాయణరావుగారు మా అమ్మ మేనమావ" అని చెప్పాను.*

*అప్పుడు రాచబంధువు, రాజప్రతినిధి బంధువుకి ఓ కథ చెప్పాడు. "ఈ సింహాసనాన్ని అధిష్ఠించాలంటే మొసళ్లున్న ఈ నదిని ప్రథముడిగా ఈదాల్సి ఉండేది. అయితే పోటీలో ఎప్పుడూ యువరాజే గెల్చేవాడు, ఆశ్చర్యకరంగా" అని చెప్పారు.*

*అప్పటి నుంచి ఇప్పటి వరకు, "ఆ మాచ్ ఫిక్సింగ్ ఎట్లా జరిగి ఉంటుందా?" అని ఆలోచిస్తూ వచ్చాను. ఆ పద్ధతి తెలిస్తే దానిని వాకచక్యంతో తమ విజయానికి ఇతర్లు కూడా ఉపయోగించుకోగలరని అనుకున్నాను. ఆ విధంగా కథ మలిచాను. అయితే చరిత్రలో అటువంటి సంఘటన జరిగినట్లు ఆధారాలు లేవు. కనుక 'కొసమలుపు' పెట్టాను*

*- రచయిత*







ఊహించాడు. వ్యాయామం చేసిన వాడిలా దృఢంగా ఉన్నాడు.

"అందరూ అంత ఉత్కంఠలో పోటీని గమనిస్తుంటే మీరు ఇంత దూరంగా ఏమీ పట్టనట్టు కూర్చున్నారు. మీకు అభ్యంతరం లేకపోతే కారణం చెప్పండి" అంటూ పక్కన కూర్చున్నాడు సింగమ నాయుడు.

"కూర్చోండి, నాకు అభ్యంతరం లేదు. నాకు విజేత ఎవరో తెలుసు. అందుకని ఉత్కంఠత లేదు" అన్నాడు ఆ వృద్ధుడు.

"మీకు ముందే తెలుసా? ఎట్లా?" అని అడిగాడు నాయుడు.

"ఎన్నో తరాలుగా ఈ పోటీలో రాజకుమారులే గెలుస్తున్నారు. సామాన్యులెవరూ గెల్చిన జ్ఞాపకాలేవీ కథల్లో వినలేదు".

"ఎప్పుడూ రాజకుమారులే గెలుస్తారా? ఆశ్చర్యంగా ఉందే! అదెల్లా సాధ్యం! మీరు ఎవరు? మీకూ ఈ పోటీకీ ఏమిటి సంబంధం? ఏ సంబంధం లేకుండా వచ్చారా?"

"నా పేరు ధరమ్ సింగ్. నా పెద్ద కొడుకు ఇప్పటి ప్రభువుతో పోటీపడి మొసళ్లకి బలై పోయాడు. ఇప్పటి రాజ కుమారుడితో నా రెండో కొడుకు కొడుకు విక్రమ్ సింగ్ పోటీ పడ్తున్నాడు. వద్దంటే వినలేదు. 'నేను తప్పకుండా గెలుస్తాను తాతా' అంటూ బయల్దేరాడు. నా రెండో కొడుకు రాజుగారి సైన్యంలో కోట రక్షణాధికారి. వాడూ చెప్పి చూసాడు. వీడు వినలేదు."

"మీ వాడు గెలుస్తాడేమో...!ఆశతో దేవుడిని ప్రార్థించండి"

"ఎట్లా గెలుస్తాడు....రాజకుమారుడికి పదేళ్ళు వచ్చినప్పటి నుంచి ఈ పోటీలో గెల్చేం దుకు శిక్షణ ఇస్తున్నారు సైనికులు పక్కనే నావల్లో రక్షణ కల్పిస్తూ. రాజకుమారుడికి ఈ నది అనుపాలు అన్నీ తెలుసు. మా వాడు గజ ఈతగాడే, కానీ ఇక్కడ ఏనాడూ ఈదినవాడు కాదు. మొసళ్లని తప్పించుకుంటూనో పోరాడుతూనో ఈదాలి. అటువంటి పరిస్థితుల్లో వేగంగా ఈది గెలవటం మాట దేవుడెరుగు, చావు తప్పి కన్ను లొట్ట పోయినా ప్రాణాలతో బయటపడ్తే చాలు"

"ఈ ఇబ్బంది రాజకుమారుడికీ ఉంది కదా! ఈ పోటీలో అతనికి రక్షణ ఇస్తూ సైనికులతో నిండిన ఏ నావా కనిపించటం లేదు, చూద్దాం" అన్నాడు సింగమ నాయుడు.

"అదే నాకర్థం కాని విషయం. అయినా రాజకుమారుడే గెలుస్తాడని నాకు తెలుసు" అన్నాడు విచారంగా ధరమ్ సింగ్.

* * *

"నా తండ్రి ఎట్టి పరిస్థితుల్లోను మన పెళ్ళికి అంగీకరించడు" అంది రాజకుమారి లక్ష్మీబాయి.

"నేను ఈత పోటీలో గెలిస్తే, నేనే రాజునవుతాను. అప్పుడు మన పెళ్ళికి మీ తండ్రిగారి నుంచి అభ్యంతరం ఉండదు కదా!" అన్నాడు అంతఃపుర రక్షకుడు విక్రమ్ సింగ్.

"ఇంతవరకు రాజకుమారులే ఆ పోటీలో గెలునస్తూ వస్తున్నారు. నీ గెలుపు ఎలా సాధ్యమౌతుంది?" అని సందేహిస్తూ అడిగింది లక్ష్మీబాయి.

"ఎప్పుడూ వాళ్ళే గెలుస్తున్నారంటే అందులో ఏదో తంత్రం ఉండి ఉంటుంది. పోటీకింకా వారం ఉంది కదా, తెలుసుకుందాం. జరిగే ప్రతీదీ గమనిద్దాం" అన్నాడు విక్రమ్ సింగ్.

* * *

కోట రక్షణాధికారి తన కొడుకైన అంతఃపుర రక్షకుడికి ఆ దినం జరిగిన విశేషం చెప్పాడు.

"విక్రమ్! ఇవాళ కారాగార తలారి వచ్చి మరణ శిక్ష పడి ఆ శిక్ష అమలుకు ఇంకా సమయం ఉన్నవారిని తన దగ్గరకు పంపమని మంత్రిగారు ఆదేశించారు అని చెప్పాడు. ఆయనకు వాళ్ళతో పనేమిటో! రేపు చీకటి పడ్డాక వారిని మంత్రివర్యుల వద్దకు తీసుకు వెళ్ళటానికి తలారికి అనుమతిచ్చాను"

విక్రమ్, జరిగిన దానికి ఈతల పోటీ ఫలితానికి సంబంధం ఉండవచ్చునని ఊహించి లక్ష్మీబాయిని మంత్రి మీద ఓ కన్నేసి ఉంచమన్నాడు. రాజకుమారి తనకి నమ్మకస్తురాలైన పరిచారికను వినియోగించింది.

★ ★ ★

పరిచారిక వచ్చి రాజకుమార్తెతో చెప్పింది.

"అమ్మా! మంత్రిగారు మరణ శిక్ష పడ్డ నేరస్తులతో ఇలా అన్నారు. 'మీరు రెండు దినాల తరవాత జరగబోయే ఈతల పోటీలో రాజకుమారులైన శ్రీ వీరసేనులగారికి ఇరుపక్కల ఈదుతూ వారిని మొసళ్ళబారి నుండి కాపాడాలి. రాజకుమారులు పోటీలో నెగ్గితే మీకు మరణశిక్ష రద్దు పరిచి, ఘనంగా ధనం ఇచ్చి రాజ్యాన్ని దాటిపోయే ఏర్పాటు చేస్తాను. మీరు తెలివి తేటలు ప్రదర్శించినట్టు అనుమానం వస్తే, మీకు చావే గతి! నా వేగులు మిమ్మల్ని గమనిస్తూ ఉంటారు' అలా చెప్పారమ్మా మంత్రిగారు వారితో. వాళ్ళు మొత్తం ఆరుగురున్నారు"

రాజకుమార్తె ఆ వార్త విక్రమ్ సింగ్‌కి చేరవేసింది.

★ ★ ★

విక్రమ్ సింగ్, దానికి తగినట్టుగా వ్యూహం పన్నుతున్నాడు. వీరసేనుడి పక్కన నీలం లంగోటీలు ధరించిన నేరస్తుల మధ్య ఈదటం నిబంధనల ప్రకారం కుదరదు. అందుకని వారు పదిబారలు ముందుకు వెళ్ళే వరకు ఆగి వారి వెనుకగా ఈదటం మొదలు పెట్టి అనుసరించి పోసాగాడు. రక్షకులైన నేరగాళ్ళు మొసళ్ళని అదిలిస్తూ, గాయపరుస్తూ ఈదాల్సి రావడంతో తప్పనిసరిగా నెమ్మదిగా ఈదసాగారు. త్వరలోనే విక్రమ్ సింగ్ వీరసేనునికి రెండు బారల దూరానికి చేరుకుని వీరసేనుడి వేగానితో సమవేగంతో ఈదటం మొదలుపెట్టాడు.

సగం దూరం ఈదేసరికి చాలామంది పోటీదారులు మొసళ్ల బారిన పడ్డారు. అందులో చాలామందికి బాకుని ఉపయోగించటం తెలియదు. ఆకలి తీరిన మొసళ్లు, నోళ్లు తెరుచుకుని ఎండ కాగడానికి నేల భాగాలవైపు మళ్లాయి. ఓ పాతిక మంది ఈతగాళ్ళు ముందుకు సాగారు. కొద్ది మొసళ్ళు అనుసరించాయి,

ముప్పాతిక దూరం గడిచేసరికి పదిమంది పోటీలో మిగిలారు. రక్షక నేరగాళ్లల్లో ఇద్దరు చనిపోయారు. మిగిలిన రక్షకుల అండతో వీరసేనుడు అందరికంటే ముందున్నాడు. కొద్ది దూరంలో విక్రమ్ సింగు అనుసరిస్తూ ఉంటే ఇతర పోటీదారులు బాగా వెనకబడి పోయారు.

నూరు బారల దూరంకి వచ్చేసరికి ఎడం వైపు రక్షకులు, కుడి వైపు రక్షకులు చెరో మొసలితో పెనుగులాడ్తున్నారు. రాజకుమారుడు సురక్షితంగా ఈదుతున్నాడు. ఎడంవైపు కనుచూపు మేరలో మరో మొసలి లేదు. అంతే, విక్రమ్ సింగ్ వేగం పెంచి రక్షకులని, రాజకుమారుడిని దాటి ముందుకు దూసుకు పోయాడు.

రాజ సింహాసనం మీద నుంచి జారిపోతున్న భావం కలిగి వీరసేనుడు రక్షకులను వెనకనే వదిలి వేగంగా ముందుకు కదిలాడు.

అప్పుడు ఓ అనుకోని సంఘటన హఠాత్తుగా జరిగింది. ఒక మొసలి కుడి రక్షకుల కుడివైపు నుంచి వేగంగా విక్రమ్ సింగు వైపు విక్రమ సింగ్‌ని నమలి మింగటానికి బయల్దేరింది. దీనిని వీరసేనుడు గమనించలేదు. రాజుగారు గమనించారు. కోటమీద జనాలు 'రాజకుమారుడు' 'రాజకుమారుడు' అంటూ హాహాకారాలు చేశారు.

అప్పుడు విక్రమ్ సింగ్ తల తిప్పి చూశాడు. రాజకుమారుడు తనకి మొసలికి మధ్యలో అడ్డుగా వస్తున్నాడు. అంతే! అంతఃపుర రక్షణాధికారిగా తన కర్తవ్యం గుర్తించాడు. ఒడ్డువైపు కాక రాజకుమారుడి రక్షణ దిశగా కదిలాడు.

మొసలిని వెనకనించి వస్తున్న కుడి రక్షకులు, రాజ కుమారుడు వీరసేనుడు, రాచ జనాల రక్షణాధికారి విక్రమ్‌సింగు తమ బాకులతో పొడిచి హతమార్చారు. వీరసేనుడు ఆనవాయితీ తప్పకుండా పోటీలో నెగ్గాడు.

★ ★ ★

"కథ మామూలే. పోతే నా మనవడు ప్రాణాలతో బతికి బయటపడ్డాడు" అన్నాడు ధరమ్ సింగ్, తెలుగు సింగమ నాయకుడితో...

★ ★ ★

రాకుమారుడి పట్టాభిషేకం దినాన విక్రమ్‌సింగు గెలిచే అవకాశాన్ని చేజేతులా వదులుకున్నందుకు, "రక్షణాధికారి విక్రమ్ సింగ్ ఏం కోరితే అది బహుకరిస్తాను" అని సభలో రాజుగారు ప్రకటించారు.

విక్రమ్ సింగు అర్ధ రాజ్యం అడగలేదు. లక్ష్మీబాయిని అర్ధాంగిగా అనుగ్రహించనున్నాడు. రాకుమార్తె సిగ్గుతో తలవంచుకొని అంగీకారం తెలిపింది. రాజు అనుగ్రహించాడు.

క్రమేపి మొసళ్లు వీరులచేతుల్లో కాక స్వార్థపరుల చేతుల్లో నశించి పోయాయి.

## 'అవయవ దానం' పై కవితల పోటీ

కిన్నెర ఆర్ట్ థియేటర్స్, డా॥ద్వా.నా.శాస్త్రి 68వ జన్మదినోత్సవాన్ని జూన్ 15, 2015 న హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభలో నిర్వహిస్తోంది. ఈ సందర్భంగా 'కిన్నెర - ద్వానా పురస్కారం' కోసం కవితల పోటీని ఆహ్వానిస్తున్నారు.

'అవయవ దానం' అనే అంశంపై 25 పంక్తులకు మించకుండా రాసిన వచన కవితలను మే 15 వ తేదీ లోపల డా॥ద్వా.నా.శాస్త్రి, నెం.1 - 1- 428, ఆర్చిస్ నెస్ట్, గాంధీనగర్, హైదరాబాద్ 500 080 చిరునామాకు పంపవలసి వుంటుంది.

ప్రథమ (రూ.3000/-), ద్వితీయ (రూ.2000/-), తృతీయ (రూ.1000/-) బహుమతులు పురస్కారంగా అందజేయబడతాయి. జూన్ 15, 2015 నాడు జరగబోయే వేదికపై బహుమతీ ప్రదానం జరుగుతుంది. వివరములకు మద్దాళి రఘురామ్, 98660 57777 లో సంప్రదించవచ్చు.

# నీలి గోరింట

విశ్వవ్యాప్తి చెందుతున్న ఎబోలాలా
ప్రపంచమంతా ప్రేమ కీటక బాధితులే
ఏపిల్‌కి స్పెల్లింగు రాకపోయినా
ఐ లవ్యూ చెప్తాడు సహ విద్యార్థినికి
ఎల్.కె.జి అబ్బాయి
చిట్ట చివరిగంట మోగాక
పాఠశాలా కారాగార కవాటాలు బద్దలుకొట్టి
సంస్కృతీ వస్త్రాలు నిస్సిగ్గుగా జారవిడిచి
నిర్భయంగా ఎగిరిపోతారు
కను చీకటి వేళ
పుడమి తల్లి నల్లతెరను కప్పుకొన్న వేళ
రెండు భవనాల మధ్య
ఇరుకు స్థలాల్లో
కోరికల పూల పొదల్లో
క్షణం కుదురుగా వుండనివ్వని
హార్మోన్ల సరిగమల ప్రభావమో
అణువణువులో పలికే వలపు సితార నాద ప్రభావమో
పరస్పర దేహ పుస్తకాల పుటలు తెరచి
పాఠాలు చదువుతున్న పారవశ్య వేళ
గర్వంతో ఒళ్ళు విరుస్తుంది ప్రేమ కీటకం

*

ఉద్యాన వనాల బల్లలపై పక్కపక్కనే
ఒకే మానులో మొలచిన వృక్ష ద్వయంగా
జంటలు జంటలు లతానికుంజాల
సడిలేకుండా సంచరించే కాంక్షా సర్పాలు
ఖజురహో కోణార్క శిల్ప భంగిమల నమూనాల్లో
పరకాయ ప్రవేశం చేసి
అర్ధ నిమీలిత నేత్రాల ఆనంద సమయాల
ఫక్కున నవ్వుతుంది ప్రేమపురుగు

*

రైల్వేస్టేషన్లో బస్టాపుల్లో
అర్ధ నారీశ్వరుల్లా
ఒకరిలో ఒకరు ఒదిగిపోతూ
కళ్ళల్లో కోరికల కాలనాగులు బుసలుకొట్టే వేళ
విజయగర్వంతో వికటాట్టహాసం చేసి
కోరమీసాలు మెలేస్తుంది ప్రేమ తేనెటీగ

*

నెట్‌లో సెల్‌లో టి.విలో మిడ్ నైట్ మసాలాల
వికృత దృశ్యాల పరంపరల
విచ్చల విడిగా కురిసే నీలిచిత్రాల వరదల్లో తడిసి
పదేళ్ళ పాపడినుంచి పళ్ళూడిన ముసలివరకు
కన్ను తెరచినా కన్ను మూసినా
అమ్మాయిల నగ్న దేహాల
అశ్లీల దృశ్యాలే తనువును మత్తెక్కిస్తున్న వేళ
తండ్రీ కూతురు గురువు శిష్యురాలు వావి వరుసల్లేకుండా
ఆడపిల్లలే అంగడిసరుకు లైనపుడు
మానవ మాంస వ్యాపారంలో
మహిళల శరీరాలే పెట్టుబడి ఐనపుడు
ఋష్యశృంగుడైనా మేనకను చూచిన
విశ్వామిత్రునిలా మారిపోడా!

*

బుల్లితెరపై పిల్లల పాటల పోటీల్లో
'నీ నడుమొంపుల్లో నలిగింది నా చూపు'
అని నడుమూపుతూ
ఎట్ట ఎదుట ఏమీ ఎరుగని పిల్లలు
నాట్యమాడుతుంటే
చీమకుట్టి నట్లైనా లేక
కీర్తి గాలిపటం నింగిలో ఎగురుతున్న దృశ్యం చూస్తూ
చిద్విలాసంగా తల్లిదండ్రులు గర్విస్తున్న వేళ
అపహాస్యం చేస్తుంది ప్రేమ పురుగు

*

రంగురంగుల పురాణ కథా చిత్రాలు
నీతిపద్యాల నెమలీకలు తొలగించి
బాల్యాన్ని డాలర్లకు తాకట్టు పెట్టి
మన సంస్కృతికి పగవారై
పర సంస్కృతికి బానిసలై
పెదవి వెదురు వనాలపై
వేమన పద్యాల వేణుగానం
బద్దెన పద్య మాధుర్యం
బహిష్కరించిన వేళ
ఎక్కడబడితే అక్కడ ప్రత్యక్షం
కామ దుర్గంధ పూరిత
నీలి గోరింట పూలపొదలు




**మందరపు హైమవతి**

94410 62732

# వలసిన కానుక







## వి హా రి

యూ ట్యూబ్‌లో ఎవరిదో శుభప్రదంగా సన్నాయి కచేరీ సాగుతోంది. నేపథ్యం పెళ్ళి పందిరేమో!

నా పక్కన సుభాషిణి మధురోహల్లో తేలుతూ ఏదో కొత్త లోకంలో కూచుని, పాట కు తాళం వేస్తూ ఆనందిస్తోంది. శుభ్రమైన బెంగాలీ కాటన్ చీరె, మ్యాచింగ్ జాకెట్, జెడలో మల్లెలూ, ముఖాన్న చిన్న స్టిక్కర్, దాని కింద కుంకుమ బొట్టు. కాటుక కళ్ళ నిండా ఉత్సాహం. తన పెళ్ళి సన్నివేశమే స్ఫురిస్తున్నదేమో!



**సోఫాలో** కొంచెం సవ్వడితో సర్దుకున్నాను. క్రీగంట చూశాను. చూపులో కొంటెదనాన్ని పసి గట్టింది. ఓ చిరునవ్వు నావైపు రువ్వి, "లలిత క్కూడా పెళ్ళి సంబంధాలు చూస్తే బాగుంటుంది" అని గోడవారగా కూచున్న అత్తగారిని కదిలించింది.

కోడలి వైపు వింతగా చూసి, వచ్చే నవ్వు నాపుకుని "బాగుంది వరస, నిన్న మొన్ననే దానికి పద్దెనిమిది నిండింది. పైగా బీటెక్ చేస్తున్న పిల్ల. నీకిదేం ఆలోచనే శుభా? దాని చదువుకీ, సంగీ తానిక్కూడా చుక్క పెట్టేస్తావా యేం? నువ్వంటే పట్టు పట్టుమని ఆ వయస్సులోనే మా వాణ్ణి ముగ్గు ల్లోకి దించావ్ గానీ, పెళ్ళి మాటంటే ఈ కాలప్పి ల్లలు నిన్నూ నన్నూ ఛీ కొడతారు" అన్నది అమ్మ.

సుభాషిణి గడసరితనం ముందే అర్థమైంది నాకు. నా తరపున అమ్మ బాగానే జవాబిచ్చింది! నా సరసపు చూపులకి తగిన విరసపు సంభాషణ రసవత్తరంగానే వుంది నాకు.

గాలి అలలపై తేలివస్తున్న పూల పరీమ ళంలా "మీరు సరే సరి అత్తయ్యా... మన పిల్లలు మనకెప్పుడూ పసివాళ్ళే అనుకుంటే ఎట్లా?" అని నావైపు కొంటె చూపు గుచ్చింది.

"నువ్వెట్లాగైనాపెద్ద ఆరిందావయ్యావమ్మా అయినా మీ సరాగం మధ్య నేనెందుకు?" అంటూ మురిపెంగా అని తన గదికేసి కదిలింది.

గదిలోంచి లలిత వచ్చింది "బామ్మ అవ



98480 25600

గాహనా, ఎసెస్‌మెంట్ ఎప్పుడూ కరెక్టే" గుమ్మంలో ఆగింది అమ్మ.

"అంతా విన్నావేమే!..."ఆశ్చర్యపోయింది అమ్మ.

"ఆహా!" అని చక్రాల్లా కళ్ళుతిప్పి, "బచ్చా కబుర్లకేం గానీ, ప్రస్తుతానికి టాపిక్ మార్చండి బాబూ. లీల హిట్స్ పెట్టండి విందాం" అన్నది.

సుభాషిణి నావైపు గుర్రుగా చూస్తూ, యూ ట్యూబ్‌ని సెట్ చేయసాగింది.

అమ్మ తిరిగివచ్చి సోఫాలో కూచుంది. "ప్రభు ఏడే?" అమ్మ ప్రశ్న.

"హోం వర్క్‌తో కుస్తీ పడుతున్నాడు" లలిత సమాధానం.

"ఏవిటో ఆరో తరగతిలోనే వీళ్ళని రాచి రంపాన పెడుతున్నారు" అని మనవడి మీద జాలి పడింది అమ్మ.

బామ్మ పక్కకుజేరి ఆమె మీదకు ఒరిగింది లలిత. మా అమ్మేమో మనవరాల్ని వెట్టగా దగ్గరికి చేర్చుకుంది.

అంతలోనే రివ్వున ఎగురుకుంటూ వచ్చే శాడు ప్రభు, "అందమె ఆనందం, ఆనందమె జీవిత మకరందం" పాట మొదలైంది. అది విని ఠక్కున లేచి బామ్మ దగ్గరగా వెళ్ళి "నువ్ రా బామ్మా, మనం నీ టీవీలో మాయాబజార్ వేసుకుందాం" అని చేతులు పట్టుకుని లేపాడు. వాడి ముచ్చటని ఆనందంగా చూస్తూ, "సరే పద. నీకూ నాకూ దాన్ని ఎన్నిసార్లు చూపినా తనివి తీరదు" అంటూ తన గదికేసి నడిచింది అమ్మ. సరిగ్గా అప్పుడే ఫోన్ మోగింది.

* * *

"ఒక్కసారి వచ్చి వెళ్ళరా! ఆరోగ్యం జాగ్రత్త!" ఎప్పుడు ఫోన్ చేసినా పలకరింపూ, పరామర్శ, వేడికోలు! పెదనాన్న శివయ్య మనసులో మాట వీటి వెనక దాగివుంది.

ఎనభై నాలుగేళ్ళు దాటిన వయసు. పెద్దమ్మ పోయి ఆరేళ్లు. నలుగురు కొడుకుల్నీ, ఇద్దరు కూతుళ్ళనీ ప్రయోజకుల్ని చేసిన నిన్నటి తరం కష్టజీవి ఆయన.

"పెద్దతనం. పాతకాలం మనుషులం కదా రక్త సంబంధాలు పీకుతూ ఉంటై. ఒక్కసారి వెళ్ళి చూసిరా" అమ్మ సలహా.

బావగారంటే ఎనలేని గౌరవం ఆమెకి. నాన్న పోయిన తర్వాత తమ బాగోగులు చూసిన మనిషి. "పదేళ్ళ లొట్టికాయనుంచీ నిన్ను ఇంతవాణ్ణి చేసింది ఆయన మంచి మనసేగా"...

నాకు తెలుసు. గ్రాయకం తెలిసినప్పట్నించీ బతుకు దారిలో ఎత్తుపల్లాల్ని గడచిన వాణ్ణే, మా ఆలనా పాలనా ఆయన రక్షణ వలయంలోనే జరిగింది.

అమ్మ గదిలో కూచుని 'మాయాబజార్' చూస్తున్న నా కొడుకు ప్రభు కేకేశాడు..."నానమ్మా! రా వస్తోంది మాయాబజార్" అంటూ.

నా భార్య సుభాషిణీ, కూతురు లలిత ఎవరింట్లోనో పేరంటానికి వెళ్ళారు.

అమ్మ లేచి లోపలికి వెళ్ళబోతుంటే వచ్చాడు సుబ్బు. మా పెదనాన్న నాలుగో కొడుకు. మాలాగానే హైదరాబాధ్లో పడుతున్న చిరుద్యోగి.

తాగటానికి నీళ్ళూ...ఆ వెంటనే కాఫీ. ఫోన్ సంగతీ, పెదనాన్న కోరిక, అభ్యర్థనా...అమ్మే మాట్లాడుతోంది. అన్నీ నిజాలు, నిష్ఠూరాలు, బాధలూ గాధలూ! "సొంత కొడుగ్గా నీకూ ఆయన బాధ్యత వుంది సుబ్బూ. ఈ వయస్సులో మీరంతా తండ్రి మనసుకి బాధ కలిగించటం బాగాలేదు".

సుబ్బు మొహం వివర్ణమైంది.కళ్ళల్లో కించిత్ కినుక కదిలింది."ఈవిడ తీరు ఇంతే, నన్నూ తప్పు పడుతోంది" అనుకున్నట్లనిపించింది. సుబ్బు స్వభావం, మనసూ నాకు తెలుసు. ఇక్కట్లూ పరిమితులూ కూడా నా అవగాహనలో ఉన్నవే. కలిసి తిరిగిన సమ వయస్కులం మేము.

"అది కాదు పిన్నీ!. నాలుగో కొడుగ్గా నాన్న దగ్గర నా మాటకి విలువలేదు. అన్నయ్యలంటావా నువ్వేరుగని కొమ్మలేం కాదు. మొండికట్టెలు. అక్కయ్యలేమో అమ్మ పోయన తర్వాత, ఆయన ఉన్నాడనే స్పృహలేకుండా తప్పుకుంటున్నారు. చిన్నపిల్లలమేం కాదు, అందరూ పెళ్ళికెదిగిన పిల్లలు కలిగినవాళ్ళం" అని మరికొంత ఆవేశం లోనికి ప్రవేశించబోయి తమాయించుకున్నాడు. మౌనం లోకి జారుకున్నాడు.

క్షణం తర్వాత...

"తాలుగానీ, తప్పుగానీ మీ అమ్మ పోయిన తర్వాత ఉన్నదంతా మీ అందరి చేతుల్లో పెట్టేశాడు. తన పెన్షన్ తనకుంది. రామ్మూర్తి దగ్గర వుంటున్నా, అందరూ ఆ తండ్రికేం కావాలో పట్టించుకోవలసిన వాళ్ళేగా?"

"నీ మాట నిజమే పిన్నీ, కానీ రమ్మనవాళ్ళ దగ్గరికి రావాలిగా. కదలడు. ఎంతసేపటికీ ఆ పెద్ద కొడుకూ, కోడలూ. వాళ్ళ పిల్లల ఆలోచనా, ఆందోళనే ఆయనకి. వాళ్ళకి చేయూత నివ్వాలనే తాపత్రయం. వాళ్ళేమో ఆయనకి మేం తప్ప గతి లేదన్నట్లు చులకనగా చూస్తారు. తెలిసిన గొడవే" అని అస్థిమితంగా కదిలి "నా దగ్గరికి రావయ్యా స్వామీ అని చెప్పిచూశాను. నీ అవస్థ నాకు తెలుసులేరా సుబ్బూ... నిన్ను ఇబ్బంది పెట్ట లేను అంటాడు".

"అవును మరి...పక్షవాతపు అత్తగారు. కూనాగుజ్జూ ముగ్గురు ఆడపిల్లలు. నిన్నూ, నీ భార్య వసంతనీ బాధపెట్టలేని తండ్రి మనసు" బావగారి మనసు వివరణని తెలుపుతోంది అమ్మ.

ముగ్గురమూ చాలాసేపు నిశ్శబ్దంలోకి జారేము.

నిశ్శబ్దంలోనే అసలైన అస్తిత్వం గింజుకుంటుంది.!!!

* * *

తెనాలి...

సాయంత్రం నాలుగు గంటలు దాటుతోంది. శివయ్య పెదనాన్న వాళ్ళింటికి నడుస్తున్నాను. ఏదో అజ్ఞాతమైన భయం. ఒక అవ్యక్త ప్రతికూల భావన. ఎలా ఉంటుందో వాతావరణం? పరిస్థితులెలా వుంటాయో? రేపు పెద్దమ్మ ఆబ్దికం. అందరూ వచ్చి వున్నారేమో?

ఈ తరహా ఆలోచనలలతో వెనకబడిన మనసును శరీరం హెచ్చరించింది. కాలు కదిలింది.

ఇంటికి వెళ్ళేసరికి లోపల ఏదో రాళ్ళవాన కురుస్తున్న సూచన!

గుమ్మం దాటి లోపలికి వెళ్ళాను, నన్ను చూసి అసంపూర్ణ వాక్యాల్లా మాటలకి చుక్క పెట్టేశారు అందరూ!

యోగక్షేమాల పలకరింపులు, ముఖప్రీతి కబుర్లూ, ప్రశ్నలు, సమాధానాలూ! పెదనాన్న తనలో తాను సంభాషించుకుంటూ, నన్ను చూసి చిన్న నవ్వు! "నువ్వొచ్చావు బాగుందిరా. సంతోషం. అమ్మనీ, కోడల్నీ, పిల్లల్నీ తీసుకొస్తే బాగుండేది".

నిశ్శబ్దం,

స్టీలు పళ్ళెంలో కాఫీ గ్లాసులు తెచ్చింది చంద్ర. మా రామ్మూర్తి అన్నయ్య కోడలు. గృహిణి. సేల్స్‌టాక్స్ ప్రాక్టీషనర్ రంగబాబు భార్య. ముగ్గురు ఆడపిల్లల తల్లి.

కాఫీలైనై. దానిమ్మ పండ్లు, యాపిల్స్ బ్యాగ్‌ని పెదనాన్నకి అందించాను. అమ్మ ఇచ్చిన సున్నుండల డబ్బాని శర్వాణి వదినకి ఇచ్చాను. అందరి మధ్యగా నాదొక ఏకాంత తృప్తి!

పెదనాన్న మంచంమీద పక్కనే కూచున్నాను. నా చేతిని తన అరచేతుల్లోకి తీసుకుని నిమ్మళంగా ఒక మృదుస్పర్శ! నాకు ఒక లాలన! ఒక స్వాంతన! చేతి సంచిలోంచి టెంప్టేషన్ చాక్లెట్స్‌ని తీసి పిల్లల్ని పిలిచి ముగ్గురికీ ఒక్కొక్కటి ఇచ్చాను. వాళ్ళ మొహాలు కళకళలాడినై. థాంక్స్ చెప్పారు. శర్వాణి వదిన మొహమే కళ తప్పింది.

"నువ్వింతకంటే ఏం తెస్తావు లేవయ్యా!" అని గిరుక్కున తిరిగి వంటింటి కేసి నడచింది. నాకు మనస్సు చివుక్కుమంది. ఆమె స్వభావంలో సౌజన్యం లేకపోవటం నాకేమీ కొత్తకాదు. మా అన్నలూ ఆమె కేసి కించిదాశ్చర్యంతోనే చూశారు.

నేను తేరుకొనేలోగా రామ్మూర్తి అన్నయ్యే అన్నాడు. "పోనీలేవే, అంతవరకూ బెటరు. నీ మరుదులకి ఇట్టాంటి మర్యాదలు అసలే లేవుగదా!"

ఈ పరిస్థితినుంచీ ఎడంగా జరిగిపోయిన వాళ్ళలా మౌనం వహించారు మా రాజారావు, ప్రసాదం, సుబ్బు అన్నయ్యలు. పెదనాన్నేమో విని పించని ఏ విషాద రాగాన్నో శ్రుతి చేసుకుంటున్న వాడిలా మంచంలో పక్కకి తిరిగాడు.

ఆ ప్రక్కనేముంది? పెచ్చులూడిపోయిన పాతగోడ!

* * *

రాత్రి తొమ్మిదవుతోంది. పెద్దవాళ్ళ ఉపాహారాలు, పిల్లల భోజనాలు అయినై. పిల్లలు తమ గదిలో నిద్రకి వెళ్ళారు. పెద్దలంతా హాల్లోకి చేరేరు. పక్కగదిలో పెదనాన్న గదితలుపు తీసేవుంది.

విషయాన్ని చురుగ్గా మొదలు పెట్టింది శర్వాణీ వదిన... "మేమెంత చేసినా ఆయనగారికి అసంతృప్తేనయ్యా సత్యం. పోనీ మీ చిన్నన్నలెవరైనా తీసుకుపోతారా అంటే వాళ్ళు ముందుకు రారు"

ప్రసాదం అన్నయ్య కదిలాడు. "ఈ పుల్ల విరుపు మాటలెందుకూ? మాలో ఎవరో ఒకరు నిజంగానే నాన్నని మాతో నడిపిస్తే మీరు తట్టుకోగలరా పాపం! నెలనెలా ఠపీమని రాలే ఆయన పెన్షన్ లేకపోతే ఈ సంసారం ఏమయ్యేదో మాకూ తెలుసు"

ఈ మాటకి రామ్మూర్తి అన్నయ్యకు రోషం పొడుచుకొచ్చింది. "దేనికి దేనికో లంకెలు పెట్టి ఎత్తిపొడుపులెందుకుగానీ, ఆయన్నీ నువ్ తీసుకుపో..."

"ఆ.. తీసుకుపోతా. ముందీ ఆరేళ్ళ పెన్షన్‌కీ లెక్క చెప్పండి. ఆయన ఖర్చులు ధారాళంగా నెలకో ఐదారువేలు తీసేసినా, తొమ్మిది పది లక్ష లుండాలి" ప్రసాదు అంకెల్ని పరిచాడు.

"అవున్నాయనా, ఆ లక్షలు లక్షలు మేమే తినేశాం" శర్వాణీ వదిన మూతి వంకర తిప్పింది.

"కిందటేడాది కిమ్స్‌లో ఖర్చు ఎంతయిందో ఏనాడన్నా అడిగారా–పెద్దమనుషులు?" రామ్మూర్తి.

"మేం ముగ్గురం కలసి అరవై వేలిచ్చాంగా. అడగక పోవడమేమొచ్చింది".

"అవును దాన్తోనే అయింది వైద్యం!" వదిన విసురు.

కొంత సమయం అలసంగా, అస్తిమితంగా గడిచింది.

"ఈ మాటలన్నీ ఎందుకూ? మేమెన్ని సేవలు చేసినా, ఏవేళకావేళకి కావలసినవన్నీ నోటికీ చేతికీ అందిస్తున్నా, ఆయనకిక్కడ చేదు మేస్తున్నట్టే ఉంది. ఎవరో ఒకరు తీసుకెళ్ళండి" వదిన మాటే.

నేను మాట పలుకబోయి తమాయించుకున్నాను.

"అట్టాగే. నేను తీసుకెళతాను. ఆయన పెన్షన్ ఎకౌంట్, ఏటీయం కార్డూ వొప్పజెప్పండి" రాజారావు లక్షణం ఒక్క ఉదుటున విశృంఖలంగా మారింది.

"అవును" అని వంత పాడాడు ప్రసాదం. సుబ్బు మాత్రం బెల్లం కొట్టిన రాయిలా కూచుండిపోయాడు.

రామ్మూర్తి అన్నయ్యకీ, వదినకీ అగ్గి ఎత్తుకుంది. లోలోపలి అహం జీవన రహస్యాన్ని మండించింది. "నోరు వాయీ లేని వాడేం కాదు గదా. ఆయన్నే చెప్పమనండి. తనేం చేసుకుంటాడో తనిష్టం" రామ్మూర్తి.

ఈ కలకలం పెదనాన్నలో కలవరం కలిగించినట్టుంది. మంచంలో లేచి కూచుని, స్టూలుమీది గ్లాసులోని నీళ్ళు తాగాడు. దీర్ఘంగా నిట్టూర్చాడు "చేతులు కలిస్తేనే చప్పట్లురా. ఒక్కొక్క వాక్యానికీ దండాన్వయాలూ, ఖండాన్వయాలూ, టీకా తాత్పర్యాలూ ఎందుగ్గానీ, మీరూ మీరు కలబడకండి. ఇవే ముక్కులూ, ఇవే మొహాలూ ! నాటకం సాగాలి కదా?"

"అట్టా అనుకునే వాడివి ప్రతి వెధవనీ ఒకసారి వచ్చి వెళ్ళరా, నన్ను తీసుకుపోరా అని దేబిరించటమెందుకూ?" రామ్మూర్తి పెనంమీద పేలగింజ అయ్యాడు.

"ఎందుకంటే – మనంపెట్టే ఆరళ్లను నలుగురిలోనూ ఉతికి ఆరేయటానికి" వదిన చేతులు నాట్యమాడినై.

నాకు మాత్రం చెవులు దిబ్బెడ పడినట్టయింది. పెద్దగా ఆవులించేను. ఇప్పటివరకూ ఓ పక్కగా కూచుని రేపటి కూరకు చిక్కుడు కాయలు వలుస్తున్న చంద్ర లేచి గిన్నే చాటా తీసుకుని వంటింటి కేసి నడిచింది.

బయట సన్నగా జల్లు మొదలైంది. కిటికీ లోంచి రివ్వున చలిగాలి దూసుకొచ్చింది. రంగబాబు లేచి కిటికీ రెక్కల్ని మూసేడు.

* * *

తెలతెలవారుతుండగా పెదనాన్న మార్నింగ్ వాక్‌కి బయల్దేరాడు. నేనూ ఆయనతో కదిలాను.

వాతావరణం చల్లగావుంది. రాత్రి వర్షానికి ఇప్పుడు కురులార్చుకుంటున్నై చెట్లు. సైకిళ్ళమీద వెళ్తున్న స్కూలు పిల్ల అక్కర్లేని చోట బెల్ మోగిస్తూ వెళుతోంది! కుర్రాడెవరో చెట్టుకింది కుక్కను రాయి కొట్టి లేపాడు. అది భౌభౌమని విజృంభిస్తే పరుగు లంకించుకున్నాడు. వీధి వ్యాపకాలు జూలు విదిలుస్తున్నై. జైనమందిరానికి పళ్ళేలు పట్టుకుని వెళుతున్నారు సగం పరదా స్త్రీలు. వాళ్ళకి పక్కపక్కగా తొలగి రామాలయానికి వెళ్తున్న మంగళ శోభ!

చిత్రమైన దృశ్యాలు! నాలో నేను నవ్వుకుంటే పెదనాన్న అన్నాడు "భిన్నత్వంలో ఏకత్వం"...ఆగి, "మనింట్లో లాగానే".

"అంటే?"అని అర్థంకాని మోహం పెట్టాను.

"అంటే నా కొడుకులు నలుగురూ నాలుగు తరహా వ్యక్తులు. ఏకత్వమేమో నా పెన్షన్ డబ్బు"

షరాబ్ బజారూ, మెయిన్ రోడ్ కలిశాయి. మూసివున్న కొట్టు. మెట్ల మీద కూచున్నాం.

ఆయన చెప్పుకొచ్చాడు "బతుకు పదిమందిలో ప్రవాసమైతే కష్టంరా. ఉద్వేగాన్నీ, ఉద్రేకాల్నీ, ఉత్సాహాన్నీ పంచుకునే అవకాశం లేక పోతే ఎలారా సత్యం బతికేది? మనుగడే ద్వీపకల్పమైపోతే తట్టుకోలేం కదా!" ఒంటరి దు:ఖం దారుణం కదూ?

నా మనసు గచ్చుపొదలా మారింది. మౌనిగా మారిపోయాను. పెదనాన్న భౌతిక స్థితిని వితర్కించుకొంటోంది మనసు. సంబంధ బాంధవ్యాలకి అర్థాన్ని వెతుక్కుంటోంది బుద్ధి. 'సమాజానికి వ్యక్తిగత సంక్షోభం, సమస్యలూ పట్టవు' అన్న రచయిత

మాట సత్యమే! కుటుంబ సభ్యులంతా సమాజమే గదా! అయితే మనిషి వినిమయ వస్తువా?

జవాబులు వెతకాల్సిన ప్రశ్నలు! ఆలోచనలు తికమక పెడుతున్నాయి. చూపులు మాత్రం కళ్ళల్లో పట్ట గలిగినన్ని దృశ్యాల్ని తాకి, దాటుకుపోతున్నాయి. నన్ను నేను నిర్మించుకునే విధానానికి వెతుకులాట సాగుతోంది.

"వెళ్దాం పద" అంటూ లేచాడు పెదనాన్న. కదిలి ఆయన్ని అనుసరించాను!

* * *

ఆబ్దికం మర్నాడు వద్దామనుకున్నవాణ్ణి మూడురోజులు తెనాలిలోనే ఉన్నాను...నా నిర్ణయం విని కొన్ని పెదవులు పరిహసించినై....కొన్ని నొసళ్ళు వెక్కిరించినై. అమ్మా, సుభాషిణీ హర్షించారు. "ఎక్సలెంట్ నాన్నా?" అని మెచ్చుకొంది లలిత. ప్రభు ఏమో "భలే భలే" అని ఫోన్లోనే ఎగిరి గంతేశాడు.

పెదనాన్న వాళ్ళింట్లో ఆర్థికాంశాల ప్రసక్తి బాగేనే నలిగింది. అక్కలిద్దరూ కూడా ఫోన్‌ల ద్వారా చర్చల్లో పాల్గొన్నారు. అందరి మనసులూ ఇరుకుగానే ఉన్నై. మూడోరోజు రాత్రి నా తిరుగు ప్రయాణం మొదలైంది. మర్నాడు ఉదయానికి హైదరాబాద్ చేరేను.

* * *

అప్పుడే ఆవిష్కరింపబడిన పుస్తకంలాగా వుంది మా హాలు. ఆత్మబంధువులా సమావేశ స్థానంలా వుంది. ఆత్మీయుల సమాలోచన మందిరంలా వుంది.

అమ్మా, సుభాషిణీ పందేలు వేసుకుని గవ్వలాట ఆడుతున్నారు. లలిత ఇయర్ బడ్స్‌తో ఏవో పాటలు వింటోంది. పెదనాన్న ఎదురుగా కూచుని ఇంగ్లీష్ గ్రామర్ నేర్చుకుంటున్నాడు ప్రభు. మాటి మాటికీ "భలే భలే", "ఇంత తేలికా ఇది" అని ఉత్సాహంగా కేరింతలు కొడుతున్నాడు.

అర్ధగంట తర్వాత "తాతయ్యా నేను వీణ వాయిస్తా" అంటూ వీణ తెచ్చుక్కూమంది లలిత. "నువ్వూరా సుభాషిణీ" అని పిలిచాన్నేను. ఆమె లేచి వెళ్ళి వీణ తెచ్చుకుని లలిత పక్కగా కూచుంది. పెదనాన్నా, ప్రభూ వాళ్ళ చదువు ఆపి, ఇటు తిరిగారు. ఒకసారి లోపలికి వెళ్ళి వచ్చి కోడలు ఎదురుగా కూచుండి అమ్మ.

"అత్తయ్యా మీరు 'నగుమోము కనలేని' ఎత్తు కోండి" అన్నది సుభాషిణి.

"ఇప్పుడెందుకు లేవే" అని మొహమాట పడింది అమ్మ.

"ఫర్వాలేదు పాడవమ్మా. నేనూ నీ పాటవిని చాలా ఏళ్ళయింది గదా" అన్నాడు పెదనాన్న. తల వూపిందామె.

ఆ స్వర రాగ సుధాలహరి చాలాసేపు సాగింది. మధ్యమధ్య నేనూ, పెదనాన్నా, ప్రభూ కరతాళధ్వనులతో మా మెప్పుదలని చూపి ఉత్సాహపరిచాము.

"రాగ సుధారస పానము చేసీ రంజిల్లవే వో మనసా..."

కృతి మధ్యలో లోపలికొచ్చాడు సుబ్బు.

మా వాతావరణం చూసి ఆశ్చర్యపోయాడు. సవ్వడి లేకుండా సోఫాలోకి చేరాడు. పెదనాన్న సైగని అందుకుని ప్రభువెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చి చ్చాడు. అసంకల్పంగా నీళ్ళుతాగి, సంగీత శ్రవణంలో లీనమైనాడు సుబ్బు.

మరో పావు గంటకి కచేరి ముగిసింది. పెదనాన్న మొహం కళకళలాడింది. మనస్ఫూర్తిగా అభినందనలు చెప్పాడు.

"ఏదో నవలోకం వెలిసినట్లుందిరా సత్యం" అని నా వైపు చూస్తూ కళ్ళు చికిలించాడు సుబ్బు.

"కరెక్ట్" అని పెద్దగా అని "సరిగ్గా ఇదిగో ఈ లోకాన్నేరా పెదనాన్న కోరుకున్నది. రవ్వంత అనురాగం గోరంత ఆహ్లాదం, కొండంత మనసుల కలబోత! ఇదే మరి పెద్దతనంలో ఒంటరి దు:ఖా నికి చికిత్స" అంటూ మాటల్ని పూర్తి చేసింది అమ్మ.

"అవునవును" అంటూ నీళ్ళు నమిలేడు సుబ్బు.

ఆ తర్వాత...డిన్నర్ సన్నివేశమంతా కమ్మతెమ్మెరలా లోకాభిరామాయణంతో, సంగీత సాహిత్య భాషణతో పరవశించింది. ఇదంతా గమనిస్తూంటే "వయసు మాత్రమే కాదు, కాలంకూడా నిష్కల్మష మనసుకూ, నిర్మల హృదయానికీ ఊడిగం చేస్తుంది" అనిపించింది నాకు. ఆ మాటని పైకి అనేసేసరికీ ఉద్వేగానికి లోనయ్యాడు సుబ్బు. లేచివచ్చి నాచేతిని మృదువుగా స్పృశించి, ఏదో అనబోయి, అనలేక మాట పెకల్చుకుని చివరికి "మీరు గ్రేట్!" అని మొహాన్ని పక్కకి తిప్పుకున్నాడు. అప్పటికే ఆయన కళ్ళు చెమ్మగిల్లినై.

సరిగ్గా ఇదే సమయంలో...

అక్కడ తెనాలిలో తేలిక బుద్ధుల పంచాయతీ సాగుతూనే వున్నది. అందులోని సింగిల్ పాయింట్ ఎజెండా – తండ్రి ఆదాయం పంపకం!

ఆ పంచాయతీలో మా సుబ్బుకు సభ్యత్వం లేదు. !!



# గాంధీ - భారతీయ విద్యావిధానం

**మొదటగా భారతదేశపు ఆర్థిక జీవన విధానాన్ని తప్పనిసరిగా విదేశీ ఆధిపత్యాన్నుండి తప్పించాలి. రెండవదిగా భారతీయ ఆలోచనా విధానాన్ని విదేశీ ప్రభావాన్నించి తప్పించి, నిజమైన స్వేచ్ఛాయుతమైన భారతీ యాత్మని ఆవిష్కరించాలి. భారతీయులు పాశ్చాత్య నాగరికతా శృంఖలాలను ఛేదించేం దుకు గాంధీజీ భారతీయ విద్యావిధానానికి పునాది వేశారు.**

ఆంగ్లపాలనలో ఆసియా సంస్కృతి కాలేజీలలో, విశ్వవిద్యాలయాల్లో నిద్రావస్థకు చేరింది. దాదాపు నలభైఅయిదు సంవత్సరాలపాటు 'అలీఘడ్', హిందూ ముస్లిం విశ్వవిద్యాలయంగా, ఇస్లాం సంస్కృతీ పీఠంగా వర్ధిల్లింది. శిక్కు సంస్కృతికి ఖల్సా కళాశాల, హిందువులకు బెనారస్ విశ్వవిద్యాలయం అలాంటివి. ఈ విద్యాసంస్థలు పాతబడి, ప్రభుత్వం మీద ఆధారపడినవి. వీటి స్థానంలో స్థాపించబడే విద్యాసంస్థలు ఆసియా సంస్కృతిని ప్రతిబింబించేవిగా ఉండాలని గాంధీజీ భావించారు. 1920 నవంబరులో గాంధీ అహమ్మదాబాద్‌లో గుజరాత్ జాతీయ విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. సంఘటిత భారతమే దాని ఆదర్శం. ఆ విశ్వవిద్యాలయానికి హిందూ ధర్మం, ముస్లింల ఇస్లామ్ రెండు మూలస్థంభాలు. దాని ప్రధానోద్దేశ్యం భారతీయ భాషల్ని, జాతీయ పునరుజ్జీవనాన్ని నిలిపి ఉంచడమే. ఆసియా సంస్కృతిని అధ్యయనం చెయ్యడం, పాశ్చాత్య శాస్త్రవిజ్ఞానాన్ని తెలుసుకోవడం సమంజసమని గాంధీ భావించారు. వాటితోబాటుగా సంస్కృతం, అరబిక్, పర్షియన్, పాలి, మంగోలి, సంస్కృతులలోని అనంతమైన సంస్కృతీ సంపదను గ్రహించడంలోనే ఈ దేశపు శక్తి ఇమిడి వున్నదని ఆయన గ్రహించారు...ప్రాచీన సం స్కృతిని పున రావృతం చేయడమేగాక, దాని పునాదు లమీద, సాంప్రదాయాలమీద, అనుభవ పరమైన క్రొత్త సంస్కృతిని నిర్మించుకోవాలని ఆయన ఆశించారు. భారతదేశానికి వచ్చిన అనేకానేక సంస్కృతుల సమ్మేళన సంస్కృతిని సాధించుకో వడేమే ఆయన ఆశయం. అది భారతీయమైన స్వదేశీ విధానం. అమెరికన్ విధానంలాగ బలవంతంగా, కృతకంగా, ఏకత్వాన్ని సాధించాలనే విధానం కాదు. హిందు వులు ఖురాన్‌ని, ముస్లింలు శాస్త్రాల్నీ అభ్యసించే అవకాశం ఉండాలి. మానవ సమాజంలో ఏదీ అంటరానిదిగా ఉండకూడదు. జాతీయ విశ్వవిద్యా లయం వేర్పాటును అంగీకరించదు. అన్ని భార తీయ మతాలను గురించి అక్కడే బోధన జరగాలి. సంస్కృతం, హిందీ, పర్షియన్, ఉర్దూ కలిసిన హిందూస్థానీ భాషను అభ్యసించడం తప్పనిసరి. విద్యాభ్యాస విధానంలో స్వేచ్ఛ ఉండి తీరాలి.

క్రమంగా ఉన్నత పాఠశాలలు అన్ని బస్తీలలోను విస్తరింప బడాలి. ఆ విధంగా ప్రజా బాహుళ్యానికి విద్య విస్తరించాలి. విద్యావంతులు, నిరక్షరాస్యుల మధ్య దూరాన్ని తగ్గించాలి. సామాన్యులకు పారిశ్రామిక విద్య, పారిశ్రామికులకు సాహిత్య విద్య అంది, వారి మధ్య సాంఘికంగా, ఆర్థికంగా వున్న ఆర్థిక పంపకాల అసమానతలు, అసంతృప్తిని తొల గించే ప్రయత్నం చేయాలి.

శ్రామికవృత్తి నైపుణ్యాన్ని పట్టించుకోక మనోవికాసానికి మాత్రమే సహాయపడే పాశ్చాత్య విద్యావిధానాలకు వ్యతిరేకంగా అన్ని పాఠశాలల్లోను శారీరక శ్రమ ఒక పాఠ్యాంశంగా ఉండాలని గాంధీ నిర్ణయించారు. నూలు వొడకడంద్వారా పిల్లలు తమ బోధనారుసుమును చెల్లించుకునేందుకవసరమైన డబ్బును సంపాదించుకోగలుగుతారు. ఆ విధంగా పిల్లలు వారి జీవనభృతిని సంపాదించుకోవడమేకాక, స్వతంత్రంగా జీవించడం నేర్చుకుంటారు. పాశ్చాత్యవిధానం ఏ మాత్రం పట్టించకోని హృదయ సంస్కారానికి మొదటినించీ ప్రాధాన్యతనిచ్చారు గాంధీ. పిల్లలకు శిక్షణనిచ్చేందుకు అర్హులైన ఉపాధ్యాయుల్ని నియమించుకోవాలి.

గాంధీజీ నూతన విద్యావిధానంలో ఈ ఉపాధ్యాయులే పునాదిరాళ్ళు. ఈ విద్యాలయాలు పాఠశాలలు, కళాశాలలకన్నా ఉన్నతమైనవి. వీటిని



99088 56530




మూలం
రోమరోలా 'గాంధీ'

అనువాదం
బి.వి.రామిరెడ్డి

కాన్వెంటులని పిలవవచ్చు. వీటిలో పవిత్ర భార తీయ సంస్కృతికి అధిక ప్రాధాన్యత యివ్వబడు తుంది. పూర్వకాలంలో పాశ్చాత్య దేశాలలో 'బెనడిక్టిన్' మొనాస్ట్రీలనుండి మత ప్రచారకులు బయలుదేరి రాజ్యాలను, ఆత్మలను జయించిన ట్లుగా ఈ కాన్వెంటులు పనిచేయాలి.

అహమ్మదాబాద్‌లో గాంధీజీ ప్రారంభించిన సత్యాగ్రహ ఆశ్రమంలో ఏ నియమాలు విధించారో, అవే నియమాలు ఈ ఆదర్శ పాఠశాలల్లో కూడా ఉపాధ్యాయులకు అమలు చేయబడ్డాయి. మామూలు మతసంస్థల్లో చేయించే ప్రతిజ్ఞలు, ఇతర మత వ్యతిరేక లక్షణాలు కలిగి ఉంటాయి. కానీ ఈ విద్యా సంస్థల్లో చేయించే ప్రతిజ్ఞలు త్యాగనిరతిని, స్వచ్ఛమైన ప్రేమభావనను ప్రబోధిస్తాయి. ఇవీ 'సంతుల' లక్షణాలు. ఈ విద్యాసంస్థల్లోని ఉపాధ్యాయులు ఈ క్రింద చెప్పబడిన నియమాలకు కట్టుబడిఉండాలి.

**1.సత్య ప్రతిజ్ఞ :** ఇది మామూలుగా అబద్ధాలాడకుండా ఉండడం కాదు. కనీసం దేశం మంచికోసం కూడా ఎలాంటి మోసమూ, దగా చేయ రాదు. సత్యానికి నిలబడేప్పుడు పెద్దలను. తల్లిదండ్రులను కూడా ఎదిరించ వలసి వుంటుంది.

**2.అహింసా ప్రతిజ్ఞ :** అహింస అంటే ఏ ప్రాణి ప్రాణాన్ని తీయ కుండడం మాత్రమే కాదు. ఎదుటివారు అన్యాయస్థులుగా ఉన్నారనుకున్న ప్పుడు కూడా వారిని బాధించకూడదు. అలాంటి అన్యాయస్థులమీద కోపం తెచ్చు కోవడంకన్నా వారిని ప్రేమించగలగాలి. నియంతృత్వాన్ని, కాఠిన్యాన్ని వ్యతిరేకించండి, కాని ఆ కఠినుణ్ణి బాధించకూడదు. అలాంటివారి హృదయా లను ప్రేమతో గెలుచుకోవాలి. అలాంటివారి కఠిన నిర్ణయాలను అంగీకరించ నప్పుడు జీవితాంతం వరకు వారు విధించిన శిక్షను భరించేందుకు సిద్ధపడాలి.

**3.బ్రహ్మచర్య ప్రతిజ్ఞ :** ముందు చెప్పిన రెండింటిని పాటించాలంటే బ్రహ్మచర్యం తప్పనిసరి. స్త్రీలను మోహ దృష్టితో చూడకుండడమే కాదు, జంతు వాంఛలను అదుపులో ఉంచుకోవాలి. అప్పుడు ఆలోచనల్లో కూడా అలాంటివి ప్రవేశించ కూడదు. వివాహం చేసుకున్న పురుషుడు జీవితాంతం తన భార్యను స్నేహితురాలిగా భావించుకొని, తమ సంబంధాన్ని పవిత్రమైనదిగా స్థిరీకరించుకుంటాడు.

**4.జిహ్వను అదుపులో ఉంచుకోవడం :** ఆహార నియమాలను క్రమ బద్ధీకరించు కోవాలి. జంతువాంఛలను ఉత్తేజపరిచే ఆహార పదార్థాలను నిషేధించు కోవాలి.

**5.దొంగతనం చేయననే ప్రతిజ్ఞ :** ఇతరుల సంపదను దోచుకోక పోవ డమే కాదు, మనకు నిజంగా అవసరంలేని వస్తువులను వాడడం కూడదొంగతనంకిందే లెక్క. ప్రకృతి మన నిత్యావసరాల కోసం కావలసిన వాటిని ఇస్తూనే వుంది.

**6.వ్యక్తిగతంగా దాచుకోకూడదనే ప్రతిజ్ఞ :** అతిగా సంపాదించి దాచుకోవడమే కాదు, అసలు వేటినీ స్వంతానికి దాచుకోకూడదు. వాటిలో మన శరీరావసరాలకు అవసరం కానివి చాలా వుంటాయి. ఎప్పుడూ జీవితాన్ని సాదాగా ఉంచుకునే ఆలోచనలు చెయ్యాలి.

ఇవి ప్రధానమైన ప్రతిజ్ఞలు. వీటికి మరికొన్నింటిని మనం అనుసం ధించు కోవాలి.

**1.స్వదేశీ:** మోసపూరితమైన వస్తువులను వాడకూడదు. తయారు చేయబడిన వస్తువులను ఉపయోగించకూడదు. మిల్లు కార్మికులు ఎన్నో బాధలకోర్చి వస్తువులు తయారుచేస్తారు. ఆ వస్తువులు వారి ఓర్పును దోచుకు న్నవి. విదేశీ వస్తువులు మిల్లుల్లో తయారు చేయబడతాయి. అవి హింసలోంచి తయారైనవి. మనదేశంలో తయారైన సామాన్య వస్తువులనే వాడండి.

**2.నిర్భీతి :** భయంతో పనిచేసేవాడు సత్యాన్ని, అహింసనూ అనుసరించ లేడు. రాజులు, ప్రజలు, కులం, కుటుంబాలు, దొంగలు, దోపిడీదారులు, క్రూర జంతువులు, మృత్యువు మొదలైనవాటి భయాన్నించి విముక్తిని సాధిం చాలి. నిజమైన నిర్భీతి పరుడు తన సత్యశక్తివల్ల, ఆత్మశక్తివల్ల, తనను రక్షించు కోగలుగుతాడు. ఇలాంటి ముఖ్య లక్షణాల ద్వారా తన జీవితానికి పునాది వేసుకున్నవాడు త్వరగా ఇతర అవసరాలమీద దృష్టి పెట్టాలి. ఉపాధ్యాయుడు శారీరక శ్రమ చేయడంలోను, వ్యవసాయ కార్యక్రమాలలో పాల్గొనడంలోను ఆదర్శంగా ఉండాలి. ఉపాధ్యాయులు ముఖ్యమైన భాషలను ఎరిగి వుండాలి.

ఇక విద్యార్థుల విషయానికొస్తే, విద్యార్థులు ఏ వయస్సులోనైనా ఆశ్రమంలో చేరవచ్చు కాని, నాలుగేళ్ల వయసు సరైనది. వారి విద్యార్జనా కాలం పది సంవత్సరాలు. వారు వారి తల్లిదండ్రులనుండి, కుటుంబంనుండి వేరవుతారు. వారి మీద తమ అధికారాన్ని తల్లిదండ్రులు వొదులుకోవాలి. పిల్లలు ఎప్పుడూ తల్లిదండ్రుల దగ్గరికి వెళ్ళకూడదు. పిల్లలు సామాన్యమైన దుస్తులు ధరించాలి. సామాన్యమైన భోజనం భుజించాలి. అదీ శాకాహార భోజనం మాత్రమే అయివుండాలి. వారికి శెలవులుండవు. వారు వారంలో రోజున్నరపాటు సృజనాత్మక కార్యక్రమాల్లో పాల్గొనాలి. సంవత్సరంలో మూడు నెలల కాలం భారతదేశమంతా నడిచి చూడాలి. విద్యార్థులందరూ హిందీ, ద్రావిడ భాషలు నేర్చుకోవాలి. రెండోభాషగా ఆంగ్లభాషను అభ్యసించాలి. వీటితోపాటు అయిదు భారతీయ భాషల్ని – ఉర్దూ, బెంగాలీ, తమిళం, తెలుగు, దేవనాగరి – తెలిసి ఉండాలి. వారి మాతృభాషలోనే చరిత్ర, భూగోళ శాస్త్రం, లెక్కలు, ఆర్థికశాస్త్రం, సంస్కృతం చదువుకోవాలి. వాటితోబాటు వ్యవసాయం, నేత నేర్వాలి. మొత్తం విద్యాభ్యాసం మత వాతావరణంలో జరగాలి. విద్యార్జన పూర్తయ్యాక, ఉపాధ్యాయులలాగే దీక్ష తీసుకోవొచ్చు, బాహ్య ప్రపంచంలోనికి వెళ్ళవచ్చు. విద్య ఉచితంగా బోధించ బడాలి.

నిజమైన భారత పౌరుల్ని, ఉపాధ్యాయుల్ని తయారు చేయడంకోసమే గాక, తన ఉద్యమానికి మూలస్తంభాలైన సత్యాగ్రహుల్ని తయారు చేసుకునేం దుకు గాంధీజీ 'సబర్మతి' లాంటి ఆశ్రమాల్ని స్థాపించారు. దక్షిణాఫ్రికాలో వుండగా అక్కడి భారతీయ కాలనీవాసుల పిల్లలకోసం కూడా గాంధీ తన అభిమాన రష్యన్ రచయిత టాల్‌స్టాయ్ పేరుమీద 'టాల్‌స్టాయ్ ఫాం' అనే విద్యాసంస్థనూ, ఫీనిక్స్ ఆశ్రమాన్నీ స్థాపించారు. భారతీయాత్మను, భారతీయ వ్యక్తిత్వాన్ని, గొప్ప పౌరుల్ని, సత్యాగ్రహుల్ని తయారుచేసేందుకు భారతీయ గురుకుల విద్యావిధానమే శరణ్యమని భావించి గాంధి, ఠాగూర్, శ్రీ అరవిం దులు తమ ఆశయాలకనుగుణంగా భారతీయ విద్యావిధానాన్ని తాము స్థాపిం చిన విద్యాలయాలలో అమలుచేసి చూపించారు.

ప్రస్తుతం మన విద్యార్థులు ప్రపంచీకరణ నేపథ్యంలో పరాయీకరణకు బలౌతున్నారు. నేడు మనం చూస్తున్నది 'విద్య' కాదు. ఇది నీతి, నియమాలు, క్రమశిక్షణ, అధ్యాపన మొదలైన విలువలు తుడిచిపెట్టుకుపోయిన రాక్షస వ్యాపార విధానం . ఇందులోంచి తయారయ్యేవారు అహంకార పూరిత దాంభికులు, జనుపాంధులు.

రేపటి పౌరులుగా ఉండవలసిన నేటి విద్యార్థుల వల్ల, భారతదేశపు భవితం ఎంత అధ్వాన్నమూ, అగమ్యగోచరమూ కాబోతోందో ఊహించడానికే భయమౌతుంది.

బస్టాండు నిండుగా జనం, అంతా గోలగోలగా వుంది. వరుసగా మూడు రోజులు పండుగ సెలవులు. భార్య, పిల్లలు ఇంతకు ముందే బస్సెక్కి ఊరెళ్ళారు. నాకు రేపటికిగానీ ఆఫీసుపని పూర్తికాదు. రేపు సాయంత్రం నేను కూడా బస్సెక్కాల్సిందే. రద్దీలో ఇరుక్కుని ఇరుక్కుని సీటు ఉన్నా లేకపోయినా నిలుచొని అయినా ప్రయాణం చేయాల్సిందే. ఊర్లో అందరూ ఎదురు చూస్తుంటారని చెప్పలేను కానీ, నేనే ఊరికి వెళ్ళే సమయంకోసం ఎదురుచూస్తూ  ఆతృతగా వున్నాను. బస్సుల్లో టికెట్టు ధరలు రెట్టింపు చేశారని, సీట్లు దొరకడమే చాలా కష్ట మని జనం గోలపెడుతుండడం వినిపిస్తూనే వుంది.







# ఇంట్లోపలికి వెళ్ళే ముందు

**రైళ్ళు, బస్సులు** ఎక్కడ చూసినా రద్దీ రద్దీ. నగరం కొంతమేరా ఖాళీ అవుతోంది. పరిసరాల్ని గమనిస్తూ బస్టాండు నుండి వెనుతిరిగి మెల్లగా ఇంటివైపు నడుస్తూ వున్నాను. ఇంత జనం పిల్లా పాపలతో, బ్యాగులు మోసుకుంటూ ఉరుకులు, పరుగులతో బస్టాండువైపు, రైల్వే స్టేషన్‌వైపు పరుగులు పెడుతుంటే చూడ్డం వింతగా ఉంటుంది.

చాలా పండుగల సందర్భాల్లో సంవత్సరంలో రెండు, మూడు సార్లు ఇలాంటి దృశ్యాలు కనపడుతూనే వుంటాయి.  చాలా మంది నగరం నుండి బయటపడటానికి పరుగులు తీస్తుంటే నేనేమో నింపాదిగా నగరం లోలోపలికి తీరిగ్గా నడుస్తూ వున్నాను. ఎందుకో తలనొప్పిగా అనిపిస్తోంది. అత్యవసరంగా టీ తాగాల్సిందే. సిలిగురి టీ పాయింట్ చేరుకోవాల్సిందే.

మామూలు రోజులైతే రద్దీ తప్పనిసరే. వురుకులు పరుగులు కూడా. అయినా రేపటి నుండి సెలవులే కాబట్టి ఎందుకో లోపలి ఆరాటాలు, ఉద్వేగాలు తగ్గినట్లుగా అనిపిస్తోంది. వాతావరణం చల్లగానే వుంది. కానీ లోపలే ఏదో  ఉక్క

పలమనేరు బాలాజీ



94409 95010

తొందర పెడుతోంది. సాధారణంగా ఎంతమాత్రం ఆలోచించడానికి వీలు దొరకని, సమయం కుదరని రద్దీ రోజుల్లోంచి బయటపడి ఇట్లాంటి సెలవు రోజుల్లో కొంతయినా ఆలోచించుకోడానికి సమ యం, అవకాశం కుదిరినప్పుడల్లా ఎవరెవరో గుర్తుకొస్తారు. ఏవేవో గుర్తుకొస్తాయి. కొనసాగించడానికి భయపడి వదిలివేసిన ఆలోచనలన్నీ చుట్టుకుంటాయి. ఒక ఉద్వేగభరితమైన వాతావరణం మనసులో అలజడి రేపుతుంది. మరచిపోయిన లేదా మరచిపోయానని నేను అనుకుంటున్న మనుషులు, సంఘటనలు, అనుభవాలు, బాధలు, సందర్భాలు, జ్ఞాపకాలు, ఒకటొక్కటిగానూ, సమిష్టిగానూ గుర్తుకొచ్చేస్తాయి. కొంచెం ఏకాంతం, తీరిక దొరికితే చాలు మనసు లోలోపల దాచుకున్న అనుభూతులేవో మెల్లగా అలా బయటకొచ్చేస్తాయి. ఘర్షణకు, స్వాంతనకు మధ్య స్థితి.

దేని గురించి అయినా యథాలాపంగా వినడం, చూడడం, మాట్లాడడం చాలా సునాయాసంగా అలవాటయిపోయింది. ఎక్కడా మనసులో గానీ, మాటల్లోగానీ, ఆలోచనల్లోగానీ తడబాటు వుండదు, ఘర్షణ వుండదు, సంశయం వుండదు. అంతా స్పష్టంగానే వుంటుంది. ఏమీ పట్టించుకోనితనం, దేన్నీ గ్రహించనితనం అన్నింటినీ, అందరినీ విస్మరించడమే వర్తమానం. యథాలాపంగా కాలాన్ని నెట్టడమే జీవితం అయిపోయింది.

రోడ్డుపైన వాహనం నడపాలన్నా, నడక కొనసాగించాలన్నా భయమే. అయినా భయంతోనే బండి నడపడం, నడవడం. గడియారాన్ని చూస్తే ఎందుకో తెలీదు గుండె ఝల్లుమంటుంది. గడియారాన్ని చూసీచూడగానే ఏదో కంగారు తొందర పెడుతోంది. ఎక్కడ నిలవలేనితనం. నింపాదిగా ఎవరితో మాట్లాడలేనితనం.

మాట్లాడాలంటే మనిషి ఉండాలికదా!
మాట్లాడాలంటే మనసు ఉండాలికదా!
మాట్లాడాలంటే... అసలు మాటలుండాలి కదా...!!

ఎవరితో మాట్లాడాలి? ఎప్పుడు, ఎక్కడ ఏం మాట్లాడాలి? రోజుకి లక్ష మాటలు, కోటి మాటలు మనుషుల మధ్య దొర్లుతూనే వున్నాయి, వుంటాయి. ఒక్క మాటయినా మనసుకు ఎక్కదు, మనిషిలో నిలవదు. రోజంతా మాట్లాడినా రాత్రి పడుకోబోయే ముందు తలచుకుందామంటే ఒక మంచి మాటయినా గుర్తుకురాదు. ఎందరితో కలిసినా, చాయ్‌లు, సమోసాలు, భోజనాలు, కబుర్లు, చర్చలు నడిచినా ఒకరి ముఖం కూడా గుర్తుకు రాదు. ఒక్క మాటయినా, ఒక్క మొహం అయినా గుర్తుందకపోవడం పెద్ద జబ్బేమో తెలీదు. బహుశా ఇది అతి పెద్ద అంటువ్యాధి కూడా కావచ్చునేమో. ఒకరి నుండి ఒకరికి, సమూహం నుండి మనిషికి, మనిషి నుండి సమూహానికి, సమూహం నుండి సమూహానికి అత్యంత వేగంగా వ్యాపిస్తున్న ప్రమాదకరమైన జబ్బేమో.

నడిచి నడిచీ అలిసిపోయాను. ఇంకొంచెం నడిస్తే ఇల్లు వస్తుంది. తాళం వేసిన ఇల్లు. మేంలేని ఖాళీ ఇల్లు. నాకోసం ఇల్లు ఎదురుచూస్తూ వుంటుందనుకోగానే ఎందుకో నవ్వొచ్చింది. ఎవరి హడావుడిలో వాళ్ళున్నప్పుడు, రద్దీ రోడ్డుపైన నేను గట్టిగా నవ్వితే పట్టించుకొనేవాడెవడు? గట్టిగానే నవ్వేశాను. రోడ్డుకు కుడివైపుగా నడుస్తూ నాకు ఎదురుపడిన ముసలి వ్యక్తి వింతగా నావైపు తల తిప్పి చూసుకుంటూ వెళ్ళాడు. అతన్ని చూస్తే నాకనిపించింది, అందరూ రోడ్డుకు ఎడమవైపే నడవాలనే కనీస విషయాన్ని కూడా కొందరు ఎందుకు పట్టించుకోరో అని.

గతవారం ఆసుపత్రి వద్ద నాకేదో సర్టిఫికెట్లు అవసరమై వెళ్ళినప్పుడు డాక్టరు, నర్సులు మధ్య మధ్యలో నవ్వుకుంటూ జరిపిన సంభాషణ గుర్తుకొచ్చింది. ఏదో రోడ్డు యాక్సిడెంట్ కేసు. రక్తగాయాలతో మనిషిని తీసుకొచ్చారు. ట్రీట్‌మెంట్ పూర్తయింది. ప్రమాదం ఏమీలేదు. యాక్సిడెంట్ ఎలా జరిగిందని అడిగితే అతడు చెప్పిన సత్యం ఇదే.

"నేనేమో నాపాటికి నేను రోడ్డుకు ఎడమవైపు బండి నడుపుతూ వున్నానా, వాడెవడో ఉన్నట్లుండి మూర్ఖంగా నాకు అడ్డంగా ఎదురుగా వచ్చి ఢీకొట్టాడు. వాడూ కింద పడ్డాడు. వాన్ని చూస్తేనే వాడికి బండి నడపడం రాదని అర్థమైపోయింది. వణికిపోయాడు మనిషి. నేనూ తిట్టాను ఏమిరా బుద్ధిలేదా? ఎందుకురా రాంగ్ రూట్లో వచ్చావు? అని అడిగాను. వాడు చెప్పింది ఒక్కటే ఒకే మాట. చెప్పి నేనేం చేస్తానోనని భయపడి బండి స్టార్ట్ చేసుకొని పరుగులు తీశాడు. ఇంతకీ వాడు చెప్పింది వాడికి ఎడమవైపు బండి నడపాలనే సంగతే అస్సలు తెలియదట."

డాక్టర్లు, నర్సులు, ఆస్పత్రి సిబ్బంది నవ్వుకుంటూ ఉండిపోయారుగానీ నాకైతే ఒళ్ళు గగుర్పొడిచింది. ఇంకేమైనా ప్రమాదం ఇంతకన్నా తీవ్రంగా జరిగింటే దానికి కారణం ఎవరు? ప్రమాదం జరగదని గ్యారంటీ ఏమీ లేదుకదా? ఇంత ఆధునిక కాలంలో కూడా కనీసం రోడ్డుకు ఎడమవైపు నడవాలనే, బండి నడపాలనే కనీస పరిజ్ఞానం కూడా మనుషులకు అక్కడక్కడా లేదంటే ఆ విషయమే వాళ్ళకు తెలీదంటే ఏమనుకోవాలి. ఈ విషయంలో అందరూ బాధితులే అయితే బాధ్యులెవరు?

సిలిగురి టీపాయింట్ వద్ద అప్రయత్నంగా నడక ఆగిపోయింది. రద్దీగా వుంది. లోపల జనం సిగరెట్స్ పొగల మధ్య కుర్చీలో సాగిలపడి, కబుర్లు చెప్పుకుంటున్నారు. టీ దుకాణం ముందువైపు మరి కొందరు గుంపులు గుంపులుగా పొగలుపోతున్న టీ కప్పుల్ని చేతుల్లో వుంచుకొని మాటల్ని పంచుకుంటున్నారు.

టీ దుకాణం లోపలికి వెళ్ళకుండా, టీ కావాలని చెప్పకుండా రోడ్డుపైనే నిల్చుని కొన్ని నిమిషాల పాటు ఆ రద్దీ ప్రపంచాన్ని గమనిస్తూ వుండి పోయాను. శ్రీనాథ్, సూరి, మణి, సదానంద్, సెంథిల్, దేవేంద్రనాయుడు, అమరనాథ రెడ్డి, కుమారస్వామి, నేతాజీ, గోపి, హేమంత్ కుమార్... అందరూ తరచూ కలుసుకునేది ఇక్కడే. అందరూ కల వాల్సిన పని వున్నా, ఏదైనా మాట్లాడాలని అనుకున్నా, కబుర్లు చెప్పుకోవాలన్నా అందరికీ కేంద్ర స్థానమే ఈ సిలిగురి టీ పాయింట్.

రేపు శనివారం కాబట్టి బహుశా రేపు సాయంత్రం ఆరు గంటలప్పుడు ఈ టీ సెంటర్ వద్దే మిత్రులందరూ చేరిపోతారు. ఊరి నుండి బయటకు వెళ్ళే ముందైనా, బయట నుండి ఊర్లోకి వచ్చేటప్పుడైనా సరాసరి ఇక్కడకే రావటం, టీ తాగి వెళ్ళడమో, రావటమో బాగా అలవాటయిపోయింది మా మిత్రులందరికీ.

వారంలో ఎప్పుడు కలసినా, కలవలేకపోయినా శనివారం సాయంత్రం ఆరింటికి సిలిగురి టీ పాయింట్ వద్ద చేరిపోవాల్సిందే. పశ్చిమ బెంగా

ళ్లోని సిలిగురి ప్రాంతం నుండి వచ్చే టీ పొడితో జయరాం చేసి ఇచ్చే అద్భుతమైన ఛాయ్ తాగాల్సిందే. జయరాం వైపు చూస్తూ నవ్వుతూ, "జయరాం టీ ఒక కప్పు" మామూలుగా చెప్పినట్లే వినయంగా చెప్పాను. ఎవరైనా తెలిసిన వాళ్ళు కనపడతారేమో అని నాకు తెలిసిన వాళ్ళ ముఖాల కోసం అటూ ఇటూ తలతిప్పి చూసాను. ఒక్కరూ లేరు. ఎందుకో హాయిగా, ప్రశాంతంగా అని పించింది. సమూహంలోని నా ఏకాంతాన్ని కానీ, కొనసాగుతున్న నా ఆలోచనల్నికానీ అడ్డుకునే వాళ్ళెవరూ ఇక్కడ లేనందుకు లోలోపలే సంతోషం కలిగింది. టీ ఇంకా రాకపోవడంతో ఆ సంతోషం లోంచే "జయరాం ... స్ట్రాంగ్‌గా" అని మెల్లగా అరిచాను.

ఎవరితో మాట్లాడాలి? ఎప్పుడు, ఎక్కడ ఏం మాట్లాడాలి? రోజుకి లక్ష మాటలు, కోటి మాటలు మనుషుల మధ్య దొర్లుతూనే వున్నాయి, వుంటాయి. ఒక్క మాటయినా మనసుకు ఎక్కదు, మనిషిలో నిలవదు. రోజంతా మాట్లాడినా రాత్రి పడుకోబోయే ముందు తలచుకుందామంటే ఒక మంచి మాటయినా గుర్తుకురాదు. ఎందరితో కలిసినా, చాయ్‌లు, సమోసాలు, భోజనాలు, కబుర్లు, చర్చలు నడిచినా ఒకరి ముఖం కూడా గుర్తుకు రాదు. ఒక్క మాటయినా, ఒక్క మొహం అయినా గుర్తుండకపోవడం పెద్ద జబ్బేమో తెలీదు. బహుశా ఇది అతి పెద్ద అంటువ్యాధి కూడా కావచ్చునేమో. ఒకరి నుండి ఒకరికి, సమూహం నుండి మనిషికి, మనిషి నుండి సమూహానికి, సమూహం నుండి సమూహానికి అత్యంత వేగంగా వ్యాపిస్తున్న ప్రమాదకరమైన జబ్బేమో.

ఆ అరుపు నాకే వింతగా అనిపించింది. నా గొంతు నాకే కొత్తగా అనిపించింది. ఎప్పుడూ ఎవరేమనుకుంటారో అని భయపడుతూ, ఎవరి అహమూ దెబ్బతినకుండా, ఎవ్వరూ నొప్పి పడకుండా, ఎవర్నీ నొప్పించకుండా, మెల్లగా, మెత్తగాలో గొంతుకతో సుతిమెత్తగా మాట్లాడ్డమే చాలా సంవత్సరాలుగా అలవాటయిపోయింది. ఆఫీసులోనూ, బయటా, ఇంట్లో...అన్నిచోట్లా అదే గొంతు అలవాటయిపోయింది.

నేను బాగా మాట్లాడుతానని, నా పలకరింపు బాగుంటుందని జనం అన్నప్పుడంతా నా అంతరాత్మ నా చెవులకు మాత్రమే వినపడేలా ఒక మాట అంటూ వుంటుంది ఎప్పుడూ.

" రేయ్ నాన్నా...ఇది నీ గొంతు కాదురా నటన" అని. నిజమే ఇది నా గొంతు కాదు. నవ్వుతూ కనిపించే ముఖం కూడా నాది కాదు. ఎంత ఒత్తిడిలో అయినా, ఉద్వేగంలో అయినా మాటతడబడకుండా గొంతులోకి లోపల కఠినత్వం పైకి రాకుండా, ముఖంపైన నవ్వు చెదరకుండా వుండటం అలవాటు చేసుకునేసాను. ఎవ్వర్నీ నొప్పించలేను, బాధించలేను. ఎవ్వర్నీ దూరం చేసుకోలేను. ఇప్పుడట్లా సుతిమెత్తని మాటలతో నటించాల్సిన అవసరం లేకపోవడం వల్లే నిర్భయంగా, స్వేచ్ఛగా, అట్లా గట్టిగా, హాయిగా అరవగలిగానేమో.

నాదైన నా గొంతుతో నేనిట్లా మాట్లాడి చాలా చాలా కాలమవుతోంది. ఎప్పుడో పెళ్ళికి ముందు, ఉద్యోగంలో చేరటానికి ముందు అనుకున్నది అనుకున్నట్లుగా వాగేసేవాణ్ని. వెనకాముందు ఏమీ చూసుకునేవాడిని కాదు. నోటికి ఎంత మాటొస్తే అంత మాట సులభంగా అనేసేవాడిని. ప్రసన్నంగా, నవ్వుతూ, వినయంగా మాట్లాడే ఈ గొంతుకానీ, ఈ ముఖంగానీ నావి కావని నాకు ఖచ్చితంగా తెలుసు. లోకానికే ఆ విషయం తెలియదు.

ఏమో! తెలియదని నేననుకుంటున్నాను, కానీ నా అసలు స్వరూపాన్ని గమనించిన వాళ్ళుకూడా వుంటారేమో! బయట ప్రపంచానికి కనపడే నేను - నేను కాదు అని గ్రహించిన వాళ్ళూ వుంటారేమో! ఎటొచ్చీ నా లోపలి నుండి నా లోలోపలి నుండి నేనేమిటో బయటపడనట్లే వాళ్ళూ బయటపడరేమో! నేనేమిటో తెలిసి కూడా, తెలుసుకుని కూడా, తెలియనట్లే నటిస్తున్నారేమో!

టీ రాలేదు. మెత్తగా చెప్పాను. నవ్వుతూ చెప్పాను. అరిచి మరీ చెప్పాను. అయినా టీ రాలేదు. రద్దీ ఎక్కువగా వుంది. ఎంత రద్దీవున్నా నాకేమిటి? నాకు వేడి వేడిగా టీ కావాల్సిందే. టీ అత్యవసర ఔషధం.

" జయరాం వేడిగా, స్ట్రాంగ్ గా..." ఈ సారి స్వరం మరింతగా పెంచి అరిచాను. నా గొంతు కీచుమంది. అంతమాత్రం గట్టిగా, నిర్భయంగా, నిస్సంకోచంగా నేను మాట్లాడి చాలా కాలం అవుతోంది.

ఇంతకు ముందు నా స్వరంలో విని పించని, కనిపించని విసురు, విసుగు, కొంచెం కోపం, కొంచెం ఆవేశం ఇప్పుడు నాకే స్పష్టంగా తెలియవచ్చాయి.

జయరాం గబగబా వచ్చాడు. అతడి మొహంలో మార్పు కన్పిస్తోంది. ముఖకవళికలు మారిపోయాయి. హడావుడిగా తిరుగుతూ, జనం మధ్య ఎప్పుడూ నన్ను అస్సలు పట్టించుకోని, గుర్తించని జయరాం ముఖంలో ఆశ్చర్యంగా ప్రసన్నత, చిరునవ్వు, వినయం కనబడ్డాయి.

" సారీ సార్...లేటయ్యింది. కొత్త టీ పొడి నిన్న సాయంత్రమే బెంగుళూరు నుండి పార్శిల్ వచ్చింది. మీరు టీ తాగి ఎట్లావుందో చెప్పాలి" అంటున్నాడు వినసొంపైన గొంతుతో.

అతడి ముఖం కన్నా అతడి గొంతే నాకు ఆశ్చర్యం కలిగించింది. నేనెప్పుడూ వినే కరుకైన ఆ గొంతు, నిజానికి అతడిది కాదులా వుంది. అతడి నిజమైన గొంతు ఈ నిముషం నేను విన్న తియ్యనిదే అని స్పష్టంగా తెలిసిపోయింది.

జనం మధ్యన మొరటుగా, బండగా అట్లా మాట్లాడ్డమే అతడి అవసరం కాబోలు. ఆ అవసరమే అతడినట్లా మార్చిందేమో. అంతే కదా! నా అవసరాలు నన్నిట్లా మెత్తగా నంగి నంగిగా మాట్లాడేలా మార్చినట్లే, నేను ఆ మెత్తటి గొంతుతో జనాన్ని ఏమార్చినట్లే, జయరాం కూడా కరుకు గొంతుతో అట్లా కాలాన్ని నెట్టుకొస్తున్నాడేమో.

టీ నిజంగా బాగా లేదు.

వగరు ఎక్కువైంది.

పాలు బాగా మరిగిపోయిన వాసన.

జయరాం ఆశగా, ఆసక్తిగా నావైపే కుతూహలం నిండిన ముఖంతో చూస్తూ వున్నాడు. నేనేం చెపుతానా అనే ఆసక్తి నిజంగా అతడిలో లేదని నాకు బాగానే అర్థం అయ్యింది. అయినా నా జవాబు లేదా నా మాట లేదా నా అభిప్రాయానికేదో చాలా విలువ ఇస్తున్నట్లు నా వైపే చూస్తూ, వినయంగా కొంచెం వంగి నిలుచున్న అతడికి ఏం చెప్పాలో...చప్పున తోచలేదు. వెంటనే ఒక నిర్ణయానికి రాలేకపోయాను.

క్షణాలు గడుస్తూ వున్నాయి.

టీ చప్పరిస్తూ వున్నాను.

దుకాణంలో సందడి అంతకంతకూ పెరిగిపోతోంది. ఇంకో కుర్రాడు జయరాంలాగే వేగంగా టీ చేసి అందివ్వటానికి ప్రయత్నిస్తూ వున్నాడు.

కొన్ని క్షణాల తర్వాత, అతడి ముఖంలోని వినయం మెల్లగా కొంచెం కొంచెం ఆవిరవుతున్న సమయంలో...గొంతు సవరించుకొని "నిజంగా టీ బాగాలేదు. పాలు బాగా మరిగిపోయాయి. టీ పొడిలో ఏదో ఫ్లేవర్ కలిపినట్లున్నారు. రుచిగా లేదు" చెప్పేసాను.

అతడు ఏమనుకుంటే నాకేమిటి? సత్యం ముఖ్యం కదా అనుకుని తెగించి మాట్లాడేసాను. హమ్మయ్య ఒక పనయిపోయింది! నాకెందుకో బరువు తగ్గినట్లనిపించింది.

ఆశ్చర్యం! అతడి ముఖంలోకి నవ్వొచ్చింది. ముఖంనిండా నవ్వే. ఎందుకు అతడికి అంత నవ్వొచ్చిందో చప్పున అర్థం కాలేదు.

అతడి కళ్లు కూడా నవ్వుతున్నాయి. ఇన్ని వందల రోజుల్లో ఇక్కడ గడిపిన వేలాది గంటల్లో ఇప్పటివరకూ కొన్ని వేలసార్లో లక్షల సార్లో అతడ్ని చూసి వుంటాను. కానీ ఈ క్షణం నాకు అనిపించింది ఒక్కటే. ఇంత వరకూ అతడి ముఖాన్ని నేనెప్పుడూ మనసులో ముద్రపడేలా కళ్లారా ఒక్కసారి కూడా నింపాదిగా చూడనైనా లేదనే సత్యం ఇప్పటికి అర్థమైంది.

నిజమే!

అతడు చాలా అందంగా వున్నాడు. ఎప్పుడూ చిరాగ్గా, హడావిడిగా, అటూ ఇటూ వేగంగా తిరుగుతూ, మొరటుగా, బండగా, కరుగ్గా, విసుగ్గా, విసురుగా, అరుస్తున్నట్లు మాట్లాడుతూ కనిపించే అతగాడి మొహంలోని నిశ్చలత, ప్రశాంతత, నెమ్మదితనం...ఈ క్షణం నన్ను అమితంగా ఆకట్టుకున్నాయి.

ఉన్నట్లుండి అతడికి నేను అభిమానినయిపోయాను. సంతోషంగా, నిర్మలంగా, ప్రశాంతంగా నవ్వుతూ వుండటం వల్ల ఇప్పుడు మరింత అందంగా కనిపిస్తున్న జయరాం వైపే కళ్ళార్పకుండా చూస్తూ నిలుచున్నాను.

అతడి నవ్వుముఖం, సంతోషంతో మెరుస్తున్న చురుకైన కళ్ళు నాకు ఆశ్చర్యం కలిగిస్తుంటే, అద్భుతం అనిపిస్తుంటే...ఆ క్షణం అంతకన్నా సంతోషంగా, అద్భుతంగా.. అతడొక మాటన్నాడు.

ఏం మాట అది? ! డొల్లతనాన్ని పగలగొట్టుకుని లోలోపల మనిషిని పునరుజ్జీవింపజేసే మాట. ఒళ్లు ఝల్లుమంది.

" సార్... మీరు చెప్పింది నిజం సార్. ఏం అనుకోకండి. నేను చాలాసార్లు మీరు కోప్పడతారేమో అని కూడా ఎదురుచూసాను. ఎప్పుడైనా టీ రుచిగా లేకపోయినా నవ్వుకుంటూనే తాగే వాళ్లు మీరు. కొన్నిసార్లు టీ అంతగా వేడి లేకపోయినా...నవ్వుకుంటూనే మీరు టీ తాగే వాళ్లు. నేనైతే మీరెప్పు డైనా తిడితే వినాలని ఎన్నిసార్లు అనుకున్నానో. భలే లోపలి మనిషిసార్ మీరు. లోతైన మనిషి సార్. వుండండి. మీకు ఇష్టమైన టీ తెస్తాను".

జయరాం ఆ మాట అని, నా చేతుల్లోంచి ఇంకా ఖాళీకాని టీకప్పుని నా అంగీకారంతో ప్రమేయం లేకుండా తీసేసుకుని, దుకాణం లోపలికి నడిచాడు.

అసలు అక్కడ నాకు కనబడుతున్న దృశ్యమే ఉన్నట్లుండి పూర్తిగా మారిపోయింది. ఎంత మంది జనం వున్నా నాకు ఎవ్వరూ కనబడటం లేదు. ఎంత మంది జనం ఎంత గోలగోలగా మాట్లాడుకుంటున్నా ఒక్క మాటకూడా నా చెవిన పడటంలేదు.

నా కళ్ళముందు ఒకడే కనబడుతున్నాడు

నా చెవుల్లో అతడి మాటే వినబడుతోంది.

"లోపలి మనిషి, లోతైన మనిషి."

లోపలి మనిషంటే ఏమిటి? ఎవరు లోపలి మనిషి?

లోతైన మనిషంటే ఏమిటి? ఎవరు లోతైన మనిషి?

నాలో వున్న ఖాళీల మాటేమిటి?

ఈ ఖాళీల్ని ఎవరు పూరిస్తారు?

పొగలు చిమ్ముతూ, వగరు వాసనతో నేనిష్టపడే సిలిగురి చాయ్ వచ్చేసింది. వేడి టీ గొంతులో పడగానే బుర్ర చురుగ్గా పనిచేయటం మొదలైనట్లుంది. ఇంత వరకూ ఆలోచించటానికి తీరిక, అవసరం లేదనుకుంటూ నేను కాలాన్ని నిరర్థకంగా గడిపేసాను, కానీ క్షణం ఆగి నింపా దిగా ఆలోచిస్తుంటే...ఇప్పుడనిపిస్తోంది...ఆలోచన మనిషికి ఎంత అవసరం... అని.

మనిషికి ఆలోచన అవసరం మాత్రమే కాదు నిత్యావసరం, అత్యవసరం కూడా.

కొందర్ని చూస్తే లోపల జ్వరం కాస్తున్నట్లుంది నాకు. లోలోపల వాళ్ళ ఆలోచనలేమిటో గ్రహించే కొద్దీ జ్వరం భయంగా మారిపోతుంది. కొందర్ని చూస్తేనే భయం. అంతులేని భయం అలాంటి వాళ్ళ సమక్షంలో అభద్రతగా అనిపిస్తుంది.

అయినా ఆలోచించాల్సినవి చాలా వున్నాయి. మారాల్సిందీ, మార్చుకోవాల్సిందీ చాలానే వుంది. తప్పులపైన తప్పులు చేస్తూనే వున్నా, ఆ తప్పులు కనబడకుండా వుండటానికి నేను మళ్ళీ తప్పులు చెయ్యాల్సి వస్తోంది. అబద్ధాలు అలవోకగా అలవాటయిపోయాయి. ఎవరు ఎవరితో మాట్లాడేది ఎంత వరకూ నిజమో, ఎంత కల్పితమో, ఎంత ఊహో, ఎంత వరకూ అబద్ధమో తెలీకుండా పోతోంది.

టీ తాగడం పూర్తయింది. ఇక ఇంటికి వెళ్ళాలి. ఇంటికి వెళ్ళాల్సిందే. ఇంట్లో ఏది ఎక్కువుందో, ఏది వుందో, ఏది లేదో, ఎంత వుందో, ఎంత లేదో, నాకు తెలిసినా, తెలియకపోయినా ఇంటికి వెళ్ళాల్సిందే.

అన్నీ తెలిసిన మనిషి నా శ్రీమతి ఊరెళ్ళిన తర్వాత ఇప్పుడు నా ఇంట్లోకి వెళ్ళాలని కదులుతూవుంటే నాకు అన్పించింది ఏమిటంటే అస్సలు మా ఇంటికే నేనొక అపరి చితుడుగా వెడుతున్నానేమోనని.

ఏది నా ఇల్లు? నాది అనుకునే అధికారమే తప్ప ఆ ఇంట్లో నాది అనిపించే బాధ్యత నాకెక్కడుంది? ఇంటి బరువు, బాధ్యతలు మొత్తం మా ఆవిడపైనేకదా ! శ్రమంతా ఆమెదే కాబట్టి ఇల్లు కూడా నిజానికి ఆమెదే కావాలి. అయినా పేరుకు, దస్తావేజుల్లో, సమాజంలో, ఆదాయపు, స్థిరాస్థి లెక్కల్లో ఆ ఇల్లు నా పేరిటే ఉంది. నాకది ఒక విశ్రాంతి కేంద్రం మాత్రమే. కానీ ఆమెకు అలాకాదు. ఇల్లే సర్వస్వం. అయినా ఇంటి గురించి నాకేం తెలుసు?.

అవునవును. ఏ స్విచ్ ఏ లైటుదో, ఏ స్విచ్ ఏ ఫ్యానుదో తెలియని వాడికి, ఎప్పుడూ వంటింట్లోకి వెళ్ళనివాడికి, కుర్చీలు, టేబుళ్ళు, టీపాయ్‌లు సర్దని వాడికి, ఇంట్లో దుమ్మూ, ధూళి శుభ్రం చేయనివాడికి, ఇంటి గురించి, ఇంట్లోని వాతావరణం గురించి, ఇంటి పరిసరాల గురించి, ఇంట్లోని మనుషుల గురించి ఎప్పుడూ ఒక్క రోజైనా తీరిగ్గా ఆలోచించని వాడికి, సహచరిని బానిసను చేసుకున్న వాడికి ఇల్లేమిటి? ఇంట్లోకి వెళ్ళేముందు ఎప్పుడూ ఆలోచించవలసిన విషయాలే ఎప్పుడూ ఆలోచించనవి, ఆలోచనలకే తీరికలేనప్పుడు పునరాలోచనకు చోటెక్కడ?

టీ దుకాణం నుండి కదిలే ముందు టీ డబ్బులు ఇవ్వబోతుంటే, అదే నవ్వు మొహంతో "ఈ రోజు మాత్రం ఈ టీకి డబ్బులు వద్దు సార్ పర్వాలేదు" అన్నాడు జయరాం.

అప్రయత్నంగా, అనాలోచితంగా, ఎందుకో దూకుడుగా నాలోపలి నుండి అత్యంత వేగంగా, నగిషీలు లేకుండా, ఉన్నదున్నట్లు నగ్నంగా బయటకు వచ్చేసింది గుండె లోతుల్లోంచి ఆ మాట.

"నన్ను బానిసను చెయ్యకు మిత్రమా!"

"నమస్కారం  వంశీగారూ!"

మధురంగా విన్పించిన ఆ పలకరింపుకి వంశీ ఏకాగ్రత చెదిరిపోయింది. చేతిలో పని ఆపి ఆమెకేసి చూశాడు.

అందానికి నిలువెత్తు నిర్వచనంలా, రెప్పలు వాల్చటం కనులు మర్చిపోయేలా ఉంది. వంశీ పరిసరాలు మర్చిపోయి ఆమెనలాగే చూస్తున్నాడు.

"నా పేరు రోహిణి" మరోమాటు వీణానాదం విన్పించింది.

"చాలా మంచి పేరు..." ప్రశంసగా అన్నాడు.

"థాంక్స్..."





# సంధ్యారాగం

**కాటూరు రవీంద్ర త్రివిక్రమ్**



98495 68901

"చెప్పండి...నేను మీకేమి సాయం చేయ గలను?" వంశీ మృదువుగా, మర్యాదపూర్వకంగా ప్రశ్నించాడు.

"నన్ను చూస్తుంటే మీకు ఎవరన్నా గుర్తుకు వస్తున్నారా?" ఆమె చొరవగా సోఫాలో కూర్చుం టూ అంది.

"మీ అమ్మగారి పేరు సంధ్యారాణి అను కుంటాను..."

"ఎలా చెప్పగలిగారు?" ఆమె మందహాసం తో ప్రశ్నించింది.

"మీ వయసులో ఆమె అచ్చు మీలాగే ఉండేది."

"నిజమే! నేను ముమ్మూర్తులా మా అమ్మ పోలికే..." ఆమె పెదవుల మీద మందహాసం చెరిగిపోకుండా అలాగే ఉంది.

వంశీ శూన్యం కేసి చూస్తూ కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయాడు.

"మీకు మా అమ్మ గురించి తెలుసుకోవాలని లేదా?"

"ఉంది. కానీ సభ్యత కాదు..."

"సభ్యత ముసుగులో మిమ్మల్ని మీరు మోసం చేసుకుంటారా?"

"ఇతరుల్ని మోసం చేయటంకంటే అదే మంచిదేమో..."

"వంశీ గారూ! మా అమ్మ మీ గురించి అన్నీ చెప్పింది..."

"ఈ అభాగ్యుడి గురించి ఏముంటుంది చెప్పటానికి?"

"మీ ప్రేమ గురించి..."

అతను విషాదంగా నవ్వేడు.

"నా జీవితంలో నేను చేసిన మొదటి తప్పు అది..."

"ఎందుకలా అనుకుంటున్నారు?

"కొన్ని విలువైనవి కొందరికే దక్కుతాయి. కోహినూర్ వజ్రం చేతులు మారి బ్రిటిష్ మహారాణి మకుటంలో స్థిరపడింది! అందాన్ని ఎందరో ప్రేమిస్తారు. అందరి ఆశలూ నిరాశపరుస్తూ చివరకి ఎవరికో దక్కుతుంది. సుఖాంతమయితే అది ప్రేమ కథకాదు..."

"అలా ఎందుకనుకోవాలి? నా విషయమే చూడండి...నేను ప్రేమించిన వ్యక్తినే పెళ్ళి చేసు కొన్నాను..."

"సుఖసంతోషాలతో ఉన్నారా?"

"సుఖసంతోషాలకు కొలబద్దలేమిటి? మాకు సమస్యలేమీ లేవు. అంతకంటే సుఖసంతోషాలు ఏముంటాయి?

వంశీ మందహాసం చేశాడు.

"రోగాలేమీ లేకపోవటమంటే, పూర్తి ఆరోగ్య మని కాదు"

"మిమ్మల్ని మాటలతో గెలవలేమని మా అమ్మ చెప్పింది"

"మనసు గెలవలేనప్పుడు మాటలతో గెలి చినా ఉపయోగం లేదు. చెప్పండి, మీరు నా దగ్గ రకు ఏ పనిమీద వచ్చారు?"

"చెబుతాను. కానీ మీరు నన్ను అంత గౌర వంగా మాట్లాడుతూంటే చాలా ఇబ్బందిగా ఉంది. పేరు పెట్టి పిలవొచ్చుగా?"

"చప్పున ఏకవచనంతో పిలవలేను. అల వాటు లేదు".

"అవును ! అమ్మ చెప్పింది.."

"మీ అమ్మ నా గురించి చాలా చెప్పిన ట్లుంది.."

"అవును ! చాలా చెప్పింది."

"సరే...ఏకవచనంతోనే పిలుస్తాను. చెప్పు నా దగ్గరకి ఏం పనిమీద వచ్చావు?

"మీరు నా బొమ్మ గీయాలి.."

వంశీ ఆశ్చర్యంగా చూశాడు.

"నేనిప్పుడు మనుషుల బొమ్మలు గీయటం లేదు"

నవ్వింది రోహిణి.

"మా అమ్మ నాకు దేవత. బహుశః మీకు ప్రేమదేవత అనుకుంటాను" ఆ మాటలు అతని మీద బాగా ప్రభావం చూపినట్టు స్పష్టంగా తెలుస్తూనే ఉంది. కొద్దిక్షణాలు అతను కళ్ళు మూసుకుని, నుదిటి మీద వేళ్ళతో రుద్దుకున్నాడు.

"బహుశః గతాన్ని గుర్తుచేసుకుంటు న్నాడేమో" అనుకుంది రోహిణి. తన బొమ్మ వేస్తే అమ్మ బొమ్మ వేసినట్లేనని ఆయనికి తెలుసు.

"నువ్వేమి అనుకోకపోతే రేపు వస్తావా? హఠాత్తుగా కళ్ళు తెరచి అన్నాడు వంశీ.

"అలాగే ! ఈ ఉత్తరం మీ కోసం అమ్మ పంపించింది" బ్యాగులోంచి ఉత్తరం తీసి ఇచ్చింది. వంశీ ఆతృతగా అందుకొన్నాడు. ఆమె వెళ్ళటానికి నిలబడింది.

* * *

"డియర్ వంశీ...!

ఈ మాటని నేను మొదటిసారిగా ఉపయోగిస్తున్నాను. వాచేత ఇలా పిలిపించుకోవాలని ఎంత ఎదురు చూశావో నాకు తెలుసు. కనీసం ఏకవచనంతో కూడా నిన్ను పిలువలేకపోయాను. నువ్వూ అంతే... నన్ను బహువచనంతో 'మీరు' అంటూ గౌరవంగా పిలిచేవాడివి. ఇవాళ ఈ ఉత్తరం రాస్తున్నప్పుడు గతమంతా ఒక్కమాటు నాముందు పడగ విప్పి పాములా నిలబడింది. నన్ను క్షమించు వంశీ. నేను నీ మనసుని గ్రహించి కూడా, ఏమీ తెలియనట్లు నటించాను. నా ప్రేమని వ్యక్తీకరించే ధైర్యం లేకపోయింది ఇప్పుడా ధైర్యం వచ్చింది. కానీ ఏం లాభం. ఇద్దరం జీవన సంధ్యకు చేరుకున్నాము.

ఈ ప్రపంచానికి ప్రతి చెట్టూ తన వారసత్వాన్ని వదలి వెళ్తుంది. నేనూ అంతే! రోహిణీలో నువ్వు నన్ను చూడగలవు. కానీ నిన్ను నేను ఎవరిలో చూసుకోగలను...! నీకు దూరంగా ఉన్నా నీ గురించి అన్నీ తెలుసుకొంటూనే ఉన్నాను. అందుకు సహకరించింది మీ ఇంటి బజారులో ఉంటున్న



నా ప్రియసఖి ప్రియంవద.

నువ్వు ఆ రోజుల్లోనే గొప్ప చిత్రకారుడివి. ఏ బొమ్మ అయినా అతి సునాయాసంగా చిత్రించేవాడివి. ఒకమాటు మా నాయనమ్మ ఫోటోని చిత్రంగా గీయించాలనే వంకతో వచ్చాను. గుర్తుందా?

"ఒక్క క్షణం అలా కూర్చోండి..." అంటూ చకచకా నా బొమ్మల్ని నాలుగైదు భంగిమల్లో స్కెచెస్ వేసావు. నాకు ఎంతో అద్భుతమనిపించింది. వాటిలో కనీసం ఒక్క బొమ్మనైనా అడగలేక పోయాను.

ఇంట్లో వాళ్ళు చూస్తే ఏమంటారో ననే భయం. ఆ బొమ్మలింకా అలాగే ఉన్నాయా వంశీ? నీకు గుర్తుందా?! ఎందుకుండదూ? అది మర్చిపోలేని సంఘటన కదా? పెళ్ళయ్యాక నేను కాపురానికి వెళ్ళబోతూ, చివరిసారి నిన్ను చూట్టానికి వచ్చాను, అది కూడా మా బామ్మ బొమ్మకి మెరుగులు దిద్దించాలనే వంకతో.

ఆరోజు తుఫాను వాతావరణం.

చీకటీ వెలుతురూ కాని సంజె వెలుగు లాంటి కాంతి. పడక కుర్చీలో ఏదో ఆలోచనలో ఉన్న

నువ్వు నన్ను చూడగానే చటుక్కున లేచి నిలబడ్డావు. అప్పుడు నీకు తెలియదు, నేను కేవలం నిన్ను చూట్టానికే అలా వచ్చానని. మా నాయనమ్మ బొమ్మని సరిచేసి తిరిగి ఇస్తూ నాకేసి చాలా ఉద్వేగంగా చూశావు. నీ కళ్ళలో ఏదో అభ్యర్థన. నాకు అర్థమయ్యింది. వీడ్కోలు గుర్తుగా నన్ను ముద్దు పెట్టుకోవాలని తహతహలాడావు. నా మనసుకూ ఇష్టమే కానీ, ఇద్దరం ధైర్యం చేయలేక పోయాం. నేను వివాహితననే స్పృహ కోల్పోయాను సుమా! ఆ సమయం అలాంటిది మరి. కొద్ది క్షణాలు అలా ఒకరినొకరు చూసు కుంటూ ఆలోచనలతోనే ఆలింగనం చేసుకుంటూ, చూపుల తోనే చుంబిస్తూ ఉండిపోయాం.

మనల్ని ప్రస్తుతంలోకి లాక్కు వస్తూ పెద్ద పిడుగు ధ్వని...కంపించిపోయాను. నేను కొత్త వధువును! నువ్వు...మనసుకి దగ్గర అయినా నన్ను తాకలేనంత దూరంగా ఉండాల్సిన వ్యక్తివి. అందుకే గబ గబ మా ఇంటికి వెళ్ళిపోయాను. మోహం, ప్రేమ వేరు వేరు కదా?!

వంశీ!

నీ నుండీ భౌతికంగానే వెళ్ళిపోయాను! కానీ, మానసికంగా నీ దగ్గరే ఉన్నాను. బహుశః నువ్వూ అంతే ననుకొంటాను. అందుకే పెళ్ళి చేసు కోకుండా ఉండిపోయావు. చెప్పాగా...ప్రియంవద నీ గురించి అన్నీ చెబుతుండేది. ప్రపంచంలో మన లాంటి మూగప్రేమలు ఇంకెన్ని ఉన్నాయో...నేను శరీరంతో కాపురం చేసాను, మనసుతో కాదు. నాలాంటి ఆడది అంతకన్నా ఏం చేస్తుంది?

నా భర్త ఆర్మీలో కల్నల్. కాశ్మీరు ఉగ్రవాదులతో పోరాడుతూ చనిపోయారు. అప్ప టికి రోహిణి చదువు పూర్తయ్యింది. ఢిల్లీలో ఉద్యోగం వచ్చింది. నన్ను తన దగ్గరే ఉంచుకుంది. ప్రేమ వివాహం చేసుకోగలిగిన అదృష్టవంతురాలు!

చెప్పాగా...మన ఇద్దరం జీవన సంధ్యలో ఉన్నాం...అన్నట్లు వయసుని దాచుకుంటూ జుట్టుకి రంగు వేస్తున్నావా?నేను మా అమ్మాయి పోరు పడలేక వప్పుకున్నాను. మా అమ్మాయి నీకు నా ఫోటో చూపిస్తుందిలే... చూసి నవ్వకు.

నువ్వు నన్ను చివరిసారి చూసినప్పుడులా ఇప్పుడు ఉండను. కానీ, రోహిణీలో నేను కనిపి స్తాను. నిన్ను పెళ్ళి చేసుకుని ఉంటే, మనకి రోహిణి లాంటి కూతురు ఉండేది.

పోనీలే...రోహిణే నీ కూతురే అనుకో...నా కెలాంటి అభ్యంతరం లేదు...

ఇంకా నీకు చాలా రాయాలని ఉంది.

కానీ రాయలేను. సమాజం, కట్టుబాట్లు, పిరికితనం, ఇవన్నీ మన చుట్టూ లక్ష్మణరేఖలు గీసాయి. వాటిని మనం దాటలేదు. కాబట్టే సమాజం దృష్టిలో మనం నీతిమంతులమే.! కానీ, నిన్ను ఎంతో నిరాశపరచాను.

ప్రేమ ప్రేమని కోరుతుందంటారు. నేనే మిటో నీకు ఏనాడూ తెలియనివ్వలేదు. నా మన సులో ఏముందో చెప్పలేకపోయాను. ఇప్పుడు చెప్పకుండా ఉండలేకపోతున్నాను.

ప్రేమ శరీరాలకు సంబంధించింది కాదని నా నమ్మకం. సంప్రదాయాలు, సమాజ జీవన పరిధుల సంకెళ్ళకి ప్రేమ అతీతమని నా కిప్పుడు అర్థమయ్యింది.

కానీ ఇప్పటికే అంతా ముగిసి పోయింది. ఒక్క మాట చెప్పి ముగిస్తాను.

నిన్ను ప్రేమించాను. ప్రేమిస్తునే ఉన్నాను. నాకు కూతురయినా, స్నేహితురాలైనా రోహిణే. అందుకే ఏమీ దాయకుండా అంతా చెప్పేశాను. అర్థం చేసుకుంది. సానుభూతితో ఓదార్చింది. నిన్ను కలుసుకుంటానని మాట ఇచ్చింది.

నువ్వు ఆడగొచ్చు, ఇంత ప్రేమ ఉన్నదానివి నా కోసం ఎందుకు రాలేదని? ఎందుకు రాలేదో రోహిణి చెబుతుంది. శెలవు..."

నీ సంధ్యారాణి.

* * *

సాయం సంధ్య...

వంశీ, రోహిణి కోసం ఎదురు చూడ సాగాడు. ఉదయం నుండీ అతని మనసంతా అశాంతిగా ఉంది.

సంధ్యారాణి స్వయంగా ఎందుకు రాలేదు? ఒక్కమాటు కళ్ళతో చూడాలని తహతహగా ఉంది. కనీసం ఫొటో ఇచ్చి వెళ్ళినా బావుండేది. ఈ రోహిణి ఎందుకిలా చేసింది? మేడమీద కిటికి లోంచి మాటిమాటికీ ఆతృతగా రోడ్డుమీదకు చూస్తు న్నాడు. విసుగు పుట్టి అలసటగా పడక కుర్చీలో కూర్చున్నాడు.

పది నిమిషాలు నిరీక్షించాక రోహిణి లోపలికి వచ్చింది.

"ఇంత ఆలస్యమైందేమిటి?"

"మనం టైం నిర్ణయించుకోలేదుగా? అమ్మ చదువుకున్న స్కూలుకి లక్ష రూపాయలు విరాళం ఇచ్చి వస్తున్నాను. అందుకే ఆలస్యం అయింది. వాళ్ళు అమ్మ ఫొటో అడిగారు. నా దగ్గర ఒక్కటే ఉంది. అదీ మీకిమ్మంది అమ్మ" అంటూ బ్యాగు లోంచి ఫోటో తీసి ఇచ్చింది.

వంశీ ఆతృతగా చూశాడు.

నిజమే! చాలా మార్పు వచ్చింది. జుట్టు రంగు తెలుస్తోంది. తను కూడా జుట్టుకి రంగు వేస్తాడు. కానీ, మొహంలో వార్థక్యం తొంగి చూస్తుంటుంది. !

"ఆ ఫొటో కాపీ తీయించి స్కూలుకి ఇద్దా మనుకుంటున్నాను" అంది రోహిణి.

"అక్కర్లేదు ! నేను దీనికి బొమ్మగీసి ఇస్తాను, స్కూలుకి ఇవ్వు"

"థ్యాంక్యూ..." సంతోషంగా అంది.

"అన్నట్టు....మీ అమ్మ నీతో ఎందుకు రాలేదు?" కుతూహలంగా అడిగాడు వంశీ.

"గతవారమే అమ్మ కాన్సర్‌తో చని పోయిం ది..."చలి పిడుగులా తాకిందా మాట.

అతనికి మాటలు పెగల్లేదు.

"అవును. చనిపోయింది. భౌతికంగా... కానీ నా మనసులో ఎప్పుడూ చిరంజీవే..."

"నాకూ అంతే " అనాలనుకున్నాడు వంశీ. అన్నాననుకున్నాడు.

సంధ్య రాసిన మాటలు మనసులో మెది లాయి.

"మన పెళ్ళి అయిఉంటే రోహిణి మన కూతురు అయ్యేది..." వంశీకి ఆ క్షణంలో విపరీత మైన వైరాగ్యం ఆవహించింది.

ప్రపంచంలో బాంధవ్య బంధాలున్నాయి. భావ బంధాలు బహు తక్కువగా ఉంటున్నాయి. రోహిణి ఇప్పుడు తల్లీ తండ్రీలేని అనాథ. కానీ భావ బంధంతో తనకి కూతురుతో సమానం... వంశీ రోహిణికేసి చూశాడు. ఆమె కళ్ళు వర్షిస్తు న్నాయి. అతనిలో పితృభావన పొంగింది. ఆప్యా యంగా హృదయానికి హత్తుకున్నాడు. తలమీద మృదువుగా ముద్దుపెట్టుకున్నాడు. రెండు కన్నీటి చుక్కలు శిరస్సు మీద రాలి పడ్డాయి.

మనం వినగలిగితే ఆ రెండు కన్నీటి చుక్కలు మానవ బంధాల పరిణితి గురించి ఎంతో చెబు తాయి.

# ఇంటిపేరే పురాణం...రాసిందంతా నవీనం

**'నీలి'** కథ చదివారా...1953లో అనుకుంటా వచ్చింది. 1954లో న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్‌వారు నిర్వహించిన ప్రపంచ కథానికల పోటీలో ప్రత్యేక బహుమతిగా ఎంపికయిన తెలుగు కథ.

ఆ కథ రాసినవారు...నాటికి పాతికేళ్ళు కూడా నిండని పురాణం సుబ్రహ్మణ్యశర్మ అనే యువ కథా రచయిత. అప్పటికే, 1949 నుంచీ కథలు రాస్తున్న శర్మగారిని తొలుత విశ్వనాథవారు పసిగట్టి గుర్తుపెట్టుకొని మరీ అభిమానించి ప్రోత్సహించారు. కథకుడిగా తొలిరోజుల్లోనే శర్మగారు పొందిన అపూర్వమైన గౌరవమది.

అంతకుముందు 'చంద్రునికో నూలుపోగు' అని ఏకంగా ఒక నవలే రాసేశారు. ఈ నవలలో గుడిపాటి వెంకట చలాన్ని పోలిన పాత్ర కూడా ఒకటుండేదట. అంతే ..శర్మగారు వార్తల్లో వున్న వ్యక్తులెవరినీ వదిలిపెట్టేవారు కాదు. ఆయన చలనశీలురేకాదు, సంచలనశీలురు కూడా...!

ఉత్తరభారతంలోనూ దరిమిలా ఉత్తరాంధ్రలోనూ రకరకాల ఉజ్యోగాలు దేదీప్యమానంగా వెలగబెట్టి 1967లోనే అనుకుంటా, నార్లవారి పిలుపందుకుని బెజవాడలో 'ఆంధ్రజ్యోతి' వీక్లీకి ఇన్‌ఛార్జ్ సంపాదకుడిగా చేరారు. అంతే...నాటి నుంచి అంతా చరిత్రే. ఎందరితోనో ఎంతో రాయించారు. అలాగే రాయాలనుకున్న వాళ్ళని కూడా ఎంతోమందిని వీక్లీ సంపాదకుడిగా ఆయన తయారు చేశారు. అందుకేనేమో రావిశాస్త్రిగారొకసారి 'యు మేడ్ జర్నలిజం గ్రేట్' అంటూ పురాణంగారికి ఒక సందేశం పంపారు.

ఒకటా.. రెండా...అప్పటివరకు లైబ్రరీల్లో గ్రంథ రూపంలో దాక్కున్న 'కన్యాశుల్కం' ని బయటికి తీసుకొచ్చి వారం వారం తెలుగువాళ్ళందరూ చదివేలా వీక్లీలో సీరియలైజ్ చేసి పారేశారు. ఆ రోజుల్లో వారం వారం 'కన్యాశుల్కం' చదవటమంటే అదొక అపూర్వమైన అనుభవం...వ్యామోహం... వెర్రి... పిచ్చి. మొక్కపాటివారి 'బారిష్టరు పార్వతీశం' గ్రంథాన్ని కూడా అలాగే 'ఆంధ్రజ్యోతి'లో రెండు మూడు భాగాలుగా వేసి అందరిచేతా చదివించారు.

కాళీపట్నం, చాసో, రావిశాస్త్రి, వడ్డెర చండీదాస్, రంగనాయకమ్మ, శంకరమంచి సత్యం, స్మైల్, ఎమ్వీయల్...ఎవ్వరినీ వదిలిపెట్టారు కాదు. అందరిచేత పదికాలాలపాటు తెలుగు సాహిత్యంలో నిలిచిపోయే రచనల్ని రాయించారు.

బుచ్చిబాబు, ఉప్పల లక్ష్మణరావు, దాశరథి వంటి మహనీయుల చేత ఆత్మకథలు రాయించారు...'జ్యోతి'లో వేశారు. నండూరి వారితో సైన్స్ సీరియల్స్ - నరావతారం, విశ్వరూపం, విశ్వదర్శనం - రాయించి, బాపు బొమ్మలతో వారం వారం పాఠకుల ముందుకు తీసుకు వచ్చిన ఘనత కూడా ఆయనదే.

అలాగే అనువాద సాహిత్యాన్ని కూడా ఆయన అద్భుతమనదగిన రీతిలో ప్రోత్సహించారు. తెలుగువాళ్ళు జయకాంతన్ తమిళ రచనలను తెలుగులో చదవగలిగారంటే అందుకు పురాణంగారి చొరవే కారణం. ఉదాహరణకు జయకాంతన్ 'శిల్ల నేరంగళిళ్ శిల్ల మణిదర్‌గళ్' నవలను 'కొన్ని సందర్భాలలో కొందరు మనుషులు' పేరిట తెలుగులో అనువాదం




చేయించి, వీక్లీలో వారం వారం బాపు బొమ్మలతో సీరియల్‌గా తీసుకొచ్చారు. ఇటువంటి జర్నలిస్టిక్ ఫీట్స్ ఎన్నో చేశారాయన.

మద్రాసులో ఉన్న శ్రీశ్రీ చేత 'ప్ర / జ' శీర్షిక నిర్వహింప జేశారు. ఈ శీర్షికలో వచ్చిన ప్రశ్నలు, శ్రీశ్రీ ఇచ్చిన జవాబులు ఇప్పటికీ ఒక 'రికార్డు'గా మిగిలి పోయాయి. యండమూరిని, మల్లాదిని ఏకకాలంలో 'కమిట్' చేయించి వీక్లీ పేజీల్లోకి తీసుకువచ్చి, అటు పత్రికను కమర్షియల్‌గా ఉన్నత స్థాయికి తీసుకు వెళ్ళడంతో పాటు, ఇటు పాఠకులకు కూడా ఒక కొత్త సాహితీ ప్రపంచాన్ని పరిచయం చేశారు.

ఇందరితో ఇన్ని పనులు చేయిస్తున్నా, పురాణంవారు తమ కలానికి ఏనాడూ విశ్రాంతి ప్రకటించలేదు. కొమ్మూరి, గొల్లపూడిలతో కలిసి 'ఇడియట్' అనే పేరుతో ఒక గొలుసు నవలకు శ్రీకారం చుట్టి చరిత్ర సృష్టించారు. ఇలా నవలలో ఒక్కో భాగాన్ని ఒక్కో రచయిత రాయడం, వారం వారం 'జ్యోతి'లో రావడం... అప్పట్లో అందరూ పదేపదే చెప్పుకున్న విషయం. అలాగే 1967లోనే 'జ్యోతి'లో చేరిన కొత్తల్లో పురాణం సీత పేరిట 'ఇల్లాలి ముచ్చట్లు' అనే శీర్షికను ప్రారంభించి సంవత్సరాలపాటు కొనసాగించిన వైనం కూడా...

పురాణంగారు ఎవరో చెప్పినట్టు పూర్తిగా రచయితల సంపాదకుడు. శ్రీశ్రీ అందుకేనేమో ఒకసారి పురాణంవారి గురించి చెబుతూ 'పురాణ మిత్యేవ న సాధు సర్వం' అన్నారు. కాళోజీ ఓ సందర్భంలో 'ఇంటి పేరే పురాణం రాసిందంతా నవీనం' అంటూ కితాబిచ్చారు. పురాణం వారి గురించి చెప్పటానికి ఇదొక్కటి చాలు...!

# పుస్తక సమీక్ష

'శ్రీ ఛానెల్' పేరు తలుచుకుంటే చాలు శ్రీరమణ వెంటనే గుర్తుకొస్తారు. శ్రీరమణ గుర్తుకొస్తే, ముళ్లపూడివారు కళ్లముందు కనబడతారు. ఆరుద్ర, జరుక్‌శాస్త్రి, భమిడిపాటి, మునిమాణిక్యం, పురాణం రాతల్లో అలవోకగా విన్యసించిన అచ్చ తెలుగు నుడికారం మళ్లీ వొకసారి ప్రాణం పోసుకుని శ్రీరమణ రచనల్లో సజీవంగా దర్శనమిస్తుంది.

ఇందుకు మరో సాక్ష్యం- 'శ్రీ ఛానెల్' పుస్తకాలు. *1997-98* మధ్య కాలంలో 'ఆంధ్రప్రభ' వారపత్రికలో శ్రీరమణ 'శ్రీ ఛానెల్' పేరిట ఒక ఫీచర్ నిర్వహించారు. ఆ ఫీచర్‌లో వచ్చిన కొన్ని వ్యాసాలతో 'శ్రీ ఛానెల్' పేరిట *2001*లో ఒక సంపుటి వచ్చింది. ఆ సంపుటిలో లేని, రాని వ్యాసాలతో *2014* సంవత్సరాంతంలో 'శ్రీ ఛానెల్-2' పేరిట శ్రీరమణ అభిమానులు మరో సంపుటిగా తీసుకువచ్చారు. More the merrier అని ఆంగ్లంలో ఒక నానుడి వుంది. ఇంకేం...చదువుకున్న వారికి చదువుకున్నంత..!

## శ్రీరమణ హాస్య వ్యంగ్యాస్త్రాల సమాహారం

ప్రింట్ మీడియాలో వచ్చిన ఈ వ్యాసాల సంపుటికి 'శ్రీ ఛానెల్-2 నిరంతర హాస్య వ్యంగ్య ప్రసారాలు' అంటూ ఏదో టెలివిజన్ ఛానెల్ ప్రసారాలను పుస్తకరూపంలో అందిస్తున్నట్టుగా చమత్కారంగా పేరుపెట్టారు. 'ఆంధ్రప్రభ' వీక్లీలో వచ్చిన వ్యాసాలతోబాటు ప్రపంచ నవ్వుల దినోత్సవం (మే 4, 2014) సందర్భంగా 'సాక్షి' ఆదివారం పత్రిక 'ఫన్ డే' కోసం రాసిన 'నవ్వులో శివుడున్నాడు'తో బాటు ఎప్పుడో అయిదు దశాబ్దాల క్రితం జరిగిన ఒక సంఘటనను గుర్తుకు తెచ్చుకుని వ్రాసిన 'విశ్వనాథ అంతరంగంలో శ్రీశ్రీ' అనే ప్రత్యేక వ్యాసం కూడా ఈ సంపుటి పాఠకుల ముందుంచుతుంది. అలా అలా మొత్తం నలభై వ్యాసాల సంపుటీకరణే ఈ శ్రీరమణ 'శ్రీ ఛానెల్ - 2'.

గత శతాబ్దాంతకాలంలో సామాజికంగా, రాజకీయంగా, ఆర్థికంగా ఎన్నో అనివార్యమైన మార్పులు చోటు చేసుకోవడం మనం 'చూసిన' విషయమే. ఈ మార్పుల ప్రభావం ఇళ్లల్లోకి కూడా దూసుకురావడం కూడా మనకు 'తెలిసిన' విషయమే. వ్యవస్థతో బాటు వ్యక్తులలోనూ, విలు వలలోనూ మార్పులు కనిపించడం ప్రారంభ మయ్యింది కూడా ఈ మధ్య కాలంలోనే. ఇదంతా సముద్రమంత లోతున్న విషయం. కాలమ్‌ల కొద్దీ కాలమ్‌లు పేపర్లలోనూ, గంటల తరబడి ఛానెళ్ల లోనూ డిస్కస్ చేయవలసిన ఈ మాటర్‌ని, శ్రీరమణ పుక్కిటపట్టి, తనదైన హాస్య, వ్యంగ్య ధోరణి లో మన ముందుంచి, విషయాన్ని తేలిక చేసి "ఔను...నిజమే సుమా!" అనిపిస్తారు. సరదాగా చేసిన ఈ వైచిత్ర్యాన్ని చదివి మనసారా నవ్వుకోవడం కోసమయినా ఈ పుస్తకం చదవాలి.

ఉదాహరణకు 'జీవనసమరం' అనే వ్యాసమే తీసుకుంటే, బెడ్‌రూమ్‌లో స్విచ్ వేయగానే లైటు వెలగకపోవడం వంటి ఒడుదుడకులను (ఒడి మరియు దుడుకు కాదట) ఎలా అవగాహనతో స్పందించి సమస్యను పరిష్కరించాలో చెబుతూ "అవగాహన అనేది భజనలాంటిది. చేసుకుంటే తప్ప ఫలితం వుండదు" అని తేల్చారు శ్రీరమణ.

ఈ వ్యాసాలు వ్రాసే కాలంలో చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రిగా పరిపాలిస్తున్నారు. జన్మభూమి, ఫైళ్ల క్లియరెన్స్ పథకాలు ప్రారంభించినది కూడా అప్పుడే...! ఈ కార్యక్రమాలపై సెటైరికల్‌గా వ్రాసిన వ్యాసాలు చూడండి...'ఫైళ్ల కదిలింపు'ని 'ఫైళ్ల వదిలింపు' చేశారు. "అత్యంత భద్రంగా వుండాల్సిన పేపర్స్‌ని సచివాలయంలో ఫైల్సులో పెట్టి పైన తాటికాయంత అక్షరాలతో అర్జెంట్ అని రాస్తారట...ఇహ వాటిని ఎవరూ చూడరని వాటి జోలికి పోరని గట్టి విశ్వాసంతో" అంటూ శ్రీరమణ యిచ్చిన ముక్తాయింపు అక్షర

**కె.ఎమ్వీ.**




**శ్రీ ఛానెల్ - 2**
**నిరంతర హాస్య - వ్యంగ్య ప్రసారాలు**
**శ్రీరమణ**
**పుటలు : 154**
**మూల్యం : రూ. 60/-**
**ప్రచురణ**
**విద్యార్థి మిత్ర ప్రచురణలు**
**కర్నూలు**
**ప్రతులకు**
**ఫ్రెండ్స్ బుక్ డిపో, షాప్ నెం. 14**
**పార్క్ రోడ్, మునిసిపల్ బిల్డింగ్స్**
**కర్నూలు - 518 001**

## నహి నహి రక్షతి

సాములారు గోదారి వరదల్లో చిక్కుకున్నాడు. ఆశ్రమంలో మోకాళ్ళలోతు నీరొచ్చింది. ఓ పడవవాడు అటెడుతూ, "సామీ! రా... గట్టెక్కిస్తా' అన్నాడు. "వలదు నాయనా, ఆ భగవంతుడే దరి చేరుస్తాడు" అన్నారు సాములారు. నీరు నడుందాకా వచ్చింది. నౌకాదళం వారు మోటారు బోటులో వచ్చి "ఆయియే...స్వామీజీ...ఆయియే" అనరిచారు. "భగవాన్ హమ్ కో రక్షా కరేగా" అన్నారు స్వామీజీ. నీటి మట్టం పెరిగి పీకల దాకా వచ్చింది. ఆర్మీవాళ్ళు హెలీకాప్టర్ నెత్తిమీద ఆపి, తాడూ నిచ్చెనా విసిరి, "పకడో... నిచ్చెన పకడో" అని అరిచారు. "నహీ భయ్యా! పరంతు ప్రభు విల్ రక్షా కరే" అన్నారు స్వామీజీ. మరి కాసేపటికి సాములారు జల సమాధి అయ్యారు.

పైకి వెళ్ళగానే దేవుణ్ణి చూసి "హే భగవాన్! ఇదేమి ధర్మం? నువ్వే రక్షిస్తావని నమ్ముకుంటే చివరికిటుల ముంచేశావ్?" అని వేష్టపడ్డాడు.

"ఒక నాటు పడవ, ఒక మోటారు పడవ, ఓ హెలీకాప్టరూ పంపాను కదా... ఏం చేశావ్, వెర్రి వెధవా!" అని కోప్పడ్డాడు దేవుడు

**'శ్రీ ఛానెల్ - 2' నుండి....**

సత్యాలన్నది సచివాలయ జీవులకి అనుభవ పూర్వ కంగా తెలిసిన విషయమే...!

ఓటర్ల మానిఫెస్టో, జన్మభూమి, ఐడియాలజీ, శ్రీరాముని దయచేతను, నగరంలో పులి, ప్రజలు, గోచారఫలం వ్యాసాల్లో కూడా ఇటువంటి సెటైరే పాఠకులకు కనిపిస్తుంది.

చిత్రంగా ఈ వ్యాసాలలో కథాలక్షణాలతో కూడిన - అంటే కొసమెరుపు కథలన్న మాట - వ్యాసాలు కూడా వున్నాయి. వెండి హాంగరు, బేడమ్మ, గ్రంధర్వులు, కీలుగుర్రం, కామన్ ప్రోగ్రామ్ వ్యాసాల్లో అంతర్లీనంగా చిన్నసైజు కథలు దాక్కుని వున్నాయింటే, అదంతా శ్రీరమణ కలం చేసిన విన్యాసమే.

చాలా వ్యాసాలను సంఘటనా పరంగా, సరదాగా చెప్పుకొచ్చారు. మైకుకున్ మైకము మైకమే, ఎన్నారై, లేడీ-స్ అండ్ జెంగిల్మెన్, వికారమా? వివర్తమా?, దంత విభూషణ, సూర్యం సెలూన్, పత్ర సాముద్రికం, మిఠాయి పొట్లం, 'నేమ్' డ్రాపింగ్ ఈ కోవకు చెందిన వ్యాసాలే.

శ్రీరమణ చెప్పినట్టు "హాయిగా నవ్వుకోవాలనుకున్నప్పుడు, తోచినప్పుడు, తోచనప్పుడు సీరియల్‌గా కాదంటే సీరియస్‌గా కూడా" ఈ వ్యాసాలను చదువుకోవచ్చు. వ్యాసానికి వ్యాసానికి మధ్య కార్టూన్లు, శ్రీరమణ పేల్చిన జోకులు కూడా వున్నాయి. బాపు రమణల సహచర్యంలోంచి పుట్టుకొచ్చిన అస్త్రాలు వుండనే వున్నాయి. అందుకేనేమో శ్రీరమణ సరదాగా ఈ పుస్తకం


'శ్రీ ఛానెల్ - 2' నుండి....

## క్రమాలంకారం

ప్రముఖ పత్రికా రచయిత, దార్శనికులు, కవి నండూరి రామమోహన రావు, బాపు - రమణలు చిరకాల మిత్రులు. ఆంధ్రపత్రిక, జ్యోతి మంత్లీలో కలిసి పనిచేసిన ఉమ్మడి అనుభవాలు కోకొల్లలు. ఒకసారి వారు ముగ్గురూ కూర్చుని ఉండగా మాటలు 'భాగవతం' మీదికి మళ్లాయి.

"ఆదిన్ శ్రీసతి కొప్పుపై, తనువుపై, అంసోత్తరీయంబుపై పాదాబ్జంబులపై, కపోల తటిపై, పాలిండ్లపై నూత్న మర్యాదం జెందు..." అన్న పోతనగారి పద్యంలో క్రమం తప్పింది చూశారా? అంసోత్తరీయం నుంచి పాదాల దగ్గరకు వచ్చి, మళ్లీ పైకి వెళ్లి కపోల తటిపై, పాలిండ్లపై అన్నారు. కొంచెం జంప్ అయింది ఆర్డరు...ఛందస్సుకోసం అయి వుండవచ్చు" అన్నారు నండూరి.

బాపు ఓ క్షణం ఆలోచించి, "పోతనగారు ఎంత భక్తులో అంత రసికులు. ఆయన క్రమం కరెక్టే! పాదాలు తాకితేనే కదా ఎంతవాడికైనా ఆ పైవాటి దాకా వెళ్ళడానికి అనుమతి లభించేది...?" అన్నారు.

రసికత లెరిగిన వారు కనుక నండూరి వారు వెంటనే ఆ అభిప్రాయంతో ఏకీభవించారు.

**'శ్రీ ఛానెల్ - 2' నుండి....**

రెండు కాపీలు కొనమన్నారు. అరువు బుక్స్ మాత్రమే చదివే నైజం ఎందరికో వుంటుందట. అందుకని అలాంటివారి సౌలభ్యం కోసం రెండు కాపీలు కొనాలని సూచించారు. ఆ పైన పాఠకుల ఇష్టం...!

ఈ వ్యాసాలతోబాటు శ్రీరమణ ఈ పుస్తకం కోసమే ప్రత్యేకంగా వ్రాసి చేర్చిన 'విశ్వనాథ అంతరంగంలో శ్రీశ్రీ' వ్యాసాన్ని కూడా ప్రత్యేకంగా చెప్పుకోవలసివుంది. అయిదు దశాబ్దాలక్రితం, బాపట్లలో తను చదువుకుంటున్న కళాశాల వార్షికోత్సవాలకు ముఖ్య అతిథిగా విచ్చేసిన కవిసమ్రాట్ విశ్వనాథ వారిని ధైర్యంచేసి "శ్రీశ్రీగారి మీద మీ అభిప్రాయమిటి?" అని అడిగిన సంఘటనను గుర్తుకు తెచ్చుకుంటూ శ్రీశ్రీ గురించి విశ్వనాథ చేసిన సుదీర్ఘమైన విశ్లేషణను యధాతథంగా చెడుతూ "యుగానికొక మహోజ్వల ఘట్టమైతే తన జీవితానికి దీనికి మించిన సువర్ణఘట్టం మరొకటి లేదు" అన్నారు శ్రీ రమణ. 153 పేజీల ఈ పుస్తకంలోని చివరిపేజీల్లో ఇది చదివిన పాఠకులు శ్రీరమణతో తప్పక ఏకభవిస్తారు. ఇంతకీ అప్పటి శ్రీరమణ వయస్సు పద హారేళ్లు...!

కర్ణుడు జగ్గుబజారు మలుపు దగ్గర నిల్చున్నాడు. వాడు ఈ ప్రాంతానికి వచ్చి ఏడు రోజులే అయింది. ఈ ప్రాంతం గురించి సర్వం తెలుసుకోవాలని అనుకుంటున్నాడు...పదేళ్ళుగా వాడు కలకత్తా ఉత్తర ప్రాంతంలో ఉన్నాడు. ఉన్నట్టుండి ఓ రోజు వాడికి కలకత్తా దక్షిణ ప్రాంతాన్ని ఓసారి చూడాలనిపించింది. డెస్క్ సర్వే చేసేక ప్రజాభిప్రాయాన్ని కాలమ్‌గా రాసి పత్రికలో అచ్చువేయడానికి వాడేం పాత్రికేయుడు కాదు.కర్ణుడికి ప్రజల మధ్యకి వెళ్లకా తప్పదు. వాళ్ల స్వభావాలని అంచనా వేసుకోక తప్పదు. వాళ్ల చూపుల్ని గుర్తించకా తప్పదు. వాళ్ల స్పందన ఎలా ఉంటుందో దానిని గ్రహించకా తప్పదు. ఇదంతా అయ్యాక అప్పుడు వాడు చెయ్యి చాస్తాడు. ఎవరి ఎదట ఎంత చెయ్యి చాచాలో దానిని కూడా ముందుగా లెక్క కట్టి మరీ నిర్ణయించుకోకా తప్పదు. ఆ తర్వాత గొంతు హెచ్చించాలా, లో గొంతుకా అన్న దాని మీద దృష్టి పెట్టవలసి ఉంటుంది.




# కర్ణుడు


99633 77672

బెంగాలీ మూలం
రామకుమార్ ముఖోపాధ్యాయ

తెలుగు అనువాదం
చాగంటి తులసి



సమకాలీన బెంగాలీ కథాసాహిత్యంలో చైతన్యవంతమైన మార్పు తెచ్చిన రచయితల్లో రామకుమార్ ముఖోపాధ్యాయ విశిష్టులు.

ఈయన 5 అక్టోబరు 1956లో కలకత్తా – బాంకుడా జిల్లా గేలియా గ్రామంలో పుట్టారు.

మొదట్లో ఆయన కవితలు రాసేవారు. కలకత్తా విశ్వవిద్యాలయం వార్షిక పత్రిక 'కేంపస్' కోసం పత్రికా సంపాదకులు సైఫుద్దీన్ చౌదరి గారు ఈయనని కథ రాయమన్నారు. ఆ కథే ఈయన మొదటి కథ.

'మాదోలే నతున్ బోల్' (మాదల్ కొత్త స్వరాలు) అన్న ఆ కథ అచ్చయ్యాక ఆయనకి తన మాధ్యమం కవిత్వం కాదు. కథానికా ప్రక్రియ అని అర్థం అయింది. నవలా రచన పట్ల దృష్టి కలిగింది. కవిత్వం మాత్రమే రాయడం మానేసి ఈ రెండు ప్రక్రియల్లో ఆయన కృషి సాగింది.

పుట్టింది గ్రామంలో కాబట్టి, గ్రామీణ జీవితం, సామాన్య జనుల కష్టసుఖాలు, వారు మాటాడే తీరు, కథలు చెప్పే పద్ధతి అన్నిటిని ఆయన ఆకళించుకున్నారు. ఆయన రచనల్లో గ్రామాల, పట్టణాల, మహా నగరాల సామాన్య జన జీవితం వస్తువు అయింది. వ్యంగ్యాన్ని సాధనంగా చేసుకుని సామాన్య జనానికి జరుగుతున్న అన్యాయాన్ని ఎంతో సహజంగా తన కథల్లో చెప్పారు. ఈయన కథలు రాయరు...చెబుతారు. పల్లెల్లో సామాన్య జనం బతుకు కథల్ని చెప్పే ధోరణిని వీరు తమ రచనలో ఉపయోగించుకున్నారు. అందుచేత ఈయన కథనం సహజంగానే మాట్లాడుతున్న ధోరణిలో ఉంటుంది.

వీరి రచనల్లో కొన్ని హిందీ, ఒడియా, తమిళం, మలయాళం, సంథాలీ, ఇంగ్లీషు, గుజరాతీ, మైధిలీ భాషల్లోకి అనువాదాలుగా వచ్చాయి. ఈయన సాహిత్య అకాడమీ పూర్వాంచల్ శాఖ సెక్రటరీగా పనిచేశారు. బెంగాలీ భాష కన్వీనరుగా ఉన్నారు. విశ్వభారతి యూనివర్శిటీ పబ్లిషింగ్ డిపార్ట్‌మెంట్ డైరెక్టరుగా పనిచేస్తున్నారు. పశ్చిమ వంగ బెంగాలీ అకాడమీ వారి సోమేన్ చంద్ర స్మారక పురస్కారం, కథాపురస్కారం, బంకిమ్ పురస్కారం, భాగల్‌పూర్ వారి శరద్ పురస్కారం, గల్పమేలా పురస్కారం, గజేంద్ర కుమార్ మిత్ర శత జయంతి పురస్కారం వంటి పురస్కారాలు పొందారు. బెంగాలీ భాషలో 18 భారతీయ భాషల అనువాద కథల సంకలనానికి సంపాదకులు.

నేషనల్ బుక్ ట్రస్టు వారి సంకలనం 51 కథలు ఈయన సంపాదకత్వంలో వెలువడింది. ఇది రవీంద్రుని తర్వాత ప్రసిద్ధులైన కథకుల కథల సంకలనం.

నిజానికి భిక్ష - అనగా ముష్టి - అడుక్కోవడానికీ ఓ పద్ధతి ఉంటుంది. స్థల కాలపాత్రలని బట్టి ఆ పద్ధతి మారుతూ ఉంటుంది. మాట వరసకి క్యానింగ్ వెళ్లే లోకల్ ట్రైన్‌లో కర్ణుడు శ్యామా సంగీతం పాడతాడు. అదే బనగ్రామం వెళ్ళే రైలు అయితే లాలన్ ఫకీరు పాటలు అందుకుంటాడు. రైలు స్టేషన్లని వదిలేసి వాడు కొంతకాలం మౌలాలి, బహూబజారు, కాలేజీ స్ట్రీట్ మొదలైన ప్రాంతాల్లో రవీంద్ర సంగీతాన్ని, నజ్రుల్ గీతాల్ని పాడుతూ వచ్చాడు. అయితే ఈ మధ్య వాడు మూగవాడై పోయాడు. వాడినోట ఏ శబ్దమూ రావటం లేదు. అప్పుడప్పుడూ 'వెధవలు...వెధవలు' అంటూ ఉంటాడు. ఇంకొకప్పుడు ఏమిటేమిటో గొణుక్కుంటూ ఉంటాడు. ఆ తర్వాత మాటా మంతీ లేక మూగవాడవుతాడు. వాడిస్వభావం ఇలా అయిపోవడానికి కారణం ఉంది. అవునండీ బాబూ! ఒకడు ముష్టి వెయ్యగలుగుతాడు. మరొకడు వెయ్యలేకపోతాడు. దానికి మనం ఏం తప్పు పట్టలేం. ధరలు మండిపోతున్న ఈ రోజుల్లో ఎవడైనా ఎప్పుడయినా ఒక్క ఐదుపైసలే చేతిలో పెడితే కోపం రావడం సహజమే కదా!

1986 ఏప్రిల్ 'సమాజ్' పత్రిక అనుబంధంలో కర్ణుడి కుటుంబ చరిత్రా, వాడి బతుకూ, ఆదాయ వ్యయాల గురించి ఓ నూరు మాటల్లో అచ్చయింది. కలకత్తా విశ్వవిద్యాలయపు సమాజ శాస్త్ర విభాగపు విద్యార్థులు ఆ సమీక్ష చేశారు. కలకత్తా ముష్టి వాళ్ళకి సంబంధించి ఇరవై పేజీల్లో చేసిన ఆ పరిశోధనాపత్రం ఆ రోజుల్లో ఎంతో సంచలనాన్ని కలిగించింది. ఆ పత్రాన్ని మరో రెండు మూడు పత్రికలు కూడా అచ్చు వేశాయి.

వాస్తవాల దృష్ట్యా కర్ణుడి చరిత్ర వాడి మాటల్లోనే ఇదిగో ఇలాంటిది...

"మా అయ్యకి క్యానింగ్‌లో ఎనిమిది బీఘాల పొలం ఉండేది. ఓ చిన్న చెరువూ ఉండేది. చేపలకీ అన్నానికీ లోటు లేదు. ఓసారి వరదొచ్చింది. అలాంటి ఇలాంటి వరద కాదు. దాంతో అంతా కొట్టుకుపోయింది. అప్పుడు నాకు ఏడేళ్ళు. మొదట మా గోలచ్చిమి చచ్చిపోయింది. నాలుగుసేర్లు పాలు ఇచ్చేది. ఆరో ఏడు వచ్చే వరకూ పన్నెండణాల పాలూ, నాలుగు అణాల వరి అన్నంతో పెరిగి పెద్దవాణ్ణయ్యాను. అయితే ఆ వరదతో మా గోవే కాదు - ఏడాదికి సరిపడా దాచుకున్న ధాన్యం, మా పొలం మాకు ఇచ్చిన గ్రాసం మొత్తం - అంతా కొట్టుకు పోయింది. అలాంటి వరదని కనీ




వినీ ఎరుగం. మా అయ్య అయితే ఆ అప్పుని తీర్చలేకపోయాడు. ఉన్నదంతా సాహుకారు ఇంటికి కాళ్ళు వచ్చి నడిచి వెళ్ళిపోయింది. సాహు కారు వడ్డీ వ్యాపారస్తుడు. పొలం, చెరువు, ఇల్లూ అన్నింటినీ మింగేశాడు. ఆ కష్టాన్ని తట్టుకోలేక అయ్య చచ్చిపోయాడు. పిల్లాణ్ణి నేనేం చెయ్యగలను? అమ్మ చెయ్యి పట్టుకుని ముష్టి అడుక్కోవడం మొదలుపెట్టవలసి వచ్చింది".

ఇదంతా వినేసరికి రవీన్ అనే విద్యార్థి కళ్ళు కోపంతో ఎర్రగా అయ్యాయి. ఆ సాహు కారుగాని కళ్ళెదుట కనపడి ఉంటే చంపేసి ఉండేవాడు. అంత లావు కోపం వచ్చింది ఆ అబ్బాయికి.

విద్యార్థుల్లో ఓ అమ్మాయి వుంది. ఆ పిల్లకి కర్ణుడి దురదృష్టానికి ఏడుపు వచ్చింది. కన్నీళ్ళతో రెండు కళ్ళూ నిండిపోయాయి. పది రూపాయల నోటుని కర్ణుడి చేతిలో పెట్టింది. వాడి పక్క నున్న

ముష్టివాళ్ళందరూ నోరెళ్లబెట్టి విస్తుపోయారు. నోటమాట రాక వాణ్ణి చూస్తూ ఉండిపోయారు కర్ణుడి కథ విని. వీళ్ళలాగే కర్ణుడి తాతా తండ్రీ అందరూ ముష్టివాళ్ళే. కానీ వాడి సంగతి చూడు. నాలుగు సేర్ల పాల కథ చెప్పి పది రూపాయలు, అచ్చంగా పది రూపాయలు కొట్టేశాడు.

నిజానికి ఎంతో కొంత గణించాలంటే ముష్టి వాడికి కూడా ఓ బాగా బతికిన కుటుంబ చరిత్ర ఉండాలి. రాజు కొడుకు సాధువు, సన్యాసి అవుతాడు. అది విశేషమే. కానీ సామాన్యుడి కొడుకు సాధువూ సన్యాసి అయితే అదేం విశేషం అవదు. చదువు సంధ్యలు లేకపోయినా కర్ణుడికి ఈ సంగతి బాగా తెలుసు.

అలాంటి కర్ణుడు ఇప్పుడు కలకత్తా ఉత్తర ప్రాంతం నుండి దక్షిణ ప్రాంతానికి వచ్చాడు. కలకత్తా పెరిగిపోతోంది. అంచేత వాడు తన ప్రాంతాన్ని పెంచుకోవాలి. గమనించి చూడాలి– ఏ ప్రాంతంలో పోటీ తక్కువగా ఉందీ, పైసలు ఎక్కువ ఎక్కడ దొరుకుతాయి? పైపైన తెలుసుకుంటే చాలదు. ఆ ప్రాంత ప్రజల మధ్యకి వెళ్ళాలి. లేక్‌టవును, సాల్ట్ లేక్‌లాంటి ప్రాంతాలు చూశాక వాడికీ విషయం బోధపడ్డది. ఎంతో పెద్ద పెద్ద ఆశలతో వాడు కలకత్తా లాంటి అందమైన మహా నగరానికి వచ్చాడు. హతాశుడయ్యాడు. ఇంత పెద్ద మహా నగరంలో నిలదొక్కుకుని ముష్టి అడుక్కోవాలంటే ఓ స్కూటరే ఉండాలి.

ఎంతోమంది మీద వాడి మనసులో ఫిర్యాదు ఉంది. అందరికందరూ వాణ్ణి మోసమే చేశారు. ఇంకా మోసం చేస్తూనే ఉన్నారు. వాణ్ణి కన్న అమ్మా అబ్బా కూడా మోసం చేశారు. కనీసం వాళ్ళు వాడికి ఓ మంచి పేరన్నా పెట్టలేదు. 'పొడుగు చెవిగాడు' అని పేరు పెట్టారు. అదేం వాళ్ళు పెట్టిన ముద్దు పేరేం కాదు. వాడి ఎడం చెవి కాస్త పొడుగ్గా వుంటుంది. దాంతో వాడు పొడుగు చెవిగాడు అయ్యాడు. ఆ పేరుతోనే నలభైఏళ్ళపాటు ముష్టి అడుక్కున్నాక వాడు తన పేరుని కర్ణుడిగా మార్చుకున్నాడు. ఆ పేరు వాడికి హఠాత్తుగా తట్టిన పేరేం కాదు. అనామిక నాటక కంపెనీవాళ్ళు వేసిన 'దాన వీర కర్ణుడు' నాటకం చూడగానే వాడికా పేరు బాగా నచ్చేసింది. వాడు పేరు మార్చుకోవడానికి ఇంకో కారణం కూడా ఉంది. ఈ మధ్య ముష్టి అడుక్కోవడంలోనూ పోటీ పెరిగిపోయింది. గుడ్డీ, కుంటీ, మూగ, చెవుడూ, ముసిలి లాంటి ముష్టి వాళ్ళతో వాడికి పోటీపడి పోట్లాడవలసివస్తోంది. వాళ్ళే కాదు, వాళ్ళకి తోడు శనిపూజారి బ్రాహ్మళ్ళు, చావులో పాటగాళ్ళు, అనాథలు, గోహత్యగాళ్ళు – చాలామంది ఉన్నారు. శివ భజనగాళ్ళు, బాబా తారకేశ్వర భక్తులు – చెప్పలేం–ఎంతెంతమందో! ఇక ఇప్పుడు రోడ్డుమీద బొమ్మలు గీసే ముష్టివాళ్ళూ వచ్చిపడ్డారు. బీహారు, ఉత్తరప్రదేశ్ నుంచి వచ్చిపడే ముష్టివాళ్ళూ తక్కువమందేం కాదు.

బయటనుండి వచ్చే వ్యాపారస్తుల గురించి అంతగా తలమొత్తుకుని బాధపడుతున్నారు. కానీ బయటనుండి వచ్చిన ముష్టివాళ్ళ గురించి ఎవరూ మాట్లాడరు. దృష్టి పెట్టరు. అది చూసి కర్ణుడికి గొప్ప బాధగా అనిపిస్తుంది.

ఈ రోజుల్లో జనంలో దానం చెయ్యాలన్న కోరిక చచ్చిపోతోంది. ఇది ఆలోచించాల్సిన సంగతి. అందరికీ యూనియన్లు ఉన్నాయి. జండాలు పట్టుకుని మీటింగులు పెడ్తారు. నినాదాలు ఇస్తారు. పోస్టర్లు ఉంటాయి. చేతులు పైకెత్తి విసురుతూ పిడికిళ్ళు బిగించి మరీ వాళ్ళ డిమాండ్లని ఒప్పుకు తీరాలంటారు. అందుకుగాను గట్టి ప్రయత్నం చేస్తారు. వాళ్లలాగానే కర్ణుడి లాంటి ముష్టివాళ్ళకీ వీళ్ల డిమాండ్లు వీళ్ళకీ ఉన్నాయి.

ఎవరూ దీనిని అర్థం చేసుకోవాలని అనుకోనే అనుకోరు. వీళ్ళ చేతులు పైకి లేవవు. మహా అయితే ఛాతీ వరకూ లేస్తాయి. అంతకిమించి మరి పైకి లేవవు. అయినప్పటికీ ముష్టివేసే వాళ్ళ మండిపోతున్న కళ్ళనీ కోపాన్నీ వీళ్ళు చూడవలసి వస్తోంది. ఆ మండేకళ్ళని చూడగానే వీళ్ళ చాచబోయే చెయ్యి దానంతటదే కిందకి దిగిపోతుంది.

తన కొత్త పేరుతో ఎల్గిన్ క్రాసింగ్ దగ్గర అడుక్కున్న మొదటి అనుభవం చేదు అనుభవమే అయింది. మొదటి కష్టమర్ ముందు ఎంతో వినయంగా అతి నెమ్మదిగా "అయ్యా! నాలుగణాలు ధర్మం చెయ్యండి" అని అడిగాడు. ఆ ఆసామీ రెండు చేతులూ రెండు జేబుల్లో పెట్టుకుని మెట్రో రైలు స్టేషన్ వేపు చూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

"అయ్యా! కర్ణుడికి ధర్మం చెయ్యండి" అడుక్కున్నాడు కర్ణుడు.

ఆ ఆసామీ జేబులోంచి సిగరెట్టు ప్యాకెట్టు తీస్తూ చికాకు పడ్డాడు.

"దాన వీర కర్ణుడు ముష్టి అడుక్కుంటున్నాడేం? పోరా సూతపుత్రా! పోయి రిక్షాలాగలేవూ?" అన్నాడు.

ముష్టివాళ్ళు జవాబు ఇవ్వకూడదు. కర్ణుడికి తనమీద తనకే కోపం వచ్చింది. కోల్‌కత్తా ఎన్నో విధాలుగా రూపుదిద్దుకుంటోంది. వాడూ కొత్త పద్ధతిని మొదలు పెట్టాలనుకున్నాడు.

"రెండణాలు ఇప్పించండయ్యా!" అన్న భాష మారిపోతోంది. వాడు కొత్త విధానాన్ని పట్టుకోవాలనుకున్నాడు. అయితే అది కాస్తా బెడిసి కొట్టింది. అమ్మా అయ్యల మీద వాడికున్న కోపం కాస్త తగ్గుముఖం పట్టింది. బహుశా ఇది తెలిసే వాళ్ళు వాడికి మంచిపేరు పెట్టలేదేమో. ముష్టి అడిగేవాడికీ, ముష్టి వేసేవాడికీ మొహం దగ్గర్నుండి పేరు వరకూ తేడా వుంటుంది. మిగతాది ఏదీ మారకుండా ఎప్పటి మాదిరిగానే ఉంది. పేరు ఒక్కటీ మార్చినంత మాత్రాన ఏం అవదు. అందుకనే వాడి కొత్తవిధానం బెడిసికొట్టింది.

కానీ ఈ కొత్త పద్ధతులని పట్టుకొని జోన్సు నెల తిరిగేసరికి ఎంతో గణిస్తున్నాడు. జోన్సు మొదట ఇంగ్లీషులో శుభాకాంక్షలు చెప్తాడు.

"గుడ్‌మాణింగ్ సర్!"

"టుడే ఇట్స్ రియలీ హాట్"

"బేడ్లీ పవర్ క్రైసిస్"

"కోల్‌కటా ఈజ్ డైయింగ్ సర్"

"నో ఫెసిలిటీజ్"

ఇలా నాలుగైదు మాటలు మాట్లాడిన తర్వాత "సర్! దయచేసి నాకో కాయిన్ ఇచ్చి సాయపడ్తారా?" అంటాడు.

తాగుబోతూ, జూదరి ఆంగ్లో జోన్సు ఇంగ్లీషు భాష బలంతో నాలుగేళ్ళుగా వీళ్ళందరినీ వెనక్కి తోసేసి రాజ్యం ఏలుతున్నాడు. వాడి పేరే 'ముష్టి దొర' అయింది.

ముష్టివాడు ఇంగ్లీషులో మాట్లాడుతున్నాడు!. అందరికి అందరూ ముగ్ధులై చూస్తారు. ఇంగ్లీషు ప్రైవేటు మాస్టారుని పెట్టి పాఠాలు చెప్పించినా పిల్లడు పరీక్షల్లో తప్పుతున్నాడు. అలాంటిది ముష్టి వాడు ఇంగ్లీషులో మాట్లాడుతున్నాడు మరి!

జోన్సు 'పొడుగుచెవిగాడి'కి ఇంగ్లీషు నేర్పిస్తానని మాట ఇచ్చాడు. నాలుగైదు వాక్యాలు నేర్పించాడు కూడా. కానీ 'పొడుగు చెవిగాడి'కి అదృష్టం అన్నది ఉంటేగా? జోన్సు పచ్చగా పచ్చబారిపోయి కాలం చేశాడు. "వాడు దేవదూత. తప్పిదారి ఈ లోకానికి వచ్చాడు. అలాంటి వాళ్ళు ఎక్కువకాలం బతకరు" అన్నారు అందరూ.

'పొడుగు చెవిగాడికి' ఆశ అడుగంటి పోయింది. ఇంక వాడివల్ల ఏంకాదు. ఏదైనా పొందాలీ

అంటే చక్కటి తీరైనమొహమూ, తెలివీ ఉండాలి. కోల్‌కతాలో ఓసారి వాన మొత్తి కురిసింది. వాడి గుడిసె ఆ వానకి కొట్టుకుపోయింది. అయినప్పటికీ వాడు చెయ్యి చాచి ఎవరినీ ముష్టి అడగలేదు.

తన కళ్ళ ఎదుట జరుగుతున్నదాన్ని చూస్తూ కూర్చున్నాడు. స్వయంగా మున్‌మున్‌సేన్ వరద బాధితుల కోసం చందా అడుగుతోంది. ఆవిణ్ణి చూడ్డానికి జనం పరుగులు తీస్తూ వచ్చి పడుతున్నారు. పోలీసులు జనాన్ని ఆపలేకపోతున్నారు. ఒక్కొక్కరూ ఐదు, పది, ఇరవై, యాభై, వంద నోట్లు ఆవిడ చేతిలో పెడుతున్నారు.

'పొడుగు చెవిగాడు' ఫిల్మ్‌స్టారులందరినీ, యించుమించు అందర్నీ బాగానే గుర్తు పట్టగలడు. వాడు పాత సినిమా పోస్టర్లని చించి తెచ్చి దాస్తాడు. అవసరమైనప్పుడు మంట పెట్టుకోవడానికి పనికి వస్తాయి. ఇంగ్లీషు ఫిల్మ్‌ది ఏదైనా పోస్టరు ప్రత్యేకమైనదిగాని కనపడితే దానిని గుడిసెలో తగిలించుకుంటాడు.

వాడికి సంతోషం వేసింది. పోస్టర్లలో కనిపించే మొహాన్ని ఇంత దగ్గరగా చూడగలుగు తున్నాడు. అయితే వాడి సంతోషం అట్టేసేపు నిలవలేదు. ఒక సినిమా నటీమణికోసం కార్లు, పోలీసు బందోబస్తు, ఏర్పాట్లు – వీటన్నిటికీ ఎంత డబ్బు ఖర్చు అయివుంటుందో! అంతంత డబ్బు అనవసరంగా ఖర్చు పెట్టే బదులు ఆ డబ్బుని పొడుగు చెవిగాడికి ఇస్తే ఈ జనానికి ఏం పోతుందిట...!

నిజానికి దానం పుచ్చుకోడానికి ఇంగ్లీషు భాషాజ్ఞానం ఉండాలి. లేదూ, సినిమా ఆర్టిస్టు అవ్వాలి. అదీ కాదూ, కనీసం గొప్ప డబ్బున్న తండ్రికి కొడుకుగా పుట్టాలి. ఆ సన్యాసి బుద్ధుడికి ఆకలిగా ఉందని సుజాత పరమాణ్ణం పెట్టాలని వెళ్ళింది. బుద్ధుడు ఇల్లూ వాకిలీ వదిలేసి సన్యాసి అయ్యాడు. అయితే ఆయన మరి రాజకుమారుడు. రాజకుమారుడు భిక్ష అడగటమూ, ఓ మామ్మూలు మనిషి భిక్ష అడగటమూ – ఈ రెండింటికీ పెద్ద తేడా ఉంది. అవును బాబూ! 'పొడుగు చెవిగాడు' సినిమాలో చూశాడు. సుజాత ఎంత భక్తిశ్రద్ధలతో బుద్ధుడికి పరమాణ్ణం పెట్టిందో!

ఈ కర్ణుడి – 'పొడుగు చెవిగాడి' పెళ్ళామా? అది వాణ్ణి వదిలేసి వెళ్ళి చాలా ఏళ్ళయిపోయింది. 'ఒంటికంటి' కొడుకుని తనతోపాటు తీసుకెళ్ళిపోయింది. 'ఒంటికంటి' కొడుకుపైన మరో ఇద్దరు కొడుకులు ఉండేవారు. ఒకడు చచ్చిపోయాడు. రెండోవాడు జేబుకాటుగాడు అయ్యాడు. ఈ మధ్య వాడు బాగా గణిస్తున్నాడంటున్నారు. ఈ తండ్రిని వాడు ఏనాడో మరచిపోయాడు. ఇటువేపుకి రానే రాడు. 'ఒంటికంటి' కొడుకుమీద గొప్ప ఆశా భరోసా ఉండేవి. అయితే వాడు చెయ్యి జారిపోయాడు. పెళ్ళాం ఆ 'ఒంటికంటి' కొడుకుతో 'పొడుగు చెవిగాడు' తో కన్నా మూడురెట్లు ఎక్కువ గణిస్తోందని వినికిడి.

'పొడుగు చెవిగాడు' కలకత్తా ఉత్తర ప్రాంతాన్ని వదిలి దక్షిణ ప్రాంతానికి రావడం వెనుక ఉన్న కారణాల్లో ఇదీ ఒక కారణమే. ఇక్కడ కొచ్చి కర్ణుడు జోన్సులా వేషం మార్చాడు. మాట మార్చాడు. కొంత కాకపోయినా కొంత తన జెండాని పాతి ఓ వెలుగు వెలుగుదామనుకున్నాడే కానీ వాడి ఆశ నీరు కారిపోయింది. ఏ ప్రాంతమైనా వాడికి రోతపుడుతోంది.

రెండు రోజులు క్రితం ఎప్పుడో చేసిన జిలేబీలు రెండు మిఠాయి దుకాణంలో కొనుక్కుని వాడు గాంజా పార్కు వేపుకి బయలుదేరాడు. అక్కడ ఫుట్‌పాత్ ఒడ్డుని కొళాయి ఉంది. అక్కడ కూచుని జిలేబీలు తిందామనుకున్నాడు. గాంజా పార్కులో ఓ మూల ఆయాసం తగ్గడానికి నిల్చున్నాడు. ఆ చీకటిలో చాచిన చెయ్యి ఒకటి వాడి ఛాతీ దగ్గరకు లేచింది.

"రెండణాలు ధర్మం చెయ్యి బాబూ!"

ఓ ముసలి ముష్టివాడు 'పొడుగు చెవిగాడి' ఎదుట నిల్చుని ఉన్నాడు.

చీకటివల్ల వాడికి బహుశా తిన్నగా కనిపించలేనట్టుంది.

'పొడుగు చెవిగాడి' బతుకులో మొదటిసారి ఇది జరిగింది, పై వాడెవడో వాడి ఛాతీముందు చెయ్యి చాచడం.

ఛాతీ దగ్గర చాచిన చేతిని ఊపుతూ ముష్టి అడుక్కోవడం.

బతుకంతా ఎంతెంతమంది ముందో చెయ్యి చాచాడు. ఈరోజు ఇదేమిటి ఇలా అయింది? రాతి బొమ్మలా వాడు కదలకుండా కొన్ని క్షణాల పాటు నిలబడి పోయాడు. ఆ తర్వాత ఆ చాచిన చేతిలో ఓ జిలేబీని పెట్టాడు.

దాన వీర కర్ణుడిలాగ ముందుకి అడుగు వేశాడు.

అందరు మనుషులు సమానమే అయినా, కొందరు మనుషులు ఎక్కువ సమానం అన్న చందాన్ని మనం భాషలకు కూడా వర్తింప చేసుకున్నాము. అన్ని భాషలు సమానమే అయినా కొన్ని భాషలు ఎక్కువ సమానం అన్న వివక్ష చూసారా, మా భాష గొప్పది, మీ భాష అంత కాదులే అన్న గొప్పలు చెప్పుకునే ధోరణి, వీటన్నిటికీ, మనకు తెలియకుండానే దాదాపు ఒక దశాబ్దమై తెర లేపాము. దీనికి ప్రాంతీయ పార్టీల ఒత్తిడి, తమకు వారి మద్దతు కోసమై, ఆయా కాలాలలో పాలిస్తున్న కేంద్ర ప్రభుత్వాల బుజ్జగింపు ధోరణి మూల కారణాలు. నెహ్రూ పండితుడి వంటివారు ప్రధానిగా వుండగా ఇటువంటి ప్రతిపాదన గనక వచ్చివుంటే, ఆయన, ఒక భాషకు ఇంకొక భాషకు మధ్య ఈ గొప్పదనాల ప్రసక్తి ఏమిటి, ఆయా భాషల అభివృద్ధికి ఇచ్చే నిధులేవో (తలా వంద కోట్లు, అయిదేళ్ళకాలంలో అంటే ఏడాదికి కేవలం ఇరవై కోట్లు మాత్రమే) గుర్తింపు పొందిన అన్నీ భారతీయ భాషలకూ ఇచ్చేద్దాము అని మొత్తం వివాదాన్ని, ఒక జాతీయ స్ఫూర్తితో ఇట్టే ఎగురకొట్టేసి వుండేవారు. ఇంత జాతీయ దృష్టిగల నాయకత్వం ఇప్పుడు చాలా కాలంగా లేదు. మనం నాయకత్వ పేదరికంలో మగ్గుతున్నాము. నాయకత్వం దృష్టి జాతీయ చైతన్యంతో సంపన్నం అయితే గానీ, దేశం సుభిక్షం, సంపన్నం కాలేదు. అయితే ఈ భాషల కుంపటి ఎలా రగులుకుంది?

# మత్తు వదలరా...ప్రాచీన మత్తు వదలరా...!

## రామతీర్థ

**2004లో** తమిళనాడులో ఎక్కువ ఎం.పి.సీట్లు గెలిచి, కేంద్రంలో యుపీఏ ప్రభుత్వానికి తమ మద్దతు అవసరం అని తెలుసుకున్న డిఎంకె పార్టీ చాల ఏళ్ళుగా తమ ప్రాంతీయ డిమాండ్ అయిన 'తమిళ భాషకు క్లాసికల్ హోదా' ను ముందుకు తీసుకెళ్ళి, అప్పట్లో దాన్ని సాధించుకున్నది. వీరు చెప్పే రెండు వేల యేళ్ళ సాహిత్య రచన, తొలికాప్పియమ్, కానీ అంతకు ముందువిగా భావించబడే సంగం సాహిత్యం కానీ, మూల ద్రవిడమ్‌లో ఉంటాయి. ఇది అని దక్షిణాది భాషలకు ఒక కుదురు. దీనిపై కేవలం తమిళులకే ఎటువంటి ప్రత్యేకమైన హక్కులేదు. అది దక్షిణాది భాషల ఒక ఉమ్మడి వారసత్వ మూలం. దీనికేవైనా అంతర్జాతీయ విధి విధానాలు వున్నాయా? అంటే లేవు.

ఈ మాట సాక్షాత్తు తమిళ సాహిత్య వేత్త కులైండై స్వామి తాను యునెస్కోకు ఒక లేఖ రాయగా, దానికి జవాబుగా (జనవరి 24, 2007న) ఆ సంస్థ దీన్ని స్పష్టం చేసింది. దేశ భాషల క్లాసికల్ స్వభావం, హోదా నిర్ణయించే విషయంపై ఏ మార్గదర్శక నియమావళి లేదని, అయినా అది




ఆయా దేశాలకు చెందిన విషయమే కానీ, తమ సంస్థ పరిధిలోకి రాదని ఆ సంస్థ తెలిపింది. 2004లోనే తమ భాషకు క్లాసికల్ హోదా పొందిన తమిళులు ఈ 2007 స్పష్టీకరణ ఎందుకు తెచ్చుకున్నారో కానీ, అందులోని వివరాలను ఆయన పత్రికా ముఖంగా ప్రకటించినప్పటికీ క్లాసికల్ హోదా పొందిన ఇతర భాషల వారు తమ కోర్ట్ కేసులు తేల్చుకోవడంలో ఈ సమాచారాన్ని ఉపయుక్తంగా వాడుకోవడం లేదు. క్లాసికల్ హోదా అసలు భాషకు ఎలా వర్తిస్తుంది...?

శాసనాల వల్లా? భాష లిపి చాలాకాలం నుంచి వుందని పురావస్తు శాఖ వెలికి తీయగలిగిన ఆధారాల వల్లా? లేక ఆ భాషలో జరిగిన సాహిత్య వికాసంవల్లా? ఈ విషయంలో మనకు గల గందరగోళం చూస్తే నవ్వు వస్తుంది. శాసనాలూ, వాటిలోని ఛంధస్సులూ, లిపి పురాతనత్వం ఇవేవీ ఒక భాషకు క్లాసికల్ గుర్తింపును ఇవ్వలేవు. జరగాల్సిందల్లా ఆ భాషలో సాహిత్య వికాసం, క్లాసికల్ భాషగా గుర్తింపు పొందాలీ అంటే, క్లాసికల్ (విశిష్ట) స్వభావం గల రచన ఆ భాషలో వెలువడి వుండాలి అన్నది ఒకే ఒక్క ఏకవాక్య అవగాహన. దీన్ని ఎంత కలగాపులగం చేయాలో అంతా చేశారు మన పెద్దలు, అలనాటి అధికార భాషా సంఘాల వారు, సాంస్కృతిక శాఖల వారు. దీనికి తమిళులు పట్టించిన పక్కదోవ కూడా ఒక ముఖ్యకారణం. ఈ క్లాసికల్ అనే మాటను ఎందుకు పదేపదే వాడుతున్నాము? ఇంతోటి ఇంగ్లీషు మాటకు సరైన మాటలు మన భాషలో లేవా? వున్నాయి అంటే ఎలా ఉన్నాయి.?

ఒక మాటకు పలు మాటలుగా మనం వివిధ భాషలలో వ్యవహరి స్తు


98492 00385

న్నాము. కేంద్ర ప్రభుత్వ వనరులతో తాము ఏర్పాటు చేసుకున్న సంస్థకు శాస్త్రీయ తమిళ్ అని హిందీలో పేరు పెట్టుకుని, సెందమిళ్ అని తమ భాషలో వ్యవహరిస్తున్నారు తమిళులు. ఇక కన్నడలో అభిజాతె కన్నడ అంటున్నారు. మనం ప్రాచీన భాష అంటున్నాము. మళయాళంలో శ్రేష్ఠ భాష అంటున్నారు. ఒడియాలో శాస్త్రీయ మాన్యత అంటున్నారు. వీటిలో ఏ పేరు కూడా క్లాసికల్ అంటే సాహిత్య విశిష్టత అని అర్థం చేసుకోవడం లేదు. దాదాపు అన్ని భాషల వారు ఈ హోదా విషయమై, ఈ క్లాసికల్ అన్నదానికి, తమ భాషా పదంగా, సంస్కృత పదాలే తమ భాషలో వాడుతు న్నారు. ఇటీవల ఒక వ్యాసంలో ఏ.బి.కె. ప్రసాద్ శిష్ట భాష అనడం కూడా సరిగా లేదు. శిష్ట హోదా కాదు అది, క్లాసికల్ అంటే, కాలంతో సంబంధం లేకుండా విశిష్ట రచన జరిగి వుండవలసిన నిబంధనే తప్ప వేరొకటి కాదు. శిష్ట అంటే ఇంకొంచెం కన్ఫ్యూజన్ పెరుగుతుంది తప్ప తగ్గదు.

నిజానికి ఏ దశలోనైనా విశిష్టంగా భావించబడే సాహిత్యం ఆ భాషలో వచ్చి వుంటే (ఇన్ని శతాబ్దాల కాలం అన్న ఏ నిబంధనలు ప్రతిబంధకాలు కాదు ఇక్కడ. గత ఐదు వందల ఏళ్ళ కాలంలోనైనా, కొన్ని వేలఏళ్ళ కిందట అయినా) ఆ భాషను విశిష్ట భాషగా గుర్తించవచ్చు అన్నది, అంతర్జాతీయ విద్యావంత సమాజంలో, ఐక్యరాజ్య సమితి సంస్థ అయిన యునెస్కో వంటి ప్రతిష్టాత్మక సంస్థలకు గల ఒక అవగాహన. దీనికి, శాసనాలు వెతుక్కుని ప్రాచీనతను నిర్ధారించుకునే చాదస్తానికీ. ఏ విధమైన సంబంధము లేదు. ఇప్పటికైనా ఈ ప్రాచీన పిచ్చి మీద ఆధారపడ్డ వాదాలన్నీ ఉపసంహరించుకుంటే ఒక స్పష్టత వస్తుంది. క్లాసికల్ స్వభావం గల రచనలు కొన్ని వేల ఏళ్ళ కిందట అయినా జరిగి ఉండవచ్చు. లేదా కేవలం రెండు వందల సంవత్సరాల కిందట అయినా జరిగి ఉండవచ్చు అని అంతర్జాతీయ సమాజం ఒక ఉదార వైఖరిని ఈ విషయంలో కలిగి యున్నది. ఆయా భాషలలోని ఉత్కృష్ట కృషి పట్ల సదా గౌరవసూచకంగా వున్నది ఈ దృష్టికోణం. ఇది మనకు లోపించింది. అందుకే మనం ఈ దురవస్థలో ఇరుక్కున్నాం. ఎలా ఇరుక్కున్నాము? అసలు ఆ దురవస్థ ఏమిటి?

ఆ దురవస్థ ఏమిటంటే ఒక భాష అంటే తమిళ భాష అన్నిటికన్నా ప్రాచీనం, మిగతావి కావు అన్న దృష్టితో, ఇలా క్లాసికల్ హోదాకు అర్హమని కేంద్ర ప్రభుత్వం భావించిన మిగతా అన్ని భాషలపట్ల ఒక అగౌరవంతో, వాటికి ఏ హోదాలు, తద్వారా వచ్చే ఏ అభివృద్ధి నిధులు దక్కరాదు అన్న ఆలోచనతో తమిళుడైన గాంధీ రాజేంద్రన్, మద్రాస్ హైకోర్టులో తెలుగు, కన్నడం, మళయాళం, తాజాగా ఒడియా భాషలకు కూడా వర్తించేలా ఒక పిఐఎల్ (ప్రజాహిత వ్యాజ్యం ?? - ఏ ప్రజలు, ఎవరి హితంకోరి ఈ వ్యాజ్యం ? అసలు ఇతర భాషలకు క్లాసికల్ హోదా ఇవ్వడం వల్ల తమిళ ప్రజలకు, వారి సంస్కృతికి ఏ విఘాతమూ కలగనప్పుడు, వారి భాషా ప్రయోజనాలకు ఎటువంటి భంగము వాటిల్లనప్పుడు) 2008 నుంచీ వేసి ఉంచారు. కేవలం రాజకీయ వొత్తిళ్ళ వల్ల ఈ భాషా సమాజాలు వారు ఈ క్లాసికల్ హోదాను పొందారే తప్ప నిజంగా వారికి అటువంటి అర్హతుల లేవనీ, వున్న అర్హతలేమిటో ఒక విశ్రాంత జడ్జ్ గారితో ఉన్నత కమిటి వేసి తగు నిర్ణయం చేయాలని, అంతా దాకా ఈ హోదాల ప్రకటనలూ, వాటి వల్ల ఒనగూరే లబ్ధి కూడా ఆగిపోవాలని ఈ పిఐఎల్ లో వారి నివేదన. ఇది ఇప్పటికీ ఏడేళ్ళ బట్టీ సాగుతున్నది. వారి భాషకు మాత్రం ఈ హోదా, అందువల్ల ఒనగూరే సంస్థలు, వాటి అభివృద్ధిని తమిళులు 2004 నుంచీ అమలు పరుచుకుంటూనే వున్నారు. 2004 లో ఒక సాహిత్య అకాడెమీ ఏర్పాటు చేసిన నిపుణుల కమిటీ, సాహిత్య అకాడెమీ అధ్యక్షులు గోపిచంద్ నారంగ్ అధ్యక్షతన పనిచేసింది తప్ప, అప్పట్లో ఏ జడ్జ్ ప్రస్తావనలూ లేవు? ఎలా వస్తాయి? అదే మొదలు కదా, ఈ చిచ్చుకు. అసలీ రెండువేల ఏళ్ళు లేదా పదిహేను వందల ఏళ్ళ గొడవేమిటి?

ఇదీ తమిళుల పుణ్యమే. 2005 నవంబర్‌లో ఈ క్లాసికల్ హోదాకు గల కాల పరిమితి ని వెయ్యేళ్ళు (తమిళులు పొందినప్పుడు వెయ్యేళ్ళే పరిమితి) నుంచి 1500-2000 ఏళ్ళుగా కేంద్ర ప్రభుత్వం సవరించేలా జాగ్రత్తలు తీసుకున్నది కూడా అప్పుడు కేంద్రంలో తమ ప్రభ వెలుగుతున్న డిఎంకె, దాని సాంస్కృతిక సైన్యాలే. ఇక అప్పటినుంచీ మనకు ప్రాచీన పూనకాలు పట్టుకున్నాయి. ఇలా మనకు అందుకోలేని కాల పరిమితిని పెట్టిన తమిళుల బండారాన్ని బయటపెట్టవలసిన మన తెలుగు సాహిత్య భాషా మేధావులు, నిపుణులు, ఈ ప్రాచీనత వెనుక పరుగులు తీయడం మొదలు పెట్టారు. అది నిరాఘాటంగా 2008 వరకూ సాగినా, మనం చూపెట్టిన కొత్త రుజువులూ లేవు. సాహిత్య ప్రాచీనత విషయమై బయల్పడిన కొత్త విషయాలు లేవు. క్రీ.శ. 850 - 900 వరకూ కన్నడ సమాజం వెళ్ళగలదు. మనకేమో నన్నయ కాలం ముందర జరిగిన మహాభారత రచన ఒక్కటే ఆధారం (అంతకు ముందు కొందరి పేర్లు కర్ణాకర్ణిగా వినబడుతున్నప్పటికీ). అందువల్ల ఎవరూ అందుకోలేని ఒక కాల పరిమితిని పెట్టి, ఈ లోగా తమ పబ్బం తాము గడుపుకోవచ్చు అన్న తమిళుల ఆలోచనే, ఈ ప్రాచీనత అంటూ కాల పరిమితిని వెనక్కు నెట్టడంలో గల కారణం. అయితే కేంద్ర ప్రభుత్వం దీన్నే సీరియస్‌గా నమ్ముతోందా? అంటే లేదు అనే జవాబు.

2008 కల్లా డి.ఎం.కె. తో తమ పొత్తులో కొన్ని అంతరాలు పెద్ద పెద్దవే వచ్చే సరికి, అన్నిచోట్లా జరిగినట్లే, భాషల ప్రాచీనత విషయంలోనూ జరిగి, అంత ప్రాచీనత ఏ భారతీయ భాషకు లిఖిత రుపేణా వుండదు అన్న సత్యం గోచరమైంది. రాజకీయ ప్రతిబందకాలు తోసి రాజని, తమ తమ రాష్ట్రాలలో చేసిన వాగ్దానాల మేరకు ఒత్తిడి పెంచుతున్న కన్నడ, తెలుగు భాషలకు కూడా 2008 లో కేంద్ర ప్రభుత్వం ఈ క్లాసికల్ హోదా ప్రకటించింది. దీనితో కన్ను కుట్టిన తమిళులు, తమ ప్రతినిధులూ ఆ కమిటీలో ఉండడం పుణ్యమా అని ప్రభుత్వ ప్రకటన వెలువడ్డానికి ముందరే ఈ పి.ఐ.ఎల్. ను మద్రాసు హైకోర్టులో దాఖలు చేశాయి. ప్రభుత్వ అంతరంగిక వ్యవహారమైన ఒక ప్రకటన రావడానికి ముందరే దాన్ని ఎలా ఈ పిఐఎల్ వేసిన వారికి

ఎవరు అందించారో, ఇక్కడ పెద్ద రహస్యమేమీ కాదు. ప్రభుత్వం ప్రకటన చేయకుండానే వారి ముదరి కాళ్ళకు తమ ఊహల మేరకు బంధాలు వేసే ప్రయత్నాలు చేసే ఇటువంటి పిఐఎల్‌లకు ఎటువంటి సమంజసత్వం ఉన్నదీ కూడా ఇక్కడ ఎవరూ ఆలోచించలేదు. తద్వారా క్లాసికల్ హోదా వచ్చిందంటే వచ్చింది అనుకున్నా, మొదటి రోజునుంచే కొత్త సమస్యలతో మనం ఇరుక్కున్నాం.

ఇంతా చేసి ఈ ప్రకటన, హోదా, ఈ వ్యవహారమంతా, ఏటా ఒక భాష అభివృద్ధికి ఇరవై కోట్లు ఖర్చు పెట్టుకోవడానికి. దీనికి ఒక భాష విషయంలో, ఇంకో భాషా సమాజపు జోక్యం అసలు అవసరం ఉన్నదా? ఆ భాష అభివృద్ధికి ఈ భాషలు ఏమన్నా అడ్డంకులా? అంటే అటువంటి సమస్యలు ఏవీ లేనే లేవు. వున్నదల్లా ఈసు, అసూయ. కుటిల స్పర్ధ. తామే గొప్పవారన్నా ఒక (పరిశీలనకు మిగలని) భాషా దురహంకారం. దీనికి తమిళులు పెట్టింది పేరు.

కేంద్ర ప్రభుత్వం వేసిన కమిటీలో భాషా సాంస్కృతిక నిపుణులే వున్నారు. వి.సి. కులందై స్వామి. ఉదయ్ నారాయణ్ సింగ్, భద్రిరాజు కృష్ణమూర్తి, డా బి. ఎన్. పట్నాయక్, డి.ఎన్. వెంకట రమణయ్య మొదలగు వారు. తమిళ భాషకి 2004 లో ఈ హోదా ప్రకటన చేసినప్పుడు వున్నటువంటి కమిటి లాంటిదే ఇది కూడా. అప్పుడు లేని విశ్రాంత జడ్జ్ నేతృత్వంలో కమిటి ప్రస్తావన ఇప్పుడెందుకు? ఈ కమిటీలో వున్న వారి నైపుణ్యాలు సరిపోవా? సరిపోవు అనే అంటూ అదే తన ముఖ్య వాదనగా ఈ గాంధీ రాజేంద్రన్ వరుసగా అన్నీ భాషలకూ ఈ పిఐఎల్ బంధాన్ని తగిలిస్తూ వస్తున్నారు. ఇప్పుడు ఏకంగా అయిదు రాష్ట్రాలు - ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, కర్నాటక, కేరళ ఒడిశా ఈ విషయమై మద్రాస్ హైకోర్టుకు ఏప్రిల్ 6 2015న తమ జవాబులు, వివరణలు సమర్పించాల్సి ఉంది.

ఈ ఏడేళ్లలో ఏం జరిగిందో ఇప్పుడు ప్రస్తావించుకోవద్దు. ఈ కేసులో కోర్ట్ స్టే ఇవ్వలేదు కనుక మనకు పెద్దగా నష్టం లేదు అన్నది ఒక ప్రధానమైన వాదనగా వున్నది. కోర్ట్ స్టే ఎప్పుడయినా ఇవ్వవచ్చు అన్నది వీరు పట్టించుకున్నట్లుగా లేదు. పైపెచ్చు తెచ్చుకున్న నిధులు ఏమిటి అంటే అవి కొన్ని లక్షలలోపే వుండవచ్చు వాటిపై సమగ్ర సమాచారం లేదు. అయితే హోదా ప్రకటన వచ్చాకా మన రాష్ట్రాలు రెండుగా విడిపోవడం, అధికారభాషా సంఘం లేకుండా పోవడం వంటి కీలక పరిణామాలు చేటుచేసుకున్నాక, ఇప్పుడు ఈ సమస్య రెండు తెలుగు రాష్ట్రాలకు సంబంధించిన విషయమై పోయింది. సత్వరమే సమగ్రమైన వాదనలు వినిపించి ఈ పిఐఎల్ ను నిరాకరించవలసిందిగా కోర్టులో మొత్తం అయిదు రాష్ట్రాలు తగు స్పందనలు నమోదు చేయవలసిన తరుణంలో, కోర్ట్ స్టే ఇవ్వడం లేదు అనే సాంకేతిక సాకులను చూపి కాల యాపన చేయడం తగని పని. అంతర్జాతీయంగా, ఈ విషయంలో ఉదార భావనలు ఉన్నాయి. ఈ కేసులో కేవలం తమిళుల అభ్యంతరాలే సరిపోవు.

ప్రపంచ వ్యాప్తంగా ఈ క్లాసికల్ అన్న అవగాహన ఆయా భాషలలో వచ్చిన రచనల విశిష్టతకు మాత్రమే సంబంధించినది. దాన్ని కూడా వారి పురాతన కాలం, మధ్య యుగాల కాలం, వలస పూర్వ అమెరికన్ భాషలు, ఆధునిక యుగకాలం అంటూ ఉప విభాగాలు చేసుకొని ఈ విశిష్ట రచనలు వచ్చిన కాలం ఏదా అన్న పరిశీలన మేరకు, ఆయా భాషలను క్లాసికల్ భాషలుగా పరిగణనలోకి తీసుకున్నారు. అలా తీసుకోవడంలో పురాతన కాలం, అంటే క్రీ.పూ. 2600 నుంచి మొదలైన సుమేరియన్ శిలా ఫలకాల సాహిత్యం నుంచి మొదలై, ఈ నాలుగు విభాగాల్లో ఇరవయ్యో శతాబ్దపు యిద్దిష్ సాహిత్యాన్ని కూడా క్లాసికల్‌గానే తమ పరిగణనలోకి తీసుకున్నారు. నిజానికి గత అయిదు వందల ఏళ్ళ కాలంలోనే దాదాపు పదహారు భాషా సాహిత్యాలను క్లాసికల్ అంటే విశిష్ట సాహిత్యం గలవిగా గుర్తించారు. అవి ఇటాలియన్, పోర్చుగీసు, స్పానిష్, అజేరి, డానీష్, లిథునియన్, తొలి ఆధునిక ఆంగ్లం (షేక్‌స్పియర్ కాలం నాటిది), పోలిష్, టర్కిష్, మంచూ భాష, తొలి ఆధునిక ఫ్రెంచ్, తొలి ఆధునిక డచ్, సంప్రదాయ లదినో, సంప్రదాయ రష్యన్, సంప్రదాయ యిద్దిష్ , ఇన్ని భాషల సాహిత్యం క్లాసికల్ కావడానికి వాటికి ఏమీ రెండువేలు, 1500 ఏళ్ళ కాల పరిమితి లేదు. అది ఎవరూ నిబంధనగా పెట్టుకోలేదు. అస్సలు పట్టించుకోలేదు. ఇది అంతర్జాతీయ అవగాహన కాగా ఎక్కడా వున్నాం మనం? ఎక్కడ వున్నారు మన భాషలకు క్లాసికల్ హోదా గౌరవాలు దక్కకూడదు అన్న కూట నీతి చూపెడుతున్న తమిళులు? ఇప్పుడు మనం ఏం చేయాలి?

ఎన్ని సాహిత్య సంస్థలు, పత్రికలు ఎంత గోల పెట్టినా విషయం ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు వేటికైతే మద్రాసు హైకోర్ట్ నోటీసులు ఇచ్చిందో, వారి సమగ్ర స్పందనలు ఇవ్వనంత కాలం ఈ కేసులు తేలవు. పైగా ఇన్నాళ్ళూ ఇవ్వని స్టే, ఎప్పుడైనా కోర్ట్ పరిశీలించే అవకాశాలు వున్నాయి.

ప్రాచీన మత్తు వొదుల్చుకుని, అంతర్జాతీయ సమాజపు అవగాహనను కోర్ట్‌వారి దృష్టికి బలంగా తీసుకువెళ్ళి, తమిళ ప్రజలకు, తమిళ భాషాభివృద్ధికి ఏ విధంగానూ భంగకరంకాని ఈ క్లాసికల్ హోదా ఇతర భాషలకు దక్కరాదు అంటూ పొరుగు భాషల అభివృద్ధికి అడ్డుపడుతున్న వారెవరో, కోర్టు వారికి స్పష్టం చేయవలసిన బాధ్యత కూడా కోర్ట్ నుంచి నోటీసులు అందుకున్న ఈ ప్రభుత్వాలకు వున్నది.

ప్రాచీన అన్న పదాన్ని ఈ క్లాసికల్ హోదా అన్న విషయంలో ఇక వాడకుండా విశిష్ట అన్న పదాన్ని వాడటం మంచిది. విశిష్ట తెలుగు అభివృద్ధి కేంద్ర సంస్థలు, రెండు తెలుగు రాష్ట్రాలలో ఏర్పడేలా పని చేయవలసిన అవసరం ఉన్నది.

తెలుగు వారికి సాహిత్య, సంగీత, నాటక అకాడెమీల పునరుద్ధరణ, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వంటిది ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటు, నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా విభాగాన్ని మన రాష్ట్రంలో ఏర్పాటు చేసుకోవడం. సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ క్లాసికల్ తెలుగు, రాష్ట్రంలోకెల్లా మొదటి తెలుగు విభాగంగా పేరొందిన ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఏర్పాటు చేసేందుకు తగు చర్యలు తీసుకోవడం, ఇవన్నీ కేవలం సిమెంటు రాజధానులు నిర్మాణం చేయడం మాత్రమే కాక సాంస్కృతిక రాజధానులు, వారధుల నిర్మాణం పట్టించుకోవడం, వనరుల సమీకరణ, వ్యవస్థల ఏర్పాటు ఇవన్నీ చేయడం కూడా పరిపాలకుల ప్రథమ కర్తవ్యం.

తెలుగు జాతి మనది, నిండుగ వెలుగు జాతి మనది అనిపించేలా ముందుకు నడవాలన్నా, తెలుగు జాతి మనది, నిండుగ మునుగుజాతి మనది అంటూ నిష్క్రియాపరత్వంలో వుండిపోవాలన్నా నిర్ణయం మనదే. ఆ పరిణామాల ప్రభావం మాత్రం తరతరాల తెలుగువారు అనుభవిస్తారు అన్న ఎరుక వుంటే, "మంచి గతమున కొంచమేనోయి. మందగించక ముందు కడుగేయి" అని గురజాడ చెప్పింది పాటిద్దాం. ఈ (క్లాసికల్) విశిష్ట హోదాను, తద్వారా ఒనగూరే భాషాభివృద్ధి పరిశోధన సంస్థలను త్వరలో సాకారం చేసుకుందాం.

మద్రాసు పొలిమేరల్లో మూడెకరాలు కౌలుకు తీసుకున్నాను. బంతిపూలు, కాగడా మల్లి, కనకాంబరం మొక్కలు పెట్టి పూలు పూయించాను. పొగమంచులో పూలు కోసి, ఆ దగ్గరలో వున్న పూలమ్మే బజారు కెళ్లి అరవల మధ్యలో, ఆరని బురదలో ముడుచుకుని కూర్చుని, బుట్టెడు పూలు అమ్ముతుంటాను. ఆ రోజు పూలమ్మితే రెండు వందలు వచ్చాయి. బుట్టలో కొన్ని బంతిపూలు, కాగడామల్లి వుంచాను - ఇవాళ ప్రయాణం ఉంది.

ఇంటికి చేరి, బురదకాళ్లు కడుక్కుని, వందరూపాయలు ఇల్లాలికిచ్చి- పిల్లల్ని బడికి తీసుకెళ్లాను. ఇంటికి వచ్చి ఇంత తిని, కునుకు తీద్దామంటే- కనురెప్ప అంటనే లేదు. ఇవాళ ప్రయాణం వుంది. సాయంత్రం పిల్లల్ని తీసుకువచ్చి - "నేను ఏలూరు వెళ్తున్నాను జాగ్రత్త..." అంటే , ఏనాడూ ఏమిటి అని అడగని ఇల్లాలు, "జాగ్రత్తగా రండి" అని మాత్రం అంది. ఇవాళ ప్రయాణం కదా - సంచిలో పూలు, ఒక చొక్కాతో లోకల్ ట్రయిన్‌లో సెంట్రల్ చేరి, మెయిలు జనరల్ బోగీలో ఎక్కి, ఎలాగో పైన చెక్కబల్లమీద పడుకోగలిగాను. మెయిలు బయలు దేరింది. ఎంత సేపయినా నిద్రపట్టలేదు. చేతి సంచిలో పూలు సువాసన వస్తున్నాయి...




# మహాబలి


040-27645536

వేంగి తీరం నుంచి - తూర్పు చాళుక్యులు దండులు నడిపిన ఊరు...ఊరి పొలిమేరలు పొగ మంచులో తడిసిన వేళ...తాత-తాత పెళ్ళి ఇంకా కోతలంత దూరం ఉన్న వేళ...కొత్తింటికోసం బ్రహ్మీ ముహుర్తంలో పునాదులు తవ్వే వేళ...గడ్డపలుగులు నేల తల్లి గుండెల్లో దిగుతున్న వేళ... గుడ్డి కాగడాలు నూనె గబ్బు కొడుతూ - కొడిగడుతున్న వేళ... వెన్నెల వెలిసి - చుక్కలు బిక్కుబిక్కు మంటున్న వేళ...ఆ పవిత్రమైన రాత్రి ఘల్లు ఘల్లున మ్రోగిన వేళ...భూమి పగుళ్ల నుంచి సీతమ్మ- లక్ష్మీ రూపం లో వచ్చిన వేళ...అపుడు పునాదులు తవ్వుతున్న వీరగయ్య, తాత తాతకు నేల పొరల్లో దాగివున్న బంగరు బిందెల్ని అందించిన వేళ...ఆశతో ఆశ్చ ర్యంతో అజ్ఞానంతో తాత తాతలు వణికిపోయిన వేళ...కర్మ కాండలు జరిపి, ఎర్ర నీళ్లతో, పసుపు పొడితో శుద్ధి చేసి వీరగయ్య నెత్తిన పెట్టి ఇంటికి తెచ్చిన వేళ...పరుసం - మాయ మర్మాలతో ఇంటి లో అడుగు పెట్టిన వేళ...ఆ తొలి వెలుగు రేఖలు ఇంకా చీకటిలో కళ్లు మూసుకున్న వేళ...ఎక్కడో పొలిమేరలో నక్కలు ఊళలు వేసిన వేళ...వీరగ య్యకేం తెలుసు మాటున దాగివున్న ప్రమాదం.?!

* * *

తాతలు ముువ్వురు, ముందు తరాల వారు రాజభక్తితో నెత్తురు చిందించి యుద్ధాలు చేసిన వారు...వీళ్ల తరానికి వందల ఎకరాలు వార సత్వం గా ఇచ్చిన వారు...దున్నలతో, ఎడ్లతో నేల దున్నిన వారు...ఎకరాలు దున్నించి రాగులు, జొన్నలు విత్తులు జల్లినవారు...దండులూరినంతా పోషిం చినవారు...అన్ని వృత్తులవారు వీళ్ల పెద్దరికాన్ని నెత్తిన పెట్టుకున్నవారు...దొడ్లనిండా గొడ్ల పాడితో సిరిగలవారు...మాట శాసనంగా సాగుతున్న వారు మంచివారు - ప్రమాదం పొంచి వున్న వారు...

* * *

పసిడి బిందెల్లో లోగిల్లోకి వచ్చినపుడు... ఆనందం ఆశ్చర్యంతో పాటు అజ్ఞానపు భయం కమ్మినపుడు...ముందు తరాల మూర్ఖత్వాన్ని ఆచా రంగా అంగీకరించినపుడు...వీరగయ్యను మహా బలి కోరినపుడు...ఎదురు చెప్పలేని జీవి, ప్రాణాలు పణంగా పెట్టినపుడు...ఆ గుమ్మం అడ్డ కమ్మె మీద మెడనుంచి తలవేరయి, నెత్తురు ఏరయి, కనక దోషాన్ని కడిగి వేసినపుడు...అపుడే- అంత కు మునుపే - "అయ్యా మీ వంశంలో పెద్దాడి పెళ్లికి నాకు బోనం పెట్టించండి.." అని మాత్రమే అడిగిన ధీరుడు ఒరిగినపుడు...'పెద్ద' మనసుతో వీరగయ్య కుటుంబానికి, పెద్దలు ఊరి పొలిమేర లకు పొలిమేరలో పదెకరాలు పెట్టిన పుడు... సూరీడు మామూలుగానే ఉదయించాడు... ఊరు మామూలుగానే ఒళ్ళు విరుచుకుంది... నాగ ళ్లన్నీ పొలాలు దున్నటానికి వెళ్లాయి...కాకులు మెతుకుల కోసం వాలుతున్నాయి...గూడెం స్మశానం లో శవం కాలుతోంది...ఇంటి ఆడపడుచులు గుమ్మానికి ఎండిన నెత్తుటి మరకలు, కుంకుడు నీళ్లతో కడిగి పసుపు పూసి కుంకుమ బొట్లు పెట్టి నపుడు...తొలి కిరణాలలో వీరగయ్య నెత్తురు లాగానే మెరిసింది!!

బంగారం విశ్వరూపాచారి కరిగించాడు. అరవంకీలయింది, జడకుప్పెలయింది, వడ్డాణాల యింది, కాసుల పేరయింది, చంద్రహారాలయింది, చెవి దుద్దులయింది, చీకటి - చీకటి మధ్య వెలు గులా వున్న పాపటిశేరయి మా ఆడవాళ్ల తలల మీద మెరిసింది!!

* * *

కాలం కదిలిపోతోంది - చెట్లు ఆకులు రాలు స్తున్నాయి - పూలు పూస్తున్నాయి. వడ గాలులు వీస్తున్నాయి. వరదలు వస్తున్నాయి. తరాలు - తరలి పోతున్నాయి. కాలంలో కలిసి పోతున్నాయి.

అన్ని తరాల్లో పెద్దాడి పెళ్లిరోజున వీరగయ్య కు బోనం పెట్టి - కొత్త కోడల్ని తీసుకు వచ్చి గుమ్మం దగ్గర "వీరగయ్యా, బోనం పెట్టాను. కాస్త

## అశ్వినికుమార్

తప్పుకో..." అని అర్థిస్తానే వున్నారు. అలా అడు గుతూనే వున్నారు...

★ ★ ★

ఇన్నేళ్లకు నా వంతు వచ్చింది. నాన్నకు పెద్ద కొడుకును నేనే కదా...ఇన్నేళ్లలో ఎకరాల పొలిమేరలు తరిగి పోయాయి...ఇన్నేళ్లలో బంగారం మెలమెల్లగా కరిగి పోయింది...తాతల తాతలు - తండ్రులు తల్లులు - మామ్మలు - అమ్మలు - మట్టిలో కలిసి పోయారు...ఇపుడు మేకలు, మెడలో ఆకులు తింటూ జలిపీరానికి వెళ్తున్నాయి... పాపం వాటికేం తెలుసు మెడతెగి తలవేరయి నేల పాలవుతుందని...! నేల తల్లీ...నీ రక్తదాహం ఎప్ప టికి తీరేనమ్మా?

★ ★ ★

నాకు పెళ్లయింది. పచ్చి తాటాకు పందిట్లో- బంతిపూలు, మల్లెపూల మంటపంలో...మొగలి పొ త్తుల జడలు, బిళ్లల్తో- ఈగే జడకుచ్చుల కులు కులతో... అరవంకీలు అరకొరగా ఉన్నాయి. వడ్డా ణాలు సన్నబడి పోయాయి పట్టు చీరల అంచులూ చిక్కిపోయాయి.

అయినా నా పెళ్లి జరిగిపోయింది ఫెళఫెళ మంటూ...సన్నాయి మోగింది... డోలు డొక్కలు కొట్టుకుంది. కనపడని అమంధతిని చూసి...ఆన వాయితీగా, గుమ్మం దగ్గర ఆగి "వీర గయ్యా బోనం తెచ్చాను - ఇదిగో తట్టనిండా పిండి వంటలు, అన్నం - కూరలు. నేను, నా భార్య వచ్చాం, కాస్త తప్పుకోవయ్యా..." అన్నాను.

నా గుండెల్లో వీరగయ్య నెత్తురు మరిగింది. కన్నుల్లో ఆ కుటుంబం దుఃఖం నిండి పోయింది. కొత్తకొడలు బిత్తరపోయింది. ఎదురుగా వీరగయ్య నిలబడి, "నీకిది నాయంగా ఉందయ్యా" అని అడి గాడు.

★ ★ ★

అవును, ఇది న్యాయం కాదు. ఈ నెత్తుటి కూడు నేను తినలేను. ముద్ద ముద్దకీ పిండం పెట్టలేను. నా కొత్త పెళ్లికూతురి కాళ్లకి నెత్తుటి పారాణి రాయలేను. నా సంతానం ఈ నెత్తుటి చారల్లో ఆడుకోకూడదు...

ఇప్పటి వరకూ జరిగిన ఘోరం చాలు. ఇక్క డితో ఈ మహాబలిని సమాధి చెయ్యాలి... అంతే - వీరగయ్య సమాధి కట్టించి అమ్మను, నాన్నను, పొలాన్ని, ఊరుని, తమ్ముళ్లని, చెల్లెళ్ళను వదిలి, నా భార్యతో వెళ్లిపోయాను.

నా భార్య మహాయిల్లాలు. ఏనాడూ ఏమీ అడగలేదు. ఆ తర్వాత నా సంతానం...చల్లని తల్లి




పెంపకంలో - వాళ్లూ అడగలేదు - "నాన్నా పొలం ఏమయింది...బంగారం ఏమయింది?" అని. ఆ నేలను, ఆ పొలాన్ని, ఆ గుమ్మాన్ని వదిలాను కాని, తరతరాల అపరాధం నా వెంటనే ఉంది.

★ ★ ★

మద్రాసు మెయిలు ఏలూరులో ఆగింది. తెల్లారింది. మెల్లగా దిగి అక్కడే కాలకృత్యాలు తీర్చు కున్నాను. సంచిలో వున్న చొక్కా మార్చుకున్నాను. అక్కడ నుంచి చాలా చాలా దూరాన వున్న వీర గయ్య సమాధి దగ్గరకు వెళ్లి, నేను పూయించిన పూలను సమాధిపైన వుంచాను. మట్టి తడిగా వుంది. ఈ పూల విత్తుల్లో ఏదో ఒకటి మొలకెత్తక పోతుందా? అని చిన్న ఆశ!

★ ★ ★

పది గంటలకు భీమడోలు - ద్వారకా తిరుమల దారిలో వున్న రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్లాను. నాన్న, బాబాయి నా కోసమే చూస్తున్నారు. నాన్న, "పొలం అమ్మాను- వచ్చి సంతకం పెట్టి వెళ్లు" అని ట్రంక్ కాల్ చేస్తే వచ్చాను. అక్కడ సంతకాల పని పూర్తి చేసి, నాన్నతో "నేను బయలు దేరతాను - బండి వుంది" అన్నపుడు ఆయన అవాక్కయి, "నీ వాటా సొమ్ము తీసుకుపోవా?" అన్నాడు. నేను బాబాయితో బైటకు వచ్చి, "వద్దు బాబాయి- నాన్నతో చెప్పు" అన్నపుడు, "అదేమిటిరా దారి ఖర్చు కయినా...?" అంటుంటే "ఉన్నాయిలే" అని అక్కడ నుంచి బయలు దేరాను.

ఇంతవరకూ ఈ కథ ఎవరికీ చెప్పలేదు. ఇప్పుడు మీకు చెప్తున్నది నా గుండె బరువు తగ్గించు కోవటానికే...!

# "నాటకం క్రింద నుంచి రావాలి"

అబ్బూరి గోపాలకృష్ణ ఆంధ్రవిశ్వవిద్యాలయంలో నాటకరంగ శాఖకు ఆచార్యులుగా పనిచేశారు. అన్నమాచార్యుల పదసాహిత్యం మీద పరిశోధన చేశారు. కరుడుగట్టిన సంప్రదాయ పరిశోధకులను సహితం నిలువరించే విషయాలను ఎత్తి చూపారు. మచ్చలు పడిన తెలుగు సాంఘిక నాటక ప్రదర్శనారంగానికి సవాలుగా నిలిచే నాటకాన్ని వ్రాశారు. జాతీయ స్థాయిలో తెలుగు ప్రదర్శన నాటకానికి గౌరవం తెచ్చే స్థాయిలో నాటక రచన చేసిన ఇద్దరు ముగ్గురు సమకాలిక రచయితలలో ఒకరు. ఆధునిక చిత్రకళామర్మాలను శిరసావహించారు. జానపద కళారీతుల్లో మనం కోల్పోయిన మూలాల విలువ ఎంతో గుర్తు చేస్తూనే, పరిశోధక యాత్ర కొనసాగిస్తున్నారు. కొంతకాలం క్రితం ఆయనతో కూర్చుంటే ఆయన పరచిన ఆలోచనల ఆభరణాలలో కొన్ని...

## అబ్బూరి గోపాలకృష్ణతో పన్నాల సుబ్రహ్మణ్య భట్టు ఇంటర్వ్యూ

**పాశ్చాత్య నాటకాలు చదివినవారు, చూసినవారూ చాలామంది ఉన్నా, మన తెలుగు నాటకరంగం ప్రదర్శనలోనూ, రచనాపరంగానూ పెరగలేదేమి?**

హిమాలయాలలో పెరిగే పైన్ చెట్టును మీరిక్కడ పెంచలేరు. ఇక్కడి వాతావరణం బట్టి ఇక్కడ రావాలి. ఇక్కడి రాజ్యాంగం ఎందుకు విఫల మయింది? ఇక్కడి అవసరాలను తీర్చలేకపోయింది గనుక. ఈ అవసరాల కోసం అని రుద్దితే రావు. మీరు ఆ అవసరాలు కావాలి అని అనుభవిస్తే వస్తాయి. ఇంపోజ్డు నీడ్సు కాదు, ఫెల్ట్ నీడ్స్ కావాలి.

**నాటకాన్ని ఇప్పుడు ఏ సంప్రదాయం బ్రతికిస్తుంది?**

మనం ఒక సత్సంప్రదాయాన్ని నెలకొల్పవలసి ఉంది. ఎలా నెలకొల్పు తామంటే, గతాన్ని విస్మరించకుండా నెలకొల్పలేం. మనకున్న భావాలను ప్రకటించడానికి క్రొత్తదారులు వెతుక్కుంటున్నప్పుడు తిరిగి నిర్మించుకోవలసి వస్తుంది. ఇప్పుడు యక్షగానం చచ్చిపోయింది. చంపేశాం.

**తెలుగునాట సాంఘిక నాటకరంగానికి సత్సంప్రదాయం ఎక్క డుంది?**

సాంఘిక నాటకం అనేది తెలుగులో ఒక్క గురజాడ రాసింది తప్ప ఇంకొకటి ఏదీకాదు.

**కన్యాశుల్కం వచ్చి వందేళ్లయిన తర్వాత కూడా రాని మంచి సాంఘిక నాటకం ఇప్పుడెలా వస్తుంది?**




రచయిత ప్రపంచాన్ని స్పష్టంగా చూడగల్గాలి. ఛాయాచిత్ర దృశ్యంగా, కల్పనా సాదృశ్యంగా క్రొత్తదనాన్ని చూపించాలి. క్రొత్తదనం కోసం అన్వేషించాలి. క్రొత్తకోణం నుంచి సమస్యని చూడాలి. క్రొత్త భాష కూడా కావాలి. ఇప్పుడు పల్లెటూళ్లలో మనం వాడుతున్న భాష, మామూలు భాష చదువురాని వారు మాటలాడే భాషరావాలి. జీవభాషని మనం ఇంకా వాడటం లేదు. క్రొత్త భాషని సృష్టించాలి.

**క్రొత్త భాష ఏ రూపంలో ఉంటుంది?**

అది బ్రహ్మ పదార్థం లాటిది. క్రొత్త భాషని సృష్టించాలి. లోహ విహంగం అని శ్రీశ్రీ అన్నపుడు విమానం అని ఎందుకు అనుకోవాలి?

**నాటకం అందరికీ చేరవలసిన కళారీతి అయినపుడు అది కుదురు తుందా?**

ఒక చిన్న అనుభవం చెప్తాను. కర్నాడ్ వ్రాసిన హయవదన రిహార్సల్స్ చూస్తున్నాను. నటుడు సరైన భావంతో సంభాషణ చెప్పలేక పోతున్నాడు. దర్శకుడు బి.వి. కారంత్ పదిసార్లు వివరించినా ప్రయోజనం లేకపోయింది. ఒథెల్లోలో ఫలానా ఘట్టంలో ఒక డైలాగు చెప్పి అప్పుడు ఆ పాత్ర మనస్థితి ఏమిటి అని అడిగాడు దర్శకుడు. నటుడికి అర్థమయింది. నటుడు ఒథెల్లోను బాగా అర్థం చేసుకున్నాడు. నటుడు అప్పుడు సరిగా చేశాడు. అలాగే మా నాన్నగారు అబ్బూరి రామకృష్ణారావుగారు మృచ్ఛ కటికంలో కోర్టుసీన్‌కి దర్శకత్వం చేస్తున్నారు. శకారుడు వచ్చి ప్రాడ్వివాకుడు చూపిన సాక్ష్యాన్ని తుడిచేస్తాడు. ఆ నటుడికి ఎంత చెప్పినా ఎలా చేయాలో అర్థంకాలేదు. అప్పుడు మానాన్నగారు హిట్లర్ తనమీద హత్యాప్రయత్నం జరిగినపుడు ఏ విధంగా ప్రవర్తించాడో, ఆ కథంతా పూసగుచ్చినట్లు చెప్పారు. యూదుల మీద ద్వేషం అంతా నటుడికి అర్థమయి, ఇప్పుడు చేస్తాను అన్నాడు. నాన్నగారు ఇప్పుడుకాదు, రాత్రంతా తయారయి రండి అన్నారు. మర్నాడు నటుడు చాలా బాగా చేశాడు.

**ఎంకి పాటలను, కొనకళ్ళ పాటలను భావగీతాలలా పాడటం పట్ల మీకెందుకు నిరసన భావం?**

విషాదంగా పాడుతున్నారు ఎందుకు? వాటిలో ఉన్నది విరహవేదన కదా! అక్కడున్నది చమత్కారం కదా! నండూరివారి పాటల్లో హాయిగా పైరగాలి వీస్తుంటే పొందే ఆనందస్థితిని, శాస్త్రీయమైన తత్వాలుగా పాడుతూ గొంతు

పైకెత్తకుండా క్రిందకు దించకుండా పాడారు కనుక.

**నండూరి ఇన్ని గీతాలను పాడినపుడు విసిగించే పద్ధతిలో లేవని చెప్పగలమా?**

నేను చిన్నప్పుడు విన్న ఆ పాటలు చాలా ఆనందం కల్గించేవి. రజని గారు వయసులో ఉన్నప్పుడు ఆంధ్రా యూనివర్సిటీలో పాడేవారు. అనసూయ, సీతలు సభలలో పాడేవారు. ద్వారం వెంకటస్వామినాయుడు గారు వయొలిన్‌పై వాయిస్తుంటే ఎంతో బాగుండేది. ఒకరోజున కేవలం ఎంకిపాటలే వాయించాడు. విజయనగరం సంగీత కళాశాల వెనుక నున్న ఇంటికి వెళ్ళేవాళ్ళం. అక్కడ పెద్ద మైదానం ఉండేది.

**మీరు త్రిజాకీయమదర్శనం నాటకం ఎలా రచించారు చటుక్కున?**

దానికి ముఖ్యకారణం రవీంద్రభారతిలో చూసిన సోషల్ నాటకాలు. కానీ అవి సూడో సోషల్ ప్లేస్. అటో వాకిలీ, ఇటో వాకిలీ మధ్య రంగస్థలంపై సోఫాలు, ఎవరూ చూడకుండా వాటిని తుడిచే నౌకరు రంగన్న, జమీందారు తండ్రి, హీరోయిను కూతురు- ఇవన్నీ చూసి చూసి ప్రాణం విసిగెత్తిపోయింది. ఆ నాయిక ప్రాంప్టింగ్ అందకపోతే కొంగు అడ్డుపెట్టుకొని బెక్‌మని ఏడ్చే ప్రయత్నం చేస్తుంటుంది. వీటన్నిటినీ కాదని ఏదో రాయాలనిపించింది. నేను యక్షగానం అధ్యయనం చేశాను. కానీ సంగీతం రాదు. కందార్థ దరువులు తెలియవు. ఒక పద్యంలాంటిది పట్టుకుంటే బాగుంటుందని పించింది. అంతకుముందు కొన్ని అమెరికన్ నాటకాలలో ఆస్కార్ వైల్డ్ పద్యాలు అవీ పెట్టుకొన్నారు. అందులో ఇన్ రీడింగ్ జయిల్ అండ్ రీడింగ్ టౌన్...దేర్ ఈజ్ ఎ బిట్ ఆఫ్ ఫ్రేమ్ అని కనిపించింది. ఈ టైప్ చేస్తే చౌకగా నడుస్తుందని పించింది. దేశానికున్నది వగర ఉజ్జయినీ, గగనమంటే సౌధంతో ఉన్నది నగరం - నాలుగు దిక్కులు కోటగోడలు, నాలుగు దిక్కుల ఆయుధ బాణం - విధి విలాసమెరుగక కోట కాపుకాడ గరంగరం - అని మొదలు పెట్టాను. విషయం ఆధునిక కథే - పాత కాలం కథలా ముసుగు వేశాను. అది చూసి దేవతల కథ రాసానని ఒక పెద్దమనిషి నన్ను విమర్శించాడు. ఇది రాస్తుండగా మా అన్నయ్య రాజేశ్వరరావు ఢిల్లీ నుంచి బ్రెక్ట్ రాసిన ఛాయిస్ ఆఫ్ ఈవిల్ అని పుస్తకం పంపాడు. తిరుపతి వెళుతుంటే రైలు చప్పుడు బోగీలో వినపడ్తూంటిది కదా! దానిమీద సైనికుడి గీతం రాసి ఇందులో పెట్టాను. పొట్ట క్రింద తిండి కొరకు కత్తి పట్టి డాలు పట్టి కదిలిపో కదనానికి, దూర దూర దేశాలను చావగొట్టి, అణిచిపెట్టి రాజుగారి ఖజానాకు తెచ్చినాను ధనరాశులు - అదొక పద్యం. సైనికుడు ఇంటికొస్తాడు. వీరపత్ని ఎదురు వచ్చె. నీ కోసం తెచ్చినాను వంటి మీద కత్తి గాట్లు - అంటూ ఆధునిక కథకి ఈ నాటకం ఒక తొడుగు లాంటిది.

**సరే! ఇందాక యక్షగానం గురించి చెప్పారు! కన్నడ దేశంలో ఇది ప్రజల మధ్య ఇంకా వుందిగాని, మన దేశంలో లేదు కదా?**

నేను కమలాదేవి ఛటోపాధ్యాయతో పర్యటించి చూశాను. ఇప్పటికీ యక్షగానం చిందు భాగవతం రూపంలో చిత్తూరు జిల్లాలో ఉంది. కుప్పంవారి బృందాన్ని పిలిచి హైదరాబాద్‌లో ఆడించాం. తెలుగు విశ్వవిద్యాలయ పాఠ్యక్రమంలో రాసిపెట్టి వుంచాం. యక్షగానం పాఠంగా పెట్టాలని సిఫార్సు చేశాం. యక్షగానం వాళ్ళను తీసుకు వచ్చి రీడర్ స్కేలయినా వేతనం ఇచ్చి పెట్టమన్నాం. హరికథని కూడా దీనికి తోడుగా పెట్టమన్నాను. దోణప్పగారు "ఏమీ చదువుకోనివారికి రీడర్ స్కేలు ఎలా ఇస్తాం" అన్నారు.

**ఈ యక్షగానాలలో వివేకవంతులను సహితం ఆకట్టుకునే అంశాలున్నాయా?**



ఉన్నాయి. నేను ఆరుబయల్లో గిరిజనులు వేసే గయోపాఖ్యానం చూసాను. అందులో ఒక బఫూన్ ఉంటాడు, సూత్రధారుడూ అతనే. వాడు నల్ల కళ్ళజోడు వాడాడు. ఎందుకురా అంటే నేనని తెలియకూడదు కదా అన్నాడు. పెద్ద తరహా మేకప్ బదులు, మాస్క్ బదులు కళ్ళజోడు వాడానని వివరణ. చిందు రామాయణం హైదరాబాద్ చుట్టుపక్కల చూశాను. అందులో శ్రోతల భాగస్వామ్యం బాగుంటుంది. ప్రేక్షకులు చుట్టూ కూర్చుని ఉండగా నాటకం ఆడుతూ ఉంటే ఎంతో బాగుండేది.

**సురభి వారి నాటకాలలో ఎనభయి సంవత్సరాలబట్టి అవే ట్రిక్కులు చూపిస్తున్నారు కదా! క్రొత్త ఏముంది?**

దానికి ఏం చేశారు మీరు? బి.వి. కారంత్ ఆధ్వర్యంలో సురభి వారి 'భీష్మ' నాటకానికి శిక్షణ ఇచ్చి పంపించారు. కారంత్ కన్నడ నాటకం తీసుకున్నాడు. భీష్ముని వ్యక్తిత్వాన్ని క్రొత్త కోణంలో చూశాడు. దానికోసం పాటలు వ్రాయించి, కొత్తనాటకం తయారుచేశారు. దీన్ని పరిశీలించడానికి ఆంధ్ర విశ్వవిద్యాలయంనుండి ఒకర్ని పంపారు. ఆయన ఆ నాటకాన్ని చూసి అన్యాయమైన నివేదిక రాసి పంపాడు. నన్నయ్య రాసిన భారతంలో ఈ విధంగా లేదు, ఇది తప్పు, ప్రదర్శనకి ప్రోత్సాహం అనవసరం, ప్రభుత్వం గ్రాంటు ఆపివేయాలి అన్నాడు. ఇంక నాటకం ఎలా వస్తుంది?

**మనం యూరపునుండి దించుకొన్న ఆధునిక నాటకానికి మన యక్షగానంనుండి ఏదో వెతకాల్సిన అవసరం ఉన్నది అంటారెందుకో?**

ఇక్కడి మూలాల నుండి నాటకం రావాలి. ప్రజలకి ఏ అవసరాలు కావాలో మనం చెబుతున్నాం. అది సరికాదు. నాటకం కూడా క్రింద నుంచి రావాలి. నాటకం ప్రస్తుత రూపంలో సంకరజాతి - హైబ్రిడ్ - గా వుంది.

**మిమ్మల్ని మేము ఎలా గుర్తుంచుకోవాలని మీరు అనుకుంటున్నారు?**

దారి తప్పిన - పోనీ వేరే దారి చూపిన విమర్శకుడిగా...

ఆ రైలు ఎప్పుడు బయలుదేరిందో...ఎంతసేపు ప్రయాణం చేసిందో...ఎన్ని ఊళ్ళు దాటిందో తెలీదు. మెలకువ వచ్చి చూసేసరికి బళ్ళారి రైల్వేస్టేషన్ అనే బోర్డు కనిపించింది. ఆ అక్షరాలు తెలుగులాగే ఉన్నాయి కానీ తెలుగు కాదనిపించింది. రైలు కదలబోతుండగా ఎందుకోగానీ తనకి అక్కడ దిగిపోదామనిపించింది.

వెంటనే దిగిపోయాడు.

తెలియని భాష...తెలియని మనుషులు...తెలియని వాతావరణం...

వీటిలో ఏ ఒక్కటీ అతడికి కొత్త కాదు.

ఆ పదిహేనేళ్ళ కుర్రాడి పేరు రాజు.

కథ

19

# ఓ పాజిటివ్ కథ

జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి

99488 96984

అప్పటికి మిట్ట మధ్యాహ్నం అవుతోంది. బైట ఎండ మండిపోతుంది. కడుపులో పేగులు నక నకలాడుతున్నయి. అలా ఆకలి వేసినప్పుడు ఏం చెయ్యాలో అతనికి బాగా తెలుసు. అందుకే ఏదైనా ఒక కాకా హోటల్ కనిపించేంతవరకూ నడిచాడు.

ఊరి మధ్యలో ఒక పెద్ద ఆటస్థలం ఉంది. దానికి ఇవతలగా ఎమ్జీ రోడ్డు మీద ఎడం పక్కన ఒక హోటల్ కనిపించింది. తిన్నగా అక్కడికి వెళ్ళి, క్యాష్ కౌంటర్‌లో ఉన్న వ్యక్తిని అడిగాడు, "సార్ పని ఉందా?"

అతను వెంటనే బిగ్గరగా నవ్వాడు. "పని వుంది. కానీ నువ్వు అన్నం పెట్టగానే పారిపోతావు. నాకు ప్లేట్ మీల్స్ బొక్క మీ బాబుగాడిస్తాడా? కావాలంటే డబ్బులిచ్చి తినేసి పన్లో చేరొచ్చు" అన్నాడు.

రాజు అక్కడినించీ కదల్లేదు. ఐదు నిమిషాలు గడిచాయి. అతను అక్కడే నిలబడ్డాడు.

పావుగంట దాటినా అతను అక్కడే నిలబడ్డంతో అతనివైపు చూశాడు ఓనర్. "చూస్తూంటే మంచోనిమాదిరి కనిపిస్తా ఉండావు. ఓపని చెయ్యి. ముందు డ్యూటీ ఎక్కు. మూడింటిదాకా పనిచెయ్యి. అప్పుడు తిందూగాని, సరేనా? అన్నాడు.

సరేనన్నట్లు తలూపాడు రాజు.

వెంటనే బచ్చల్లో కూలబడ్డాడు. వెనువెంటనే డ్యూటీ స్టార్టయింది. వచ్చే ప్లేట్లని వచ్చినట్లుగా కడిగి పారేస్తున్నాడు.

దాదాపు నాలుగు గంటలవేళ ఒక పళ్ళెంలో ఓ గరిటె చిత్రాన్నమూ, ఓ గరిటె పెరుగన్నమూ, పక్కనే ఓ ఊరగాయ బద్దా వేసి ఇచ్చారు. అదే అమృతంలా తిన్నాడు. ఆకలి తీరింది.

రాజు రావడం వల్ల ఒక కుర్రాడికి ప్రమోషన్ వచ్చింది. అతనిపేరు మంజునాథ్. అంతవరకూ అతను ప్లేట్లూ గిన్నెలూ కడిగేవాడు. ఇప్పుడు రాజు రావడంతో అతన్ని పార్సెల్ అండ్ కూరల కటింగ్ పని అప్పగించారు. అది ప్లేట్లు కడగడం కంటే గౌరవ ప్రదమైన పని. అందుకే ప్రమోషన్ పొందిన ఆనందంతో ఓనర్ కంట పడకుండా రాజుకి ఒక టీ తెచ్చిచ్చాడు మంజునాథ్. అది తాగాక ఓ బీడీ ఆఫర్ చేశాడు. రాజు వద్దన్నాడు. బీడీ వద్దన్నావు కాబట్టీ ఓ పావుగంట రెస్టిస్తాను తీసుకొమ్మన్నాడు మంజునాథ్.

ఆ రాత్రి ఎనిమిది గంటలవేళ నీలమ్మ వచ్చింది. పాలు పోసింది. టీ మాస్టర్ ఆ పాలని మరగ కాచి ఫ్రిజ్‌లో పెట్టాడు.

రాత్రి పదిగంటలవేళ డ్యూటీ పూర్తయ్యింది.

ఓనరు బయట తాళం వేసుకుని వెళ్ళిపోయాడు. లోపల ఇద్దరే ఉన్నారు...రాజు, మంజునాథ్.

మంజునాథ్ ఆ హోటల్లో పని గురించీ, పని వేళల గురించీ క్షుణ్ణంగా వివరించాడు. ఆ తరువాత నీలమ్మ గురించి చెప్పాడు. నీలమ్మకి రంగు తక్కువైనా హంగులకీ పొంగులకీ తక్కువ లేదు. కులుకులకైతే లెక్కేలేదు. అదీ కాకుండా ఓనర్ని పట్టింది కదా, అందుకే ఎవర్నీ మనుషుల్లా చూడదు అంటూ మొదలు పెట్టి ఓనరూ నీలమ్మల గురించి కథలు కథలుగా చెప్పాడు. ఆ తరువాత టీవీ పెట్టాడు. తన దగ్గరున్న పాత డీవీడీ ఒకదాన్ని తీసుకొచ్చి ప్లే చేసి చూపించాడు.

రాజు జీవితంలో మొదటిసారిగా చూస్తున్న బ్లూ ఫిలిం అది. ఎవరో మైసూరు మెడికల్ గ్రాడ్యుయేట్‌తో ఆమె స్నేహితుడు జరిపిన సంభోగ వైభోగం.

దాని గురించి మాట్లాడటం ప్రారంభించాడు మంజునాథ్.

"ఆ అమ్మాయి ఆ అబ్బాయీ ప్రేమించుకుని ఉంటారు. ఆ ప్రేమ ఎక్కువై ఉంటుంది. దాన్ని పక్కలోకి లాగి ఉంటుంది. అలాంటప్పుడు కెమెరా దొరకాలేగానీ పంపగే పండగ" అంటూ మొదలు పెట్టి ఆ డీవీడీ చూస్తున్నంతసేపూ వాళ్ళిద్దరి గురించీ తెలిసినవీ తెలియనివీ కలబోసి వచ్చీరాని తెలుగులో చెబుతూనే ఉన్నాడు. దాన్ని చూడ్డం అయిపోయాక, ఆ అమ్మాయి తల్లిదండ్రులు ఆ అబ్బాయిని తీసుకొచ్చి వాళ్ళిద్దరికీ పెళ్ళి చేసి ఆస్ట్రేలియా పంపించేసినట్లుగా కూడా చెప్పాడు.

ఆ రాత్రి ఎప్పట్లా పడుకున్న వెంటనే నిద్రపట్టలేదు.

హోటల్ బెంచీ మీద అటూ ఇటూ పొర్లుతూ ఆ పొర్లటంలోనే ఏ అర్ధరాత్రో నిద్రపోయాడు.

ఒకరోజు పొద్దున్న నీలమ్మ పాలు పోసి వెళ్తున్నప్పుడు ఓనరూ తనూ ఏదో గుసగుసగా మాట్లాడు కోవడం గమనించాడు మంజునాథ్. వెంటనే రాజు దగ్గరికి వెళ్ళి ఆ రోజు మధ్యాహ్నం వాళ్ళిద్దరూ ఎక్కడో ఒక చోట కలుసుకుంటారనీ, ఎక్కడ కలుసు కున్నారో కనిపెట్టి తీరాలనీ చెప్పాడు.

అన్నట్టుగానే మూడింటికి కాస్త గిరాకీ తగ్గగానే డబ్బు లెక్కేసి జేబులో పెట్టుకుని కాష్ కౌంటర్లో తనకి నమ్మకస్తుడైన టీ మాస్టర్ని కూర్చోబెట్టి బైటికి వెళ్ళాడు ఓనర్. ఆ వెనువెంటనే మంజునాథ్ కూడా రెస్టుకని వంకపెట్టి పత్తేదారి పనిమీద బైటికి వెళ్ళిపోయాడు.

సాయంత్రం ఐదుగంటలవేళ మంజునాథ్ తిరిగివచ్చాడు. వచ్చాడన్న మాటేగానీ అతని మనసు మనసులో లేదు. ఏదో చెప్పాలన్న ఆరాటం... చెప్పలేకపోతున్నందుకు చిరాకు. రాజు కనపడినప్పుడల్లా "ఉండు చెబుతాను" అన్నట్లు సైగలు చేస్తున్నాడు. చివరికి అతను ఎదురుచూస్తున్న సమయం రానే వచ్చింది.

ఆ రాత్రి పదింటికి పడుకునే ముందు మధ్యాహ్నం తను చూసిందంతా చెప్పడం మొదలు పెట్టాడు. తను వాళ్ళిద్దరినీ వెంటాడటం, వాళ్ళిద్దరూ ఓ ఇంట్లోకి వెళ్ళడం, గడి తలుపులు మూసు కోవడం, తను కిటికీలోంచీ లోపల జరిగిందంతా చూడటం, అన్నీ చెప్పాడు. అయితే కిటికీలోంచీ చూశానని చెప్పిన విషయాలూ వర్ణనలూ అన్నీ కల్పితాలని అర్థమైపోతూనే ఉన్నాయి.



అయినా సరే వైనవైనాలుగా వర్ణిస్తూనే ఉన్నాడు.

ఇంతకాలం రాజుకి ఒకఆడది, ఒకమగాడు కలిసి ఉండటం అనేది అందరిలోనూ ఎందు కంత ఆసక్తిని రేకెత్తిస్తుందో అర్థం అయ్యేదికాదు.

కానీ, మంజునాథ్ చేస్తున్న వర్ణనలు వింటుం టే తనకీ ఆసక్తి కలుగుతోంది. అతను చెబుతుంటే మళ్ళీమళ్ళీ వినాలనిస్తోంది. ఎందుకోగానీ ఆడీవీడీ మళ్ళీ చూస్తే బాగుండుననిపిస్తోంది. అతని మనసు గ్రహించినట్లుగా లేచివెళ్ళి మరో డీవీడీ తెచ్చి ప్లేచేశాడు మంజునాథ్. అది పూర్తయ్యేసరికి ఒంటిగంటయింది.

ఇద్దరూ పడుకున్నారు.

మర్నాడు ఐదుగంటలకే లేపాడు ఓనర్. అదీ చేత్తో కాదు, కాలితో తన్ని మరీ లేపాడు.

వెంటనే రాజు దిన చర్య మొదలైంది.

గబగబా కాల కృత్యాలు తీర్చుకుని వచ్చాడు. వాష్ బేసిన్ పక్కనే పడివున్న సబ్బుముక్కల్ని ఏరు కొచ్చాడు. చొక్కాని విప్పాడు. అది చిరుగులు పట్టి పోయి వుంది. ఏమాత్రం గట్టిగా లాగినా చిరిగి చేతుల్లోకి వచ్చేసేంతగా చివికిపోయింది. దాన్నే గోచీగా పెట్టుకుని స్నానం చేశాడు. పిర్రల మీద అరిగిపోయిన పాంటుని ఉతికి కొంచెం బలంగా పిండాడు. దాన్ని మరికాస్త గట్టిగా పిండితే పీలికలైపోతుందేమో అని భయపడ్డాడు.

అదింక వేసుకోవడానికి పనికి రాదు. మరో చొక్కా పాంటూ కొనుక్కోవాలంటే డబ్బులు కావాలి. డబ్బులు కావాలంటే నెల గడవాలి. అప్పుడైనా ఇచ్చేది పదిరోజుల జీతమే. అంతవరకూ ఈ చిరుగుల గుడ్డలే గతి అనుకుంటూ ఆ తడి పాంటునే వేసుకున్నాడు. చొక్కాని కూడా పిండి తడిగానే తొడుక్కున్నాడు. వాళ్ళు పని చేసేది కిచెన్ పక్కనే కాబట్టీ ఆ గాసు పొయ్యిల వేడీ ఒంట్లోని వేడీ కలిసి టిఫిన్ చేసే టైముకి బట్టలు పూర్తిగా ఆరిపోతాయి. కాబట్టీ సమస్య ఉండదు.

అప్పటికీ "రోజూ స్నానాలూ బట్టలుతకడాలూ ఏమిట్రా, బట్టలు తొందరగా చిరిగిపోతాయి, చర్మం అరిగిపోతుంది" అంటూ మంజునాథ్ ఉచిత సలహాలు ఇస్తూనే ఉన్నాడు. అతని సలహా పాటిస్తే మంచిదేమో అని అతనికి ఎన్నోసార్లు అనిపించింది. కానీ స్నానం చెయ్యకుండా వుంటే తనకి చాలా చిరాగ్గా వుంటుంది. అందుకే మంజునాథ్ మాటల్ని ఎప్పుడూ పట్టించుకునేవాడు కాదు రాజు.

మంజునాథ్‌కి మూడు జతల బట్టలున్నాయి. బట్టల విషయంలో అతను రాజు కంటే రెండింతల శ్రీమంతుడు. అతను ఆ బట్టల్ని చాలా భద్రంగా దాచుకుంటాడు. వారానికో పదిరోజులకో ఒకసారి ఉతికి ఆరేసినా ఎండిన వెంటనే సంచిలో పెట్టేసుకుంటాడు. ఒకవేళ ఏమాత్రం అశ్రద్ధ చేసినా వాటిని రాజు దొంగిలిస్తాడేమోననేది అతని భయం. అందుకే రాత్రిపూట భద్రంగా ఉండటం కోసం తలకిందే పెట్టుకుంటాడు. పైకి మాత్రం తనకి దిండులేకుండా నిద్ర పట్టదని కవర్ చేస్తాడు.

రానూ రానూ రాజుకి బట్టలు పెద్ద సమస్యగా మారసాగాయి.

అదే విషయం మంజునాథ్‌కి చెప్పాడు.

**ఒకరోజు పొద్దున్న నీలమ్మ పాలు పోసి వెళ్తున్నప్పుడు ఓనరూ తనూ ఏదో గుసగుసగా మాట్లాడుకోవడం గమనించాడు మంజునాథ్. వెంటనే రాజు దగ్గరికి వెళ్ళి ఆ రోజు మధ్యాహ్నం వాళ్ళిద్దరూ ఎక్కడో ఒక చోట కలుసుకుంటారనీ, ఎక్కడ కలుసుకున్నారో కనిపెట్టి తీరాలనీ చెప్పాడు. అన్నట్టుగానే మూడింటికి కాస్త గిరాకీ తగ్గగానే డబ్బు లెక్కేసి జేబులో పెట్టుకుని కాష్ కౌంటర్లో తనకి నమ్మకస్తుడైన టీ మాస్టర్ని కూర్చోబెట్టి బైటికి వెళ్ళాడు ఓనర్. ఆ వెనువెంటనే మంజునాథ్ కూడా రెస్టుకని వంకపెట్టి పత్తేదారి పనిమీద బైటికి వెళ్ళిపోయాడు.**

అప్పుడతను ఓ సలహా ఇచ్చాడు. తను కూడా ఆ పనిచేసే ఇప్పుడున్న బట్టలని సంపాదించు కున్నానని చెప్పాడు. నువ్వొప్పుకుంటే నీకూ కొత్తబట్టలు కొనుక్కునే మార్గం చూపిపెడతానన్నాడు.

రాజుకి ఒప్పుకోక తప్పని పరిస్థితి. అందుకే ఒప్పుకున్నాడు.

మర్నాడు అతనికి తన బట్టలిచ్చి వేసుకుని రమ్మన్నాడు మంజునాథ్.

ఆ బట్టలు వేసుకుని అతని వెంట వెళ్ళాడు రాజు.

అతన్ని ఒక ప్రైవేట్ హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళాడు మంజునాథ్. అక్కడ రాజునించీ కొంత రక్తం తీసుకున్నారు. అతని రక్తం ఓ పాజిటివ్ కావడంతో అసలుకి కొంత కొసరేసి మరీ లాక్కున్నారు. అంతా అయ్యాక అతనికి పళ్ళూ బ్రెడ్డూ నాలుగు గుడ్లూ ఇచ్చారు. చివరిగా సంతకాలు తీసుకుని డబ్బిచ్చి పంపించేశారు. అంత డబ్బొస్తుందని ఇద్దరూ ఊహించలేదు.

రక్తం అమ్ముకుని బట్టలు కొనుక్కోవలసిన దుస్థితి పట్టినందుకు రాజు ఎంతమాత్రం బాధపడలేదు. ఎందుకంటే అతనున్న పరిస్థితుల్లో రక్తం కంటే బట్టలే విలువైనవి.

రక్తం ఎక్కువగా తీసుకోవడంతో నీరసం ఆవహించింది. పళ్లు తిన్నాక ఆకలి తీరిందిగానీ నీరసం తగ్గలేదు.

అలాగే వెళ్ళి ప్లేట్లు కడుగుతూ కడుగుతూ కళ్ళు తిరిగి పడిపోయాడు.

అతన్ని తీసుకువెళ్ళి ఓ మూలగా పడుకోబెట్టాడు మంజునాథ్. తరువాత ఓనర్‌కి విషయం చెప్పి వచ్చాడు. అతని పనిని కూడా తనే చేస్తానన్నాడు. దాంతో రాజుకి రెస్టివ్వడానికి ఒప్పుకున్నాడు ఓనర్.

మధ్యాహ్నం అయ్యేసరికి జ్వరం తగిలింది. దాంతో మెడికల్ షాపుకి వెళ్ళి రెండు టాబ్లెట్లు తెచ్చి రాజుకి వేశాడు మంజునాథ్.

ఆ రాత్రి ఎనిమిదిగంటలకి పాలు పొయ్యడానికి వచ్చిన నీలమ్మకి రాజు జ్వరం విషయం తెలిసింది. వెంటనే లోపలకి వెళ్ళి చూసింది. అతను పడుకుని ఉన్నాడు. ముందు మెడమీద చెయ్యిపెట్టి చూసింది. అలా చెయ్యి పెట్టడానికి వంగినప్పుడు ఆమె గుండెలవంకే ఆబగా చూస్తున్న మంజునాథ్‌ని గుర్తించాడు రాజు.

ఆ తరువాత తనే అతనికి టాబ్లెట్ వేసి పాలు తాగించింది.

ఆ తరువాత జాగ్రత్తగా చూసుకొమ్మని మంజునాథ్‌కి చెప్పి వెళ్ళిపోయింది.

ఆమె అటు వెళ్ళగానే రాజు దగ్గరకి వచ్చాడు మంజునాథ్. "నువ్వు అదృష్టవంతుడివిరా, నీలమ్మ నీ చెయ్యిపట్టుకుంది. లేపి కూర్చోబెట్టింది. పాలు తాగించింది" అంటూ మొదలు పెట్టి, "ప్చ్...ఆ జ్వరం ఏదో నాకు వచ్చినా బాగుండేది" అని ముక్తాయించాడు.

ఆ రాత్రి పన్నెండు వరకూ రాజుకి నిద్ర పట్టలేదు.

ఎంత వద్దంటున్నా వినకుండా మంజునాథ్ డీవీడీ పెట్టుకు చూస్తుంటే నిద్రెలా పడుతుంది.

తెల్లవారుఝామున నాలుగ్గంటలకి మెలకువ వచ్చి చూస్తే ఎదురుగా బెంచీ మీద ఉండాల్సిన మంజునాథ్ కనపడలేదు.

అనుమానం వచ్చి పాంటు జేబు చూసుకుంటే డబ్బు కనపడలేదు.

ఆ వెనువెంటనే "డీవీడీల్లో ఉండేది చూసి ఆనందించక్కర్లేదు, చేసి ఆనందించచ్చు" అనే అతని మాటలు గుర్తొచ్చాయి.

విశ్లేషణ

# 'అగ్నిశిఖ' ఆలోచనాగ్ని కీలలు

జి.వెంకటకృష్ణ

నిర్భయ చట్టం అమల్లో వున్నా స్త్రీలపై, పసి పిల్లలూ, వృద్ధులూ అనే తేడా లేకుండా పెచ్చురి ల్లుతున్న హింస, ప్రజాస్వామిక రచయిత్రు లను ఆలోచింపజేసింది. దైనందిన జీవితంలో సమాజం, పిత్రుస్వామిక వ్యవస్థ చేతిలో పావుగా, స్త్రీలపై చేసే భీకర దాడికి తోడుగా వ్యవస్థీకృత రాజ్యహింస జతకలిస్తే జరిగే విధ్వంసం స్త్రీవాదులైన యీ రచయిత్రులను కదిలించింది. ఆ కదలికలు నేరుగా స్త్రీ వాద రచనల్లో ప్రతిఫలిస్తూ, మగలోకపు మనస్త త్వంలో ఏ చిన్న మార్పు అయినా రావాలని ఆశించేవి.

**ఆ స్పందనలు** విడివిడిగావున్న వాటిని ఒక సంకలన రూపమిస్తే బాగుంటుందనే ఆశ యంతో **'ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక' (ప్ర.ర.వే)** 'అగ్నిశిఖ' పేరుతో ఓ పుస్తకాన్ని వెలువ రించింది. వాళ్ళే చెప్పుకున్నట్టు 'అగ్నిశిఖ' స్త్రీలపై జరుగుతున్న సకల హింసలనూ ప్రతిఘటిస్తూ, వాటి మూలాలను ప్రశ్నిస్తూ, పరిష్కారాల్ని సూచిస్తూ చేసిన ఒక స్పందన, ఒక సారికారక ప్రకటన.




'అగ్నిశిఖ' పుస్తకంగా ఒక ప్రక్రియా సమాహారం. సాహిత్య ప్రక్రియలైన కవిత, కథ. వ్యాసాలను యిముడ్చుకొని పాఠకుల్ని ఆలోచింపజేసే మాధ్యమం. ఇందులో ఆరు కథలు, ఆరు కవితలు, పద్నాలుగు వ్యాసాలున్నాయి. మళ్ళీ అన్నీ సామాజిక వ్యాసాలే అయినా, కథ మీదా, నవల మీదా ఒక్కో విమర్శా వ్యాసమువ్నాయి.

ఘంటశాల విర్మల కవిత్వం 'శరీర న్యాయం రెండో అధ్యాయం' తో ప్రారంభించి, కాకలు తీరిన సాహిత్య విమర్శాయోధురాలు కాత్యాయనీ విద్మహే, యిప్పుడిప్పుడే బలంగా రాస్తున్న మల్లీశ్వరీ, వరలక్ష్మీ (విరసం) వ్యాసాల్ని కలుపుకొని కె.సుభాషిణి కథతో ముగుస్తుంది.

ఈ పుస్తకంలో లోతైన, పదునైన సామాజిక వ్యాసాలున్నాయి. పితృస్వామ్య వ్యవస్థలో హింసా మూలాలూ, దాని వ్యవస్థీకృత అవగాహన, దాన్ని కట్టడి చేయడానికి సామాజిక ఆచరణను వివరిస్తూ పన్నెండు మంచి వ్యాసాలు ప్రశ్నల శరాలై పౌర సమాజాన్ని తాకుతాయి. పిత్రుస్వామ్య వ్యవస్థ ఆచరణను దాని మూలాల్లోనే కట్టడి చేయాలంటే బాల్యాన్ని ప్రభావితం చేసే వుపాధ్యాయ ఆలోచనల్లోనే మార్పు రావాలనీ, అందుకై వుపాధ్యాయ వుద్యమాల ఆవశ్యకతను విద్మహే గారు వివరిస్తే, తరతరాలుగా స్త్రీని హీనంగా చూస్తున్న సమాజం ఒక్కసారిగా మారిపోదనీ, ఎక్కడికక్కడ తక్షణ ప్రతిఘటనల్ని నిర్మించే, సమర్థించే పౌర సమాజపు ఆవశ్యకతను డా.నళిని చెప్తారు. హింసకు మూలమైన వ్యవస్థలపై యుద్ధం చేయకుండా, ఏ హింసా ఎన్నటికీ ఆగదనీ, యిలాంటి విస్మరణతో కూడిన పోరాటం అది ఏ స్థాయిదైనా నిజాల్ని వదిలేసి నీడతో యుద్ధమని పి.వరలక్ష్మి వివరిస్తుంది. రాజ్యం చేస్తున్న స్త్రీ హింసమీద, మరీ ముఖ్యంగా గిరిజన మహిళల మీద పోలీసుల దుశ్చర్యలపై, మల్లీశ్వరీ, రత్నమాలల వ్యాసాలున్నాయి. అందులో 'భూమి చెపితే ఆకాశం నమ్మదా' వ్యాసంలో ప్రకృతి లో మూగప్రాణుల బాధల్నే వినగలిగే బాధ్యతల్ని మోస్తున్న మనం సాటి మహిళల మరీ ముఖ్యంగా గిరిజన మహిళల పోరాటానికి మద్దతు యివ్వాలి కదా అంటూ మల్లీశ్వరి వొప్పిస్తారు.

స్త్రీ సమస్యల పట్ల ముందు నుంచీ కూడా బలమైన వ్యక్తీకరణ వినిపిస్తున్న స్త్రీవాద కవిత్వం కూడా యీ సంకలనంలో వుంది. కొండేపూడి నిర్మల, ఘంటశాల నిర్మలలతో పాటు అంతే బలమైన వ్యక్తీకరణ కలది పసుపులేటి గీత కవిత్వం 'మృగతృష్ణ'. ఈ కవయిత్రుల కవిత్వం పాఠకుల్ని బలంగా ఆలోచింపజేస్తుంది. వి.ప్రతిమ 'నెత్తుటి నదిలో నెలవంకలు' రాజ్యహింసపై ఆవేదనను వెలువరించిన కవిత.

కవిత్వం తర్వాత స్త్రీవాదం తన ముద్రను బలంగా వేసింది కథా ప్రక్రియలోనే. దాన్ని గమనించే ఈ 'అగ్నిశిఖ' సంపాదక మండలి ఆరు కథలకి యిందులో చోటిచ్చారు. పితృస్వామ్య (రాజ్య) వ్యవస్థ యిరికిరుకు సందుల్ని కూడా ఫోకస్ చేయగలిగే సన్నివేశాలతో (వస్తురీత్యా) అన్ని కథలూ పాఠకుల స్పందనను ప్రేరేపిస్తాయి. 'శిలలోని జల', 'నేను రేపిస్టును ఎలా అయ్యాను', 'అరుణ కోసం' కథలు శిల్పరీత్యా కూడా ఎన్నదగిన కథలు. సంప్రదాయ ఆలోచనలతో పిరికితనంతో కూతురు ఎదుర్కొన్న లైంగిక దాడిని దాచేయాలని ఆలోచిం చి, భార్యను నోరు మూయించిన భర్తలో వచ్చిన మార్పే శాంతిప్రబోధ 'శిలలోని జల' కథ. 'నేను రేపిస్టును ఎలా అయ్యాను' ఒక తప్పుదారి పట్టిన యువకుని ఆత్మకథనం. పట్టించుకోని కుటుంబం, దారి తప్పించే స్నేహితులు, మీడియా ప్రేరేపించే విచ్చలవిడితనం, ఆ యువకుడిని ఎట్లా నేరస్థునిగా చేసిందో మంచి శిల్పంతో విజయభాను చెప్తుందీ కథ. బాధితురాలైన అరుణ కోసం బాధ్యతాయుత వ్యక్తులు పూనుకోవాల్సిన అవసరం గురించి, కార్యకర్తల స్థాయీ చిత్రణతో రచయిత్రి సుభాషిణి 'అరుణ కోసం' కథలో చెప్తుంది.

వెరశి 'అగ్నిశిఖ' సమాజం అన్యాయంగా రగిలిస్తున్న పురుష భావజాల పెనుమంటల్లో, ప్రత్యక్షంగా స్త్రీ, పరోక్షంగా కుటుంబం దగ్ధమవుతున్నదనీ, ఆ దురహాగ్ని కీలల్ని స్త్రీ శక్తి సంఘటితమై ఆర్పాల్సి వుందనీ సూచిస్తుంది.

ఈ ప్రతిభావంతులైన రచయిత్రుల ఆలోచనా శిఖలతో పురుషస్వామ్య భావ జాలం దహించబడి మనుషులుగా మారడానికి, పునీతులు కావటానికి 'ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక' రచయిత్రుల స్పందన దోహదం చేస్తుంది.

ఊళ్ళలో అయితే సూర్యోదయం కాకపోయినా, ఆపాటికే జన సంచారం ప్రారంభమయ్యేది.

నగరం కావడంతో ఇంకా మేల్కోలేదు.

చెరువు ప్రక్కనే వున్న ఆ పార్క్ లాంటి ప్రదేశం దగ్గర ఓ ఒంటెద్దు బండి ఆగింది.

బండిని నడుపుకొచ్చిన ఆ వ్యక్తి చటుక్కున కిందకి దిగి, ఎంత వేగంగా క్రిందికి దూకాడో అంతే వేగంగానూ బండి వెనక్కి వెళ్ళి బండిలోంచి ఓ పాత చీరలో చుట్టివున్న ఆ ముసలమ్మని చేతులతో ఎత్తుకొని క్రింద పరచినట్లున్న పచ్చగడ్డిమీద జాగ్రత్తగా పడుకోబెట్టాడు.

తన మూల్గు ఆమెకే వినిపించనంత నెమ్మదిగా మూల్గిందామె.







# నోరులేని జీవి


9391343916

"ఎన్నాళ్ళీ ముసలిదానికి సేవ... నా వల్లకాదు... ఈ రాత్రి మీరు తీసుకువెళ్ళి ఎక్కడైనా దింపొస్తారా? లేదా?" అతని భార్య కొన్నిరోజులుగా చేస్తున్న గోల తీవ్రస్థాయికి చేరింది. తనూ తినలేదు. భర్తని, అతని ముసలితల్లిని కూడ తిననీయలేదు రాత్రి... ఇక విధిలేక అర్ధరాత్రి కొడుకు, తల్లిని ఒంటెద్దు బండిమీద వేసుకుని ఈ ప్రాంతానికి తీసుకొచ్చాడు, ఎవరూ చూడకుండా తల్లిని ఈ ప్రాంతంలో విడిచి వెళ్ళిపోవాలని!

"నన్ను క్షమించమ్మా... అది చెప్పినట్లు నిన్నింట్లోంచి తీసుకొచ్చి ఇలా దూరంగా విడిచిపెట్టకపోతే, దాని నోరు మూతపడేట్లు లేదు... కుటుంబాన్ని పూర్తిగా రోడ్డున పెట్టుకోవడం ఇష్టంలేక, విధిలేక నిన్నిలా విడిచిపెట్టి పోవాల్సి వస్తుంది" తల్లిమీద కప్పిన గుడ్డతో తన కళ్ళు తుడుచుకున్నాడు కొడుకు.

అంత బాధలోనూ, నీరసంలోనూ కూడ ఆ పిచ్చి తల్లి చిన్నగా, విరక్తిగా నవ్వుకొంది - పెళ్ళాం నోరు మూయిస్తే చాలు కుటుంబం రోడ్డున పడదని భావించిన కొడుకు, తల్లిని బలవంతాన తీసుకువెళ్ళి రోడ్డు ప్రక్కన పారేయడం కుటుంబ పరువును కాపాడుకోవడంగా భావిస్తున్నాడు!

మనుష సంచారం ప్రారంభమైతే తన గుట్టు ఎక్కడ బయటపడుతుందోనని భయంతో అక్కడ నుంచీ భయంగా వెనుదిరిగాడు, పున్నామ నరకం నుంచి తల్లిని కాపాడడానికే పుట్టిన ఆ పుత్రుడు.

చెర్నాకోలు దెబ్బలు నాలుగు తగిలిన తర్వాత భారంగా బండిని లాగడం ప్రారంభించింది ఎద్దు. దానికీ తెలుసు ఇలా బండిని, భారాల్ని లాగేందుకైనా తను ఉపయోగపడుతోంది కాబట్టే ఇంకా తనని బయటకు తోసివేయకుండా, నాల్గు పరకల్ని వేయనిస్తోందా యిల్లాలని!

దానితో పాటు ఆ ఇంటినే కనిపెట్టుకుని, తన పాడితో, ఆ ఇంటివాళ్ళకి అండగా నిలిచిన ఆవు వట్టిపోయేసరికి ఆ ఇంటికి... కాదు, ఆ ఇల్లాలికి భారమైపోయిందని అర్థం చేసుకుంది. కానీ, అర్థం చేసుకోని గోమాత తనని రాత్రికి రాత్రి యజమాని తీసుకు వెళ్ళి పక్కఊళ్ళో దింపి వచ్చినా, ఇరవై నాల్గుగంటల్లోనే తిరిగి ఇంటికి చేరుకుంది. ఈ సారి యజమాని జాగ్రత్తపడి ఈ నగర పొలిమేరల్లోనే విడిచి వెళ్ళిపోయాడు!

ఇంటిదారి తెలీక, అక్కడి వీధుల్లోనే తిరుగుతున్న ఆ ఆవు చెత్తకుండీలలో చెత్తతో కడుపు నింపుకోవడానికి ప్రయత్నిస్తూ, రోగం పాలైంది.

అయినా, అంత కాలమైనా రోడ్డుమీద పరుగెడుతున్న తన నేస్తం గిట్టల చప్పుడు, మెళ్ళో గంటల చప్పుడూ వినిపించినా కదలలేక అక్కడినుంచే 'అంబా...' అంటూ అరిచిందా ఆవు.

డా॥ వేదగిరి రాంబాబు

ఆ అరుపు విన్న ఎద్దు పరుగులో వేగం తగ్గింది. దాన్ని పసిగట్టిన యజమాని చేతిలో చర్నాకోల్ మళ్ళీ నాట్యమాడింది. జన్మనిచ్చిన తల్లి మూగరోదననే అర్థం చేసుకోలేని ఆ రాక్షసుడు తనకి ఎప్పుడో పాలిచ్చిన ఆ ఆవు ఆర్తనాదాన్ని ఏం అర్థంచేసుకోగలడు!

ఒంటెద్దుబండి వేగాన్నందుకుంది.

ఈ అకృత్యాలన్నింటినీ చూడక, చూపించక నాకు తప్పదన్నట్లు సూర్యుడు తన కిరణాలతో లోకంమీద దండయాత్ర ప్రారంభించాడు.

"అరె! ఎవరీ ముసలమ్మా...?"

"బిచ్చగత్తా?"

"కానట్లనిపిస్తోంది! ఈ ముసలిది భారమై, బహుశా ఆ కొడుకామె నిక్కడికి తీసుకొచ్చి పడవేసి వెళ్ళిపోయుంటాడు"

"నిజమే! ఇంట్లోవాళ్ళే ఇక్కడ పారేసి వెళ్ళుంటారు..."

తెల్లవారడంతో, అటుగా వచ్చిన ఒక్కొక్కళ్ళు ఆ ముసలిదాని దగ్గరకు వచ్చి, తమకి తోచిన విధంగా జాలిని మాటల రూపంలో ప్రకటించ సాగారు. తాము చేద్దామనుకున్న పనిని తమకన్నా ముందు చేసి చూపించిన ఆ తల్లి మీద జాలికన్నా, ఆమెనక్కడ విడిచివెళ్ళిన కన్నకొడుకు మీద జెలసీ లాంటి మాటల తూటాల్ని వదలసాగారు.

తన కొడుకు చేసిన పనికన్నా చుట్టూ చేరినవాళ్ల సానుభూతి తూటాలు ఆ ముసలి తల్లిని ఎక్కువగా బాధించసాగాయి.

ఆ మాటల్ని వినలేనట్లు కళ్ళు మూసుకుంది. తనది ఏ ఊరో, తనని ఇక్కడికి ఎవరు తీసుకువచ్చి విడిచారో, వెనుక ఎవరి మొండిపట్టు వుందో - అన్నీ తనకి తెలుసు! అందుకే ఆవులా బయట విడిచిపెట్టినా తిరిగి ఇంటికి వెళ్ళాలనే ఇచ్ఛ ఆమెకి కలగడం లేదు!!

బలవంతాన ఆ ముసలావె కళ్ళు మూసుకున్నా అక్కడికి చేరిన వాళ్ళందరూ అనే మాటలు ఆమె చెవిని చేరి బాధిస్తూనే ఉన్నాయ్!!

"మీదేవూరు?"

పదే పదే ఈ ప్రశ్న వినిపించడంతో భారంగా కళ్ళు తెరిచి అటు వైపు చూసింది అయోమయంగా.

"మీ ఇల్లెక్కడో చెప్పమ్మా కన్నతల్లినే భారంగా భావించి విడిచిపెట్టిపోయిన ఆ దౌర్భాగ్యుణ్ణి నాలుగు దులిపి నిన్నక్కడ విడిచిపెట్టి వస్తాం" మరో గొంతు.




తను జవాబు చెప్పకపోతే తన కొడుకుకి మరెన్ని చివాట్లు పడతాయోనని బాధ వేసినట్లుందా తల్లికి...

"వాణ్ణి తిట్టకండి బాబూ... వాడు ఏ పరిస్థితిలో ఇలా చేయాల్సి వచ్చిందో...!"

ఇంత చేసినా ఆ కొడుకుపట్ల ఆ తల్లి చూపిస్తున్న ప్రేమకి ఎవరి నోటవెంటా మళ్ళీ మాట రాలేదు.

ఆ ముసలమ్మా మరేమాటా మాట్లాడాలనుకోలేదు.

నీరసం ముంచుకు రావడంతో ఆమె కళ్ళు మూతలు పడ్డాయ్. ఎవరెన్ని మాటలన్నా తిరిగి కళ్ళు తెరుచుకునే స్థితిలో లేదామె!

గత పాతికేళ్లలో అస్తిత్వ సాహిత్యంలో దళిత, మైనారిటీ సాహిత్యకారులు తమ గళాలు విప్పడం మనం తెలుగు సాహిత్యంలో చూస్తున్నాం. ముఖ్యంగా గత పది పన్నెండేళ్లుగా వస్తోన్న ముస్లిం సాహిత్యాన్ని మనం పరిగణనలోకి తీసుకుంటే వస్తోన్న సాహిత్య విస్తృతంగా ఉంది. ఏ వాద సాహిత్యమైనా ముందు తన బాధలను వినిపించే ఆర్తనాదంగానే మొదలౌతుంది. అటుపైన ఆ దుఃఖాల వెనక గల సామాజిక కారణాలను విశ్లేషిస్తుంది. ఆ తర్వాత పరిష్కారాలను వెదుక్కుంటుంది.

భారతీయ ముస్లిముల వెనుకబాటు తనానికి కారణాలు, మొదటిగా దేశ విభజన...గొప్పవారు అందరూ పాకిస్తాన్ వెళ్ళిపోయారు. ఇక్కడ మిగిలింది పేద ముస్లిములు మాత్రమే. చాలా మంది ముస్లిం మతాన్ని స్వీకరించిన వారు దళితులు, నిమ్న కులాలకు చెందిన వారు కావడం వలన ఇక్కడ ముస్లిం వెనుకబాటుతనం చాలా ఎక్కువగా ఉంది. ముస్లిములు ఆర్థిక స్థితి లేనందున ఎటువంటి పెద్ద వ్యాపారాలను, విద్య లేనందున పెద్ద ఉద్యోగాలను సంపాదించలేకపోయారు. అందువలన ఇక్కడి ముస్లిముల బాధలు, సమస్యలు అనేకం అని వివరిస్తారు, అస్గర్ అలీ ఒక పరిశీలనా వ్యాసంలో. ముస్లిములు కేవలం భారతదేశంలోనే మైనారిటీలు. కానీ ప్రపంచంలో చాలా ఎక్కువ శాతం ఉన్నారు. కానీ విదేశాల్లో ముస్లిముల సమస్యలకు, ఇక్కడి ముస్లిముల సమస్యలకు తేడా ఉంది. పర్దా, తలాక్, ఆడపిల్లలని చదివించకపోవడం ఇవన్నీ ఒకరకం సమస్యలైతే, మన దేశంలో ఉన్న కుల వివక్ష సమస్య ఒకటి అదనంగా ఉంది మన ముస్లిములకు.

# తెలుగు సాహిత్యంలో రెండు ఈద్ కా చాందోలు

## జగద్ధాత్రి




95730 54909


**ఎక్కువమంది** నిమ్న కులాల వారు తమ అస్తిత్వం కోసం ముస్లిములుగా మారడం వెనుక గల సామాజిక కారణం, తమకు ఒక గౌరవాన్ని కల్పించుకోవాలన్న తపన మాత్రమే. భారతీయ ముస్లిములు హిందూ మతంలోనుండి ఇస్లాంని స్వీకరించిన వారే. ఇందుకు గల కారణాలు కేవలం అస్తిత్వస్పృహ మాత్రమే కాదు, ఎక్కువ కాలం ముస్లిం పాలనలో భారత దేశం ఉండటం కూడా ఒక కారణమే. హిందూమతంలోని లేని గౌరవాన్ని పొందాలనుకున్న కొన్ని దళిత, బహుజన కులాలు ఇస్లామును స్వీకరించాయి.




ఇస్లాం, క్రిస్టియానిటీని స్వీకరించిన వారెక్కువగా దళితులే. భారతీయ ముస్లిములు చాలావరకు ఇంకా ఆర్థికంగా, విద్యలోనూ వెనుకబడే ఉన్నారు. అలాంటి వెనుకబాటుతనం నుండి నూతిలోని గొంతుకల్లా అస్తిత్వం స్పృహ తోనూ, సమాజంలో గౌరవం కోసం, తమదైన ఒక స్థానం కోసం, అసమాన తలపైన పోరాటం కోసం గళమెత్తిన ముస్లిం స్వరాల సాహిత్యాన్ని చర్చించు కోవడం, ఈ సాహిత్యం కలిగించిన, కలిగిస్తోన్న ప్రభావాన్ని అవలోకించడం ఈ వ్యాస ఉద్దేశం. ఇలాంటి రెండు బృహత్ ప్రయత్నాలు గత దశాబ్దంలో జరిగాయి.

మతానికన్నా భయంకరమైన వివక్ష కులానిది. ఏ మతం స్వీకరించినా మళ్ళీ అందులో ఈ కుల వివక్ష విషకీలలు వుంటూనే ఉంటాయి. ఇదే మనకి ఇస్లాములోనూ, క్రైస్తవ మతంలోనూ కనిపిస్తుంది. ఈ కులపు వేళ్లు ఎంతగా పాతుకు పోయాయి అంటే, మనుషులలో ఒకే మతానికి చెందినా, ఒకరి పట్ల మరొకరికి చులకన భావం ఏర్పడేంతగా. ఇలాంటి సమయంలో అస్తిత్వ సాహిత్యం మొదలైంది. ఇక్కడ ముస్లిములు మత కుల సామాజిక సమస్యలతో పోరాడవలసి వస్తోంది. ఆధునిక విద్య పట్ల ఆసక్తి లేనందున కేవలం మదర్సా విద్యాపైననే శ్రద్ధ చూపడం చేత కూడా ముస్లిములు నేటి పోటి వ్యవస్థలో బాగా వెనుకబడి ఉన్నారు అన్నది వాస్తవం. వీరిలో విద్యాహీనతే

వెనుకబాటుతనానికి బలమైన కారణం అన్నది సత్యం. పల్లెల్లో భూములు లేకపోవడం, పట్టణాల్లో ఎక్కువగా చేతి వృత్తుల వాళ్లే ఉండటంతో వారి పిల్లలు కూడా అవే వృత్తులు స్వీకరించేలా చేశాయి. అందుకే కొన్ని తరాలుగా వారు అవే పనులు చేస్తూ తమ ఆర్థిక, సామాజిక స్థాయిని పెంచుకోలేక పోయారన్నది వాస్తవం.

ఇక సాహిత్యం విషయానికి వస్తే చైతన్యం పొందిన ముస్లిముల స్వరాలను వినిపించిన ఎందరో భారతీయ రచయితలు ఉన్నారు. సాదత్ హసన్ మాంటో, హైదర్, ఇంతియాజ్ ధర్కర్‌లాంటి భారతీయ సాహితీ వేత్తలు ఉన్నారు. అభ్యుదయ రచయితల మొదటి ఉర్దు సంకలనం 'అంగారే' (1932) ప్రచురించిన వారిలో ఒక ముస్లిం మహిళ డాక్టర్ రషీద్ జాన్ ఉండటం గర్వించదగిన విషయం. ఇస్లాంలోని సంప్రదాయాలకు వ్యతిరేకంగా గళం ఎత్తి ప్రశ్నించినందుకు ఈ పుస్తకాన్ని నిషేధించారు. ఇటీవల 2014 స్నేహాల్ సింఘవి చేసిన ఈ పుస్తక ఆంగ్లానువాదం పెంగ్విన్ వారు ప్రచురించారు. మరొక ఆంగ్లానువాదం కూడా వచ్చింది. ఇక తెలుగు సాహిత్యానికి వస్తే నేడు చాలా మంచి ముస్లిం స్వరాలు వినవస్తున్నాయి. ఆ కోవకు చెందిన రెండు గొప్ప పుస్తకాలను ఇక్కడ ప్రస్తావించుకుందాం.

# తెలుగు సాహిత్యాకాశంలో 'వెండి మేఘం' సలీం




**తెలుగు** సాహిత్యంలో మొట్టమొదటి ముస్లిం నవల 'వెండి మేఘం'. రచయిత సలీం. ఇటీవలే కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారాన్ని కూడా స్వీకరించిన ప్రసిద్ధ సాహితీ వేత్త, పేద కుటుంబం నుండి వచ్చి, చదువుకుని నేడు చాలా మంచి ఉద్యోగంలో ఉన్న వారు సలీం. తాను చూసిన జీవితం, అనుభవించిన కష్టాలు అన్నిటికీ కారణమైన అవిద్యను, వివక్షను తన నవలలో చర్చిస్తారు సలీం. 'వెండి మేఘం' పేద ముస్లిం జీవనానికి దర్పణం పడుతుంది. ఒక స్ఫూర్తినిస్తుంది. మిగిలిన సాహిత్యం ఎక్కువగా రాసినా, రాస్తున్నా 'వెండి మేఘం' కేవలం ముస్లిం జీవితాన్ని చర్చించిన నవల. ఈ పన్నెండేళ్ళలో ఈ కోవకు చెందిన నవల మళ్ళీ మరొకటి రాలేదు.

ఇందులో ముస్లిముల సమస్యలనన్నిటినీ స్పృశించారు, చాలా ప్రతిభావంతంగా రచయిత. కథనం పాఠకులని, పుస్తకాన్ని మొదలు పెట్టాక పూర్తయ్యేంతవరకు కింద పెట్టనివ్వదు. అంతటి బలమైన ఇతివృత్తం, కథ కథనంతో ఆద్యంతం ఉత్కంఠతో సాగుతుంది ఈ నవల. మనసును, మేధను స్పందింప జేసే రచన ఇది.

ఈ నవలలోని అన్వర్ బేగమ్ పాత్ర తెలుగు సాహిత్యంలో చిరస్మరణీయంగా ఉంటుంది. చివరి శ్వాసవరకు అన్వర్‌కు అండదండగా నిలిచిన ఆమె అత్త కుల్సుంబి పాత్ర కూడా. కథాకాలం దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు. అప్పటికి అన్వర్‌కి పదకొండేళ్లు. తన అక్క చనిపోతే పుట్టిన పిల్లవాడిని చూసుకునేందుకు, తనకంటే పాతికేళ్ళ పెద్దయిన భాషాకి ఇచ్చి వివాహం చేస్తారు. ఆ చిన్నతనంలో ఏమి జరిగిందో కూడా ఆమెకి తెలీదు.

అలాంటి అన్వర్, అతి చిన్న వయసులోనే మరొక బిడ్డకు తల్లై, ఇద్దరు బిడ్డలను, అత్తగారిని పోషించుకోవాల్సిన పరిస్థితి ఎదుర్కొంటుంది. భర్త భాషా మరణం తర్వాత, ఆమె ఒక్కతే బీడీల ఫేక్టరీలో గ్రేడింగ్ కూలి పనికి వెళుతుంది. ముస్లిం స్త్రీకి లేదా అసలు స్త్రీకి విద్య ఎంత అవసరమో తెలుసుకుని మెట్రిక్యులేషన్ పరీక్షకి ఆ వూరి పంతులుగారి వద్ద చదువు నేర్చుకుని పాస్ అవుతుంది. అన్నిటికంటే గొప్ప విషయం, విద్యార్హత వలన వచ్చిన టీచర్ ఉద్యోగాన్ని కాదని వ్యవసాయమే చేస్తుంది. నేల తల్లితో అనుబంధం పెంచుకుంటుంది. ఈలోపల ఆదాం అనే సోదరుడి లాంటి అబ్బాయికి ఇస్లాం ధర్మాన్ని అంతా బోధిస్తుంది. ఉర్దు, అరబ్బీ రాయడం చదవడం, అలాగే తెలుగు, ఇంగ్లీష్ ఆడపిల్లలకి నేర్పుతుంది.

ఈ నవలలో రచయిత 1947 నుండి 1990 వరకు సాగే కథా గమనంలో జరిగే రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంఘిక పరిణామాలను అతి లాఘవంగా కథలోనే ఒక భాగంగా చిత్రిస్తారు. ఇలాంటి నైపుణ్యం చాలా అరుదుగా కనిపిస్తుంది రచయితల్లో. బాహ్య పరిణామాలన్నీ వారి జీవితాల మీద ఎలా ప్రభావం చూపుతాయో అన్నది రెంటినీ జమిలిగా చిత్రించడం ఈ 'వెండిమేఘం'ను శాశ్వతంగా నిలబెడతాయి.

దూదేకుల కులం నుండి వచ్చిన ప్రఖ్యాత నాదస్వర వాయిద్యుడు షేక్ చినమౌలానాకు జరిగిన సన్మానాన్ని పేర్కొనడం లాంటివి రచయిత ఆత్మ గౌరవాన్ని, సామాజిక పరిశీలనని తెలియజేస్తుంది. ముస్లిములుగా మారిన తక్కువ కులస్తులను పూర్తిగా ముస్లిములుగా ఎందుకు చూడరో కారణాలు చెప్పి, దూదేకుల వారికి ఒక మర్యాద కల్పించి, నూర్ భాషీయులుగా సామాజిక స్థానం కలిగేలా చెయ్యాలనుకున్న వారి ఉద్యమంలో ఆదాం ప్రముఖ పాత్ర వహిస్తాడు. దీనికి కారణం అన్వర్ బేగమ్. అతనికి ఇస్లాం మత ఆచారాలు, అందులోని లక్ష్యాలు అన్నిటినీ వివరించడం వలన తాను చదువుకుని తన వారిని చదివిస్తాడు ఆదాం. దేశ విభజన నుండి, నేటి మత ఘర్షణల వరకు ముస్లిముల సామాజిక స్థానమేదో, వారి సమస్యలేమిటో అన్నీ చర్చిస్తుంది. అన్నిటికి విద్యారాహిత్యమే కారణమని చెప్తుంది అన్వర్. తన జీవితాన్ని చక్కదిద్దుకోవడమే కాదు, ఊరికి, దేశానికి ఆదర్శ మహిళగా నిలబడుతుంది దృఢమైన వ్యక్తిత్వంతో. ఆమెకు అత్తగారిలా కాక కన్నతల్లి కంటే మిన్నగా ఎంతో సహాయమందిస్తుంది అన్ని విధాలా కుల్సుంబి.

ఈ రెండు పాత్రలు చూస్తుంటే ఇటీవల చాలా మంచి కీర్తి పొందిన 'ఏ థౌజెండ్ స్ప్లెండిడ్ సన్స్' లో భర్తతోనూ, సమాజంతోనూ పోరాడిన

మారియా, లైలా పాత్రలు గుర్తొస్తాయి. అంతకంటే ఉదాత్తమైనవి అన్వర్ బేగమ్, కుల్సుంబి పాత్రలు. స్త్రీలు స్త్రీలకే శత్రువులు అన్న మాటను అబద్ధం చేస్తూ, ఒక నిస్సహాయ స్త్రీకి మరొకరు ఎంతగా సహాయపడగలరో ఈ పాత్రలు చెప్తాయి. ఈ నవలలోని పాత్రలు 2002లోనే సలీం రచించారు. కాకుంటే ఈ నవల తెలుగులో ఉండిపోయింది కనుక దీనికి రావాల్సినంత ప్రాచుర్యం రాలేదనిపిస్తుంది. మిగిలిన భాషల్లోకి కొన్నిటిలోకి అనువాదం అయినప్పటికీ, ఆంగ్లంలోకి వెళితే చాలా మంచి స్పందన లభించేది. ఈ నవలను ఆంగ్లీకరించే ప్రయత్నం సాగుతోంది. అలాగే తాను రాసిన నవల ముస్లిం స్త్రీ జీవిత చిత్రణ కావడం వలన, వారిలో రావాల్సిన మార్పులు రావాలంటే, ఈ నవలను ఉర్దూలోకికూడా అనువదింప జేయాలని రచయిత ఉద్దేశం. ఆ ప్రయత్నం కూడా త్వరలోనే పూర్తి అవుతుంది.

ముస్లిం స్త్రీ విద్య, ధైర్యం, ఆత్మగౌరవం, అన్నిటికంటే ముందు జీవితంపట్ల ఆశావహ దృక్పథం కలిగి ఉండాలని మంచి సందేశం ఇస్తుంది ఈ నవల. ఈ నవల కేవలం ముస్లిం స్త్రీలకే కాదు, ఎవరు చదివినా స్త్రీ తన జీవితాన్ని ఎలా ఓర్పుతో నేర్పుతో ఆత్మ విశ్వాసంతో తీర్చి దిద్దుకోవాలో చెప్తుంది.

ఇస్లాం మతంలోని కొన్ని ఛాందస భావాలు, ఉదాహరణకి కుటుంబ నియంత్రణ చేసుకోకూడదనేవి, చదువు, కేవలం మదరసాల్లోనే తప్ప ఆంగ్లం, తెలుగు అభ్యసించకూడదు అనేది, ఆడపిల్లలని చదివించకూడదు అనే ఇలాంటి ఛాందసాలెన్నిటి గురించో ఉద్రేకంతోకాక, ఒక సానుకూల దృక్పథంతో పరిష్కరించుకునేలా ఉంటాయి ఇందులోని సంభాషణలు. మత కలహాల పేరిట జరిగే మారణ హోమం వెనుక ఉన్న రాజకీయ కారణాలను చర్చిస్తుంది అన్వర్ తన కొడుకు జిలానీతో. ఈ నవల రాసిన సలీంకి స్త్రీలందరి తరఫునా శత సహస్ర కృతజ్ఞతలు, అభినందనలు. తెలుగు సాహిత్య చరిత్రలోనే చిరకాలం మెరిసే 'వెండిమేఘం'గా ఈ నవల చిరంతనంగా ఉంటుంది అనడంలో అతిశయోక్తి లేదు.

## తొలి తెలుగు ముస్లిం కథా సంకలనం స్కైబాబ 'వతన్'

**దశాబ్దం** క్రితం స్కైబాబ సంపాదకత్వంలో వెలువడిన తొలి తెలుగు ముస్లిం కథా సంకలనం - వతన్. తెలంగాణ, రాయలసీమ, కోస్తా జిల్లాల నుండి ముస్లిం రచయితల కథలను సంకలించిన తొలి తెలుగు కథా సంకలనం ఇది. ఇది ఒక అద్భుతమైన, విజయవంతమైన, స్ఫూర్తిదాయకమైన ప్రయత్నంగా భావించాలి. పదేళ్ళ క్రితం చదివినా ఇప్పటికీ ఇందులోని ప్రతి కథా నాకు గుర్తున్నాయంటే, ఒక మంచి పాఠకురాలిగా చెప్పొచ్చు, ఇవి మంచి కథలని.

ఇందులోని షాజహానా 'సండాస్', సలీం 'ఆరో అల్లుడు', యాస్మిన్ బేగం 'బుర్ఖా', దాదా హయత్ 'మసీదు పావురం', స్కై బాబ 'చోటి బెహెన్', ఖదీర్‌బాబు 'కూటికి పేదనైనా కులానికి నవాబునా?' కథలను, ఈ పుస్తకాన్ని




నేను ఎన్నో సందర్భాల్లో ఉటంకిస్తూ ఉంటాను. ఇవి అంతగా మనసును పట్టిన కథలు. నిజానికి ఈ పుస్తకం నేను చదివి ఒక సభలో మాట్లాడేటప్పటికి నాకు ఏ రచయితతోనూ పరిచయం లేదు. నేను చేసిన ప్రసంగానికి నా బి.ఇడి విద్యార్థిని పర్వీన్ బేగమ్ అనే ఆమె వచ్చింది. ఈ కథలన్నీ చెప్పాక నిజంగా ఆ సమస్యలన్నీ తమకు ఉన్నాయని, అవి అన్నిటికి అక్షర రూపమిచ్చారు ఈ రచయితలు, వారికి అభినందనలు అంటూ కళ్ళ నీళ్లు పెట్టుకుంది. చాలా కదిలించే కథలు. కహానీలు కావివి, జిందగీలు అంటారు స్కైబాబ. అందులో ఎటువంటి సందేహము లేదు. ఇవాళ కాస్త విరివిగా వినిపిస్తోన్న ముస్లిం సాహితీ స్వరాలు ఒక దశాబ్దం క్రితం ఇంతగా లేవు. అలాంటి సమయంలో ఈ సంకలనం ఒక సాహసం, ఒక సంయమనం. ఒక ఐక్యతను, ఒక సంకల్పాన్ని మనకి తెలియజేస్తాయి.

ఈ కథలు మూడు ప్రాంతాల రచయితలవీ తీసుకోవడం విశేషం. తెలంగాణ కథలు, రాయలసీమ, కోస్తా, ఆంధ్ర ప్రాంతం నుండి ముస్లిం స్వరాలను, వారి కష్టాలను కడగండ్లను కళ్ళకు కట్టినట్లు కాదు, హృదయం తట్టినట్లున్న కథలు ఇవన్నీ. అప్పుడు రాసిన రచయితల్లో నేడు చాలామంది మంచి ప్రఖ్యాత రచయితలుగా పేరు తెచ్చుకుంటున్నారు.

ముస్లిం జీవితం లోని విభిన్నమైన సమస్యలు, కుల వివక్ష, రిజర్వేషన్లు, మతమౌఢ్యాలు, బాధాకరమైన సంప్రదాయాలు ఇవన్నీటినీ చర్చిస్తాయి ఈ కథలు. దాదాపుగా తెలుగులోని అందరు ముస్లిం రచయితల కథలు ఉన్నాయి ఇందులో. 52 కథల్లో మనకు కనిపించేదీ, వినిపించేదీ, హృదయాన్ని కదిలించేదీ ఈ ముస్లిముల జీవన కథనాలే. తర్వాత ఎవరివి వారివే కథా సంపుటులు వచ్చినా, పదేళ్ళ క్రితం ఈ 'వతన్' కథలు మాత్రం భారతీయ ముస్లిముల, ముఖ్యంగా తెలుగు వాళ్ళ జీవితాలకు అద్దం పట్టే కథలు.

తిండి గడవని పేదరికంలో దుబాయ్ లాంటి దేశాలు వెళ్ళడం, అక్కడ సంపాదించి ఇంటికి పంపడం. ఆడపిల్లలని షేకులకిచ్చి వివాహాలు చెయ్యడం...ఇలాంటి హృదయ విదారక సమస్యలు ఎన్నో ఉంటాయి ఈ కథల్లో. విద్య, ఉద్యోగం వీటన్నిటిలోనూ రిజర్వేషన్లు కోసం, ఆర్థికంగా వెనుకబడి ఉన్న మతం పేరిట ఈ వెసులుబాట్లు లేకపోవడం, ముస్లిములని శత్రువులుగా చూడటం...ఇవన్నీ చాలా విపులంగా ఆవేదనతో, ఆర్ద్రంగా రాశారు ఈ రచయితలందరూ. ఇందులో బలంగా వినిపించే రచయిత్రులు షాజహానా, యాస్మిన్ బేగమ్ వంటి ఇద్దరు ముగ్గురు మాత్రమే స్త్రీలు ఉన్నారు. నాడు బలంగా వినిపించిన ఈ స్త్రీ స్వరాలే వారికి నేడు తెలుగు సాహితీ చరిత్రలో ప్రముఖ స్థానం కల్పించాయి. బుర్ఖా వేసుకోవడం నుండి మత తీవ్రవాదం

వరకు అన్ని సమస్యలు ఈ కథల్లో చర్చించబడ్డాయి.

ప్రాంతం బట్టీ సమస్యలు కూడా కొంత మారుతాయి. భాష కూడా ఆయా ప్రాంతాల బట్టీ మారుతుంది. ఈ కథలను సంకలనం చేయడంలో స్కై బాబకి సహకరించిన వారు దాదా హయత్, స్మైల్ ఉన్నారు. ఈ కథా సంకలనానికి సంపాదకవర్గంగా ఖాజా, షాజహానా, ఇనాయతుల్లా, అబ్బాస్, గౌస్ మొహియుద్దీన్ వ్యవహరించారు. అయితే ఈ ప్రయత్నాన్ని పూర్తి విజయవంతం చేసిన ఘనత మాత్రం స్కై బాబదే. అందుకు స్కై బాబకు తెలుగు ముస్లిం సాహిత్యంలో విశిష్టమైన స్థానం శాశ్వతంగా ఉంటుంది.

తాను సంకల్పించినట్లుగానే ఈ పుస్తకం ద్వారా ముస్లిం జీవితానికి ఒక అక్షర రూపం వచ్చింది. మేము కూడా మనుషులమే, మా సమస్యలివీ అని గళమెత్తి చెప్పగలిగే స్ఫూర్తి రగులుతుంది, ఈ పుస్తకంలోని కథలు చదివితే. ముస్లిమేతరులు ఈ పుస్తకం చదివినా, సహానుభూతి కలుగుతుంది ముస్లిముల పట్ల. ముస్లిం అంటే మనకి శత్రువు కాదు, మన భారతీయగడ్డపై మనతోనే పుట్టినవాడు, ఇక్కడే ఈ మట్టిలోనే కలిసి పోవాలని ఈ నేలతల్లినే తన వతన్ (మాతృభూమి)గా భావించేవాడు, నీ తోటి మైనారిటీ వాడు అయిన ముస్లిం భాయిల సమస్యలను తెలుసుకో, వీలైతే వారికి చేతనయిన సహాయం చెయ్ అనే అనుకంపను కలగజేస్తాయి ఈ కథలు. ఇలాంటి కథా సంకలనం మళ్ళీ మరోటి రాలేదు ఇప్పటివరకు. ఈ పుస్తకాన్ని పునర్ముద్రించాలనే సంకల్పం ఉన్నట్లు ఇటీవలే స్కై బాబ చెప్పేరు. ఇది చాలా అవసరం కూడా. ఇందులోని కథలు ఆంగ్లంలోకి వెళ్ళాలి. అప్పుడే ప్రపంచ ముస్లిం స్వరాలతో వీరూ గొంతు కలపగలుగుతారు.

ఇక ముస్లిం సాహిత్యం గత అయిదారేళ్ళుగా మరీ విస్తృతంగా వస్తోంది. ఇందులో కవిత్వం, దీర్ఘ కవితలు, కథలు వస్తున్నాయి విరివిగా. ఇందులో వేంపల్లె షరీఫ్ 'జుమ్మా', కరీముల్లా 'సాయిబు', 'ఖిబ్లా', రెహ్మతుల్లా 'బెహెన్', స్కై బాబ 'అదూరే'...ఇలా చెప్పుకుంటూ పోతే.

ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, ఇరాక్, పాకిస్తాన్‌లలోఎన్ని అడ్డంకులున్నా, నిషేధాలున్నా, ఆంక్షలున్నా గళం విప్పి తమ స్వరాలను వినిపిస్తోన్న సోదరీ సోదర రచయితల్లాగా మనలో కూడా విస్తృత చైతన్యం రావాలి. అప్పుడే మనకి సరి అయిన దృక్పథంతో మంచి కథలు వస్తాయి.

అస్తిత్వవాద సాహిత్యంలో, మైనారిటీ సాహిత్యంలో అత్యంత ప్రతిష్టాత్మకమైన తొలి తెలుగు కథా సంకలనం 'వతన్' అని చెప్పేందుకు తెలుగు పాఠకురాలిగా గర్విస్తున్నాను. ఇలాంటి రచనలు ఇంకా రావాలి అని కోరుకుంటున్నాను. ఒక్కొక్కరి పేరు చెప్పడానికి ఈ వ్యాస పరిమితి సరిపోదు. కానీ ఈ రచయితలందరికీ అభినందనలు. ఈ కథలు అన్నీ అంతర్జాతీయ స్థాయిలో వస్తోన్న కథల సాటిగా వున్నాయి. ఇరాన్, ఇరాక్, పాకిస్తాన్, బంగ్లాదేశ్ తదితర ముస్లిం అంతర్జాతీయ సాహిత్యాలను చదువుకుంటుంటే, మన భారతీయ ముస్లిం సాహిత్యం, అందులోనూ తెలుగు ముస్లిం సాహిత్యం, అంతర్జాతీయ స్థాయికి ఏమాత్రం తగ్గదని చెప్పడానికి గర్విస్తున్నాను.

ఉజ్వలమైన మన తెలుగు ముస్లిం స్వరాలకు అక్షరాలైన సామాజిక సాహితీ శాస్త్రవేత్తలు - సలీం, స్కైబాలకీ మనసారా అభినందనలు తెలియజేస్తున్నాను.

తెలుగు సాహిత్యంలో ఈద్ కా చాంద్‌లు ఈ రెండు పుస్తకాలు.

# హైకూలు

ఆషాఢం
బస్సునిండా
ఎన్ని ఏకాంతాలో!

బొమ్మలకు
ప్రాణం పోస్తూ
పిల్లాడు!

సముద్రం
ఒంటరి నావ
వణుకుతూ!

పొయ్యిలో
మాడిపోతూ
ఓ కట్టె!

లోలకం
కొసల మధ్యే
భ్రమిస్తూ.

చంద్రాగ్ని
దగ్ధమవుతూ
విరహ నిశి.

చిరుజల్లు
బడి పుస్తకం
పడవలై.

మేఘాలు
దాగుడుమూత
కొండతో

రాత్రివాన
ఎన్ని కలలు
మొలకెత్తాయో!

ఓలమ్మో!
సంతే లేని
మా వూరు.

అంబరం
పిట్టకోసం
దిగులుగా

జడివాన
వీధులన్నీ
ఇళ్లలో

బాటలన్నీ
నాలోకి
తెరుచుకుంటూ!

అశ్రువే
ప్రవాసంలో
ఆసరా.

లోలోన
చీలిపోతూ
అనుక్షణం

రైలులో
నాకు నేనే
కొత్తగా

డా॥ ఉప్పుధడియం వెంకటేశ్వర
095661 98368

**"వాటీజ్ యువర్ నేమ్?"**

**"మైనేమ్ ఈజ్ ఆనంద్ అంసుమన్" నీపు బదులు ఇచ్చాడు.**

**అర్థచంద్రాకారపు టేబిలు ముందు అయిదుగురు మహిళామణులు కూర్చుని ప్రశ్నలు అడుగుతున్నారు. వారి మధ్యన మణిపూసలాంటి ఓ ప్రౌఢ కూర్చుని ఉంది. ఎడ్మిషన్లు జరుగుతున్నాయి. నీపు ఇంటర్ వ్యూ సాగుతూంది. నీపు తల్లిదండ్రులు అదే గదిలో గోడవారనున్న రెండు కుర్చీల్లో కూర్చుని ఉన్నారు.**




# సీతాకోక చిలుక







సిస్టర్ గంభీరంగా "ఇంటరెస్టింగ్" అని, "హౌ ఓల్డ్ ఆర్ యు?" అంది.

"ఐ యామ్ త్రీ ఇయర్స్ సెవెన్‌మంత్స్ అండ్ టెన్‌డేస్ ఓల్డ్" అన్నాడు నీపు.

ఏ.సి. రూములో కూడా నమితకు చెమటలు పట్టాయి. ఇంటర్‌వ్యూ గదిలో ప్రవేసించే వరకు 'నీపు' కి జవాబులను నూరి పోసింది నమిత. భగవంతుడి దయవల్ల నీపు సరిగానే జవాబిస్తున్నాడు.

గంభీరంగా వున్న ఆ మహిళ ముఖంలో ఓ చిరు దరహాసపు మెరుపు! నమిత తన సొంత పరీక్షలప్పుడు కూడా ఇంత టెన్షను పడలేదు. కొడుకు అడ్మిషను ఆమెకు జీవన మరణ సమస్యగా తయారైంది.

సిస్టరుకి ఎడమ వైపున కూర్చున్న మహిళకు నలభై సంవత్సరాలు ఉంటాయి. ఆమె గంభీరంగా అంది..."ఈమధ్య రెండక్షరాల పేర్లు పెట్టడం ఫాషను అయింది. దానివల్ల విద్యార్థి కులం పట్టుబడదు. మంచి పద్ధతేను..."

ఆమె ఏ ఉద్దేశంతో అలా వ్యాఖ్యానించిందో నమితకు అర్థం కాలేదు. నమిత భారధ్వాజస గోత్రాయ బ్రాహ్మణి. బ్రాహ్మణులు కావడం వల్ల భవిష్యత్తులో ఉద్యోగావకాశాలు తగ్గుతాయని, నమిత తండ్రి ఇచ్చిన సలహా మీద, అటువంటి పేరును ఖాయం చేసారు. మిశ్రో పేరు చివర తగిలించుకుంటే, దరఖాస్తు దశలోనే తీసి ప్రక్కన పెట్టడం జరుగుతోంది. రెండు దశాబ్దాల తర్వాత బ్రాహ్మణ శబ్దం అస్పృశ్యతకు గురికావచ్చు కూడా!

సిస్టరుకి కుడి వైపున కూర్చున్నామె ఒడియాలో ప్రశ్నించింది..."నీతో ఎవరు వచ్చారు?"

"మమ్మీ డాడీ!"

"నీ డాడీ గారి మమ్మీ డాడీ మీతో ఉన్నారా?"

"ఆс... ఉన్నారు!"

"నీ డాడీగారి డాడీ నీకేమవుతారు?"

"తాతగారవుతారు, మరేంటి? ఆమాత్రం తెలీదా?" అంటూ నీపు పాండిత్యాన్ని ప్రదర్శించాడు.

ఆ సమాధానానికి నమిత భయపడింది. గత ఇంటర్‌వ్యూలో భయపడ్డాడని, ధైర్యం నూరిపోసి తీసుకొచ్చింది నమిత. దాని ఫలితం ఇది! ఎలాగైనా ఈ కాన్వెంటులో నువ్వు సీటు సంపాదించాలి అంటూ బోధించింది తను. కాన్వెంటు పిల్లల్ని చూసిన నీపు సీటు సాధించాలనే పట్టుదలతో ఉన్నాడు. నీపు ఒక పిల్ల చేతిలో నున్న 'పోకెమన్' బొమ్మవున్న వాటరు బాటిల్ని చూసేడు. చూసి, "మమ్మీ! నాకలాంటి బాటిలు కావాలి!" అని అడిగాడు.

"తప్పక కొంటాను. ముందు నువ్వు సమాధానాలు సరిగా చెప్పి ఈ స్కూల్లో సీటు సంపాదించు! ఆ తర్వాత నీకు ఇంతకన్న మంచి బాటిలు కొనిపెడతాను" నీపు తల నిమురుతూ అంది నమిత.

తల్లి ఇచ్చిన వరప్రభావంతో నీపు నదురు బెదురు లేకుండా సమాధానాలు ఇస్తున్నాడు. అయితే, ఇంత నిర్భయంగా ఏది తోస్తే అది చెప్పేస్తాడనుకోలేదు! నమిత కాళీమాతకు, చండీమాతకు మొక్కుకుంది.

ఆశ్చర్యంగా మరొక కుర్ర టీచరు కూడా ఒడియాలో ప్రశ్నించింది.

"మీ తాతగారికి నువ్వేమవుతావు?"

"మనవడుగాడిని! మరేమవుతాను?"

వాడి సమాధానం విన్న నమితకు హార్ట్ ఎటాక్ వచ్చినంత పనయింది. తన మావగారి పల్లెటూరి మాటలు పట్టుకున్నాడు నీపు. ఆయన వీడిని "మనవడు గాడూ! మనవడుగాడూ!"


**ఒడియా మూలం**
**డా॥దీప్తి పట్నాయక్**

**తెలుగు అనువాదం**
**మహీధర రామశాస్త్రి**

అంటుంటారు. ఇక్కడ అంతా దొరల వ్యవహారం. వీడి మాటలు విని వీరెలా స్పందిస్తారో...

ఆ కుర్ర టీచరు చిన్నగా నవ్వుకుని, తిరిగి ఒడియాలోనే అడిగింది.

"నీకు పాటలు వచ్చా?"

"ఆఁ...ఆఁ...! చాలా పాటలు వచ్చు. రైమ్సు చెప్పనా? పుస్సీ క్యాట్! పుస్సీ క్యాట్! జాక్ ఎండ్ జిల్, హమ్టీ డమ్టీ ట్వింకిల్...ట్వింకిల్, ఇన్సీ ఉయిన్సీ స్పైడర్, ఇలా చాలా పాటలు వచ్చు. దేన్ని పాడను..."

ఆ కుర్ర టీచరు ధనస్సులా వున్న పల్చటి భృకుటిని ఎగరేసి, నవ్వుతూ అంది "వావ్! చూడ బోతే నువ్వు చాలా గుడ్‌బాయ్‌లా ఉన్నావే! ఒడియా పాటలేం నేర్చుకోలేదా?"

"చాలా వ...వ..." నీపు తల ఎగరేశాడు.

ఓరి బాబోయ్...ఈ సారి గండం గడి చింది. పక్కా ఆంగ్ల మాధ్యమం స్కూలు. అందునా క్యాథ లిక్ నన్స్ నడుపుతున్న స్కూలు. వీళ్లు ఒడి యాలో అడుగుతున్నారేంటి? బొమ్మలు చూపించీ, సీ.డీ. వేసి, రాత్రంతా నిద్ర పోకుండా పది రైమ్సు... హిందీలో అడుగుతారేమోనని, "మచిలీ జల్‌కీ రాణీహై!" కూడా నేర్పించింది. వీళ్ళు ఒడి యాలో అడుగుతున్నారు. నమిత భర్త మొహంలోకి చూసింది. నిశికాంత్ మొహం కూడా వివర్ణమైంది.

"సరే పాడు..."

నమిత ఆశ్చర్యపడేలా నీపు పాటను అందు కున్నాడు. "చందమామ రావే, జాబిల్లి రావే, పాల గిన్నె తేవే, మా పాపాయికిచ్చి పోవే!"

ఆ అయిదుగురు ముక్తకంఠంతో అన్నారు "వావ్...వావ్...చాలా బాగా పాడుతున్నావ్... అంశుమన్... వెరీగుడ్!"

నీపు ఆ ప్రశంసకు మరింత ఉత్సాహంతో కుర్చీమీద సర్దుకుని కూర్చుని ఇంకా ఎవరూ ఏమీ అడక్కుండానే చెప్పుకు పోయాడు..."ఇంకా తెలుసు, కొళా కళేబరొ కన్నేయి... ఆహె దయామయ, బిశ్వబిహారీ, ఇంటికిలి మిటికిలి...పాడనా?"

ఆశ్చర్యంగా టీచరు కూడా ఒడియాలో అడిగింది..."అచ్చా... అంశుమాన్, ఇంత చక్కని పాటలు ఎవరు నేర్పారు? మీ అమ్మగారా..., నాన్న గారా?"

ఏమాత్రం భయపడకుండా, శ్రీమాన్ అంశు మాన్‌గారు జవాబిచ్చారు... "మమ్మీ రైమ్సు నేర్పు తుంది, రంగులు బోధిస్తుంది. పక్షుల్ని జంతువుల్ని ఇంగ్లీషులో ఏమంటారో చెబుతుంది. డాడీ కేవలం



పేపరు చదువుకుంటారు. పుస్తకాలు పట్టుకుని కాలేజీకి వెళ్ళిపోతారు. ఏమీ కూడా నేర్పరు నాకు. నాయనమ్మ నా దగ్గర ఉన్నప్పుడు ఆటలాడించి, చందమామను చూపించి, పాటలు నేర్పుతుంది"

"మీ మామ్మకి నువ్వేమవుతావు?" అంటూ సిస్టరు మార్గరెట్ పక్కా ఒడియాలో అడిగింది.

"ధనొ (ఐశ్వర్యం)" ఠకీమని జవాబిచ్చాడు. అందరు నవ్వుకుని నీపూని మెచ్చుకుంటూ వెళ్ళిరా అని పంపించారు.

గదిలోంచి బయటకు రాగానే నమిత విరక్తిగా "నడవండి" అంది. ఆమె వస్తూ తన సర్టిఫికెట్లు పట్టుకొచ్చింది. నిశికాంత్ కూడా ఏవో కాగితాలు తీసుకొచ్చాడు. ఇతర స్కూళ్ళలో తల్లిదండ్రులకు

కూడా ఇంటర్వ్యూ ఉంటుంది. ఇక్కడ తమను ఒక్కమాట కూడా అడగలేదు. ఇప్పటికి మూడు స్కూళ్ళలో విఫల ప్రయత్నం చేసారు. "ఎక్కడా ఎవరూ ఒడియాలో అడగలేదు. ఇక్కడ కేవలం ఫెయిలు చేయాలని నీపూని ఒడియాలో ప్రశ్నించారు. అందుకే వాడిని అడగాల్సినవి అడగలేదు. అంతా రాజకీయం. దీని వెనకాల చాలా వ్యవహారం ఉంది. ఇక్కడి ప్రిన్సిపాలు చాలా స్ట్రిక్టు అన్న అబద్ధపు ప్రచారం సాగుతూంది" నమిత గొణుక్కుంది.

అన్యమనస్కంగా నడుస్తూన్న నశికాంత్ "ఏమిటా మాటలు?" అన్నాడు.

నమితకు ఈ ప్రపంచమంతా విషపూరితంగా కనుపించింది. ఆమె కోపంగా అంది..."నీకెందుకు? నీకు కాలేజీ, ట్యూషన్లు, పుస్తకాలు, స్నేహితులు వుంటే చాలు, నీకంతా బాగానే ఉంటుంది. కుర్రాడు ఎక్కడ చదువుతున్నాడు అన్నది నీకు పట్టదు. ఇక్కడ నిష్పక్షపాతంగా అడ్మిషన్లు ఉంటాయని అందరు అన్నారు. అదంతా వట్టి అబద్ధమని నీకు అనిపించడం లేదా? సీట్లన్నీ పెద్దవాళ్ళ పిల్లల కోసం రిజర్వు చేసి ఉంటారు. లేదా అమ్ముకుందుకు దాచుకుని ఉంటారు. కాకపోతే ఇంగ్లీషు మీడియం స్కూల్లో ఇంటర్వ్యూ చేసే పద్ధతి ఇదేనా? నేను వదలను. ఈసారి ఇంకా బాగా తయారు చేసి తీసుకొస్తాను. నీపూనూ సెంట్ పీటర్స్‌లో జేరుస్తాను. అవసరమైతే నేనే స్పోకెన్ ఇంగ్లీషు కోర్సు చేస్తాను. నేనేమీ చదువులో వెనకబడిన దానను కాదు. మేం ఆరుగురం సంతానం కాబట్టి ఆ రోజుల్లో మా ఊళ్ళోని గంగాధరం పాఠశాలలో చదువుకున్నాం. నా కొడుక్కేం తక్కువ! మనకు వాడొక్కడే! వాణ్ణి ప్రయోజకుడిని చేయాలి. అందుకోసం వాడిని ప్రారంభం నుంచీ మంచి స్కూల్లో చదివించకుంటే వాడి పునాది దెబ్బ తింటుంది" నమిత ప్రతిజ్ఞ చేసింది.

ఆమె ముఖాన్ని చూసిన నిశికాంత్ దీర్ఘంగా నిట్టూర్చేడు. పాపం తను గత నాలుగు మాసాలుగా రాత్రీ పగలు కష్టపడి నీపూని తయారు చేసింది. సావిట్లో నాలుగు వైపులా బొమ్మల పుస్తకాలు... గోడలన్నీ చార్టులు – ఈ చదువులో నీపూ సగం అయ్యాడు. అయినా, మూడుచోట్ల సీటు దొరకలేదు. ఒక చోట 'డీర్' అనడానికి 'గోట్' అన్నాడు. ఒక చోట ఆకాశం రంగు చెప్పలేక పోయాడు. మరొక చోట కైట్‌ని చూసి క్రో అన్నాడు.

ఈ ఇంటర్వ్యూలు కాదు కానీ, పిల్లలకు పెద్దలకు నెల రోజులుగా ఇళ్ళలో ఒకటే బుర్రకథ! విరక్తి చెంది, డొనేషను కట్టి మంచి స్కూల్లో వేద్దామంటే, యాభైవేలు కట్టాలన్నారు. కట్టలేక ఇంటి దారి పట్టేరు. నిశికాంత్ నమితకు ఓ సలహా ఇచ్చాడు..."మన వీధిలో వున్న నర్సరీలో పడేద్దాం. ఇంక ఎంతని కష్టపడతావు? ఇప్పటికే నీరసించి, నీ మెడ గూళ్ళు బయట పడ్డాయి"

నమిత గంభీరంగా అంది – "అక్కడి అమ్మాయిలందరు ఒడియా మీడియం నుండి వచ్చిన వారే. వాళ్ళేం చదివిస్తారు? నేను 'లిటిల్ ఫ్లవర్' లో ప్రయత్నిస్తాను. అక్కడ క్రొత్తగా ఓ ప్రిన్సిపాలు వచ్చారు. చాలామంచి మనిషని విన్నాను. చూద్దాం ఏమవుతోందో..."

"ఆ 'లిటిల్ ఫ్లవర్' నుంచి తిరిగివస్తున్నప్పుడే నిశికాంత్ అన్నాడు.."ఇంకా ఏం చదివిస్తావు? మన నీపు అన్నింటికీ చక్కగా జవాబు లిచ్చాడు. స్మార్ట్‌గా లోపలికి వెడుతూ, గుడ్ మార్నింగ్ అన్నాడు. థాంక్యూ అన్నాడు బయటకు వస్తూ. ఎంతో మధురంగా బై కూడా చెప్పాడు"

నమిత ఈ మాటకు జవాబు చెప్పలేదు.

దారిపొడవునా నీపు ఒకటే సతాయింపు "మమ్మీ వాటరు బాటిలు ఎప్పుడు కొనిపెడతావు?" అంటూ. కానీ వాడిగోల ఎవరూ పట్టించుకోలేదు.

వారిద్దరినీ ఇంటి వద్ద దిగబెట్టి నిశికాంత్ కాలేజీకి వెళ్ళిపోయాడు. తాళం తీసుకుని ఇంట్లోకి ప్రవేశించే సరికి మధ్యాహ్నం ఒంటిగంట అయింది. ఇంతవరకూ ఉత్కంఠతో ఆకలి, దాహం సంగతే మరచిపోయారు. నిశికాంత్ అభోజనంగానే కాలేజీకి వెళ్ళిపోయాడు. పిల్లాడు సైతం ఉదయం బ్రెడ్డు ముక్కలు తిన్నాడు అంతే. మంచినీళ్ళు కూడా త్రాగలేదు, ఇంతవరకూ. నమిత నీపు చేతిలో బిస్కట్టు పెట్టి బట్టలు మార్చుకుని వంట యింటిలోకి ప్రవేశించింది.

అరగంటలో అన్నం, పప్పు, చేపల కూర కంచంలోకి తీసుకుని కొడుక్కి తినిపిద్దామని డైనింగు టేబిలు దగ్గరకు వచ్చేసరికి, నీపు ఎదురుగా వున్న పూల మొక్క దగ్గరకూర్చుని పట్టిపట్టి చూస్తూ కనిపించాడు. తల్లి పిలుపు వినబడలేదు వాడికి. నమిత వాడి చేయి పట్టుకునే సరికి, చైతన్యం వచ్చింది. అమ్మా! ఆ ఉడుత ఎలా తింటుందో చూడు. ఆ మొక్క రంగు ఆకుపచ్చ- ఎరుపు రంగులో ఉంది కదా?" వాడు మాట్లాడుతూనే ఉన్నాడు.

ఉదయం నుంచీ ఉపవాసంలోవున్న తనను సంతోష పరచడం కోసం, నీపు ఆంగ్ల పదాలను ఉపయోగించడం చూసిన ఆమె కళ్ళు చెమర్చాయి. నమిత తనను తాను తిట్టుకుంది. తనెంత స్వార్థపరురాలు? తను ఆశలు పెంచుకుని చంటాడిని ఎంత కష్టపెట్టింది? వాడి కోమలమైన కలల ప్రపంచం నాశనమైపోతూంది. ఆంగ్లమాధ్యమంలో చదువుకోకపోతే ఏమవుతుంది? హాయిగా తిని, త్రాగి ఆట పాటలతో పెరిగి పెద్దవాడైతే చాలు. అమ్మనాన్నలతో గడిపే బాల్యం సుఖమయం, మధుమయంగా సాగాలి. ఈ దేశంలో ఎంతో మంది వీధి అరుగుల మీద చదువుకుని, చాలా పెద్దవాళ్ళయినారు. మన ప్రధాని మన్‌మోహన్‌సింగ్ అటువంటి వారిలో ఒకరు!

"నిశికాంత్ చెప్పినట్టుగా, సోమవారం ఇంటికి దగ్గరగా వున్న నర్సరీలో వేస్తాను. దగ్గరగా వుంటే మరింత నిశ్చింత. వెళ్ళడాలు తీసుకురావడాలు గోడవ ఉండదు!"

'నీపూ' కి యింతపెట్టి, పడుకోబెట్టాక, తను తిని కొడుకుని పక్కలో వేసుకుని రెండు గంటల సేపు తృప్తిగా పడుకుంది నమిత. అయిదు గంటలకు కొడుక్కి పాలిచ్చి బట్టలువేసి, తను కూడా అందంగా తెమిలి బయటకు వచ్చేసరికి నిశికాంత్ వచ్చేశాడు. ఇంట్లోని ప్రశాంత వాతావరణానికి ముగ్ధుడయ్యాడు. గత నాలుగు మాసాలుగా పిల్లాడి చదువు సంధ్యల గురించి కొంపలో తిరస్కార ఛీత్కారాలతో మేడమ్‌గారి అరుపులు, కన్నీళ్ళతో గొడవ గొడవగా ఉంటూంది.

నాలుగు వేడి వేడి పుల్కాలు బంగాళాదుంప కూరతో ఆమ్లెట్టుతో సర్ది టేబిలు మీద పెట్టేసరికి నిశికాంత్ సంతోషించాడు.

"ఏవిటలా చూస్తున్నారు? త్వరగా తెమలండి. ఉదయం నుంచీ ఏమీ తినలేదు మీరు. భోంచేసి రెస్టు తీసుకోండి. నేను నీపు అలా పార్కుకేసి వెడుతున్నాం. వాడు పార్కులో ఆడుకుని ఎంత కాలం అయిందో!"

నిశికాంత్ ఈల వేసుకుంటూ హుషారుగా బాత్‌రూమ్‌లోకి దూరాడు. "హమ్మయ్య... నా పుస్తకాలను నేను చదువుకోవచ్చు హాయిగా" అనుకున్నాడు.

ఆ మర్నాడు ఉదయాన్నే నిశికాంత్‌తో నమిత అంది – "నీపూని మన వీధిలోవున్న నర్సరీలో జేరుస్తాను" అని.

సంతోషంగా నిశికాంత్ అన్నాడు – "నడవండి... ఇవేళ 'టిన్ టిన్' సినిమాకి వెడదాం. హాల్లో సినిమా చూసి చాలా కాలం అయింది"

★ ★ ★

నీపూని టీవీ ముందు కూర్చోబెట్టి, నమిత నలుగురయిదుగురు మిత్రులకు ఫోన్లు చేసి, మంచం మీద నడుము వాల్చిందో లేదో తలుపు చప్పుడైంది. తలుపు తెరవగానే, నిశికాంత్ తోసుకుంటూ లోపలకు వచ్చాడు. తనకు కన్నుగీటుతూ అన్నాడు "నీకో శుభవార్త! ఏమిటో చెప్పుకో చూద్దాం"

"సినిమా టిక్కెట్లు దొరికి ఉంటాయి!"

"కాదు మేడమ్! ఇంకా చాలా మంచి కబురు! ఇవాళ సిస్టర్ మార్గరెట్ ఫోను చేసి నన్ను పిలిచారు. ఆమె ఏమన్నారో తెలుసా? తొంభై అయిదుగురు పోటీ పడ్డ ఇంటర్వ్యూలో అంశుమాన్ ప్రథమ స్థానంలో వచ్చాడని చెప్పారు. వచ్చే సోమవారం నుంచి అంశుమాన్‌ని స్కూలుకి పంపించమని కూడా అన్నారు. నేను నమ్మలేక కళ్ళప్పగించి చూస్తూ నిలబడ్డాను. వెళ్ళండి... రేపే జాయిను చేయండి అన్నారు. అందుచేత మేడమ్! నీకు అభినందనలు" అన్నాడు నిశికాంత్.

మంచం మీద విస్తుపోయి కూర్చుండి పోయిన నమితతో తిరిగి నిశికాంత్ మళ్ళీ అన్నాడు... "నిజం! మార్గరెట్‌గారిని మనం చాలా అపార్థం చేసుకున్నాం. ఆమె చాలా అసాధారణ మహిళ! ఇంగ్లాండులో పది సంవత్సరాలు ఉండి, అక్కడే చదువుకున్నారుట. అయితే, ఆమె తన మాతృభూమినీ మాతృభాషనూ మరచిపోలేదు"

నమిత సంతోషంగా లేచి, "నీపూ ఎక్కడ?" అంటూ వెదికింది. నీపు మల్లెపొదల మీద కూర్చున్న ఓ పసుపు పచ్చని సీతాకోకచిలుకను చూస్తున్నాడు. దాని రెక్కలు ఎర్రని మచ్చలతో అందంగా ఉన్నాయి. తదేకధ్యానంతో ఆ సీతాకోక చిలుకనే చూస్తున్నాడు నీపు. ఏమీ మాట్లాడుకుండా కొడుకుని దగ్గరగా తీసుకుని గుండెలకు ఆదుముకుంది నమిత.

"మమ్మీ చూసేవా? ఎంత అందంగా ఉందో ఈ ఎల్లో సీతాకోకచిలుక... సీతా - బటర్‌ప్లై - దాని రెక్కలు రెడ్ ఎండ్ బ్లాక్ రంగులో ఉన్నాయి!"

నమిత నవ్వాపుకుంటూ అంది..."ఔను నాన్నా...ఎంతో అందమైన సీతాకోక చిలుక. దాని రెక్కలమీద ఎర్రని, నల్లని మచ్చలున్నాయి"

తల్లీకొడుకుల మాటల మధ్య సీతాకోక చిలుక... రెక్కలాడించుకుంటూ ఎటో ఎగిరి పోయింది.

అది శివరాత్రి నెల. ఎందుకో... ఏమిటో విషయం తెలియదుగానీ, మహాశివుడు మహాకోపాగ్నుడై శివతాండవం చేస్తూ తన మూడో కన్ను తెరిచేసాడు. శివుడు భోళా శంకరుడం టారు. ఆనందం కలిగితే పరవశుడై వెనుకా ముందు చూడకుండా వరాలు ఎలాగిస్తాడో... కోపం వస్తేకూడా ఏమాత్రం ఆలోచించకుండా తన మూడో కంటితో భస్మం చేసేస్తాడు. అటువంటి శివుని కోపానికి ఇప్పుడు ఈ భూమండలమంతా ప్రచండ అగ్నిహోత్రానికి మాడి మసైపోతోంది. చెట్లు, పుట్టలే కాదు, మనుషులు, పశుపక్ష్యాదుల నుండి అనంత జీవ కోటి వరకు...నదులనుండి మహా సముద్రాల వరకు ఇంకిపోయి, మాడి మసైపోయి కుప్పంతా గాలిలో కల్సిపోయింది.







# తర'గని' ముద్ద




కానీ...

చాలాచోట్ల అంతెత్తున జిగురు జిగురులాంటి ముద్దలు గుట్టలుగా, కుప్పలుగా శివుని మూడో కంటికి సైతం ఏమాత్రం చలించకుండా నిలబడి వుండడం శివునికి మరింత ఆగ్రహానికి గురిచేసింది.

"ఏమీ! నా మూడోకంటి ధాటికి కూడా ఇవి మాడి మసవ్వకుండా నిలిచి ఉండుటయా?.. ఎంతటి అవమానం..ఎంతటి అవమానం?...నన్ను పరాభవం చేయడానికి సృష్టికర్త అయిన బ్రహ్మ దీనిని సృష్టించి వుంటాడు. ముందు అతని భరతం పట్టాలి" అని కోపంతో ఊగిపోతూ– "ఓ బ్రహ్మ దేవా!" అంటూ పిలిచినట్లు అరిచాడు మహ శివుడు.

అసలే శివుడు మూడో కన్ను తెరిచాడని తెలియగానే సృష్టికర్త అయిన బ్రహ్మ సైతం భయంతో వణికిపోతూ రక్కున శివుని ముందు ప్రత్యక్ష మయ్యాడు బ్రహ్మ, తాను ఏమాత్రం ఆలశ్యం చేసినా శివుడి ఆగ్రహజ్వాలలకి బలవ్వాల్సి వస్తుందే మోనని.

"ఏం బ్రహ్మదేవా! సృష్టికర్తవు నీవే కదా!... నా మూడో కన్ను ధాటికి సైతం భస్మం కాకుండా వుండే ఈ జిగురు లాంటి పదార్థాన్ని ఎందుకు నువ్వు సృష్టించావు? ఇది నువ్వు నన్ను అవమానించడానికే కదూ..." కోపంతో అరిచాడు మహ శివుడు.

"శివ.. శివా!... ఎంతటి మాటన్నావు మహాశివా!... లోక సంరక్షణార్థం గరళాన్నే గొంతులో దాచుకున్న మహాత్యాగివి నీవు... అంతటి మహోన్నతుడివైన నిన్ను, నేను పరాభవం చేయడానికి ప్రయత్నించడమా? శాంతించు స్వామీ శాంతించు...ఈ జిగట పదార్థాన్ని నేను సృష్టించ లేదు. దీనిని నేను కూడా ఇప్పుడే చూస్తున్నాను" భయంతో చెప్పాడు బ్రహ్మదేవుడు.

"మరి... ఇది ఎవరి పనై ఉంటుంది? ఒక వేళ మనిద్దరి మధ్యా కయ్యం పెట్టడానికి విష్ణుమూర్తి పెట్టిన పితలాటకం కాదు కదా" అంటూ మహాశివుడు "శంఖు చక్రధరా!" అంటూ విష్ణుమూర్తిని గట్టిగా పిలిచాడు కోపంతో.

విష్ణుమూర్తి వెంటనే ప్రత్యక్షమయ్యాడు. శివుడు విషయం చెప్పి కారణమడిగాడు.

"ఓహో శంకరా! ఎంతమాట అన్నావు? నా అనుంగ మిత్రుడివైన నిన్ను నేను అవమానపరచే ప్రయత్నం చేయడమా? నిన్ను అవమానపరిస్తే, నన్ను నేను అవమాన పరుచు కున్నట్లే కదా!... త్రిమూర్తులమైన మన స్నేహాన్ని చూసి గిట్టనివాళ్ళు ఎవరో పన్నిన పన్నాగము వలే తోస్తున్నది" అన్నాడు విష్ణుమూర్తి సందేహంగా.

"సర్వలోకాలకూ అధిపతులమైన మన ముగ్గురమూ కాకుండా ఇంకెవరు ఈ సాహసానికి ఒడి కట్టగలరు?" బ్రహ్మను, విష్ణుమూర్తిని మార్చి మార్చి అనుమానంగా చూస్తున్న మహాశివుని మాటకు విష్ణుమూర్తి అడ్డుతగులుతూ–

"శాంతించు మహాశివా! శాంతించు!!... దీని

చింతపాక ప్రకాష్

కి ఒకే ఒక ఉపాయం ఉన్నట్లు తోస్తోంది. సర్వలోక సంచారి అయిన నారదుడ్ని పిలిచి అడిగితే విషయం మొత్తం తెలుస్తుంది" సలహా ఇచ్చాడు.

వెంటనే నారదుణ్ని పిలిచాడు మహాశివుడు.

నారదుడు వెంటనే అక్కడ ప్రత్యక్షమవ్వడమే ఆలస్యం "ఏమిటి స్వామీ మీ హఠాత్ పిలుపుకు కారణం?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించడం తోపాటు, అక్కడ జరిగిన విలయాన్ని చూసి ఆశ్చర్య పోయాడు. త్రిమూర్తులంతా అక్కడే ఉండడంతో మరింత ఆశ్చర్యపోయాడు.

"త్రిమూర్తులారా! ఏమిటీవిలయం? దీనికి కారణం ఏమిటీ?" అని అడిగాడు.

"అదే.. నిన్ను అడిగి తెల్సుకుందామని పిలిస్తే, ఏమీ తెలియని అమాయకుడి మల్లే మాట్లాడుతున్నావేమిటీ?' కోపంతో బుసకొట్టాడు మహాశివుడు.

"నారాయణ.. నారాయణ! కలహభోజుడ్నే కానీ, ఈ విలయానికి నాకు ఎటువంటి సంబంధం లేదు స్వామీ!" భయంగా చెప్పాడు నారదుడు.

"నేనంటుంది... ఈ విలయానికి కారణం కాదు! నేను మూడోకన్ను తెరిస్తే ఎటువంటివైనా భస్మీపటలం అవ్వాల్సిందే కదా...! మరి, ఈ జిగురులాంటి ముద్దల గుట్టలు ఏమిటీ? మసికాకుండా గుట్టలు గుట్టలుగా నన్ను వెక్కిరిస్తున్నాయి. నన్ను అవమానించడానికి ఎవరు పన్నిన పన్నాగమిది? సృష్టికర్త అయిన బ్రహ్మని అడిగితే నేను సృష్టించలేదంటున్నాడు. జగన్నాథ సూత్రధారి అయిన హరిని అడిగితే నాకు తెలియదంటున్నాడు. వీరెవరూ కాకపోతే అంత ధైర్యంచేసే వారెవరు? లోకసంచారివి కదా నువ్వు నీకు తెలుస్తుందని నిన్ను అడుగుతున్నాను!" విషయాన్ని సూటిగా చెప్పాడు పరమశివుడు.

"ఓహో అదా!...మానవుడ్ని బ్రహ్మ సృష్టిస్తే, మానవుడు వీటిని సృష్టించాడు స్వామీ!" చెప్పాడు నారదుడు.

"ఎట్టెట్టా! ఒక సాధారణమైన మానవుడు వీటిని సృష్టించడమా?" బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ ఒకేసారి ఆశ్చర్యపోయారు.

"అవును స్వాములు! వీటిని 'పాలిథిన్ కవర్లు' అనే నామధేయముతో పిల్చుకుంటారు మానవులు. ఒకప్పుడు బజారుకెళ్ళి సరుకులు తెచ్చుకోవడానికి మానవులు తాటాకు బుట్టలో, నార, గుడ్డ సంచులో వెంట తీసుకు పోయేవారు. ఇప్పుడు ఆధునిక




మానవుడు చాలా చవక ధరలో వీటిని సృష్టించి వదిలాడు స్వామి?. అంతే! ఈ రోజు బజారుకెళ్ళే ఏ మానవుడూ ఏ సంచి పట్టుకెళ్ళకుండా ఏ సరుకు కొంటే ఆ కొట్టువాడు ఉచితంగా ఈ కవర్లు ఇస్తుండడంతో... ఒకొక్క మనిషి చేతిలో ఎన్ని కొంటే అన్ని కవర్లు వుంటున్నాయి.

అలా వాడిపారేసిన కవర్లు కరిగితే కరగవు...భూమిలో కలవవు. అలా పేరుకుపోయిన గుట్టలే మీ ధాటికీ కరగని ఈ ముద్దలు స్వామీ. దేవతలు అమృతం తాగి చిరంజీవులైయ్యారు. కాని ఈ కవర్లు ఏమీ తాగకుండానే చిరంజీవులుగా నిలిచాయి స్వామీ...అదీ వాటి గొప్పతనం" విడమరచి చెప్పాడు నారదుడు.

"ఒహో!... మానవుడ్ని దేవుడు సృష్టిస్తే, ఆ దేవుడి శక్తికంటే మానవుడి మేథాశక్తి దాటిపోయిందా?" ఏమీ వైపరీత్యమూ!!?" అని ఆశ్చర్యంతో ముక్కున వేలేసుకున్నారు ఆ త్రిమూర్తులు.

"విశ్వ సమ్మానంబు వెలయు నోబెలు కీర్తి / రంగమెక్కినది మా వంగ సుకవి" అని జాషువా ప్రశంశలందుకొన్న మహాకవి రవీంద్రనాధ ఠాగూర్. ఠాగూర్ బహుముఖ ప్రజ్ఞాశాలి. బహుభాషా కోవిదుడు. ఆయన కథలు రచించాడు, కవితలు అల్లాడు, నాటకాలు రూపొందించాడు, వ్యాసాలు విరచించాడు, శాంతినికేతనం స్థాపించి ఆదర్శప్రాయమైన విద్యాభ్యాసానికి శ్రీకారం చుట్టిన మహానుభావుడు. భారతదేశం పక్షాన సాహిత్యంలో నోబెల్ పురస్కారం పొందిన ఏకైక కవి. ఆయన రచనల్లో 'గీతాంజలి' కి విశ్వ పురస్కారమైన నోబల్ బహుమతి దక్కింది. 'గీతాంజలి' ప్రపంచంలోని పలు భాషల్లోకి అనువదించబడింది. తెలుగు కవులు, రచయితలు కూడా చాలామంది 'గీతాంజలి'ని పలు రీతుల్లో అనువదించారు. 'గీతాంజలి'కి ఇప్పటి వరకు తెలుగులో 50కి పైగానే అనువాదాలు వచ్చినట్లు తెలుస్తున్నది.




# ముక్వల 'గీతాంజలి' అనువాదం

## ఒక పరిశీలన

**రవీంద్రుడు** క్రీ.శ.1861 మే 7వ తేదీన జన్మించాడు. ఈయన తల్లి శారదాదేవి. తండ్రి దేవేంద్రనాధ ఠాగూరు. 1873 నుంచి రవీంద్రుడు రచనలు ప్రారంభించాడు. ఈయన మొదటి పద్య కావ్యం 1878లో ప్రచురితమైంది. 'గీతాంజలి' కి నోబెల్ బహుమతి 1913 నవంబరులో వచ్చింది. అంటే విశ్వకవి రవీంద్రుడు నోబెల్ పురస్కారం అందుకొని వంద సంవత్సరాలైంది. అయినా ఆ కావ్యం నవనవోన్మేషంగా ఇప్పటికీ పలు భాషల్లోకి అనువదించబడుతూనే ఉంది. అందుకే 'గీతాంజలి' సార్వకాలికం...సార్వజనీనం...!

డా॥ గుమ్మా సాంబశివరావు,

'గీతాంజలి' కి తెలుగులో ఇటీవల వచ్చిన అనువాదాల్లో ముక్వల సుబ్బరామయ్య రచన ఒకటి. ముక్వల సుబ్బరామయ్య దుర్గాంబ, పెరుమాళ్ళు దంపతులకు 16-8-1956న విజయవాడలో జన్మించారు. ముక్వల పెరుమాళ్ళు 'జయంతి పబ్లికేషన్స్' పేరుతో అనేక పుస్తకాలను అందుబాటు ధరలలో ముద్రించిన సాహిత్యాభిమాని. సుబ్బరామయ్యకూడా తండ్రి అడుగుజాడల్లో నడుస్తూ, సాహిత్య రచన చెయ్యటం సంతోషించదగిన అంశం. ప్రచురణ కర్తగా, రచయితగా పలువురు రచయితలతో ప్రత్యక్ష పరిచయమున్న వ్యక్తిగా సుబ్బరామయ్య ప్రసిద్ధుడు.




ముక్వల సుబ్బరామయ్య 'గీతాంజలి'ని అనువదించటానికి గల కారణాల్ని ఏమీ తెలపలేదు. ఆయనతో ముఖాముఖి జరిపినప్పుడు "ప్రపంచ ప్రసిద్ధి పొందిన రచనను తనదైన రీతిలో రచిస్తే బాగుంటుందని ఒక ప్రయత్నం చేశా"నని వినయంగా చెప్పారు. రవీంద్రుడు తన మాతృభాష బెంగాలీలో ముందుగా 'గీతాంజలి' రచించాడు. తర్వాత దాన్ని తానే ఆంగ్లీకరించాడు. ఆంగ్లానువాదానికే నోబెల్ బహుమతి లభించింది. సుబ్బరామయ్యకు, రవీంద్రుని 'గీతాంజలి' ఆంగ్లానువాదమే మూలాధారమని చెప్పాలి. సుబ్బరామయ్య అనువాదం 2012లో మొదటిసారి ముద్రితమైంది.

సుబ్బరామయ్య తెలుగు భాష మీద మంచి పట్టు సాధించినవాడు కావటంతో వినసొంపైన పదాల్ని లయాత్మకంగా పొందుపరచాడు. ఠాగూర్ మొట్ట మొదటి కవిత "Thou host made me endless / such is thy pleasure / This final vessel thou emptiest again and again / and fillest it ever with fresh life " అని ప్రారంభమైంది. ఈ భావాల్ని సుబ్బరామయ్య,"నువ్వు నన్ను మృదువుగా సృష్టించావు. అది నీకు విలాసం / మృదు మధురమైన ఈ జీవన పాత్రికను నీవు నిత్యం / ఖాళీచేసి, నిరంతరంగా క్రొంగొత్త జీవనంతో నింపుతుంటావు" అని అనువదించాడు. endlessకు మృదువుగా అనే పదాన్ని అనువాదకుడు ప్రయోగించాడు. మిగిలిన భావమంతా మూలానికి తగిన రీతిలోనే సాగింది. నాల్గవ కవితలో ఠాగూర్ life of my life, i shall ever try to keep my body pure, knowing that thy living touch is upon all my limbs.

I shall ever try to keep all untruths out from my thoughts, knowing that thou art that truth which has kindled the light of reason in my mind.

I shall ever try to drive all evils away from my heart and keep my love in flower, knowing that thou hast they seat in the immost shrine of my heart.



9849265025.

ఈ ఠాగూర్ కవితను బాగా పరిశీలించి, అవగాహన చేసుకొని సుబ్బరామయ్య మనోహరంగా ఈ విధంగా అనువదించాడు.

"ప్రాణానికి ప్రాణమా! / నా సజీవ స్పర్శ నా సమస్తావయవాలలో, ప్రసరిస్తుందనే తెలివితో, నా దేహాన్ని / దేవాలయంలా పవిత్రంగా ఉంచుకోవడానికి / ప్రయత్నిస్తాను.

నా మనోమందిరంలో హేతుజ్యోతిని వెలిగించిన / సత్యానివి నీవని తెలిసి అసత్యాన్ని దరికి రానీయక / అల్లంత దూరాన ఉంచుతాను.

నా హృదయాంతరంగమున నీ పీఠం ఉన్నదని / ఎరిగి, ఏ దుష్టత్వాన్నీ దరి చేరనీయక / నా హృదయాన్ని నిరంతరం నవ వసంత ప్రేమా రామంగా చేసుకుంటాను.

నేను చేసే ప్రతికార్యంలో నీవే ప్రతిఫలించాలని / నా ఆకాంక్ష. నీవు ప్రతిఫలిస్తేనే నాకు ఏ / పనిలోనన్నా శక్తి చేకూరేది" మూలభావాన్ని పదిలంగా అనువాదంలో పొందుపరచిన సుబ్బరామయ్య ప్రయత్నం ప్రశంశనీయం.

ఆరో గీతంలో ఠాగూర్ "Pluck this little flower and take it. Delay not. / I fear lest it drop and drop into the dust" అని రచించగా సుబ్బరామయ్య మూల విధేయంగా "ఈ చిన్ని పూవును కోసివేయి జాగుచేయక / రాలి పోయి ధూళిలో కలిసి పోతుందని నా భయం" అని రచించాడు.

పదహారో గీతాన్ని ఠాగూర్ " I have had invitation to this world's festival and thus my life has been blessed. My eyes have seen and my ears have heard " అని ప్రారంభించగా సుబ్బరామయ్య "ఈ విశ్వ మహోత్సవానికి / నాకు ఆహ్వానం వచ్చింది/ నా జీవితం ధన్యమైనది / నా కళ్ళు ఉత్సవాన్ని చూశాయి / నా చెవులు కోలాహలాన్ని విన్నాయి" అని రచించాడు. నా కళ్ళు ఉత్సవాన్ని చూశాయి, నా చెవులు కోలాహలాన్ని విన్నాయి అనటం ద్వారా అనువాదకుడు తన భావానికి మరింత పదును పెట్టినట్లయింది. మూలంలోని ఉత్సవాన్ని, కోలాహలాన్ని సందర్భోచితంగా అనువాదకుడు ప్రవేశ పెట్టడం సముచితంగా ఉంది.

పంథొమ్మిదో గీతంలో ఠాగూర్ భావాలకు సుబ్బరామయ్య "నీవు నాతో పలకక పోతే / నీ మౌనంతో నా హృదయ పాత్రికను / నింపుకుని ఓర్పు కుని భరిస్తాను / తారలతో నిండిన రాత్రి / సహనంతో బరువుగా తలవంచి / ఉదయం కోసం నిరీక్షించినట్లు / నీ కోసం నేను వేచి ఉంటాను" అని చక్కగా రచించాడు. మౌనంతో హృదయపాత్రికను నింపుకోవటం మంచి భావన. మూలానికి తగిన రీతిలోనే అనువాదకుడు రచించటం మెచ్చుకోదగిన విషయం. "head bent with low" అనేదాన్ని నిరీక్షించినట్లు అని మార్చటం కూడా బాగుంది.

గీతాంజలి లోని 35వ గీతం అందరికీ బాగా పరిచయమైందే. పలు సభల్లో వింటూ ఉంటాం. ప్రార్ధనా గీతంగా పాడుకుంటాం.

"Where the mind is without fear and the head is held high / Where the knowledge is free / Where the world has not been brokenup in to fragments by narrow domestic walls" అంటూ సాగిన గేయాన్ని మువ్వల సుబ్బరామయ్య అల్పాక్షరాల్లో అనల్పార్థ రచనగా ఈ విధంగా రచించాడు.

"ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో / ఎక్కడ మనుషులు సగర్వంగా తలలెత్తి తిరుగుతారో / ఎక్కడ విజ్ఞానం వెల్లి విరుస్తుందో / ఎక్కడ లోకం ముక్కలు చెక్కలుగా విడిపోదో / ఎక్కడ అగాధమైన సత్యం నుంచి మంచి మాటలు వెలువడతాయో / ఎక్కడ అలుపెరుగని శ్రమ / తన చేతులను పరిపూర్ణతవైపు చాస్తుందో / ఎక్కడ నిర్జీవమైన ఆచారపు ఎడారిలో పరిశుద్ధమైన విజ్ఞాన ప్రవాహం ఇంకిపోదో / ఎక్కడ మనసు / నిరంతరం వికసించే తలపులలోకి / నీచే నడపబడుతుందో / ఆ స్వేచ్ఛాస్వర్గంలోకి / తండ్రీ! నా దేశం మేల్కొనేలా అనుగ్రహించు" అని రచించాడు.

ఈ గేయంలోని భావాన్ని ఒక సామాజిక సందేశంగా గ్రహించవచ్చు. ప్రతి ఒక్కరు ఈ గేయ భావాన్ని అవగాహన చేసుకొని ఆచరిస్తే నిజంగా స్వేచ్ఛాస్వర్గంలోకి ప్రయాణించవచ్చు. వైషమ్యాలు లేని లోకాన్ని నిర్మించవచ్చు. సౌభ్రాతృత్వంతో నిండిన సమాజాన్ని రూపొందించవచ్చు.

ఠాగూర్ 54వ గీతంలో "lanquor is upon your heart and the slumber is still on your eyes" అని రచించగా సుబ్బరామయ్య "నీ హృదయం తూగుతూనే వున్నది / కళ్ళనిండా నిద్రమబ్బులు కమ్ముకునే ఉన్నవి" అని సరళ సుందరంగా అనువదించారు.

59 వ గీతంలో చివరగా ఠాగూర్ The morning light has flooded my eyes this is thy message to my heart. Thy face is bent from above, thy eyes look down on my eyes and my heart has touched thy feet" అని రచించారు. దీని అనువాదాన్ని సుబ్బరామయ్య ఇలా మనోహరంగా కూర్చారు. "ఉదయ కాంతి నా హృదయంలో నిండింది / నా హృదయానికి నీ సందేశం ఇదే / ఉన్నత పథం నుంచి తల వంచి / నీవు నా వంక చూస్తున్నావు / నా కళ్ళలోకి చూస్తున్నాయి నీ కళ్ళు / నా హృదయం నీ పాదాలను తాకింది"

ఠాగూర్ 75వ గీతంలో చివర "From the words of poet men take what meanings please them, yet their last meaning points to thee" అని రచించగా సుబ్బరామయ్య "కవి రచించిన పదాల నుండి / ఎవరికి కావలసిన అర్థం వారు గ్రహిస్తారు / ఆ పదాల పరమార్థం మాత్రం నిన్నే సూచిస్తుంది" అని ప్రశంశనీయంగా అనువదించాడు.

ఠాగూర్ 82వ గీతాన్ని, దానిలోని భావాన్ని చక్కగా గ్రహించిన సుబ్బరామయ్య "ప్రభూ! కాలం నీ చేతులలో అనంతం / క్షణాలు లెక్కించడం ఎవరితరం? / రాత్రులూ పగళ్ళూ గడుస్తాయి / యుగాలు పూలలా వికసించి రాలిపోతాయి / కానీ కాలానికి అతీతంగా ఉండడం నీకు తెలుసు" అని రచించాడు. Days and nights అని మూలంలో ఉండగా 'రాత్రులూ పగళ్ళూ' అనటం "ages bloom and fade like flowers"అని ఉండగా 'యుగాలు పూలలా వికసించి రాలిపోతాయి' అని రచించటం బాగుంది.

చివరి గేయమైన 103 ను ముగిస్తూ ఠాగూర్ "Like a flock of homesick cranes flying night and day back to their mountain nests let all my life take its voyage to its eternal home in one saluation to thee" అని రచించారు.

ఈ భావాన్ని గ్రహించిన సుబ్బరా మయ్య "గూటికి మనసు మళ్ళి / పర్వతాలలో తమ గూళ్ళకు / ఎగిరిపోయే పక్షుల బారులా / నా జీవితం సంపూర్ణంగా / తన శాశ్వత నివాసానికి పయనమై / ఒక్క అభివందనంతో / నీ పాదాలను స్పృశించనీ!" అని రచించాడు.

ఒక అమృత ధారగా, అద్భుత భావ మధురిమగా సాగిన ఠాగూర్ 'గీతాంజలి'ని ఎందరెందరో అనువదించగా. 'నేనుసైతం' అంటూ ప్రయత్నించి ఒక మంచి అనువాదాన్ని అందించిన మువ్వల సుబ్బరామయ్య అభినందనీయుడు.

# మీమాంస

"అనా! దేశదేశాలూ తిరిగినోడివి. ఇల్లూ వాకిలీ, ఊరూ, వాడా, లోకమూ పాపము, పుణ్యమూ అంటావుగదా.. ధర్మమూ, అధర్మమూ, నీతీ, నాయమూ నీకు తెలుసు కాదా. నేనెరిగి మడుసుల్లో నీవే లోకం గుట్టు తెలిసినోడివి" అని ఆగి బీడి ముట్టించాడు బికారి.

అప్పటికి నడిజాము దగ్గరపడుతూ ఉంది. రోడ్డుమీద అప్పుడప్పుడూ వినిపించే వాహనాల శబ్దం తప్ప మనుషుల అలికిడి తగ్గుతూ ఉంది.

బికారి వేసుకున్న బట్టలు రకరకాల రంగులలో ఉన్నాయికాని రోజులతరబడి ఉతక్క మురికి పట్టి ఉన్నాయి. అతడి కుడిచేతి మణికట్టుకి రంగు రంగుల దారాలు చుట్టి ఉన్నాయి. వయసు ముప్పై లోపు ఉంటుంది. పగటిపూట నిరంతరం అతడు రైలు బోగీల్లో పేపర్లూ, పల్లీలూ, బత్తాయిలూ అమ్ముకుంటూ తిరుగుతాడు. స్టేషనులో తిరిగే భిక్షకులు, బైరాగులూ, ముష్టివాళ్ళూ, కుష్టు రోగులూ అతడికి తెలుసు.







బి.అజయ్ ప్రసాద్


92477 33602

**అతడికి** ఎదురుగా కూర్చుని పగలంతా అడుక్కు తెచ్చుకున్న చిల్లరను లెక్కబెట్టుకుంటున్న రామస్వామి ఒంటికన్నుతో బికారివంక విచిత్రంగా చూసాడు. ఒక చెయ్యి నేలమీద ఆనించి మరో చేత్తో బీడిపొగ గాలిలోకి ఒదులుతున్న బికారి తాగి వచ్చాడేమో అన్న అనుమానం కలిగింది.

రామస్వామికి ఒక కన్ను కనపడదు. కుడి కన్ను చింతనిప్పులా తీక్షణంగా ఉంటే ఎడమకన్ను ఆరిపోయిన నిప్పులా ఉంటుంది. అతడి ఒంటిమీద పొడవాటి చేతులచొక్కా మాసిపోయి రంగు తెలి యడంలేదు. ఉదయమనగా నుదుటమీద రాసు కున్న తెల్లటి వీబూది చెరిగి చెదిరిపోతూ ఉంది. అతడు ఊరూరా తిరిగి ఒక్కోసారి భిక్షమడు క్కుంటూ, మరోసారి వీధుల్లో జాతకాలూ చెప్పు కుంటూ తిరుగుతాడు. ఇద్దరూ పగలంతా ఎక్క డెక్కడ తిరిగినా సాయంత్రం వేళకు అక్కడకే వచ్చి చేరతారు.

"అనా! ఇల్లూ, వాకిలీ, లోకమూ, ధర్మమూ అంటావుగదా.." అని మళ్ళీమొదలు పెట్టాడు బికారి.

"ఏందిరా నీ సంగతి...ఏమయ్యింది నీకి య్యాల?" అన్నాడు రామస్వామి నేలమీద కూర్చునే కాళ్ళు చాపుకుంటూ. పగలంతా తిరిగిన అలసటతో అతడికి నిద్ర వస్తూ ఉంది.

"ఇయ్యాల పొద్దున్నే ఉప్పల్ పోయినానన్నా. ఆడొక ఇసిత్రం చూసినా... నలుగురు మడుసులు. ఆళ్ళ తీరు, తెన్ను, బాస, యాస మనదే. ఆళ్ళు వొకిరికొకరు, ఎవురికి ఎవురు ఏమౌతారో... అసలదేమిటో, ఎందుకలా అయ్యిందో పొద్దన్నుంచి ఎంత ఆలోచించినా తెగడంలా... ఈ సిక్కుముడిని నువ్వే ఇప్పాల" అన్నాడు బికారి మరో దమ్ములాగి బీడీ పొగ గాలిలోకి వొదుల్తూ.

రామస్వామి లేచి పొడవాటి పాతగుడ్డ ఒకటి దులిపి నేలమీద పక్క పరుచుకున్నాడు. పాతగుడ్డలతో ఉన్న చేతిసంచిని తలకిందకి లాక్కు న్నాడు. కాళ్ళవైపు ఒకపక్కన అతడి అతుకుల చెప్పులు ఉన్నాయి. వాళ్ళకి కొద్ది దూరంలో ఫుట్ పాత్ మీద ఇద్దరు భిక్షకులు ప్లాస్టిక్ కవర్లలోంచి అన్నం తీసుకుని తింటున్నారు.

పక్కమీద పడుకున్న రామస్వామి కాళ్ళు నిగడ చాపుకున్నాడు. ఒకపక్కకి ఒరిగి తలగడలా ఉన్న చేతిసంచి మీద మోచేయి పెట్టుకుని... మోచేయి మీద కుడిచెవి ఆనించాడు. అతడి ఎడమ చెవి గాలిలో బికారి చెప్పే మాటలను వింటా ఉంది. అతడి ఒంటికన్ను బికారిని నిశ్చలంగా చూస్తూ ఉంది.

బికారిని అతడు మూడేండ్లుగా ఎరుగు దును. పగలంతా ఉండేది ఒక పంచన గాకున్నా, ప్రతిదినం కలవకున్నా ఎప్పుడన్నా రాత్రిపూట మాత్రం కలిసేది మాత్రం అక్కడే. ఒకరిది ఒంగోలు అయితే మరొకరిది గిద్దలూరు. ఊరు ఒకటి కాకున్నా మాట ఒకటే. మాటలు పంచుకోడానికి వయసు తేడా అడ్డురాలేదు. రామస్వామికి తెలిసి నంత మేర బికారి లోకజ్ఞానం లేని అమాయకుడు.

బికారి చెప్పడం మొదలు పెట్టాడు.

"ఇయ్యాల పొద్దున్నే చీకటితో ఉప్పల్‌కి బయలెల్లినానన్నా. మావోళ్ళు ఊర్నుంచి లారీలో వచ్చినారని యలమంద మేస్త్రికి ఎవురో ఫోనుచేసి చెప్తే ఆయన నాకు చెప్పినాడు. లారీ డ్రైవరు మా వోళ్ళని ఎక్కడో ఉప్పలకవతల రోడ్డుపక్కనే దిగ బెట్టేసినాడంట. మూడుదినాల నుంచి వాళ్ళు రోడ్డు

పక్కనే ఉన్నారంట. వాళ్ళనెతుకుతా నేను బోయి నాను. నేనాడికి పోయే సరికి సగం తెల్లారతా ఉంది. సగం చీకటి తెగతా ఉంది. రోడ్లమీద జనం లేరు. నేను రోడ్డుకి ఒకవార నడస్తుండగా గబక్కన ఒక ఆడ గొంతుక ఇనబడింది. నేనాగి ఎనిక్కి చూసాను. నా యెనకమాల మొత్తం ముగ్గురు మదు సులు...కాదు కాదు మొత్తం నలుగురు. మొదట ముగ్గురు...కడాన ఒకరు. ముందు ఒక నడివయిసు ఆడమడిసి, తరవాత ఒయిసులో ఉన్న ఒక పిల్లోడు. మల్లా ఒయిసులో ఉన్న ఇంకో ఆడమడిసి. అళ్ళ ఎనకతల కాస్తదూరంలో ఇంకో నడివయసు మగ మనిషి....అనా...ఇంటన్నావా?" అన్నాడు బికారి చెప్తున్నవి ఆపి, రామస్వామి వంక అనుమానంగా చూసి.

రామస్వామి ఉలిక్కిపడి "ఆ ఆ...ఒక ఆడ మడిసి...మగమడిసి...మల్లా ఇంకో ఆడమడిసి" అన్నాడు.

బికారి రామస్వామివంక చూసి తలాడిస్తూ "అళ్ళకి యెనకమాల ఇంకో మగమడిసి" అన్నాడు. మొదట ఉదాసీనంగా ఉన్నా బికారి చెప్పేది వినే కొద్దీ రామస్వామికి కుతూహలం పెరిగింది. అతడి ఒంటికన్ను చూపు గాలిలోకి సూదిగుచ్చుకుని ముందుకు పోతున్నట్టు బికారి చెప్తున్న కథ వెంటబడి పోతూ ఉంది. మూసుకుపోయిన అతడి ఎడమకన్ను నిగూఢంగా దేన్నో వెతుకుతూ ఉంది.

బికారి కొనసాగించాడు. "నన్ను కేకేసినది ఆ ఆడమడిసి. నేను ఆగి ఎనిక్కి తిరగ్గానే నా యెనకమాలున్న వాళ్ళు ముగ్గురూ పరిగెత్తి కొచ్చినట్టు బిరబిరా నాకాడికొచ్చి నించున్నారు. వాళ్ళలో ముందు నించున్న పొట్టిగా నల్లగా ఉన్న నడివయిసు ఆడామె నాకాడికి వచ్చి ఎనికెనిక్కి చూస్తా 'ఈ మడిసెవరో టేషనుకాన్నుంచి మాయం టనే వస్తుండాడు. ఎంత బెదిరించినా పోవడం లేదబ్బయా...' అనింది. ఆయమ్మి చెప్పినాక ఎనక నున్న పిల్లోడుకూడా ముందుకొచ్చి 'అవుననా ఈయనెవురో రైలుటేషను కాణ్నుంచి మాయనక బడొస్తాండాడు. ఎంత సెప్పినా పోవడంలా..' అన్నాడు. ఈళ్ళిద్దరికి యనకమాలున్న ఒయిసు పిల్ల బీకుబీకు మంటా ముందుకీ ఎనిక్కీ సూస్తా ఉంది. ఆ యమ్మి కాళ్ళకు కొత్తగా పారాణి ఉంది. ఒంటిమీద ఉతికిన పసుపుచీర ఉంది. చూస్తా ఉంటే ఆయమ్మి నా కళ్ళకి కొత్తపెళ్ళి కూతురులా అగపడింది. నేను చివర కొనాకు నుంచున్న ఆ నడివయిసు మగమడిసి వంక తిరిగి



'ఇదేంది! ఎవురయ్యా నీవు? ఏవూరు మీది?' అనడగతా ఉండగానే ఆ మడిసి...ఆ మడిసి... అప్పుడు చూసిననా ఆ నల్లటి మడిసిని ...సరీగ్గ... ఆయన ఎటుసూస్తుండాడో తెలవడంలా. నీ మాదిరి గుడ్డోడైతే కాదు. సంకలో సినిగిన గళ్ళ సొక్కా కింద రంగు మాసిన గళ్ళలుంగీ నేనెప్పుడూ అసమంటి మడిసిని సూడ లేదనా. సూస్తుండగనే ఆయన ఒంటిమీద సినిగిన గళ్ళ చొక్కాతీసి అవతల ముళ్ళకంచెలో పడేసి గబగబా చేతిలో ఉన్న కవరులోంచి కొత్త చొక్కా తీసి ఒంటిమీద తొడుక్కున్నాడు"

బికారి చెప్పిన ఈ మాట వినగానే రామస్వామి హావభావాల్లో మార్పువచ్చింది. శూన్యంలోకి చూస్తున్నవాడల్లా తలతిప్పి బికారి వైపు చూసాడు. రోడ్డుకి అవతలివైపు చీకట్లో ఫుట్‌పాత్ మీద నల్లటి మురికిబట్టలతో ఉన్న పిచ్చివాడొకడు గాలిలో చేతులు తిప్పుతూ తనలో తను మాట్లాడుకుంటున్నాడు. అతడికి కొంతదూరంలో ముడుచుకుని కూర్చున్న ఊరకుక్క చీకట్లోకి విచారంగా చూస్తూ ఉంది.

చీకటిలోకి చూస్తూ చెప్తున్న బికారి ఆగి "అనా...ఇంటన్నావా? అన్నాడు అటువైపే చూస్తూ...

"ఆ..." అన్నాడు రామస్వామి చూపు తిరిగి శూన్యంలోకి తిప్పి. అతడి గొంతులో వచ్చిన మార్పును బికారి గుర్తించలేదు. అతడు కథను కొనసాగించాడు.

"నేను అడనే నిలబడి సూస్తండగనే ఆయన – ఆ నడివయిసు మగమడిసి ఒంటిమీద సినిగిన గళ్ళ చొక్కాతీసి అవతల కంపలో పడేసి చేతిలో ఉన్న కవరులోంచి కొత్త చొక్కా తీసి తొడుక్కున్నాడు. ఆయన సేసే పనిని నేను బిత్తరపోయి సూస్తండగనే నా పక్కన ఆటో ఆగిందనా. ఏం జరగతా ఉందో తెలుసుకునే లోపే ఆ పొట్టామె ఆటో బేరవాడ్డం, వాళ్ళు ముగ్గురూ ఒకిరెనకాల ఒకరు దబదబా ఆటోలో కూర్సోడం జరిగి పోయాయి. వాళ్ళతో బాటు చివరిగా ఆ మడిసి తొడుక్కున్న కొత్తచొక్కా గుండీలు పెట్టుకుంటానే ముందుకువచ్చి ఆటో ఎక్కబోయినాడనా. ఎక్కబోతా ఉండగానే లోపల కూర్చున్న ఒయిసుపిల్లోడు ఆయన్ని లోపలికి రానీ కుండా కాలితో బయటికి తన్నాడనా. ఆ మడిసి ఎనిక్కి పడబోయి రెండడుగులు ఎనిక్కి వేసి...నిల దొక్కుకుని...రెండడుగులు ముందుకేసే లోగా ఆటో బర్రుమని ఎల్లిపోయిం దనా. ఆయన కాసేపు అడనే నిలబడి రోడ్డుదాటి అవతలికి పోయాడు. ఆయ నెటుపోతాడా అని అక్కడ్నే నిలబడి సూస్తా వుండా. రోడ్డవతల ఒకిరిద్దరు మడుసులు బొస్సు కోసం సూస్తా నుంచునుండారు. ఆయన వాళ్ళ మద్దెకెల్లి నుంచుండాడు. అటుగా పోయే బొస్సు ఆగి మళ్ళీ ముందుకెళ్ళింది. నుంచున్న ఒకరిద్దరు బస్సెక్కి నట్టున్నారు. ఆ మడిసి ఎక్కలేదు. రొంతసేపలా ఆడనే నుంచుని చివరికి రోడ్డువార నడవడం మొద లెట్టాడు. ఎండె క్కెకొద్దీ జనం పెరగతా ఉండారు. సూస్తండ గనే ఆయన జనంలో కలిసి పోయాడు"

బికారి కథ చెప్పడం పూర్తిచేసి పక్క సర్దు కోవడం మొదలెట్టాడు. అవతలకి తిరిగి పడు కున్న రామస్వామి మొహం అతడికి కనపడలేదు.

బికారి పక్కమీద వెనక్కువాలి "ఇదేననా పొద్దన్న జరిగింది..." అన్నాడు.

బికారి చెప్పినదంతా మొదటినుంచి చివరి దాకా రామస్వామి మనసులో మననం చేసుకు న్నాడు. అతడు చెప్పింది అర్థమయ్యేకొద్దీ రామ స్వామి మనసులో ఏవో సముద్రపు కెరటాల ధ్వని అతడికి మాత్రమే వినిపించసాగింది.

కాసేపటికి "సరే అయితే... ఇక పొడుకో" అని లోగొంతుకతో గొణిగాడు రామస్వామి...

బికారి గభాల్న పైకిలేచి "అయితే పొడుకోడానికా అనా నీకీ కతంతా సెప్పింది... పొద్దున్నుంచీ ఆలోసిస్తా ఉండాను. అళ్ళంతా... ఎవురు ఎవురికేమౌతారని... అసలు వాళ్ళ కతేంది అని తెలుసుకుందామనే కదా నీకాడికొచ్చింది" అన్నాడు రామస్వామిని దబాయిస్తున్నట్లుగా.

రామస్వామి మామూలుగా ఉండటానికి ప్రయత్నిస్తూ మళ్ళీ కుడిచెవిని తలగడలా పెట్టు కున్న చేతిసంచికి ఆనించాడు. ఎడమ మోచేత్తో ఎడమ చెవిని కప్పేశాడు. అతడికి కథ అర్థ మయ్యింది. కాస్తంత ఆలోచిస్తే బికారికీ సగం కథ తెలుస్తుందని తెలుసు. కథలో మిగతా కన పడని సగం అతడిని కలవర పరుస్తున్నది. అది బికారికి వివరించి చెప్పడానికి అతడి మనసు నిరాకరిస్తున్నది.

"ఈడు ఈ దినం సూడకూడనిది సూసాడు. నాకు సూపు సగం కనపడి సగం కనపడనట్టు ఈడికి సగం తెలస్తాఉంది. సగం తెలవటంలేదు. లోకంలో పాపాన్ని ఈ పసిగుడ్లు, పసిమనసు మడుసులు, సూడకపోతే మునిగేదేవిటి? కళ్ళు తెరిసి సూడమని బూమ్మీద పరమాత్ములు చెప్తా ఉండారు.

పైనున్న పరమాత్ముడు సగం సూపి, సగం మూసి, మాయజేసి మడుసుల్ని కాపాడతా ఉ న్నాడు. ఉన్నదంతా బగమంతుడు తెరతీసి ముందుపెడితే మడుసుల గతేం కాను. ఇసమంటి అమాయకులు ఏకాడికి పోవాలి..?" అని అను కున్నాడు.

బికారి, రామస్వామిని పట్టించుకోనట్టు మళ్ళీ "అనా...అయితే మరి...వాళ్లు వొకిరికొకరు ఏమవుతారనా?" అన్నాడు.

రామస్వామి వినీ వినట్టుగా ఊరుకుని నిద్ర నటించాడు.

బికారి వదల్లేదు. "అనా ఇందులో సగం తెలస్తాఉంది. సగం తెలవడంలేదనా. నీకు అర్థమవు తాది. నీకంతా తెలస్తదనా. అదేందో చెప్పనా" అన్నాడు బతిమాలుతున్నట్టుగా మొహం పెట్టి.

"ఇందులో తెలవందేవుందిరా...దినమంతా టేషనులో ఇంతమందిని సూస్తా ఉండావు. ఇక నీకు నేను సెప్పేటిదేమిటి? అంతా కళ్ళకు కట్టినట్టు కనబడతానే ఉంది కదరా. బహుశా తల్లి, కొత్తగా పెళ్ళైన కొడుకు, కోడలు. అళ్ళు ఏవూరునుండో రైలెక్కి సికింద్రాబాదు టేషనులో దిగినారు.

ఆ నడివయిసు మతిసెడ్డ మడిసి అళ్ళ ఎనకబడి పోయాడు. ఎవరు గుర్తుకొచ్చారో ఆయనకేమని పించిందో పాపం. అళ్ళు ఆయన్ని చూసి దడుసుకున్నారు. ఇందులో ఇంక తెలవన్దే ముంది? నేను నీకు సెప్పేదేముంది?"

బికారి ఆలోచిస్తున్నట్టు మొహంపెట్టి, అర్థమవుతునట్లుగా తలాడించి, తరువాత చప్పున పక్కమీంచి లేచి బాసిపట్లువేసి కూర్చుని "తల్లి... పిలగాడు, కోడలు, అవును నిజమేననా" అన్నాడు.

"తల్లి కాకపోతే అత్త...వరుసలు మనం వూహించినట్టుగాక కొంచెం అటూ ఇటూ కావచ్చు" అని రామస్వామి చీకట్లోకి చూసి నవ్వాడు. అతడి కుడికన్ను నిశ్చలంగా ఉంది.

బికారి బైరాగివంక తదేకంగా చూస్తూ, ఆలోచించి, చివరికి తలాడించి "అంతేనంటా వా..." అన్నాడు.

"లేదా ఆ ముగ్గురిని వెంబడించినవాడు దొంగకూడా అయిఉండొచ్చు. మతిస్థిమితం లేని వాడిలా నటించి కొత్తగా పెళ్ళైన ఆ జంటనుండి ఏదో ఒకటి కాజేయొచ్చుననే ఆలోచనతో ఆళ్ళ ఎనకబడుండొచ్చు" అన్నాడు రామస్వామి.

ఇద్దరిమధ్యా కొంత మౌనం తరువాత బికారి నిట్టూర్చి "నిజమేననా.. అదికూడా కావ చ్చు. అయినా నా ఎర్రికాకపోతే లోకంలోని గొడవ లన్ని నాకెందుకు సెప్పు. ఈ దినం గడిసిందా లేదా...అది కదా సూసుకోవాల్సింది ఈ బికారి బతుక్కి..." అంటూ అతడు కూడా నడుము వాల్చాడు.

ఆకాశంలో లెక్కలేనన్ని చుక్కలు. వాటిని చూసుకుంటూ ఏదో గొణుక్కుంటూ కాసేపటికే నిద్రలోకి జారుకున్నాడు బికారి.

రామస్వామి కూడా ఆకాశంలో చుక్కలవైపే చూస్తూ ఉన్నాడు కాని అతనికి నిద్రపట్టడంలేదు. ఎవురో గాలి ఊది నిప్పుని రవాటించినట్టు అతడి కుడికన్ను చింతనిప్పులా ఎర్రగా తెరుచుకుని ఉంటే అతడి ఎడమకన్ను ఎవరో అదిమిపట్టి చిది మి వేసినట్టు అసహాయంగా, నిస్సత్తువుగా మూసు కుపోయి ఉంది.

కొద్దిసేపటిక్రితం బికారి వేసిన ప్రశ్నకు జవాబుగా పొద్దున బికారి చూసిన ఆ ముగ్గురుని వెనకనుంచి అనుసరించినవాడిని గురించి చెబుతూ తను "అతనికి ఎవరు గుర్తుకు వచ్చారో? ఆయనకేమనిపించిందో పాపం..."

అని చెప్పిన వాక్యాలే అతడి తలలో గిర్రున తిరగ సాగాయి.

# అంతర్వేదం



ఇదే కథని ఎన్నాళ్ళని ఇలా పంతగించి తలపోసుకొంటావ్
ఆగని కాలాన్ని ఎంతకని అడ్డుకొంటావ్...
కాకూడదు కదా బతుకంటే ఒక ఆటబొమ్మగా అనుకోవటం...
స్పర్థలు ఆలోచనా విబేధాలు పొడసూపినపుడు
ప్రతిదీ ప్రశ్నార్థకమైనపుడు
నిర్హేతుకంగానే నీకు నీవు సమాధానపడుతుంటావ్...
ప్రతిక్షణమూ ప్రతి అడుగూ ఎదురు దెబ్బ అవుతూన్నప్పుడు
ఎవర్నని ఆక్షేపిస్తావ్?
మహార్ణవాన అలల సమూహాలు ఎగిరొచ్చినట్లు
నీలో వైఫల్యాలే అధిగమిస్తూ...
మునుపటి రోజుల బాగోగులు ఉచ్చరించుకొంటూ
కాలహరణం కావించుకొంటే ఎలా...?
పట్టుమని పదినాళ్ళైనా విలవని భేషజాల
ముసుగులో ఊగులాడటం అంత సమంజసమంటావా?
వ్యక్తా వ్యక్తా ్యల నడుమ అపోహలు అవమానాల మధ్యన
రాని చిర్నవ్వును బలవంతంగా అతికించుకొని
'బఫూన్ వేషం' కట్టుకోవటం
నీలో పరిపాటై తిష్ఠ వేస్తూంది...
రెక్కల్లో తల దూర్చుకొని కునారిల్లే మౌనపక్షిలా
ఏ థ్రిల్లూ లేని ఒకటే మొనాటనీ లైఫ్‌కి అలవాటు పడితే
బతుకులో సాఫల్యత ఏముంటుంది...?
ఎంతకూ తెగని అసావేరి రాగం నీలో ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది.
అనుభవానికొస్తే తప్ప అవగాహన కానిదేదో
నీడలా నిన్ను వెంటాడుతూనే ఉంటుంది.
ఒక అంతర్మథనం బీజమై మొలకేసినపుడు
గెంతులిడే తువ్వాయిలా స్వేచ్ఛాకురంగంలా
ఉరుకులిడే తురంగంలా పడిలేచే తరంగంలా
జీవితం విరాట్రూపమై ప్రవృద్ధి చెందాలన్న ఆలోచన
గాఢంగా గూఢంగా నిన్ను కుదిపేస్తుంటుంది.

ఎన్నెన్ని దివసాలు ఎదురు చూపుల్లోనే
బతుకు నీడ్చుకొంటూ బతికేస్తూ...
నీకు నువ్వు అర్థమయ్యి అవ్వనట్టు
క్వొశ్చన్ మార్క్ ముఖం పెట్టి అదోలా చూస్తుంటావ్...
లెక్కకు మించి ఆలోచనల చుట్టూ పరిభ్రమిస్తూ నువ్వు
గుక్క తిప్పుకోలేని ఒకటే సాగర ఘోష.
నిర్నిద్రా వీక్షణమై మనో నేత్రం
వాస్తవానికి రుజు మార్గం నగ్నత్వం
నిర్విణ్ణ వదనుడవై సందిగ్ధ గడపకు జారిగిలపడి ఎన్నాళ్ళు ఇలా...?
ఓడిపోవటం ఓడించటం
ఎపుడైనా ఎక్కడైనా ఎవరికైనా అనుకోని పరిస్థితుల్లో జరగొచ్చు!
మనిషి పుట్టుక పుట్టినాక ఒడుపు నేర్పు ఉంటేనే కదా
మనుగడ స్వచ్ఛందంగా సాగేది.
చుట్టూ ఉన్న అద్దాల గదిలో ఎటు చూసినా నీ రూపమే ప్రతిబింబిస్తూంది
నువ్వు బతికిన క్షణాలే నీ ఉనికేమిటో నిర్ధారిస్తాయి...
ఇంతా చేసి ఇన్నాళ్ళూ గడిచి నువ్వు పొందినదేముంది?
ఇంత బతుకూ బతికి నువ్వు కూడబెట్టేదేముంది?
నువ్వు నడిచిన దారినే విస్మరిస్తే ఎలా...?
ఊహాజనిత లోకంలో గిరికీలు కొడితే ఎలా?

ఒక అసంకల్పిత చర్యగా ఒకానొక సుదినాన
నిన్ను నువ్వు తవ్వుకొంటూన్న క్షణం...
గుండె గర్భ కుహరాంతరాళ్ళల్లో
మరుగుతూన్న లావావేశం...
అది ప్రచ్ఛన్న యుద్ధకారకమో...?
ప్రశాంత హేతు ప్రేరకమో?...

అవనిగడ్డ సూర్య ప్రకాశ్
82970 33525






# అందం



ఆమె అంత అందగత్తె మరొకరు లేరని చెప్పుకుంటారు. ఆమె పేరు శుభాంగి. హేమాంగి అని కూడా పిలుస్తారు. పేరుకు తగ్గట్టు ఆమె శరీరంలోని అవయవాలన్నీ బంగారంతో చేసినట్టు ఉంటాయి. కేవలం బంగారంతో చేసినట్టు ఉంటే ఫర్వాలేదు... ఆపై నగిషీ పెట్టినట్టు మెరుస్తుంటాయి.

బంగారమైనా తయారు చేసేటప్పుడు సుత్తి దెబ్బలు తగిలి ఎక్కడో అక్కడ చిన్న ఒత్తు పడుతుంది. కానీ శుభాంగిది మచ్చలేని అందం.

మచ్చలేని అందమే కాదు, మచ్చపడని అందం. మచ్చ పడనివ్వక పెంచిన అందం. మచ్చే కాదు... ఎండ కూడా ఆమె మీద పడలేదు... ఎండ పడలేదు అనేకంటే... పడనివ్వలేదని అంటే సబబు.

**పి.వి.సునీల్ కుమార్**

శుభాంగి తల్లి నాగలక్ష్మి. ఆమెకు ఒక్కగా నొక్క కూతురు శుభాంగి. నాగలక్ష్మి చాలా అందమైంది. మంచి రంగు, ఎత్తరి మనిషి. మరీ సన్నమూ, మరీ లావూ కాని నిండైన విగ్రహం. ఆమె పేద కుటుంబం నుంచి వచ్చింది.

ఆమె చిన్నతనంలో నెత్తికి రీటా నూనె దొరకటమే కష్టం. పెనుగొండ బుధవారపు సంతలో ఎప్పుడైనా వాళ్ళ నాన్న కాష్మీర్ స్నో కొనుక్కొస్తే చాలు, మిస్ ఇండియా కిరీటం దొరికినట్టు ఎగిరి గంతులేసేది వాళ్ళ ఊరు మునమర్రులో.

చలికాలం వళ్ళు పగుల్తే, దానికి నోవా క్రీము రాసుకోవాలని ఉండేది. పచ్చటి రంగులో గుబాళించి పోతాఉంటది నోవా క్రీము. చలికాలం ఒంటికి అది రాసుకుంటే పగుళ్ళు పడకుండా నున్నగా మిలమిలా మెరిసి పోతది ఒళ్ళు.

పొలానికెళ్ళే ప్రతోడూ రైతుకాదు. రైతుకూలీ ఉంటాడు. చిన్నకారు రైతుంటాడు. కౌలుదారుడు ఉంటాడు. భూస్వాముల పిల్లలు తణుకునుండి, పాలకొల్లునుండీ పాండ్సు క్రీములు తెచ్చుకునే వోళ్ళు. తలకి వాసన నూనె రాసేవోళ్ళు.

కౌలుదారు పిల్లలు పెనుగొండ సంత నుండి నోవా క్రీములు తెచ్చుకునే వోళ్ళు. సన్నకారు, చిన్నకారు రైతులకి పొలానికి పెట్టుబడి దొరికేదే గగనం. వాళ్ళింక పిల్లలకి క్రీములేం తెస్తారు. అందుకే ఆళ్ళ పిల్లలు కొబ్బరినూనెతో సర్దుకునే వోళ్ళు.




ఇక రైతు కూలీల పిల్లలకి ఆ కొబ్బరి నూనె దొరికినా ఎక్కువే.

చలికాలం పొద్దుటే గడ్డకట్టిన కొబ్బరినూనె సీసా ఎండలో పెట్టి అది కరుగుతుంటే చూస్తా కసువు పెట్టి, పళ్ళు రుద్దుకునే వోళ్ళు. మొహం కడుక్కుని, స్నానం చేసి చద్దికూడులో ఉల్లిపాయా, పచ్చిమిరపకాయా నంజుకుని తినేసరికి నూనె కరిగేది. అది ఒంటికి రాసుకుని బడికో, పొలానికో పరిగెత్తేవోళ్ళు.

మొహానికి రంభ ఫేసుపౌడరు దొరికితే గొప్ప. పెళ్ళిళ్ళకి కునేగా సెంటు పెళ్ళికూతురికి దొరికేది. పెళ్లప్పుడు వెలిగిపోయి ఆరిపోయేయి ఆ ఆడపిల్లల బతుకులు. అవి మతాబుల్లాంటివి. తయారయ్యేటప్పుడు వెలగవు. కాలిపోయాక వెలగవు.

ఎండా, దుమ్మూ నాగలక్ష్మి అందాన్ని సగం ఆర్పేశాయి. వాస్తవానికి ఆమె అందాన్ని ఆర్పేసినవి ఎండా కాదు, దుమ్మూ కాదు... పేదరికం. పేదతనం ఎండకంటే పదింతలు మండుతుంది. లేనితనం దుమ్ముకి వందరెట్లు మురికిగా ఉంటది.

ఎండ మొహాన్ని, బట్టల్లోంచి బయటకి కనపడే జబ్బల్ని, చేతుల్ని, నడుముని, మెడకింద భాగాన్ని, వీపుని మాడ్చేస్తుండి. తెల్లగా ఉన్న ఒంటిని గోధుమ రంగుకి, ఆనక నలుపుకి మార్చుతుంది. కానీ పేదతనం ఇచ్చే ఆందోళనలు, లేమి, నాకు ఇది లేదు ఇక రాదు అనే ఆలోచనలు మొహాన్ని కొడుతుంది. ఆ బెంగ కంటికింద నల్లటి వలయంగా మారుతుంది. ఆ వలయం అందాన్ని కొడుతుంది.

ఎండ కాదు అందాన్ని కొట్టేది. ఆ ఎండలోకి వెళ్ళకపోతే బతకలేని తనం...అది అందాన్ని దెబ్బ కొట్టేది.

దుమ్ముకాదు అందాన్ని కమ్మేసేది. ఆ దుమ్ము సోకకుండా ఉండలేని తనం...అదీ అందాన్ని మూసేసేది.

నాగలక్ష్మి అందాన్ని పొగడనివోళ్ళు మునమ్రు, దేవ గ్రామాల్లోనే కాదు, అటు సిద్ధాంతం, ఇటు పెనుగొండ, మార్టేరు వరకూ ఎవరూ లేరు.

కానీ అందం కూడెట్టదు అనే విషయం నాగలక్ష్మికి త్వరగానే అర్థమైంది. ఆ అందం వల్ల పొగడ్తలు తప్ప ఏం రావు.

పోకిరి నాయాళ్ళు నేరుగా, మర్యాదస్తులు చాటుగా అడిగేది ఒకటే ప్రశ్న..."వస్తావా?" అని.

అది ఒకరకంగా పొగడ్త...మరో రకంగా అగడ్త.

"రాను..." అంటే యాసిడ్ పోయాలనే పోయేకాలం ఆలోచనలు అప్పటికి ఇంకా టీవీ సీరియళ్ళు నేర్పించలేదు. టీవీల్లో ఇంకా బ్లాక్ అండ్ వైటు మాత్రమే ఉంది. కానీ మనుషుల్లోకి మురికి ఆలోచనలు బ్లాకులో ఇంకా ఎక్కలేదు. అందుకే జీవితాల్లో ఇంకా వైటు ఉంది.

రంగుల్లో రావణాసురుడి ఆలోచనలు చిమ్మే కాలం ఇంకా రాలేదు.

అందుకే నాగలక్ష్మి ఎంతమందికి రాను అని చెప్పినా, దాని మొహాన ఇంత యాసిడ్ పోసినవాడు లేడు.

సరేలే, నాగలక్ష్మి కాకపోతే ఎంకటలక్ష్మి, అదీ రాకపోతే జ్యోతిలక్ష్మి అనుకుని మొగాళ్ళు సర్దుకుపోయేవారు.

"నువ్వు సినిమాల్లో సరిపోతావు...పెద్ద ఏక్టేరు వైపోతావు" అని చాలామంది నాగలక్ష్మి అందమైన మొహానే అన్నారు. అది గబిక్కిన నమ్మేసి, టెంప్టయిపోయి అర్జంటుగా మద్రాసు రైలెక్కేయలేదు. దానికి కారణం ఆ చుట్టుపక్కల రైల్వేస్టేషన్ లేకపోవటం కాదు. సినిమాల్లోకి ఎళ్ళినా పెనుగొండ సీతారాంపేటకి ఎళ్ళినా ఒకటే అని దానికి ఎవరో చెప్పారు. నాగలక్ష్మికి పెద్దాపురం బిగినేసు చేయాలని ఏరోజూ లేదు. అందుకే ఆగిపోయింది.

ఏతా వాతా నాగలక్ష్మి ఇంత అందాన్ని ఏం చేసుకోవాలో దానికి తెలియలేదు. ఆ అందం, అంత అందం, అద్భుతమైన అందం...ఆ మునమ్రు పొలం గట్లమీదా, కాలవ గట్లమీదా ఆగిపోయింది. కొబ్బరి ఆకుల వెనుక దాగిపోయింది.

ఎవడో రాజశేఖర్ అనే పేరున్న రాజకుమారుడు పడవలాంటి కారులో యద్దనపూడి సులోచనా రాణిగారి మిల్స్ అండ్ బూన్ తెలుగు నవలల్లోంచి ఫేట్‌మని వచ్చి, మునమ్రు మునసబు అడ్డం పడినా, కాకిలేరు కరణం అడ్డం పడినా నాగలక్ష్మి నాది...అడ్డతీగలమీద ఒట్టు...అడ్డొస్తే అడ్డంగా నరికేస్తా...అనేసి (వాస్తవంగా నాగలక్ష్మిని ఎవడైనా చేసుకోవాలంటే అంత సీను అవసరం లేదు. జుట్టుకి ఇంత చమురు రాసుకోగలిగినోడు ఎవడైనా నాగలక్ష్మిని చేసుకుని తీసుకుని పోవచ్చు) తనని తీసుకుపోతాడని రోడ్డు పక్కనే ఎదురు చూస్తా ఉండేది, తమ ఇంటి పక్కన ఉన్న షోడా షాపు దగ్గర.

అంబాసిడర్ కారు నాగలక్ష్మి పక్కనే ఆగేది. కానీ నాగలక్ష్మి కోసం కాదు. రాజశేఖర్ కారు దిగి నిమ్మ షోడా తాగి వెళ్ళిపోయేవాడు.

వాళ్ళ గొంతుకి దాహమేకానీ, మనసుకి సౌందర్య దాహం లేదు. నాగలక్ష్మి అందం కన్నా నిమ్మ షోడా ఎక్కువాళ్ళకి.

ఇలా యద్దనపూడివారి నవలలు ఎన్ని చదివినా పుస్తకాల షాపువాడికి అద్దెడబ్బులు మిగిలాయి కానీ, నాగలక్ష్మికి రాజశేఖరం తగల్లేదు.

చివరికి నాగలక్ష్మి అందం క్లియరెన్సు సేల్‌లో క్లియరైన అందమైన పెయింటింగ్‌లా అయింది.

తణుకులో స్థిరపడ్డ నాగభూషణంకి మొదటి భార్య పోయింది. నాగభూషణం వ్యాపారం చేసేవాడు. పిల్లా జెల్లా లేరు. కొంపా గోడూ ఉన్నాయి. స్థితిమంతుడనే చెప్పాలి. పొలంపుట్రా ఉన్నాయి. బాంకిలో ఎకవుంటుంది. ఆ ఎకవుంట్లో లక్షలున్నాయి.

కానీ కొంపలో స్విచ్చేసి దీపం వెలిగించే ఇల్లాలు లేకపోయింది.

కొంపలో పనిమనుషులు స్విచ్చేసినా దీపాలు వెలుగుతాయి. కానీ ఆ వెలుగులో వాళ్ల మొహాలే కనపడతాయి. దీపం వెల్గగానే తన పెళ్ళాం మొహం చూడాలని నాగభూషణానికి తోచింది. ఆ మొహం గల ఇల్లాలు అందంగా ఉండాలని తోచింది.

మొదటి పెళ్ళాం అంత అందగత్తె కాదు. రోడ్డుమీద నాగలక్ష్మిలాంటి అందాన్ని చూసి మనసు ఊలేసినా, పెళ్ళిపీటలు ఎక్కేది మాత్రం ఆ అమ్మాయి ఎనకున్న ఎకరాలు, ముందున్న మాగాణీలు, ఒంటిమీద వేసుకొచ్చే నగా నత్రాలు. ఇవన్నీ ఉండి అమ్మాయి కూడా అందంగా ఉండాలీ అంటే, చందమామ కావాలి...దానికి మచ్చ ఉండకూడదు అన్నట్టుంటది.

అందుకే అందరు మొగాళ్ళలాగే భూషణం కూడా మొదటి భార్యగా బాగా ఉన్నమ్మాయినే చేసుకున్నాడు. ఆమె మొగుడ్ని తక్కువా ఆస్తిని ఎక్కువా చూసకునేది. తర్వాత కాలంలో ఊష్టం

వచ్చి పోయింది.

ఆమె తాలూకు బంధువులు ఆమె వస్తువులు, ఆస్తి రాబట్టుకోవడం కోసం భూషణం మీద ఖూనీ కేసు బనాయించబోయారు. నాగభూషణం పేరు విలన్ పేరే కానీ పరమ సాధు జంతువు. తన బతుకు అపరాధ పరిశోధనలో టెంపోరావు కథలా అయిపోయేసరికి అతడికి భార్య అంటే ఎలా ఉండాలో, ఎలాంటి కుటుంబం నుంచి రావాలో అర్థం అయింది.

అందుకే పేదింటి అమ్మాయి అయినా, అందంగా ఉన్న నాగలక్ష్మిని చేసుకున్నాడు.

రెండో పెళ్ళివాడు, అందులోనూ రాజశేఖరం కారు డ్రైవరు పర్సనాలిటీ, చామనచాయ రంగు, పొట్టిగా నిలబడ్డ పాములా సన్నగా ఉన్న నాగభూషణం నాగలక్ష్మికి నచ్చలేదు. కానీ ఇండియాలో పెళ్ళికి కావల్సింది అమ్మాయికి నచ్చడం కాదు, అబ్బాయి దొరకడం.

సర్లే, పాలు విరిగినా జున్ను మిగిలినట్లు, చేసుకున్న వాడు సన్నాసి అయినా, వాడి డబ్బు సన్నాసిది కాదు. ఆ డబ్బు తన అందానికి పట్టే గొడుగు సన్నాసిది కాదు.

అందుకే నాగలక్ష్మి సగం బాధ, సగం ఊరడింపుతో పెళ్ళి చేసుకుంది.

ఆ తర్వాత ఆమె అందం రెట్టింపు అయింది.

"మా అమ్మగారి ముందు సిన్మాస్టార్లు పనికి రారు" అనేవోళ్ళు పనోళ్ళు.

నాగభూషణం తన పడుచు పెళ్ళాంతో వీరనారాయణకి కానీ, రాయల్ టాకీస్‌కి కానీ, పద్మశ్రీ థియేటర్‌కి కానీ సినిమాకి వెళ్ళాడంటే అందరూ ఆమెని జయసుధని చూసినట్టో, జయప్రదని చూసినట్టో చూసేవోళ్ళు. పక్కనే భూషణాన్ని ఎవడీ గొట్టం కాజా అన్నట్టు చూసేవోళ్ళు. దీంతో భూషణం సినిమాలు చూట్టం తగ్గించేడు.

తనే ఇంత అందంగా ఉంటే, తన కూతురు శ్రీదేవి కన్నా అందంగా ఉంటదని అనుకునేది నాగలక్ష్మి.

నీడ అందాన్నిస్తదనీ, ఎండ అందాన్ని అరాయిస్తదనీ నాగలక్ష్మికి ఇప్పుడిప్పుడే తెలుస్తాంది. నీడపట్టునుంటే నిగనిగలాడటం మొదలెట్టింది ఆమె. కూతుర్ని ఎండ ఎరగకుండా పెంచాలని తీర్మానం చేసుకుంది.

చివరికి ఆమె నిరీక్షణ ఫలించి, ఆమెకి పుల్లమామిడి కాయ తినాలనిపించింది. తనకి పుట్టేది కూతురో, కొడుకో తెలీదుగానీ ఎవరైనా సరే అందంగా పెంచాలి. ఆడపిల్ల అయితే అత్తారబత్తంగా పెంచాలి. ఈ చుట్టుపక్కలేకాదు, ఈ స్టేట్‌లో, ఈ దేశంలో ఇంత అందగత్తెని చూడలేద నిపించేలా పెంచాలి.

తన అందం వారసత్వంగా తన కూతురికి కాక ఇంకెవరికి వస్తుంది? శ్రీదేవి అదిరిపోవాలి. జయప్రద బెదిరి పోవాలి.

నిజానికి శ్రీదేవి, జయసుధ, జయప్రదల తర్వాత తెలుగు వెండితెరమీద క్షీణయుగం మొదలైంది. మళ్ళా అంత అందమైన హీరోయిన్లు రాలేదు.

అంత అందమైన వాళ్ళు ఎందుకు? అసలు మామూలు అందగత్తెలుకూడా తెలుగుతెరకి దొరకలేదు. తనకి కూతురు లేకపోబట్టి కదా తెలుగుతెర ఇలా కళావిహీనమైంది అని నాగలక్ష్మికి అనిపించక పోలేదు.

ఆ దిగులు తీర్చడానికా అన్నట్టు ఆమె నెల తప్పింది. ఆమె జాతకాన్ని బట్టి తొలిచూలు ఆడపిల్ల అని చెప్పారు పంతులు.

కూతురు కళగా ఉండటానికి ఆమె చెయ్యని పనిలేదు. పాలల్లో కుంకుమపువ్వు వేసుకుని తాగేది. చిన్నప్పుడు గ్లాసుడు చిక్కని పాలు తాగటానికి దొరకడమే గొప్ప.

ఆచారిగారిని అడిగి లేహ్యాలు నాకేది. అలా, ఇలా కాలం గడిచి నాగలక్ష్మి పురుడు పోసుకుంది.

ఆమెకి కూతురు పుట్టింది. కానీ ఆ కూతురు నల్లగా ఉంది. నాగభూషణంలా ఉంది. నాగలక్ష్మిలా లేదు.

* * *

కూతురివంక చూడ్డానికి కూడా ఇష్టపడలేదు నాగలక్ష్మి. కుళ్ళి కుళ్ళి ఏడ్చింది. ఆమె కళ్ళ వెంట నీళ్ళు అలా పారుతూనే ఉన్నాయి.

కూతుర్ని పురిట్లోనే పోగొట్టుకున్న తల్లి కూడా అంతలా ఏడవదు. అలాంటి నల్లపిల్ల ఒకవేళ పురిట్లో పోయి ఉంటే నాగలక్ష్మి సంతోషపడేదేమో. కానీ ఆ పిల్ల పిడుగులా ఉంది. చూడ్డానికి కాకిపిల్లలా ఉందా...దాని గొంతు మాత్రం తీయగా ఉండేది.

తియ్యటి కత్తి. నాగలక్ష్మి గుండెను కోసేసిన నల్లటి కత్తి.

నాగలక్ష్మి ఆ నల్లపిల్లని గుండెలకి హత్తుకోలేదు. గుండెల్లో పెట్టుకుని పాలివ్వలేదు. ముర్రపాలు గుండెలకి బరువైతే పిండుకుంది. అంతే తప్ప పిల్లని ముట్టనీయలేదు. ఆయాకి జాలేసి ఆ పాలని గ్లాసుతో పట్టుకుని బిడ్డకి సీసాతో పట్టించింది.

ఆ పిల్లకి వనిత అని దాని నాన్నే పేరు పెట్టుకున్నాడు. నాగభూషణం తల్లి పేరు వనజమ్మ. ఆ పేరు కలిసి వచ్చేలా, కాస్త కొత్తగా ఉండేలా అలా పేరు పెట్టుకున్నాడు.

వనిత చాలా చురుకు. నల్లగా ఉన్నా చక్కటి వర్చస్సు దానిది. మొహంలో కళ్ళు మిలమిలా నక్షత్రాల్లా మెరిసేవి. దాని నవ్వు తొలకరి జల్లులా హాయిగా చల్లగా ఉండేది.

ఉన్నచోట ఉండకుండా ఓ...అని పరుగులు పెట్టేది. అల్లరి, ఉరుకులు, పరుగులు దాని నైజం. గొప్పులు తగిలించుకుని పడిపోయేది. మోకాలి చిప్పలు డోక్కుపోయేవి. రక్తం, దుమ్ము కలిసిపోయి చిక్కగా అంటుకునేవి. అది మాత్రం ఇంత మన్ను తీసుకుని అంటించుకుని మళ్ళా గంతులేసేది.

ఆటలు అయిపోయాక, ఇంటికెళితే ఏం పిల్లా దెబ్బలు తగిలించుకున్నావని అడిగేవాళ్ళు లేరు. దానిష్టం. దాని రాజ్యం.

ఆయమ్మ మాత్రం అది ఇంటికొచ్చాక చూసుకుని దెబ్బలు కడిగి, టించరో, పసుపో పెట్టేది. వనితకి ఆయమ్మ దగ్గర చాలా ముద్దు. అది ఆయమ్మ పిల్ల. నాన్న కూచి.

అమ్మంటే భయం. అమ్మ దాన్ని పలకరించదు. ముద్దు చేయదు. అలా అని తిట్టదు, కొట్టదు. అందుకే దానికి అమ్మంటే భయం. కొట్టినా తల్లి చెయ్యి దానికి తగిలి తల్లి ప్రేమని ఇచ్చేదేమో. కూతురి గారాబం తల్లికి ఆ స్పర్శ ద్వారా అందేదేమో. కానీ ఆ తల్లి ఆ పిల్లని ముట్టుకునేది కాదు.

ఎదురైనా చూపు తిప్పుకునేది. ఈ దరిద్రం నాకెందుకు దాపురించిందా అన్నట్టుండేది నాగలక్ష్మి.

అయితే మొదటి పిల్ల తండ్రి పోలిక అయినపుడు, చిన్నపిల్లకి తల్లి పోలిక వస్తుందని ఎవరో చెప్పారు నాగలక్ష్మికి. నాగభూషణం కూడా ఆమెని బతిమాలాడు.

ఒక్క షరతుమీద ఒప్పుకుంది నాగలక్ష్మి. రెండో కూతురు కూడా ఇలా అనాకారి భ్రష్టాచారి ముండ అయితే మాత్రం ఆ దరిద్రాన్ని ఇంటికి తేకూడదు. అనాథ శరణాలయంలో వదిలేయాలి. ఇప్పటికే ఓ దరిద్రం ఇంట్లో చెంగు చెంగుమని గంతులు వేస్తూ తిరుగుతోంది. ఇది చాలు...అంది నాగలక్ష్మి.

నాగభూషణం చాలా బాధపడ్డాడు. పుట్టకముందే తన బిడ్డమీద ఖూనీకేసు పెడుతోంది తల్లి అనుకున్నాడు. గతిలేక ఒప్పుకున్నాడు.

మళ్ళా నాగలక్ష్మి నెల తప్పింది. ఈసారి కుంకుమపాలు, గాడిదగుడ్డు పాలు ఏం లేవు.

అవన్నీ తాగితే వనితలాంటి అవతారం దిగింది. పుట్టేదానికి సుడి ఉంటే సరిగా పుడుతుంది అనుకుంది నాగలక్ష్మి.

నెలలు నిండి ప్రసవించింది. ఈసారి బిడ్డని చూసుకోవాలంటే భయపడింది నాగలక్ష్మి. వనితకి చెల్లెలు కదా పుట్టింది...దీనికి కూడా తండ్రి పోలికలు తగలడితే...

కానీ పిల్ల పాలకంటే తెలుపు. ఒంటిమీద ఒక్క పుట్టుమచ్చ కూడా లేదు. నల్లటి పట్టు కుచ్చు లాంటి జుత్తు. పెద్ద పెద్ద కళ్ళు...కోటేరు ముక్కు... నాగలక్ష్మి లాగా తీర్చిదిద్దినట్టుండే పెదాలు. పొడవు పిల్ల. కాళ్ళూ చేతులూ అవీ తీర్చిదిద్దినట్టున్నాయి. నాగలక్ష్మి కూతురులా ఉంది కానీ, వనిత చెల్లెలులా లేదు.

సంతోషంతో ఏడ్చింది నాగలక్ష్మి. ఆ పిల్లకి అనిత అని పేరు పెడతానన్నాడు భూషణం. కానీ వనిత చెల్లెలు అనితలా ఉంటుందని వద్దంది నాగలక్ష్మి.

శుభాన్ని కలిగించే అంగములతో పుట్టినది కాబట్టి శుభాంగి అని పేరు పెట్టాలని పంతులుగారు చెప్పి, నాగలక్ష్మిని సంతోషపెట్టి పట్టు బట్టలూ, మంచి సంభావనా పట్టుకు పోయాడు.

శుభాంగి పెంపకం పిల్లల పెంపకం చరిత్ర లోనే ఓ అధ్యాయం.

ఆ పిల్లకి ఒంటిమీద పుట్టుమచ్చ లేదు. డాగుపడని బంగినపల్లి మామిడిపండులా అలానే పెంచాలని నాగలక్ష్మి పట్టుదల.

పరుగులు పెట్టి పడిపోతే దెబ్బ తగులుతుంది. దెబ్బ తగిలితే చర్మం చెక్కులు లేచిపోతుంది. అక్కడ మళ్ళా కొత్త చర్మం వస్తుంది కానీ కొత్త చర్మం, పాత చర్మంల మధ్య తేడా ఒకటి కనపడుతుంది. దాన్నే మచ్చ అంటారు. మచ్చ పోదు.

మచ్చలేని సౌందర్యం అంటే దానికి నిర్వచనంలా ఉండాలి హేమాంగి. అందుకే దానికి ఆట పాటలు లేవు. ఎండలో ఎగరటాలు లేవు. అంతెందుకు, దానికి టీకాలు కూడా వేయించలేదు నాగలక్ష్మి, మచ్చలు జబ్బపీద ఉంటాయి అసహ్యంగా అని.

డాక్టరు బతిమలాడి అరికాలులో వేస్తానన్నాడు. దానికి కూడా ఒప్పుకోలేదు నాగలక్ష్మి.

ఏదొచ్చినా మందుల్తో చూసుకుందాం అంది. అంతే.

శుభాంగికి ఎండ తగలక చర్మం పాలిపోతా ఉంటే రాజమండ్రి డాక్టరు పిల్లని సాయంకాలం నీరెండలో తిప్పాలన్నాడు. విటమిను ఇ తగ్గిపోయిందట శుభాంగి ఒంట్లో. సాయంత్రం పూట కాలవ గట్టుకి నీరెండకోసం వెళ్ళి వచ్చేది శుభాంగి. కారులో దుమ్ము పడకుండా అద్దాలు ఎత్తి తీసుకు పోయేవాళ్ళు. కాలవ గట్టున అయితే దుమ్ము తక్కువ, గాలి చల్లన.

ఎండాకాలం వచ్చి కాలవా, బోదెలు ఎండి పోతే మగరాయుడులాగా వెళ్ళి చేపపిల్లలా ఈతలు కొట్టి వచ్చేది వనిత. శుభాంగి ఎండకోసం కాలవ గట్టున నడక చేస్తా ఉంటే, అక్క వనిత మగాళ్ళకి పోటీగా ఎదురీతలు, మునుగీతలో కొడతా ఉండేది.

ఎవరన్నా అదిగో మీ చెల్లెలు అంటే ఒక్కసారి అటు చూసేది అంతే. అది తన చెల్లెలు అన్న సోయి దానికి లేదు. ఇది నా అక్క అన్న ధ్యాస దీనికి లేదు.

తల్లి తనని పట్టించుకోకపోవడం వనితకి వరం అయింది. దానికి కావలసినంత స్వేచ్ఛ దొరికింది. దాన్ని వనిత పూర్తిగా వాడుకుంది. మిగతా తల్లుల్లా తన తల్లి ఎందుకు ఉండదు అని అర్థం చేసుకోవడానికి అది మాక్సిం గోర్కి అమ్మ చదివింది. దాన్లో తన తల్లి గురించి ఏం లేదు కానీ, కొన్ని గొప్ప విషయాలు అర్థం అయ్యాయి దానికి. చదువూ, ఆటలూ రెండు కళ్ళు. అన్నిట్లో ఫస్టే. జిల్లా స్థాయి ఆటల పోటీల్లో అదరగొట్టేది. కోకో, వాలీబాల్, కబాడి...ఏదైనా సరే, జావలిను, డిస్కు ఏదైనా విసిరి పారేసేది.

శుభాంగికి నాగలక్ష్మి పెంపకం వరమో, శాపమో తెలీదు. దానికి అంత ఆలోచించే శక్తిగానీ, అంత మెదడుకానీ లేవు.

గులాబి రేకులు వేసి నానబెట్టిన పాలు స్నానం తొట్టిలో పట్టించి ఉంచేది నాగలక్ష్మి. దాన్లోనే స్నానం చేయాలి. పసుపు, చందనాలు ఇంకా కుంకుమ పువ్వు, ఇలాంటి మూలికలు దంచిన మిశ్రమం వాడాలి ఒళ్ళు రుద్దుకోడానికి. అంతేకానీ అందరూ వాడే సబ్బులు వాడకూడదు. సబ్బువల్ల మురికి పోతుంది కానీ చర్మం గరుకు తేలుతుంది.

శుభాంగి స్నానానికి ముందు గానుగ నూనెతో ఒంటికి మర్దనా చేయించేది నాగలక్ష్మి. గోరువెచ్చటి గానుక నూనెలో మందార పూలు మరిగించి, ఆ తైలంతో స్నానం చేస్తే ఒంటికి నిగారింపు, చర్మవ్యాధులు రావని ఆయుర్వేద భిషక్కు చెప్పాడు ఆమెకు. అందులో కాసింత పచ్చ కర్పూరపు భస్మం కూడా కలుపుతుంది నాగలక్ష్మి.

శుభాంగి జుత్తుకు రాసే నూనె ప్రత్యేకించి గానుగలో ఆడిస్తుంది నాగలక్ష్మి. ఎండు కొబ్బరి కాయలు, ఎండిన ఆలివ్ కాయలు, వట్టివేళ్ళు ఇంకా ఎంపికచేసిన ద్రవ్యాలతో నెలకోసారి తాజాగా ఆడిస్తుంది నూనెను. శుభాంగి నడచి వస్తోంటే ఆమె జుత్తునుండి వచ్చే కమ్మని వాసన అరకిలో మీటరు వ్యాపిస్తుంది.

స్నానం అయ్యాక ఆమె ఒంటికి కొబ్బరి పాలు, మీగడ, వెన్న కలిపి తయారుచేసిన లేపనం పూసుకుంటుంది. శుభాంగి ఒళ్ళు వైనా సిల్కు గుడ్డ ఎండలో మెరిసినట్లు నున్నగా మెరుస్తుంది.

శుభాంగి వాడే ప్రతి సుగంధ ద్రవ్యం ఇంట్లో తయారైనవే. అందరూ వాడే క్రీములు, సబ్బులు వాడనివ్వదు నాగలక్ష్మి.

అదొక్కటే కాదు. శుభాంగి వాడే తువ్వాలు, చేతిగుడ్డలు అన్నీ రాజమండ్రి నల్లమందు సందు లోంచి రావల్సిందే. ఫారిన్ సరుకు.

బడికి కొంతకాలం వెళ్ళినా కాలేజి వయసొచ్చాక మానిపించి ప్రైవేటుగా డిగ్రీ చేయించింది నాగలక్ష్మి. శుభాంగి చదువులో అంతంత మాత్రం.

ఎందుకు ఇంత అత్తారబత్తంగా పెంచడం అంటే నాగలక్ష్మి అంటుంది..."అందంగా అందరూ పుట్టలేరు...అందం గా పుట్టినవాళ్ళంతా అందాన్ని కాపాడుకోలేరు... రెంటికీ అదృష్టం ఉండాలి" అని.

"రాజకుమారుడిలాంటి వాడిని పెళ్ళాడుతుంది నా కూతురు...మహల్లో ఉంటుంది" అనేది.

తనకో పెద్ద కూతురు ఉందనికానీ, అది కూడా పెద్దదయిందని కానీ గుర్తుచేసుకోవడానికి కూడా ఇష్టపడేది కాదు. ఆమె దృష్టిలో తనకు ఒకతే కూతురు. వనిత భూషణం కూతురు.

కనీసం సవతి తల్లి అయినా ఇంకా బాగా చూసుకునేదేమో వనితని. లోకం నిందలు వేస్తుం దన్న భయం నాగలక్ష్మికి లేనే లేదు. అందుకే కేరేజాట్ అన్నట్టుండేది.

* * *

కాలం వనితకి, శుభాంగికి యవ్వనాన్ని అద్దింది.

వనిత పుట్టినప్పుడున్నట్టు నల్లగా లేదు. లేత గోధుమ వర్ణం ఆమెది. పొలం గట్లంటా, మైదానాల వెంటా, కాలవలవెంటా పరిగెత్తి పచ్చిగాలి పీల్చి పరిపుష్టంగా తయారైంది వనిత. ఆమె ఇంకా ఉరికే జలపాతమే.

ఇక శుభాంగి గురించి చెప్పుకోవాలంటే ఆమెని ఒక్కసారి చూస్తేచాలు అనుకోకుండా వుండే కుర్రాడు ఆ ప్రాంతంలో ఒక్కడు కూడా లేడు.

శుభాంగి కనపడితేనే అదృష్టం. ఆమె చూపు తాకితే జన్మ ధన్యం. ఆమె అందం కోసం యుద్ధాలు

చేయొచ్చు. క్లియోపాత్రా ఎంత అందగత్తో ఎవడు చూడొచ్చాడు? రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమల అందాలు చూసిన వాడెవ్వడు? అటజని గాంచె భూసురుడు ఆ వరూధినిని...వీళ్ళంతా ఉంటే గింటే శుభాంగి అందంలో సగం అందంగా ఉంటారేమో...

కోటింగ్ వేసుకుని కూడా సినిమా హీరో యిన్లు అప్పుడే నిద్రలేచి మొహం కూడా కడుక్కోని శుభాంగి పక్కన నిలబడితే...ఆమె మేకప్పు లేని రాజకుమారిలా, వాళ్ళు మేకప్పు వేసుకున్న పరిచారికల్లా ఉంటారు...అంత అందగత్తె ఆమె.

మచ్చలేని అందం... మచ్చ పడని అందం
దాగులేని బంగినపల్లి మామిడి కాయ....

హిమాలయాల మంచు... పండిన బంగిన పల్లి అంచు...సానబెట్టిన కెంపు...లేత గులాబి రెక్క తుంపు...అన్నీ కలిపితే హిమాంగి.

దాన్ని పెళ్ళాడతగిన రాజకుమారుడు నాగభూషణం బంధుగణంలోనే ఒకడున్నాడని తెలిసింది.

హిమేష్ శేఖర్ అట వాడి పేరు. వాడి చిన్నప్పుడే వాడి అమ్మ బాబు ఇంగ్లండు దేశంలోని లండనుకు వెళ్ళిపోయారు. వాళ్ళిద్దరూ డాక్టర్లు. ఇతగాడు కూడా డాక్టరే.

లండన్‌లో వాళ్ళుండే ఇల్లే నరేంద్ర టాకీస్‌కి రెండింతలు ఉంటుందట. వాళ్ళ ఇంటి వెనక తోట చిట్టూరి ఇంద్రయ్య కాలేజి గ్రౌండంత ఉంటుందట.

కార్లు, నౌకర్లు చాకర్లు ఇక చెప్పనక్కర్లేదు. ఇవన్నీ విన్న తర్వాత నాగలక్ష్మికి కాళ్ళూ చేతులూ ఆడలేదు. ఎక్కడ మునమర్రు ఎక్కడ లండను.

నాగభూషణాన్ని పోరగా పోరగా...లండనుకి ఐయస్‌డీ కాలు చేశాడు, ఈసారి ఇండియాకి వచ్చినపుడు ఆ కుటుంబం మొత్తం వచ్చి తమ ఇంట్లో విడిది చేయాలని.

వాళ్ళు కూడా సంబంధాలు వెతుక్కుంటున్నారు. శుభాంగి అందం గురించి వాళ్ళ చెవిన కూడా పడింది. హిమేష్ తల్లిదండ్రులు తమ పిల్లాడితో సహా తణుకులో దిగబడ్డారు. వాళ్ళకోసం సకల సౌకర్యాలు ఏర్పాటు చేసింది నాగలక్ష్మి. విడిది, వాహనం, భోజనం ఇలా అన్నింటా తమ ముద్ర, జాగ్రత్త కనిపించాల్సిందే.

* * *

హిమేష్ అందగాడు. శుభాంగి అందంతో సరితూగే మగాడు ఉండటం కష్టం. కానీ హిమేష్ ఆమెకి ఈడే కానీ, జోడు కాకపోయినా, ఆమె అందాన్ని తట్టుకుని పక్కన నుంచుంటే మరీ తేలిపోడు.

ఇద్దరూ పక్కపక్కనే నడుస్తుంటే నాగలక్ష్మి ఆనందం ఎక్కడో ఉంది. ఏమైనా నా కూతురు పెట్టి పుట్టింది అనుకుంది.

హిమేష్ కుటుంబం వారం రోజులకి పైగా ఉన్నారు అక్కడ.

శుభాంగి శుభ్రంగా తయారవడం అతడితో అటూ, ఇటూ తిరగడం తప్ప వేరే ఏం చేయలేదు.

వనిత మాత్రం వచ్చిన వాళ్ళకోసం బండేసుకుని తిరుగుతూ తాపేశ్వరం మడత కాజా, అవిడి నుండి పాలకోవా, ఆత్రేయపురం నుంచి పూత రేకులు పురమాయించి సందడి చేసింది.

వనితకి తన అందం మీద ధ్యాస లేదు.

శుభాంగికి తల్లో పిన్ను నుంచి కాలికి వేసే జోడు వరకూ మాచింగ్ ఉండాలి. బయటకి కన పడనివే అయినా, జాకెట్ రంగులోనే లోపలి బ్రా కూడా ఉండాలి. అంత ఖచ్చితం ఆమె. గోళ్ళ రంగు, లిప్‌స్టిక్ కూడా బట్టలకి మేచింగ్‌గా ఉండాలి. ఆ షేడ్స్ కూడా రోజూ మారుస్తుంది. రేపు వేసుకునే బట్టల్ని బట్టి రాత్రే నెయిల్ పాలిష్ రిమూవర్‌తో పాత రంగు తీసేసి కొత్తది వేసుకుంటుంది. ఐ లాషస్‌తో సహా అన్నీ రాత్రే సిద్ధం అయిపోతాయి. మర్నాడు టైం టు టైం ఆ డ్రస్సులు మారతాయి. అంతే. పొద్దున్న ఒక రకం...మధ్యాహ్నం ఒక రకం, సాయంత్రం ఒక రకం, రాత్రికి ఒక రకం చీరలు కావచ్చు, చుడీదార్లు కావచ్చు, లెహంగా కావచ్చు. కలర్ స్కీం మాత్రం సింక్ అవుతుంది నెయిల్ పాలిష్‌కి. లేదంటే కాంట్రాస్ట్. అంతే కానీ అవుటాఫ్ స్కీం మాత్రం ఉండటానికి వీల్లేదు.

వాస్తవానికి ఒక వారానికి సరిపడా కలర్ స్కీం, మేచింగ్ స్కీం సిద్ధం చేసుకుంటుంది ఆమె. వాటికి సరిపడా లోపలి బట్టల్నించి, చెప్పుల్నించి చెంపపిన్నుల వరకూ అన్నీ బీరువాల్లో అమర్చుకుంటుంది. ఏ రంగు బట్టలు వేస్తే ఎలాంటి పెర్ఫ్యూం వాడాలో తెలుసుకోవడం ఓ సైన్సు. అందులో ఆమె జీనియస్.

తయారవడానికి అరగంట నుంచి గంట వరకూ తీసుకుంటుంది ఆమె. తన బట్టల్లో ఎక్కడైనా చిన్న పోగు రేగి ఉన్నా అవి వేసుకోదు.

ఆమె మాట్లాడితే వీణ మీటినట్లు ఉంటుంది. ఆమె నోటినుండి పరిమళం వస్తూ ఉంటుంది. ఎప్పుడూ తడి ఆరని పెదాలు... పొడిబారని నోరు.

ఇక వనితకి తయారవ్వాలంటే పది నిముషాలు పట్టదు. మరీ పెళ్ళి పేరంటం అంటే ఇరవై నిముషాలు అంతే.

జుత్తు దువ్వేసుకుని, పౌడర్ రాసేసుకుని ఎదురుగా ఉన్న బట్టల్లో నచ్చినవి వేసేసుకుని తయారయి పోతుంది.

కానీ అదేం చిత్రమో ఆమె ఏం వేసుకున్నా బావుంటాయి.

చకచకా కదలటం, గలగలా మాట్లాడటం... ఆ కళ్ళ వెనుక కనిపించే ఆమె చదువు, సాహిత్యం తాలూకు జ్ఞానం...

వారంలో రెండు రోజులు శుభాంగి అందాన్ని ఆస్వాదిస్తూ ఆమెతో తిరిగేశాడు హిమేష్. మూడో రోజు ఆమెకి నలిగిపోయినట్టయి కాసింత విశ్రాంతి తీసుకుంది.

చివరి అయిదురోజులూ ఇంట్లో ఉంటే శుభాంగితో గడిపేవాడు. ఆ అయిదురోజులూ బయటకి కదిలితే వనిత ఉండాల్సిందే... కంట్రీ సైడ్ అంటే పల్లె తాలూకు తోటలూ, కాలవలు, తోపులూ, పొలాలు అన్నీ చూపించే బాధ్యత వనిత మీద పడింది.

* * *

చివరికి వాళ్ళు వెళ్ళిపోవాల్సిన రోజు దగ్గర పడింది.

లాంఛనమే అయినా అడగాలి కాబట్టి అడిగింది నాగలక్ష్మి, "ముహూర్తాలు ఎప్పుడు పెట్టుకుందాం?" అని.

"పెళ్ళి చేసుకునే లండన్ వెళదాం అనుకుంటున్నాం...కాబట్టి త్వరగా పెట్టుకుందాం" అన్నాడు హిమేష్ తండ్రి.

"మరి శుభాంగి జాతకం తెప్పించనా?" అంది నాగలక్ష్మి.

"జాతకం తెప్పించండి కానీ...వనిత జాతకం...ఒకవేళ అవి కలవకపోయినా నాకేం పట్టింపు లేదు. వనితకి ఇష్టమైతే నేను తనని చేసుకుంటాను" అన్నాడు హిమేష్.

కాసేపు తానేం వింటున్నానో అర్థం కాలేదు నాగలక్ష్మికి. పెళ్ళికూతుర్ని చూడ్డానికి వచ్చి ఆ ఇంటి పనిమనిషిని లేపుకుపోయిన తింగరాడ్ని చూసినట్టు చూసింది.

"కారణం ఏంటో నాకు తెలియాలి" అంది దెబ్బతిన్నట్టు.

"ఏం లేదు అత్తమ్మా...మీ శుభాంగి గొప్ప అందగత్తె. అందులో తిరుగులేదు. కానీ ఆమెలో అందం తప్ప మరేమీ లేదు. ఆమెది బొమ్మ లాంటి

అందం. కానీ నాకు కావల్సింది అమ్మాయి. బొమ్మాయి కాదు. శుభాంగి రెండు రోజులు బయట తిరిగితే మూడో రోజు తిరగలేదు. ఆమె మామూలు మనిషిలానే అనిపించదు...ఒంటిమీద ఓ చిన్న దెబ్బకానీ, మచ్చకానీ లేని మనిషి. నాకు కావల్సింది బాల్యం తాలూకు జ్ఞాపకాలు ఒంటి మీద, మనసులోనూ మోసుకొచ్చే అమ్మాయి...

మేం రేపు మాట్లాడుకోవాలంటే మాకు ఏదైనా ఉండాలిగా. మన ఒంటిమీద ఉండే ప్రతి మచ్చా ఓ జ్ఞాపకం, ప్రతి గీతా ఓ కథ చెబుతాయి. జీవితం అంటే మానిపోయిన దెబ్బలు, మిగిలి పోయిన జ్ఞాపకాలు...అసలు పుట్టుమచ్చే లేని మని షికి, ఓ గీతా, మచ్చా లేని మనిషికి ఏముంటాయి తలుచుకోడానికి...నాతో పంచుకోవడానికి.

అత్తయ్యా...అందం అంటే కేవలం బయ టకి కనిపించేదే కాదు. లోపల కూడా ఉండాలి. పువ్వుకి పుప్పొడి, సువాసన ఎలాంటివో చదువు, సాహిత్యం మనిషికి అలాంటివి. ప్లాస్టిక్ పువ్వు చూడ్డానికి బావుంటుంది. కానీ మనం దాన్ని డ్రాయింగ్ రూంలో పెడతాం. తల్లో పెట్టుకోం. చేతుల్లోకి తీసుకుని మూరిసిపోము...మనిషి కూడా అంతే...

వనిత మామూలు అమ్మాయి...కానీ సహజ మైన అమ్మాయి...నిజమైన అమ్మాయి...తనకి కష్టం తెలుసు, దాన్ని దాటడం తెలుసు...ఆ కష్టం కలిగించిన వాళ్ళమీద కోపం పెట్టుకోవడం తెలీదు...అందుకే ఆమే నాకు కావాలను కుంటు న్నాను...

శుభాంగితో రెండు రోజులు కూడా ఏం మాట్లాడాలో తెలీలేదు. వనితతో నాకు ఎంత మాట్లాడినా అది ముగించాలని లేదు...అదీ తేడా...

శుభాంగిని చేసుకుంటే ఆమె అందం చూడ్డం తప్ప మరేం ఉండదు జీవితంలో...వనితతో అయితే అంతా జీవితమే...

ఏం అనుకోకు అత్తయ్యా...ఫారం కోడిని పెంచినట్టు పంజరంలో పెట్టి పెంచావు ఆ అమ్మా యిని. ఆమెకి అలంకరణ తప్ప ఏం తెలీదు...నాకు మామూలు అమ్మాయి కావాలి...కానీ మంచి అమ్మాయి దొరికింది" అన్నాడు హిమేష్.

వనితకి పెళ్ళయి లండన్ వెళ్ళిపోయింది. కానీ అతడేం మాట్లాడాడో...

ఎందుకలా చేశాడో వాగలక్ష్మికి, శుభాంగికి ఇంకా అర్థం కాలేదు.

కంప్యూటర్ స్క్రీన్ మీద కనిపిస్తున్నది నమ్మాలో వద్దో అర్థం కాలేదు.

పెళ్ళి ముందురోజు దాకా వెంటపడి తిరిగిన పెళ్ళికొడుకు తీరా ఆ ముందురోజు కూల్‌గా రెస్టారెంట్‌కి పిలిచి "ఈ పెళ్ళి వద్దు - నిన్ను నేను పెళ్ళి చేసుకోను" అని చెప్తే ఆ పెళ్ళికూతురు కారణం అడిగింది. "నేను దేశాలు తిరిగి ఎంతో ఆధునికంగా మారేను. నువ్వు ఇంకా పాతగానే ఉన్నావు. అందుకే వద్దు" అన్నాడు. ఆ పెళ్ళికూతురు తెల్లబోయి, ఏడ్చి, బతిమాలి ఆపై విసిగి ఒక నిర్ణయానికొస్తుంది. పెళ్ళి అయ్యాక హనీమూన్ వెళ్ళడానికి తీసుకున్న టిక్కెట్లలో తన టిక్కెట్ మీద ఒక్కతీ మొదటిసారిగా ఓ విదేశం - ఫ్రాన్స్ వెళ్తుంది.




# దయచేసి వినండి



98480 16442

డా॥వాడ్రేవు వీరలక్ష్మీదేవి

చీమ చిటుక్కుమంటే భయపడే ఆ అమ్మాయి చిత్రమైన అనుభవాల వల్ల కాసిన్ని రోజులలోనే ధైర్యం సంపాయిస్తుంది. అక్కడ నుంచి మొదటి ప్రోగ్రాంలో భాగంగానే ఆమ్‌స్టర్‌డామ్ వెళ్తుంది.

అక్కడ హోటల్‌లో ముగ్గురు అబ్బాయిలతో కలిసి ఉండే గది ఎలాట్ చేస్తారు. వినగానే, చూడగానే మనందరిలాగే ఆ పిల్లా హడలి పోయింది. కానీ చిత్రంగా ఆ మగవాళ్ళు ఎంత పద్ధతిగా ఉన్నారో!

ఒక ఆడపిల్ల తమతో పాటు రూంలో ఉన్నట్లే లేదు. కామ్‌గా ఒకడు బొమ్మలు వేసుకుంటూ, మరొకడు గిటార్ వాయించుకుంటూ వాళ్ళ పనుల్లో వాళ్ళున్నారు.

జానకి తెల్లబోయి ఆశ్చర్యంగా చూస్తోంది. దాదాపు మూడు నెలల నుంచి జానకి వచ్చినప్పుడల్లా ఈ సినిమా ప్లే చేసుకుని చూద్దామనుకుంటోంది. కానీ వాళ్ళ కబుర్లమధ్య కాలం తెలీకుండా గడిచిపోయి జానకి ఇంటికి వెళ్ళిపోయింది. ఈ సారి ఇలా కాదని కబుర్లు మొదలు పెట్టకుండా ముందు సినిమాయే వేసుకుని చూడడం మొదలు పెట్టారు.

'క్వీన్' అనే హిందీ సినిమా అది. దర్శకుడు వికాస్ భెల్. దాన్ని ఉమెన్ ఓరియంటెడ్ సినిమా అని చెప్పకనే చెప్పేలా తీస్తూ భారతీయ సగటు పురుషుణ్ణి అందరిముందూ బాగా చూపెట్టాడని గీత చెప్పింది. "నీతో కలసి మళ్ళీ చూడాలి" అంటూ ఇప్పుడు జానకిని కూర్చోపెట్టి ఆ సినిమా చూపిస్తోంది.

ఆమ్‌స్టర్‌డామ్‌లోని హోటల్‌లో హీరోయిన్ రాణి ఆ అబ్బాయిలతో కలసిమెలసి ఉంటూ, స్నేహంగా బయట తిరుగుతూఉంటే - వావ్!! జానకి ఆశ్చర్యంగానే కాక థ్రిల్‌గా కూడా అయిపోయింది. ఇది ఇండియాలో ఉన్నవాళ్ళకి ఊహల్లో కూడా అసాధ్యమైన సంగతి.

"నిజంగా ఇలాగే జరుగుతుందంటావా?" అని మౌస్ కదుపుతూ దృశ్యాన్ని పాజ్‌లో పెట్టి గీతని అడిగింది.

"ఎస్ జానూ! నేనే చూసాను. నేను మా విసూ కడుపుతో ఉన్నప్పుడు వెళ్ళి ఆరునెలలు ఉన్నాను కదా! బాగా తిరిగే దాన్ని. ఇలాగే ఉంటారు. ఒకరి గొడవ ఒకరు మనలా అదేపనిగా పట్టించుకోరు. ఇక వస్త్రాల గురించిగానీ, వాటి ధారణ గురించిగానీ ఆ గోలా గొడవా ఎక్కడా ఏమీ ఉండదు. మనకైతేనా! చూడు. వికాస్ భెల్ మన మగాళ్ళని ఎక్కడా వదల్లేదు. కుర్ర పిల్లాడి నుంచి ముసలాడిదాకా చాపల్యపు కుతూహలం ఎలా కారుస్తారో మరీమరీ కెమేరాలోకి ఎక్కించాడు" అంది.

సినిమాని మళ్ళీ ఆన్‌లోపెట్టి చూడడం మొదలుపెట్టారు. జానకి మనసు కాస్త వికలమయ్యింది. అవును. ఏదోకాదు, అదే గుర్తొచ్చింది. అది జరిగాక ఆమె ఆ సంగతి ఎవరికీ చెప్పలేకపోయింది. కారణం పెద్దగా ఆలోచిస్తే ఏమీ కనిపించదు. కానీ ఎవరితోనయినా చెప్పాలంటే ఏదో చిన్నతనంగా అనిపించింది. అంతేకాదు, అవమానించబడినట్టు కూడా. అందుకేనేమో చెప్పనిది.

ఈ సినిమా చూడడం అయ్యాక గీతకు చెప్తేనో? అనిపించింది. సరే చెప్దాం, చెప్పేస్తే మనసులోంచి తీసిపారేసినట్టవుతుంది కదా! అనుకుంది.

సాయంత్రం నాలుగు దాటింది సినిమా పూర్తయ్యేసరికి. కంప్యూటర్లో దాచిపెట్టిన ఓలేటి వెంకటేశ్వర్లు లలిత గీతాలు పెట్టింది గీత.

"గడచేనటే సఖియా! ఈ రాతిరి కడు భారమైన ఎడబాటున" కృష్ణశాస్త్రిగారి విరహగీతం సున్నిత మాధుర్యం, లేదా మోహ విరహ మాధుర్యం అదంతా ఓలేటి మత్తు గొంతులోంచి రహస్యంగా వినవస్తోంది. ఆ సినిమా ఇచ్చిన హుషారు తర్వాత ఈ పాట వినడం ఆ ఉల్లాసానికి ముక్తాయింపుగా ఉంది.

గీత టీ ఆకులు మరిగించి అల్లంతో పాటు కాగిన వేడి వేడి టీని అందించి వాతావరణాన్ని సెలబ్రేట్ చేసింది.

శిశిరం వెళ్లిపోతున్న కాలం. చలి చల్లదనంగా మారి గాలులు ఇంపుగా ఉన్నాయి. శిశిర వసంతాల మధ్యకాలం ఎంతో స్పృహణీయమైన కాలం. అవును, కాలానికి ఒక్కొక్కవేళ స్పష్టమయిన స్పృహ ఉంటుంది. "ఏవియో అర్థమ్ముకాని

భావగీతములవి" అన్నట్లు పాటలు పాడి, వాటిని ఆకుల గలగలల రూపంలో వినిపిస్తూ ఉంటుంది. గుమ్మంలో ఒక పక్కనే ఒదిగి ఉన్నట్లే ఉండి పైకి వెళ్ళి అంతటా ఆవరించుకుని ఉన్న కానుగ చెట్టు అవిరామంగా ఆకులు రాల్చేస్తుంది, పైనుండి ఎవరో కోసి పడేస్తున్నట్లు. కొందరు మనుషులు ఒదిగి ఉన్నట్లే ఉంటూ ప్రేమతో అందరిని ఆవరిస్తారు, ఈ కానుగ చెట్టులాగే. ఒక వైపు ఆకులు రాలుస్తూనే మళ్ళీ చిగుళ్ళతో సన్నద్ధమౌతూ ఉంటారు. టీ తాగుతుండగానే జానకి మనసు నిండా ఇలాంటి ఊహలు మెదిలాయి, ఆ చెట్టు వైపు చూస్తుంటే.

"గీతా! ఈ చెట్టు ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క అందంతో ఉంటుంది సుమా! ఇప్పుడు చూడు శిశిరాన్ని గౌరవిస్తూ దాని ఆదేశంతో ఆకులు అన్నీ రాల్చింది. మళ్ళీ వసంతం కోసం ప్రతి రోజూ కాస్త కాస్తగా సన్నద్ధమవుతూ ఉంది. చెట్టంతా చిరు లేత ఆకుపచ్చ రంగులోకి వచ్చాకా ఆ అందం చెప్పనలవి కాదు. ఇక ఆపైన రెండు రోజులకొక సారి ఆకుపచ్చల అందాలు మారుతూ ఉంటాయి. ఆ ఆకులకెంత మెరుపో, ఎంత నునుపో. నిజంగా గుమ్మంలో ఉన్న ఈ ఒక్క చెట్టే ఋతుగానాన్ని చేస్తోంది సుమా" అంది.

గీతకి జానకి మాట్లాడుతూంటే వినడం ఇష్టం. ఆ సున్నితమైన పరిశీలన, అందాలను ఆస్వాదించే హృదయపు శక్తి ఇంకా ఆశ్చర్యంగా కూడా అనిపిస్తుంది. ఇవన్నీ నాకెందుకు తోచవో? అనుకుంటూ ఉంటుంది.

చిగిర్చి పూలు పూస్తున్న మరిన్ని వేపచెట్లు దారి పొడుగునా ఉన్న బాటలో సాయంత్రపు నడకకు గీత జానకిని తీసుకెళ్ళింది. ఆ పూల సువాసన తొలి వేసవిని, మల్లెలనూ, మామిడి పిందెలనూ మనసుకి జ్ఞాపకం చేస్తూండగా ఏవేవో ఊసులతో ఇద్దరూ నడిచి నడిచి వెనక్కి వచ్చారు.

జానకి ఇవన్నీ చూస్తూ ఉన్నా, ఆస్వాదిస్తూ ఉన్నా, గీతతో పంచుకుంటూ ఉన్నా మనసులో ఆ మలినపు జ్ఞాపకం అలానే ఉంది. ఇది ఈ రోజు ఎలాగయినా గీతకు చెప్పి తీరాలి అనుకుంది.

"జానూ! ఈ రోజు రాత్రి ఉండిపోకూడదా! రేపు ఉదయం వెళ్ళవచ్చు' అని గీత అడగ్గానే జానకి ఉండిపోవడానికి నిశ్చయించుకుంది. అందుకే, ఇంటికొచ్చాకా రఘుకి ఫోన్‌చేసి రేపు పొద్దున్నే వస్తానని చెప్పేసింది.

ఆ రాత్రి జానకి, గీతకి చాలా చెప్పింది. గీతకు జానకి సున్నితం తెలుసు. మామూలు





వాళ్ళనే భయపెట్టే విషయం జానకిలాంటి వాళ్ళకి ఇంకెంత వెగటు, ఇంకెంత జుగుప్స కలిగించి ఉంటుందో! అని గ్రహించుకుని బాధపడింది. ఆ రాత్రి వాళ్ళు మాట్లాడుకున్న మాటలు ఎందరో స్త్రీల అవమాన గాథల మీంచి నడిచి వారి ఆత్మలకు శాంతిని కలిగించాయి.

ఇంతకీ జానకి, గీతకు ఏం చెప్పుకుంది ? చెప్పుకుని తాను దేని నుంచి విముక్తమయింది.

* * *

"యువరటెన్షన్ ప్లీజ్" అంటూ మొదలుపెట్టి ఆ రోజు రావలసిన అన్ని రైళ్ళూ పదిగంటలు ఆలస్యంగా నడుస్తున్న ప్రకటన దక్షిణ మధ్య రైల్వే వారి మైకుల్లోంచి వినపడింది. జానకి చాలా అవస్థపడి స్టేషన్‌కొచ్చింది. రెండు రోజుల నుంచి ఒకటే ముసురు. దారి అంతా మునిగిపోయి ఉంది. రాత్రికి ఎలాగోలా విజయవాడకు చేరాలి.

కృష్ణకి జ్వరంగా ఉంది. చూడాలని ఉంది రమ్మన్నాడు. కృష్ణ విజ్ఞాన్‌లో ఇంటర్ చదువుతున్నాడు. రఘుకి నిన్న సెలవు దొరికింది. నిన్ననే వెళ్ళాడు. జానకికి నిన్నంతా బేంక్‌లో చాలా పని. మార్చి హడావిడి. ఈ రోజు మధ్యాహ్నానికి ఎలాగో బయట పడగలిగింది.

వర్షం పెద్దగా కురవడం లేదుగానీ, ముసురు మాత్రం తగ్గలేదు. రోడ్లన్నీ బురదగా, మురికిగా అయిపోయాయి. చిన్నబేగ్‌తో ఎలాగో స్టేషన్‌కి వచ్చి పడింది. సీట్ రిజర్వేషన్ ఉంది. కానీ రావాల్సిన రైలే రాలేదు. ఆదరాబాదరా నాలుగు కిలోమీటర్లు దూరం నుంచి పరుగు పరుగున వస్తే ఇన్ని గంటలు ఆలస్యం అంటున్నారు. ఆమెకు ఒక్కసారిగా ఉసూరుమని అనిపించింది.

రైల్వే స్టేషనంతా కిక్కిరిసి పోతూ ఉంది. ఎలాగో కాస్త ఖాళీచేసుకుని ఓ సిమ్మెంటు బెంచీమీద చివరకే కూచుంది.

కృష్ణకి జ్వరం ఎలా ఉందో! వాడికి టెన్త్ క్లాస్ దాకా ఆమె దగ్గరే పడుకోవడం అలవాటు. జ్వరం వస్తే ఎన్నెన్నో పలవరింతలు పలవరించే వాడు. నాన్న కంటే కూడా అమ్మ కొంగే కావాలి. రఘు ముందుగా వెళ్ళాడు కనక జానకికి కాస్త ఊరటగా ఉంది. రఘు వంశీకృష్ణని హాస్టల్లో నుంచి చెల్లిగారి ఇంటికి తీసుకొచ్చేసేడట.

జానకి మనసంతా పిల్లాడిమీదే ఉంది. మాటిమాటికీ వాడి జ్వరం గురించే ఆలోచన. బయల్దేరే ముందు ఫోన్ చేసింది. నిద్రపోతున్నాడని చెప్పాడు. వాడు నిద్రలేచేసరికి వెళ్ళిపోవాలి అనుకుంది. కానీ ఇప్పుడెలా ? ట్రైన్స్ లేవు. వెనక్కి వెళ్ళాలని లేదు. పోనీ బస్‌లో వెళ్దామా! అంటే అవయినా సమయానికి ఉండాలి కదా!

ముసురు తగ్గటం లేదు. దాంతోపాటు దిగులు ముసురు. రైల్వేవారి స్పీకర్లు అవిరామంగా మోగుతూనే ఉన్నాయి, 'కృపయా ధ్యాన్ కీజియే' అంటూ...

జానకి ధ్యానం, ధ్యాస అంతా పిల్లవాడి మీదే ఉంది. అరగంట గడిచింది. ఆమెకు లోపలంతా బరువుగా ఉంది. అందుకే రైల్వేవారి 'దయచేసి వినండి' ప్రకటన సరిగ్గా వినపడటం లేదు.

ఇంతలో స్టేషన్‌లోకి బెజవాడ వైపు వెళ్ళేఏదో ఎక్స్‌ప్రెస్ రైలు వేగంగా వస్తోంది. అందరూ ఆత్రంగా పరిగెడుతున్నారు. అది చూసి జానకి లేచింది, ఎలాగోలాగ ఇరుక్కుని కూచునో, లేదా నిలబడి అయినా సరే వెళ్ళిపోతే బావుణ్ణు అనుకుంటూ.

ఇది తెల్లవారు ఝామున రావాల్సిన రైలట. ఇప్పుడొచ్చింది. ఆఘమేఘాలమీద రైల్వే ప్లాట్‌ఫారంని అదరగొడుతూ వచ్చి ఇంజను స్టేషన్ దాటి ముందుకు వెళ్ళి ఆగింది.

జానకి లేచి గబగబా నడిచింది కానీ అన్ని పెట్టెలూ కిక్కిరిసి ఉన్నాయి. జనం వేళ్ళాడుతున్నారు. ఎక్కడానికి దారీ లేదు, తోసుకుని ఎక్కే చొరవా చెయ్యలేకపోయింది. అలా వరసగా పెట్టెలన్నీ చూసుకుంటూ పరుగులాంటి నడకతో ఎక్కడయినా వీలు చిక్కకపోతుందా అనే ఆతృతతో నడుస్తున్న ఆమెకు కొద్దిమంది ఓ ఖాళీగా ఉన్న పెట్టెలోకి ఎక్కడం కనిపించింది.

ఆమె కూడా ఆలోచించకుండా గబుక్కున ఎక్కేసి హమ్మయ్యా అనుకుంది. ఎక్కేనుకదా! ఇక అక్కడికి కృష్ణగాడి దగ్గరకి ఎలాగయినా వెళ్ళి పడిపోతాను అని నిశ్చింతలోకి వెళ్ళబోయింది.




వీరలక్ష్మీదేవిగారు ఈ కథలో ప్రస్తావించిన 'క్వీన్' చిత్రంలో ఒక దృశ్యం.
ఈ చిత్రంలో కథానాయిక పాత్ర పోషించినందుకే కంగనా రౌనత్
ఈ ఏటి ఉత్తమనటిగా జాతీయస్థాయిలో ప్రభుత్వ పురస్కారాన్ని గెలుచుకుంది.

తీరా చూస్తే అది గార్డు పెట్టె. తెల్లబట్టల గార్డు జెండాలు అటూ ఇటూ సర్దుకుంటూ కనిపించాడు. ఎక్కినవాళ్ళని ఏమీ అనలేదు. ఎక్కిన వాళ్ళుకూడా కాస్త కాస్త తడిసి తడిసిన కోడిపెట్టల్లా కునుకుతూ ముడుచుకుని నిలబడ్డారు. ఆడామగా అంతా ఉన్నారు. కానీ విద్యావంతుల్లా లేరు.

పెట్టెలో ఒక పక్క చిన్న బల్లలాంటి సీట్ ఉంటే గార్డ్ జానకిని చూసి దానిమీద కూచోమన్నాడు. హమ్మయ్య అని మళ్ళీ అనుకుని ధైర్యం తెచ్చుకుని కూచుని థాంక్స్ చెప్పింది. అప్పటికి తడిసానని గుర్తొచ్చి హేండ్‌బాగ్‌లోంచి జేబు రుమాలు తీసి మొహం తుడుచుకుంది.

రైలు బయలుదేరింది. గార్డు పెట్టెకి తలుపులు లేవేమో గాలి గట్టిగానే తగుల్తోంది. జానకి పమిట కొంగు భుజం చుట్టూ కప్పుకుంది. ఎక్స్‌ప్రెస్ రైలు వేగంగా పరిగెత్తడం మొదలుపెట్టింది. గంటలో రెండు స్టేషన్లు దాటాయి. గార్డు ఎర్రజెండా, పచ్చజెండాల్లాంటివి ఊపడం లాంటిదేదో చేస్తున్నట్లున్నాడు. ఆమె దృష్టి దానిమీద లేదు.

మావగారి పేరు వెంకట కృష్ణారావు. వంశీతో కలిసి ఆమె వాడికి ఇష్టంగా వంశీకృష్ణ అని పేరు పెట్టుకుంది. మురళీకృష్ణ అని పెడతారు గాని, అదే అర్థం అయినా వంశీకృష్ణ పేరు ఇంకా కొత్తగానే అనిపిస్తుంది. ముచ్చటగా కృష్ణకి మాస్టర్‌ని వెతికి పట్టుకుని ఫ్లూట్ నేర్పించింది. అప్పుడప్పుడు అమ్మకోసం మోగిస్తూంటాడు.

రైలు ఏదో స్టేషన్‌లో ఆగింది ఒక్క నిముషమే. అలా అనిపిస్తుంది గానీ, రెండు నిమిషాలు ఆగి ఉంటుంది. గార్డు పెట్టెలో ఎక్కిన వాళ్ళు కొందరు దిగిపోయారు. ఇంకెవ్వరూ ఎక్కలేదు. మళ్ళీ కదిలింది. ఆమెతోపాటు మరో ఇద్దరు మిగిలారు. ఇద్దరూ మగవాళ్ళే. జానకి ఇవేమీ పట్టించుకోవడంలేదు.

ఆ ఇద్దరిలో ఒకడు చుట్ట వెలిగించాడు. గార్డు చూసి కోప్పడి ఆర్పించేసాడు. ఆ ఆసామి నిప్పు కిందపడేసి ఆరిన చుట్టను చెవిలో పెట్టుకున్నాడు.

అప్పుడు గమనించింది వాళ్ళని. నిలబడే ఉన్నారు. రైలులోంచి బయట వానకేసి చూస్తున్నారు. గార్డు వైపు కూడా అప్పుడే చూసింది. ఏమీపట్టనట్టు బయటికి చూస్తూ నిలబడి ఉన్నాడు.

ఇంకొక్క రెండు గంటలు కళ్ళు మూసుకుంటే వెళ్ళిపోవచ్చు. వంశీకి జ్వరం తగ్గేదాకా అక్కడే ఉండాలి. వాడికి ఓపిక వచ్చాక మురళి మోగించమని అడిగి విని రావాలి. జానకి మనసునిండా అలాంటి ఊహలే.

కాసేపట్లో మరో స్టేషన్ రాబోతున్నట్టుగా సిగ్నల్. రైలు ఒకే ఒక్క నిముషం, నిజంగానే ఒక్క నిముషం ఆగింది. ఆమె అటునుంచి ఇటు తిరిగే లోపు మిగిలిన ఇద్దరూ దిగిపోయారు. రైలు కదిలిపోయింది.

అప్పటికి కూడా జానకి నిశ్చింతగానే ఉంది. కదిలే రైల్లో ఆ పెట్టెలో గార్డు, ఆమె ఇద్దరే ఉన్నారన్న ఆలోచన ఆమె మనసుకి తట్టలేదు. ఎందుకంటే అప్పటిదాకా అతని పద్ధతి ఆమెకు జండర్ స్పృహని కలిగించలేదు. మనిషి అనే అనుకుంది, మగవాడని అనుకోలేదు.

మరో పావుగంటలో అదంతా అబద్ధమైంది.

అతను - తెల్ల బట్టల రైల్వే గార్డు - గుమ్మం దగ్గరే నిలబడి ఆమెవేపే చూడడం మొదలు పెట్టాడు. ఆమె ఉన్నట్టుండి ఒక్కసారిగా అతని మొహం చూసి కంగారు పడింది. అతని చూపు మారిపోయింది. మోహంలోకి ఏదో, మాటలలో చెప్పలేని దుష్టత్వఛాయ వచ్చినట్లు అనిపించిం దామెకు.

కానీ తన ఆలోచన తప్పేమో! అనుకుంది. ఒంటరిగా ఉండటంవల్ల భయంతో అలాంటి ఆలోచన వచ్చిందేమో అనుకుంది. అటు చూడ కుండా ఇటు తిరిగి బయటకు చూస్తూ కూర్చుంది. కానీ బెరుకు బెరుకుగా మనసు అటే చూస్తోంది.

మరో పావుగంటకు ఏదో తగిలినట్టయితే పక్కకు తిరిగింది. అతను దగ్గరికి వచ్చి పక్కనే తగులుతూ కూర్చున్నాడు.

జానకికి కళ్ళు తిరిగినంత పనయింది. నిజమే, తన ఊహ నిజమే, ఇది భ్రమ వల్ల కలిగిన అపోహ కాదు. వాడి దుర్మార్గపు ఆలోచన వాడి మొహంలో కనిపించింది. అది నిజమే...!

ఏం చెయ్యాలి ఇప్పుడు? కాళ్ళు వణుకుతు న్నాయి. కాళ్లేమిటి, ఒళ్ళంతా వణుకుతోంది. భయం భయంగా భయం. వాడు నవ్వుతూ చూస్తున్నాడు, వికారంగా...

ఎంత దుర్మార్గం? దుర్మార్గం ఇలా రెప్ప పాటులో ప్రత్యక్షమవుతుందా? ఉన్నట్టుండి ముసు గు తీసి పారేసుకుంటుందా?

జానకి... బేంక్‌లో ఎంతో మంది పబ్లిక్‌తో డీల్ చేసే జానకి గొంతు పొడారిపోయింది. ఒక్క సారిగా ప్రయత్నించి తను ప్రభుత్వోద్యోగినని గుర్తు చేసుకుంది. విద్యావంతురాలినని జ్ఞాపకం చేసు కుంది. గొంతు పెగుల్చుకొని "దూరంగా వెళ్ళి కూర్చోండి" అంది. వాడు లేవలేదు. ఇంగ్లీషులో మళ్ళీ చెప్పింది.

ఇంతలో ఏదో స్టేషన్ రాబోతుంది. వాడు లేచాడు. రైలు స్టేషన్‌లో ఆగలేదు. వాడు గుమ్మం దగ్గరకి వెళ్ళి ఏదో జెండాను చూపించినట్టున్నాడు.

జానకి గుండె జారిపోయింది. స్టేషన్ దాటింది రైలు. వాడు మళ్ళీ రాలేదు. జానకికి అంత చలిలోనూ, ముసురులోనూ చెమటలు పట్టాయి. ఏదేదో, ఎన్నెన్నో సంగతులు కళ్ళముందు మెదిలాయి. టాక్సీలు ఎక్కించుకుని ఎక్కడికో తీసుకుపోతుంటే ఆ ఆడపిల్లల పరిస్థితులు మీడియా ద్వారా వినగానే ఇంత భయంకరంగా ఉంటుందా అని అనిపించింది.

మళ్ళీ వాడు దగ్గరికి రాలేదు. కానీ వస్తాడని ఆమెకు తెలుసు. వస్తే ఏం చెయ్యాలి? వాడు చెయ్యి పట్టుకోగలడు. ఇంకా ఏమైనా చెయ్యలేడు కానీ, చెయ్యి ముట్టుకుంటే చాలదు! కదిలే రైలులో ఒంటరిగా చూసి ఏమీ చెయ్యలేదన్న ధైర్యంతో చెయ్యి పట్టుకోవడం కూడా అత్యాచారమే కదా! అదయినా ఎంత అవమానం!!

ఏం చెయ్యాలి? ఏం చెయ్యాలి? అని గుండె దడదడలాడిపోతోంది. వచ్చాడు... మళ్ళీ వచ్చాడు. ఆమె అనుకున్నట్టే చెయ్యి పట్టుకున్నాడు.

జానకి ఊహించిందే అయింది. అనాలో చితంగా ఒక్కసారి విడిపించింది. ఇప్పుడెలా? ఈ పరిగెత్తే రైలులోంచి దూకలేనే? పోనీ వాడిని తోసె య్యగలనా? అదీ చెయ్యలేను. ఇలాంటివి మనకి ఎప్పుడైనా చేతనవునా? ఇప్పుడు చెయ్యడానికి అని అనుకుంటూ గబగబా ఆలోచిస్తోంది.

కొంచెం భయపడినట్టున్నాడు. కానీ కోపం గా మారాడు. మళ్ళీ వెళ్ళి గుమ్మం దగ్గర నిల బడ్డాడు. జానకిని భయం నమిలి మింగేస్తోంది. కానీ ఆమె వయసు లోపలనుంచి ధైర్యం చెప్తోంది, "భయపడకు. ఈ రైల్లో వీడు నిన్ను ఏమీ చెయ్య లేడు" అని ...

ఏం చెయ్యాలి? ఈ తాకడం చాలదూ! అసలు వాడి మొహం లోకి వచ్చిన ఆ వికృత భావనే ఎంతో అసహ్యం కలిగిస్తోంది. అంటే వాడు తనని ఎలా అనుకుంటున్నాడు? ఒక సాటి మనిషి గా కాదు కదా! ఒక మాంసపు ముద్దగా కదా!

రైలు వేగం తగ్గింది. జానకిలో చిన్న ఆశ. స్టేషన్ రావాలి...రావాలి...ఒక్క నిముషం ఆగినా దూకెయ్యాలి. అసలు బుద్ధిలేక ఈ పెట్టెలో ఎందుకెక్కాను అని తిట్టుకుంది.

దేవుళ్ళున్నారా? దేవతలున్నారా? కృష్ణ జ్వరం ఎలా ఉందో? లేచాడా? అమ్మ వస్తుందని చూస్తున్నాడా? అమ్మ పరిస్థితి ఇలా అయింది. మంచితనాలు, సున్నితాలు తప్పేమో! వాడిని ఒక లెంపకాయ కొడితే రైల్లోంచి తోసేస్తాడని భయమా! భయంగానే వెనక్కు చూసింది. వాడు తిరిగి జెండా ఊపే పనిలో ఉన్నాడు. వెంటనే లేచి ఇటు గుమ్మం దగ్గరకి వచ్చింది

రైలు ఆగడమేమిటి...జానకి మసక చీకట్లో, వానలో, ప్లాట్‌ఫారం లేని చోటు కంకర రాళ్ళమీదికి దూకడమేమిటి ఒక్కసారిగా జరిగిపోయాయి.

రాళ్ళమీంచే పరిగెత్తి ప్లాట్‌ఫాం ఎక్కింది. వరసగా జనరల్ బోగీలు. గబుక్కున గుమ్మంలో జనాన్ని తోసుకుంటూ ఒక పెట్టెలోకి దూరి కిక్కి రిసిన జనం మధ్య నిలబడి "హమ్మయ్య బతికేను" అని గట్టిగా ఊపిరి పీల్చుకునేలోగానే రైలు కదలి పోయింది. చీకటిలో ఏదో స్టేషన్ దాటిపోయింది. జానకికి చోటు దొరకనేలేదు. నిలబడే ఉంది. అయినా ఆ కిక్కిరిసిన రైలు పెట్టె ఆమెకు ఇరుకుగా అనిపించలేదు. అమితమైన ధైర్యాన్ని ఇచ్చింది.

* * *

"ఇది జరిగి రెండేళ్ళయింది. ఎవరికీ చెప్ప లేకపోయాను. చెప్పాలంటే ఏదో అవమానంగా అనిపించింది" అంది జానకి ఆ రాత్రి గీతకు అంతా చెప్పాకా.

"చూడు జానూ! ఇంత పెద్ద దానివి నువ్వే ఇంత భయపడ్డావు. ఎవరికీ చెప్పలేకపోయావు. ఇక పిల్లల సంగతేమిటి చెప్పు?" అంది విచారంగా గీత.

"అవును కదా! రైల్వేస్టేషన్‌లు యువర్ అటెన్షన్ ప్లీజ్, కృపయా ధ్యాన్ కీజియే అంటూనే ఉంటాయి. మనం ఎంత అటెన్షన్‌లో, ఎంత జాగ్ర త్తగా ఉన్నా ఇలా జరుగుతూనే ఉన్నాయి. వాడు 'గార్డు'. అంటే రైల్లో ప్రయాణీకులందరినీ గార్డు చెయ్యాల్సిన వాడు. నేను ఒంటరిగా దొరికేసరికి అంత దుర్మార్గంగా మారిపోయాడు. రేప్ అంటే ఏమిటి? ముందు ఇలా అవమానించడం...ఆ తర్వాత హింస. అదే కదా వీళ్ళు చేస్తున్నది. తలుచు కుంటే ఇప్పటికీ వణుకు వస్తుంది" అంది జానకి.

"హెచ్చరిస్తూనే వాళ్ళే కబళిస్తారు. అవకాశం కోసం కాచుకునుంటారు. ఎక్కడని, ఎన్నిచోట్లని అప్రమత్తంగా ఉండగలుగుతాం" అని వాపోయింది గీత.

"పెద్ద బరువు దిగినట్టుందే నీకు చెప్పు కుంటే" అంది జానకి. ఆవిలింతలు వస్తున్నాయి. ఆ రిలీఫ్‌కి ఆమెకు నిద్ర వచ్చేస్తోంది. గీత దిళ్ళు సవరిస్తూ జానకిని పడుకోమని దుప్పటి కప్పుతూ అంది.

"ఆడపిల్లలు అన్ని విషయాలు నమ్మకమ యిన వాళ్ళెవరికో ఒకరికి చెప్పుకుంటూ తమని తాము రక్షించుకోకపోతే, ప్రాణాలు కూడా మిగిలే పరిస్థితులు ఉండట్లేదు సుమా!" అంటూంటే జానకి అంది. "ఇదంతా అవమానంగానూ, తప్పుగానూ అనుకోవడమే మనం చేస్తున్న తప్పు. అవమాన పడవలసినది ఇలాంటి మగాళ్ళూ, వాళ్ళను పెంచి పోషించే సమాజమూనూ. మనం కాదు!" అంటూ గీత చెయ్యి పట్టుకుని నిశ్చింతగా కళ్ళు మూసు కుంది.

# 2014లో తెలుగు కవితా వికాసం

2014లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం నుండి తెలంగాణ రాష్ట్రం విడిపోయింది. "తెలుగుజాతి మనది నిండుగ వెలుగుజాతి మనది" అని ఉప్పొంగిపోయే ఆంధ్రులు రెండు రాష్ట్రాలుగా విడిపోయినందుకు తెలంగాణ ప్రాంత ప్రజలు ఆనందిస్తే, కోస్తాంధ్ర, రాయలసీమ, ఉత్తరాంధ్ర ప్రజలు హతాశులయ్యారు. రాష్ట్ర విభజనకు పూర్వం తెలుగు సాహిత్యవేత్తలలో భిన్నాభిప్రాయాలు విన్పించాయి. సీమాంధ్ర ప్రజలు తెలంగాణ భాషా సంస్కృతులను అవమానిస్తున్నారని, తమ జలవనరులను, ఖనిజ సంపదను, ఉద్యోగావకాశాలను దోచుకుంటున్నారనే భావనతో తెలంగాణ కవులు కొందరు కవితలు రచించారు. ఉద్రేకపరులైన విధ్వంసకారులు కొందరు హైదరాబాదు టాంక్‌బండ్‌పై వున్న ఆంధ్ర సంస్కృతికి గర్వకారణమైన మహనీయుల విగ్రహాలను కూలగొట్టారు. ఈ విధ్వంసాన్ని సాంస్కృతీపరులందరు నిరసించారు.



9959778698

## డా. కడియాల రామమోహనరాయ్

**పెనుగాలి** వీచి అణగారిపోయిందని అనుకుంటున్న తరుణంలో హుద్‌హుద్ తుఫాను ఉత్తరాంధ్రను అతలాకుతలం చేసి తీవ్ర సంక్షోభానికి గురిచేసింది. పంట పొలాలకు, పరిశ్రమలకు, నివాస గృహాలకు తీరని నష్టం కలిగించింది. పునాదుల నుండి ప్రారంభమవుతున్న నవ్యాంధ్రప్రదేశ్ నిర్మాణానికి తీవ్ర విఘాతం కలిగించింది.

రాష్ట్ర విభజన, హుద్‌హుద్ తుఫాన్‌లు తెలుగు కవులను ఆందోళనకు గురి చేశాయి. ఈ యేడాది వివిధ పత్రికలలో వచ్చిన కవితలలో యీ ఆవేదన ప్రస్ఫుటంగా కనిపించింది.

అంతర్జాలం కొందరు తెలుగు కవుల వేదికై ఫేస్‌బుక్ ద్వారా పాఠకులకు చేరువైంది. ఫేస్‌బుక్‌లో కవితలు విన్పించిన కవులు 'కవి సంగమం' ద్వారా సన్నిహితులయ్యారు. మూడుతరాల కవులను ఒకే వేదిక మీదికి తెచ్చి రసజ్ఞులకు వారి కవితలను విన్పిస్తున్నది. 'కవి సంగమం' చేస్తున్న ఈ ప్రయత్నం మెచ్చదగినది.

ప్రముఖ సాహిత్యవేత్తలలో చేకూరి రామారావు, పైడి తెరేష్ బాబు, కె.చిరంజీవి, రతన్‌బాబు, ద్వివేదుల విశాలాక్షి, గోవిందరాజు సీతాదేవి, మల్లాది సుబ్బమ్మగారల మరణాలు. సాహిత్యాభిమానులకు బాధ కలిగించాయి. అరవై ఏళ్లపాటు కవుల కవితలకు తన రేఖా చిత్రాలతో జీవమిచ్చిన ప్రముఖ చిత్రకారుడు బాపు అస్తమయం మరింత బాధాకరం.




సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులు, పాలగుమ్మి పద్మరాజు, విద్వాన్ విశ్వం, డాక్టర్ జి.వి. కృష్ణారావు, సంజీవదేవ్, చాగంటి సోమయాజులు, వట్టికోట ఆళ్వారు స్వామి శతజయంతులను వేడుకగా జరుపుకొని తెలుగు వారు, వారివారి ఉజ్వల వారసత్వాన్ని కొనసాగిస్తున్నారు.

ప్రచురణకర్తల ప్రోత్సాహం లేకపోయినా కవులు తమ కావ్య సంపుటాలను అందంగా ప్రచురించుకుంటున్నారు. వేర్వేరు ప్రదేశాల నుండి పెక్కు సాహిత్య సంస్థలు కవులను తగు పురస్కారాలతో సత్కరిస్తూ వస్తున్నాయి.

కవి, కథకుడు, నవలారచయిత, చిత్రకారుడు శీలా వీర్రాజు కవితల్లో అందమైన పదచిత్రాలు ఆహ్లాద పరుస్తాయి. "ఒకప్పుడు పల్లెల్లోనే కాదు పట్టణాల్లోనూ / పచ్చని చెట్ల మధ్య కాకుల కావుకావులు / ఇప్పుడు / నగరాల్లోనేకాదు పట్టణాల్లోనూ / అపార్ట్‌మెంట్ల మధ్య పావురాల కువకువలు / నిండు వెలుగుల పగటి కన్న / కటిక చీకటి రాత్రి కన్న / వెలుగు నీడలు పరుచుకున్న ఉభయ సంధ్యల్లోనే అందాల ప్రకృతి ఆవిష్కారమౌతుంది"

**(చిరుజల్లులు)**

"కష్టజీవుల కన్నీటిలో తడిసి / బరువెక్కిన అక్షరాలు నావి" అనే కవులు తమ మాటలకు పొంతన లేని విలాసమయ జీవితాన్ని గడపటాన్ని ఈయన హేళన చేశారు.

"మరణభయం చుట్టు ముట్టినప్పుడు /...గుళ్లూ గోపురాలవైపు / సాగిపోకుండా / భజన్లూ బాబాలవైపు జారిపోకుండ / నా రంగుల ప్రపంచం / నన్ను కాపాడుతూనే వుంటుంది / నా అక్షర ప్రాంగణం నన్ను ఆదుకుంటూనే వుంది" అన్న ఈ కవి సంకల్ప బలం ప్రశంసించదగినది.

"నా చిన్నప్పుడు ఉన్న ఒకే ఒక్క బట్టలజత / ఆరేసినప్పుడు దండెం విలువ తెలిసొచ్చింది /...బొట్లు రాలుతుంటే / అవి పేదరికం దుఃఖాన్ని తలపించేవి" అంటున్నారు ఎన్.గోపి 'మళ్లీ విత్తనంలోకి' లో...

"నడిచే పాదాలు రచించిన దీర్ఘకావ్యంలాగా పిల్లబాట / ఎక్కడ పుట్టిందో

తెలియదు / ఎక్కడ ముగుస్తుందో అర్థంకాదు / అడవికి భయపడదు / పట్టుకుందామంటే దానికే దొరకదు / పేరుకే అది పిల్లబాట / నిజానికది / అంతులేని బతుకుపాట / మా అమ్మమ్మ ఊరికి వెళ్లే పిల్లబాట / ఇప్పటికీ మరపురాదు / నా కవిత్వం పంక్తులన్నీ దాని చలవే / నా కవిత్వంలోని ఆ విశ్వాసమంతా / పిల్లబాట ప్రసాదించిందే / ఆత్మీయత దాని భావం / మానవత దాని స్వభావం" అంటున్నారు గోపి. అందుకేనేమో రెండూళ్లమధ్య, కాలిబాటను చూసినప్పుడల్లా గోపి **'పిల్లబాట'** కవిత తప్పక మదిలో మధురంగా మెదులుతుంది.

"ఎంత అద్భుతమో ఈ మనస్సు" అంటున్నారు ముకుంద రామారావు తన **'ఆకాశయానం'** లో...

'కల నాకు ఎప్పుడూ ఆశ్చర్యమే / దాని జ్ఞాపకం కూడ పని చేయదు / ఆదేమిటో/ దిండులో అంతగా పోగొట్టుకుంటుంది"..."ఉచితమే అయినా నాకలల్లోకి ఎవరినీ తీసుకుపోలేను" అని కలల అనుభూతిని విలక్షణమైన రీతిలో వెల్లడించారు ఈ కవి.

మరణాన్ని గురించిన ముకుంద రామారావు ఆలోచనలు చిత్రమైనవి. "ఎక్కడ ఆపేశామో / అక్కణ్ణించి చదవటం మొదలుపెట్టినట్లు / మరణం తర్వాత జీవితం ఎలా మొదలవుతుందో తెలిస్తే బాగుండు"

**(మరణానికి ముందు మరణాలు)**

తెల్లవారిన తర్వాత కనిపించే ప్రకృతి దృశ్యాలను ఈయన అందంగా చిత్రించారు. "చిరుగాలికి ఊగుతున్న ఊయలలా / వేకువజామున పసిపాప నవ్వు / నిశ్శబ్దంలో పక్షులే మాట్లాడుతున్నాయి /... ఎండిన చెట్టుకొమ్మలకి / ఎర్రగా వేలాడే ప్రయత్నంలో సూర్యుడు"

**(వెలుగు పువ్వు విచ్చుకున్నాక)**

"కొత్త ఉదయానికి స్వాగతించాలంటే / పాత దుఃఖఛాయల్ని తుడిచేయాలి" అంటున్నారు శ్రీమతి శీలా సుభద్రాదేవి 'నా ఆకాశం నాదే'


ఎన్.గోపి


సి.నా.రె

లో..."గూటిపక్క ఆకుపచ్చని కొమ్మపై కూర్చొని / ఆలోచనల్ని ఆలపిస్తున్న నన్ను / ఏ పంజరంలోనో బంధించి ఏ చూరుకో వేలాడదీయొద్దం"టారు సుభద్రాదేవి.

"కులాంతరాలూ మతాంతరాలూ దేశాంతరాలుగా / వైవాహిక సంబంధ బాంధవ్యాలు కలగలుపుకొంటూనే / మగవాడి కులాన్నే / దరఖాస్తుల్లో / ప్రతిష్ఠించుకొంటున్నాం" అని ఈమె జండర్ వివక్షను ఆక్షేపించారు.

"మాట మంచిదైతే అంతా మంచిగా వుంటుంది / ఎర్రని ఎండలో సాగే జీవన యానంలో గొడుగై నీడ పడ్తుంది / మనిషి మనిషికీ మధ్య వంతెనై / హృదయాల్ని కలిపే మాలగా అల్లే దారమౌతుంది" భావప్రకటనలో ఈమె మాటతీరు ఇంపు గొలుపుతుంది.

"నిన్ను చూసిన ప్రతి తావు నీ స్మృతిగా బంధించి / నీటి రంగుల చిత్రంగా నీకు సమర్పిస్తాను" అన్నారు వాడ్రేవు చినవీరభద్రుడు **'నీటిరంగుల చిత్రం'** లో...

ఒక కవితను రాయటమంటే "గోవును సేవించినట్లుగా / వాక్కును సేవించాలి / గోచర జీవితానుభవాన్ని క్షీరంగా మార్చుకోవాలి" అని తలుస్తారు వీరభద్రుడు.

"కవులేం చేస్తారు / పండుగ అయిన మర్నాడు వీధులూడ్చే వాళ్లలా / నిశ్శబ్దంగా భాషను శుభ్రపరచుకుంటూ పోతారు"

"రోజూ పొద్దున్నే నన్నొక పిట్ట నిద్రలేపుతుంది / నీళ్ల గొట్టం మీద వాలి / నోరారా అరుస్తుంది / తెల్లవారుతూనే ఒక దీపం వెలిగిస్తుంది / తానే సూర్యుడికి తోవ చూపిస్తుంది / ఇంతా చేసి పిడికెడు దేహం / ఏది కంఠమో / ఏది హృదయమో వేరు చేసి చూపలేం రోజూ పొద్దున్నే" అంటున్న ఈ కవి దృష్టికి ప్రకృతి అంతా చైతన్య విలసితమే... రాగరంజితమే...!

వీరభద్రుడు తన తల్లిని గురించి తెలిపిన తలపులు రమ్యమైనవి, ఆలోచనామృతమైనవి. "వానపాములు ఆకాశంలోంచి పడతాయనుకునేది మా అమ్మ / పదమూడు కాన్పులామెకు / ఎనిమిదిమంది పిల్లల్ని పెంచింది / దెబ్బయ్యేండ్లు బతికింది / మెలకువగా వున్నంతసేపు నలుగురి కోసం ఏదో ఒక పని చేసేది / బతికినంత కాలం ఎవరికీ ఒక ఉత్తరం రాయవలసిన పని పడలేదామెకి / తన పిల్లల్లో ఒక్కరు కూడ ఎంతదాకా చదివారో తెలియదు / ఆమెకి తెలిసిందేదో మాకు తెలియనే లేదు"

**'నీటి రంగుల చిత్రం'** కావ్య సంపుటి సరళ సుందరమైన భాషలో




రసజ్ఞులను అలరింప జేయగలిగినది.

"దాంపత్య జీవితంలో ఒకరికోసం ఒకరున్నా ఎదురుచూసే పని ఏకాలంలోనైనా అర్థాంగిదే"..."భార్యాభర్తల పోటీలో / ఎప్పుడూ ఓడిపోయిన వారే / గెలుపు ఆనందాన్ని పొందుతారు"...అంటూ దాంపత్య జీవిత శోభను కవి మొవ్వా శ్రీనివాసరావు అందంగా వర్ణించారు తన 'సిక్స్ ఎలిమెంట్', 'సమాంతర ఛాయలు' కవితలలో...

పొలం సాగుచేసే ఎడ్లతో రైతు అనుబంధాన్ని ఈయన అద్భుతంగా తెలిపారు.

"అమ్మా నాన్న వెక్కి వెక్కి ఏడుస్తున్నారు / వూళ్లో జనమంతా ఎడ్ల కొట్టం ముందు మూగివున్నారు / పొద్దునార్పిన పొయ్యి మళ్ళీ వెలిగించలేదు / ఏడేళ్లు పని చేసి ఎత్తుబడి మెత్తబడ్డ పెద్ద ఎద్దును నాన్న ప్రతిరోజూ పొద్దున్నే కర్రలతో లేపి కడిగేవాడు / పసిగుడ్డుకు పక్క మార్చినట్లు గడ్డిపేర్చి పక్క మార్చేవాడు / కాకులకు కాపలాకాస్తూ/ పుండుబడ్డచోట పొడుస్తాయేమోనని/ ఎత్తుపీటేసుకొని / ఎప్పుడూ పక్కనే కూర్చునేవాడు / తన చేతుల్తోనే దానా తినిపించేవాడు / పసుపు కుంకుమా చల్లి ఊరంతా ఊరేగించి / ఉప్పు పాతరేస్తున్నప్పుడు / ఏడ్చిఏడ్చి చింతనిప్పులయిన నాన్న కళ్లు నాకింకా గుర్తే"...ఎద్దులతో రైతు అనుబంధం తెలిసినవారికి శ్రీనివాసరావు కవిత కరుణరస భరితంగా ఉండడంలో ఆశ్చర్యంలేదు.

కొప్పర్తి **'యాభై ఏళ్ల వాన'**లో "ఆద్యంతాలు లేని నిద్రలో జీవితం / ఒక ఉలికిపాటు" గా పేర్కొన్నారు. "చీకటనీ వెలుతురనీ / రెండుంటాయంటాం కానీ / ఉండేది చీకటే / వెలుతురు వచ్చి వెళుతుంది" అంటారు కొప్పర్తి.

"బుష్ ప్రపంచానికే శత్రువు / సద్దాంకూ నాకూ శత్రువు కాకుండా ఎట్లా వుండగలడు / అయితే నా శత్రువు శత్రువులందరినీ నేను మిత్రులుగా అంగీకరించలేను / బుష్‌ని ధిక్కరించినంత మాత్రాన సద్దాం వీరుడు కాలేదు / నాకు మిత్రుడూ అవలేదు" అంటూ ఒక నియంతను ధిక్కరించిన మరొక నియంతను కీర్తించటం తగదన్నారు కొప్పర్తి.

వర్షం కవులకు ఎప్పటికీ తరగని కావ్య వస్తువు. "ఎన్నిసార్లు కురిసినా వాన / అద్భుతంగా వుంటుంది / ఎన్నిసార్లు చూసినా / విస్మయం కలిగిస్తోనే వుంది / వానను చినుకు చినుకుగా ఎవరు కిందకు దింపుతున్నారు / భూమి మీద చిన్న చిన్న / ఆకాశాల్లాంటి గొడుగులు ఎందుకు విచ్చుకుంటాయి/ కిందకు దిగిన ఆకాశం/ వాన వెలిశాక నిలిచిన / నీటి మడుగుల్లో / ముక్కలై ఎట్లా కనిపిస్తుంది" అని కవి కొప్పర్తి ఒక పసిపిల్లవాని వలె స్వచ్ఛమైన మనస్సుతో వానను గూర్చి ఆశ్చర్యానందాలను వెల్లడించారు. **'యాభై యేళ్ల వాన'** ఒక హృద్యమైన గీతం. ఈ సంపుటిలో 'లెక్కలేనితనం', 'జండర్ పొలిటిక్స్', 'సుశీల' గీతాలు కూడా సహృదయులను అలరిస్తాయి.

### హృద్యమైన తెలుగు పద్యం

డా॥ రామడుగు వెంకటేశ్వరశర్మ 'చెంచులక్ష్మీ కల్యాణము', డా॥ కాసల నాగభూషణం 'నవీన సుమతీ శతకము' సహృదయులు చదివి ఆనందించదగిన పద్య కావ్యాలు.

"అక్కరకు రాని చట్టము
ముక్కక బదులీని ఫ్రెండు ముచ్చటపడి తా
నెక్కిన కదలని లిఫ్టును
గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ" మొదలైన పద్యాలతో ఆధునిక జీవిత దృశ్యాలను చమత్కరించి నాగభూషణం నవ్వులు పూయించారు.

2014లో వచ్చిన కావ్య సంపుటాలలో డా॥సి.నారాయణరెడ్డి 'నింగికెగిరిన చెట్లు', యార్లగడ్డ రాఘవేంద్రరావు. 'చివరంచు', ఎం.కె.సుగమ్ బాబు 'శిఖరం', యాకూబ్ 'నదీమూలంలాంటి ఆ ఇల్లు', ఆశారాజు 'నూతన పరిచయం', శైలజామిత్ర 'రాతిచిగుళ్లు', బండ్ల మాధవరావు 'అనుపమ', యస్.ఆర్.పృథ్వి 'కీలకం', సలీం 'విషాదవర్ణం', తాళ్లూరి లాబన్ బాబు 'వాయుగానం', హనుమారెడ్డి 'పావని', శ్రీమతి జగద్ధాత్రి 'సహచరణం' కూడ చదవదగిన మంచి కవితామాలలు.

తెలుగు పత్రికలు 2014లో కవులకు తగినంత ప్రోత్సాహం ఇచ్చాయి. కావ్యసంపుటాలను కొని చదవని పాఠకులు కూడ పత్రికలలో ప్రచురితమైన ఈ కవితలు ఆసక్తిగా చదువుతున్నారు.

ఈ యేడాది వచ్చిన అత్యుత్తమ కవితలలో **'నల్లతుమ్మ'** ప్రత్యేక స్థానాన్ని అలంకరించుకుంది. 'కాదేదీ కవిత కనర్హం' అనే మాటను సార్థకం చేస్తూ గోరటి వెంకన్న, సామాన్యంగా కవుల దృష్టికి అంతగా ఆనని తుమ్మచెట్టుపై మహాద్భుతమైన గేయమొకటి రాశారు.

"ఓ నల్లతుమ్మ పసిడి పూలకొమ్మ / నీవు లేక పల్లె చిరునామ లేదమ్మ / గులకరాళ్ల పవుక నేలలో మొలిసేవు / గుట్టలు రాల్లున్న గుబురుగ పెరిగేవు / పెట్టి పోతల కొరకు పెట్టుకోవు బెంగ / మేక పంచెకముంటె అదె నీకు సురగంగ / కంచె లేకనె పెరిగి కంచె నీవయ్యేవు / మంచెపై కాపుకు దాపు నీవయ్యేవు"...ఇలా...!

బతుకమ్మ పండుగంటే వెంకన్నకు పిచ్చి ఇష్టం. "కాలపు చెక్కిలిన పూలమేళం యీ పంముగ" అంటారు. "బతుకమ్మ తరలి రాగ ఏరమ్మ తనువు పొంగ / పసుపు పారాణి లేతపాదాలు తడిసి మురువ / సెరువమ్మ వొడిలోన కొలువు తీరిన" బతుకమ్మ సంబరాన్ని తనివితీరా గానం చేశారు.

కవి అందెశ్రీ 'నీలోకం నీదే కానీ', ఈ లోకం పోకడ తెలుసుకో మన్నారు. "ప్రవక్తలు ఎందరొచ్చినా ప్రపంచమేమన్న మారెనా / మారాలని కలలుగన్నరూ / మహాత్ములై వెలుగుతున్నరూ / ఎవరివల్ల మారినదెంత? / కన్నీళ్లె యీ జగమంతా / మనలో మనమె మారక పోతే / మారేదెప్పుడు మానవ చరిత?" అని ప్రశ్నించి, మానవ చరిత మారవలసిన అవసరాన్ని గుర్చి హెచ్చరించారు.

తొలి చూలు బిడ్డను గర్భంలో మోస్తున్న **'తల్లి తలపులు'**ను ఎ.సి. సుమిత్రాదేవి **'ఎవరు'** గీతంలో సున్నితంగా వెల్లడించారు. "ఎవరు / నా ఏకాంత సానువుల్లో / సీతాకోక చిలుకై / నా నిశ్శబ్దానికి / భంగం కలిగిస్తున్నది / ఎవరు / మా అనుబంధ సుప్రభావాన్ని / నవ్వుల ఉయ్యాల లూగిస్తున్నది / ఎవరు / నా ఆత్మలో ఆత్మగా వెలుగుతూ / నా దేహాన్ని తేజోవంతం చేస్తున్నది? ఎవరు మా మమతల మాధుర్యమై / నా బొజ్జలో మౌనవ్రతం చేస్తూ ఉషోదయాల కలలు కంటున్నది"

అంటున్న ఈ గీతంలో కావ్యవస్తువు, రెండూ విశిష్టమైనవి. చిరకాలం జ్ఞాపకం వుండే కవిత ఇది.

"మనుష్యులే కదా నిత్య చలనశీలురు / తనకు తానైన స్థితి నుండి తనవాళ్లకోసం తానుగా పనిచేసేవాళ్లు / చీకటి సముద్రంపై ఒంటరి యుద్ధం చేసే / జాలరి తెగువ ఆకాశదీపంలా వెలుగుతుంది / కోరలు చాచిన అలలపై నువు విసిరె / మెరుపు చూపుల కత్తి మొండిబారితే పదును పెట్టేందుకు రా / రా వెనక్కి రా / మళ్ళీ ప్రారంభించు ప్రారంభాన్ని" అని కవి విమల **'జీవనోత్సాహం'** లో నూరిపోశారు.

ఆదమరచి నిద్రపోవటంలో హాయిని కందాళై రాఘవాచార్య **'బంగారునిద్ర'** గీతంలో వర్ణించారు. "అన్నింటినీ మరచి / లోకాన్ని మరచి / శోకాన్ని మరచి, ఆదమరచి హాయిహాయిగా బంగారు కలలుకంటూ నిద్ర పోవటం ఎంత రాజయోగం..." "...నిద్ర రాని బతుకు / రాత్రి వేసే పగటి వేషం కాదా / మాత్రలు వేసుకుంటే వచ్చే నిద్ర / ఎంత మాత్రం నిద్ర కాదు" అన్నారు రాఘవాచార్య.

ఆధునిక జీవితంలో బాల్యం నాగరికతకు బలైపోతున్నదని జంధ్యాల రఘుబాబు ఆందోళన చెందారు. "ఫ్లోర్‌సెంటు వెలుగు జిలుగుల్లో / చల్లని వెన్నెల తలొంచుకుంది / యాంత్రిక జీవితాల్లో / మాంత్రికుడి కథలతో నీకేం / పనంటూ కుందేలు కన్నీరు పెట్టుకుంది /... ఆకాశహర్మ్యాలు నింగిని కప్పేశాయి / వెన్నెల పద్దానికి చోటేలేదు /.. సెల్‌ఫోనులు టాబ్లెట్లు / ఐపాడ్లు యాండ్రాయిడ్‌లు / మీ నేస్తాలయినప్పుడు నాతో ఇక పనేమిటంటూ / చందమామ సెలవు తీసుకొంది" అన్నారు ఈ కవి.


చిన వీరభద్రుడు


శీలా వీర్రాజు


ముకుంద రామారావు

"కూచోడమంటే / అలసత్వమనుకోరాదు / నడిచి పోవటమంటే వాహ్యాళి అనుకోరాదు/ ఎగసిపోవడమంటే / తప్పించుకపోవటం కాదు /... కూచోవాలనుకున్నా నడవాలనుకున్నా / ఎగరాలనుకున్నా / చైతన్య పార్శ్వాలన్నింటినీ / సంపుటీకరించికున్న మేధ / నిరంతర చలనశీలి"

డా॥ సి.నారాయణరెడ్డి కవిగా నిరంతర చలనశీలి. ప్రకృతిలో విభిన్న దృశ్యాలను ఎదపై పదిలపరచుకొని విశ్లేషించుకునే నేర్పు ఆయన 2014లో రాసిన వివిధ కవితల్లో వున్నది.

ప్రకృతి సౌందర్యాన్ని, జీవన వైవిధ్యాన్ని ప్రదర్శించటంలో తెలుగు కవులు ప్రతిభ చూపిస్తున్నారు. "ప్రపంచానుభూతిలో స్వీయానుభూతి పరమైనపుడే ఉత్తమ కవిత ఉద్భవిస్తుంద"ని తెలుసుకున్న కవులను కాలం తప్పక మన్నిస్తుంది.

యుద్ధభూమిలా వుంది ఆకాశం.

కుమ్ములాడుకుంటున్నాయి నల్లటి మబ్బులు. చినుకు మాత్రం రాలడం లేదు. వారం రోజుల్నుంచి యిదే తంతు. ఇలాగే సాగితే నారు ముదిరిపోయి ఉడుపుకి పనికిరాదు. మళ్ళు కొర్నుండి పోవలసిందే. ఆకు పొయకముందే వర్షాలు పడితే అదొక దారి. ఆ విత్తనాలైనా మిగిలేవి.





"ఇంట్లోని యితనాలు ఈదిబోయించింది
పిడికెడేస్తే పుట్టిడొస్తాయనిపించింది
ఎక్కింది ఎర్రగా ఎండ
కంట్లో కొట్టిందిరా వర్ర గుండ.

# అల్పపీడనం


9441415182

దప్పుశీను పాడిన పాటలాగే వుంది బతుకు. రుతువులు, కర్తెలు మార్కెట్లో రేట్లు అన్నీ రైతును మోసం చేసేవే. ప్రకృతికీ, ప్రభుత్వాలకీ ఎందుకో మరి కసి రైతంటే...చూస్తుండగానే ఆకాశంలో మబ్బులు పలు వర్ణాల్లో...వివిధ ఆకృతుల్లో తల పాగ చుట్టుకున్న రైతు శిరస్సులా...బిగించిన పిడి కిలిలా...ఒకరిమీద ఒకరు కలబడుతున్నట్టు... వాటిని చూస్తుంటే రకరకాల ఆలోచనలు. ఆ ఆలోచనలకు అక్షరరూపం యివ్వాలని కాగితాలు ముందేసుకుని కూర్చున్నాను. వాక్యం వెంట వాక్యం తరుముకొస్తుంటే అలా చాలా సేపు రాస్తూ కూర్చుండి పోయేను. కవిత పూర్తి కావస్తుందనగా మావారి పిలుపు.

"విజయా...అన్నం తినవా..."

"అన్నం తిందాం రా..." అనడు... "తినవా ..." అంటాడు, "నువ్వు తిన్నా తినకపోయినా నేను ఆగను" అన్నట్టు. నేను చదవడం లోనో... రాయడంలోనో మునిగిపోయినపుడు...పనిమనిషి వంటచేస్తే ఆయన తన భోజనం అయిందనిపించి టీ.వీ ముందు కూలబడిపోతాడు. లేదంటే నిద్ర.

ఆకలి అనిపించలేదు

మా వూరు...అక్కడి రైతులు... వారి దుర్భర జీవితం అవే కళ్ళముందు కదలాడుతున్నాయి. ఈ యేడూ కరువు తప్పదులా వుంది. ఎలా బతుకు తారో! ఇప్పటికే వలసలతో ఊరు సగం ఖాళీ అయి పోయింది. మా వీధిలో ఆయితే మా అమ్మ... మా అమ్మలాగే భర్తలు పోయి వంటరిగా ఇళ్ళల్లో చివరి రోజులు గడుపుతున్న ముసలమ్మలు నలు గురు. మా పెదనాన్న కొడుకు రాజు కుటుంబం... అంతే. వీళ్ళు తప్ప ఆ వీధిలోని అందరూ యిప్పుడు హైదరాబాదులోనో...చెన్నైలోనో... ఏలూరు... విజ యవాడ..ఎక్కడ పని దొరికితే అక్కడ...ఎవరు పనికి పిలుస్తారా అని సత్తు కేరేజిల్లో గెంజి నీళ్ళు పోసుకుని గుంపులు గుంపులుగా నగరాల్లో ప్రధాన రహదారి మీద...ఎదురు చూస్తూ... కనిపి స్తారు. ఆ దృశ్యం చూసినపుడు గుండె కలుక్కు మంటుంది. ఏ సాహిత్య సభకో వెళ్ళి బస్సులో వస్తుంటే ఏ నగరంలో చూసినా అదే దృశ్యం. వాళ్ళంతా మావూరి మనుషులే అనిపిస్తుంది. నా మనుషుల్లాగే కనిపిస్తారు. ఆ దృశ్యం గుర్తుకొస్తే చాలు కళ్ళల్లో నీళ్ళు తిరుగు తాయి.

రాయడం ఆపి ఇంట్లోకెళ్ళేను.

అప్పుడే నిద్రలోకి జారిపోవడమా ఆయన... గురక విన్పిస్తోంది. టీ.వీ. అరుస్తోంది. అన్నం పెట్టుకుని రెండుముద్దలు తిన్నాననిపించి తిరిగి రాతబల్ల ముందు కూర్చుంటే...మావారు నిద్ర లొంచే..."ఈ రాత్రి జాగారం చేస్తావా...సర్లె నాకేటి కొత్తా...గానీ...మీ తమ్ముడి పెళ్ళం అంటదట... పంట నష్టపరిహారం వొచ్చిందిగదా.. ఆ డబ్బులు వాళ్ళకే చెందాలని. నీ ఎకౌంట్ లోకి జమ అవు తాయి కదా...ఇచ్చీసినాయిచ్చేస్తావు, తమ్ముడంటే ప్రేమగదా!" అని మళ్ళీ గురకలో జారిపోయేడు.

ఇద్దరం టీచర్లం...ఏ లోటూలేదూ...మా పిల్ల లిద్దరూ ఉద్యోగాలు చేసుకుంటున్నారు. హాయిగా... అయినా యితనికి డబ్బు యావ పోదు. బ్రతుకు జరక్క తమ్ముడు మా పొలం కౌలుకు చేస్తున్నాడు. పోయినేడాది పంట పోయింది వరదలొచ్చి. పంట నష్టపరిహారం ప్రకటించింది ప్రభుత్వం. వెయ్యో.. రెండువేలో వస్తుందంటే అదెంత? నష్టపోయింది ఏడాది శ్రమ. అప్పుతెచ్చి పెట్టిన మదుపులు. వొచ్చిన ఆ పరిహారం డబ్బులకీ కక్కుర్తే తనికి. మాది కులాంతర వివాహం. ప్రేమించి పెద్దల్ని కాదని పెళ్ళి చేసుకున్నాం ఉపాధ్యాయ శిక్షణా కాలంలో . పక్కపక్క గ్రామాలు మావి. నేను తక్కువ కులానికి చెందిన మనిషిని ప్రేమించి పెళ్లిచేసుకు న్నానని మావాళ్ళెవరూ...మావాళ్ళేకాదు, మా

గంటేడ గౌరు నాయుడు

వూరోళ్ళుకూడా మాయింటికి వచ్చేవారుకాదు. మావారు మొదట్లో బాగానే వుండేవారు. డబ్బు కళ్ళచూసినకొద్దీ తన పరిస్థితి మారిపోయింది. మొదట్లో బంధువుల్ని ఇంటికి పిలిచి వారికి కావలసిన సహాయం చేసేవారు. ఇప్పుడు పూర్తిగా డబ్బు మనిషై పోయారు.

నా ఎకౌంట్లో కి జమ అయిన నష్టపరిహారం సొమ్మును అప్పుడే యిచ్చేసేనని చెప్పకపోవడమే మంచిదైంది. లేకపోతే నిద్ర పట్టేవాడా...రోజంతా గొణుకుతూనే వుంటాడు. "సరేలెండి...ఇవ్వను... నాకేం డబ్బు చేదా..." అన్నాను అతని సంతృప్తి కోసం. విన్నాడో...నిద్రలోవున్నాడో మరి...

తమ్ముడు గుర్తుకొచ్చి కళ్ళు చెమరించేయి.

తమ్ముడంటే మా పెదనాన్న కొడుకు. అయినా ఒక రక్తం పంచుకుపుట్టిన వాళ్ళలాగే పెరిగేం. ఒకప్పుడు ఊళ్ళో కాస్త కలిగినవాడు. ప్రోజెక్టు నిర్మాణంలో మావూరికీ...దక్షిణాన వున్న ఏటికీ మధ్యనున్న పొలాలు ముంపుకి గురవుతాయని, ఇళ్ళకీ, పొలాలకీ పరిహారం చెల్లించి మా వూరికి ఐదు కిలోమీటర్ల దూరంలో ఊరికోసం స్థలం కేటాయించింది ప్రభుత్వం. ముంపులో భూములు పోయిన రైతులు పరిహారం సొమ్ము చేతిలో పడగానే అప్పులు తీర్చేసి, ఆడ పిల్లలకు పెళ్ళిళ్ళు చేసేసి కట్టుగుడ్డలతో వలసెళ్ళిపోయేరు ఇళ్ళకు తాళాలేసుకుని. ప్రోజెక్టు నిర్మాణం పూర్తయినా ముంపుకు గురికాని సొంతభూముల్లో సాగు చేసుకుంటూ వుండిపోయేరు కొందరు. భూముల్లేని కొందరు రైతులు...దళితులు వలసెళ్ళిపోయిన వారి పొలాల్ని సాగు చేస్తున్నారు. అవి పండిందీలేదు.. కడుపు నిండిందీ లేదు. తమ్ముడు కూడా వలసెళ్ళి పోతానంటే నేనే వద్దన్నాను.

"నా కన్న వారెవరూ లేరిప్పుడు...ఉన్నది నువ్వే...నువ్వు దూరంగా వెళ్ళిపోతానంటే ఎలాగా? నీకే అవసరం వొచ్చినా నేనున్నాను" అని వాడిని వెళ్ళకుండా ఆపేసేను. మా ఆయన ముఖం ముద్దుకున్నాడు. "మీ తమ్ముడికిస్తే మనకేమిస్తాడు...గడ్డి...అదే బయటవాళ్ళకిస్తే ముక్కు పిండి వసూలు చేయొచ్చు". ఇదీ మావారి తీరు. తమ్ముడి బాధ్యతను వహిస్తున్నానని బాధ పడిపోయేడు. "లేనిపోనివన్నీ నెత్తినేసుకుంటా వెందుకు" అని రుసరుసలాడేడు. అతనంతే...అంతకంటే మరేం చెయ్యగలడు... నేను చేయాల్సిన సాయం చేస్తూనే వుంటాను. నాకు తెలుసు వ్యవసాయం పరిస్థితేమిటో...




ఎవరో కవి అన్నట్టు ఇప్పుడు వ్యవసాయం నిరర్థక క్రతువు...కర్షకులు కలిసిరాని ఆత్మహత్యల రుతువు.

ఉపాధి హామి పథకం కూలీలకు ఎంతో కొంత అనుకూలంగా వున్నా చిన్న రైతులకు మాత్రం పెద్ద దెబ్బగా పరిణమించింది. రైతులకనేమి?...నాయకులు.. ఉద్యోగులు కలిసి పందికొక్కులై తమ ఉపాధికే హామీగా మార్చుకొని కూలీల పొట్టకూడా కొట్టడం మామూలైపోయింది. కూలీలకోసం యాతన – జనం వలస వెళ్ళిపోయేక వ్యవసాయం పనులకు కూలీల కరువు. ట్రాక్టర్లు.. కోత మిషన్లు వున్నోళ్ళ దయా దాక్షిణ్యాల మీదనే చిన్నచిన్న రైతుల వ్యవసాయం ఆధారపడి వుందిప్పుడు. పశువులు...నాగళ్ళు...గాదెలు...ఇవేవీ ఊళ్ళల్లో కనిపించవిప్పుడు.

కోత యంత్రం చేను కోసి ధాన్యం వొంపిస్తే పొలం గట్టునే పచ్చి ధాన్యం బేరం. రైతుకిప్పుడు గడ్డికూడా మిగలడం లేదు. మూడు నెలల పంటల ఉత్సవం...మూడు గంటల్లో ముగిసిపోతుంది. కోత యంత్రం వచ్చేక కళ్ళం అదృశ్యమైపోయింది. కళ్ళం...కళ్ళంలో వరిచేల కుప్పలు...కుప్పల నడుమ కుందిర్లూ...

వేకువ ఝామునే చలిలో...పశువులు లంకెలు కట్టి చేను నూరుస్తుంటే గొడ్డ తిరుగుతున్న ఆ చప్పుడు...భూపాళరాగం ఆలపిస్తున్న వారెవరో అని

పించేది. వేకువ బూడిద రంగు వెలుగులో నాన్న కొంటికర్ర పట్టుకుని చేను దులుపుతుంటే... కళ్ళంలో చలిమంట వేసుకుని చలి కాగుతూ... తాతయ్య చెప్పే కథలు వినడం...నూర్చిన వరిగడ్డి కుప్పల మీద గంతులేయడం...ఒక గొప్పదృశ్యం పల్లెల నుండి మాయమైపోయింది. కోతల నుండి నూర్పుల దాకా సంబరం లాంటి చైతన్యమేదో హరించుకు పోయింది. పాత నవలల్లో...కథల్లో ప్రారంభ వాక్యంగా కనిపించే 'గోధూళివేళ' ట్రాక్టర్లు రేపిన దుమ్ములో కొట్టుకు పోయింది. ఊరి ముఖ చిత్రం మారిపోయింది.

ప్రభుత్వం నిర్లక్ష్యం...ప్రకృతి పరిహాసం... రైతును చేయి చాచి యాచించే స్థితికి దిగ జార్చేయి. రుణాలు మాఫీ చేస్తామని ఆశలు కల్పించి...రైతును ఒక దురాశపరునిగా మారే స్థితికి నెట్టేసారు పాలకులు. ఇప్పుడు రైతుగా బ్రతకడమంటేనే అదో సాహసకృత్యంగా మారిపోయింది.

మళ్ళీ నా ఆలోచనలు నా కవితవేపు మళ్ళుతుంటే సృజన నుండి ఫోన్.

సృజన మా ప్రగతిశీల మహిళా సమాఖ్య కార్యదర్శి. ఆ పిల్ల ఫోన్ చేసిందంటే ఒకంతట వదలదు. గొప్ప సందడైన పిల్ల. మొన్నామధ్య మా మండలంలో ఓ గ్రామంలో జరిగిన దళితులపై దాడిని ఖండిస్తూ ప్రకటన విడుదల చేయాలని అందరికీ ఫోన్లు చేస్తుంది.. అత్యవసర సమావేశం కోసం.

ఆ సంఘటన అత్యంత హేయమైంది... ఐతే దాన్ని కుల సమస్యగానే చూడడం సరైనదేనా ...అది 'కులదురహంకారం' తో జరిగిన దాడి అంటారు కొందరు. 'భూమి సమస్య' అంటారు కొందరు. ఈ రెండింటితో పాటు మరో సమస్య కూడా ముడిపడి వుందనే ఆలోచన రాకపోవడం ఆశ్చర్యమే. మహిళాసంఘాలు కూడా ఆ కోణంలో ఎందుకు చూడలేకపోయేరో...దానికి నేను కూడా మినహాయింపు కాకపోవడమే ఆశ్చర్యం. ఒక నేరం జరిగితే ఆ నేరం చేసిన వారు ఏ సామాజిక వర్గాన్నో మొత్తం బాధ్యుల్ని చేసి నిందించడం, ఆ సామాజికవర్గమంతా దుర హంకారులు, హంతకులు అనడం... దీన్ని ఎలా చూడాలి? నేను దాడికి గురైన వారి సామాజిక వర్గానికి చెందిన వారి ఇంటి కోడలిని. ఐనా ఒక స్త్రీగా ఈ సంఘటన వెనుక జెండర్ సమస్య వుంటుందని ఎందుకు ఆలోచించలేకపోయానో ఆశ్చర్యం కలుగుతుంది నాకిప్పుడు.

జరిగిన, జరుగుతున్న అనేక పోరాటాలకు, కొట్లాటలకు బయటకు కనిపించే అనేక కారణాల కంటే కూడా కనిపించని అసలు కారణం జండర్ సమస్యే...అయివుంటుంది.

రాముడు దండకంలో అడుగుపెట్టి... రాక్షసుల మనస్థైర్యాన్ని దెబ్బతీయడానికి చేసిన తొలి ప్రయత్నంలో బలయిన స్త్రీ 'తాటక'. రావణుని రెచ్చగొట్టే ప్రయత్నంలో తరువాత బలయ్యింది. 'సూర్పనఖ'. రాముడిపైన తన ఆధిక్యతను ప్రదర్శించడానికి రావణునికి సాధనమయ్యింది సీత. రాముడైనా రావణుడైనా తమ ఆధిక్యతను చాటుకోడానికో...శతృవును అవమానించడానికో ఎన్నుకున్న అడ్డదారి స్త్రీలను అవమానించడమే. సురులో... అసురులో ఎవరైనాగాని తమ బలాధిక్యతా ప్రదర్శనకు...శతృవును అవమానించి అహంను తృప్తి పరుచుకోడానికి...ఎన్నుకున్న మార్గం...స్త్రీ.

నిండు సభలో ద్రౌపదీ వస్త్రాపహరణానికి దుర్యోధనుడు పాల్పడ్డానికి ఎప్పుడో ద్రౌపది తనను చూసి నవ్విందన్నది సాకు మాత్రమే. వస్త్రాపహరణ చర్య ద్వారా పాండవులను అవమానించడమే దుర్యోధనుని లక్ష్యం. కురుక్షేత్ర యుద్ధానికీ...కొన్ని అక్షౌహిణుల సైన్యం హతమవ్వడానికీ.. రాజ్యకాంక్ష ప్రధానకారణంలా కనిపించినా...'కులస్త్రీని' అవమానించడం ద్వారా...తన అహాన్ని చల్లార్చు కుని ఎదిర పక్షాన్ని తీవ్రంగా అవహేళన చెయ్యడమే... అవమానించడమే...నిజానికి వస్త్రాపహరణ సంఘటనలో తీవ్రమైన అవమానం పాండవులకే కదా... ఆ అవమానాగ్నిలోనే కదా దహించుకు పోయింది కురువంశం.పురాణాలు...చరిత్ర...వర్తమాన వాస్తవ ఘట్టాలు చెబుతున్నదంతా అదేకదా... జరిగిన ఏ పోరాటంలోనైనా...దాడుల్లోనయినా... అంతర్లీనంగా వున్నది జండర్ సమస్యే అవుతుంది ఎనభై శాతము.

ఇప్పుడిక్కడ కూడా...ఆ అంశమే నిజంగా ప్రధానమని నాకు తెలిసిన వాస్తవాలు రుజువు చేస్తున్నాయి. సృజనకి ఫోన్ చేసి అదే చెప్పేను.

సంఘటన జరిగేక వెళ్ళిన అందరూ...బాధితుల్ని...వారి మనుషుల్ని మాత్రమే పరామర్శిస్తారు. వారు చెప్పిందే రికార్డు చేస్తారు. దాడి చేసిన వారి పట్ల ఎవరికీ సానుభూతి వుండదు కాబట్టి వారిని శిక్షించమని డిమాండ్ చేస్తారే తప్ప...ఎందుకు దాడి చేయాల్సివచ్చిందో...ఆరా తీయాల్సిన అవసరం ఎవరికీ వుండదు. కవిత్వాలు...వ్యాసాలు ఎవరికి తోచినట్టు వారు రాసుకుంటారు. ఆ కవిత్వం...వ్యాసాలు పత్రికల్లో వొచ్చినప్పుడు 'సుధ' ఎంత ఏడ్చేదో...ఒక సామాజిక వర్గం హంతకులు...దురహంకారులు అన్నంతదాకా వ్యాసకర్తలు వెళ్ళేరంటే...దాన్ని ఎలాచూడాలి ?

"మా అమ్మ పెదవి విప్పి చెప్పుకోలేక... గుండెల్లో సుడులు తిరిగే దుర్భరవేదనతో...లైంగిక వేధింపుల అవమాన భారంతో ఆత్మహత్యా ప్రయత్నం చేసినప్పుడు కదా...అసలు విషయం బయటపడింది..." అని అది కుళ్ళికుళ్ళి ఏడుస్తుంటే వారించడం నాకు సాధ్యం కాకపోయేది.. ఇప్పుడు సుధ తండ్రి జైల్లో...తల్లి రోగంతో మంచంలో...

నిచ్చెన మెట్ల సమాజంలో స్త్రీలు లైంగికంగా వేధించబడడానికి కులంతో సంబంధం లేదని, ఏ కులానికి చెందినా అతడు పురుషుడే అని, ఏ దిగువ కులం పురుషుడుకంటే కూడా ఏ అగ్ర కులానికి చెందిన స్త్రీ అయినా ఒక మెట్టు దిగువనే ఉందని స్పష్టంగానే తెలుస్తోంది. ఒక మహిళగా నాకిది గొప్ప వేదనకి గురి చేస్తోంది. అవును... మేము మహిళలం, పురుషుల పరువు ప్రతిష్టల అహంకారాల, ఆవేశకావేశాల బలి వితర్ధికల మీద మెడలు సాచిన మేకలం కదా! ఎంతకాలం కొనసాగాలిలా?!

ఎక్కడ మొదలయ్యిందిది...

నిర్వాసితులకు పరిహారం చెల్లించేక ఆ భూమి ప్రభుత్వం స్వాదీనం చేసుకుని ఆ భూముల మీదికి ఎవరినీ వెళ్ళకుండా చేసివుంటే సమస్య ఉత్పన్నమయ్యేది కాదు. లేదా పేదలకు ఆ భూమిని పంపిణీ చేసినా (ముంపు జరిగేదాకా) సరిపోయేది. అదేదీ జరగకపోగా కవ్వింపు చర్యలకు, కేసులకు... రాజకీయాలకు అవకాశం యిచ్చి యిరువర్గాల నడుమ ఘర్షణ వాతావరణం సృష్టించింది. భూములు పోగొట్టుకున్న రైతులు, తరతరాలుగా భూములు లేని నిరుపేదలు...దళితులు, ఇద్దరి నడుమ అగ్గి రగిలించే నేతలు....

మనసంతా చికాగ్గా అయిపోయింది.

నిజమే...దాడి అమానుషమే. అందుకు శిక్షించడానికి కోర్టులున్నాయి చట్టాలున్నాయి. మృతులకు, గాయపడ్డవారికి న్యాయం జరగాలి. హంతకులు శిక్షించబడాలి. అందుకు సంఘాలూ, ప్రగతిశీల సమాఖ్యలూ ఆందోళన చెయ్యాల్సిందే.

ఐతే...దాడి జరగడానికి ముందు...ఏం జరిగి వుంటుంది? దాడి జరగడానికి ఏ పరిస్థితులు దారి తీసేయి. ఇవన్నీ...సుధ చెబుతుంటే.. అది భూమి సమస్య...కులం సమస్యగామారి... 'జండర్'

సమస్యగా పరిణమించిందని మేధావులకు తెలీదను కోవాలా? కవిత పూర్తవ్వలేదు.

నిద్ర రావటం లేదు.

ఉన్నట్టుండి విసిరికొట్టిన గాలికి కిటికీ తలుపులు కొట్టుకుంటుంటే లేచి వెళ్ళి కిటికీలు మూసే ముందు బయటకు చూస్తే గేటుదగ్గర నీడలా... ఎవరో...నిలబడ్డట్టు అనిపించింది. వరండాలో లైటు వేసేను.

చెట్లనీడలు మరింత చిక్కగా...పడి పొడవుగా సాగేయి.

నిజంగానే గేటు దగ్గర ఓ వ్యక్తి.

గ్రిల్స్ తాళం తీయడానికి సంకోచం. కోలనీలో దొంగతనాలు...హత్యలు జరుగుతున్నట్టు... వార్తలు గుర్తుకొచ్చేయి.

సందేహిస్తుండగా అక్కా అని పిలుపు, తాళం తీసి వెళ్ళేను.

బయట చీకటే చినుకులుగా కురుస్తుందో...చినుకులే చీకటిగా రాలుతుందో...దట్టంగా చల్లగా భయం భయంగా...ఆ చీకట్లో చినుకుల్లో దిగాలుగా నా కవితకు రూపం వొచ్చినట్టు మా తమ్ముడు రాజు నెలల తరబడి జబ్బుపడ్డ మనిషిలా...

వాణ్ణలా చూస్తుంటే నాకు భయమేసింది,

"ఏమైందిరా...ఈ రాత్రప్పుడు..." చెయ్యి పట్టు కుని ఇంట్లోకి తీసుకెళ్ళేను,

వాడు స్నానం చేసి వచ్చేలోగా భోజనం సిద్ధం చేసేను.

నిర్వికారంగా భోజనం దగ్గర కూర్చున్నాడు. అన్నంలో చేయి పెట్టి కలుపుతూ కూర్చున్నాడు.

"ఏమైందిరా...మరదలూ నువ్వూ మళ్ళీ దెబ్బలాడుకున్నారా"

అప్పుడప్పుడూ వాళ్ళకది మామూలే.

"వ్యవసాయం మనకి వొద్దు నాయినా, అందర్లాగే మనమూ ఏలూరో, ఏగవరమో ఎలిపోదుంగానీ, నేలబుగ్గి నెత్తికెత్తుకోవడమేగాని గడ్డిపరకైనా మిగిలింది లేదు, బురద బుక్కి బురద కక్కి నరుమైపోయినా అప్పే మిగుల్తుందిగాని పైసా కళ్ళజూసింది లేదు, అదే సీమెలిపోతే కానో పరకో మిగలేసుకోకపోయినా గుంటల్ని సదివించు కోవడమైనా ఔతాది, పరువూ పెస్టేజి అని కూకుంతే మన బతుకులు ఇలగే తెల్లారి పోతాయి" ఇదీ మా మరదలి వాదన.

నిజమే...ఆమె మాటనీ కొట్టి పారేయడానికి లేదు. ఇప్పుడు గ్రామాల్లో అందరూ చేస్తున్నదదే.

వాడు అన్నం కెలుకుతున్నాడే తప్ప తినడం లేదు.

అన్నట్టు తనకిప్పుడు ఆరోనెలకదా, ఆరోగ్యం ఎలా వుంది? హాస్పటల్‌కి గాని తెచ్చారా? నాకు ఫోన్ చెయ్యొచ్చుకదా...నేను అడుగుతూనే వున్నాను. దేనికీ సమాధానం లేదు వాడినుండి.

వున్నట్టుండి అక్కా అని భోరున ఏడ్చేడు.

"ఎందుకురా చిన్న పిల్లడి లాగా" అన్నానే గానీ వాడినిచూస్తే నాకు దు:ఖం ముంచుకొచ్చింది.

"నామీద ఖూనీ కేసు పెట్టేరక్కా...మనూర్లో దెబ్బలాట జరిగింది. ఆ తగువులోన ఎర్ల పోలయ్య లేడా మన తోట కాసేవోడు ఆ పోలయ్య దెబ్బలు తగిలి సచ్చిపోయేడు..." వెక్కిళ్ళ మధ్య చెప్పేడు.

నివ్వెరపోయేన్నేను.

బయట ఉరుములు మెరుపులుతో గాలి వుధృతమైంది. గడియపెట్టని తలుపులు గాలికి కొట్టుకుంటున్నాయి.

"హత్యా...నువ్వా మన పోలయ్యనా"

పోలయ్య మా కుటుంబానికి నమ్మకమైన మనిషి. నాకు నమ్మబుద్ధి కావట్లేదు, చిన్న పిల్లడు జడిపిస్తే బెదిరిపోయే వీడు హత్య చేసేడంటే ఎలా నమ్మను?

కొంతసేపు నేనేమీ మాట్లాడలేదు. బయట వర్షంలోకి చూస్తూ వుండి పోయేను.

తరువాత కొన్ని క్షణాలకి వాడే చెప్పడం ప్రారంభించేడు.

"ఆ మధ్య నాలుగు రోజులు ముసురు పెట్టింది కదా...ఆ ముసురుకి పోలయ్య ఇంటిగోడ నానిపోయి పడిపోయింది. ఆ రాత్రప్పుడు పారొచ్చినారు పోలయ్య...పోలయ్య పెళ్ళామూ...జన్ని గుంపయ్య కొత్తగ కట్టుకున్న ఇందిరమ్మ ఇల్లుంది గదా...ఆ గడపలో వుండమని చూపించినాం. జన్ని గుంపయ్య ఇల్లు కట్టి అందలోన ఎన్నిరోజులూ లేదు. ముంపన్నారు...ఆడు ఇంటితాళం మనకిచ్చేసి దేశిమెలిపోనాడు. అదా...ఆ ఇంటి గడపల ఆ రాత్రి తలదానుకోడానికి సోటివ్వడం తప్పై పోయింది.

ఇల్లు ఖాళీయేగదా...పోలయ్య గోడ లేపీ వరకీ...ఆ గడపలో వుండి తరువాత ఎలిపోతాట్లే అనుకున్నాం. రెండ్రోజులన్నది పదిరోజులయ్యింది. అప్పుడన్నాది మీ మరదలు.

"తెల్లారితే ఎలిపోతామన్నారు...పది రోజులయ్యింది. ఏసినప్పుడు ఏపకొమ్మ...తీసినప్పుడు అసిరమ్మ. రెండ్రోజులుంతే మూడో రోజుకి ఎల్లబుద్ధి గాదు. అదీగాక మీరు ఆలకించినారో లేదో... పేటలోన మీటింగులెడతన్నారట. ముంపు భూవులు గురించి...ఎవులెవులో...ఎక్కడెక్కడి నుంచో వచ్చీ ఎల్తన్నారట. వాటాం సూస్తే బాగులేదు" అని.

నేనెల్ళి పోలయ్యతో మాట్లాడేను.

"జన్ని గుంపసోమి పెళ్ళం పిల్లల్తోటి ఆధార్ కార్డుల ఫోటోలు తీసుకో డానికి వస్తారు...ఆళొచ్చీ సరికి అక్కడ నువ్వుంతే ఎలాగ సెప్మీ" అని బోధ పరిచేను. ఏమాటకామాటే సెప్పుకోవాల గదా...

"నువ్వు నాకు తిరిగి బతిమాల్డమేటి కొడుకా...తప్పుగదా...ఆ రాత్రి దేవుడులాగ ఆదుకున్నారు...ఇప్పుడే ఎలిపోతాము. ఇంటి గోడపనీ అయిపోయింది" అని ఎళిపోడానికి తయారైనాడు. ఆడి కొడుకూ...ఆడితో వచ్చిన మరొకడూ...మరి కొందర్ని కూడబెట్టి మీటింగెట్టేరట.

"ముంపు భూముకీ...ఇళ్ళకీ...గవర్మెంటు సొమ్ము యిచ్చీసిందిగదా... ఇప్పుడా భూములుగాని ఇళ్ళుగాని ఆలకి చెందవు. ఆటిని ఇళ్ళూ భూవులు లేనోళుము తీసికుంటే తప్పేటి" అని.

మన మంతిని రమేషున్నాడు గదా...ఆడసలే కోపగొట్టోడు. "...ఐతే మా ఇళ్ళు తీసుకుంతారే టర్రా...ప్రోజెక్టొచ్చి మా బతుకు బుగ్గి జేస్సింది. ఇచ్చిన సొమ్ము వుండిపోయిందా...సెరలచ్చి ఎలగొచ్చింది అలాగే అయి పోయింది. మీరు ఇళ్ళు... భూవులు లాక్కొండి...మేము అడుక్కుతింటాము. లేకపోతే మీ ఆలోచనేటి.. న్యాయమూ అన్యాయమూ చూడక్కర్లేదా..."

పోలయ్య మాత్రం బతిమాలేడు...ఆళ గుంటలకీ నచ్చజెప్పేడు. అయితే ఆళెలాగున్నారు... దేసి మెల్లి పైసా, పరక కళ్ళ జూస్తన్నారుగదా...

రాత్రి బడ్డీలు దగ్గర చేరతారు కుర్రోళు... కసింత మందేసి.. బోకు కవుర్లు సెప్పడాకి...సరిగ్గ...ఆ సమయానికే మన సిమ్మునాయుడి పెళ్ళం, సబ్బు కొనడాకి బడ్డీ దగ్గిరికెల్లిందట. కావాలని చెయేసేడో...పొరపాట్నే తగిలిందో...పేట కుర్రోడి చెయ్యి తగిలీసరికి...కసింత కిందా మీదా సూడండ్రా...అన్నాది. ఆడైనా...పొరపాటై పోయిందనొచ్చు గదా...అలగనకుండ..."ఏటమ్మా...అలగైపోతున్నావు...యింతవరకీ ఎవల సయ్యా తగల్నట్టూ..." అన్నాడట. ఆ పక్కనేవున్న సిమ్మునాయుడు ఆలకించినదది. పెళ్ళాన్ని ఆమాట అంటే ఎవులు సహించగలరు...ఆ గుంటడ్ని కొట్టేడు...పేటోల్లొచ్చేరు.

మనోలు వచ్చేరు... ఆరోజే మంగళోరాలు గదా... కుక్క...సుక్క ఏసుకోనున్నారేటో...రాపులాట తోపు లాట అయ్యింది. మాటా మాటా పెరిగింది.

అప్పుడికీ సంచాన ముసలోడన్నాడు "ఒరే నాయనలారా...మేము నాయుళ్ళమూ...మాకేటీ అని ఎగురుతున్నారు. వాళ్ళు గాని కేసు గాని పెడితే మనమూ ముడి యిప్పుకోడాకి ముప్ప తిప్పలు పడాల...నేనెందుకు చెప్తున్నానో కొంచెం తగ్గండీ..." అని.

"అయితే దానికి భయపడి ఆలేటి చేస్తే దానికి తలొంచుకొని సేతులు ముడుసుకొని కూకోవాలా...మాది 'తప్పు' అయితే నోరు మూసు కొని కూకుంతాము. అంతేగాని...భూములు లాక్కుంతాము...ఇంటిల చొరబడతాము, ఆడోళ్ళ కొంగుల్లాగుతాము...అంతే వల్లకున్నోలు ఎవులూ లేరిక్కడ" పెద్దలమీద ఎగిరేడు మింది సూరి గాడు...ఆడివెనక మరికొందరు కుర్రోళు.

మాటా మాటా పెరిగింది.

అప్పుడొచ్చేడు సిమ్మనాయుడు తమ్ముడు.. వస్తూనే..

"ఎవుడ్రాడు...కళ్ళు నెత్తిమీద కొచ్చేయి క్కొక్కడికి...ఆడికింత తిమురు గుంతే...పట్నంలోన దొరుకుతారు...అక్కడికెల్లి ఆలమీద సెయ్యో ఏత్తాడో... కాలో ఏత్తాడో ఏసుకోవాల...సంపాదిం చిన సొమ్ముంతే ఏ సానికొంపలకో ఎల్లి తగలెట్టు కోవాల. ఆడెంత ఆడి బతుకెంత...మక్కలిరగదం తాను...ఎవుడనుకుంతాన్నాడో..." అని...చేతిలోన కర్ర నేలకేసి కొట్టేడు.

అంతే...అక్కడేవున్న పేట కుర్రోళు మీది కొచ్చేరు. ఆ సమయానికే కరెంటూ పోయింది. సీకటి...సిన్న సినుకులు...ఆ సీకట్ల ఎవరికి ఎవు లేటి సేసినారో...కొట్టురా అంటే కొట్టురా అని మొగిసిపోనారు. కేకలు...అరుపులు. ఈ రాపులాట తోపులాటలోన నన్ను ఎనక్కి లాగడానికి మద్దిని దూరింది మీ మరదలు. నాకు తగలవలసిన దెబ్బ దానికి తగిలింది. అసలే వొట్టి మనిషి గాదు. కొట్టినోడు కలబెట్టి కొడతాడా...దెబ్బ బలంగా తగిలింది తలమీద. దాన్ని డాక్టరు దగ్గరికి తీసికెళ్ళి కట్టు కట్టించి తెచ్చేసరికి ఎటోలటు పారి పోనారు. ఏటయ్యిందని సూస్తే పోలయ్య సచ్చిపడున్నాడు గడపల. అవతల ఆలకీ...ఇవతల ఈలకీ దెబ్బలు తగిలేయి.

ఆ రాత్రి ఎవరికీ నిద్దర్లు లేవు. ప్రెసిడెంటు ఆళ్ళనీ...ఈళ్ళనీ కూకుండ బెట్టి నచ్చజెప్పినా పేట కుర్రోళు యిన్నారు గాదు. మనగుంటలూ యిన్నా రు గాదు. ఏటయితే అదవ్వనీ అని మొండిపట్టు పట్టీసేరు.

పేటోలందరు మీటింగెట్టుకోని రాత్రికి రాత్రి మండలం కెల్లి పోలీసు రిపోర్టు యిచ్చీసేరు. అందు లోన నాదేనట మొదటిపేరు. ఊర్లోన పార్టీలుగదా.. ఎవులో ఎగదీసి యింతవరకి తెచ్చినారు..." చెప్ప డం ఆపి కొంతసేపు నిశ్శబ్దంగా వుండిపో యేదు తమ్ముడు.

వాడసలే అమాయకుడు. ఇటువంటి తగు వులు...దర్మాలు తెలీనోడు. వాడి పనేదో వాడి పాటేదో...అంతే తప్ప మరోసారి వూసు జోలి పట్టడు. యిప్పుడీ ఆపదొచ్చి పడింది.

"ప్చ్...ట్రాక్టరు కుదిరింది. వాన సత్తిం నాయుడు మామ బోరు నీరు యిస్తానన్నాడు. ఉడుపు పూర్తయి పోద్దనుకున్నాను. యీ వుపెద్రం వొచ్చి పడింది. ఉడుపా ఆగిపోయింది. దానికెలా గుందో...అన్నీ వొక్కసారే కట్టగట్టుకోని వచ్చి పడ్డాయి. ఛ...ఏం పుట్టుక...దుక్కిముచ్చు పుట్టుక!" అని పై మీది తువ్వాలుతో కళ్ళు ముఖం తుడుచు కుని మోకాళ్ళ చుట్టూ చేతులు బిగించి ముఖం ముడుకులమీద ఆనించి అలసినట్టు ఆగిపోయేడు. అలా వాడిని చూస్తుంటే దు:ఖం ఆగలేదు నాకు. వాడొక్కడే నన్ను అర్థంచేసుకున్న వాడు. నేను కులాంతర వివాహం చేసుకుంటే నన్ను సమర్థిం చింది వాడు మాత్రమే. అప్పటి నా పరిస్థితిని అర్థం చేసుకుని ఆదరించింది వాడే. ఇప్పుడు వాడికీ కష్టం వొచ్చింది .

కొంతసేపు అలగే మౌనంగా వుండిపో యేము. ఏమీ మాట్లాడకుండా మా గుండె గోస తాను వినిపిస్తున్నట్టుంది. ప్రకృతి, ఉరుములు... మెరుపులు... హోరుగాలి...వానతో...

"ఈ రోజు ఎమ్మెల్యే...ఎవులెవులో రాజకీయ నాయకులు...సంఘాల నాయకులు మనూరు వెళ్ళేరట. నేరస్తుల్ని వెంటనే అరెస్టు చెయ్యాలని... చనిపోయిన పోలయ్య కుటుంబానికీ...దెబ్బలు తగిలిన పేట కుర్రోళకి పరిహారం యివ్వాలని సంఘనాయకులు డిమాండు చేసేరట...మన రాధ ఫోను చేసింది. ఔనక్కా...నాకు తెలీకడుగు తానూ...తగువొచ్చింది, కొట్టుకు న్నారు, ఆళకీ... ఈలకీ రెండుపక్కలా దెబ్బలు తగిలాయి. పట్నంల గవర్నమెంటు ఆసపత్రిల సెట్టి గుంపసోమి పొద్దుటే సచ్చిపోయాడట. పాపం...ఏడాది పూర్తవ్వలేదు పెళ్ళయ్యి...పోలయ్యకి పరిహారం యిమ్మని అడుగు తున్నారు గానీ...సెట్టి గుంపసోమిని పట్టించు కున్నోళే లేరు. యిద్దరు సచ్చి పోయిందీ ఆ తగువు లోనేగదా..." అని ఆగిపోయేడు.

అమాయకంగా అడుగుతున్న వాడిని చూ స్తుంటే నాకేం చెప్పాలో అర్థం కాలేదు. కొద్దిగం టల క్రితం అక్కడెక్కడో జరిగిన హత్యలకు ఖండన తెలుపుతూ ప్రకటన యివ్వాలని చెప్పిన నేను నా వూళ్ళో జరిగిన యీ సంఘటనకు ఎలా స్పందిం చాలి? ఎలా చూడాలీ ఘర్షణల్ని? ఘర్షణ జరిగిన ప్రతిచోట ఆ ఘర్షణ ఏవో రెండు కులాల మధ్యనే అయివుంటుంది. దాన్ని కులఘర్షణగామాత్రమే చిత్రించడం. ఘర్షణాంతర పరిస్థితిని మాత్రమే పట్టించుకోకపోవడం...చాలా చిత్రం గా అన్పిస్తుంది నాకు.

నిష్కారణంగా ప్రాణాలు కోల్పోయిన పోల య్య...సెట్టి గుంపస్వామీ యిద్దరూ కూలి చేసుకుని బ్రతికినోళే...మరి సంఘాలు...నాయకులు స్పందిం చే తీరులో యీ వ్యత్యాసమెందుకో...మనిషి ప్రాణా న్ని కులంతో కొలవడం...కులంతో గుర్తించడం మామూలు మనుషులు చేస్తారంటే అదో దారి. మేధావులు కూడా...అసలు మేధావులు, కవులు.. రచయితలూ స్పందించే తీరు చూస్తుంటే.. చిత్రంగా అనిపిస్తోంది. ఈ విషయంలో హతుల పట్ల స్పందిం చేది హార్షనీయమే అయినా...మూలకార ణాల్ని అలక్ష్యం చేయడం మాత్రం శోచనీయమే. ఒక సాహిత్యజీవిగా జరిగిన దాడికి వ్యతిరేకంగా స్పందించిన దానినే...కాదంటే ఇద్దరు కూలీల మరణంగా కాకుండా రెండు కులాలకు చెందిన వారి మరణంగా ఎందుకు చూడాల్సి వస్తుంది? ఈ ప్రశ్నలే తమ్ముడు అడుగుతున్నట్టనిపించింది.

...నా ఆలోచనల్లో నేనుంటే తమ్ముడ న్నాడు...

"అక్కా...యిది యీరోజుది కాదు. తగువు ఇల్లు ఖాళీ చేయడానికి సంబందించిందీకాదు. పేట కుర్రోళ్ళు మనీది ఆడపిల్లలు ఏటికి నీళకెళ్తే ఏదో అనడం...బుర్ర తిరుగుడుగా మాట్లాడ్డం...మనోలు ఏదేనా అంటే కులం పేరు పెట్టి తిడతన్నారని కేసెట్టడాకి తయారైపోవడం...యిలగెప్పుడ్నుం చోవుంది...నిన్నటికి భరించలేక...తగువుకు దిగి పోయేరు. ఎలిపొచ్చినారు...నువ్వేసెప్మీ... కట్టు కున్నదాని వొంటిమీద పరాయోడు సెయ్యేత్తే... ఎవడుపల్ల కోగల్డు...అయితే అది సావుల్దాక వస్తా దని ఎవులనుకుంతారు...అక్కడదానికెలాగుందో... గెంజిపోసిన దిక్కులేదు" భార్యను తలుచుకుని

కుమిలిపోతుంటే వాడిని చూస్తూండడం తప్ప ఓదార్చలేని అశక్తత ఆవహించింది నన్ను.

తమ్ముడు చెప్పిందాంట్లో సత్యం వుంది. ఈ సత్యంను ఒప్పుకోడానికి మేధావులకు ధైర్యం చాలలేదు. ఏది ఏమైనా...వెలుగులోకి రాని విష యాలను అలాగే చీకట్లో సమాధి చేసి కులం వృక్షా నికి నీళ్ళు పోస్తున్నారు తప్ప వేళ్ళు తీయడం లేదు.

రాత్రి గడిచి పోతోంది...గోడ గడియారంలో చిన్నముల్లు రెండు మీద కొచ్చింది. బయట వర్షం కురుస్తూనే వుంది.

అల్పపీడనం కాబోలు...

"నాకు తెలుసు...ఊరికే వుండలేరుకదా... పనికిమాలిన రాజకీయాలు...ఏనాయకుడో వుసి గొలిపేసుంటాడు. పీకమీదకి తెచ్చుకున్నారు. ఇప్పుడు ఆడికాళ్ళూ యీడికాళ్ళు పట్టుకోడానికి పరుగులు..."

ఎప్పుడు లేచివచ్చేడో...ద్వారానికి చేరబడి విసుగ్గా చూస్తున్నాడు మా వైపు మా ఆయన... సిగరెట్ పొగ వొదుల్తూ.

"ఏమండీ లాయర్ కృష్ణారావుగారు మీకు బాగా తెలిసినవారే కదా...అతనికోసారి ఫోన్ చెయ్యగూడదా..." అన్నాను.

"సరే ఉదయం మాట్లాడతాన్లే.. అన్నట్టు మా చెల్లి కెలాగుందిరా.!" అనడిగేడు. ఆ మాత్రానికే కదిలిపోయేడు మా తమ్ముడు.

"పద...రాత్రి రెండు గంటలు దాటుతుంది. ఉదయం ఆలోచిద్దాం ఏం చెయ్యాలో... ఏమీ ఆలోచించకుండా పడుకో..!" అని వాడికి పక్క చూపిస్తుంటే మొబైల్...పిలుపు...

ఆ సమయంలో మొబైల్ తియ్యాలంటే దో భయం.. ఏం వినవలసి వస్తోందోనని...నేనే తీసేను అదిరే చేతుల్తో. ఎవరిదో ఆడమనిషి గొంతు. గొంతులో ఆదుర్దా. తమ్ముడి గురించి అడిగింది. మరదలి పరిస్థితి ఆందోళన కరంగా వుందంటోంది. మాట పడిపోయిందని...చివరి క్షణాలే అన్నట్టుం దని.

"కారేదయినా దొరకదా...108కి ఫోన్ చేసేరా" ఆతృతగా అడిగేను... ముసలోళ్ళు..ఆడవాళ్ళు.. పిల్లలు తప్ప ఒక్క మగ పురుగు లేదనీ...పోలీసులకు దొరక్కుండా బయటే ఎక్కడెక్కడో వున్నారనీ.. ఏం చెయ్యాలో ఏమీ తోచడం లేదని గాభరాపడుతోందావిడ.

నాకు వొళ్ళంతా చెమటలు పడుతున్నాయి.

కాళ్ళ కింద భూమి కరిగిపోతున్నట్టుంది. కాళ్ళు తేలిపోతున్నట్టుంది. నా ముఖంలోకి చూస్తూ నా మాటలు వింటున్న తమ్ముడికి పరిస్థితి అర్థమైనట్టు కూలబడిపోయేడు ఏడుస్తూ...సరిగ్గా ఆసమయంలో నాకు గుర్తొచ్చేయి అనేక యుద్ధ సమయాలు. వ్యక్తుల మధ్య కావొచ్చు, రాజ్యాల నడుమ కావొచ్చు. జరిగిన ప్రతి యుద్ధం వెనక ఒక స్త్రీ వుండడం యాదృచ్ఛికం కాదు. భూగోళాన్ని కుళంగుడ్డలో మూటకట్టడం ఎప్పుడు మొదలైంది ? దీనికి అంతం ఎప్పుడు? ఎక్కడ ?

ఎక్కడో పిడుగుపడింది... నా చేతిలోని మొబైల్ జారిపోయింది. బయట గాలి హెూరు. వర్షం మరింత వుధృతమైంది మా అక్కా తమ్ముళ్ళ ఏడుపులాగా...

దట్టమైన మేఘాలతో అల్లకల్లోలంగా ఉరుములు మెరుపులతో.. యుద్ధభూమిలావుంది ఆకాశం.




పావన గంగ జీవన కృష్ణ!
స్వర్గధామం అమరావతి!
పంచారామాల క్షేత్రాల ప్రథమారామం అమరారామం
హిందూ, బౌద్ధ, జైన మతాల సామరస్య ధామం
గౌతమ బుద్ధుడు నడయాడిన పుణ్యస్థలి
బౌద్ధమత ప్రాభవం పరిఢవిల్లిన ఆరామం
గత వైభవ దీప్తికివే మూలాధారం

ధాన్యకటకం ధరణికోట
ప్రాచీన చరిత్రకు నామాలెన్నున్నా నగరమొక్కటే
శాతవాహన చక్రవర్తులు రాజధానిగ పాలించిన అమరావతీ
ఇంద్రప్రతిష్ఠితమయిన ఆధ్యాత్మిక
అమరలింగేశ్వర పుణ్యక్షేత్రం
పర్యాటక కేంద్రమైన సుందర ప్రాంతం

తాళ్ళాయి ముక్కాల అమరావతీ!
కోటిలింగాల క్షేత్రాల కృష్ణాతీరం
వైకుంఠపుర ఉత్తర వాహిని
శోభిల్లుతు ఉదయించెను మరో భాగ్యనగరం.

నవ్యాంధ్ర నడిబొడ్డు నదీతీర రాజధాని
సింగపూరు సిరివెన్నెల అందాల హరివిల్లు
నాల్గు దేవాలయాల నడుమనున్న తుళ్ళూరు వేదికై
చుట్టూ ఆ వేల్పుల ప్రాకారమై రక్షగా!!
మన రాజధానికి అండదండగా నుండగా!

కనకదుర్గ సన్నిధాన అమరేశ్వర ఆశీస్సుల
కృష్ణవేణి తరంగాల తెలుగుతల్లి చిరునగవుల
ఆంధ్రజాతి కభ్యుదయం యువతరానికి ఉషోదయం.
ఆంధ్రజాతి అభివృద్ధికి అవతరించిన చంద్రోదయం.

డా॥ శృంగారపు వెంకటప్పయ్య
89853 13811







టీవీ చూస్తోందన్న మాటే కానీ విజయ దృష్టి టీవీమీదకానీ, టీవీలో వస్తున్న ప్రోగ్రామ్ మీదకానీ లేదు. ఆమె టీవీ చూస్తోంది... చూడడంలేదు. రాత్రి పదవుతున్నా ఇంటికి చేరని కూతురి చుట్టూ ఆమె ఆలోచనలు పరిభ్రమిస్తున్నాయి.

గోడ గడియారం పదిగంటలు కొట్టింది. విజయ ఉలిక్కిపడి లేచింది. ఇంక ఆగలేక వీధిగుమ్మం దగ్గరికి నడిచింది. గేటుమీద పాకించిన మాలతీల పరిమళం ఒక్కసారిగా ఆమెను కమ్ముకుంది. అయితే అవేవీ గమనించే స్థితిలో లేదామె. గేటు దగ్గర నిలబడి వీధి చివరకంటా చూసింది కృతి వస్తోందేమోనని. అప్పుడప్పుడు రోడ్లు సందడి తగ్గి నిశ్శబ్దంగా అవుతున్నాయి. ఒకటీ అరా వాహనాలు తప్ప మనుషుల అలికిడి తగ్గుముఖం పదుతోంది. విజయకి ఒక్కసారిగా కూతురిమీద కోపం ముంచుకు వచ్చింది. చెప్పింది ఏనాదన్నా విని ఏడిస్తేగా?

# భయం

**ఆడపిల్లలూ** లేదు మగపిల్లలూ లేదు, అందరూ ఒకేరకంగానే ఏడిపిస్తున్నారు. ఒకళ్ళు కాకపోతే ఒకళ్ళ కన్నా అమ్మ చెప్పింది విందామన్న ధ్యాస లేదు. పైగా వెక్కిరింతలూ, వేళాకోళాలు. అక్కడికీ చిలక్కి చెప్పినట్టు చెప్పింది ఆ వెళ్ళేదేదో మీ నాన్న వచ్చిన తర్వాత, ఆయన ఊళ్ళో ఉన్నప్పుడు వెళ్ళవే, నన్ను అనవసరంగా గాభరా పెట్టకు అని. వింటేనా? ఆయనతో ఫోన్ చేసి మరీ చెప్పించింది.

"ఫ్రెండ్ ఇంటికి వెళ్ళి ప్రాజెక్టు వర్కేదో చేసుకుని వెంటనే వచ్చేస్తుందంటలే. పంపించు" ఆయన సిఫార్సు. పోనీ వెళ్ళి ఏడిసేది ఏదో బస్సులోనో ఆటోలోనో ఏడవకూడదూ? వచ్చీరాని బండెక్కి పోయింది. బండివద్దు అంటే వినిపించుకుందా? "అబ్బ ఊరికే విసిగించకమ్మా ఏంకాదు. ఇప్పుడే వచ్చేస్తాగా" అంటూ పోయింది.గంటలో వచ్చేస్తానన్న పిల్ల గంటకాదు, రెండు గంటలు కాదు, నాలుగు గంటలైంది. ఫోను చేస్తే తియ్యదు, అదేం ఖర్మో. ఫోన్ ఎప్పుడూ సైలెంట్‌లో పెట్టి ఏడుస్తుంది. ఆ మాత్రం దానికి ఇంక ఫోన్ ఎందుకూ? అవసరమైనప్పుడెప్పుడూ దాని ఫోన్ కలసి చావదు.

ఏమయిందో ఏంటో? అక్కడ ఫ్రెండు ఇంట్లో నుండి బయలుదేరిందో లేదో! ఇంకా అక్కడే ఉన్నా ఫరవాలేదు. ఒకవేళ బయలుదేరితే? దారిలో ఏమన్నా అయితే? ఆ ఆలోచనకు విజయ ఒక్కసారిగా ఉలిక్కిపడింది. అసలే రోజులు బాలేదు. రోడ్డు మీదకు వెళితే ఎప్పుడు ఏ క్షణంలో ఏం జరుగుతుందో తెలీదు. ఒకవేళ జరగకూడనిది ఏమన్నా జరిగితే? ఆమెకు గుండె గాభరాగా అనిపించింది. జరిగితే జరగనీ, చెబితే విందా ఆ పాడు మొహంది. పెద్దవాళ్ళ మాట వినకుండాపోతే ఏమవుతుందో తెలిసి రావాలి...విజయ మనసులోనే కూతుర్ని తిట్టుకుంది. అంతలోనే ఛ ఛ ఏంటి తనకి ఏమయింది? ఏదో చిన్నపిల్ల... తనకంటే భయాలు కానీ వాళ్ళకేం భయాలు తెలుస్తాయి...అనుకుంది.

దూరంగా సందు మలుపు తిరుగుతున్న బండి కనిపించింది. కృతి ఏమోనన్న ఆశతో కళ్ళు చిట్లించి చూసింది. ఉహు! కాదు. బండి దూరంగా వెళ్ళిపోయింది. గుండెల్లో ఎక్కడో కలుక్కుమంది. ఈమధ్య ఈ దొంగజబ్బొకటి ఏడిపిస్తోంది. అసలు తనది గట్టి ఆరోగ్యం. ఏ రోజూ తలనెప్పి అని కూడా ఎరగదు. అలాంటిది ఇప్పుడు వీళ్ళ పుణ్యమా అని ఈ గుండెదడతోనే ఏదో ఒక రోజు పోయేలా ఉంది. చెప్పిన టైముకి రాకపోతే నాకు గుండెదడ వచ్చేస్తోంది. కాస్త చెప్పిన టైముకి వచ్చేయండి, లేకపోతే ఫోనన్నా చేయండి అంటే ఒక్కళ్ళూ వింటారా? చిన్నాలేదు పెద్దాలేదు. ఆయనా వినరు. అదీ వినదు. ఎక్కడో దేశంకాని దేశంలో ఉన్న కొడుకూ వినడు. ఏం చెప్పినా మొహమొహాలు చూసుకుని నవ్వుకోడం.

వాళ్ళకు ఎట్లా చెబితే అర్థం అవుతుంది? మీరురాని ఒక్కో నిముషం ఒక్కో ఆలోచనతో నా గుండె పగిలిపోతోంది. మీకు ఎక్కడ ఏం అయిందో, ఏం జరిగి ఇంటికి రాలేకపోయారో ఏ ప్రమాదం జరిగిందోనన్న ఆలోచనతో గుండె గాభరా పడిపోతోంది. చెమట్లు పట్టి కళ్ళు తిరిగి పోతున్నాయి. ఆ భయంతో చచ్చిపోతానేమో అనిపి స్తోంది అని చెప్పగలదా? చెబితే తనను బతకని స్తారా? పనీ పాటా లేకుండా ఇంట్లో కూర్చుని అనవ సరంగా ఏదేదో ఊహించుకుని ప్రాణం మీదకు తెచ్చుకుంటున్నావని అరుస్తారు. తనమీద విరుచుకు పడతారు. అంతేకానీ పిచ్చి మొహంది ఏదో భయపడి ఏడుస్తోంది కదా, చెప్పిన టైముకి కాస్త అటూ ఇటూగా వచ్చేద్దామన్న జ్ఞానం ఒక్కరికన్నా ఉంటేగా? ఆయనా అంతే, మొదట్లో కనీసం ఫోన్ అన్నా తీసి ఎక్కడ ఉందీ చెప్పేవారు. ఇప్పుడు ఫోన్ కూడా తియ్యరు. ఏదన్నా అంటే బండిమీద ఉన్నాను, వినిపించలేదు అని తప్పించుకుంటారు. కృతి అయితే "ఎందుకమ్మా అన్నిసార్లు ఫోన్ చేసి ఎక్కడున్నావ్ ఎప్పుడొస్తావ్ అని అడుగుతావు. మా ఫ్రెండ్స్ అంతా నవ్వుతున్నారు తెల్సా. ఫోన్ రింగయితే చాలు కృతీ ఎక్కడున్నావ్? అంటూ ఏడిపిం

జి. లక్ష్మి
94907 35322

చేస్తున్నారు. ఇంక నువ్వు అట్లా ఫోన్ చేస్తే నేనసలు ఫోన్ తియ్యను" అని చిరాకు పడిపోతుంది.

ఇక్కడ ఏడిసేవాళ్ళు ఇట్లా ఉంటే అక్కడెక్కడో దేశంకాని దేశంలో ఉన్నాడు ఇంకో రకంగా ఏడిపిస్తున్నాడు. ఏ వీకెండ్‌కో ఫోన్ చేస్తాడు. చేసి "అమ్మా రేపు మేం ఏంచేస్తున్నామో తెల్సా. ఇక్కడ పల్లెటూళ్ళు ఎలా ఉంటాయో చూడాలని బాగా రిమోట్ ఏరియాకి వెడుతున్నాం. ఈ రెండు రోజులు అక్కడే ఉంటాం" అంటాడు. తెలియని కొత్తచోటులో రెండు రోజులు గడపడం... అది చాలు తనకు గుండెదడ రావడానికి. అలా తెలియని చోట్లకి వెళ్ళొద్దురా అంటే వినడు. లేకపోతే ఎక్కడో చోట లేట్ నైట్ పార్టీ ఉంది అంటాడు.

అక్కడ నుండి అర్ధరాత్రి ఒంటరిగా హాస్టల్‌కు ఎలా వెళ్తాడోనన్న భయం. నిద్ర పట్టదు. క్షేమంగా చేరాడో లేదో కనుక్కోడానికి ఫోన్ చేసే సమయమూ కాదు.

అసలు వాడు ఫ్లయిట్ ఎక్కిన తర్వాత దిగే వరకూ, దిగి ఫోన్ చేసేవరకూ తను మనిషి మనిషిలా లేదు. ప్రపంచం అంతా ఓ పక్క నిద్ర పోతుంటే వాడు వెళ్ళే విమానం ఒక్కటే ఆ చీకట్లో అలా ఎగురుకుంటూ వెళ్ళడం తల్చుకుంటే ఏంటో దిగులుగా అనిపించింది. ఎవరితోనన్నా అందామంటే నవ్వుతారు. ఆడపిల్లలే ఒంటరిగా దేశాలు చుట్టి వస్తున్నారు, మగపిల్లాడి గురించి భయపడుతోంది చూడు అంటారు. తన భయం వాడి గురించా? ఆ విమానం గురించి కానీ. ఒకవేళ ఆ విమానానికి ఏదైనా అయితే తన మవసులో తిరుగుతున్న ఆలోచనలు ఎవరితోనన్నా అనగలదా?

గుండెల్లో మళ్ళీ మరోసారి కలుక్కుమంది. వళ్ళంతా చెమటలు. ఇంట్లోకి వచ్చి మంచి నీళ్ళు తాగింది విజయ. కొంచెం సర్దుకున్నట్టు అనిపించింది. అంతకు ముందు అలా వచ్చినప్పుడు ఒకసారి డాక్టర్ దగ్గరికి వెళ్ళారు. రకరకాల టెస్టులు చేసి చివరికి ఒసిడి అని తేల్చాను. అబ్సెసివ్ కంపల్సివ్ డిజార్డర్, అబ్సెసివ్ యాంగ్జయిటీ డిజార్డర్ అయుండొచ్చన్నాడు. దూరంగా ఉన్న తనవాళ్ళు క్షేమంగా ఉన్నారో లేదో అని కంగారు పడుతుండటం, వాళ్ళకు ఏదన్నా ప్రమాదం జరగవచ్చేమోనని ఊహించుకుని ఆందోళన పడుతుండడం దాని లక్షణం అంట. దానికి మందులకన్నా గుండె నిబ్బరం ముఖ్యమంటూనే గుప్పెడు మందులు రాసిచ్చాడు.

డాక్టరు దగ్గర నుంచీ ఇంటికి వచ్చి ఇంకా



గుమ్మం అన్నా ఎక్కీ ఎక్కకముందే ఈయన ఉపన్యాసం...

"చూడు విజయా! నీకు ఎట్లా చెప్పాలో తెలియడం లేదు. నువ్వేమన్నా చిన్నపిల్లవా! ఏమీ తెలియనిదానివా? అన్నీ చూస్తూ అన్నీ తెలిసి కూడా అలా చేస్తుంటే ఎలా? ఇంటి నుంచి బైటకు వెళితే తిరిగి వచ్చేవరకూ గండమే. అలా అని బైటకు వెళ్ళకుండా ఎలా కుదురుతుంది చెప్పు? ఏదన్నా అవుతుందేమోనని పనులు మానుకుని ఇంట్లో కూర్చోలేం కదా. ఒకసారి బైటకు వెళ్ళిన తర్వాత ఏదైనా జరగొచ్చు. ఒక్కోసారి అనుకున్న టైముకి పని అవదు. ఫోన్ చేయగల పరిస్థితి ఉండకపోవచ్చు. అంతమాత్రాన నీలో నీవే ఏదేదో ఊహించేసుకోవాలా? నువ్వు ఇబ్బంది పడుతున్నావు. మమ్మల్ని ఇబ్బంది పెడుతున్నావు. ఒక్కోసారి ఎంత పానిక్ క్రియేట్ చేస్తున్నావో తెల్సా. కొంచెం కూల్‌గా ఆలోచించు. అసలు ఎందుకంత వర్రీ అవుతున్నావు? ఏదో అవుతుందని ఎందుకనుకుంటావు? ఒకవేళ అవుతుంది అనుకో...ఏం చెయ్యగలం? మన చేతుల్లో లేని దాని గురించి భయపడి ఏం ప్రయోజనం? బస్సుల్లో, రైళ్ళల్లో, కార్లలో ప్రపంచం ఎలా పరిగెడుతుందో చూడు. ఏదో జరుగుతుందని ఎవరైనా ఆగుతున్నారా?

పిచ్చి పిచ్చి ఆలోచనలు మాని బుర్రకి ఏదన్నా పని కల్పించుకో. డాక్టరు చెప్పింది విన్నావుగా. గుండె గట్టి పరుచుకుని నీకు నువ్వు నిబ్బరం తెచ్చుకో. మందులు వాడడం ఒకటేకాదు, ఏదన్నా వ్యాపకం కూడా కల్పించుకో. నీకు నువ్వే ఇందు లోంచి బైటపడు. పుస్తకాలు చదువు. సంగీతం విను. అంతే కానీ నువ్వు కూడా నాకు ఒక సమస్య కాకు" అని చెప్పిందే చెప్పడం...

గుండె నిబ్బరం తెచ్చుకోవాలంట. మందు ల కన్న అదే ముఖ్యమంట. అదేంటది అబ్సెసివ్ కంపల్సివ్ డిజార్డరా? యాంగ్జయిటీ డిజా ర్డరా? అన్నీ డిజార్డర్లే. బైటకు వెళ్ళిన భర్తా పిల్లలూ క్షేమం గా ఉండాలని, ఏ ప్రమాదం జరగకూడదని అనుకో వడం డిజార్డరా? అనుకోకపోవడం డిజా ర్డరా? ఏమైనా ఫరవాలేదులే అని పట్టించుకోకుండా ఉంటే ఆర్డర్‌లో ఉన్నట్టా? ఆందోళన పడడమే డిజార్డరా? ఏంటీ డాక్టరు అన్నీ రివర్సులో చెబు తున్నాడు. అందరూ ఏదో చిన్న పిల్లను అడిగినట్టు మందులు వేసుకుంటున్నావా, మందులు వేసుకుం టున్నావా అని అడుగుతున్నారు, ఆ మందుల్లో ఏదో మాయామంత్రాలు ఉన్నట్టు. అవి వేసుకుంటే ఏదో మహాత్యం జరిగిపోతుందన్నట్టు.

బైటకు వెళ్ళిన కూతురు టైముకి తిరిగి రాకపోతే కంగారు పడనివ్వకుండా చేసే మందు ఏదన్నా ఉందా ప్రపంచంలో? ఊరు వెళ్ళిన భర్త క్షేమంగా ఉన్నాడో లేదో అని ఆందోళన పడకుండా శుభ్రంగా తిని పడుకునేలా చేసే మందు ఏ కంపెనీ అన్నా కనిపెట్టగలిగిందా? దేశం కాని దేశంలో ఉ న్న కొడుకు ఎలా ఉన్నాడో అని బెంగపడకుండా చేసే మాత్రలు ఏ దేశం అన్నా తయారు చేయగలి గిందా? ప్రపంచంలో ఏ మూల అన్నా భద్రంగా ఉందా? ఎగరేసిన గాలిపటాల్లా, గాలిలో పెట్టిన దీపంలా ఏ క్షణానికి ఏం జరుగు తుందో అన్న భయం తప్ప ఏదీ కాదన్న ధీమా ఇచ్చేదేదన్నా ఉందా బతుకులో?

గుండె మళ్ళీ దడదడమని కొట్టుకుంది. తల తిరుగుతున్నట్టు అనిపించింది. టాయిలెట్‌కు వెళ్ళాలనిపించేలా నరాల్లో ఏదో కదలిక. గుండె పోటు వచ్చేటప్పుడు అలాగే అనిపిస్తుందట. కొంప దీసి గుండెపోటు కాదు కదా? ఇంట్లో ఎవరూ లేను కూడా లేరు. ఎవరెన్ని అంటున్నా ఈ మాయ దారి గుండె గట్టిపడి చావదేంటి? ఏదైతే అదవు తుందని ఎంత గుండె నిబ్బరం తెచ్చుకుందా మన్నా మాటిమాటికీ జారిపోతూనే వుంది. ఏమన్నా అయి తను చచ్చిపోతే వీళ్ళకి దిక్కెవరు?

ఆడపిల్ల...ఇంకా పెళ్ళి కూడా అవలేదు. తనకేదన్నా అయితే దానికి అచ్చటా ముచ్చటా ఎవరు తీరుస్తారు? ఈయనకి మంచినీళ్ళు ముం చుకోడానికి కూడా బద్ధకం. తను లేకపోతే ఏమై పోతారు వీళ్ళంతా? తనకేదన్నా అయితే బాబు గాడికి అసలు చెబుతారో లేదో? చదువు మధ్యలో చెడిపోతుందని చెప్పరేమో? అక్కడ ఉండగానే తెలి స్తే వాడి గుండె పగిలిపోదూ?

మొన్ననే ముచ్చటపడి రెండు పట్టు చీరలు కొనుక్కుంది. ఇంకా మడతన్నా విప్పలేదు. పోరి పోరి చేయించుకున్న ఒంటిరాయి నెక్లెసు ఒక్క సారన్నా ఒంటిమీద పెట్టలేదు. వాటి మొహం అన్నా చూడకుండానే పోతుందేమో? తను దగ్గరికి వెళ్ళగానే సన్నజాజి చెట్టు ఎంత సంతోషంగా ఊగు తుందని...తనకేదన్నా అయితే దాని మొహం చూ సేది ఎవరు? చెంబుడు నీళ్ళు పోసేది ఎవరు? బుట్టతో బుట్టెడు పూలు పూస్తుంది. తనకి కచ్చి తంగా తెలుసు. తనకేదన్నా అయితే పూలు కోసే వాళ్ళు కూడా ఉండరు.

అబ్బ ఇన్ని మమకారాలు తనకెందుకు? ఏదైతే అది అవుతుందని ఎందుకు నిర్లిప్తంగా వుండ లేకపోతోంది. అక్కడికీ ఈ మధ్య గీత చదువు తోంది. భజగోవిందం వింటోంది. ఆపదామపహ ర్తారం చదువుతోంది. జెకెని చదువు తోంది. ఏదీ కూడా మనసుకి స్థిమితం ఇవ్వలేకపోతోంది. మన సుకి ఉదాశీనత తేలేకపోతోంది.

స్థిత ప్రజ్ఞత అని చదవడమే కానీ అను భవంలోకి రాకుండానే వయసయిపోతోంది. ఇప్ప టికీ గట్టిపడకపోతే ఇంకెప్పుడు గట్టి పడుతుంది? ఆ కాస్త ప్రాణం పోయాకా?

తను ఎవరి కోసం అయితే కళ్ళల్లో వత్తులు వేసుకుని చూస్తోందో వాళ్ళే తనను విసుక్కుంటు న్నారు. చిరాకుపడుతున్నారు. వాళ్ళు విసుక్కుం టున్నారని వాళ్ళ కోసం ఎదరు చూడడం, రాకపోతే కంగారు పడడం మానేయ గలదా? అది వాళ్ళు అనుకుంటున్నంత తేలికా...? అది తన చేతుల్లో ఉందా? కావాలని చేస్తోందా? ఆ విషయం వాళ్ళకు ఎందుకు అర్థం కాదు? విసుక్కు న్నంత మాత్రాన ఎవరికైనా గుండె గట్టిపడిపోతుందా? బండరాయిలా గడ్డ కట్టిపోతుందా? ఏమయితే అవుతుంది కాని మ్మని కాలు మీద కాలేసుకుని కూర్చుని టీవీ సీరి యళ్ళు చూడగలుగుతుందా? సహజంగా జరిగే దాన్ని అసహజం అంటున్నారు. అదే రోగం అంటున్నారు. అలా అనిపించకపోవడమే రోగం అని వాళ్ళకు తెలియదా?

టీవీ పెడితే ఒక్కటన్నా మంచి వార్త వుం టుందా? అక్కడ అద యింది, ఇక్కడ ఇదయింది, ఇంతమంది చనిపోయారు, అంతమంది చనిపో యారు అని తప్ప స్థిమితం ఇచ్చేది ఒక్కటన్నా వుంటుందా...? అవన్నీ చూస్తూ బైటకు వెళ్ళిన వాళ్ళు ఎలా ఉన్నారో, చెప్పిన టైముకి పది నిము షాలు లేటైతే ఏమయ్యారో అని కంగారు పడకుండా ఉండడం కుదురుతుందా? "పదినిముషాల్లో ఇంటికి వచ్చేస్తున్నా" అని చెప్పిన బిడ్డ చెప్పినట్టే ఇంటికి చేరుతున్నాడా? ఇవన్నీ చూస్తూ వింటూ పొద్దు న్నించీ రాత్రి వరకూ ప్రాణాలు బిగబట్టుకుని ఎదు రుచూడడం ఎవరికైనా ఎలా సాధ్యం? ఆలోచించ వద్దంటే ఆలోచించకుండా ఉండడానికి అదేమన్నా మనసా? టీవీనా? స్విచ్చి తీసేయడానికి? రేడి యోనా? కట్టేయడానికి. చెప్పడం తేలిక. చెయ్యడం కష్టం.

నిన్నకాక మొన్న శశిగాడు ఎంత మాట న్నాడు? "కొంచెం జాగ్రత్తగా ఉండరా. రాత్రుళ్ళు అట్లా ఒంటరిగా తిరగకూ" అంటే "ఏమవుతుంది? మహా అయితే పోతాం. అంతేగా. నువ్వు అట్లాం టివన్నీ ఊరికే అలా చెప్పకు" అన్నాడు. వేలెడంత లేదు వెధవ, చిటుక్కుమని ఎంత పెద్దమాట అన్నాడు.

నిజమే, బతుకులే అలా వున్నాయి. అన్నీ గాలిలో దీపాలే. దేనికి భద్రత ఉందని, దేనికో లేదని భయపడడానికి? అన్నీ అలాగే ఏడిసినయి. ఇంతోటి బతుక్కి ఎంతకని అనుక్షణం చస్తూ బత కడం? ఏదీ తన చేతుల్లో లేదు. దేన్నీ అడ్డుపెట్టి ఆపలేను. ఎవరికెంత ప్రాప్తం ఉంటే అంతే. ఏది రాసిపెట్టి ఉంటే అదే జరుగుతుంది. అది కర్మ సిద్ధాంతమో, అకర్మ సిద్ధాంతమో, వికర్మ సిద్ధాం తమో ఏదో ఒకటి దాన్ని నమ్ముకోవడం తప్ప ఇంక చెయ్యగలిగింది ఏదీ లేదు. మన చేతుల్లో ఏదీ లేదు. అంతే. ఇంక ఇదే తన పాలిట గీతా పారాయణం. విజయ కృత నిశ్చయం చేసుకుంది.

ఇంటి ముందు బండి వచ్చి ఆగింది.




# శిశిరం నడచిన జాడలు

హరితవనాల్ని వేటాడుతూ వచ్చి
పిట్టగూళ్లలాంటి మా గూడేల్ని తగలబెట్టేరు!
అయినా మా ఖర్మంటూ నెత్తిబాదుకున్నామే తప్ప
ఎదిరించిన పాపాన పోలేదు!
ఆయుధాల పహారాలో...
మా కాళ్ల కింద కొండల్ని పెళ్లగించుకుపోతున్నారు!
అయినా తలరాతంటూ ఊరుకున్నామే తప్ప పల్లెత్తు మాటాడనేలేదు!
కానీ....శిశిరం కురిసి శిథిలమైన మా బతుకుల మీద
యీ మతోన్మాదపు జాడలేమిటి?
యీ సాంస్కృతిక ఉగ్రవాదపు నీడలేమిటి?

మా బతుకు మూలాల్ని, మతం దువ్వి పోస్తుంటే...
మౌనంగా ఎలా ఉండగలం?
మా సనాతన ఆదిమ సంస్కృతుల మీద అగ్గి పోస్తుంటే...
మా తరాల సాంప్రదాయాల్నీ, ఆచారాల్నీ తగులబెడుతుంటే...
చూస్తూ ఎలా ఊరుకోగలం?
మతాన్ని మోసుకుంటూ మా కొండకోనల్లోకొస్తున్న దైవజనులారా...
శిలువ కంటే బరువైన బతుకు బండల్ని మోస్తున్నవాళ్లం!
గిరిజన గోవిందమంటూ మా గూడేల్లో ఊరేగుతున్న కాషాయధారులారా...
పదునాలుగేండ్లు కాదు,
బతుకుబతుకంతా వనవాసం చేస్తున్న వాల్మీకి వారసులం!

మహామహా మృగాలకు భయపడనివాళ్లం,
మతం తోలు కప్పుకున్న మనిషికి భయపడుతున్నామిపుడు!
మా పూర్వీకుల ఆచారాల్నీ, విశ్వాసాల్నీ మింగేస్తున్న
శిలువ చిలువలకు భయపడుతున్నామిపుడు!
ఇతిహాసాలమాటున బుసలు కొట్టే
నిలువ నామాల నాగసర్పాలకు భయపడుతున్నామిపుడు!
ఇపుడిక్కడ మా బతుకులు మతం ఉక్కు వలలో చిక్కుకున్న పావురాలు!
రాలిన వసంతాలు! అడవిపాడే విషాదగీతాలు!

చింతంబలీ, టెంకంబలీ జుర్రటమే తప్ప
ఏ మతం, మా ఆకలి కడుపున పట్టెడన్నం పెట్టింది?
గోచీయే తప్ప, యే ఆఛ్ఛాదనా లేని మా జీర్ణ దేహాలమీద
యే మతం జానెడు గుడ్డను కప్పింది?
మా కన్నీటి ఊట చెలమలే తప్ప
యే మతం మా ఎండిన గొంతుకల్ని జీవధారై తడిపింది ?
మన్నెంమన్నెమంతా మంచమెక్కినపుడు,
పసరుమందే పరమౌషధమయ్యిందే తప్ప
యే మతం మందుబిళ్లై మా ప్రాణాలు నిలబెట్టింది ?
మరుగున పడి, యీ మట్టి పొరల్లో యింకిపోయిన కన్నీటిగాథలెన్నో...
గాలిలో దీపాలై యీ కొండకోనల్లో కొట్లాడుతూ ఆరిపోయే ప్రాణాలెన్నో...
ఎవరిక్కావాలిపుడు?

చాలు! కల్చరల్ పోలీసై, మతం
మా మీద కవాతు చేసిందిక చాలు !
లేతాకు మీద కురిసే మంచుబిందువుల్ని కలుషితం చేయడమే
మతమైతే....ఆ మతాన్ని ధిక్కరిస్తున్నాం !
సహజవర్ణాల అడవిపూలకు రంగులద్దడమే మతమైతే...
ఆ మతాన్ని బహిష్కరిస్తున్నాం !
మా బతుకులు మమ్మిల్నిలా బతకనీయండంటూ...
సమస్త అడవినీ ఒక ముకుళిత హస్తం చేసి వేడుకుంటున్నాం!
కాదూ కూడదంటే.... అడవి అడవంతా ఓ కల్లోల కడలి తరంగమై...
పోటెత్తుతుందని హెచ్చరిస్తున్నాం!!

**సిరికి స్వామి నాయుడు**



ఉత్తరాంధ్రకి సంబంధించి సామాజికార్థిక, రాజకీయ సాంస్కృతిక సమస్యలని లోతుగా అభివ్యక్తీకరించిన అట్టాడ అప్పల్నాయుడి గురించి పాఠకులకి కొత్తగా చెప్పేదేమీ లేకపోయినప్పటికీ, కళింగాంధ్ర అట్టడుగు జన జీవితాన్ని - అంటే గిరిజన, కార్మిక, రైతాంగ జీవనాన్నీ, అభివృద్ధి విధ్వంసాన్నీ, పునరావాస లేమినీ, సంక్షేమ పథకాల పేరుతో ఆ ప్రాంతం మీద కమ్ముకుంటోన్న మాయ జలతారునీ...యింకా 'వాళ్లు'... వాళ్ళమీద జరుగుతోన్న దమనకాండ గురించీ, విప్లవ పార్టీల మౌలిక వ్యూహాల లోపాల గురించీ కథలు కథలుగా, వ్యాసాలుగా, నవలలుగా పాఠకుల ముందు ఆవిష్కరించిన అప్పల్నాయుడిని గురించి ఎప్పటికప్పుడు చెప్పుకోవాల్సింది యింకా మిగిలేవుంటుందేమో మరి...



# ఉత్తరాంధ్ర ఉద్యమ సాహిత్య ఉత్తేజకారుడు

## వి. ప్రతిమ

**మూడున్నర** దశాబ్దాలుగా బాధ్యతాయుతమైన సాహితీసేవ చేస్తూ వస్తోన్న అప్పల్నాయుడి మొత్తం సాహిత్యాన్ని ప్రచురించే బాధ్యతని శ్రీకాకుళ సాహితి, మిత్రసాహితి, స్నేహకళాసాహితి మూడు సంస్థలూ కలిసి భుజాన వేసుకోవడం నిజంగా అభినందించదగిన విషయం... ఆ క్రమంలో మూడు సంపుటాలుగా వెలువడిన అతడి సాహిత్యంలో కథల విభాగాన్ని మాత్రం ఆధారం చేసుకుని ఈ నాలుగు మాటలూ పాఠకులతో ముచ్చటించాలన్పించింది...

చాలాసార్లు అనిపిస్తూ వుంటుంది, ఇటు రాయలసీమలోనయినా, అటు ఉత్తరాంధ్రలోనయినా ప్రభుత్వ గణాంకాలలో వున్న దానికంటే కూడా ఆధునిక




సాహిత్యం నమోదు చేసిన సామాజిక చరిత్రే ఎక్కువేమోనని...ఆ పనిని కళింగాంధ్రలో ఎక్కువ లోతుగా అప్పల్నాయుడు చేయడమే కాకుండా, విజయవంతంగా ఆ సాహితీ సామాజిక కాగడాని సమర్థులయిన తన సన్నిహితుల కందించారు. అంకిత భావంతో పనిచేసే ఒకమంచి గ్రూప్‌ని ఆయన తయారు చేశారు. అందుకూ్కడ ఆయన్ని అభినందించాల్సే వుంది.

ఒక వ్యక్తి, అందునా జీవితమంతా ప్రజల క్షేమం కోసం, వారి జీవన స్థాయి మెరుగు పడ్డం కోసం పరితపించిన వ్యక్తి, జీవితంలోంచి సాహిత్యంలోకి ఎట్లా వచ్చాడు? ఏ శక్తులతడినిలా ముందుకు నడిపించాయి? ఏఏ వర్గాల ప్రయోజనాల కోసం ఎంతెంత మందిని కలుపుకుని ముందుకు నడిచాడు? బాల్యం నుంచీ అతడి జీవితంలో జరుగుతూ వచ్చిన మార్పులేమిటి? అన్నది ఆలోచిస్తే...

అప్పల్నాయుడు వారింట్లో మొదటి సంతానం. తండ్రి సూరి నాయుడికి డాబు, నాయుడి దర్జా ఎక్కువ...ఆ దర్పంతో పాతికెకరాల నేలా హారతి కర్పూరంలా కరిగిపోయి చూస్తూండగానే కుటుంబం తరుగుదలలో కొచ్చింది...అప్పల్నాయుడు హైస్కూలు చదువులకొచ్చేసరికి వారింట్లో ఇనపగజ్జెల తల్లి నాట్యం చేస్తుండేది. ఒకవైపు వ్యవసాయపు పనులకెళ్ళి సంపాదించుకోవడం, మరోవైపు పట్టుదలగా పైచదువులు కొనసాగించడం జరిగింది. ఆ క్రమంలోనే అతడికి సమాజంలోని అసమానతలు అవగాహన


98485 41485

కొచ్చాయి. అవగాహనలోనుండి ఈ ఎగుడుదిగుళ్ళ సమాజ పరిస్థితులకు వ్యతిరేకంగా ఏదయినా చేయాలన్న తపన మొదలయింది.

సరిగ్గా అప్పుడే శ్రీకాకుళోద్యమ నాయకులు వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసంల ఎన్‌కౌంటర్ జరిగి పోస్ట్‌మార్టం కోసం వీరి కాలేజీ ఎదురుగా వున్న ఆస్పత్రికి తీసుకొచ్చినపుడు వారికోసమొచ్చిన అశేష ప్రజానీకం, వారి త్యాగాలను ఒక వీర చరిత్రలాగా వీరి మాస్టారు అర్థం చేయించడం, వారికి కాపలాగా వున్న పోలీసులే వారికోసం కన్నీరు పెట్టడం యివన్నీ అప్పల్నాయుడిని ఆ వయసులోనే చాలా కదిలించాయి...జీవితానికో సార్థకత వుండాలన్న విషయం అర్థమయి అతడి ప్రాపంచిక దృక్పథమే మారి పోయింది.

శ్రీకాకుళోద్యమపు తొలి దశని జముకు కథగా సుబ్బారావు పాణిగ్రాహి, బుర్రకథగా పాటలుగా వెంపటాపు సత్యం రాసారు....మలిదశ నుంచి ఉద్యమ స్తబ్దత దాకా భూషణంగారు రాసారు...

"భూషణంగారు కొన్ని కారణాల వలన రాయకుండా లేదా రాయలేక వదిలేసిన శ్రీకాకుళోద్యమపు ఘటనలను బయటి ప్రపంచానికి తెలియజేయ డానికే నేను రచయితనయాను. నేను ప్రభావితమయినటువంటి ఆ ఉద్య మాన్ని గురించి భూషణం వ్రాస్తూ ఆపేశారు గనక నేను రాయాలనుకు న్నాను...కొనసాగించేను" అంటాడు అప్పల్నాయుడు.

అయితే పెద్దగురువు రావిశాస్త్రిలా పట్నానికి, చిన్నగురువు కాళీపట్నం వారిలా పల్లెకీ, భూషణంగారిలా అడవికి మాత్రమే పరిమితం కాలేదతడు... అడవితోనే ఆగిపోకుండా పల్లె, బస్తీ, పట్నం మొత్తం కళింగాంధ్రనే దున్ని సాగుచేసి ఆ సాహితీ ఫలాలను పాఠకుల కందించిన మట్టి మనిషి అప్పల్నా యుడు...అంటే తన గురువుల కంటే కూడ మరింత సూక్ష్మస్థాయి లోకి వెళ్ళి తమ చుట్టూ వున్న జీవితాన్ని మరింత సునిశితంగా, నిర్దిష్టంగా అర్థంచేసుకుంటూ, విశ్లేషిస్తూ కథారూపంలో పాఠకుల కందించిన రచయిత అప్పల్నాయుడు.

చాలాసార్లు జీవితాన్ని అర్థం చేసుకోవడానికి సాహిత్యం ఉపయోగపడు తుంది అన్నది అప్పల్నాయుడి సాహిత్యానికి చాలా అర్థవంతంగా సరిపో తుంది... అందుకే కాళీపట్నం రామారావుగారు అప్పల్నాయుడి గురించి మాట్లాడుతూ "నేను యిక్కడి వాడినే అయినప్పటికీ, కొన్ని కొన్ని పరిస్థితు రీతులను అర్థం చేసుకోవడానికి అప్పల్నాయుడి సాహిత్యాన్ని క్రమం తప్ప కుండా చదువుతుంటాను" అంటారు. ఆవిధంగా ఉత్తరాంధ్ర సామాజిక చరిత్రకి సంబంధించి ప్రతీ చీకటి కోణంలోకి వెలుతురు ప్రసరించేలా సాహితీ టార్చిలైటును వెలిగించి పోరాట ఉత్తేజాన్ని కలిగించే కథలు రాశారాయన. ఆ తీరం వెంబడి క్షతగాత్ర గానాలన్నీ బయటి ప్రపంచానికి తెలిసింది అప్పల్నా యుడి వల్లనే కదా.

మొదట మొదట కరడుగట్టిన అభిప్రాయాలతో, కూలీలు, శ్రమజీవులు మాత్రమే చోదక శక్తులనీ, వారిని గురించి మాత్రమే రాయాలనుకునే అప్పల్నా యుడికి క్రమంగా, మరికొంత లోతుగా, విశాలంగా సమాజంలోని అనేక సమూహాలనూ, ఎన్నో గాథలూ, బాధలూ వున్నాయని గుర్తెరిగి 'ప్రత్యామ్నా యం', 'మమకారం', 'బంధాలు - అనుబంధాలు' వంటి కథలు రాశారు. అప్పట్నుండీ అతడి కార్యక్షేత్రం సాహిత్య రంగమే అయింది.

* * *

"వాళ్ళు భూమితో సాముచేసి కాసిని పంటలు పండిస్తారు. పలురకాల మొక్కలు నాటి తోటలు పెంచుతారు. మట్టిని మంత్రించి మాణిక్యాలను వెలికి తీస్తారు. వాళ్ళు సముద్రంతో సాము చేసి కాసిని మత్స్యసంపదను తెస్తారు. కొండలను పిండిచేసి కాసిని దేవతా విగ్రహాలను తయారు చేస్తారు. వాళ్ళు అడవిని జయించి కాసింత మందూ, మాకూ తెస్తారు. చెమట చుక్కల్ని వర్షించి, బతుకు ఆల్చిప్పల్లోంచి ముత్యాల్ని వెలికి తీస్తారు" అంటూ సృష్టి కర్తల గురించి మాట్లాడే అప్పల్నాయుడు తన తొలికథ "పువ్వుల కొరడా' నాటినుండీ, యింకా అంతకు ముందునుండే ఒక నిశితమైన ప్రాపంచిక, తాత్త్విక దృక్పథాన్ని కలిగి వున్నారు. దానితోపాటే ఒక ధిక్కార స్వరాన్ని సంతరించుకున్నారు.

ఈ క్రమంలో మొత్తం వారి అసహాయ స్థితి, అణిచిపెట్టబడిన ఆక్రోశం ఒక సమిష్టిగా పనిచేయాల్సిన అవసరాన్ని తెలుసుకుని సంఘాలుగా ఏర్పడి కూలీరేట్ల పెంపుదల కోసం, తమ భూమిని షావుకార్ల నుండి కాపాడుకోవడం కోసం కార్యక్రమాలుచేపట్టిన విశేషాలు యివన్నీ కూడ అప్పల్నాయుడు ఒక క్రమ పద్ధతిలో సాహిత్యంలో నమోదు చేశారు. పోరాటాన్ని అణిచివేస్తే ఓడి పోయినా తిరిగి తిరిగి పోరాడాలన్న ఉత్తేజాన్ని కలిగిస్తాయతడి కథలు...

"పంట పోయిందని మళ్ళీ వ్యవసాయం సెయ్యిరూ...మళ్ళీ వేస్తాం, మళ్ళీ పండిస్తాం...అదిగిలగ పోరాటమూ అంతే" అంటుందొక పాత్ర. పడిలేచే కథల తరంగాలు గుర్తొస్తాయి మనకి.

"కప్పల బతుకుల మీద పాముల తీర్పు పనికిరాదు. యికనుండీ శ్రమజీవుల తీర్పే అమలవాలి" అన్న భూషణం మాటలు తలదాల్చినట్టుగా అప్పల్నాయుడి కథల్లో ప్రజాపోరాటాల ఉత్తేజిత విజయ గాథల్ని మనం చూడగలం.

* * *

ఆధునికత రాకతో రైతు జీవన విధ్వంసం, గ్రామీణ ప్రజల సంక్షోభం, మానవ సంబంధాల హింస, భూమికీ, రైతుకీ నడుమ వ్యవస్థ సృష్టిస్తోన్న వైరుధ్యాలు, ఆ క్రమంలో దోపిడీ రూపాలలో మార్కెట్టు ప్రవేశం, రైతులు రైతుకూలీలుగా, యింకా కార్మికులుగా మారడం, మళ్ళీ అక్కడ మిల్లుల మూసివేత, లాఠీచార్జీలు, కార్మికుల మరణాలు అన్నీ కూడా రాజకీయార్థిక కోణాలనుండి లోతుగా పట్టుకుని ఎన్నెన్నో చారిత్రక వాస్తవాలను పాఠకుల ముందు ఆవిష్కరించిన ఉద్యమకారుడు అప్పల్నాయుడు. ఒక విధంగా ఇలా ఇంటా బయటా ఉద్యమమే జీవితమయిన అప్పల్నాయుడిని రాజకీయవేత్తలు, సాహిత్య జీవన సాహితీ వేత్తలు రాజకీయ జీవిగా భావిస్తారు. అంతగా రాజ

కీయమూ, జీవితమూ, సాహిత్యమూ కలగలిసిపోయిన రచయిత అతడు.

సామ్రాజ్యవాద విధానాల మూలంగా వ్యవసాయం దెబ్బతిని భూసంబంధాల్లో పెనుగులాడి సన్నకారు రైతులంతా రైతు కూలీలుగా మారిపోయిన క్రమంలో పూలమ్మిన చోట కట్టెలమ్మలేక దూరప్రాంతాలకు వలసపోవడమనే దురదృష్టకరమైన సందర్భం రైతుల జీవితాల్లో ఏర్పడిందని మనందరికీ తెలుసు...దానిమీద సింగమనేని నారాయణగారు రాసిన "ఒక పయనం" కథలో రైతు గంగన్న, కుటుంబంతో బళ్లారి ప్రాంతానికి వలసపోయి అక్కడి మోతుబరి రామప్పనాయుడితో ఒక మాటంటాడు.

"మా ప్రాంతంలో వ్యవసాయానికి సంబంధించినవేవీ రైతు చేతుల్లో లేవు నాయనా...నీళ్ళు మాచేతుల్లో లేవు, ఎరువులు మాచేతుల్లో లేవు.. మందులు మా చేతుల్లో లేవు... కరెంటు మా చేతుల్లో లేదు. వీటన్నింటినీ కట్ట కట్టుకుని ఎవరో మా చేతుల్లోనుండి లాక్కుపోయారు. ఇప్పుడు మా జిల్లా రైతు చేతుల్లో ఉత్త భూమి మాత్రమే వుంది" అంటాడు.

అప్పల్నాయుడి రైతు బలరామయ్య భూమిని అమ్ముకుని వలసపోయి "బాపూ మీ పెద్దలు పేరంటాళ్ళ దయవల్ల మా తాత ముత్తాతలు సల్లగ బతికేరు...కానీ తాతల్నాడు భూమికి రాజులూ, జమీందార్లక్కుదారుల యినారు. తండ్రి నాటికి తెల్లదొరలు తోడయినారు. కొత్తకొత్త పంటలు, కొత్త మార్కెట్టూ జతగలిసేయి. నాకొచ్చేసరికి మెట్టభూములూ, మార్కెట్ పంటలూ, మదుపుల మీద మదుపులూ జతగూడినాయి. అయినా నిబ్బరంగా నిలబడినాను. బాగు పడ్డానికి బంజర్ని వొరగట్నాను. వొస్తాదనుకున్న ఆనకట్ట రాక అప్పుచేసి, నుయ్యి తవ్వి ఏతమెత్తినాను. అప్పు తీరదు, నీరు సాలదు, చెప్పాను కదా బాబు బతికి చెడిన దేశమని, ఆనకట్టల్లేని దేశమని, ఆకలి దేశమని...ఆ దేశానికి దండం పెట్టి ఎంతోకంతకి తమలాంటి కలిగి నోరికి భూములప్పజెప్పి సేనామందెలిపోనారు. ఆ భూముల్ల రిగ్గులు దించితే ఏతానికి నీరందతాదా? మళ్ళా అప్పుచేశాను. మోటారేశాను. పంటలు మార్చా ను. మార్కెటంట పరిగెత్తినాను. కొనకి పడిపోనాను. నుయ్యప్పు, మోటారప్పు, మదుపులప్పు ముప్పేట ముడేసినాయి" అంటూ ఏదేదో చెప్పాలని అనుకుంటాడు బలరామయ్య. కానీ ఏదీ కూడ గొంతుకడ్డంపడి బయటికిరావు.

బలరామయ్యకి బతికి చెడ్డవాడ్ని అని చెప్పుకోడానికిష్టంలేదు. బతికి చెడిన దేశమోడ్ని అంటాడు. చివరికి అతి ప్రయత్నంమీద గొంతు పెగుల్చుకుని "ఇదిగోండి బాపూ ఈ రెక్కలిరిసి కష్టపడతాను. మీ పశువుల్ని కాస్తాను. మీ భూముల్ని పచ్చపచ్చగా చేస్తాను. మీ యింటిని పాడి పంటల్తో కళకళలాడిస్తాను. పనిప్పించండి, పనిప్పించండి బాబూ" అని మాత్రమే అనగలుగుతాడు.

'ఒక పయనం' కథలో రామప్పనాయుడు రైతు గంగన్నకి ధైర్యం చెప్పి పని చూపిస్తాడు. కానీ యిక్కడ బలరామయ్య వలస వచ్చిన మోతుబరి "తర్వాత రండి" అనేసి లోపలికెళ్ళిపోతాడు.

నిజంగా చదువుతున్న పాఠకుడికి తలకొట్టేసినట్టవుతుంది. బాధని దిగమింగుకోవడం కూడ కష్టమవుతుంది.

ఈ వలస పయనం కోసం వస్తువులు సర్దుకునే క్రమంలో ఈ కథ ప్రారంభమవుతుంది. ఇల్లాలు పీటచెక్క గుగ్గిలం చెక్కతో చేసింది వొదలాలన్పించక పెట్టుకుందామంటుంది.

"బతుకు ఈకాడికొచ్చినా నాయురాలికి పీటచెక్క కావాల గావాల కూకొని వూసులాడ్డంకి. మనవేమీ అత్తగారింటికెళ్లం లేదు. అడుక్కు తింటానికెల్తన్నాం" అంటాడతడు.

"ఆఁ అత్తారింటల పీటసెక్కమీద కూకుని కూకుని తినితినీ సూడు పిర్రలెలగ బలిసినాయో" అని ఎండిన పుల్లల్లాంటి తన కటి భాగాన్ని తిప్పి చూపి వెక్కిరించేదే గానీ ఆ యిల్లాలి గొంతు దుఃఖంతో పూడుకు పోయిందని అంటాడు రచయిత. చదువుకున్న పాఠకుడి గొంతుక్కూడ ఏదో అడ్డం పడుతుంది...

ఎందుకు చెప్తున్నానంటే అంతంత బరువులు మోస్తూ కూడ, బతుకొక యుద్ధంగా మారినా, ఆ వెటకారం, హాస్యం, వ్యంగ్యం ఎల్లప్పుడూ తోడుగా వుంచుకోవడం అప్పల్నాయుడి పాత్రలకే సాధ్యమా లేక ఉత్తరాంధ్ర అట్టడుగు జనాలకి మాత్రమే స్వంతమా అనిపిస్తుంది.

ఆధునిక కథలో భాషకీ, వస్తువుకీ అవినాభావ సంబంధముంటుంది భాష వస్తువుతో మిళితమైపోయి తనంతట తానుగా సౌందర్యవంతమైన శిల్పాన్ని రూపొందించుకోవడం అప్పల్నాయుడి కథల్లో మనం చాలా చోట్ల చూస్తాం.

తల్లి తనని వదిలిపెట్టి వెళ్తానన్నప్పుడు జయకృష్ణ ఒక మాటంటాడు. "మామాఁ ఎవురి ప్రయాణాన్ని ఎవురం ఆపలేం. ఎవరమెటు పయనిస్తున్నామో కూడ అర్థమవదు...తల్లీ తండ్రీ, పిల్లలూ, బంధువులూ, స్నేహితులూ, గ్రామాలూ ఎవరికి వారుగా ఏదో విశదమైపోయి భవిష్యత్తేదో వెలుగయి కన్పిస్తుంటే చేసే ప్రయాణాలు గావివి. ఇక్కడ యిప్పుడు బాగోక పారిపోతున్న యాత్రల న్పించట్లేదూ? నాకు యింతకుమించి బోధ పడ్డేదో, బోధ పడిందాన్ని చెప్పలేక పోతున్నానో మరి అదన్నమాట"

కన్పించని శత్రువెవవరో బోధపడక మనుషులు తమలో తాము పోరాడుకుంటున్నారని రచయిత ఉద్దేశం.

ఇట్లా తల్లికి అన్నం పెట్టలేని జయకృష్ణవంటి యిద్దరు ముగ్గురు కొడుకులు అప్పల్నాయుడు కథల్లో మనకి కన్పిస్తారు. అన్నం పెట్టని కాదు, అన్నం పెట్టలేని కొడుకులు. అసలు పసికందులయిన తన కడుపున పట్టిన బిడ్డలకే అన్నం పెట్టలేని పరిస్థితుల్లో తానేం తింటాడు? తల్లికేం పెడతాడు?

"నైరుతీ రుతుపవనాల ఆదిలో వర్షాలొస్తాయి. ఆకులు పోస్సి, ఎరువు లేసి పెంచి నాట్లేస్తామా? ఒకటి రెండు వానలందుతాయి. ఒకటి రెండుసార్లు ఎరువులూ మందులూ కొడతాం. ఇకంతే, చేను పొట్టకొచ్చి ఆగిపోతుంది. మరి వాన పడదు. పొట్టగింజ గట్టడదు. పెట్టిన మదుపు కయినా పంట రాదు. పంటలన్నిసార్లు పోతే రైతు తట్టుకోగలడా" అంటూ కోడలు సంజాయిషీ యిస్తున్నట్లుగా రైతు పరిస్థితిని వివరిస్తుంది.

"పురుగుల మందుల తోటి పురుగు సస్తదేమోగానీ పంటలు పండవు గదా. రైతుకి పురుగులమందే పెరుగన్నం చేసిందేదో దానికి కొట్టాల మందు" అనే రచయిత, దేని మూలంగా ఈ బంధాలు అనుబంధాల హింస జరిగిపోతోందో జాగ్రత్తపడమంటాడు.

కళింగ రైతులంతా కళింగయుద్ధం నాటినుండీ క్షతగాత్రులయ్యే వున్నారు. ఎన్నో యుద్ధాలు జరిగేయి గానీ ఢిల్లీ కోటమీద తలపాగాను జెండాగా ఎగురవేసే యుద్ధం యింకా జరగాల్సే వుందంటాడు అప్పల్నాయుడు.

* * *

పెత్తనాల కింద అణగారి పోతోన్న స్త్రీలతో పాటు చైతన్యవంతమైన,

ధైర్యసాహసాలుగల, ఆత్మగౌరవంతో అలరారే స్త్రీలు కూడ అతడి కథల్లో మనకి తారసపడతారు. స్త్రీలంటే అప్పల్నాయుడికి ఎనలేని గౌరవం.

ఈ ముప్పయి మూడుశాతం రిజర్వేషన్ల మూలంగా స్థానిక సంస్థల్లో రాజ్యాధికారం వచ్చినప్పటికీ వాళ్ళు నామినేషన్లు వేయడం దగ్గర్నుండీ చివరికి సీట్లో కూర్చున్న తర్వాత కూడ ఎట్లా పురుషాధిక్యపు నీడలో సాగుతూ వుంటారో మనందరికీ తెలిసిన విషయమే.

'యానగాలి' కథలోని శాంతామణి లేడీస్ కోటాలో అధ్యక్షురాలిగా గెలిచి కేవలం ఆఫీసుకొచ్చి కూర్చుంటుందే గానీ మొత్తం పాలనా వ్యవహారాలన్నీ ఆమె భర్తే చూస్తూ వుంటాడు. అంతేకాకుండా టీచర్ల పోస్టింగులమీద పూర్తి అధికారమున్నటువంటి ఎండిఓ సరళమ్మని, ఎవరికీ తలవంచని సరళమ్మని అనేక రకాలుగా బెదిరిస్తూ, దబాయిస్తూ వేదనలకు గురి చేస్తుంటాడు...

కథా వస్తువు లోతుల్లోకి వెళ్ళకుండా ఈ కథలోని ముగ్గురు స్త్రీలను మాత్రం మనం పరిచయం చేసుకుందాం.

ఒక మధ్యాహ్నం వేళ ఒంటరిగా ఆఫీసులో కూర్చుని వున్న శాంతామణికి తన చిన్నప్పుడు సాయిబు కోతిని ఆడించే ఆట గుర్తొస్తుంది. ఇప్పుడు నలభయి, యాభయిల్లో వున్న చాలమందికి తమ బాల్యంలో యిట్లా కోతిని ఆడించే ఆట గుర్తుండే వుంటుంది.

కోతి ఒంటిమీద రంగురంగుల జుబ్బా వేసి, రంగుపూసల దండలతో దాన్ని అలంకరించి, మచ్చిక చేసుకుని తాను చెప్పినట్లల్లా ఆడేట్టుగా అలవాటు చేస్తాడు. ఆ ఆటలో ఎప్పటికీ మరపురాని చర్య ఒకటివుంది అది సాయిబు దానిచేత నీళ్ళు మోయించే అంశం.

కన్నవాళ్ళింటికి నీళ్ళు తీసుకురా అంటే అదేమో ముక్కుతూ, మూలుగుతూ నీళ్ళ కడవ ఎక్కడ ఎత్తి పడేస్తుందోనన్నట్టు తెస్తుంది.

ఉమ్మడి కాపురం నాడు అత్తవారింటికి నీళ్ళు తెమ్మంటే ఎవరి మీదనో కక్షతో విసురుగా వెళ్ళి నీళ్ళు తెస్తూ దధాలున కడవ దించుతుంది. అదే వేరుపడి స్వంతకాపురం నాడు నీళ్ళకోసం వెళ్ళమంటే ఖాళీ కడవతో నీటికి బయల్దేరిన దగ్గర్నుండీ తిరిగి నీళ్ళ కడవ యింట్లో పెట్టేదాకా అత్యంత జాగ్రత్తగా, బాధ్యతగా, తనదైన కర్తవ్యంగా నీళ్ళు తేవడం చూపుతుంది. చూస్తున్న వాళ్ళు దాని స్వార్థాన్ని గుర్తించినట్లు నవ్వుకుంటారు. కానీ శాంతా మణికి మాత్రం నవ్వు వచ్చేది కాదు. ఆ దృశ్యం మరోలా అర్థమయ్యేది.

అర్థం కానిదల్లా ఒక్కటే. అధికారం కింద, పెత్తనాల కిందా కాకుండా స్వయం నిర్ణయాధికారాలతో స్వేచ్ఛగా వుండటానికి ఎవరయినా ఎంత యిష్టపడ్తారు. మొత్తంగా స్వేచ్ఛారాహిత్యానికి ఒక ప్రతీకలా వుంటుందీ కథ... పురుషాధిపత్యపు నీడలో రాజ్యాధికారాన్ని చేపట్టిన స్త్రీల పరిస్థితిని చెప్పడానికి ఈ కోతి ఆటని ఉపమానంగా తీసుకోవడం ఒక కొత్తదనం...అదీ శాంతామణి ఆలోచనల్లో నుండే చెప్పడం ఆమె లోలోపలి చైతన్యాన్ని అర్థం చేయించడం.

రానురాను స్త్రీలు తమ యింట్లో తాము కూడ ఒంటరులయిపోతోన్న పరిస్థితి దాపురించడం మరింత శోచనీయం. గృహిణి అయిన శాంతామణే కాకుండా చదువుకుని ఎం.డి.ఒ.గా ఉద్యోగం చేస్తున్న సరళమ్మ... ఎంతో ఆత్మగౌరవం, ధైర్యం, నమ్మకం కలదయి కూడ ఇటు కార్యాలయంలోనూ, అటు కుటుంబంలోనూ ఎట్లా అణచివేతకు గురవుతుంది? ఒంటరిదయిపోతుంది? ఎందుకు రాత్రులు లెక్కపెట్టుకుంటుంది? అర్థమవుతుందీ కథలో...

అంటే చదువు, సంస్కారం, తెలివితేటలు, ధైర్యసాహసాలు, తెగువ వుండే స్త్రీలు కూడ ఎట్లా అణచబడతారు? ఎట్లా విధ్వంసానికి గురవుతారు? ఈ అసమ సమాజపు నేపథ్యం ఎట్లా వాళ్ళని అధీనుల్ని చేస్తుందో అర్థం చేయిస్తారు రచయిత.

అయితే వీరిద్దరికీ భిన్నమైన, తెగువ గలిగిన మరొక స్త్రీని పరిచయం చేస్తారిదే కథలో.

"ఎన్ని సుట్లు సెప్పాలి నీకు? నా బతుక్కేంటరా దిల్‌కారాజా. ఒకరికి తలొంచి బతకడం సేతకాదు నాకు?" అంటుంది గున్నమ్మ – "నువ్వు చిన్నింటి దానివేటి? సామబిల్లి గున్నమ్మ. మందస మందారం" అంటాడు గవరయ్య వెటకారంగా.

మందసారాణి పేరు ఎవరికీ గుర్తుండదు కానీ, రాచరికాన్ని ధిక్కరించిన గున్నమ్మ, వీరోచిత గున్నమ్మ మాత్రం అందరికీ గుర్తుండిపోతుంది. ఎందరినో ప్రభావితం చేస్తోంది. గున్నమ్మ పేరు పెట్టడమే ఒక ప్రతీక. చివరిదాకా ఎం.డి.ఓ సరళమ్మని కనిపెట్టుకుని వుండి ఆమెకి ధైర్యాన్ని, తెంపునీ సరఫరా చేస్తున్న దానిలా వుంటుంది గున్నమ్మ. అప్పల్నాయుడి యితర కథల్లోని స్త్రీ పాత్రలు కూడ పల్లెటూరి అమాయకత్వంలో నుండే చైతన్యాన్ని నింపుకుని ప్రకాశిస్తూ వుంటాయి.

ముఖ్యంగా బాగా గుర్తుండిపోయి మళ్ళీ మళ్ళీ జ్ఞాపకానికొచ్చే ఆమె "సూతకం కబురు' లోని అనామిక. ఆమెకి పేరులేదు కథలో. బహుశా స్త్రీల అస్తిత్వలేమికి ఈ పేరులేక పోవడం ఒక ప్రతీక కావొచ్చు. ఆమె బాగా పొడగరి. ఇతర స్త్రీలు వేసే రెండంగల దూరాన్ని ఆమె ఒక్క అంగలోనే నడవగలదు.

ఆమె జనరల్ రాజకీయాల నుండి, కుటుంబ రాజకీయాల వరకూ, ఇందిరమ్మ ఇళ్ళు శాంక్షనవడం దగ్గర్నుంచి తన ఇల్లూ, చెల్లి యిల్లూ అస్తవ్యస్తమై పోవడం దాకా ఎన్నెన్నో విషయాలని అనర్గళంగా నీలాటి రేవుకి వెళ్తూ నీలవేణితో చెప్తుందామె. నీలవేణి కేవలం శ్రోత మాత్రమే.

ఆమె ఎవరిదో సూతకం కబురు విని ఆ వూరికివెళ్ళి చావుని చూసి తిరిగొచ్చింది...అయితే అసలు సూతకం కబురు వేరే వుంది. జీవిక కోసం దూరప్రాంతానికెళ్ళిన ఆమె భర్త అక్కడ మరొక ఆమెతో కలిసి వుంటున్నాడన్న కబురు చెప్పి యింటిని చూసుకోమంటుందొకావిడ... ఏం చూసుకుంటుంది? ఇంటిని చూస్తుందా? ఇంట్లో పిల్లల్ని చూసుకుంటుందా? యుద్ధమయిపోయిన బతుకును చూస్తుందా?

"సూతకం తానం సేసొస్తానమ్మీ" అంటూ నీలాటిరేవులోకి దిగి బుడుంగున మునుగుతుంది. దిగబోతూ ఒక మాటంటుంది.

"కనబడదు గానీ బతుకింతకు తక్కువలోతుకాదు" అని ఆ ముగింపుని కూడ అత్యంత విశ్వసనీయంగా పాఠకుడికి ఎటువంటి అనుమానమూ రాకుండా చెప్తాడు రచయిత.

శిల్ప పరంగా కూడ 'సూతకం కబురు' చెప్పుకోదగిన కథ. శ్రీపాద కథ కేవలం సంభాషణలతో నడిస్తే యిది ఆమె ఒక్క సంభాషణతో మాత్రమే నడుస్తుంది. అట్టాడవారి కోడలూ, మామిడివారి ఆడపడుచూ అయిన నీలవేణి కేవలం శ్రోత మాత్రమే. ఇంకా యింకా అప్పల్నాయుడి కథల్లో చర్చించదగిన స్త్రీలు చాలామందే వున్నారు.

* * *

ఇవ్వాళ అభివృద్ధి అన్న పదానికి అర్థం పూర్తిగా మారిపోయింది.

అభివృద్ధి పేరుతో సమస్త సాంస్కృతిక సంపదనూ భూస్థాపితం చేసి విదేశీ కంపెనీలకు కట్టబెడుతోన్న ప్రభుత్వ దుష్ట విధానాలకు ఎక్కువశాతం బలయింది ఉత్తరాంధ్ర ప్రాంతం కాబట్టి, దానికి వ్యతిరేకంగా పోరాటం చేయాల్సిన అవసరాన్ని గుర్తెరిగి సాహిత్యోద్యమం చేస్తున్నారు అప్పల్నాయుడు.

"కెరటాలు, కెరటాలుగా పొంగిపొరలే నీలిరంగు సముద్రమూ, సువర్ణ వర్ణపు యిసుక తీరమూ, నేల నేలంతా నీళ్ళతో నిండే తంపరలో తుళ్ళిపడే చేపపిల్లలూ, తంపర నీటితో తడిసి పెరిగిన ఆకుపచ్చ పంటచేలూ, చేలల్లోనా, చెలకల్లోనా, గట్లమీదా, చెట్లమీదా విన్పించే సర్వ జీవరాశి సుస్వ రాలూ, పైరగాలీ, గావంచా పంచెల రైతు తలపాగాలూ, రాగాల పద్యాలూ, రైతు పడతుల గీతాలాపనలూ, పాడిపంటలూ" యివన్నీ కూడ యిక మీదట నిజజీవితంలో మాయమైపోయి కలిమిగల మారాజుల కాంక్రీటు గోడల మీద చిత్రరాజాలయి కాంతులీనుతాయని... ఆ కళాఖండాలని ఎంతయినా చెల్లించి కొనుక్కుని మధుర దృశ్యాలుగా అమర్చి ఆనంద పడ్తారనీ అనుకుంటే దిగులు మేఘాలావరిస్తాయి.

వాటి బదులు యివ్వాళ ధూళి మేఘాలూ, ఇంజన్ల రొదలూ, సైరన్ కూతలూ, కాంక్రీటు గిడ్డంగీ, ఒక కర్మాగారం, వొక నోట్లకట్ట పాములా పుట్టి, అభివృద్ధికీ, సంపదకీ నిఖార్సయిన నిదర్శనంగానూ, మనల్ని నమ్మించే, మనం నమ్మే ఒక వాస్తవ దృశ్యమయిపోయింది గ్రామాల్లో.

బీల మీద, తరగని మత్స్య సంపదతో బిలబిల లాడుతుండే బీల మీద, పేదలు తినే దుంపజాతి మొక్కలు, పేదలు వాడుకునే తుంగ చాప గడ్డీ తర గని సంపదగా అలరారే బీల మీద లారీలతో మట్టి తోలి కప్పెట్టి పెద్ద పవర్ ప్రాజెక్ట్‌ని కట్టి ప్రజలకు మేలు చేస్తామంటుంది ప్రభుత్వం.

ఆ 'బీలకోసం' మనుషులే కాకుండా సమస్త జంతుజాతి, పక్షులూ కదిలి అండగా నిలవడాన్ని గురించి చెప్తాడు రచయిత. సకల చరాచర జీవ రాశీ ఎట్లా సమరానికి కదిలిందీ, ఎట్లా గొంతుల్ని పూరించేయి? ఎట్లా శరీ రాలను సంధించేయి?... ఇంతకీ ఎవరిమీద ఈ యుద్ధం? కేవలం కంపెనీల మీదనా? కాదు మనుషులు కాని వాళ్ళమీద...!

ఎవరి వలన జలవనరులు యింకి పోతాయో, ఎవరి వలన భూగర్భం లోని ఖనిజ సంపద ఖాళీ అయిపోతోందో, ఎవరి వలన నదులూ, సముద్రా లూ, పర్వతాలూ, పంటభూములూ, పల్లెలూ విధ్వంసమయిపోతాయో వారం దరూ శత్రువులే... వారి మీదనే ఈ యుద్ధం.

పొట్టేలు కొండతో ఢీకొంటే, కోడిపుంజు గ్రద్దమీదకు కాళ్ళు దువ్వితే, కప్ప పాము మీద కలబడితే, గోవు పులిరాజు మీదికి దుమికితే యేటవుతా దండీ? సదరు ఢీకొట్టే జీవాల పని యింతేసంగతి కదా. ఈ సంగతి తెలియక...

ఆరుగాలం పండే పంట భూముల్ని వొదులుకోలేమని రైతులూ, జీవనా ధారమైన బీల భూముల్నీ, తంపర్లనీ, చెరువుల్నీ వొదులుకోలేమని మత్స్య కారులూ, తోటలనూ, దొడ్లనూ ఇళ్ళనూ ఊళ్ళనూ వదులుకోలేమని పేదలూ భీష్మించుక్కూచున్నారు. నోళ్ళున్నాయని దూషణలకు దిగేరు. కాళ్ళున్నాయని ఆఫీసులకీ, కోర్టులకీ తిరిగేరు. నిరసనలూ, నిరాహారదీక్షలూ, ఆందోళనలూ, పోరాటాలు చేసేరు... అందువలన ఏమయింది? ఎన్ని ప్రాణాలు పోయేయి? ఎందరు గాయపడినారు? ఎంత నెత్తురొలికింది? ఇది తొలిదెబ్బ. యింకా యింకా ఎన్ని దెబ్బలో... ముందున్నది మృత్యు సంబరమంటూ కొన్ని కంపెనీల పోతు బలాన్ని వెటకార ధోరణిలో చెప్తాడు రచయిత.

అభివృద్ధికి ఎవ్వరూ వ్యతిరేకం కాదు. వ్యతిరేకించినా సమాజ అభివృద్ధి ఆగదు. కాకపోతే చర్చ అంతా ఆ అభివృద్ధి నమూనా పైనే. ఈ అభివృద్ధి ఎవరిది, ఎవరికోసం అన్నదానిపైనే...!

ఉత్తరాంధ్ర ఒక విభిన్న నైసర్గిక ప్రాంతం. దాదాపు పదిహేను వందల కిలోమీటర్ల సముద్ర తీరం. వేయి కిలోమీటర్ల అటవీ ప్రాంతం, సారవంతమైన పల్లపు మైదానం కలిగిందీ భూభాగం. దాన్ని సరిగ్గా వినియోగించుకుని అభి వృద్ధి పథంలో నడవకుండా విదేశీ కంపెనీల కప్పగిస్తోన్న పాలకుల స్వార్థ విధానాలను గురించిన కలత అతడి రచనల్లో మంటలా మండుతూ వుంటుంది. ఆ ప్రాంత సహజ వనరులను కాపాడుకోవడం కోసం బలమైన ఉద్యమ నిర్మాణం జరగాల్సే వుందని అతడి ఉద్దేశ్యం.

అప్పల్నాయుడి విశ్వరూపం యింతే అనుకుంటే పొరబడ్డట్టే.

ఆలివ్‌గ్రీన్ అరణ్యం మధ్యన మనోహరమైన లోయలో అతలాకుతలమై పోయిన ఉదయ సంధ్యల గురించి అల్లల్లాడి పోతాడు. పచ్చనాకులు రుచి చూసిన ఎర్ర నెత్తురు మీదుగా రెక్కలు తెగిపడ్డ రామచిలుకల మీదినుండి, చిల్లులు పడ్డ వేణువయిన పశువులకాపరి దేహం మీదుగా, చీరుకుపోయిన గంగడోలుతో నిశ్శబ్దంగా కూలిపోయిన లేగదూడ మీదినుండి అతడు చూపించే ఉదయసంధ్య అడవి వేసే చావుకేక గొంతు కడ్డంపడి ఎంతకీ మింగుడు పడనివ్వదు.

మన రేపటి కోసం 'వాళ్ళు' చేస్తోన్న యివ్వాల్టి త్యాగాలు మనల్ని కృత జ్ఞతా బద్ధులను చేసి ఉద్వేగానికి గురిచేస్తాయి. మొత్తం కథంతా పోలీసాఫీసరు దృష్టికోణం నుండి నడపడం విశేషం... అతడో రచయిత కావడంతో పాఠకుడికే మాత్రం అపనమ్మకం కలగకుండా కథ నడుస్తుంది.

'నిత్య ఆందోళనలు... మండిన, మండుతున్న, మండబోతున్న అగ్ని గుండం నా కళింగం... ఈ అగ్నిజ్వాలలే నా నిండా, నా సాహిత్యం నిండా" అనే అప్పల్నాయుడి లోలోపలి ఉష్ణకాసారపు ఉరవళ్ళని కొలవడం నిజానికి అసాధ్యమైన విషయం.

మొత్తం మీద ఒక ప్రకాశిత ఉదయం, ఒక కార్తీక పున్నమీ, ప్రశాంతతని కళింగం యివ్వాళ స్వప్నిస్తోంది. కళింగమే కాదు, దేశం దేశమే కాదు, ప్రపంచం ఈ కలని కంటోంది. ఈ స్వప్నమే అప్పల్నాయుడి రచనల యెనక.

భూషణం, అప్పల్నాయుడుల తర్వాత ఉద్యమం మీద యితరులు రాసినప్పటికీ, కొంతకాలం తాను స్వయంగా ఉద్యమంలో వుండివచ్చిన సువర్ణముఖి అదివాసీల జీవితాన్నే కాకుండా వారి భాషనీ, యాసనీ కూడ లోతుగా పట్టుకుని కొనసాగింపుగా కథలు రాశారు.

అలా భూషణం గారినుండి అప్పల్నాయుడి మీదుగా, గౌరునాయుడు, సువర్ణముఖిల మీదుగా మల్లిపురం జగదీష్ దాకా వారి సాహిత్యాన్ని గాని శ్రద్ధగా చదివినట్లయితే ఒకానొక గొప్ప ఉద్యమం, నిర్బంధం, దమనకాండ, మార్కెట్ మాయ, సంక్షేమ పథకాల కుట్ర దాకా ఒక చరిత్ర మనకి అవగాహన కొస్తుంది... ముందే చెప్పుకున్నట్లు పాలక వర్గాల గణాంకాలలో చోటు చేసుకోని ఎన్నెన్నో అంశాలని వీరి సాహిత్యం చరిత్రలో నిక్షిప్తం చేసింది.



సత్తెమ్మ, కిట్టయ్యలు చూడముచ్చటైన దంపతులు. చిలకా గోరువంకలు. ఇలాంటి జంటని ఇంగ్లీషులో 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' అంటారు. సత్తెమ్మది ఏ బ్యూటీక్వీన్‌కీ తీసిపోని అందం. ఆ రోజుల్లో, సినిమాలు తీసేవాళ్ళు సత్తెమ్మను చూసుంటే, తక్షణం హీరోయిన్‌గా బుక్ చేసుండేవారు.

సత్తెమ్మ మంచి పొడగరి. సన్నని నడుమూ...చెంపకు చారడేసి కళ్ళు. అందమైన నవ్వూ... నవ్వినపుడు బుగ్గమీద సొట్టా. కోటేసిన ముక్కు... దానిమీద ముక్కు పుడకలూ. చెవులకు గిల్టునగలూ, మెళ్లో పసుపుతాడు, మంగళసూత్రాలూ, నల్లపూసలు. ఇంత కుంకుమబొట్టుతో, సత్తెమ్మ చామన ఛాయ రంగైనా, గుళ్లో అమ్మవారి విగ్రహంలాగ కొట్టొచ్చినట్టు కనపడేది. సత్తెమ్మకి కూడా ఎంచక్కా ఇప్పటి మోడల్సులాగ హెయిర్‌కట్‌చేసి, వాళ్లలాంటి డ్రెస్, జోళ్లూ వేసి నిలబెడితే, మాట్లాడితే దేమో కాని, మిస్సిండియా - బ్లాక్ బ్యూటీ అయుండేది. అదీ ఆమె అందం.







# గోప దంపతులు

**కిట్టయ్య** తక్కువ వాడేమీకాదు. ఆరడుగుల రెండంగుళాల పొడవూ, రెస్‌లర్స్, బాక్సర్స్‌లాగ కండలు తిరిగిన శరీరం, గుబురైన నొక్కు నొక్కుల గిరజాలు, నవ్వుముఖం, శ్రీకృష్ణుడు లాంటి చిలిపి అల్లరికళ్లు. చేతిలో వేణువు ఒక్కటిపెడితే, కృష్ణుడు వేషంలాగే ఉంటాడు. ముదరరంగు పంచలూ, చొక్కాలూ వేసుకునే వాడు. ఇతను రోడ్‌మీద నడచి వెడుతుంటే ఆడవాళ్లందరూ అలాగ చూస్తూ ఉండి పోయేవారు.

కిట్టయ్య, భార్యని ముద్దుగా 'సత్తూ' అని 'సత్యభామా' అని పిలుచుకుంటూ ఉంటాడు. సత్తెమ్మ కిట్టయ్యని 'కృష్ణుడూ' అని పిలుస్తుంది. ఈ సత్యభామా కృష్ణులు ఇంట్లోనూ, పెరట్లోనూ, పాలు పితుకుతూ, వంట చేస్తూ కూడా ఆడుతూ, పాడుతూ, గంతులేస్తూ, అన్ని పనులూ కలిసి చేస్తూ నవరసాలు ఒప్పించేస్తూ, ప్రేమకలాపాలు చేస్తుంటే, వీళ్ల లవ్‌సీన్స్ ఎబ్బెట్టుగా ఉండకుండా, చూసేవాళ్లకి ముచ్చటగొల్పేవి.

సత్తెమ్మ యాదవ కుటుంబానికి చెందినది. కిట్టయ్య పుట్టు పూర్వోత్తరాలెవ్వరికీ తెలియవు. పిఠాపురంలో, సన్యాసిరాళ్ల దగ్గర దొరికిన అనాథ బిడ్డను ఓ ముసలమ్మ పెంచి, కిట్టయ్యని పేరుపెట్టుకుంది. పేరుకు తగ్గట్టే అల్లరి పనులు చేస్తూ, ఐదో క్లాసు వరకూ చదువుకున్నాడు. చెడు గుడు ఆటలోనూ, ఈతలోనూ మంచిపేరు తెచ్చుకు న్నాడు. ఎప్పుడూ చెరుకుల కాలవలోనో, ఏండూరి చెరువులోనో ఈతపందేలలో పాల్గొని డబ్బులు సంపాదించేవాడు.

సన్యాసి రాళ్లకు దగ్గరగానే ఉంటున్న సత్తెమ్మ, కిట్టయ్యలు ఒకరినొకరు గాఢంగా ప్రేమించుకున్నారు. రోజూ చెరుకుల కాలవ ఒడ్డున కలుసుకునేవారు.

ఉన్నట్టుండి ముసలమ్మ హఠాత్తుగా మరణించింది. ఆమెకూ ఎవరూలేరు. ఆమె వదిలిన ఇల్లూ, ఆవు, గేదె కిట్టయ్యకి మిగిలాయి. పందొమ్మిదేళ్ళ కిట్టయ్య మళ్లా అనాథ అయ్యాడు.

ఈ విషయం తెలిసి సత్తెమ్మ చాలా బాధ పడింది. కిట్టయ్య ఒక్కడూ ఎలాగ వండుకుంటాడు. ఏం వండుకోగలడు...పాలూ, పెరుగూ ఎలాగ అమ్మగలడని తాపత్రయ పడిపోయింది. అతన్నిచ్చి పెళ్లి చెయ్యమని తల్లితండ్రుల్ని ప్రాధేయ పడింది. కులగోత్రాలు లేని వాడికిచ్చి పెళ్లి చేయలే మన్నారు. పదహారేళ్ళ సత్తెమ్మ కట్టుబట్టలతో కిట్టయ్యింటికి వచ్చేసింది. ఇద్దరూ రహస్యంగా సర్పవరం గుళ్లో పెళ్లిచేసుకున్నారు. సత్తెమ్మ తలి తండ్రులు, వీళ్లతో గొడవలు పెట్టుకోకుండా, చిత్రాడకి మకాం మార్చుకున్నారు.

సత్తెమ్మ కాపురం సాఫీగా, సంతోషంగా నడుస్తోంది. కిట్టయ్య పువ్వుల్లో పెట్టి చూసుకుంటున్నాడు. ఇంకేం కావాలి? అయితే, సత్తెమ్మకి ఒక్కటే ఒక కష్టం. చామర్లకోట ఫ్యాక్టరీలో పనిచేస్తున్నానంటూ, రోజూ నైట్‌షిఫ్ట్ అని రాత్రిళ్లు వెళ్లి పోతాడు కిట్టయ్య. ఏ అర్ధరాత్రో వచ్చి పడు కుంటాడు. అయినా ఒక్కొక్కప్పుడు తెల్లవారు ఝామున లేచి ఆవుకు, గేదెకు గడ్డివేసి, పాలు పితికి సత్తెమ్మ కిచ్చి, మళ్లా పడుకుంటాడు. సత్తెమ్మ నడుచుకుంటూ వెళ్లి అరడజను ఇళ్లల్లో పాలు, పెరుగు అమ్మి వస్తుంది.

మొదటిల్లు తిమ్మాపురం దొరగారిది. దొరగారు, ఇంటిముంగిట పడకకుర్చీలో కూర్చుని చుట్ట కాలుస్తూ, సత్తెమ్మ రాక కెదురు చూస్తూండేవారు. సత్తెమ్మ రాగానే కబుర్లు లంకించుకునేవారు. సత్తెమ్మతో మాట్లాడటం సరదా అందరికీ.

దొరగారు - ఏమే సత్తీ! నీ మొగుడు రాత్రిళ్లు కూడా ఫ్యాక్టరీ పని చేస్తున్నాడంట కదా? కొత్తగా పెళ్లైన దానివి పాపం ఇంట్లో ఒక్కదానివి ఎలాగుంటావు? మా ఇంటికొచ్చి పడుకో.

సత్తి - ఫరవాలేదయ్యా!..సుట్టుపక్కలున్నోళ్లు సాయపడుతుంటారు.

తరువాతిల్లు చెల్లాయమ్మగారిది. వారింటికెడితే, సత్తెమ్మను ఓ పట్టాన్ని వెళ్లిపోనివ్వరు. చెల్లాయమ్మ ఇల్లు దాటి బయటకు వెళ్లదు. ఆవిడ కాలక్షేపానికి లోకాభి రామాయణం కావాలి. చెల్లాయమ్మ తూగుటుయ్యాలలో కూర్చుని ఊగుతూ, ఎప్పుడూ కిట్టయ్యని గురించి విశేషాలడుగుతుంది.

చెల్లాయమ్మ - పాపం ఎన్నిళ్లని తిరుగుతావు? కిట్టయ్యని పంపు. ఇంట్లో కాస్త పనులున్నాయి. అవి చేయించుకుని కొంత డబ్బు కూడా ముట్టచెబుతాను.

సత్తెమ్మ - రాలేడండి. రాత్రంతా పనిచేసి, ఇంటికొచ్చి, ఓ సుక్కేసుకుని కునుకుదీత్తాడండి. ఆడిని సూత్తే జాలేస్తుందండి. పంపలేను. (నిక్కచ్చిగా చెప్పింది)

చెల్లాయమ్మ - ఓసీ! నువ్వే పంపలేనంటే నేస్తా వేమిటే? సరే! ఊరికే ఒకసారి వచ్చి నన్ను కలవ

డా॥ అవసరాల (వింజమూరి) అనసూయాదేవి

మను.

సత్తెమ్మ మెల్లగా "ఎందుకో...?" అని గొణుగుకుంటూ వెళ్లిపోతుంది.

తెల్లవారుఝామున ఐదు గంటలకు బయలుదేరిన సత్తెమ్మ, పై రెండిళ్లు అయాక, పోస్టు మేష్టారు, పూజారిగారు, డాక్టరుగారు, నర్సమ్మ గారిళ్లలో పాలూ, పెరుగూ ఇచ్చి చుట్టి వచ్చేటప్పటికి తొమ్మిది గంటలకి తక్కువవదు. అపుడు కాస్త చద్దన్నమో, తరవాణి తేటో తాగి, వంటచేసి కిట్టయ్య లేచేవరకూ కాసుకు కూచుంటుంది. కిట్టయ్య లేశాడంటే, ఒక్క నిమిషం కూడా భార్యని వదల కుండా "సత్తూ...నా సత్యభామా" అంటూ ఆమె కొంగు పట్టుకు తిరుగుతూ, లాలిస్తూ, ఇంటిపను లలో సహాయపడతాడు. తర్వాత స్నానం చేసి, సత్తెమ్మతో సరదాగా కబుర్లు చెప్పుకుంటూ మస్తుగా భోజనం చేసి వెళ్లిపోతాడు. ఆ వెళ్లినవాడు ఏ అర్ధ రాత్రో ఇల్లు చేరుకుంటాడు. కిట్టయ్యకి సగం సమ యం సత్యభామతో సరసాలతోనూ, సగం బయట పనులతోనూ అయిపోతుంది ఇదీ అతని తంతు.

ఒకరోజు భోజనం చేస్తూ ...

కిట్టయ్య – భామా! దొరగారి భార్య కట్టుకున్న బచ్చలి పండురంగు పెద్దాపురం పట్టు చీరెంతో బాగుందని మెచ్చు కున్నావు కదే! నీకు అచ్చు అలాంటి చీరే కాకినాడ మెయిన్‌రోడ్‌లో మసీదు దగ్గరున్న ఫాన్సీ గుడ్స్ బజారులో వేలంలో కొన్నాను, చూడు. కాస్త నలిగింది అంతే. కట్టుకు చూపించు. కళ్లారా నిన్ను చూసుకుని, నీ రూపం తల్చుకుంటూ పనికెడతాను.

సత్తెమ్మ చీరకట్టుకుని వచ్చి కిట్టయ్య కెదురుగా నిలుస్తుంది. "మహారాణీలాగున్నావే" అంటూ కిట్టయ్య మురిసిపోతాడు.

సత్తెమ్మను మెప్పించటమే కిట్టయ్య పరమావధి. సత్తెమ్మ కిష్టమైనవన్నీ తెచ్చి పడేయడం అతని కానందం. చిలకాకు పచ్చరంగు సత్తెమ్మ కిష్టమని, ఆ రంగులో ఉప్పాడ జరీ చీర తెచ్చాడు. మరోసారి గులాబీరంగులో గుంటూరు కల్నేత చీర తెచ్చి చ్చాడు. సత్తెమ్మ కట్టుకు చూపిస్తుండడం, కిట్టయ్య ఆనందిస్తుండడం, ఈ మధురానుభూతి వర్ణించడం కష్టం.

కిట్టయ్య – ఒసే భామా! ఎలాగొచ్చిందే నీకీ అందం? ఏం పున్నెం చేసుకున్నానో నిన్ను నా భార్యని చేసుకోడానికి! నిన్ను చూసిన కళ్లతో మరో ఆడదాన్ని సూడలేనే...(అంటూ సత్తెమ్మ నెత్తుకుని గిరగిరా తిప్పి ముద్దులతో నింపేశాడు).

కొత్తచీర రావడమేమిటి, అది కట్టేసేవరకూ




తోచదు సత్తెమ్మకి. "దొరబాబుగారి భార్యకు చూపించాలి, నాకు కూడా మా కృష్ణుడు మీకున్న చీర లాంటి చీరే తెచ్చాడని" అనుకుంటూ, పొద్దు పొడవకుండా స్నానంచేసి కొత్తచీరకట్టి, పాలు పట్టుకుని దొరబాబుగారింటికెళ్లింది. అప్పటికే దొరగారు లేచి ముందు వరండాలో కూర్చుని చుట్టకాలుస్తున్నారు. సత్తెమ్మను చూసి ఇంత ముఖమయింది.

దొర – ఏమే సత్తెమ్మ! ఏమిటి విశేషం? ఇంకా తెల్లారకుండా వచ్చేశావే? పెళ్ళికూతురులాగ మిలమిల మెరిసిపోతున్నావు. రా కూర్చో, కాస్సేపు కబుర్లు చెప్పు.

ఈ లోగా దొరగారి భార్య గిన్నె పట్టుకు వస్తూ సత్తెమ్మను చూసి కాస్త ఆశ్చర్యపడింది.

సత్తెమ్మ – (అమాయకంగా) అమ్మగారూ! ఓరోజు మీరిలాంటి సీరే కట్టారు జ్ఞాపకం ఉందా? నేను మనసుపడి కృష్ణుడుతో చెప్పాను. తక్షణం వేలంలో కొని తీసుకువచ్చాడు. మీకు చూపించాలని కట్టుకువచ్చాను.

దొర భార్య – నా చీర పోయిందే సత్తీ. ఎవరో దొంగిలించారు. నిన్న ఇల్లంతా గాలిం చాను. ఎక్కడా కనపడలేదు.

మరోరోజు, సత్తెమ్మ చిలకాకు పచ్చరంగు ఉప్పాడ జరీ చీర కట్టి చెల్లాయమ్మింటికి వెళ్లింది.

ఎవరింటికెళ్ళినా ముందు గుమ్మం దాటి వెళ్లదు, వాళ్లు లోపలికి రమ్మంటేనే తప్ప. చెల్లాయమ్మ యథాప్రకారం ఉయ్యాలలో కూర్చునుంది. సత్తెమ్మను లోపలికి రమ్మని పిలిచి కూర్చోమంది. సత్తెమ్మ నేలమీద చతికిలపడింది.

చెల్లాయమ్మ – సత్తెమ్మా! ఈ చీరలో నువ్వెంత బాగున్నావో తెలుసా? నీ అందం అడవిగాసిన వెన్నెలే. నీకు సంగీతమో, డాన్సో నేర్పించి ఉంటే, గొప్ప కళాకారిణివై ఉండేదానివి. పాపం! అవకాశాలు లేకపోబట్టికదా ఇలాగ కష్టపడుతున్నావు?

సత్తెమ్మ – అబ్బే లేదండి! నా మొగుడు నాకు కొంచెం కూడా కష్టం ఇవ్వడండి. నాకు జీవితంలో బాధలంటే ఏమిటో తెలియవండి. కృష్ణుడు నే కోరుకున్నదల్లా తెస్తాడండి. నాకింట్లో పనులు సాయంచేస్తాడండి. నాకు మరేం కావాలి?

చెల్లాయమ్మ – చెప్పడం మరిచిపోయాను. నాకూ అచ్చు ఇలాంటి చీరే ఉండేది. కొత్త చీర సంచీతో సహా అలాగే కిటికీదగ్గర పెట్టానని జ్ఞాపకం. అది ఎవరో దొంగిలించారు. ఎలాగ పోయిందో ఆశ్చర్యంగా ఉంది.

చెల్లాయమ్మ లేశమంతా కూడా సత్తెమ్మని అనుమానించలేదు. పైగా, పిలిస్తేకాని లోపలికి రాని మనిషి దొంగతనం ఎలా చేయగలదు అని మనస్సులో అనుకుని, ఇటువంటి ఆలోచన వచ్చినందుకు తనని తను తిట్టుకుంది.

ఓరోజు, సత్తెమ్మ కిట్టయ్యతో అంది, రోజూ పాలు పోసే కుండ పగిలిపోయిందేమో అని భయంతో, అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తూ కష్టపడుతున్నానని. అంతే! తెల్లారేటప్పటికి మెరిసిపోతున్న పెద్ద కంచుగిన్నొకటి తెచ్చి పెట్టేశాడు.

చాలాకాలం నుంచి సత్తెమ్మకి ముక్కు పుడకలు తీసేసి, బేసరి పెట్టుకోవాలని కోరిక. ఆరోజు సత్తెమ్మ పాలు పోయడానికి బయలుదేర బోతోంది. "ఉండు ఉండు నీతో పనుంది" అంటూ సత్తెమ్మను కౌగిట్లోకి తీసుకుని, నెమ్మదిగా తనే ముక్కు పుడకలు తీసేసి, ముక్కుకు బేసరి అమర్చాడు. సత్తెమ్మ కళ్లు మూసుకుని చిరునవ్వు నవ్వింది.

కిట్టయ్య – ఒసే! బేసరి పెట్టుకుని నవ్వు నవ్వు తుంటే, నీ బుగ్గ సొట్ట బర్ఫీముక్కంత తియ్యగా కనపడి తినేయాలని ఉందే!

సత్తెమ్మ – అమ్మో నా బేసరి! నా బేసరి! అంటూ ఆనందం పట్టలేక కిట్టయ్యని గట్టిగా కౌగలించుకొని ఆనందభాష్పాలతో అతని భుజం నింపేసింది.

ఆరోజు సత్తెమ్మ లేచిన వేళ మంచిది కాదు. ఎక్కడికి వెళ్ళినా అవమానం ఎదురైంది. పోస్టుమేస్టారింటికి వెళ్ళగానే, తనకి కిట్టయ్యిచ్చిన కంచు గిన్నెలాంటిదే వాళ్లది పోయిందంటూ గుసగుసలాడుకున్నారు. పూజారింటికి పెరుగిచ్చినప్పుడు, సత్తెమ్మ కట్టిన గులాబీరంగు గుంటూరు కల్నేత చీర లాంటిదే తన కోడలు చీర పోయిందంటూ అక్కడి ముసలమ్మ "వాళ్ల చేతులు విరగా! వాళ్లు నాశనం అయిపోనూ!" అంటూ ఇంత గొంతు పెట్టుకుని నానా తిట్లూ తిట్టింది.

సత్తెమ్మ త్వరత్వరగా డాక్టరుగారింటికి చేరుకుంది. అక్కడ, బేసరి గురించి డాక్టరుగారి భార్య నిలవదీసి అడిగేసింది.

డాక్టర్‌గారి భార్య – ఎక్కడ కొన్నావే ఈ బేసరి?

సత్తెమ్మ – ఏమో! నాకేం తెల్సు? కృష్ణుడు తెచ్చిచ్చాడు. బావుందా అమ్మగారూ!

డాక్టర్‌గారి భార్య – నాదీ అచ్చు ఇలాంటిదే బేసరి కనపడడం లేదు. ఆశ్చర్యంగా ఉంది!

సున్నితమైన సత్తెమ్మ మనస్సు పరిపరి విధాల పరుగెత్తింది. ఇంతమంది ఇలాగెందుకడుగుతున్నారు? అయితే నా మొగుడు దొంగా? ఇవన్నీ దొంగతనం చేసితెచ్చి, తనని సంతోషపెడుతున్నాడా? నైట్ షిఫ్టు, ఫ్యాక్టరీ ఉద్యోగం, అన్నీ అబద్ధమేనా? రాత్రిళ్ళు దొంగతనాని కెడతాడన్న మాట! "ఈ దొంగ సొత్తు నాకొద్దు. ఈ సొమ్ములేవీ నాకొద్దు. రేపు అందరి ముఖాలు ఎలాగ చూడగలను? నాకీబ్రతుకే వద్దు. ఇవన్నీ కృష్ణుడి కిచ్చేసి, విషం తిని చచ్చిపోతాను. నేనీ అవమానం భరించలేను. చచ్చిపోతా! చచ్చిపోతా!" అంటూ మరి రెండిళ్లలో పాలు కూడా పోయకుండా ఏడ్చుకుంటూ ఇల్లు చేరుకుని, పచ్చి మంచినీళ్ళైనా ముట్టకుండా, కిట్టయ్య రాకకోసం కాసుకుంది.

నిమిషాలమీద ఈ సంగతి ఊరంతా పొక్కింది. చుట్టుపక్కల వాళ్లు వచ్చి సత్తెమ్మని ఊరడించడానికి ప్రయత్నించారు. సత్తెమ్మ ఏడుస్తూ, ఎవరితో మాట్లాడకుండా తలుపులు మూసేసుకుంది.

ఆ రోజంతా కిట్టయ్య ఇంటికి రాలేదు. సత్తెమ్మ అలాగే ఏడుస్తూ గుమ్మం దగ్గరే కూర్చుంది. ఈలోగా, కిట్టయ్యని పోలీసులు పట్టుకున్నారనే వార్త, పక్కింటి పెద్దమ్మ పుసుక్కున సత్తెమ్మకి కిటికీలోంచి అందజేసింది.

కష్టమంటే ఎరగని సత్తెమ్మ ఆ వార్త విని కూలిపోయింది. ఇంక చేయవలసిన పని ఒక్కటే అనుకుంది. తనకి ముప్పు తెచ్చిన బచ్చలిపండు పెద్దాపురం పట్టుచీర, బహుకష్టంమీద దూలానికి కట్టి ఉరిపోసుకుని ఆత్మహత్య చేసుకోడానికి నిశ్చయించుకుంది. దేవుడి పటానికి, మొగుడి ఫోటోకీ దణ్ణాలు పెట్టుకుంది.

పొద్దున్నే అందజేసే న్యూస్ పేపర్ వార్తలాగ, కిట్టయ్యని పోలీసులు పట్టుకున్నారన్న వార్త ఊళ్లో అందరికీ తెలిసిపోయింది. ఈ గోప దంపతుల గురించి ఉన్న సదభిప్రాయం తారుమారైంది.

సన్యాసిరాళ్ల దగ్గరున్న సత్తెమ్మింటి చుట్టుపక్కలవాళ్లు, సత్తెమ్మ ఎంతకీ తలుపులు తెరవకపోతే అనుమానపడి తలుపు సందుల్లోంచి, ఉరివేసుకోవడానికి చేసుకుంటున్న సన్నాహాలు చూసి, అంచెల మీద పరుగెత్తుకు వెళ్లి అందరికీ చెప్పొచ్చారు.

సత్తెమ్మంటే అందరికీ ఇష్టమే. ఏం అఘాయిత్యం చేస్తుందో అని, పోస్టుమేష్టారి భార్య ఒంటెద్దు బండిలో సత్తెమ్మింటికి బయలుదేరింది. దొరగారు చేతికర్ర తీసుకుని పరుగులా నడిచారు. డాక్టరుగారు, పూజారిగారి కుటుంబం, నర్సమ్మ– ఒకళ్లేమిటి అందరూ అక్కడ పోగయ్యారు. తలుపులు బద్దలుకొట్టి ఉరివేసుకుంటున్న సత్తెమ్మని రక్షించారు. ఒక అయిదు నిమిషాలాలస్యమయితే, సత్తెమ్మ ప్రాణాలు పోయుండేవి. డాక్టరుగారితో సహా అందరూ అక్కడకు రావడం భగవత్సంకల్పం. ఆ రోజు పిఠాపురంలో ఉన్న జనం అంతా సత్తెమ్మింటి దగ్గరే ఉన్నారు. సత్తెమ్మ ఎవరితోనూ మాట్లాడడం లేదు. కళ్లు విప్పి ఎవర్నీ చూడడం లేదు. బుర్ర వంచుకుని ఒక్కపెట్టున ఏడుస్తూనే ఉంది. ఈ లోగా, జనంలోంచి, "అదుగో కిట్టయ్య... కిట్టయ్య" అంటూ కేకలు వినపడ్డాయి.

తను దొంగతనం చేయలేదనీ, దొంగసొమ్ము అమ్మేచోట, అవన్నీ చవకగా కొన్నానని కిట్టయ్య చెప్పాడు. కాదు, పోలీసుల దెబ్బలకి భయపడి అలాగ అబద్ధం చెప్పాడు, ఇవన్నీ సత్తెమ్మకు మేమే ఇచ్చామని, దొరగారు, చెల్లాయమ్మ, పోస్టుమేస్టారు, పూజారిగారు, డాక్టరుగారు మొదలగువాళ్లు సాక్ష్యమిచ్చారు. ఎలాగైతేనే కిట్టయ్య విడుదలయ్యాడు.

మర్నాడు సత్తెమ్మ ఆ చీరలు, కంచుగిన్నె, బేసరి, ఎవరిది వాళ్లింటిదగ్గర వదిలేసి వచ్చింది, వాళ్ళు వద్దని వారిస్తున్నా.

కిట్టయ్య దొంగతనాలు చేశాడో లేదో దేముడి కెరుక! పల్లెటూళ్ళలో మనుష్యుల్లో సంఘీభావం, సానుభూతి, క్షమాగుణం ఉండేవి. పిఠాపురం వాళ్ళు, వాళ్ల మనుష్యుల్ని వాళ్లు కాపాడు కున్నారు.

ఆవు, గేదెలను అమ్మి, ఆ సన్యాసిరాళ్ల దగ్గరే ఓ కిరాణా కొట్టు పెట్టుకుని నిజాయితీగా హాయిగా జీవించారు ఆ గోపదంపతులు.

# బాపు గొప్పన్నర బొమ్మల కథ

**విశాలాంధ్రవారు** ఆ మధ్య తెలుగు కథల సంకలనమొకటి ప్రచురించారు. ఈ పుస్తకం ముఖ చిత్రం చూసినవారినెవరినైనా ఇట్టే ఆకర్షిస్తుంది. తక్షణం ఆ పుస్తకాన్ని సొంతం చేసుకోవాలని పిస్తుంది. ఇంతకీ ఆ ముఖచిత్రమేమిటో తెలుసా... నండూరివారి ఎంకి తెలుగు పుస్తకంలో చూసు కుంటూ బొట్టు పెట్టుకుంటున్నట్లు బాపుగారు గీసిన బొమ్మ. నిజానికి వారే ఎప్పుడో వేసిన అద్దంలో చూసి బొట్టుపెట్టుకుంటున్న ఎంకి బొమ్మను మార్చి అలా వేశారు. ఇప్పుడు ఈ సంకలనాన్ని ఎవరు సొంతం చేసుకున్నా ముందుగా ఓ క్షణం ఆ బొమ్మను అలా తదేకంగా చూడవలసిందే...!



అలాగే అప్పుడెప్పుడో చెన్నపట్నంలో నం దూరి రామమోహనరావుగారు, రమణగారు ఆంధ్ర పత్రికలో పని చేస్తున్న రోజుల్లో వాళ్ళను బతిమాలి మరీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, రాచకొండ విశ్వనాథశాస్త్రిగారు, భమిడిపాటి రామగోపాలం గారు రచించిన క్లాసిక్స్ అన్నింటికీ బాపుగారు గీసిన రేఖా చిత్రాలు...!

ఆ మధ్య సినిమా దర్శకుడు వంశీ రాసిన నవలొకదానికి పెద్ద కన్నువేసి కన్నీరు నెమలి పింఛం రూపంలో అద్భుతంగా వేశారు బాపుగారు. నామిని కథలకు బాపుగారు గీసిన బొమ్మలు కూడా...! దువ్వూరి వెంకట రమణశాస్త్రిగారు రాసిన 'జానకితో జనాంకితం' గ్రంథానికి బాపుగారు వేసిన ముఖచిత్రం - స్వామి పాదాల వద్ద సీతమ్మ వారు కూర్చుని సర్వం తానే అయిన స్వామి వద్ద




జనాంతికం ఎలా అన్నట్టు చిన్న నవ్వు నవ్వుతున్న బొమ్మ...! బాపుగారు గీసిన వందల వేల బొమ్మల లో మచ్చుకివి కొన్ని మాత్రమే. అసలీ 'కథలకు బొమ్మలు' అనే ప్రక్రియ ఎలా, ఎప్పుడు, ఎక్కడ, ఎవరు శ్రీకారం చుట్టారోగానీ, బాపు కథలకు బొమ్మలు వేయడం మొదలు పెట్టిన తర్వాతే కొత్త పుంతలు తొక్కిందనడంలో సందేహం లేదు. తరువాతి కాలంలో ఎంతో మందిని చిత్రకారులుగా చేసిందీ బాపుగారు గీసిన బొమ్మలే.

ఒకసారి వెనక్కి, బాగా వెనక్కి వెళితే ముళ్ళ పూడివారు ఒక కథ రాసి మిత్రుడు బాపుతో బొమ్మ వేయించుకుని మరీ 'ఆంధ్రప్రభ' కార్యాలయానికి వెళ్ళి ఎడిటర్ విద్వాన్ విశ్వం గారిని కలిసి కథని, బొమ్మని ఇస్తూ "మా ఫ్రెండ్ బాపు బొమ్మ వేశాడు... ఫ్రీ" అన్నారట.

"అక్కర్లేదు...మా ఆర్టిస్టులు మాకున్నారు. బయటివాళ్ళవి తీసుకోం" అంటూనే విశ్వంగారు



ఆ బొమ్మను చూసి మునివేళ్ళతో తనవైపు లాక్కొని ఒక క్షణం చూసి, ఉత్తర క్షణంలో కథ తీసి చద వడం ప్రారంభించారు. ఆ కథ పేరు 'ఆకలీ ఆనంద రావూ'...విశ్వంగారు రెండు నిమిషాలలోనే ఆసాం తం ఆ కథ చదివి బొమ్మను మళ్ళీ ఒకసారి చూసి, "ఇడ్లీకంటే పచ్చడే బావుంది...వేస్తాంలెండి" అన్నా రట.

ఇక్కడ ఇడ్లీ అంటే రమణగారి కథ...పచ్చడి అంటే బాపుగారి బొమ్మ. అచ్చయిన రమణగారి తొలి కథ కూడా అదే. ఆ తర్వాత కాలంలో తనెన్నో



గొప్ప కథలు రాసినా, బాపు గొప్పన్నర బొమ్మలు వేసేవాడని రమణగారే స్వయంగా చెప్పుకున్నారు.

ఇంతకీ బాపుగారి బొమ్మల్లో ఉన్న ఆ 'గొప్పన్నరదన'మేమిటంటే, కథకుడు తన రచనలో ఏం చెప్పదలుచుకున్నాడో అది బొమ్మలోనే చూపిం చడం...అందుకోసం ఆయనెంతో తాపత్రయ పడేవారు. అందుకే ఆ బొమ్మలన్నీ 'అలా' ఘనంగా మిగిలిపోయాయి. ఆ కథల్ని, నవలల్ని అందరితో చదివించాయి. అయితే అప్పుడప్పుడు ఆ రచనల్లో లోపించిన విషయం కూడా బొమ్మలో కనపడ డంతో ఆ రచనలకో గౌరవం వచ్చిన సందర్భాలు కూడా ఉన్నాయనుకోండి...అది వేరే సంగతి!

జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి కథకుడు, నవలాకారుడు. గతంలో 'ది డెత్ ఆఫ్ లాస్ట్ ఇండియన్' కథల సంపుటిని వెలువరించిన వీరు ప్రస్తుతం "ఈ కథకి శిల్పం లేదు" అంటూ మరో సంపుటిని తీసుకువచ్చారు. ఇందులో ప్రేమ అంటే ఏమిటో చర్చిస్తూనే, దాంపత్య జీవితంలోని ప్రేమను - త్యాగాలను చిత్రించిన కథలున్నాయి. మానవీయ విలువల గొప్పతనాన్ని తెలియజేసే కథలున్నాయి. విద్యావిధానంలోని పంతుళ్ళ నడవడికల మీద కథలున్నాయి. డబ్బు మనుషులను ఎలా లొంగదీసుకుంటుందో వివరించే కథలున్నాయి. మీడియాకు సంబంధించి రెండు కథలు, జర్నలిజం మీద, సినిమాల మీద రెండేసి కథలు వున్నాయి.




ఈ కథకు శిల్పం లేదు
జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి
పుటలు : 192, మూల్యం : రూ. 120/-
ప్రచురణ
పాలపిట్ట బుక్స్, హైదరాబాద్
ప్రతులకు
పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1
403, విజయసాయి రెసిడెన్సీ
సలీమ్ నగర్, మలక్‌పేట్
హైదరాబాద్ - 500 036
ఫోన్: 04027678430

# శిల్ప వైవిధ్యమున్న కథలు

**కోతుల్ని** తరమడానికి కొండముచ్చుల్ని పెంచి తద్వారా జీవనోపాధి పొందే కుటుంబానికి చెందిన అంజయ్యకు పూర్వీకులు మిగిల్చినది ఏమీ వుండదు. అంజయ్య మరదలు అక్కమ్మ అందగత్తె. ఆమెను ఊరివాళ్ళ నుండి రక్షించడానికిగాను అంజయ్యతో పెళ్ళి చేసి, విడిగా బతకమని వేరే ఊరు పంపిస్తారు. అక్కమ్మ తాను అందగత్తెనన్న అహం కారంతో అంజయ్యను ఈసడించుకుని దూరం పెడుతుంది. అలా ఏడాది గడుస్తుంది. ఆ వూరికి వచ్చిన దొమ్మరాటలో, దొమ్మరాడితో ఆమె లేచిపోతుంది. దాంతో ఆ ఊర్లో ఉండలేక అంజయ్య తిరుపతికి వచ్చి రిక్షా తొక్కుతూ బతుకుతుంటాడు. ఒకరోజు చెత్త కుండీ దగ్గర అనామకంగా పడివున్న రోగిష్టిని చూసి, అక్కమ్మగా గుర్తుపట్టి చేరదీస్తాడు. ఆమెకు వైద్యం చేయించటానికి నవాబు ఇచ్చిన ఉంగరాన్ని సైతం అమ్ముకుంటాడు. ఇంకా డబ్బులు కావాలి. అక్కడ యూనివర్సిటీలో వున్న కోతులను తరిమేస్తే డబ్బులు ఇస్తారని తెలిసి, ముచ్చు కోసం వెతికి విఫలమవుతాడు. ముచ్చుకు నేర్పిన విద్యలను గుర్తుకు తెచ్చుకుని తానే ముచ్చు వేషం వేసుకుని వాటిని తరుముతుంటాడు. అలా తిరుపతి రైల్వేస్టేషన్‌లో పిల్లాడ్ని ఎత్తుకుపోయిన కోతిని బెదిరించి, ఆ పిల్లాడ్ని తల్లికి తెచ్చి ఇస్తాడు. అక్కడున్న వాళ్ళందర్ని తమకు తోచినంత ఇవ్వమని అడుక్కోవడంతో ఆ ముచ్చు అంజయ్య అని తెలుస్తుంది. అమ్మకాదు...అక్కకాదు...ఆలి కూడా కాకుండా పోయిన అక్కమ్మ కోసం అంజయ్య చేసిన త్యాగం అక్కమ్మనే కాదు, పాఠకులను కూడా కదిలిస్తుంది.

ఎనభైఏళ్ళ దాంపత్యంలో భార్యాభర్తల అనుబంధాన్ని, ప్రేమను ఆత్మీయంగా చిత్రీకరించిన కథ 'అచుమ్బితమ్'. ప్రేమంటే ఆకర్షణ, భౌతిక పరమైన వాంఛా, ఆరాధనాభావమా, ఎప్పటికీ మరిచిపోలేని జ్ఞాపకమా - అన్న విషయాన్ని చర్చించిన కథ 'సురగంగ'. ఈ ప్రశ్నలన్నింటికి సమాధానాలు పై రెండు కథలలోనే దొరుకుతుంది.

ప్రైవేట్ ఆర్గనైజేషన్స్‌లో వున్న ఖచ్చితత్వం, క్రమశిక్షణ, సమయపాలన చాలామందికి కొరుకుడు పడదు. తమ ఆఫీసర్లను విలన్‌గా చూస్తూ, వాళ్ళను తిడుతూ పనిచేసుకుంటారు. ఒక మహిళా ఉద్యోగి, తన బాస్ మహిళ అయినా ఆమె మీది కోపంతో, ఆమె వ్యక్తిగత జీవితాన్ని రచ్చకీడ్చి, ఆమెపై ప్రతీకారం తీర్చుకోవాలనుకుంటుంది. రిజైన్ చేసి వెళ్తుంటే, వాళ్ళ బాస్ పిలిచి మనసులు విప్పి మాట్లాడుకుంటే అపోహలు తొలగుతాయి అని ఆమెను ఒప్పిస్తుంది. భర్తంటే జీవితాంతం భరించవలసిన వాడనే ఉద్దేశంతో వాడి తప్పులు, క్రూరత్వాన్ని దాచిపెడతారు. బాస్ అంటే ఇంకో ఉద్యోగం దొరికేవరకు తప్పనిసరి తద్దినం అనే తేలిక భావన ఉండటం వల్లే గాసిప్స్ ప్రచారం చేస్తుంటారని తేలుతుంది. ఈ చర్చతో శ్రావణి తను చేసిన తప్పును తెలుసుకుంటుంది. ఏ స్థాయిలో ఉన్నా ఉద్యోగినుల కష్టాలు వేరుగానే వుంటాయని 'వంతెన' కథలో తెలియజేసిన విధానం అద్భుతం. ఇక మానవత్వానికి గుడి కట్టిన ఎంగటవ్వ గురించి ఎంత చెప్పినా తక్కువే. దయాగుణం, పరోపకారమే పరమావధిగా బతికిన ఎంగటవ్వను ఎవరూ మరచిపోలేరు. ఆమె గురించి అందరూ కథలు కథలుగా చెప్పుకుంటారని 'ఎంగటవ్వ మాడీ' తెలియజేస్తుంది. "రాగిమాను" కథలో ప్రకృతితో మనిషి పోరాటంలో ప్రకృతిదే పైచేయి. కాని మనిషి క్రూరత్వానికి, నీచత్వానికి భయపడి పోరాటమే విరమించుకుంటుంది. మనిషి అవకాశవాదాన్ని, క్రూరత్వాన్ని నిరసిస్తూనే మానవత్వాన్ని పెంపొందించుకోవాల్సిన ఆవశ్యకతను ఈ కథలు తెలియజేస్తాయి.

మనిషికి డబ్బు కూడబెట్టడం అలవాటు కావాలేగాని, ఆ డబ్బు మనిషి చేత ఎన్ని ఆటలైనా ఆడిస్తుంది. డబ్బు కక్కుర్తితో ప్రభుత్వ విధి విధానాలను అమలు పరచాల్సిన ఉద్యోగులే వాటిని అతిక్రమించడాలు ఎంత మామూలైపోయిందో 'బోధివృక్షం' తెలియజేస్తుంది. 'ముల్లుగాడి కథ'లో చట్టంలోని లొసుగులన్నింటిని ఆధారం చేసుకుని కోట్లకు పడగలెత్తిన ధనికుడు, అతడికి ఏమాత్రం లొంగని మల్లేశు...ఎన్ని ప్రలోభాలు చూపినా అతడు భూమిని అమ్ముకోక నిలబడతాడు. మట్టిని నమ్ముకున్న మల్లేశు ఆత్మస్థైర్యం ఆ ధనికుడ్ని

## పుస్తక సమీక్ష

కె.పి.అశోక్ కుమార్

ముల్లులా తొలిచేస్తుంటుంది. రియల్టర్లు, సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు, బ్రోకర్లు, బ్యూరోక్రాట్స్, ధనవంతులు అప్పనంగా వచ్చిపడుతున్న డబ్బును ఎలా ఖర్చుపెట్టాలా అని ఆలోచిస్తుంటారు. వాళ్ళకు డబ్బు ఉత్ప్రేరకంగా పని చేస్తుంది. వాళ్ళ ఉన్మాదాన్ని రెచ్చగొడుతుంది. అలాంటి ఉన్మత్తులను సంతృప్తి పరచడానికి పబ్‌లు...కాసినోలు పుట్టుకొస్తుంటాయి. అలాంటి ఒక పబ్‌లో పనిచేసే బౌన్సర్ రామ్లా, అక్కడికి ఎంజాయ్ చేయడం కోసం వచ్చేవాళ్ళ వెధవ్వేషాలు చూసి భరించలేక, అక్కడ పనిమానేసి వెళ్ళిపోవాలనుకుంటాడు. తను ఎవరినుండి ఎక్కడికని పారిపోతాడు? ఆడదానికి ఎక్కడా సెక్యూరిటీ కనిపించని ఈ దేశంలో, మగాడై వుండి తను పారిపోవాలని చూడడం అనే విచికిత్సలో పడతాడు.

ఉపాధ్యాయులు నిరంతర అధ్యయన శీలురు కావాలి. తమ జ్ఞానాన్ని ఎప్పటికప్పుడు అప్‌డేట్ చేసుకోవాలి. అధ్యయనం లేకపోతే వారి ఎదుగుదల ఆగిపోతుంది. దురదృష్టవశాత్తు విద్యను వ్యవస్థీకరించే క్రమంలో బోధన అనేది కేవలం ఉద్యోగస్థాయికి దిగజారిపోతుంది. అలాంటి పరిస్థితిలో ఎక్కడో మారుమూల పల్లెలో ఒక గిజుభాయి బగేకా లాంటి టీచర్ పిల్లలు ఏం చదవాలని వారు భావిస్తున్నారో, దాన్ని వారి పెద్దలు కూడా చదివేలా చేస్తారు. అలా చదవటం ద్వారా తమకు ఎదురయ్యే సమస్యలను గుర్తించడం, ఆయా సమస్యల గురించి చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా అందరూ సమిష్టిగా ఆలోచించడం, ఆయా సమస్యల్ని అధిగమించే ప్రయత్నంలో తమవే అయిన పరిష్కారాన్ని కనుక్కోవడం, తద్వారా తమ స్వంత విధానాలను తామే రూపొందించుకోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. అక్కడ నేర్పడం, నేర్చుకోవడం నిరంతర ప్రక్రియ. అందుకే రచయిత 'దాన్ని నాగరీకుల చదువుల బళ్ళలోలా అది భవిష్యత్తుకి పెట్టుబడి కాదు. నవచైతన్యానికి పెట్టుబడి' అంటాడు. అందులో చేరడానికి రచయిత "రండి...మళ్ళీ పుడదాం" అని పిలుపునిస్తాడు. పెదపాళెగాడి ఆటలో పిల్లలు అంటుకోవడం ఆటలో భాగమే. నాయుడి గారబ్బాయి తేజ తంతే అది ఆట. అదే ఎరుకల రెడ్డిశాస్త్రి, తేజను తంతే మహాపరాధం జరిగినట్లు ఉపాధ్యాయులు అతడ్ని శిక్షించబోతారు. అయినా వాడు లొంగక తిరిగి ప్రశ్నించడం జరిగింది. 'ఆట ఆగిన వేళ' అనే ఈ కథలో ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయుల అవకాశ ధోరణులను, పిల్లల ఆటలను చక్కగా చిత్రీకరించారు.

ఏదో చెయ్యాలనే తపన, ఆసక్తి, జర్నలిస్టుగా మారి బాలల హక్కుల పేరిట పరిశోధనాత్మక కథనాలు రాసి బాలకార్మికులకు విముక్తి కల్పించి వాళ్ళను స్కూళ్ళల్లో చేర్చి సంతృప్తి పడలేదు. పిల్లలకోసం ఇంకా ఏమైనా చేయాలనుకునే విద్యాసాగర్ తన కళ్ళముందు కనిపించే బాలకార్మికులను గుర్తించలేకపోవడం 'ఒక వేకువ కోసం' లో కనిపిస్తుంది. వెలుగులో చూసిన ప్రతిదానికి ఓ నీడ వున్నట్లే ప్రతి మంచిపనికి చీడలా ఓ పరిణామం వుంటుంది. అందుకే మంచిపని చేయడం అంత సులభం కాదు. అయినా సంపాదకుడిగా సురేంద్ర, యజమానిని ఎదిరించయినా సంచలన వార్త వేద్దామని నిర్ణయించుకుంటారు. అతని ఆలోచనా విధానం 'చైతన్య స్రవంతి' పద్ధతిలో కొనసాగుతుంది. ఇందులో తెలుగువాళ్ళ అనైక్యత, భాషా సంస్కృతుల పట్ల నిర్లక్ష్యంపై ఆవేదన కనిపిస్తుంది.

అమెరికాలో పుట్టి పెరిగిన రెడ్డెమ్మ చిన్నప్పటినుండి తన ముత్తాత గురించి, జేజమ్మ గురించి కథలు కథలుగా వింది. తన ముత్తాతగారి జీవిత చరిత్రను తెరకెక్కించడానికి ఆయన జీవించిన కాలాన్ని, ఆనాటి ముష్టూరి జన జీవనాన్ని, నైతిక, సామాజిక విలువలను, వాటిలో వస్తున్న మార్పులను చిత్రీకరిస్తుంది. దీన్ని టెలీ సీరియల్‌గా తీస్తే రేటింగ్ పేరిట నిర్వాహకులు ఒరిజినల్‌ను నాశనం చేయడానికి ప్రయత్నిస్తారు. దాంతో ఆమె ఎన్నో కష్టాలు, వెక్కిరింతలు, అవమానాలను ఎదుర్కొని సినిమాతీస్తుంది. అది ఆస్కార్ అవార్డు పొందడంతో హక్కులకోసం అంతా విరగబడటాన్ని 'కడప రెడ్డెమ్మగా మారిన ముష్టూరి పెద్దప్పరెడ్డి కథ' లో చూడవచ్చు. మేకప్‌లో వున్నంతసేపే సినీతారల ధగధగలు. మేకప్ లేకుండా వస్తే ఎవరూ వారిని గుర్తుపట్టరు. తారలు ముఖ్యంగా హీరోయిన్లకు ఇప్పుడు నటనతో పనిలేదు. శరీరాంగాలను ప్రదర్శించి ప్రజలను రెచ్చగొట్టడమే వారిపని. ప్రేక్షకులు కూడా వారిని అలాగే గుర్తుంచుకోవడం మరీ ఆశ్చర్యం. ఒక ప్రముఖ తార జనసమ్మర్ధమైన కోటీ ప్రాంతంలో తిరిగితే ఆమె వీరాభిమానులు సైతం గుర్తుపట్టలేక పోతారు. ప్రమాదవశాత్తు స్థానభ్రంశం చెందిన దుస్తుల వల్ల ఆమె శరీరాంగాలను చూసి గుర్తుపట్టడం - ఈనాటి ప్రేక్షకుల అభిరుచిని తెలియజేస్తుంది.

జొన్నవిత్తుల శ్రీరామచంద్రమూర్తి కథలు తిరిగి తిరిగి ముష్టూరికి చేరుకుంటాయని పలమనేరు బాలాజీ చమత్కరించడంలో నిజం లేకపోలేదు. రచయిత కోస్తావాడైనప్పటికీ, అతని బంధం - అనుబంధం ముష్టూరితో ఏర్పరచుకోవడం వల్ల ముష్టూరు అతని స్మృతి పథంలోనుండి ఇంకా చెరిగిపోలేదు. ఆర్.కె. లక్ష్మణ్ మాల్గుడిలా ఇది కల్పితం కాదు. చిత్తూరు జిల్లాలో వున్న ముష్టూరును కేంద్రంగా చేసుకుని అక్కడి మనుషులు, వారి వేష భాషలకు తమ కథల్లో శాశ్వతత్వం ఏర్పరచడానికి రచయిత చేస్తున్న కృషి ప్రశంసనీయం. చాలా కథలకు ముష్టూరు నేపథ్యంగా తీసుకున్నప్పటికీ, నగర వాతావరణం - నగర సంక్లిష్టతలను తెలియజేయడానికి హైదరాబాద్ నేపథ్యంలో కూడా రాసిన కథలు ఇందులో వున్నాయి.

జొన్నవిత్తుల కథలన్నీ మల్టీ లేయర్స్‌తో కూడుకుని వుంటాయి. కథ చుట్టూ అల్లుకున్న పొరలను ఒక్కొక్కటిగా విడదీసుకుంటూ పోతే అసలు విషయం బయట పడుతుంది. అధ్యయనం, అవగాహన, అనుభవమున్న రచయిత మాత్రమే ఇలాంటి కథలు రాయగలరు. ఎక్కువ భాగం కథలు వ్యంగ్య ప్రధానంగా కొనసాగాయి. చెప్పదలచుకున్న నిష్ఠుర సత్యాలకు వ్యంగ్యాన్ని ఆధారం చేసుకోవడం వల్ల ఆ కథలు మరింత పకడ్బందీగా తయారై పాఠకులను ప్రభావితం చేయగలుగుతాయి. చైతన్యస్రవంతి కథలో ప్రవాహ శైలిని సాధించగలిగారు. కాని అది రచయిత అన్ సెన్సార్డ్ జ్ఞాపకాల లోంచి రాలేదు కాబట్టి దాన్ని పాక్షిక చైతన్య స్రవంతిగానే పేర్కొనాలి. 'ముచ్చు' కథ జానపద కథాకథన శైలిని అందిపుచ్చుకుంది. ఇందులో రెండు కథలు జాతీయవాద నేపథ్యంలో అనగా స్వాతంత్ర్యయుద్ధ కాలంనాటి పరిస్థితులను వివరించాయి. ఒక సబార్డినేట్ - బాసుల మధ్య జరిగిన సంభాషణా క్రమాన్ని 'వంతెన' కథలో ఎక్కడా బిగి సడలకుండా చిత్రీకరించారు. కేవలం సంభాషణలతోనే మొత్తం కథంతా నడవడం శ్రీపాద సుబ్రహ్మణ్యం కథల్లోనే జరుగుతుంది. తర్వాత చాలామంది ఈ టెక్నిక్‌లో చిన్నకథలను రాయడం జరిగింది. కాని ఒక పెద్ద కథను కేవలం రెండు పాత్రలతో సంభాషణలపరంగా ఉత్కంఠ భరితంగా చిత్రీకరించి పాఠకులను ఆకట్టుకోవడంలో రచయిత విజయం సాధించారు. వస్తువుకు తగ్గ శిల్పాన్ని ఎన్నుకోవడంలో రచయిత మంచి నేర్పు చూపించారు. ఇలా కథల్లో శిల్పపరమైన ప్రయోగాలు చేసిన రచయిత, ఈ సంపుటిని 'ఈ కథకు శిల్పంలేదు' పేరిట తీసుకురావడం విచిత్రం. శిల్పం లేకుండా కథ వుంటుందా? రచయిత వినయం కొద్దీ ఈ శీర్షికను వుంచారా? లేక తన కథలను చర్చకు పెట్టదలుచుకున్నారా? అన్న విషయాల్ని పాఠకులే తేల్చుకోవాలి.

అనంతరాములుగారు తలస్నానం చేసి పట్టుపంచె కట్టుకున్నాడు. నిలువుబొట్టు పెట్టుకున్నాడు. రాజభవనం వంటి ఆ ఇంట్లో 'అల్పాదాయవర్గంలోని ఒక కుటుంబం హాయిగా నివసించవచ్చు' అన్నంత వున్న పూజగదిలోకి వచ్చాడు. పట్టుపీతాంబరాలు ధరించి, సర్వాలంకార భూషితులైన సీతారామ లక్ష్మణులు ఆంజనేయస్వామితో సహా బంగారు విగ్రహాల రూపంలో ఆ గదిలో కొలువై ఉన్నారు. వారికి అలంకరించిన పలు రకాల పుష్పమాలలతో, ధూపదీపాలతో ఆ గది శోభాయమానంగా వెలుగొందుతోంది.











కోపూరి పుష్పాదేవి


**అనంతరాములు** గంటన్నరసేపు అష్టోత్తరాలతో, శత సహస్ర నామాలతో స్వామిని పూజించి, నైవేద్యం పెట్టి తను కొద్దిగా ప్రసాదం తీసుకుని సరాసరి వ్యాపార లెక్కలు చూసే గదిలోకి అడుగు పెట్టాడు. అప్పటికి గుమాస్తా ఏడుకొండలు క్రితం రోజు జమాఖర్చులు రాసి సిద్ధంచేసి ఉంచిన లావుపాటి పుస్తకం ఆయన ముందు పెట్టాడు.

ఆయన వోపికగా అన్ని ఖాతాలు పరిశీలించాడు. అన్నిటిమీదా కలిపి క్రితంరోజుకంటె కొన్ని లక్షలు అధికంగా లాభం కన్పిస్తేనేగానీ ఆయన ఆ రోజు భోజనం చెయ్యడు.

మరునాడు శ్రీరామనవమి. అనంతరాములు గారు నగరంలోని అన్ని రామాలయాలూ దర్శించి, అధికమొత్తాల్లో ధనాన్ని ఆలయాలకు కానుకగా అర్పించి ఇంటికి వస్తాడు. అది ఆయనకు ఎప్పటి నుండో వస్తున్న అలవాటు. అంతేకాదు, ఒక అజ్ఞాత భక్తుడిలా రాష్ట్రంలోని ప్రముఖ దేవాలయాల్లోని స్వామివార్లకు, అమ్మవార్లకు బంగారు కిరీటాలూ, కంఠాభరణాలూ, సింహాసనాలూ వంటివి భారీగా చేయించి సమర్పించడం ఆయనకు అచ్చివచ్చిన సంప్రదాయం.

ఇలా తనకు వచ్చిన లాభాల్లో దేవుళ్ళకోసం పెద్దపెద్ద మొత్తాలు ఎంతగా ఖర్చుచేస్తున్నా ఆయనకు ఈమధ్య మనశ్శాంతిగా ఉండడంలేదు. ఎందుకో తెలియడం లేదు. ఎంత ఆలోచించినా అర్థం కావడం లేదు. మనసంతా చీకాకుగానూ, ఎంతో బాధగానూ ఉంటోంది.

ఏదైనా అనాథాశ్రమానికి వెళ్ళి వాళ్ళకి ఆర్థిక సాయం అందించాలని ఒకరోజు ఆలోచన వచ్చింది. లేడికి లేచిందే పరుగన్నట్లు చీరలు, ధోవతులూ, తువ్వాళ్ళూ, దుప్పట్లు, తినుబండారాలూ, పళ్ళూ ఫలాలూ మొదలైనవన్నీ తీసుకొని నగరానికి కొద్ది దూరంలో ఉన్న 'బాపూజీ సేవాసదన్' అనే ఆశ్రమానికి సపరివారంగా వెళ్ళాడు.

ఆశ్రమం చిన్నదే అయినా పరిశుభ్రంగా వుంది. ఆఫీసుగది, వంటగది, భోజనాల గది, వృద్ధులకోసం కొన్ని గదులు, పిల్లలకోసం కొన్ని గదులు, హాలు... ఉన్నాయి

వార్ధక్యంవల్ల వొంట్లోని వోపికంతా హరించుకుపోగా వణుకుతున్న శరీరాలతో, నైరాశ్యం నిండిన ముఖాలతో, తమ పనులు కూడా తాము చేసుకోలేని వృద్ధులు కొందరూ, రకరకాల అనారోగ్యాలతో అలమటిస్తున్నవారు మరికొందరూ, 'బిడ్డల ప్రేమ' అనే లవణజలం అందక మోడులైపోయిన వృక్షాల్లాంటి వారు ఇంకొందరూ...

ఎండాకాలం ఎండిపోయిన చెరువుల్లాంటి ముఖాలతో, నీటి చెమ్మ కూడా ఎరుగని దిగుడు బావుల్లాంటి కళ్ళతో, ఎవరికీ అక్కర్లేని ఎడారివంటి బ్రతుకుల్లో దైన్యం మూర్తీభవించినట్లున్న పిల్లలూ... ఆ ఆశ్రమంలో ఆశ్రయం పొందుతున్నారు.

"అసలా దేవుడు మమ్మల్నెందుకు పుట్టించాలి...? ఎందుకు ఇన్ని ఇక్కట్లు పాలు చెయ్యాలి...? మామీద ఆయనకెందుకు ఇంత కోపం...? ఎందుకు ఇంత కక్ష...?" అని ఆలోచిస్తున్నట్లు నిర్లిప్తత రాశిపోసినట్లు ఉన్నారు వాళ్ళందరూ.

మందీమార్బలంతో వచ్చిన అనంతరాముల్ని సాదరంగా ఆహ్వానించాడు ఆశ్రమ స్థాపకుడూ, నిర్వాహకుడూ అయిన గోవిందరావు.

ఆశ్రమవాసులకు సాయమందించడానికి వచ్చిన ఆయన గొప్పమనసును మనసారా అభినందించాడు.

"అయ్యా తమరు ఏం చేస్తుంటారు? తమరి వృత్తి ఏమిటి...?" ఆదరంగా అడిగాడు గోవిందరావు.

"ఏమిటీ నేనెవరో నీకు తెలియదా? ఊళ్ళోని బార్ అండ్ రెస్టారెంట్లు అన్నీ నావేకదా... ఇంకా క్లబ్బులూ, పబ్బులూ బోలెడన్ని" అన్నాడు దర్పంగా అనంతరాములు, స్మగ్లింగ్ సంగతి దాటవేసి..

ఆయన అలా చెప్పగానే వృద్ధులూ, పిల్లలూ అందరూ గబగబా గదుల్లోకి వెళ్ళిపోయి తలుపులు బిగించుకున్నారు. అది చూసి అనంత రాములు బృందానికి కోపంతో కళ్ళు ఎర్రబారాయి.

"అయ్యా... చాలా సంతోషం. కానీ మీ దాన ధర్మాలు మాకు వద్దండీ..." అన్నాడు గోవిందరావు వినయంగా.

"అదేమిటీ... ఈ ఆశ్రమం నిర్వహించడానికి మీకెంతో డబ్బు అవసరమవుతుంది. నేను డబ్బు కూడా ఇస్తాను" అన్నాడు అనంతరాములు కోపాన్ని దిగమింగి, సహనాన్ని అరువు తెచ్చుకుని.

"అదే వద్దండీ...మీ నుంచీ మాకు పైసా కూడా వద్దు. ఇంకా పండూ ఫలమూ ఏవీకూడా వద్దు. ఇంకా మాట్లాడితే మీ నీడ కూడా మా ఆశ్రమం మీద పడకూడదు. మా దగ్గర బియ్యం, పప్పూ, ఉప్పూ లేకపోతే పస్తులైనా ఉంటాము కానీ, మీనుంచి చిల్లికానీ కూడా తీసుకోము. చూశారా... మీ వృత్తి సంగతి వినగానే అసహ్యంతో మావాళ్ళందరూ లోపలకు వెళ్ళిపోయి ఎలా తలుపులు బిగిం

చుకున్నారో...అందువల్ల దయచేసి ఇవన్నీ తీసుకుని మీ అందరూ వెళ్ళిపోండి..." చేతులు జోడించి ప్రాధేయపూర్వకంగా అన్నాడు గోవిందరావు.

"ఏమిటి... మతిగానీ తప్పిందా నీకు...? పోనీలే పాపం అని నీకూ, వీళ్ళందరికీ కూడా సాయం చేద్దామని ఇవన్నీ తీసుకువస్తే వద్దంటావా...? ఏమీ తీసుకోకుండా వెళ్ళిపొమ్మంటూ మమ్మల్ని అవమానిస్తావా...? ఎంత ధైర్యం నీకు?"

"దీనికి ధైర్యమూ, సాహసమూలాంటి గొప్ప విశేషణాలెందుకండీ... మాకున్నదల్లా కోపమూ, చిరాకూ, అసహ్యమూ అంతేనండీ..."

"కోపమూ, చిరాకూ, అసహ్యమూనా? డబ్బంటే అంత చేదా నీకు...?"

"డబ్బంటే చేదు కాదండీ...అది సాక్షాత్తూ శ్రీమహాలక్ష్మి కదండీ... కానీ, మీరు ఆ డబ్బు సంపాదించే విధానమే మాకు నచ్చదండీ...ఈ పిల్లలంతా అనాథలెలా అయ్యారనుకున్నారు...? తాగుబోతు తండ్రులు మందు మత్తులోనే ఇరవై నాల్గు గంటలూ గడుపుతూ భార్యాపిల్లల్ని పట్టించుకోక, వాళ్ళ ఆలనాపాలనా చూడక వాళ్ళని రోడ్లమీద వదిలేస్తే అనాథలయ్యారు వీళ్ళంతా...దానికి కారణం మీరు అమ్ముతున్న సారా బ్రాందీవిస్కీలు కాదా...?

"అలాంటి తాగుబోతు కొడుకులే తల్లిదండ్రులకు తిండిపెట్టక, వాళ్ళ అతీగతీ చూడక, ఇంటి నుండి తరిమివేయడం వల్లే ఈ వృద్ధులు కూడా అనాథలయ్యారు. దిక్కులేని పక్షులయ్యారు.

"ఇలా వీళ్ళందరి జీవితాలు పూర్తిగా నాశనం చేసిన ఆ సారా బ్రాందీల వ్యాపారంతో మీరు సంపాదించిన ఆ డబ్బు మాకు అక్కర్లేదండీ... దయచేసి మీరందరూ ఇక్కడినుండి త్వరగా వెళ్ళిపోతే మేమందరం మరీమరీ సంతోషిస్తాం..." గోవిందరావు మాటలకు నిర్ఘాంతపోయారు అనంతరాములు, ఆయన పరివారం.

ఊహ తెలిశాక అనంతరాములు అంతటి అవమానం ఎప్పుడూ పొందలేదు. అందులోనూ తన వారందరి ముందూ. అనంతరాముల్ని చూసి కాకపోయినా, ఆయన వెనకఉన్న సంపద చూసి అందరూ ఆయన్ని ఇంద్రుడూ, చంద్రుడూ అని పొగిడే వారు. తమ పబ్బం గడుపుకునే వారు. అటువంటిది ఈనాడు ఈ ఒక్కమనిషి తనంతటివాణ్ణి పట్టుకుని వెళ్ళిపొమ్మంటూ అవమానించేసరికి ఆయన ఉగ్ర నరసింహమూర్తిలా చెలరేగి పోయాడు.

"అంటే...ఈ జనాన్నంతా నేనే చెడగొడుతున్నానా...? నా వొక్కడివల్లే ఈ సమాజమంతా నాశనమయి పోతుందంటావా...?"

అనంతరాముల్లో ఆగ్రహావేశాలు కట్టలు తెంచుకున్నాయి. కదం తొక్కుతున్నాయి.

"మీ వొక్కరివల్లే ఇదంతా జరుగుతోందని నేను అనడం లేదండీ...కానీ, ఎవరికి వారు నా వొక్కడివల్లా ఏమీ జరగదులే అనుకుని అకృత్యాలు చేస్తూపోతే చివరికి ఈ సమాజం సర్వ నాశనమైపోదా...? మనమూ, మనపిల్లలూ, వాళ్ళ పిల్లలూ, ఇలా తరతరాలూ మట్టిగొట్టుకుపోవా?

"ఈమధ్య చూడండి... పోలీసుల పట్టుకున్న అనేక దొంగతనాల కేసుల్లో కళాశాల విద్యార్థులే దొంగలుగా పట్టుబడుతున్నారు. వాళ్ళు అలా దొంగలుగా మారి జీవితాలు నాశనం చేసుకుంటూ, బంగారు భవిష్యత్తును బుగ్గిపాలు చేసుకోవడానికి కారణం ఏమిటంటారు...? ఖచ్చితంగా ఈ మద్యపాన వ్యసనం, దానికి తోడు మరికొన్ని వ్యసనాలు.

"వాళ్ళు ఈ వ్యసనమనే సాలెగూటిలో చిక్కి బయటకు రాలేక, ఆ మద్యం కోసం డబ్బుదొరకకపోతే హత్యలు చెయ్యడానికి కూడా తెగబడుతున్నారు. ఇంతటి వినాశనానికి కారణం మీరు అమ్ముతున్న మద్యం



కాదంటారా...? మీ గుండెల మీద చెయ్యి వేసుకుని నిజం చెప్పండి...కాదని మీరేకాదు, ఎవరూ చెప్పలేరు. చెప్పరుకూడా. అందువల్ల అన్ని అనర్థాలకూ మూలకారణమైన మద్యం వ్యాపారం చేసే మీ దానధర్మాలు మాకు వద్దు. మీ డబ్బూ వద్దు, మీ దయావద్దు. మీరందరూ త్వరగా ఇక్కడినుంచి వెళ్ళిపోండి. మీరు వెళ్ళాక ఈ ప్రదేశాన్నంతా గోమూత్రంతో శుద్ధి చేసుకోవాలి మేము..."

"ఇదిగో గోవిందరావ్...నువ్వు మమ్మల్ని చాలా అవమానిస్తున్నావు. ఛీత్కరిస్తున్నావు. నా సంగతి నీకు తెలియదు. నేనెంత మంచివాణ్ణో కోపం వస్తే అంత చెడ్డవాణ్ణి. నేను తలచుకుంటే నిన్నేమైనా చెయ్యగలను..." మితిమీరిన కోపావేశాలతో రొప్పుతున్నాడు అనంతరాములు.

"ఏం చేస్తారండీ...? ఏం చెయ్యగలరు...? మహా అయితే ప్రాణం తీస్తారు...అంతేగా...చావడానిక్కూడా నేను సిద్ధమే..." అన్నాడు పరమ శాంతంగా గోవిందరావు.

"మొండివాడు రాజుకన్నా బలవంతుడు" అన్నట్లు గోవిందరావుని ఇక ఎలా లొంగదియ్యాలో అనంతరాములికి అర్థంకాలేదు. "నేనేదో ఈ అనాథాశ్రమం వారికి ఆర్థికసాయం చేసి ఆదుకోవాలనుకున్నాను. తద్వారా నా మనోవేదన అనే గాయాన్ని మాన్పుకోవాలనుకున్నాను. కానీ, ఈ గోవిందరావు నా సహాయాన్ని నిరాకరించి, నా పుండు మీద తన నిరసన అనే కారాన్ని చల్లుతున్నాడు. ఇప్పుడు నేను కోరికోరి కొరివితో తల గోక్కున్నట్లయింది..." అనుకున్న అనంతరాములు తన పరివారంతో మౌనంగా అక్కడినుండి నిష్క్రమించాడు.



ప్రపంచ వ్యర్థ పదార్థాల నిర్వహణ సంస్థ వారి రవాణా నౌక "ఎస్.వి. డిస్పోజర్" కంట్రోలు డెక్ మీద కంప్యూటరు తెరమీద దృశ్యాన్ని చూస్తూ వైర్‌లెస్‌లో ఆదేశాలిచ్చాడు, కెప్టెన్ మార్కు రీడ్ - "మనం 'ఇన్ వెడ్' ద్వీపం ఉత్తర జెట్టీని చేరుతున్నాం. నౌకని అక్కడ అనుసంధానం చెయ్యగానే, పని మొదలు పెట్టడానికి అందరూ సిద్ధంగా ఉండండి" అని. తర్వాత తన పక్కకి వచ్చి నిలబడ్డ ముఖ్య పరీక్షాధికారి నిర్మల్ బారువాతో - "మీరు, మీ టీమ్ సిద్ధమా?" అని అడిగాడు.

"యస్ కెప్టెన్! 'ఆపరేషన్ విసర్జన్' - అదే - ఇక్కడ మనం చేసేది- సిద్ధం. నా అసిస్టెంట్ కిమ్ కొరియాలిస్ డెక్ మీద ఉంటాడు. మీరు క్రేన్ ఆపరేటర్ ఖాదిర్‌కి ఆదేశాల్విండి" అన్నాడు నిర్మల్.







# బీర్బల్ - 2206

'ఇన్‌వెడ్' అని వాళ్ళు వ్యవహరిస్తున్న ఆ చిన్న దీవి - నిజానికి "ఇంటర్నేషనల్ ఎలక్ట్రానిక్ వేస్ట్ డంప్" దాని పూర్తి పేరు. అంతకు ముందు ఆ దీవికి పేరు లేదు. ప్రపంచ పటంలో కనిపించని భూ భాగం. దక్షిణ హిందూ మహా సముద్రంలో కొన్నివేల సంవత్సరాలక్రితం జరిగినఉల్కా పాతానికి భూమి తల బొప్పికట్టినట్టు, సముద్ర తలం మీదకు సుమారు యాభై మీటర్లు ఎత్తుకు పొడుచుకు వచ్చిన భూగర్భ రాతి ద్రవం గడ్డ కడితే ఏర్పడింది. మధ్యలో లోతుగా ఉండి, చుట్టూ ప్రహరీ గోడలా రాతి కొండలతో అదో పెద్ద గంపలా వుంది.

ఇరవయ్యో శతాబ్దం చివరలో వచ్చిన ఎలక్ట్రానిక్ సాంకేతిక విప్లవంతో ప్రపంచంలో ఈ పరికరాల వాడకం విపరీతంగా పెరిగింది...ఎప్పటికప్పుడు కొత్త పరికరాలు, చౌకగా లభించడం వల్ల పాత వాటిని బాగు చేయరు- పారేస్తారు. వ్యర్థ పరికరాలు పర్యావరణానికి, ఆరోగ్యానికి ప్రమాదకరంగా మారడం వల్ల అన్ని దేశాలు ఒక ఏర్పాటు చేసుకున్నాయి. ప్రతి దేశం ఈ వ్యర్థాల్ని పరీక్షించి, తిరిగి వాడటానికి అనువుకాని వాటిని, వ్యర్థ పదార్థాల నిర్వహణ సంస్థకి పంపుతారు.

ఆ వ్యర్థాలని పారెయ్యడానికి, ఈ నిర్మానుష్యమైన దీవిని ఎంచుకున్నారు. భార లోహ మిశ్రమాలు, వికిరణశక్తి గల పదార్థాలు అందులో ఉంటాయి కనుక, వాటి నిల్వకి ప్రత్యేకమైన ఏర్పాటు అవసరం.

ఖాదిర్ క్రేన్ సహాయంతో ఆ వ్యర్థాల్ని జెట్టీ మీద ఉన్న కన్వేయరు యంత్రాలపై వేస్తున్నాడు. అవి వాటిని ఆ కొండల అవతల వాలులో అక్కడక్కడా గుట్టలుగా పడేస్తున్నాయి.

డెక్ మీద నిలబడ్డ కొరియాలిస్ చేతిలోని ఫోనులాంటి పరికరంలో అలారం మోగింది.

"సార్, ఈ బ్యాచ్‌లో, వాటిలో అణు ఇంధన వ్యర్థాలున్నట్లున్నాయి"అని నిర్మల్‌కి రిపోర్ట్ ఇచ్చాడు.

"లోపల రోబోలు ఏమైనా ఉన్నాయా? వాటిలో కొన్నింట్లో ఫ్లుటోనియం ఉంటుంది. మనం ఎన్నిమార్లు రిమార్క్ రాసినా, క్షేత్రస్థాయిలో సరిగ్గా వేరు చెయ్యరు! ఇదో తలనొప్పి మనకి" అన్నాడు నిర్మల్.

"ఇక్కడ మానవాకార రోబో ఒకటి ఉంది. దాన్ని పిడగొట్టలేదు. అలాగే మన నౌకలో ఎక్కించేరు!" అని కొరియాలిస్ సమాధానం ఇచ్చాడు.

"సరే! నేను వచ్చి చూస్తాను!" అని చెప్పి నిర్మల్ కార్గో డెక్‌కి వెళ్ళాడు.

ఆ రోబోని డెక్ మీద పడేసి, మిగతా వ్యర్థాల్ని దించడం కొనసాగించాడు కొరియాలిస్.

నిర్మల్ రోబోని పరీక్షించాడు. ఇనుప గుండులా తలభాగం, దాని ముందు భాగంలో మూడు కెమెరాలు - కళ్ళలా ఉన్నాయి. అందులో నుదుటి మీద కెమెరా బహుశా రాత్రి సమయంలో చూడగల్గిన 'ఇన్‌ఫ్రారెడ్' కెమెరా కావచ్చని అనుకున్నాడు. నోరు బదులు స్పీకరులున్నాయి. లౌడ్ స్పీకర్‌లాంటి చెవి దొప్పలు, పనులు చెయ్యడానికి, నడవడానికి అవయవాలు ఉన్నాయి.



98481 90592


నిర్మల్ ఆ రోబో మెడలో వున్న కార్డు తీసి చదివారు- "ఇది గృహోపయోగాలకి తయారు చేసిన నమూనా రోబో- ప్రయోగ దశలోనే దాని మెదడు పని చెయ్యలేదట!" చదువుతూ నిర్మల్ పెద్దగా నవ్వాడు.

"ఇది విను. దాని పేరు 'బీర్బల్ - 2206'ట" అని మళ్ళీ నవ్వాడు.

"అందులో నవ్వడానికేముంది సార్?" అని అడిగాడు కొరియాలిస్.

"ఇది అమెరికా డిజైను. చైనాలో తయారీ. మధ్యలో ఒక భారతీయుడి ప్రమేయం ఉన్నట్లుంది. బీర్బల్ అనే ఒకడు చరిత్రలో ఒక చక్రవర్తికి ఆంతరంగిక సలహాదారు ఉన్నట్లు కథలు చెప్తారు.


త్రిమూర్తి

ఇది అంత తెలివిగా ఉండాలని అనుకున్నాడేమో? కాని ఇలా చెత్తలో చేరింది. అందుకు నవ్వు వచ్చింది" అని సర్దిచెప్పి, "ఇది సౌరశక్తి ఫ్యూయల్ సెల్ ఆధారంగా పనిచేస్తుంది. అణు వ్యర్థాలు కాదులే" అన్నాడు నిర్మల్.

"దీన్ని సముద్రంలో పారేద్దామా?" అని అడిగాడు కొరియాలిస్.

"అలా కుదరదు. సరే – దీన్ని ఆఖర్లో వెయ్యి, బాగా ఎత్తు నించి పడేలా చూడు. అదే ముక్కలవుతుంది" అని చెప్పి వెళ్ళిపోయాడు నిర్మల్.

వారి వ్యర్థాల 'విసర్జన' పనికి పదిగంటలు పట్టింది. వాళ్ళు దానిమీద వ్యర్థాలను పరీక్షించడం మరోసారి యాత్రలో భాగం కనుక, పని పూర్తవగానే, 'డిస్పోజర్' నౌక తిరుగుప్రయాణం ప్రారంభించింది.

కన్వేయరు చివర్నించి, అంత ఎత్తు నించి క్రిందపడ్డ రోబో విరిగిపోలేదు. కొండవాలు మీద తలక్రిందులుగా జారుతూ, దార్లో ఒక పెద్ద సౌరశక్తి బ్యాటరీ పరికరాన్ని గుద్దుకుని ఆగిపోయింది.

ఇన్‌వెడ్ ద్వీప ప్రాంతంలో ఇప్పుడు వేసవి కాలం. ఎండ బాగా కాస్తోంది. సౌరశక్తి బ్యాటరీ మీద సూర్యరశ్మి పడి, అందులో విద్యుచ్ఛక్తిగా మారింది. బ్యాటరీలో ఉన్న కెపాసిటర్లు ఆ శక్తిని నిల్వ చేస్తున్నాయి. కొన్ని గంటల తర్వాత ఆ బ్యాటరీ విద్యుత్ పీడనం పెరిగి, షార్ట్ సర్క్యూట్ వల్ల ఒక్కసారిగా మెరుపు వచ్చి, ఆ రోబో నడినెత్తిని పడింది.

నిశ్చేతనంగా పడి వున్న ఆ రోబో, ఈ విద్యుద్ఘాతానికి మూడు అడుగులు ఎగిరి పడింది. దాని అవయవాలు గిలగిలా కొట్టుకుని ఆగిపోయాయి.

బీర్బల్ రోబో కెమెరా కళ్ళలోకి సూర్య కిరణాలు సూటిగా పడి, అతని మెదడులోని సర్క్యూట్లలో చిన్నగా విద్యుత్ ప్రసారం ప్రారంభం అయింది. బీర్బల్ లేచి కూర్చుని తన పరిసరాలను పరికించాడు. ఈ చెత్త కుప్పలో తను ఎందుకు ఉన్నట్లో అతనికి తెలియలేదు.

బీర్బల్ నెమ్మదిగా తన అవయవాలు పని చేస్తున్నాయో లేదో చూసుకున్నాడు. ఎడమ పాదం కదలిక సరిగా లేదు. ఎడమ కెమెరా కన్ను మసకగా ఉంది. నుదుటిమీద కెమెరా బాగానే వుంది. తన చేతి వేళ్ళ స్థానంలో వున్న పనిముట్లు సరి చూసుకున్నాడు. వాటిలో రేడియో వేవ్స్‌తో వేడి చేసి ప్లాస్టిక్ గాని, లోహాన్నిగాని అతికించేది కూడా ఉంది. తన బ్యాటరీ శక్తి తక్కువ ఉందని అతను దాన్ని పరీక్షించ లేదు.




అతనికి తన కెమెరా కన్ను – చూపు మేరలో మానవ మాత్రులెవరూ కనపడలేదు. మరి తనకి ఎవరు నిర్దేశాలిస్తారు? తను ఎవరి అవసరాలు తీర్చాలి?

"ఇక్కడ ఎవరేనా ఉన్నారా? నేను మీ సేవకి సిద్ధంగా ఉన్న బీర్బల్ అనే రోబోని. నేనేం చెయ్యాలి చెప్పండి" అని పెద్ద గొంతుతో – ఆనాటి ప్రపంచ భాషలో, మరికొన్ని భాషల్లో అరిచాడు. సమాధానం లేదు. సముద్ర అలల హోరు, నిరామయంగా వినిస్తోంది.

బీర్బల్ కదలకుండా ధ్యానముద్రలో ఉన్నట్లుగా కూర్చుని తన బ్యాటరీలోకి శక్తి నింపుకున్నాడు. అతనికి సమయ భావన ఉన్నా అలా కదలకుండా రోజుల తరబడి కూర్చోగలడు.

మూడోరోజుకి, అతనిలో ఉన్న ఇంధన బ్యాటరీ పని చెయ్యడం ప్రారంభించింది. అతని మెదడు పూర్తిస్థాయిలో సామర్థ్యం అందుకుంది.

బీర్బల్ ఆ వ్యర్థాల గుట్టల మీద నడుస్తూ తనకో యజమాని కోసం వెతుకుతూ ఎంత తిరిగినా ప్రయోజనం లేకపోయింది.

బీర్బల్ ఒకచోట ఎండలో కూర్చుని దీర్ఘాలోచనలో పడ్డాడు. ఇప్పుడు అతను తన చుట్టూ వ్యర్థాలనుంచి అప్పుడప్పుడూ వచ్చే సంకేతాలని గ్రహిస్తున్నాడు.

అప్పుడు అతని ఎలక్ట్రానిక్ మెదడులో ఒక భావన కలిగింది. ఎవరి ఆజమాయిషీ లేకుండా, ఈ పాతబడిన రోబోలని, పరికరాలని బాగుచెయ్యడమే తనపని అని, అదే తనకర్తవ్యం అని నిర్ణయించుకున్నాడు.

బీర్బల్ ఆ వ్యర్థాల గుట్టల్లో, పనికి వస్తాయనుకున్న వాటిని పోగుచేసి, కొండ చరియలో ఒక గుహలో చేర్చాడు.

వాటిలో మరో యాంత్రిక రోబో ఉంది. దానికి సౌరశక్తి పానెల్సు బిగించి విద్యుత్ వచ్చేలా చేశాడు. హఠాత్తుగా ఆ రోబోలో కదలికలు వచ్చా

యి. "హలో"అని రోబోనించి శబ్దం వచ్చింది.

"నీ ఐ.డి. ఏమిటి?" అని బీర్బల్ అడిగాడు.

"ఎసెంబ్లర్ - ఎ- 1415. నేను పారిశ్రామిక రోబోని. నేను కొన్ని విధులు సరిగా నిర్వర్తించ లేకపోయాను. అందుకే నన్ను తీసి పారేశారు" అంది.

బీర్బల్ ఆ ఎసెంబ్లర్‌ని తాకి, "అదేం పెద్ద సమస్యకాదు. అక్కడ రిపేరు చేసే రోబోలు లేక తీసేసి వుంటారు. నేను అందుకే ఉన్నాను. నిన్ను మళ్ళీ పూర్తి స్థాయికి తెస్తాను" అన్నాడు.

కానీ బీర్బల్‌కి ఒక అడ్డంకి కనబడింది. తనకి సాంకేతిక పరిజ్ఞానం ఉంది. కాని విడి భాగాలూ, పనిముట్లూ సరైనవి లేకపోతే, తను మాత్రం ఏమీ చేయలేడు.

బీర్బల్ మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

"నాకు ఆలోచించగలిగిన మెదడు ఉంది. పరిసరాల నుంచి నేర్చుకున్న విషయాలకు సృజ నాత్మకత జోడించి, కొత్త ఆలోచనలతో నా సమస్య లకి పరిష్కారం కనుక్కోవాలి. అప్పుడే నన్ను ఇక్కడ నియమించిన వారి ఆజ్ఞలను పాటించగలుగుతా ను" అని నిర్ణయించుకున్నాడు.

బీర్బల్ ఉత్సాహం రెట్టింపు అయింది. అతని మెదడు కొత్త ఆలోచనలతో నిండిపోయింది.

## 2

బీర్బల్ - 2206, ఇన్‌వెడ్ ద్వీపానికి వచ్చి ఆరు నెలలు గడిచింది. రాబోయేది శీతాకాలం. సౌరశక్తి మీద ఆధారపడటం కుదరదు.

ఇప్పటికే అతను, ఆ వందల టన్నుల చెత్త కుప్ప నుండి సేకరించిన విడిభాగాలతో చేసిన ప్రయోగాలు ఫలించాయి. ఒక రిమోట్ కంట్రోలు కెమెరాను, టివికి కలిపి పనిచేయించాడు. దానితో కొండ ఆవల వున్న సముద్రాన్ని చూడగలిగేడు. ఒక రేడియో తరంగ గ్రాహకం అమర్చాడు. దాంతో కొన్ని ఉపగ్రహాల నించి వచ్చే సంకేతాలని, అప్పు డప్పుడు కొన్ని చిత్రాలని తెరమీద చూడగలు గు తున్నాడు. ఎ - 1415 రోబో తనకి ఎంతో సహాయ కారిగా ఉంది. రేడియో తరంగాలపై సంకే తాలను పంపే ఒక యాంటెనా దొరికింది. దానికి సిగ్నలు అందించగల సాధనం రేడియో ఫోను లోంచి తీసి రెండింటినీ సంధానం చేశాడు. దాన్ని పరీక్షించాలి. మరో చోట దొరికిన బ్లాక్ బాక్స్ లాంటిది షిప్పులో వాడే సోనార్ లాగ ఉంది. అది చిన్న శబ్దాలను దూరం నించి కూడా గ్రహించ డానికి ఉపయోగి స్తారు. బీర్బల్ ఇప్పుడు ఈ పరికరం మీద పని చేస్తున్నాడు.

ఇక శీతాకాల సమయంలో, బ్యాటరీ ఛార్జిం గు చాలకపోతే, ధృవాలలో నివసించే తెల్ల ఎలుగు లాగా, తనూ నిద్రాస్థితిలోకి వెళ్ళిపోతాడు. ఏం చెయ్యాలి? ఇలా తర్కించుకుంటూ, కొత్త నిర్మాణా లని ఊహించుకుంటూ కూర్చున్నాడు.

ఇంతలో ఒకరోజు, అతను రిపేరు చేసిన శబ్దగ్రాహక పరికరం 'సోనార్ సౌండర్', 'కీ!' అని కూత పెట్టింది.

బీర్బల్ టివీ స్క్రీన్ దగ్గర కూర్చుని కెమెరాని నాలుగు దిక్కులా తిప్పేడు. దూరంగా సముద్రంలో ఒక నౌక కనబడింది. తన దగ్గరున్న పరికరాలతో ఆ నౌకకి ఎలా సందేశం పంపాలా అని ఆలోచిం చేడు. అత్యవసర సమయాల్లో ఇప్పటికీ షిప్పుల్లో నావికులు మోర్స్ కోడ్‌తో ఈనాటి అంతర్జాతీయ భాషలో సంభాషించుకుంటారని అతనికి జ్ఞాపకం వచ్చింది.

వెంటనే రెండు లోహ కడ్డీలని వైర్లుతో యాంటీనా పెట్టెకి తగిలించి రేడియో తరంగాల మీద రిపోర్టు పంపడం మొదలు పెట్టాడు.

## 3

రవాణా నౌక 'డిస్పోజర్' కంట్రోల్ పానెల్ దగ్గర ఉన్న కెప్టెన్ మార్క్ రీడ్ ఉలిక్కిపడ్డాడు. ఎవరో మోర్స్‌కోడ్‌లో సందేశం పంపుతున్నారు. అతను దాన్ని కంప్యూటరుకి అనుసంధానం చేసి, ఆ సందేశాన్ని చదివి ఆశ్చర్యపోయాడు.

వెంటనే పరీక్షాధికారి నిర్మల్‌ని, అతని సహా యకుడు కిమ్ కొరియాలిస్‌ని డెక్ మీదకి పిలిచేడు.

విషయం తెలుసుకున్న వారూ నివ్వెర పోయారు. ఆ సందేశం ఇలా వుంది.

"సర్! నేను బీర్బల్ 2206 రోబోని. ఈ వ్యర్థాల గుట్ట నించి సందేశం పంపుతున్నాను. మీరు నాకిచ్చిన పని కొంత పూర్తి చెయ్యగలిగాను. ఎసెంబ్లర్ - ఎ - 1415 ఇప్పుడు పనిచేస్తోంది. అలాగే మరికొన్ని బాగుచేసేను. కాని పనిముట్ల, విడిభాగాలూ దొరక్క చాలా పని ఉండిపోయింది. మీరు ఇప్పుడు అందులో కొన్నైనా తెస్తున్నారని భావిస్తాను. నాకు కావలసిన వాటి జాబితా యిస్తు న్నాను...

వోల్టేజి నియంత్రకం (బ్యాటరీలకి), డిజిటల్ సంకేత యాంప్లిఫయర్‌లు (12 వోల్టులు) 8, ప్రోగ్రాం చేసిన నియంత్రకాలు - 12, మినీ స్టెప్పర్ మోటార్లు 7, ప్రోగ్రాం చేసుకునే చిప్‌లు 100 ఎం. 22, వోల్టేజితో పొడవు, రూపం మార్చుకో గలిగిన విద్యుత్ వాహక ప్లాస్టిక్ వైర్ల కట్టలు (వేర్వేరు సైజులవి), కాంతివాహక నానో ఫైబరు వైర్ల కట్టలు (వివిధ సైజులు).

ఇప్పటికి ఇవి ఇస్తే మరికొన్ని సాధనాలను పని చేయించగలను. రాబోయే శీతాకాలంలో ఇక్క డ సూర్యరశ్మి ఎక్కువగా రాదు కనుక కొన్ని ఇంధన బ్యాటరీలు ఇస్తే పని వేగంగా పూర్తి చెయ్యగలను. ఈ సందేశం మీకు అందితే దయచేసి సమాధానం ఇవ్వండి" అని - సందేశం.

ఎక్కడో ఏదో పొరపాటు జరిగిందని నిర్మల్‌కి అర్థమయింది. కొరియాలిస్ తప్పు తనమీదకు వస్తుందని ఏదో భాషలో తిట్టు తిడుతూ తల బాదు కున్నాడు. "ఆ రోబోని, క్రితం యాత్రలో వచ్చిన ప్పుడు అలా పడేయడం తమ తప్పా? పనిచేస్తున్న రోబోని సరిగ్గా గమనించకుండా దాన్ని వ్యర్థాల్లో పారేసిన వాళ్ళ తప్పా? ఇప్పుడేం చెయ్యాలి" అనే ఆలోచనలు ఇద్దరికీ కలిగాయి.

నిర్మల్ తేరుకుని, సందేశం అందినట్లుగా సమాధానం పంపమన్నాడు.

"కృతజ్ఞతలు సర్! ఇక మీరిచ్చే ఆజ్ఞల కోసం ఎదురు చూస్తాను" అని బీర్బల్ నించి సమాధానం.

నిర్మల్‌కి నమ్మ బుద్ధి కాలేదు.

"నువ్వు ఒక రోబోవి. నిజంగా ఈ చెత్త నుంచి పనిచేసే పరికరాల్ని తయారు చేశావా?" అని ప్రశ్నించాడు నిర్మల్.

"అవును సార్...మీరు నాకు ఇచ్చిన పని అదే కదా సార్! ఇప్పటి వరకు ఈ దీవిలో ఉన్న కొన్ని వ్యర్థాలని వర్గీకరించాను. భారలోహాలు ఉన్న భాగాలను వేరేచోట, నీటిని కలుషితం చెయ్య కుండా దాస్తున్నాను. ప్లాస్టిక్, లోహ భాగాలని వేరు గా ఉంచాను. అవి మళ్ళీ ముడి పదార్థాలుగా వాడటానికి మీ షిప్‌లో పంపవచ్చా? ఇక్కడ ఉన్న వాటిలో కొన్ని కృత్రిమ అవయవాలు బాగుచేస్తే ఉపయోగించవచ్చు. అయితే అవి యంత్ర భాగా లుగా వాడుతారా లేక మానవులకి అమర్చడానికా అన్న సంగతి తెలియదు. దయచేసి నాకు వివరంగా ఆదేశం ఇవ్వండి...

"నేను ఆరో తరం సేవక రోబోని సర్. ఇచ్చిన ఆదేశాలకి పరిమితం అవకుండా, స్వయం గా ఆలోచించి మీరు ఇచ్చిన ఆదేశం వెనుక ఉద్దేశాన్ని గ్రహించి పనిచేసేలా నన్ను తయారు చేసారు కదా? నేను నా విధి నిర్వహణ మీకు సంతృప్తి కలిగేలా చెయ్యగలనని హామీ ఇస్తున్నాను సర్!" అన్నాడు.

నౌకలో కంప్యూటరు తెర ముందు ఉన్న వారంతా ఆశ్చర్యంతో నిరుత్తరులయ్యారు.

"తే వంద్యాస్తే మహాత్మనః / తేషాం లోకే స్థిరం యశః
యైన్నె బద్ధాని కావ్యానిః / ఏచ కావ్యే ప్రకీర్తితాః"

లబ్ధప్రతిష్టులైన కవిచంద్రులు వారి కావ్యశోభిత వెన్నెలకాంతులతో సదా ప్రకాశిస్తూనే ఉంటారన్నది చరిత్ర చెబుతున్న నిజం.నాటకకర్త. అనువాదకుడు, కాలమిస్ట్, ప్రజాభాషలో భావోద్వేగ కవితలు, ఆదర్శపూరితమైన కథలు రాసి మెప్పించిన రచయిత దేవరాజు మహారాజు. సరళ సుందరంగా శాస్త్రీయ అవగాహనను పెంపొందించడానికి అనేక సైన్సు గ్రంథాలను అందించారు. బాలసాహిత్యం, రేడియో నాటకరంగాలలో విశేష కృషి సల్పారు. తెలుగు అకాడమి పుస్తక రచయితగా, సంపాదకుడుగా వ్యవహరించడమేకాక, అంతర్జాతీయ, జాతీయ సాహిత్య సమ్మేళనాలలో పాల్గొంటూ, ఇతర భాషా సాహిత్యాలను మూల్యాంకనవేస్తూ, వర్తమాన సామాజిక మార్పులను ఎప్పటికప్పుడు అంచనా వేస్తూ, అక్షరాలలో దాగిన యథార్థాలను బయటకు తీసుకువచ్చి పాఠకులకు పరిచయం చేయడం దేవరాజు మహారాజు ప్రత్యేకత. అలా పరిచయం చేసిన రచనల్లో ఒక మంచుముత్యం ఈ 'స్త్రీ అక్షరాలు శిలాక్షరాలు'. భారతీయ సాహిత్యంలో పతాకలా నిలిచే మహిళా రచయితల జీవితం గురించి, సాహిత్యం గురించి సవివరంగా అందిస్తున్న ఈ కొత్త పొత్తాన్ని పరిచయం చేయడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.


98485 36113

# భారతీయ సాహిత్యంలో స్త్రీ

దేవరాజు మహారాజు కలం నుండి జాలు వారిన 'స్త్రీ అక్షరాలు శిలాక్షరాలు' వ్యాస సంపుటి ఎంతోమంది భారతీయ రచయిత్రుల పరిచయాలకు వేదిక. 'ఆంధ్రభూమి'లో 'సాహితీ సుమాల' పేరుతో ఆరుసంవత్సరాల (1996-2001) పాటు దేవరాజు మహారాజు నిర్వహించిన శీర్షిక ఇది. సుమారు 53 మంది రచయితల జీవత గాధలను, విశేషాలను క్షుణ్ణంగా, క్లుప్తంగా కళ్లకు కట్టినట్టు తెరకెక్కించారు దేవరాజు మహారాజు. ఇవన్నీ చదివితే ఎంతోమంది స్త్రీలు తమ జీవన పథాన్ని ఎలా సుగమం చేసుకున్నారో అవగత మవ్వడమేకాక ఎంతోమంది స్త్రీలు అభివృద్ధి దిశగా పయనించే దిక్సూచిగా ఈ పుస్తకం ఉపయోగపడు తుంది. 'ఈ భారతీయ రచయిత్రుల విజయకేతనం' భావితరాలకు ఓ 'వ్యక్తిత్వ పురోగమన' సంకేతంగా నిలుస్తుందనడం లో ఎలాంటి సందేహాలకు తావులేదు. ఇందులో ఇంగ్లీష్ భాషకు చెందిన పదమూడు మంది, హిందీ, బెంగాలీ భాషలకు చెంది ఐదుగురు, కన్నడ నుంచి నలుగురు, మరాఠీ, ఉర్దూ, పంజాబీల నుంచి ముగ్గురు, మళయాళం, గుజరాతి, అస్సాం, సింధి, తమిళ భాషల నుండి ఇద్దరు, ఒరియా, తెలుగు భాషలనుండి ఒకరు ఉన్నారు.

ఈ సంపుటిలో తరిగొండ వెంగమాంబను గూర్చి చక్కని పరిచయం చేశారు దేవరాజు మహారాజు. ఆనాటి అచ్చమైన తెలుగుభాషలో భక్తి కవిత్వాన్ని, ఆశుకవిత్వాన్ని అనర్గళంగా వినిపించిన ఈమెను గురించిచేసిన పరిచయం మనలని ఆశ్చర్యానికి గురిచేస్తుంది. బాల్యం నుంచి దైవం, ధ్యానమే ధ్యేయంగా రచనలు చేసి పండిత ప్రకర్షను సంపాదించుకున్న సుప్రసిద్ధురాలు. సంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి నిరుపయోగ సాంప్రదాయాల్ని, ఛాందసాల్ని ఎండగట్టి, ప్రాపంచిక బంధనాల్ని కాదనిన వనిత. సాహిత్య నేపథ్యం, చదువు, శిక్షణ లేకుండా పరమాత్మబంధమే నిజమైన బంధమని నమ్మి ఏకాంతంగా గడుపుతూ భక్తి, ప్రేమభావాలతో ప్రార్థనాగీతాలను ఆలపించి వాటికి సాహిత్యంలో చోటుకల్పించి, స్వామిభక్తితో చరిత్రలో స్థిరస్థాయిగా నిలిచిన రచయిత్రి ఈమె.

విలువైన రచనలతో తమకంటూ ఒక పేజీని సుస్థిరం చేసుకున్న బెంగాలీ రచయిత్రి స్వర్ణకుమారీ దేవి. ఈమె దేవేంద్రనాథ్ టాగూర్‌కి అక్క. ఆధునిక తొలిబెంగాలీ కథా రచయిత్రి. వివిధ సాహిత్య ప్రక్రియల్లో చేయి తిరిగిన ఈమె రచనలు సంఖ్యాపరంగా, స్థాయిపరంగా గొప్పవిగా గుర్తింపు పొందాయి. పురుషాధిక్య రాజపుత్ర సమాజంలో మహిళల పాత్రను ముఖ్యంగా పృధ్వీరాజ్ పతనాన్ని ఎత్తిచూపుతూరాసిన నవల 'దీప్ నిర్వాణ్' ప్రసిద్ధి చెందింది. ఈమె కథానిక, నవల, నాటకం, కవిత, గీతాలు, వ్యాసాలు తదితర ప్రక్రియల్లో పేరెన్నిక గన్నారు.

లంకె జనార్దన్

స్త్రీ అక్షరాలు శిలాక్షరాలు
భారతీయ రచయిత్రుల విజయకేతనం
వ్యక్తిత్వ వికాస పురోగమనం
డా॥దేవరాజు మహారాజు
పుటలు : 150
మూల్యం : రూ. 150 /-
ప్రచురణ
పుస్తక శిల్పి
టి.మురళీధర్ గౌడ్ - 9393176552
ప్రతులకు
జి-4, లహరి ఎస్టేట్, 40 - 241/2
కృష్ణవేణి నగర్, మౌలాలి
హైదరాబాద్ - 500 046




పుస్తక సమీక్ష

వైద్యశాస్త్రం అభ్యసిస్తూనే సాహిత్యంలో సుస్థిర స్థానాన్ని కైవసం చేసుకున్న మహిళ కృపా సత్యా సదన్. ఈమెను గురించి దేవరాజు మహారాజుమరో జనరంజక పరిచయాన్ని ఈ సంపుటిలో మనకి వినిపిస్తారు. మద్రాస్ మెడికల్ కళాశాలలో చదివిన తొలి మహిళ ఈమె. ఇండో ఆంగ్లియన్ నవలా రచయిత్రిగా 'సగుణ'... 'కమల'... అనే నవలల్లో 19 వ శతాబ్దపు భారతదేశ జాతుల మధ్య వైవిధ్యాన్ని, వైరుధ్యాల్ని అద్భుతంగా ఆవిష్కరించి సమీక్షకుల మన్ననలందుకున్నటువంటి ఎన్నోవిశేషాలు ఈ వ్యాసంలో మనకు కనపడతాయి.

సుభద్రాకుమారి చౌహాన్ రచయిత్రిగా, కవయిత్రిగా ప్రాచుర్యం పొందడమేకాక అంతకంటే మిక్కిలిగా 1920నాటి కాంగ్రెస్ జాతీయ రాజకీయాల్లో చురుగ్గా, ముఖ్యంగా సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని దేశంలోనే తొలి మహిళా సత్యాగ్రహి అవడం విశేషం. ఇక్కడే మనకి దేవరాజు మహారాజు 'బర్డ్స్ ఐ' కనబడుతుంది. అంటే రచనలు మాత్రమే కాకుండా జీవిత నేపథ్యాన్ని, గమనాన్ని కూడా పాఠకులకు పరిచయం చేయడం రచయిత విస్తృత అధ్యయనానికి నిదర్శనం. గడపదాటి బయటకురాని సమాజంలో ఒక మహిళ దేశకాలమాన స్థితిగతిని అవగతం చేసుకొని భర్తతోపాటు కలిసి సమానంగా పోరాటంలోకి రావడం గొప్ప విశేషమే. ఈమె పోరాట పటిమ, స్ఫూర్తితో దేశభక్తిని ఉటంకిస్తూ రాసిన కవిత్వం చెప్పుకోదగినది. స్త్రీ పురుష సమానత్వానికి ఈమె కృషి శ్లాఘనీయం. బాల్య వివాహాలు, బహుభార్యత్వం వంటి రుగ్మతలను ఖండించారు.

సుభద్రా కుమారి, కుమర్తె సుధాచౌహాన్ 'మిలా తేజ్ సే తేజ్' అనే ఉద్గ్రంథంలో తన తల్లి దండ్రుల దేశపోరాటాలను త్యాగాలను వివరించారు. తల్లి కథను అక్షరీకరించిన తనయగా హిందీ సాహిత్య ప్రాంగణంలో 'తల్లి కథ నేలతల్లి కథ ఒకటే' అంటున్న సుధా సౌహాన్ వంటి ప్రసిద్ధ రచయిత్రి కూడా ఈ సంపుటిలో కనిపించడం ఓ ప్రత్యేకత.

ప్రఖ్యాత మళయాళ రచయిత్రి లలితాంబికా అంతర్జనం. వీరి కుటుంబ నేపథ్యం ఛాందస భావాలమయం. స్త్రీల జీవితం దుర్భరం. అట్టి స్థితిలోంచి వచ్చిన ఈమె సామాజిక దురాచారాలను చాలా దగ్గరగా గమనించి, వాటివలన జరుగుతున్న అనర్థాలను గుర్తించి, వాటిని సమాజం నుండి పోగొట్టడానికి ఒక పోరాటాన్నే చేసిన గొప్ప ధీమంతురాలు. ఆ పోరాటంలో భాగంగా ఆమె సాహిత్యాన్ని ఆయుధంగా చేసుకోవడంతో దేవరాజు మహారాజు పరిశోధనలో చిక్కింది. అక్కడ మొదలైన ఆమె తిరుగుబాటు ప్రపంచంలోని తాడిత పీడిత వర్గాలవైపు మళ్ళింది. ఎక్కడ అత్యాచారం జరిగినా అక్కడ ఆమె కలం ఓ ప్రవాహతరంగమై ప్రవహించేది. స్త్రీ స్వాతంత్ర్యాన్ని కళాత్మకంగా ప్రశ్నిస్తూ ఆమె రాసిన అనేక కథలు మళయాళ కథానికా సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. నిజాయితీగా నైతిక విలువల్ని నిలబెట్టే పాత్రలతో అంతర్జనం కథలు అంతర్మథనానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చాయి. అవి జీవిత వైరుధ్యాల్ని, క్లిష్ట సమస్యల్ని ప్రతిబింబించాయి. లలితాంబికా అంతర్జనం రచించిన 'అగ్నిసాక్షి' (1977) నవల కేంద్ర, రాష్ట్ర సాహిత్య అకాడెమీల అవార్డులందుకొంది.

మరో సుప్రసిద్ధ రచయిత సరసు థామస్. మళయాలంలో ఆత్మకథ రాసుకున్న ఈమె పుస్తకం పేరు 'ఇథెంటె కథాయుం గీతవుం'. ఐదేళ్ల వయసులో పోలియోతో మంచానపడ్డ బాలిక, ప్రపంచాన్ని చూడ్డం అక్కడినుంచే మొదలెట్టింది. మంచంలోనే చదవడం రాయడం నేర్చుకుంది. మంచంలోనే రచనలు చేసింది. మంచి సాహిత్యం చదివింది. తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించాలన్న సంకల్పమే ఆమెకు బలమైంది. తనలోని తీవ్ర ఆలోచనే ఆమెకు చేయూత. చేతితో పెన్ను పట్టుకునే శక్తి కూడాలేదు. ఒక్క అక్షరం రాయాలన్నా ఒకగంటసేపు పట్టేస్థితి వంటి అవరోధాలను అధిగమించి 'సృజనాత్మక శక్తికి అంగవైకల్యం అడ్డుకాద'ని రుజువు చేసిన 'సరసు థామస్' గురించి కూడా ఈ సంపుటి చెప్పడం దేవరాజు విజ్ఞత. ఆమె ఒక గొప్ప రచయిత్రిగా మళయాళ సాహిత్యంలో అందరికీ ఆదర్శనీయురాలు. ఆమె ఆత్మవిశ్వాసం అందరికీ స్ఫూర్తిదాయకం. హృదయం, మేథస్సు ఆరోగ్యంగా ఉన్నప్పుడు అంగవైకల్యం అక్షర సృజనకు అవరోధం కాదని నిరూపించి చరిత్రలో తనకంటూ ఒక పుటను కేటాయించుకున్న ఈమె ఈ సంపుటిలో ఉండటం సముచితం.

ప్రతిభా సత్పతి ప్రముఖ ఒరియా రచయిత్రి. చిన్నతనం నుండి కవిత్వ రచనకు పూనుకున్నారు. ప్రకృతి, ప్రేమ, ఒంటరితనం, అస్థిరత్వం మొదలగు అంశాలతో కవిత్వాన్ని అల్లడం ఈమె ప్రత్యేకత. నాట్యం, సంగీతం, నాటకం వంటి లలిత కళలలో విశేషమైన ప్రతిభ కలిగిన ఈమె అసూయ, హేళన, క్రూరత్వం, విశృంఖలత్వంలేని ఒక ప్రత్యేక ప్రపంచ స్థాపనకు తన రచనలు దోహదం చేయాలనే ఆకాంక్ష కలిగిన రచయిత్రి. భోపాల్ చంద్ర ప్రహరాజ్ తనయగా తండ్రి సాహిత్య వారసత్వాన్ని వరంగా పొందిన ఈమె ఒరియా సాహిత్యానికి మణిపూస. సార్థక నామధేయురాలు.

కుందనిక కపాడియా గుజరాతీ రచయిత్రి. విలువైన రచనలతో బాటు విలువల్ని కాపాడుకుంటూ జీవితాన్ని కొనసాగించడం ఉత్తమమని తన రచనల ద్వారా చాటి చెప్పారు. మహిళలకు ధైర్యం అవసరమంటూ సాహస వనితల జీవిత విశేషాలను గురించి క్షుణ్ణంగా వివరించారు. పాఠకులను కూడా ఆదర్శనీయులుగా మార్చేదిశగా ఆమె రచనలు సాగేవి. ఆమె సృష్టించిన కొన్ని పాత్రలు గుజరాతీ సమాజంలో నేటికీ ప్రజాదరణ పొందుతున్నాయి. "మహిళలు అణగదొక్కబడి ఉండడానికి కొంత వరకు మహిళలే కారణం. మార్పు రావాల్సింది ఎక్కడో కాదు, ముందు స్త్రీల ఆలోచనా విధానంలో రావాలి..." అంటున్న కుందనిక కపాడియా ఈ సంపుటికే హైలెట్.

ఇలా చెప్పుకుంటూ వెళితే అందరి గురించి చెప్పవలసినంత అవసరం కలుగుతుంది. కన్నడ రచయిత్రి సంచియా హొనమ్మ నుండి మింట్ ప్రచురణ సంస్థ అధినేత మినీ కృష్ణన్ దాకా కొలువు తీరిన ఈ పుస్తకం ప్రతి ఒక్కరూ చదవ వలసిన గ్రంథం. డా॥కేశవరెడ్డి నవల ఇంగ్లీష్‌లోకి అనువదించి ప్రచురించిన సంస్థగా 'మింట్' ను పరిచయం చేసి మినీ కృష్ణన్ గురించి విలువైన సమాచారాన్నిచ్చిన ఈ రచయితకు మనం ధన్యవాదాలు చెప్పాల్సిందే. అంతే కాదు భారతీయ కథకు చిరునామాగా కీర్తించే గీతా ధర్మరాజన్ గురించి, చలనచిత్ర కళలో విశిష్టతను సాధించిన అమితామాలిక్ గురించి, మహిళల మానసిక ఔన్నత్యాన్ని వస్తువుగా స్వీకరించిన మనోజ్ఞదేశాయ్ గురించి, మనం వెతుకుతున్న 'ది గాడ్ ఆఫ్ స్మాల్ థింగ్స్' రచయిత్రి అరుంధతీరాయ్ గురించిన ఎన్నో అక్షరాలు మనకి గొప్ప స్ఫూర్తి నిస్తాయి.

సృజన సాహిత్యంలోనే కాదు పరిశోధనాత్మక సాహిత్యంలోనూ ప్రత్యేకతను నిలుపుకుంటున్న దేవరాజు మహారాజు రేపటి పాఠకుడు చదవాలనుకునే రచయిత. నేటి పాఠకుడు చదువుకుంటున్న రచయిత. నిన్నటి పాఠకుడు నెమరువేసుకునే రచయిత. ఈ సంపుటి లింగ వయో భేదం లేకుండా అందరూ చదవదగినది. దేవరాజు మహారాజు కలంనుండి ఇంకా అనేక ఉత్తమోత్తమ రచనలు జాలువారాలని ఆశిస్తూ...

Printed, Published, Edited and Owned by NANDURI RAJA GOPALA RAO V.V.S. and Printed at VANAJA OFFSET PRINTERS # 32-21-18A, Seetharampuram, Vijayawada-4. Published at CHINUKU sahitya masa pathrika , 26 - 7 - 11, Garukapatuvari st. Gandhi Nagar, Vijayawada -3, Editor - NANDURI RAJA GOPALA RAO V.V.S.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M218 |
| పుస్తకం పేరు | చినుకు |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | ye |
| మొత్తం పేజీలు | 195 |
| పెద్ద సైజు పేజీలు | 190 |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Madhu |
| పేజీలు విడదీసినది | MADHU |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |